ఆ. సా. ప. ప్ర. మ్యూజియం ప్రచురణ 4

# స్వాతంత్ర్య సమరంలో

# ఆంధ్ర మహిళలు


రచయిత్రు

డా. దుర్గాబాయ్ దేశ్ము

అచ్యుతుని గిరి





జనరల్ ఎడిటర్

డా. వి. వి. కృష్ణశాస్త్రి, ఎం.ఎ., పిహెచ్.డి.

డైరెక్టర్, రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలశాఖ



ప్రచురణకర్త

ఆంధ్రరాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలశాఖ

హైదరాబాదు

1987

ఆ. పా. ప. ప్ర. మ్యూజియం ప్రచురణ 4

స్వాతంత్ర్య సమరంలో

# ఆంధ్ర మహిళలు



రచయిత్రులు

డా. దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

అచ్యుతుని గిరిజ




జనరల్ ఎడిటర్

డా. వి. వి. కృష్ణశాస్త్రి, ఎం.ఎ.;పిహెచ్.డి.;
డైరెక్టర్, రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలశాఖ

ప్రచురణకర్త

ఆంధ్రరాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలశాఖ

హైదరాబాదు

1987

# ముందుమాట



డా. అల్లాడి పి. రాజ్‌కుమార్

ఆంధ్ర మహిళోద్యమ చరిత్రలో మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమము ఒక స్మరణీయఘట్టము. భారతస్వాతంత్ర్య సమర సారధియై యావద్భారతదేశమున శాంతి సమరమును సాగించి భారత మహిళలను కూడ సమర రంగమునకు ఆహ్వానించినప్పుడు ఆంధ్రదేశము నుండి అసంఖ్యాకంగా మహిళలు అత్యంత ఉత్సాహంతో పాల్గొని సమ్మెలు, సత్యాగ్రహములు, శాసనోల్లంఘనములు, ఊరేగింపులు జరిపి కారాగృహములకు వెళ్ళినారు. విద్యావంతులు, అవిద్యావంతులు, పల్లెలు, పట్టణములు అను భేదములేకుండ స్వాతంత్ర్య సమరంలో పాల్గొని ఎన్నో కష్టనష్టములకు ఓర్చి తమ సేవానిరతిని, తెగువను ప్రదర్శించినారు. స్వాతంత్ర్య సంగ్రామము మహిళల రాజకీయ చైతన్యమునకును, దేశాభిమానమునకును, సేవాభిలాషకును ప్రోద్బలమిచ్చినది. ఈ ప్రబోధమే స్త్రీలయందు సంఘసేవాభిలాషను చిగురింపజేసింది. విదేశ భాషానాగరికతలయందు విముఖతను, దేశీయ వేష భాషా సంప్రదాయములయెడల అభిమానమును కలిగినవారై, మహిళలు భారతీయ స్త్రీ విద్యా సంస్థలను నెలకొల్పి, ఆయా సంస్థలద్వారా స్త్రీల పురోభివృద్ధికి విశేషమయిన కృషిసల్పినారు. మహోద్వేగాన్ని సంతరించుకుని ఉత్సాహముతో స్త్రీలు ముందుకుసాగారు. ఎందరో స్త్రీలు ఉన్నత విద్యనభ్యసించి అనేకమైన ఉన్నత పదవులను నిర్వహించారు. సమాజ సేవచేయుచూ స్త్రీల అభ్యున్నతికి పాటుపడినవారు సరోజినీ నాయుడు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి వీరవనితలు అశేషశేముషీవిదులై, రాజకీయ, సాంఘిక, సారస్వతరంగములో విశేష కృషి సల్పినారు. తెలుగు జాతికి గర్వకారణమయినారు.

ఆంధ్రదేశంలో సంఘసేవాధురీణులు, బహుముఖ ప్రజ్ఞాశాలురయిన మహిళలకు కొదువలేదు. ఆకోవలోని త్యాగమూర్తుల జీవితాలలోని ఆసక్తిదాయకమయిన ప్రధాన ఘట్టాలను మననంచేసుకొంటున్నప్పుడు కలిగే అనుభూతి అనుభవైక వేద్యం, అటువంటి

ఆనందాన్ని అందరికీ అందివ్వాలనే ప్రయత్నమే "స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రమహిళలు" అనే ఈ గ్రంథం. ఇందులో అరవయ్యొనిమిది మంది తెలుగు మహిళల జీవిత చరిత్రలు, అందలి ముఖ్యమయిన ఘట్టాలు సంగ్రహంగా సరళమైన భాషలో, రసవత్తరంగా వివరించ బడినవి. ఒక్కొక్క స్త్రీమూర్తిని గురించిన జీవిత విశేషాలు ఒక కథగా సాగుతుంది.

సరోజినీ నాయుడు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి బహుముఖ ప్రజ్ఞాశీలురతోపాటు తెలుగింటిని మెట్టి, సాంఘిక చైతన్యంలో ఘనకీర్తిని గుర్తించిన పాశ్చాత్య వనితలు శ్రీమతి ఉప్పల మెల్లీ షోలింగరు లక్ష్మణరావు, శ్రీమతి ఎలెన్ శర్మ కూడ ఈ గ్రంథంలో చోటు చేసుకోవడంముదావహం, హర్షనీయం. ఇందులో కేవలం ఆయా మహిళల జీవితాలలోని ముఖ్యమైన ఘట్టాలేగాక, భారత స్వాతంత్ర్య సమరంలోని ప్రధాన ఘట్టాలు, అందులో పాల్గొనిన తెలుగు మహిళలు నిర్వహించిన వివిధ కార్యక్రమాలు, సాహసకృత్యములు, త్యాగనిరతి, గాథలుగా వివరింపబడి రసహృదయాలను స్పందింపజేస్తాయి.

ఇటువంటి గ్రంథాలు తెలుగు సాహిత్యంలో చాల అరుదుగావచ్చినవి. ఆంధ్ర మహిళాభ్యుదయానికి అవిరళ కృషి సల్పిన తెలుగింటి ఆడపడుచులలో ఆణిముత్యాలవంటి కొందరి జీవిత వివరాలను సంకలనంచేసి పుస్తక రూపంలో వెలువరించుటలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలశాఖవారు చేసిన కృషి శ్లాఘనీయము.

**డా. అల్లాడి పి. రాజ్‌కుమార్**
వెనుకబడిన తరగతుల సంక్షేమం, పర్యటన,
అభిలేఖ, పురావస్తు శాఖమంత్రి,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.

# పరిచయం

'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి'
'అస్వతంత్రా ధర్మేస్త్రీ'

అన్న నుడులు భారతీయులకు చిరపరిచితం. దీనికి కారణం అనాదిగా స్త్రీ కుమార్తెగా, భార్యగా, తల్లిగా పురుషునిపై ఆధారపడి వారి ఆజ్ఞానువర్తిగా చరించటమే. స్మృతుల్లో, శాస్త్రాల్లో వారికి నిర్ణయించబడిన పరిధి యిదే. వ్యక్తిగతంగా స్త్రీకి సంఘంలో, రాచకీయాల్లో మధ్యయుగందాకా స్థానంలేదనే చెప్పవచ్చు. ఆర్థిక స్వాతంత్ర్యం అంతంత పాటిదే. ఇది స్త్రీ సామాన్యపరిస్థితి. కాని యే కాలంలోనూ కొంతమంది స్త్రీలు అన్ని రంగాలలోను, వేదాంత, మత, సాహిత్య, కళ, సాంఘిక, రాజకీయరంగాల్లో యీ పరిధులని ఛేదించుకుని ముందంజవేశారు. వీరిని యే శాస్త్రాలు, చట్టాలు ఆపలేకపోయినై.

వేదాలని స్త్రీ దరిచేరరాదన్నారు. కాని వేదాల్లో కొన్ని ఋక్కులనే రచించిన స్త్రీలువున్నారు. లోపాముద్ర, యమి, అపాత, ఘోష మొదలైనవారు. వీరు ఋషులతో సమానంగా 'ఋషిక' లనబడేవారు. బ్రహ్మవాదినులుగా చలామణిఐనారు. మైత్రేయి, గార్గి వాచక్నవి ఈ కోవకు చెందినవారు. గార్గి యాజ్ఞవల్క్యుడితో జనకుని నిండు సభలో బ్రహ్మవిద్యలో లోతుగా చర్చించి తనకంటూ ఒకస్థానం కల్పించుకుంది.

రామాయణ, భారతకాలంలో స్త్రీలు బ్రహ్మవిద్యేగాక అస్త్రవిద్యలో ఆరితేరారు. రామాయణ కాలంలో స్త్రీలు యుద్ధవిద్యా నిపుణులైనారు. కైకేయి ఒక ఉదాహరణం. ద్వాపరయుగంలో సత్యభామా, ప్రమీలా మొదలైనవారు. భారతంలో ద్రౌపది ప్రశ్నలకెవరూ జవాబుచెప్పలేకపోయారు. మహాభాష్యంలో పతంజలి 'శాక్తికి' అని శూలపాణులైన స్త్రీలను పేర్కొన్నాడు. చంద్రగుప్త మౌర్యునికాలంలో రాజుకు అంగరక్షకులుగా ఆయుధపాణులైన స్త్రీలు పహరా కాసేవారని మెగస్తనీస్ చెప్పివున్నాడు. కౌటిల్యుడు సేనలగురించి చెప్తూ స్త్రీ విలుకత్తెలుగూడా ఉన్నారనిచెప్పాడు. రాజుకు అంగరక్షకులుగా స్త్రీలుండటం విజయనగర రాజులకాలంవరకూ ఆచారంగా ఉన్నది.

జగద్గురు శంకరాచార్యులవారితో చర్చలకుదిగిన మండనమిశ్రుడు ఓడిపోగా ఆయన భార్య ఉభయ భారతీదేవి ఆచార్యులనే ఓడించిందంటారు. ఆ భారతి పేరునే ప్రతి శంకరస్వాములు చివరన పెట్టుకుంటారు అని నానుడి. ఆంధ్రప్రదేశంలోని ప్రతి రాజవంశ చరిత్రలోనూ రాణివాసపు స్త్రీలైతేనేమి, సామాన్య స్త్రీలైతేనేమి పేరెన్నదగ్గనారు యెంతమందో వున్నారు.

ప్రథమంగా చారిత్రకంగా మనకు వినవచ్చేది శాతవాహనుల పరిపాలన. ఈ వంశంలోని రాజులు తల్లిపేర్లతో ప్రసిద్ధికెక్కినవారే. గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠీపుత్రపులమావి, గౌతమీపుత్ర యజ్ఞశ్రీ. శాతవాహనరాణి నాగనికయొక్క నానాఘాట్ శాసనం చూస్తే ఆనాటి స్త్రీలు, రాణులేకావచ్చు, యాగాలేచేసినట్టు తెలుస్తున్నది.

వీరి అనంతరం ఇక్ష్వాకుల రాజుల్లోనూ ఈ పద్ధతే కనిపిస్తున్నది. వాసిష్ఠీపుత్ర శ్రీ చాంతమూలుడు, మాధరీపుత్ర వీరపురుషదత్తు, హారీతిపుత్ర కుమార వీరపురుషదత్తు మొదలైనవారు మాతృకమైన పేర్లతోనే చరిత్రలో నిలిచారు. ఇక్ష్వాకుల రాణులు శాంతిశ్రీ, రుద్రధరభట్టారిక, కొడబలిశ్రీ మొదలైనవారు నాటిపాలకులు వైదిక మతం అవలంబించినా వీరు స్వతంత్రించి బౌద్ధానికి చేయూతనిచ్చారు. చైత్యాలు నిర్మించారు, ఆరామాలు కట్టించారు, బౌద్ధులైనారు.

తరువాత రాష్ట్రకూట, చాళుక్య, కాకతీయుల పాలనలోకూడా కొంతమంది పేరెన్నికగన్న స్త్రీలుండేవారు. చాళుక్యత్రిభువన మల్లుని పట్టమహిషి మన్నాదేవి 'అభినవ సరస్వతి' అని ఆ కాలపు శాసనాల్లో చెప్పబడినది. ఈ రాణులు ఆలయనిర్మాణాలు చేశారు. తటాకాలు త్రవ్వించారు. విద్యాలయాలు, సత్రాలు స్థాపించిన మిన్నలు.

కాకతీయులకాలంలో స్త్రీలు చాలా ముందంజవేశారు. కామసాని కాకతిరాజ్యం నిలపటం అందరికి తెలిసినదే కదా! రాణి రుద్రమ పేరువినని తెలుగువారుండరు. ఆమె రాజ్యం ప్రజాహితమైనదని, అంతగా ప్రజలచే అభిమానించబడే రాజును తాను చూడలేదని విదేశీయుడైన మార్కోపోలోచేత కొనియాడబడినది. ఆమె పరిపాలనాదక్షురాలేకాక స్వయంగా కత్తిపట్టి ముందుకురికి, వైరులను తుత్తునియలు చేసిన వీరాంగన. చివరకు యుద్ధభూమిలో ఒరిగిపోయిన వీరవనిత. చరిత్రలో తరువాత చెప్పుకోతగ్గ స్త్రీ పల్నాటి నాయకురాలు నాగమ్మ. పల్నాటి చరిత్ర తెలిసినవారికి యీమె గురించి చెప్పపనిలేదు. ఆమెకు దీటుగా నిలిచేది మాంచాల. భర్తని పుత్తేజపరచి యుద్ధానికి పంపిన వీరవనిత ఈమె. ఈ తరువాత రాజకీయాల్లో ముందుకొచ్చిన ఆంధ్ర స్త్రీలలో తంజావూరు రాణి మంగమ్మ ముఖ్యురాలు.

సాహిత్య, కవితా, కళాక్షేత్రాల్లో కొంతమంది చెప్పదగ్గ విశిష్టవ్యక్తులున్నారు. ఆతుకూరి మొల్ల తనపేరనే తెలుగులో మొల్ల రామాయణం వ్రాసింది. ఖడ్గతిక్కన భార్య చానమ్మ తన ఆశువులతో భర్తలో నిద్రాణువైన పౌరుషాన్ని రెచ్చగొట్టి యుద్ధానికి పురిగొల్పింది. కంపిలిరాయల పట్టమహిషి గంగాదేవి సంస్కృతంలో తన భర్త విజయదండయాత్రలనే మధురా విజయంగా రచించింది. తాళ్లపాక అన్నమాచార్యుల భార్య తిరుమలాంబ సుభద్రా కల్యాణగ్రంథకర్త.

మరీచీపరిణయం కవయిత్రి కృష్ణదేవరాయల కుమార్తె తిరుమలాంబ, అచ్యుతదేవ రాయలు వరదాంబికల వివాహంగురించి వరదాంబికా పరిణయం అనే కావ్యాన్ని రచించింది. సుప్రసిద్ధ ఏలేశ్వరోపాధ్యాయల కుమార్తె నాచి తన పాండిత్యప్రకర్షలతో యితర పండితులనోడించి 'నాచీవిజయ' మనే సంస్కృతనాటకం రచించింది. గణితశాస్త్రాచార్యుడైన భాస్కరాచార్యుని కుమార్తె లీలావతి 'గణిత' మనే గణితశాస్త్ర గ్రంథాన్ని వెలువరించింది.

నాయకరాజుల ఆస్థానాలలో అష్టభాషావిశారదలైన స్త్రీలుండేవారు. వారిలో రామభద్రాంబ ప్రముఖురాలు. రఘునాథాభ్యుదయ కావ్యరచయిత్రి మధురవాణి, పండితురాలేకాక రచయిత్రికూడా. రామాయణ సారకావ్యతిలక ఆమె రచనే. ఈమెకు నాయకుడు స్వర్ణాభిషేకముచేసినాడట. తరువాతివారు రంగాజమ్మ. రంగాజమ్మ 'మన్నారుదాసవిలాసాన్ని' ప్రబంధంగానూ, నాటకంగానూ రచించింది, ఉషాపరిణయ ప్రబంధకర్త.

రానురాను రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వ్యవస్థలో మార్పువచ్చింది. ఆంగ్లేయుల పాలనలలో అన్ని కళలు, ప్రతిభలు అణచివేయబడ్డాయి. జీవనోపాధినే కోల్పోయిన కళాకారులు, ప్రజలు, రైతులు అనేక కడగండ్లకు గురిఅయినారు. ఈ పరిస్థితుల్లో అణగదొక్క బడుతున్న ప్రజాచైతన్యం, శక్తి, విజృంభించటానికి అవకాశాలకై ఎదురుచూస్తున్నాయి. స్వరాజ్యం అన్న శంఖారావానికి ఈ శక్తులు వువ్వెత్తునపైకిలేచినై. గాంధీజీ స్త్రీలను పురుషులతో సమానంగా అభిమానించి ఆదరించటంతో స్త్రీలలో స్వాతంత్ర్యేచ్ఛ పాకిపోయింది వేళ్ళూనింది. నివురుగప్పిన నిప్పుగావున్న రాజకీయ సాంఘిక స్పృహలు ప్రజ్వలించినై. ఈ వెల్లువే స్వాతంత్ర్యసమరంలో విజృంభించిన ఆంధ్రస్త్రీదళం. ఈ దళం కట్టుబాట్లనే కట్టలుతెంచుకొని విరుచుకుపడ్డది.

స్త్రీలు యిళ్ళు వాకిళ్ళు, పిల్లా జెల్లా, భర్తా అత్తా అంటూ వెనుకంజవేయలేదు. వారిని ఒక ప్రక్క సంబాళించుకుంటూనే, స్వాతంత్ర్య సమరంలోకి దూకారు. పురుషులకు సమవుజ్జీలుగా నిలబడి సత్యాగ్రహాలుచేశారు. పికెటింగులు జరిపారు. లాఠీదెబ్బలుతిన్నారు. జైళ్లపాలైనారు. జైళ్లలో రోగాలపాలయినారు. కొంతమంది ప్రాణాలే కోల్పోయినారు. తమ ఆస్తిపాస్తులు, వంటిమీది బంగారం వూడ్చి కాంగ్రెస్ నిధులకు సమర్పించారు. గాంధీజీ ఆంధ్రప్రదేశ్ వచ్చినప్పుడల్లా ఆంధ్రమహిళలు వెర్రి ఆవేశంతో ఆయనచేతులు నింపిపంపారు.

వారి యిళ్ళు వాకిళ్లు పొలం పుట్ర ఆంగ్లేయులచే జప్తుచేయబడి నిలవ నీడ లేకుండా పోయింది. పోయిందిపోగా చావుదెబ్బలకి సహితం తలవంచారు. దొరతనాన్ని యెదిరించి ఉప్పువండారు. దాన్ని బంగారంకన్న యెక్కువ విలువగలదిగా అమ్మి డబ్బును కాంగ్రెస్ నిధికి అర్పించారు. స్వాతంత్ర్యబావుటా యెగరేస్తూ స్వతంత్రభారత గీతాలు యెలుగెత్తిపాడుతూ వీధి వీధి తిరిగారు.

భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వీరాంగనల సంఖ్య వేలలోకివచ్చింది. జైళ్లు చాలకపోవడంచేత అరెస్టులుమాని లాఠీ చార్జీలుచేయడం, చిత్రహింసలు పెట్టడం, నిర్మానుష ప్రదేశాల్లో వదిలిరావడం జరిమానాలువేయడం ప్రారంభించింది తెల్లవారి ప్రభుత్వము. కానీ ఈ మహిళాశక్తి దేనికీ వెరవలేదు. అనేక సేవాదళాలు ఏర్పడ్డాయి. వీటిలో స్త్రీలకు ఆయుధాలు ఉపయోగించే పద్ధతులు, ఆత్మరక్షణలో శిక్షణలు యివ్వబడ్డాయి. ఈ ఆంధ్రమహిళలతోపాటు కొందరు విదేశీ స్త్రీలుకూడా చేతులు కలిపారు. నిర్భయంగా జైళ్లకు వెళ్లారు.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. అప్పటివరకు దేశస్వాతంత్ర్యం కోసం పోరాడిన స్త్రీలు తరువాత క్రియా సూన్యంగా కాలం వెళ్లబుచ్చక సంఘ సేవలోదిగి ఏ రకమైన రాజకీయ ప్రతిఫలాన్ని ఆశించక తమ జీవితాలను ధన్యంచేసుకున్నారు. ఆనాటి వీర వనితల చరిత్రలు కాలగమనంలో కనుమరుగు కాకముందు ఈ సంపుటం ప్రచురణకావడం చాల అవసరము. వారికి ఆంధ్రదేశ చరిత్రలో చిరస్థాయిగా స్థానం కల్పించి తరతరాలుగా వీరిని స్మృతిపథంలో నిలిచేట్లుగా చేయడమే ఈ గ్రంథ ముఖ్యోద్దేశ్యము. ఈ గ్రంథ రచనలో నిర్విరామంగా కృషిచేసి, దొరికినంతవరకు సమాచారాన్ని చిన్న చిన్న వ్యాసాలుగా రూపొందించిన సహరచయిత్రి శ్రీమతి అచ్యుతుని గిరిజగారు ధన్యులు. సహ గ్రంథకర్తలయిన శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు ఒక మహోన్నత వ్యక్తి, స్వాతంత్ర్య సమరయోధురాలు, విద్యావేత్త, సంఘ సంస్కర్త, మహావక్త, స్త్రీలపాలిటి కల్పతరువు, ఆపద్బాంధవి. ఆమె జీవితకాలంలో ఈ పుస్తక ప్రచురణ జరిగివుండవల్సింది.

ఈ గ్రంథ ప్రచురణలో అత్యంత ప్రోత్సాహాన్నిచ్చిన గౌరవనీయ ముఖ్యమంత్రి డా. శ్రీ నందమూరి తారకరామారావుగార్కి, మంత్రివర్యులు డా. అల్లాడి పి. రాజకుమార్ గార్కి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. పుస్తక ప్రచురణలో సహకరించిన కుమారి జి.లలిత గార్కి, ఆంధ్రప్రదేశ్ పాఠ్య పుస్తక ప్రచురణ సంస్థాధిపతులకు వారి సిబ్బందికి నా ధన్యవాదములు.

వి. వి. కృష్ణశాస్త్రి

# నా మాట

స్వాతంత్ర్యోద్యమంలోను, స్వచ్ఛంద సేవారంగంలోను పాల్గొన్న ఆంధ్రమహిళల చరిత్రలను వ్రాయాలన్న సంకల్పం శ్రీమతి దుర్గాబాయమ్మగారికి కలిగింది. తాను జీవించి వుండగానే ఆ కృషి జరగకపోతే తరువాత ఎవరుపట్టించుకోరన్న ఆందోళనతో రచనా బాధ్యత నన్ను వహించమన్నారు.

ఆమెతో పరిచయం నాకు 1939 నుంచి వున్నది. మద్రాసులో వున్నప్పుడు మహిళాసభ ప్రచురణ అయిన 'ఆంధ్రమహిళ' లోను, హైదరాబాదు వచ్చిన తరువాత తెలుగు, 'విజయ దుర్గ' ప్రచురణలోను కొంతకాలం బాధ్యత వహించాను. ఆమె వ్రాసిన 'The Stone that Speaketh' ను 'ఆంధ్రమహిళాసభ - నేను' అనేపేరుతో అనువదించాను. దుర్గాబాయి దేశ్‌ముఖ్ జీవిత చరిత్రను అచ్చువేయించే బాధ్యతను నేను తీసుకున్నాను. ఈ అనుభవాన్ని పురస్కరించుకుని ఈ రచనకు పూనుకోనమని దుర్గాబాయమ్మగారు నన్ను అడిగారు. దానిఫలితమే ఈ స్వాతంత్ర్య సమరంలో ఆంధ్ర మహిళలు.

స్వాతంత్ర్యోద్యమంలో వీరవిహారంచేసిన ఆంధ్ర మహిళలు వుద్యమం ముగిసిన తరువాత విరివిగా స్వచ్ఛంద సేవాసంస్థలను నెలకొల్పి, అవసరమున్న స్త్రీలకు, పిల్లలకు స్వతంత్రంగా జీవించటానికి చేయూతనిచ్చారు. స్వాతంత్ర్యోద్యమం మొదటి మెట్టు అయితే, సంఘసేవారంగం రెండవమెట్టు అయింది. దేశభక్తి, సమాజసేవకు జాతి, మత, భాషా, వర్గ విభేదాలు అడ్డుగోడలు కాలేవని ఈ పుస్తకంలోని జీవిత చరిత్రలు నిరూపించు తున్నవి.

దేశసేవికల జాబితాలు తయారయినవి. తమజీవిత ఘట్టాలను, కార్యకలాపవివరాలను పంపమని వారికి వినతిపత్రాలు వెళ్ళినవి. ఒక్కొక్కరి జీవితచరిత్ర అచ్చులో 5, 6 పేజీలకు తగ్గకుండా వ్రాయాలని, ఫోటోలు వేయాలని, 50 చరిత్రలు కాగానే ఒక సంపుటం వేయాలని, వెలుగుబాటన స్త్రీలను నడిపించి, వారి జీవితాలకు సార్థకత కలిగించిన జాతిపిత గాంధీమహాత్ముడికి అంకితంగా ఆయన జయంతినాడు ఈ పుస్తకాన్ని ఆవిష్కరించాలని ఒక నిర్దిష్టమైన పథకం యేర్పాటు చేసుకున్న తరువాతనే రచన ఆరంభించాను. కాని ప్రచురించటానికి ఒక్కరు ముందుకు రాలేదు. అందువల్లనే మరి కొన్ని సంపుటాలు వ్రాయాలన్న కోరిక సమసిపోయి, వ్రాసినమేరకు ముగించటం జరిగింది.

ఆంధ్రమహిళాసభ స్వంత ప్రెస్సులో అచ్చువేసుకుని మహిళాసభ ప్రచురించు కోవచ్చును. కాని ప్రభుత్వ సంస్థలో ఈ పుస్తకం ప్రచురించితే ఇంగ్లీషు, హిందీలలోకి

అనువదించటం జరుగుతుందని, విదేశాలలోని లైబ్రరీలలో కూడ ఆంధ్రమహిళల వుజ్జ్వల గాధలు చోటుచేసుకోగలవని దుర్గాబాయమ్మగారి వుద్దేశం. అందువల్ల రచన కొంత కాగానే ఢిల్లీలోని Indian Council of Social Science Research (I.C.S.S.R.) తో సంప్రదింపులు జరిగినవి. వారు కృషిని మెచ్చారు. అలాగేనన్నారు. 1979 ఫిబ్రవరి నాటికి 68 జీవిత చరిత్రలు వ్రాయటం ముగిసింది. కాని ఆ సంస్థనుంచి యెటువంటి నిర్దిష్టమైన జవాబు రాలేదు. ఉస్మానియా యూనివర్సిటీ చరిత్ర విభాగం, ఆంధ్ర సాహిత్య అకాడమి వంటి సంస్థలతో సంప్రదింపులు జరిగినవి. ఏనాడో ముగిసిన వుద్యమంలో పాల్గొన్న సోదరీమణుల చరిత్రలను వెలుగులోకి తీసుకురావాలని దుర్గాబాయమ్మగారు పరితపించారు. చేతిలోని టెలిఫోనే ఆమెకి కళ్ళూకాళ్ళుగా అయిన పరిస్థితిలో నేను యెంతో పట్టుదలతో, శక్తిమేరకు విషయసేకరణచేసి వ్రాశాను. చివరకు 1981 నాటికి ఆ పుస్తకం ఆంధ్రప్రదేశ్ ఆర్కైవ్స్, ఆర్కియాలజీ, మ్యూజియమ్స్, శాఖ కమీషనర్ శ్రీ పి. సీతాపతి గారిచేతికి వెళ్ళింది. ఫర్వాలేదని ధైర్యము కలిగింది. పట్టుదలతో శ్రద్ధతో పుస్తకాన్ని ప్రచురించిన పురావస్తు ప్రదర్శనశాలల శాఖ డైరక్టర్ శ్రీ వి. వి. కృష్ణశాస్త్రి గారికి, ఎసిస్టెంటు డైరక్టర్ గోళ్ళమూడి లలిత గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు. అయితే తమసంకల్పం నెరవేరే సమయంలో దుర్గాబాయమ్మగారు మనమధ్య లేకపోవటం విషాదకరం. ఎంతో సంతృప్తిగా ఉండవలసిన 'మామాట' 'నామాట' గా వ్రాసుకోవాలని వచ్చినందుకు ఎంతో బాధపడుతున్నాను.

సోదరీమణుల జీవిత వివరాలను అందించి నాతో సహకరించిన వారికి మనఃపూర్వక నమస్కారాలు. ఏనాటి విషయాలో కాబట్టి వారు అందించిన వివరాలనే ఆధారాలుగా తీసుకొని, వుద్యమపరంగా, చాలావరకు పరిశీలించి వ్రాశాను. కొందరు తమ జీవిత విశేషాలను ఫోటోలను పంపలేదు. అందువల్ల అందరి జీవితవివరాలను యిందులో పొందు పరచలేకపోయినాను.

విషయసేకరణకు ప్రత్యేక సహకారం అందించిన సర్వశ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు, కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), తెలుగుభాషా సమితి కె. ఆంజనేయులు, క్రొవ్విడి లింగరాజు, పాదర్తి సుందరమ్మ, ఇల్లిందుల సరస్వతీదేవి, కె. సుగుణమణి గార్లకు కృతజ్ఞతలు. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం రిఫరెన్సు శాఖ, పశ్చిమ కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, ఆంధ్ర మహిళాసభ ట్రస్టుబోర్డుల వారి సహకారం అనన్యం. వారికి కృతజ్ఞతలు.

**అచ్యుతుని గిరిజ**

30–7–1986

హైదరాబాదు.

## విషయ సేకరణకు ఉపకరించిన గ్రంథాలు

1. ఆంధ్ర వీరాంగనలు—మాగంటి బాపినీడు

2. ఆంధ్ర కవయిత్రులు—ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

3. వీరసంస్మరణం—రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ

4. గుంటూరుజిల్లా స్వరాజ్య ఉద్యమం—మాదాల వీరభద్రరావు

5. సరోజినీనాయుడు చరిత్ర—గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

6. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు శతజయంత్యుత్సవ సంచిక

7. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు చరిత్ర

8. గృహలక్ష్మి సంచికలు

9. భారతి సంచికలు

# విషయసూచిక

# దేశబాంధవి శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మ

జననం **1880** నవంబరు — మరణం **31–5–1964**

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగ దూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు, మూతులు బిగియగట్టి."

శ్రీ చిలకమర్తివారి ఈ పద్యము రాగ వరసతో అభినయించి చూపుతూ, తెల్లవారు గడుసరి తనంతో ఏ ఏ రకాలుగా కొల్లగొడుతున్నారో, మూతులు బిగియగట్టిన లేగదూడలల్లే భారతీయులు యెట్లా అసహాయులై బాధలను భరించు తున్నారో వ్యాఖ్యానించుతూ శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మగారు స్వాతంత్ర్యోద్యమ కాలంలో బహిరంగ సభల్లో ఉపన్యసించుతూ వుండేవారు. రామాయణ, భారత, భాగవతాలలో నుంచి అనేక ఘట్టాలను శ్రావ్యమైన చక్కని కంఠంతో రాగ వరసన చదువుతూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని యే రావణాసురుడుతోనో సరిపోల్చి చెప్పేవారు. ఏ మైకులులేని ఆ కాలంలో ఆమె కంఠం యెంత దూరానికో వినిపించేది. అటు హిందూ పురాణ శ్రవణం యిటు భారత రాజకీయ పరిచయం చేసుకుంటూ సభికులు మంత్ర ముగ్ధులై కదలకుండా కూర్చుని వినేవారు. ఆమె తన విద్వత్తును, పాండిత్యాన్ని, కల్పనా శక్తిని స్వాతంత్ర్యోద్యమ ప్రచారానికి ఉత్సాహంగ అర్పించేవారు.



శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మ

ఆమెకు మొండి ధైర్యం, సాహసం చాలా అధికం. నదురు బెదురు లేకుండా బహిరంగ సభల్లో ప్రవన్యసించే సందర్భంలో శ్రీ గరిమెళ్లవారి రచనలు "మాకొద్దీ తెల్లదొరతనము'' పాటను రాగం తానం పల్లవి అన్నంత సుదీర్ఘంగ, భావస్ఫూరితంగా చతుర్లతో, చమకులతో పాడేవారు. అశేషజనం పరవశించుతూ విని పుత్తేజితులయ్యేవారు. ఇంత బహిరంగంగా వేలకొద్దీ జనానికి తెల్లదొరతనం వద్దని విప్లవ మంత్రం వుపదేశించుతూ వుంటే ప్రభుత్వ అధికారులుగా పోలీసు వారు డప్పులు, డబ్బాలు మోగించి ఆమె పాట, మాట వినపడకుండా చేసేవారు. ఆమె కోపం పట్టలేక "ఏమోయి అధికారీ నేనంటే ఏమనుకున్నావు. గంగా భగీరథీ సమానురాలను. తలచుకున్నానంటే నిన్ను నీ డప్పులను నీ పోలీసు వాళ్లను గంగలో ముంచెత్తగలను. కాని అహింసా వ్రతం చేపట్టాను. అందుకని అంత పని చేయటంలేదు జాగ్రత్త'' అని గర్జించేవారు. అంతటితో ఖంగారు పడుతూ పోలీసువారు వచ్చిన దోవన పోయేవారు. మరికొన్ని సభల సమయంలో పోలీసు అధికారులు కనిపించగానే "ఏమోయి బ్రిటిష్ వారి బానిసా! రా, రా, నన్ను పట్టుకో,'' అని అరిచేవారు. అధికారులు యిబ్బందిగా అటు, ఇటు చూసి వెళ్ళిపోయేవారు. ఇప్పుడు అతిశయోక్తి అని అనిపించుతుందేమో కాని స్వాతంత్ర్యోద్యమంలో ఇవన్నీ అక్షరాలా జరిగిన ఘట్టాలు.

ఆమె బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడ్డి పోచగా భావించేవారు. అందువల్లనేమో పోలీసు శాఖకు ఆమె అంటే హడలు. ఒకసారి పిఠాపురంలో ఒకతోటలో లాఠీ ఛార్జి జరిగింది. నలుగురు పోలీసులు ఒక ఆయనను లాఠీలతో కొడుతుంటే చూడశక్యంకాక శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ అడ్డువెళ్లారు. ఆ నాలుగు లాఠీలు ఆమెమీద పడినవి. వెంటనే శ్రీమతి సుబ్బమ్మగారు "పిల్లను చంపి వేయటానికి మీకు చేతులు ఎట్లావచ్చినవిరా'' అంటూ ఆశీస్సులు అరంభించారు. పోలీసులు తక్షణం లాఠీలు కిందకు దించి "పొరపాటు అయిందమ్మా. ఆమె ఒక్కసారిగా అడ్డురావడంతో అనుకోకుండా దెబ్బ తగిలింది. క్షమించం డమ్మా'' అంటూ క్షమాపణఅడిగి సమర్పకాలు చెప్పుకుంటూ అవతలకి తప్పుకున్నారు.

ఆమె తెల్లని ఖద్దరు పంచ ముసుగు ధరించి కట్టుకునేవారు. చిన్నప్పుడే పోలియొ వ్యాధి వచ్చినందువల్ల కాలు అవుడుఅయి కుంటుతూ నడిచేవారు. కాని ఆమె ప్రతిభ అటువంటిది.

మధ్య తరగతి సనాతన కుటుంబములో ఆమె 1880 నవంబరులో జన్మించారు. రామచంద్రపురం తాలూకా ద్రాక్షారామం ఆమె జన్మస్థలం. శ్రీ మల్లాది సుబ్బావధాన్లు కూతురు. చిన్నతనంలోనే రాజమండ్రి తాలూకా, కడియం గ్రామవాసి అయిన శ్రీ దువ్వూరి వెంకటప్పయ్యతో వివాహం అయింది. సంస్కృత ఆంధ్ర భాషలలో విదుషి. శ్రీ చల్లపల్లి వెంకటశాస్త్రి శిష్యురాలు. గొప్ప వేదాంతి. ఆడపిల్లలకు హైస్కూళ్లుకూడ లేని ఆరోజులలో చిన్నప్పుడే వివాహమయి అత్తవారి ఇంటికి వెళ్ళిన ఆమెకు అంతటి వేదాంత పరిచయం గొప్పవిద్వత్తు ఉండేదంటే ఆమె సాధనను ఊహించుకో వచ్చును.

1921 వరకు ఏ రాజకీయాలు ఆమె ఎరగరు. అప్పుడే గాంధీ మహాత్ముడి స్వాతంత్ర్యసమర శంఖారావం దేశం నాలుగు మూలల పిక్కటిల్లింది. ఆమెభర్త చనిపోయి అప్పటికి కొన్నినెలలే అయింది. ఆమె బాహ్య రూపంలోనే పెద్ద మార్పు జరిగిపోయింది. ఐనా ఇవేవీ ఆమెకు అడ్డు రాలేదు. రణరంగంలో ప్రవేశించారు. ఆ సంవత్సరమే కాకినాడలో ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులు ఆధ్వర్యాన జరిగిన ప్రథమ తూర్పుగోదావరి జిల్లా మహాసభకు హాజరైనారు. శ్రీ బులుసు సాంబమూర్తి సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనమే జాతీయ మహసభ ప్రధాన లక్ష్యంగా ఉండాలని సూచించుతూ తీర్మానం ప్రవేశపెట్టారు. ఆ తీర్మానాన్ని బలపరుస్తూ ఆమె బ్రహ్మాండమైన వుపన్యాసం ఇచ్చారు. స్త్రీలు అంత అనర్గళంగా బహిరంగసభల్లో వుపన్య సించటం యెరగని ప్రజలు ఆశ్చర్యపోయినారు. ఆనాటినుంచి ఆమె ఉపన్యా సమంటే ప్రజలు పదిమైళ్లునడిచి వెళ్లేవారు. ఆంధ్రదేశమంతట అసహా యోద్యమంలో ఆమె అంతులేని ప్రచారం జరిపారు. వాలంటీర్ల దళంలో మొట్టమొదటిపేరు ఆమెదే. ఆమె వుపన్యాసాలకు వుత్తేజితులు కానివారు ఉండే వారు కారు.

ఆమె ఏ పని చేసినా మొదటినుంచి పోలీసువారికి, ప్రభుత్వానికి ఒక సమస్యగా తయారయి వాళ్లను ఇరకాటాన పెట్టేది. అప్పటివరకు భారతదేశం మొత్తంమీద పంజాబులో ఒక్క శ్రీమతి పార్వతీదేవి అరెస్టు అయినారు. అందువల్ల ప్రభుత్వం స్త్రీలను ఖైదుచేయటాన్ని గురించి అంతగా ఆలోచించ నేలేదు. ఆంధ్రదేశంలో శ్రీమతి సుబ్బమ్మగారే ఈ సమస్యతెచ్చిపెట్టారు.

ఆమెను అరెస్టుచేయటానికి తగినజైలు సదుపాయాలు లేవు. పోయి పోయి ఒక ఛాందస కుటుంబానికి చెందిన పూర్వ సువాసినిని జైలులోపెట్టి, అందువల్ల కలిగే సమస్యలను ప్రభుత్వం ఎదుర్కొన తలుచుకోలేదు. ఉపేక్షచేస్తే ఆమె పలికే విప్లవ మంత్రం దేశంలో కార్చిచ్చులాగ వ్యాపించుతున్నది. ధైర్యంచేసి ఒకసారి బంధించితే, ఆమె నిష్ఠానియమాలకు జైలు జీవితం ఎటూ సరిపోదు. కాబట్టి తానే క్షమాపణ ఇచ్చి ఆమె బయటికి రాగలరన్న ఆశతో ఒక పాచిక వేశారు. 1922 ఏప్రియల్ 4 న ఆమెను అరెస్టు చేసి జామీను కేసుపెట్టారు. ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించి రాజమండ్రి జైలుకు పంపించారు. దేశం కోసం పాటుపడుతున్నప్పుడు ఇటువంటి చిన్న చిన్న వ్యక్తిగత విషయాలు అడ్డం రావుసుమా అని ప్రపంచానికి చాటినట్లుగా ఆమె అలక్ష్యంగా అది ఒక సమస్యే కాదన్నట్లు వ్యవహరించారు. అధికారుల ఎత్తు చిత్తయింది. కలెక్టరు మొదలైనవారు స్వయంగా వచ్చి ''అమ్మా మీరు వ్రాత మూలకంగా కాక పోయినా నోటిమాటగా క్షమాపణ చెప్పినా మిమ్ములను వెంటనే విడుదల చేస్తా'' మన్నారు. ఆమె అతి నిర్లక్ష్యంగా ''నా కాలిగోరు కూడా అటువంటి పని చేయ'' దన్నారు. అవమానంతో వెనుదిరిగిన అధికారులు ఆమెను రక రకాల ఇబ్బందులు పెట్టి లొంగతీసుకోవాలని చూశారు. అది వాళ్లతరం కాలేదు. ఏడాది పూర్తి శిక్ష అనుభవించి ఆమె బయటికి వచ్చారు. జాతీయోద్యమంలో జైలుకు వెళ్లిన ద్వితీయ మహిళగా, ప్రథమ ఆంధ్ర మహిళగా ఆమె చరిత్రలో ఎనలేని స్థానం సంపాదించుకున్నారు. దేశసేవలో ఆంధ్ర మహిళలకు ఆమె వరవడి దిద్ది గురువులైనారు.

ఆమె గాంధీజీ ఆదేశానుసారం కాంగ్రెసు కార్యక్రమాలను ప్రచారం చేస్తూ ఆంధ్ర దేశం నాలుగు మూలలా ప్రచారం చేసేవారు. రాజమండ్రిలో శ్రీమతులు పెద్దాడ సుబ్బమ్మ, చల్లపల్లి సీతాదేవి వంటి స్త్రీలను సమకూర్చుకుని మహిళా సభలు, సమావేశాలు ఏర్పాటు చేస్తుండేవారు. మహిళలలో చైతన్యం, ఉత్తేజం కలిగించేవారు. జాతీయ విధానంలో స్త్రీ విద్యాభివృద్ధి కలిగించితే శాశ్వతమైన సత్ఫలితాలు ఉండగలవని విశ్వసించారు. రాజమండ్రిలో ''సనాతన విద్యాలయం'' అను పేరిట జాతీయ విద్యాలయం స్థాపించారు. సంస్కృతం, తెలుగు, కుట్టుపనులు వంటివి బోధించి అవసరమైన స్త్రీలకు ఒక జీవికను కల్పించారు. ఉదారులైన ప్రజల నుండి విరాళాలు సేకరించి చదువు ఉచితంగా చెప్పటమే కాక వారికి ఉచితంగా భోజన వసతి

సదుపాయాలు కల్పించారు. అటువంటి వ్యక్తి చేస్తున్న కార్యకలాపాలకు సహకరించటం తన ధర్మంగా ఆనాటి సంఘం భావించింది. దసరా ఉత్సవాలు ఆమె ఎంతో నియమంతో, నిష్ఠతో దేవీ భాగవత పఠనాదులతో నిర్వహించేవారు.

ఇంతలో మహాత్ముని దండీయాత్ర, ఉప్పుసత్యాగ్రహం వచ్చినవి. ఆమె ఉత్సాహానికి అంతులేదు. చేతికి నోటికి కావలసినంత పని. బళ్లు కట్టించుకుని లవణ ప్రభలు కట్టుకుని, జాతీయ గీతాలు పాడుకుంటూ, భజనలు చేసుకుంటూ, ప్రజలు ఉప్పు వండటానికి ఉద్యమించారు. శ్రీమతి సుబ్బమ్మ గారిని ఆపటం యెవరి తరం ? 31-5-1930 న అరెస్టు చేసి, మొదటి పంక్తిలోనే ఆమెకు జైలు శిక్ష వధించింది ప్రభుత్వం. అప్పటికి అనుభవం గడించినందువల్ల రాయవేలూరు సెంట్రల్ జైలులో స్త్రీలకు ప్రత్యేక విభాగం కట్టించి స్త్రీ బందీలను అక్కడికే పంపించేవారు. ఆరు నెలల శిక్ష అనుభవించమని ఆమెనూ అక్కడికే పంపించారు. ఇద్దరు పోలీసులు, ఆమె, జట్కాలో కాట్పాడి నుంచి వేలూరు పోతూ ఉండగా దోవలో యింకొక జట్కా బండి యెదురొచ్చింది. అప్పటికే అరెస్టయి రాయవేలూరు జైలులో ఉన్న శ్రీమతి దుర్గాబాయమ్మ గారిని చూచి తిరిగి వస్తున్న ఆమె సోదరుడు, తల్లి ఆ బండిలో ఉన్నారు. వాళ్ళను గుర్తించిన ఆమె బండి ఆపమని ఒక్క కేక పెట్టి "అమ్మాయిని చూసి వస్తున్నారా?" అని అడిగారు. అలవాటు పడిన నిర్లక్ష్యంతో జట్కాబండి ముందుకు సాగింది. "బండి ఆపమంటే వినిపించుకోవె నీకుకాదూ చెపుతున్నది" అని ఒక్కసారి గర్జించారు. ఇది బొత్తిగా అలవాటు లేని బండివాడు ఆపడమే కాక రెండవ బండి పక్కన నిలబెట్టాడు. పోలీసులు బిత్తరపోయి చూస్తున్నారు. ఆమె "అమ్మాయిని చూచివస్తున్నారా? బెంగ పెట్టుకోకండి, మరేం ఫరవాలేదు. నేను వెళుతున్నాగా. జాగ్రత్తగా చూచుకుంటాను," అని ధైర్యం పలికారు. పోలీసులతో వెళుతున్న ఒక సామాన్య ఖైదీగా ఆమె యింత చొరవ, ధైర్యం చూపగలిగారు అంటే సామాన్యుల ఊహకు అందదు. జైలులో అంతా ఆమెకు పరిచయులే, మిత్రులే. ఆమె ఛలోక్తులకు, పాటలకు, పద్యాలకు అంతులేదు. అక్కడా నవరాత్రులు శ్రద్ధాభక్తులతో చేసేవారు. ఆమెదంతా ఒక విచిత్ర ధోరణి. సూటిగా నిస్సంకోచంగా అధికారులనే నైవేద్యానికి ప్రత్యేక వస్తువుల నడిగేవారు. వాళ్లు వున్నంతలో సమకూర్చేవారు. తోటి స్త్రీలు మీరు ఎంత ధైర్యంగా అడిగారండీ అంటే

ఆమె ''ఏం జైలువాళ్లకు మాత్రం నాలుకలు లేవా, రుచులు తెలియవా? వాళ్లకూ ఇంత ప్రసాదం పెడితేసరి'' అనేవారు. శ్రీమతి జయంతి సూరమ్మతో ''ఇదుగోనమ్మా సూరమ్మ వదినా ఆ కాస్త వంటా యీ నాలుగు రోజులు మడితో చేసి పడెయ్యి'' అనేవారు. ''ఎ'' క్లాసు ''బి'' క్లాసు ఖైదీలకు సంబారాలు యిస్తే వంటలు వంతుల ప్రకారం వాళ్లే వండుకునేవాళ్లు. అందువల్ల కావలసిన విధంగా పిండి వంటలతో సహా నైవేద్యం సంసిద్ధమయ్యేది. మహావిద్వాంసురాలు కవయిత్రి అయిన శ్రీమతి పొణకా కనకమ్మ కూడ అప్పుడు ఆ జైలులోనే వున్నారు. అందువల్ల ఆమె శ్రద్ధా భక్తులతో దేవీభాగవతం చదివి వినిపించేవారు. అట్లా సుబ్బమ్మగారు పూనుకుని జైలు జీవితాన్ని కూడా రసవంతంగా సత్కాలక్షేపాలతో గడిపేవారు.

ఆమె కాంగ్రెసు నడిపిన ప్రతి కార్యక్రమంలోనూ పాల్గొన్నారు. 1932లో శాసనోల్లంఘనం, 1940లో వ్యక్తి సత్యాగ్రహం, 1942లో క్విట్టిండియా కార్యకలాపాలలో ప్రధాన పాత్ర ధరించారు. లాఠీదెబ్బలు తిన్నారు. జైళ్లకు వెళ్లారు. 14 సంవత్సరాల పాటు అఖిల భారత కాంగ్రెసు సంఘంలో సభ్యులుగా ఉన్నారు. కన్న కలలు ఫలించి స్వరాజ్యం వచ్చింది. ఆంధ్ర రాష్ట్రం కూడ వచ్చింది. వృద్ధాప్యంలో అనారోగ్యంతో సంతానంలేని ఆమె, సోదరుని దగ్గర సేవలు పొందుతు 1964 మే 31వ తేదీన భౌతికకాయం చాలించారు.

ఆమె ప్రజలకు గౌరవాస్పదురాలైన దేశబాంధవి. మహిళాభ్యుదయ; జాతీయోద్యమాలలో ఆంధ్ర మహిళలకు గురువుగా, పూజనీయగా స్థిరమైన కీర్తిని పొంద గలిగిన ధన్యురాలు.

# శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ

జననం 1882 మరణం 29-2-1952

**1926-27** ప్రాంతాలలో ఒకనాడు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గుంటూరు కొత్తపేటలోవున్న తమ పరిచయులు శ్రీమతి గోళ్ల మూడి రాజ్యలక్ష్మమ్మ యింటికి వెళ్లారు. బయట హాలులో ఆ కాలపు అలవాటును పట్టి కుమారీ శతకం, సుమతి శతకంలో పద్యాలు గడగడ ప్రైవేటుమాస్టరుకు అప్ప చెపుతున్నది ఒక ఆరేళ్ల అమ్మాయి "పతి భుజియించిన మెతు కొక్కటి మిగల కుండ" అని ఆ అమ్మాయి చదువుతునే వున్నది. ఆమె 'ఛీ ఛీ యేమిటా చదువు? మీ అమ్మలేదూ యింట్లో' అని ఒక్క కేక పెట్టారు. బిత్తరపోయిన అమ్మాయి 'అమ్మా ఉన్నవ అత్తయ్య వచ్చారు' అంటు తల్లిని పిలుస్తు వెళ్లింది. పై ఘట్టం వినిన వాళ్లెవరూ ఆమెను నుదుట పెద్ద కోలబొట్టు, మెళ్లో పసుపుతాడు చేతులకు వెండి గాజులు, కాళ్లకు మట్టెలు అంటదువ్వి చుట్టుకున్న చిన్న కొండిచుట్ట మోచేతులవరకు వున్న తెల్ల ఖద్దరు రవికె, కాశపోసి కట్టుకున్న ముతక తెల్ల ఖద్దరు చీరె, జీరాడే పమిటెతో వూహించుకోలేరు. కాని వేరే యే అలంకారాలు, ఆభరణాలు లేని యీ నిరా డంబర వేషంతోనే శ్రీమతి లక్ష్మీబాయమ్మ సభలు సమావేశాలు, పెళ్లిళ్ల పేరంటాలు అన్నీ సలక్షణంగా జరిపించేవారు. ఆమె అక్షరాలా పురాణి. పురాతన పూజలు, పునస్కారాలు, నోములు, వ్రతాలు, వేషభాషలు చదువు సంస్కారాలు అభిమానించుతారు. కాని పాతవే అయినా స్త్రీల అభ్యున్నతికి అడ్డువచ్చేవి, అభిజాత్యానికి అడ్డువచ్చేవి అంటే మాత్రం సహించరు.



శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ

మహాకాళిగా మారిపోతారు. సభలు సమావేశాల సమయంలోనైనాసరే స్త్రీ తగిన గౌరవం యివ్వకపోతే యెవరిని లెక్క చెయ్యకుండ లేచివెళ్ళిపోయేవా ఆమెలోవున్న విప్లవ భావన, పరతంత్ర శృంఖలాలను ఛేదించిపారవే లన్న తపన ప్రతి ఒక్క విషయంలోను కనిపించుతుంది.

1920—40ల మధ్య గుంటూరులో శారదా నికేతనం వార్షికోత్సవా పౌరులను విపరీతంగ ఆకర్షించేవి. పదేళ్లలోపు అమ్మాయిలకు పెళ్లిళ్లు చే మూడోయెక్కమైనా ముచ్చటపడి నేర్చుకోకుండ అత్తవారిళ్లకు పంపే ఆ రోజు శారదా నికేతనంలో అమ్మాయిలు తళ తళలాడే మఖమల్ జరీబుటా దుస్తులు ధరించి సంస్కృత నాటకాలు కూడ ప్రదర్శించుతు, కన్ను పండుగగా పదేసిమంది పిల్లలు రకరకాల వాయిద్యాలతో పాట కచ్చేరీ చేస్తువుంటే రాత్రి తొమ్మిదయినా ప్రేక్షకులు కదిలేవారు కాదు.

ఆ రోజుల్లో శారదా నికేతనం విశ్వకవి రవీంద్రుని శాంతి నికేతనాన్ని స్ఫురింపచేసేది. అక్కడ తెలుగు, సంస్కృతం, సంగీతం, చిత్రలేఖనం, లే అల్లికలు, పూవులు, లతలు కుట్టటం, నూలువడకటం వంటి జాతీయ విద్యలెన్నో నేర్పేవారు. జాతి, కుల, మత, భేదం లేకుండ ఆడపిల్లలకు ఉచితంగా విద నేర్పటమేకాక ఉచితంగా హాస్టలు సదుపాయాలు కూడ కల్పించేవారు. ఇవన్నీ నేర్చి అమ్మాయిలు విజ్ఞానవంతులు కావాలి, తమగౌరవాన్ని తాము కాపాడ కోగలగాలి, అవసరమైన పరిస్థితులలో కొంత డబ్బు సంపాదించుకోగలగాలి తమకు తమస్త్రీ జాతికే కాక తమ మాతృదేశానికి సేవచేయాలి అన్న తలంపుతోనే శ్రీ ఉన్నవ దంపతులు శారదా నికేతనం స్థాపించారు. బాల్య వివాహాలవల్ల స్త్రీ మానసికంగా యెదగకుండానే గృహవిధులకు, కష్టాలకు లోనవుతున్నది. ఇక బాలవితంతులగోడు చెప్పనే అవసరంలేదు. ఈ పరిస్థితిలో చైతన్యం స్త్రీలలోనే కలిగించాలనే ఉద్దేశంతో సంస్థాపించి గురుకుల వాతావరణంలో నడిపించసాగారు. ఆంధ్రపర్యటనకు వచ్చినప్పుడు గుంటూరులో ఎంత తక్కువకాలం గడిపినా గాంధీజీ ఒకసారో రెండుసార్లో శారదానికేతనానికి వచ్చి, అక్కడి వారందరిని ఆశీర్వదించి, వుద్బోధించి తీరవలసిందే. రెల్లు కప్పువేసిన గుండ్రటి వేదికలు అనేకం వుండేవి. వాటిమీద కూర్చుని గాంధీజీ మాట్లాడుతుంటే సభికులు తామెక్కడున్నారో మరచి పరవశించేవారు. అది ఆ నాటి శారదానికేతనం సౌభాగ్యం.

1862 లో శ్రీ నడింపల్లి సీతారామయ్య, శ్రీమతి రామలక్ష్మమ్మల ముద్దు బిడ్డగా శ్రీమతి లక్ష్మీబాయమ్మ జన్మించారు. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలోని అమీనాబాద గ్రామం ఆమె జన్మస్థలం. పదవ ఏట 1892లో గుంటూరు తాలూకా వేములూరిపాడు వాస్తవ్యులైన ఉన్నవ లక్ష్మీనారాయణ గారితో వివాహం అయింది. ఆయన స్ఫురద్రూపి, అత్యంత శాంత,సరళ స్వభావి, బారిష్టరు. ఇంగ్లండులో విచ్చలవిడిగా సంచరించి, లేని పోని పోకళ్లు నేర్చుకోకపోగా, గాంధీజీ లాగా సంస్కార భావాలు, స్వాతంత్ర్యేచ్ఛ, సమాజ పతనానికి మూల కారణాలు వెతకటం, రచనాత్మక కార్యకలాపాలను నిర్వర్తించటం వంటి వున్నత, వుత్తమ భావాలనే పెంపొందించుకొని వచ్చారు. అర్థాంగి ఆసరాలేనిదే ఏ పని సానుకూలం కాదని, నిజమైన ఫలితం కలగదని ఆయన నమ్మకం. అందువల్ల భార్యకు విజ్ఞాన తృష్ణ, సంస్కార భావాలు కలిగించారు. 1902 లోనే ఆ దంపతులు గుంటూరులో ఒక వితంతు శరణాలయం స్థాపించారు. అనేక కష్టనష్టాలను ఎదురుకొని సాహసంతో ఎన్నో పునర్వివాహాలు జరిపించారు. ఇంతలో రాజమండ్రి నుంచి శ్రీ వీరేశలింగం పంతులుగారు వీరిని పిలిపించారు. తాము స్థాపించిన ఆశ్రమాన్ని, శరణాలయాలను నిర్వహించమన్నారు. ఆ పని చూస్తూ వాళ్లు మరింత అనుభవం గడించారు.

1908 లో తిరిగి గుంటూరు వచ్చి తాము నెలకొల్పిన వితంతు శరణాలయం నిర్వహించసాగారు. 1914 నుంచి స్వాతంత్ర్యం సంపాదించాలన్న ఆకాంక్ష దేశంలో తలెత్తింది. శ్రీ బాలగంగాధర తిలక్ ఆనాటి రాజకీయగురువు. శ్రీ ఉన్నవదంపతులు, శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, టంగుటూరి ప్రకాశం పంతులు, ఆచంట లక్ష్మీపతి దంపతులు వంటివారు యెంతోమంది తరుచూ పోట్లపూడిలో సమావేశమవుతువుండేవారు. స్వరాజ్య సంపాదన గురించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణంగురించి ఆలోచనలు జరుపుతూ వుండేవారు.

వయోజనులయిన స్త్రీలకు తీరికవేళల చదువు, చేతిపనులు నేర్పటానికి 1918లో దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్య తమ యింట్లోనే ఒక పాఠశాల నెలకొల్పారు. సుప్రసిద్ధ దేశసేవిక శ్రీమతి దిగుమ

జానకీబాయమ్మ ఇంగ్లీషు, లెక్కలు బోధించుతువుండేవారు. అదేకాల క్రమేణ శారదానికేతనంగా రూపొందింది.

1921 నాటికి దేశంలో గాంధీజీ నాయకత్వం వచ్చింది. కాంగ్రెసు సంఘం యేర్పడి ఉద్యమాన్ని క్రమబద్ధంగా జరపనారంభించింది. పల్నాటి ప్రజలు పుల్లరి చెల్లించకుండా అడవులు వాడుకొని ప్రభుత్వాన్ని చీకాకు పరచసాగారు. అప్పటికింకా పన్నులు కట్టవద్దని ప్రజలకు కాంగ్రెసు చెప్పలేదు. పరిస్థితులను పరిశీలించిచెప్పమని కాంగ్రెసువారు శ్రీ లక్ష్మీనారాయణ, మాడభూషి వేదాంత నరసింహాచార్యులుగార్లను పంపించారు. గ్రామాలన్నీ సంచారం చేస్తున్న వీళ్లను చూసి వీళ్లే ఉద్యమం రగిలించుతున్నారనుకొని ప్రభుత్వం నిర్బంధించింది. అప్పటికి స్థానికప్రజలు ఎవరు స్వాతంత్ర్య ఉద్యమంలో జైలుకు పోలేదు. జైలుకు వెళ్తున్న భర్తను చూడటానికి శ్రీమతి లక్ష్మీబాయమ్మ గుంటూరు స్టేషనుకు వెళ్లారు. ధైర్యంగా, నిశ్చలంగా వీడ్కోలిచ్చి, నాటినుండి ఆమె బహిరంగంగా వుద్యమ ప్రచారానికి పూనుకొన్నారు. ఉత్తేజపూరితమైన వుపన్యాసాలతో విద్యార్థులను, స్త్రీలను వుద్బోధించారు. ప్రచారం చేస్తు విరివిగా దేశాటనంచేశారు. విశాఖపట్నంలో మెడికల్ కాలేజి విద్యార్థు లనేకులు ఆమె ప్రబోధంతో గాంధీటోపీలు పెట్టుకుని కాలేజికి వెళ్లి శిక్షలకు గురి అయినారు. ఆమెమాట ప్రభావం అంతటిది.

రాయవేలూరు జైల్లో లక్ష్మీనారాయణగారు వ్రాసిన మాలపల్లి అనే బృహత్ నవల గొప్ప సంచలనం కలిగించింది. బ్రిటిష్ ప్రభుత్వం దానిని నిషేధించింది. ఆ పుస్తకాన్నే స్వతంత్ర భారత ప్రభుత్వం యేర్పడిన తరువాత బి. ఎ. క్లాసులకు, రాష్ట్రభాషావిశారద పరీక్షలకు పాఠ్యగ్రంథంగా వుంచారు.

1922లో స్త్రీవిద్య జాతీయ విధానంలో వ్యాపింపచేయాలనుకున్నారు ఉన్నవదంపతులు. సంస్కృత, తెలుగు భాషలకు ప్రాధాన్యతనిస్తూ ఉభయ భాషా ప్రవీణ, విద్వాన్ పరీక్షలకు, కుట్లు, అల్లికలు, చిత్రలేఖనం, వడకటం, నేయటం వంటి విషయాలలో శారదా నికేతనంలో క్లాసులు నడిపారు. దాతల వుదార విరాళాలతో స్వంత స్థలం ఏర్పడి రెల్లుపాకలు క్లాసులుగా రూపొందినవి. హాస్టలు మాత్రం గట్టిగా కట్టిన భవనాలలో వుండేది. కుల, మత, జాతి విచక్షణ లేకుండా అందరిని చేర్చుకుని వుచితంగా హాస్టలు సౌకర్యాలు కల్పించేవారు. జాతీయసంస్థలపై నాటిప్రజలు యెంతో గౌరవంతో ఎక్కువగా

విరాళాలు అందించేవారు. వయసు ఎక్కువగా ఉన్న స్త్రీలను, వివాహితులయిన స్త్రీలను చేర్చుకోకూడదని శ్రీ లక్ష్మీనారాయణ అనేవారు. అసలు వాళ్లకే ప్రాధాన్యత నివ్వాలని శ్రీమతి లక్ష్మీబాయమ్మ పట్టు. సంస్థ నిర్వహణా భారమంతా ఆమెదే కాబట్టి విజయమూ ఆమెదే. మద్రాసు, బొంబాయి వంటి పట్టణాలకు పోయి ఆమె విరాళాలు భారీగా సేకరించగలిగేవారు. ఏ హోదాలో వున్నవారి దగ్గరకైనా, యే పార్టీవారి దగ్గరకైనా నిస్సంకోచంగా వెళ్లి పని సాధించుకు రాగల పట్టు, సామర్థ్యం ఆమెకు పుష్కలంగా వుండేవి.

ఆమె జాతీయ నిధిని పోగుచేయటానికి బర్మా కూడా వెళ్లారు. తమదంటు లేకుండ సమస్తము దేశానికి అర్పించారు. విదేశీ వస్తు, వస్త్రాలను బహిష్కరించమని నిరంతరము ప్రబోధించేవారు. తామే కాక సంస్థ బాలిక లందరు నూలు వడికి ఖాదీ ధరించేవారు. ప్రతి బాలికలోనూ దేశభక్తి వెల్లుబుకుతు వుండేది.

1930 లో ఉప్పు సత్యాగ్రహం దేశం అంతటిని ఒక్క తాటిపై నడిపించింది. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతితో కలిసి ఆమె ఆంధ్రదేశంలో నిరవధిక ప్రచారంచేశారు. స్త్రీలను వుత్తేజితులను చేసి రంగంలోకి దించారు. గుంటూరులో దేశభక్త కొండా వెంకటప్పయ్య గారు శాసనోల్లంఘన నాయకులుగా వుప్పు సత్యాగ్రహం ఆరంభమయింది. కోనేటి గట్టునచేరి స్వాతంత్ర్య శపథంచేసిన వీరయువకులకు ఆయన వీరకంకణాలు కట్టారు. శారదా నికేతనబాలికలు ''వీర గంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ'' అనేగీతం ఆలపించారు. వారికి తిలకం దిద్దారు. ఆ దృశ్యం ప్రతివారికంట ఆనంద బాష్పాలు రాలేట్లు చేసింది. శ్రీమతి లక్ష్మీబాయమ్మ అంతటా తానే అయి ముఖాన వీరావేశం వుట్టిపడగా పరాశక్తిగా విజృంభించారు.

ఆ రోజుల్లో గుంటూరు కొత్తపేటలో 200 మంది శాంతిసమర సైనికులను తీర్చి దిద్దటానికి శిబిరం నిర్వహించబడింది. శ్రీయుతులు నడింపల్లి లక్ష్మీనరసింహారావు, కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లతో పాటు శ్రీమతి కాళంగి శేషమాంబ వంటి స్త్రీలను జతకూర్చుకొని శ్రీమతి లక్ష్మీబాయమ్మ శిబిరం నిర్వహించారు. ఒకనాడు అధిక సంఖ్యలో

పోలీసు దళంవచ్చి వడ్డించిన విస్తళ్లు తొక్కిపారేసి, వండిన గుండిగలు కింద కుమ్మరించి. దొరికిన వారినల్లా లాఠీలతో చితక బాదటం గుంటూరు పౌరులు మరువలేని దృశ్యం. శిబిరం మూసి వేయబడింది.

ఆమె వివిధ ప్రాంతాలలో ప్రచారంచేస్తు, వుప్పువండి శాసనధిక్కారం చేస్తూ వుండేవారు. చివరకు దేవరంపాడులో వుప్పు వండుతుండగా ఆమెను 9-6-1930న అరెస్టు చేశారు. 6 నెలలు కఠిన శిక్ష విధించి రాయవేలూరు జైలుకు పంపించారు.

1932 లో శాసన ఉల్లంఘనం రెండవసారి దేశాన్ని వూపివదిలింది. అప్పటికి ప్రభుత్వం అనుభవం గడించి కుటిలనీతిని, దమన నీతిని అలవరచు కున్నది. ఢిల్లీలో కాంగ్రెసు సమావేశంజరుగనున్నది. పోలీసులు నిషేధించారు. వెళ్లిన సభికులను స్టేషనులోనే అరెస్టు చేశారు. నిషేధాజ్ఞను అతిక్రమించి ఆమె ఢిల్లీ వెళ్లారు. అనుకున్నట్లుగానే 24–4–32 న అరెస్టు చేశారు. అక్కడే కొన్నిరోజులు జైలులో వుంచారు.

మిన్ను విరిగి మీద పడినా వెన్నుచూపని అపర ఝాన్సీలక్ష్మీబాయిగా పేరు గడించుకున్న ఆమె నిర్భయంగా తన బృందంతో వూరూరు తిరిగి ప్రబోధం చేసేవారు. శ్రీమతులు సంగం లక్ష్మీబాయి, బసవరాజు రాజ్యలక్ష్మమ్మల వంటి యువతుల నెందరినో వీరవనితలుగా తయారుచేశారు.

1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో ఆమె పాల్గొన్నారు. గుంటూరులో 2–2–41 న మూడవసారి అరెస్టయినారు. 3 నెలలు శిక్షవేసి రాయవేలూరు జైలుకు పంపించారు. ఆ సమయంలో 'ఎ' క్లాసులో ఉన్న ఆమె 'సి' క్లాసు రాజకీయ బంధితులకు ఆహార పదార్థాలు అందించారని అలజడి కూడ రేగింది.

ఆమె కార్యకలాపాలకు వుద్యమాలతో ముగింపురాదు. అవి నిరవధికం. ఆమె పాల్గొనని జాతీయ వుద్యమాలు లేవు. వివరించుతు ఆమె వుపన్యసించని, ప్రబోధం చేయని స్త్రీల సమస్యలు లేవు. ఎక్కడ యే సంస్కరణ అవసరమైనా, సాంఘిక మార్పు రావలసినా ఆమె చెయ్యివుండి తీరాలి. బహుకాలం గుంటూరు పురపాలక సంఘ సభ్యురాలుగా కాంగ్రెసు పక్షానికి ప్రతిభ కూర్చారు.

ఎన్ని కమాటాలు వున్నా సంస్థ ఆమెకు ప్రాణం. విద్యార్థినులు ఆమెకు బిడ్డలకన్నా ఎక్కువ. విద్యార్థినులచేత పూజలు, వునస్కారాలు, అట్లతద్దెలు, మూగనోములు చేయించుతూ వాళ్ల భావిశ్రేయస్సుకు భగవంతుని ప్రార్థించుతు, వారి ఆటలు పాటలతో తన్మయులవుతూ అదే ప్రపంచంగ జీవించారు. ఆ వసుధైక కుటుంబిణి మాతృ మూర్తిగా విద్యార్థినులచేత, దేశసేవికగా నాయకులచేత, సంఘసంస్కారిణిగా యావన్మందిచేత గౌరవాభిమానాలు అందుకున్నారు. 1952 లో తన 70వ ఏట పండు ముత్తయిదువుగా పుణ్యలోకాలకు తరలిపోయినారు.

---

# శ్రీమతి పొణకా కనకమ్మ

జననం 1892 మరణం 15-9-1963

1962 మే నెలలో ఆంధ్ర మహిళాసభ రజితోత్సవాలు మద్రాసు నగరంలో అత్యంత వైభవంగా జరిగినవి. జాతి, మత, భాషాప్రసక్తులు లేకుండా పౌరులు అసంఖ్యాకంగా వుత్సవాలలో పాల్గొన్నారు. మొదటి రోజు సాయంత్రము సమావేశానికి మాజీ భారతదేశ అధ్యక్షులు, ఆనాటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి అయిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించారు. మన దేశానికి ఆఖరు వైస్రాయి, ప్రజా నాయకులు, దేశసేవకులు అయిన శ్రీ సి. రాజగోపాలాచారిగారు హాజరయినారు. శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి ప్రార్థనాగీతంతో ఆరంభం అయిన ఆనాటి కార్యక్రమంలో ఆంధ్రదేశానికి చెందిన ఇరవైమంది దేశసేవికలు, సంఘ సేవికలు, రచయిత్రులు, కళాకారులను సత్కరించి సన్మానించింది సభ. వారిలో శ్రీమతి పొణకా కనకమ్మగారు ముఖ్యులు. ఆనాటి మహారాష్ట్ర గవర్నరయిన డాక్టర్ సుబ్బరాయన్‌గారు మహిళా సభ తరపున ఆమెకు రజిత ఫలకం అందించారు. ఫలకంపైన—



శ్రీమతి పొణకా కనకమ్మ

"ఆంధ్రమహిళాసభా రజితసమారోహే
భారత మహిళాలలామ భూతాయై,
శ్రీమతి పొణకా కనకమ్మా ఇత్యస్త్యై,
సమ్మానపురస్కారః" అని వున్నది.

సాదాఖద్దరుబట్టలు, ఏ ఆభరణాలు, అలంకారాలు లేవు. కాని డెబ్బయి సంవత్సరాల వయస్సులో, సాత్వికంగా, ప్రశాంతంగా తృప్తిగా వెలుగొందు

తున్న ఆమె ముఖవర్చస్సు చేతిలోని రజితఫలక ప్రకాశాన్ని అధిగమించి వున్నది. ఆ దృశ్యం ప్రేక్షకులకు మరపురాదు. ఆ వృద్ధ తపస్వినే శ్రీమతి కనకమ్మగారు. సమయానికి తగుమాటలాడి ఆమెను పొగడటం వేరు. మహానాయకుల సమక్షంలో భారత మహిళాలలామగా గుర్తిస్తూ, శాశ్వతంగా వుండేటట్లు రజితఫలకంపైన చెక్కించి సన్మానించటం వేరు. ఉత్తమ దేశ భక్తురాలుగా స్వాతంత్ర్యోద్యమానికి సర్వస్వం అర్పించిన త్యాగశీలిగా, నెల్లూరుమండల యువతులలో రాజకీయ చైతన్యం, విద్యావికాసం, ఆత్మధృతి కలిగించిన సంఘసేవికగా, గాంధీజీ నిర్మాణాత్మక కార్యకలాపాలకు రూప మిచ్చిన శిల్పిగా, నిత్యము కవి-పండిత, గాయక కళాకారులతో గోష్ఠులు, సమావేశాలు జరిపిన విదుషిగా, తన సంపద అపహృతమయినా లెక్కచేయక ప్రజావుద్యమాలను నడిపిన ధీరగా, వీరవిహారంచేసి అలసిపోయి, విశ్రాంతి తీసుకుంటున్న వీరబెబ్బులిగా గుర్తించి, ఆంధ్రమహిళాసభ ఆమెను గౌర వించింది.

శ్రీ మరుపూరి కొండారెడ్డి, శ్రీమతి కామమ్మగార్ల ముద్దుబిడ్డగా 1892లో శ్రీమతి కనకమ్మ జన్మించారు. పోట్లపూడి ఆమె జన్మస్థలం. మేనమామ గారైన శ్రీ పొణకా సుబ్బరామిరెడ్డితో వివాహమయింది. వారికి ఒకే కుమార్తె. ఎటుచూసినా కొఱతలేని సిరిసంపదలు. అయినా స్వహస్తాలతో అతిథి అభ్యాగతులకు వడ్డించి తృప్తిపడటం ఆమెకు అలవాటు. ఏదోవిధంగా పదిమందికి సహాయపడటం పదిమందిని కూడగట్టుకోవటం ఆమెకు సహజ లక్షణం. ఆనాటి సంపన్న రెడ్డికుటుంబాలలో పాటించే ఘోషాపద్ధతి వారి యింటలేదు. పుటకతో వచ్చిన సంస్కారము, స్వయంకృషితో పెంపొందించు కున్న విద్య తప్ప యే డిగ్రీలు లేవు. ఏవేవో జనోపయోగకార్యాలు చేయాలి, విజ్ఞానవికాసాలు పెంపొందించాలి అనే ఆర్తి కొంతమందికి జన్మతః కలుగు తుంది. అట్లాగే మరికొంతమందికి దేశసేవ చేయాలన్న కోరిక వుంటుంది. ఆమెకు యీ రెండూ పుష్కలంగా వున్నవి. ఉండేది పల్లెటూరయినా 1913లో సుజనరంజనీ సమాజం స్థాపించి దానిద్వారా అనేక వుద్యమాలకు నాంది పలికారు.

అపుడప్పుడే ఆంధ్రోద్యమం తలెత్తింది. శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య గ్రంథాలయోద్యమం ఆరంభించారు. వెంటనే పోట్లపూడిలో

వివేకానంద పుస్తక భాండాగారం వెలిసింది. చుట్టుపక్కల గ్రామాలలో సైతం అనేక గ్రంథాలయాలు రూపొందినవి. ఆమె ప్రోత్సాహంతో అండ దండలతో ఆ పల్లెటూరే వుద్యమాలకు కేంద్రమై సభలు, సమావేశాలు నిరంతరంగా జరుగుతూ వుండేవి. జిల్లాలో ఆనాడు మరెక్కడాలేని సాహిత్య గోష్ఠులు, సమావేశాలుకూడ జరిగేవి. శ్రీయుతులు చిలకమర్తి లక్ష్మీనరసింహం, అయ్యదేవర కాళేశ్వరరావు, దంటు సుబ్బావధాని, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, ఉన్నవ లక్ష్మీనారాయణ, ఆచంట లక్ష్మీపతిగార్లు, శ్రీమతులు కాంచనపల్లి కనకమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, ఆచంట రుక్మిణమ్మగార్లు తరుచువచ్చి సభలలో సమావేశాలలో పాల్గొనేవారు.

శ్రీ బాలగంగాధరతిలక్ ఆనాటి రాజకీయనాయకుడు. స్వదేశీ వస్తువులనే వాడాలని ఆయన ఆదేశం. ఆనాడు ఖాదీ తెలియదు. అందువల్ల మిల్లుబట్టల బదులు మిల్లునూలుతో చేనేతమగ్గాలపైన తయారయిన బట్టలనే వాడాలని నిర్ణయించుకొని పొట్లపూడిలో స్వదేశీ నేతసంఘం అనే పేరుతో గొప్ప ఉత్పత్తి కేంద్రాన్ని స్థాపించారు. ఉత్తరోత్తర ఖాదీవుద్యమం వచ్చింది.

సుజనరంజనీ సమాజం సంఘసేవా కార్యకలాపాలను కూడ చేపట్టింది. ఊళ్ళోనేకాక పరిసరప్రాంతాలలో యెక్కడ కలరావంటి వ్యాధులు వ్యాపించినా వెళ్ళి మందులివ్వటం, రోగులకు వుపచారాలు చేయటం చేసేవారు. ఈ మహత్తర సేవకు జాతి, కులమతాలు అడ్డు వచ్చేవికావు. వ్యాధులు ఎక్కువగ వ్యాపించే హరిజన వాడలకు ఆమె, అనుయాయులు స్వయంగావెళ్ళి మందులిచ్చి పథ్యపానాదులు అందించి వుపచారాలు చేసి వచ్చేవారు. శ్రీ చతుర్వేదుల రాఘవయ్యగారు గొప్ప పండితుడు, విద్వాంసుడు. శ్రీ దామోదర సావర్కార్ మహాశయుడి స్వాతంత్రయుద్ధం (War of Independence) అనే పుస్తకాన్ని తెనిగించుతూ పొట్లపూడిలో శ్రీమతి కనకమ్మ అతిథులుగా వున్నారు. ఉప్పు, నిప్పు సైతం కడుక్కునేటంత మడి, ఆచారం, నిష్ఠ పాటించేవారాయన. చివర కొకసారి కలరావచ్చిన హరిజనుడి యింటికి ఆయన వెళ్ళి స్వయంగా మందుయిచ్చి వుపచారాలుచేసి, యింటికివచ్చి ప్రాయశ్చిత్తం చేసుకుని భోజనం చేశారుట అంతటి విజ్ఞులు. సుజనరంజనీ సమాజ సభ్యులు, పొట్లపూడిగ్రామ వాసులు. గాంధీమహాత్ముని అస్పృశ్యతా నివారణ పేరుకూడ తెలియని కాలంలో జరిగినవే యివన్నీ.

ఇంతలో హోంరూలు వుద్యమం వచ్చింది. దాని ప్రచారానికి పోట్ల పూడి గ్రామమే కావలసివచ్చింది. దేశ స్వాతంత్ర్య సిద్ధికోసం తపించుతున్న కనకమ్మగారు, ఆమె బృందం కొండఎక్కినట్లు సంతోషించారు. ఎక్కడ చూసినా హోంరూలు బేడ్జీలు కనిపించేవి. అన్ని విధాల క్షేత్రం సిద్ధమయివున్న సమయంలో గాంధీ మహాత్ముడు చల్లిన ప్రతిబీజం మూడు పూవులు ఆరుకాయలుగా విజృంభించింది. అహింసావ్రతం, మాంసాహార నిషేధం, చరఖావడకటం, విదేశీవస్తు, వస్త్రబహిష్కరణ అన్నీ ముమ్మరంగా సాగించారు. ఆమె, ఆమె కుటుంబసభ్యులు అతి సన్నగా నూలువడికి, ఖాదీ బట్టలు నేయించి, తాము ధరించటమేకాక గాంధీజీకి కానుకగా పంపేవారు.

వారియింట వివాహమహోత్సవాలు జరిగినవి. ఆ కుటుంబంలో స్త్రీ లందరు ధగధగలాడే బంగారు పూవులు, వెండిపూవుల చీరెలు ధరించారు. అక్కసుకొద్దీ కొంతమంది "సమయం వస్తే అంతాయింతే. ఖద్దరు అటకెక్కించి బెనారసు చీరలు కట్టారు చూడండి" అని వెటకారం చేశారు. పట్టలేక సమీపానికి వెళ్ళిచూశారు. ఖాదీమీద వెండి, బంగారు రంగులమైకా అద్దకం పూవుల చీరెలని వాళ్లకుఅర్థమై వింతగాచూశారు. బెల్గాంనుంచి ప్రత్యేకంగా యీ బట్టలు తెప్పించి అన్ని సమయాలకు అనువైన విలువైన ఆకర్షణీయమైన బట్టలు ఖాదీలో లభించగలవని చేతలతో ఆమె నిరూపించారు.

విజయదశమినాడు యిప్పటికీ చాలామంది శమీపూజ చేస్తారు. నగలతో కొత్తబట్టలతో ముస్తాబయి, శమీపత్రాలు యిచ్చి పుచ్చుకుంటూ శుభాకాంక్షలు పలుకుతూవుంటారు. అయితే పోట్లపూడిలో ఆమె ఆధ్వర్యాన జరిగిన శమీవ్రతాల అర్థంవేరు. విజయదశమినాడు శమీపూజ చేసి ఆమె, శ్రీయుతులు వెన్నెలకంటి రాఘవయ్య, పొణకా పట్టాభిరామిరెడ్డి, పట్నం సుబ్బారెడ్డి, రామానాయుడుగార్లు తదితరులు, భరతమాత నిరంతరసేవలోనే జీవితాలనుగడుపుతామని శపథం చేసేవారు. కంకణాలు ధరించేవారు రాయప్రోలు సుబ్బారావుగారు ఆ సందర్భాలలో వీరావేశం చిప్పిలుతు వ్రాసిన పద్యాలు గేయాలు యీనాటికీ మణిదీపాలు. దేశభక్తి ప్రబోధాలు సాహిత్యపరంగా కూడ అమూల్యమైనవి.

ఆమె తన నగలను అమ్మివేసి పల్లెపాడులో "పినాకినీ సత్యాగ్రహ ఆశ్రమం" నెలకొల్పారు. గాంధీ మహాత్ముడు ఆశ్రమ ప్రారంభోత్సవం

జరిపారు. 1920 నుంచి కాంగ్రెసుతో ఆమెకు సన్నిహిత సంబంధంవున్నది. ఆమె యెంతో పట్టుదలతో స్త్రీలలో కాంగ్రెసు అభిమానం ప్రజ్వలింప చేశారు. కాకినాడ స్త్రీవాలంటీరు దళానికి అధ్యక్షత వహించారు. స్త్రీలందరు విద్యావంతులు కావాలని, రాజకీయ చైతన్యం కలిగి దేశభక్తులు కావాలని ఆమె కోరిక. అందుకే నెల్లూరులో ఆమె కస్తూరిదేవి విద్యాలయం నెలకొల్పారు. 1923 లో దానికి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు ప్రారంభోత్సవం చేశారు. స్కూలు స్వంతభవనాలకు 1929 లో గాంధీమహాత్ముడు శంకుస్థాపన చేశారు. నెల్లూరులో చూడదగినది ఏదైనా ఉంటే అది కస్తూరిదేవి విద్యాలయమే సుమా, మీరందరు దీనికి సహకరించండి, అని ప్రజలను వుద్బోధించారు బాపు. ఆ విద్యాలయంలో జాతీయ విద్యలు, చేతిపనులు నేర్పేవారు.

1930 లో ఉప్పు సత్యాగ్రహోద్యమం కార్చిచ్చులాగా దేశమంతట వ్యాపించింది. స్త్రీలు పురుషులు శాసనోల్లంఘనం చేసి ఉప్పు సత్యాగ్రహంలో జైలుకు వెళ్లారు. ఆమెకు ఆరునెలలు జైలుశిక్ష పడింది. 1930 డిశంబరు 26న విడుదలయినారు. తిరిగి 1932లో సారాదుకాణాల దగ్గర పికెటింగు చేసిన కారణంగా 1932 మే 26న ఒకటిన్నర సంవత్సరం జైలుశిక్ష పడింది. ఈ రెండు జైలుశిక్షలు అనుభవించి బయటికి వచ్చేటప్పటికి ఆమె ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. ప్రాణాపాయ స్థితి వచ్చింది. అయినా ఆమె జైలులో వున్నప్పుడు హిందీ నేర్చుకున్నారు. కొన్ని అనువాదాలు చేశారు. అప్పటివరకు ఎట్లాగో నెట్టుకు వస్తున్న కస్తూరిదేవి విద్యాలయం ఆర్థికలోపంవల్ల నిలిచిపోయే దుస్థితి వచ్చింది. లక్షలు వెచ్చించి ప్రజాకార్యాలు కొనసాగించుతున్న ఆమె మోజు పడి స్థాపించిన విద్యాలయం డబ్బు లేక మూయవలసి వచ్చిందంటే దానికి కారణం జమీన్ రైతువుద్యమం. సంస్థానాధీశులు, జమీందార్లు మొఖాసాదార్లు రైతులను రకరకాలుగా బాధలకు గురి చేసేవారు. ఈ దురాగతాలను ఎదుర్కొనటానికే రైతులు విప్లవం బయలుదేర తీశారు. ఆమె ప్రమేయం ఆ విప్లవంలో చాలానేవున్నది. రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవలేదుకదా. దెబ్బలు పడినా ఫరవాలేదు. డబ్బులు కూడా దోచుకుంటారు. అదే జరిగింది. వందల వందల యెకరాల ఆస్తిని కబళించివేశారు. ఆమె కుటుంబం కట్టుబట్టలతో బయటపడ్డారు. ఆనాటి జమీన్ రైతు వుద్యమ తీవ్రకృషి ఫలితంగా 1946-47లో జమీందారీ రద్దు

బిల్లు ఆమోదించింది మద్రాసు ప్రభుత్వం. తమ ఆస్తియావత్తూ మాయమై పోయినా, తమకృషి ఫలితంగా వేలకొద్ది అమాయిక పేదరైతులు బాగుపడ్డారని ఆమె యెంతగానో సంతోషించారు. ఈ త్యాగశీలికీర్తి దేశమంతట మరింతగా వ్యాపించింది.

ఆస్తిపోయింది. జైలుశిక్షలతో ఆరోగ్యం క్షీణించింది. చివరకు భగవంతుడు యింకా పరీక్షించుతున్నట్లుగా యేకైక సంతానమైన కుమార్తె మరణించింది. అంతటి దుఃఖంలోను ఆ పిచ్చితల్లి తనబిడ్డ జైలుకు వెళ్తానంటే వద్దని ఆపినందుకు విపరీతంగా బాధపడింది. మనసుకు శరీరానికి రవంత కూడ త్రాణలేక, ఉపశమనార్థం శ్రీరమణ మహర్షిసాన్నిధ్యంలో కొంతకాలం గడపి వచ్చారు. మరికొన్ని రోజులు అన్నారెడ్డిపాలెంలోని శ్రీరామయోగి ఆశ్రమంలో ఆధ్యాత్మిక చింతనతో గడిపారు. మానవసేవతోటే మాధవసేవ చేయవచ్చునని జ్ఞానులైనవారు యిట్టే గ్రహిస్తారు. అందువల్ల ఆమె అక్కడ గ్రంథాలయాలు స్థాపించి, యోగీశ్వరుని వర్ధంతులు జరిపి ప్రజాబాహుళ్యానికి విద్యావికాసాలు, జిజ్ఞాసరేకెత్తించారు.

ఈమె హిందీ బాగా చదువుకున్నారు. ఇంగ్లీషు మాట్లాడగలరు. తెలుగులో గొప్ప రచయిత్రి. గృహలక్ష్మి, హిందూసుందరి వంటి అనేక పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూవుండేవారు. శ్రీరమణ మహర్షిపై భక్తితో "శ్రీరమణబ్రహ్మాంజలి" వ్రాశారు. అనేక అనువాద గ్రంథాలు వ్రాశారు. "శ్రీరామయోగి," "గురుదేవుడు" అనే రెండు జీవిత చరిత్రలు వ్రాశారు. శ్రీరమణ మహర్షి ఆశ్రమంలో శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మిబాయమ్మని కలుసుకున్నారు. ఆమె కూడ కవయిత్రి,విదుషి. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. కడుపుశోకంతో ఆశ్రమానికి వచ్చారు. ఇన్ని కారణాలతో వారిది పీడని జంటగా తయారయింది. ఇద్దరు కలిసి "రమణగీత,ఆరాధన, జ్ఞాననేత్రము, నైవేద్యము" అనే పద్యకావ్యాలు వ్రాశారు. ఇద్దరు కలసి భగద్గీతను సుబోధకంగ, సుమధురంగా తేటగీతాలలోకి తెనిగించారు. వీరికి ముందు స్త్రీలెవరు భగవద్గీత జోలికి పోలేదు. వీరిద్దరు జంట కవయిత్రులని పేరుపొందారు.

శ్రీ తిక్కవరపు రామిరెడ్డి ఆర్థిక సహాయంతో కస్తూరిదేవి విద్యాలయం 1944 లో హైస్కూలుగా రూపొందింది. అగ్రశ్రేణికి చెందిన బాలికల

హైస్కూలుగా పనిచేస్తూ ప్రస్తుతం జూనియర్ కాలేజీగా అభివృద్ధి పొందింది. సేవాతత్పరులకు చేసిన కొద్ది యింకా యేదో చేయలేకపోతున్నామనే బాధ, యింకా యింకా ప్రజోపయోగ కార్యకలాపాలు కొనసాగించాలన్న ఆరాటం సహజం. స్త్రీలకు చేతిపనులను, కుటీరపరిశ్రమలను నేర్పి ఆర్జన పరులుగా చేయాలన్న కోరిక కలిగింది. ఎంతో శ్రమపడిన మీదట చరమదశలో భగవంతుడు ఆమెను కరుణించాడు. కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయం స్థాపించబడింది. నేత, అద్దకం, ఎంబ్రాయిడరీ కుట్టు మొదలయిన చేతిపనులు నేర్పబడుతున్నవి. చేతిపనుల టీచర్లుగా శిక్షణ, తర్ఫీదు అవకాశాలు కూడ వున్నవి.

ఆంధ్రమహిళాసభ వ్యవస్థాపకులు, స్త్రీవిద్యా వ్యాపకులు, పటుతర సంఘ సేవకులు అయిన శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్, డాక్టరు దేశముఖ్‌గార్లు పారిశ్రామిక విద్యాలయాన్ని చూడటానికి వెళ్లారు. అప్పుడు కనకమ్మగారి ఆరోగ్యం బొత్తిగా బాగాలేదు. అయినా అమె కూతురు, అల్లుడు తనయింటికి వచ్చినంతగా పొంగిపోయినారు. పెద్దవిందు ఏర్పాటు చేశారు. దేశముఖ్ దంపతులకు బట్టలు పెట్టి ఆనందించారు.

నిజమైన ఆర్తితో, మనసులో వుత్పన్నమయే తీవ్రకాంక్షతో సేవచేసే వారికి ఈసులు, అసూయలు వుండవు. కీర్తికాంక్షవుండదు. సేవచేయటమే వారిలక్ష్యం. అదేవారి తపస్సు. ఆ సాధనలో గురు, శిష్య, పెద్ద, చిన్న తారతమ్యాలు వారికి వుండవు. అందుకే ఆమెకు శ్రీమతులు ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్, మనపాకం కమలమ్మగార్ల వంటివారు ఆత్మబంధువులు.

ఆమె వీరవనిత, విప్లవకారిణి. బూజుపట్టిన పాత భావాలను, ఆచారాలను తోసిపుచ్చి అభ్యుదయకరమైతే కొత్తరీతులను యిట్టే ఆమోదించి స్వీకరించగల సంస్కర్త. అనేక రచనలు చేసిన రచయిత్రి. ఇతరుల సేవలో సమస్తం వదిలి వేసిన మహాత్యాగశీలి. నిజానికి స్వార్థం చూసుకుంటు, ఆమె సౌఖ్యసంతోషాలామె అనుభవించుతువుంటే ఆమెకు యేయిబ్బందులు వుండేవికావు. కోరికష్టాలుతెచ్చుకున్నందు వల్లనే కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయ ప్రారంభోత్సవ సందర్భంలో ఆమెకు "కష్టశ్రీ" అనిగాని "శ్రమశ్రీ"అనిగాని బిరుదు ఎందుకు

యివ్వకూడదని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి చమత్కరించారు. ఇతరుల బాధలు కష్టాలు పోగొట్టటానికి తాను సంతోషంగా ''కష్టశ్రీ'' ''శ్రమశ్రీ'' కాగలిగినందువల్లనే ఆమె మూర్తీభవించిన ఒక మహాసంస్థగా కీర్తి తెచ్చుకున్నారు. 72 సంవత్సరాల నిండు జీవితం గడిపి ఆమె 1963 సెప్టెంబరు 15న ప్రశాంతంగ కన్నుమూశారు.

---

# శ్రీమతి సరోజినీ నాయుడు

**జననం 13-2-1879** **మరణం 2-3-1949**

"నేను ఆంధ్రమహిళను. నాది ఆంధ్రదేశం. ఆంధ్రమహిళలను మహాత్మా గాంధీ రాట్నంరాణీగా పేర్కొన్నారు. అది వారి ప్రత్యేక వారసత్వమైన అచంచల స్వభావం, మర్యాద లక్షణాలకు తగి వున్నది. అందువల్ల యీ రాణులకు తగిన లక్షణాలు వారి భర్తలకు అబ్బినవి. ఆంధ్ర రాజ్యాన్ని పరిపాలించిన చివరి రాజుల సాంప్రదాయాన్ని నాయకులు, వాలంటీర్లు కూడ కాపాడినందుకు శ్రీకృష్ణదేవరాయల ఆదరణ, సత్కారాలను మిగిలిన భారతదేశానికి ఎరుకపరచినందుకు నేను యీనాడు గర్విస్తున్నాను. ఆంధ్రులు హృదయ పరిపాకమున శ్రేష్ఠులు" అని 1923 లో కాకినాడ కాంగ్రెసు సందర్భాన శ్రీమతి సరోజినీ నాయుడు అన్నారు.



శ్రీమతి సరోజినీ నాయుడు

ఆమె 13-2-1879 న హైదరాబాదులో జన్మించారు. ఆ వూళ్లో వున్న లిటిల్ గరల్స్ స్కూలులో చదువుకున్నారు. ఆ స్కూలే యీనాడు ఉస్మానియా స్త్రీల కళాశాలగా అభివృద్ధి చెందింది. పదమూడవ యేటనే మెట్రిక్యులేషను వున్నత శ్రేణిలో నెగ్గారు. 11వ ఏటనుంచే ఆమె ఇంగ్లీషులో కవితలు అల్లటం చూసిన నిజాముప్రభువు సంవత్సరానికి నాలుగువేల రూపాయల విద్యార్థివేతనం యిచ్చి వున్నత విద్యలకు ఆమెను ఇంగ్లండు పంపించారు. లండన్‌లో కింగ్సు కాలేజిలోను, కేంబ్రిడ్జిలోని గిర్టన్ కాలేజిలోను చదివారు. భారత దేశవాతావరణం సృష్టించి అనేక వుత్తమ కవితలే ముఖ్యంగా వ్రాశారు.

స్విట్జర్లండు వెళ్లి ఆ రమణీయ ప్రకృతి మధ్య మరికొన్ని కవితలు వ్రాశారు. ఇంగ్లండులో వున్న కవులు, పండితులు, విమర్శకులు ఆమె ఇంగ్లీషు కవితా పాటవానికి ఆశ్చర్యపోయినారు. స్వదేశం తిరిగి వచ్చారు. హైదరాబాదులో ఛీఫ్‌మెడికల్ ఆఫీసరుగా వున్న శ్రీ ముత్యాల గోవిందరాజులు నాయుడుని ప్రేమించారు. ఉస్మానియా యూనివర్సిటీలో ఫిజిక్సు ప్రొఫెసరుగా వుంటున్న ఆమె తండ్రి శ్రీ అఘోరనాథ్ చటోపాధ్యాయ-తల్లి శ్రీమతి వరదసుందరీదేవి, వంగదేశీయులు. బ్రాహ్మధర్మమవలంబించిన బ్రాహ్మణులు. వారు తమకూతురు నిర్ణయాన్ని ఆంధ్ర సంస్కరణోద్యమ పితామహులయిన శ్రీ కందుకూరి వీరేశ లింగం పంతులుగారితో సంప్రదించారు. ఆయన అంగీకరించడమే కాక మద్రాసు బ్రాహ్మమందిరంలో తనచేతుల మీదుగా శ్రీ గోవిందరాజుల నాయుడుతో శ్రీమతి సరోజినీదేవి వివాహం జరిపి ఆంధ్రులకోడలుగా గృహ ప్రవేశం చేయించారు. అంతటితో ఆమె పరిపూర్ణ ఆంధ్రమహిళ కావటమేకాక లక్షల సభికుల మధ్య నేను ఆంధ్రమహిళను, నాది ఆంధ్రదేశం అని సగర్వంగా చాటుకున్నారు.

నిజానికి ఆమె పుట్టిపెరిగి, గృహిణిగాస్థిరపడిన హైదరాబాదు ప్రాంతంలో ఆనాడు జాతీయోద్యమం తలయెత్తే ఆస్కారమేలేదు. కాని ఆ దంపతులు నిజాము ప్రభువుకు ప్రీతి పాత్రులు. అందువల్ల ఆమె పైరాష్ట్రాలలో జాతీ యోద్యమంలో పాల్గొన్నా అంతరాయం యేర్పడలేదు. ఆమెకు చిన్నతనం నుంచి కాంగ్రెసు సంస్థతో సంబంధం వున్నది. 1905 ప్రాంతాలలోనే కాంగ్రెసు సమావేశంలో ఆమె యిచ్చిన మహోపన్యాసం అందరిని ఆకర్షించి, ఆమె కవయిత్రి మాత్రమే కాదు, అంతను మించిన మహాశక్తి అని రూఢి చేసుకున్నారు. ఆమె యింగ్లీషు, హిందీ, ఉర్దూ, బెంగాలీలలో అనర్గళంగా, కవితాగానం లాగ వుపన్యసించుతు దేశభక్తిని ప్రేరేపించేవారు.

ఆనాటి రాజకీయ గురువులైన శ్రీ గోఖలే 1911 లో దేశంకోసం నీవు యేమి చేయాలనుకుంటున్నావని ఆమెను అడిగారు. ఆమె తడుముకోకుండా ఐదు సంవత్సరాలలో హిందూ ముస్లిం సఖ్యతను దేశంలో సాధించుతానన్నారు. ఆమె పుట్టిపెరిగి స్థిరపడిన హైదరాబాదు ముస్లిం రాజ్యం. ఆమెకు హిందువులు, ముస్లింలు, పారసీవారు ఆత్మ స్నేహితులు వుండేవారు. వస్తుతః ఆమె శాంతిప్రియ. మానవులంతా సోదరభావం కలిగివుండాలని, ప్రశాంతంగ జీవించాలనే వుద్దేశం

తప్ప యేనాడు రాజకీయరంగులు పులమాలని చూడలేదు. అందువల్లనే 1921 లో ప్రజ్వరిల్లిన హిందూ ముస్లిం మతకలహాల సమయంలో నిర్భయంగా వాళ్లమధ్య తిరుగుతు శాంతి సుహృద్భావాలను ప్రబోధించారు. 1922 లో గాంధీజీ జైలుకువెళ్తు దేశఐక్యత నీకు అప్పగించుతున్నానని ఆమెతో అనటంలో పరమార్థంయిదే. 1925 లో కాన్పూరు కాంగ్రెసు అధ్యక్షురాలుగా ఎన్నికయినారు. అప్పుడామె "నేను స్త్రీని. నా కార్యక్రమం గృహ కృత్యాలకు సంబంధించే వుంటుంది. అన్ని మతాలవారు, అన్ని వర్గాలవారు, అన్న తమ్ములుగా వుండేటట్లు చూస్తాను. భారత గృహాంగణంలో పిల్లలను, అతిథులను, పరదేశీయులను కాపాడటమే నా కర్తవ్యం" అన్నారు.

కాంగ్రెసు కార్యవర్గంలో ఆమె 25 సంవత్సరాలు వున్నారు. అక్కడ అనేకసార్లు అభిప్రాయభేదాలు తలయెత్తినవి. కాని ఆమె యే ఒకరిని తూలనాడక, విమర్శించక ఐకమత్యం కాపాడుతూ వచ్చారు. ఆమెకేదో సమ్మోహన శక్తి వున్నదని గాంధీజీ అంటూవుండేవారు. ఎటువంటి పరిస్థితులలోగాని తన పేరుప్రతిష్ఠలకు, తన వ్యక్తిగత లాభాలకు తావులేదు. ఆమె చిన్ననాడు వ్రాసిన ఇంగ్లీషు కవితల కారణంగా 1914 నాటికే రాయల్‌సొసైటీ ఆఫ్ ది లిటరేచరు సభ్యురాలుగా ఎన్నికైనారు. కవయిత్రిగా ఇంగ్లండులో ఆమెకు గొప్ప గుర్తింపు వున్నది. కానిదానిని పెంపొందించుకోవటానికిగాని, మరిన్ని పొగడ్తలు పొందటానికిగాని ప్రయత్నించకపోగా అడుగడుగునా బ్రిటిష్‌వారి దమన నీతిని వారితోనే వాదించి, వివరించి, ఎదిరించి, కీర్తి రెట్టింపు చేసుకున్నారు. ఆమెకు యే సెక్రటరీలు అవసరంలేదు. వంటరిగా విదేశయాత్రలన్నీ సలక్షణంగా చేసేవారు. గాంధీజీకి ఆమె సామర్థ్యంపైన అమితనమ్మకం. అందువల్ల విదేశ వ్యవహారాలను చక్కపెట్టటానికి ఆమెను పంపేవారు. 1920 లో ఆమె ఇంగ్లండులో వున్నప్పుడు బ్రిటిష్‌వారు పంజాబులో చేసిన దురాగతాలను బహిరంగంగ, తీవ్రంగానే ఖండించారు. మాంటేగు దానిని ఖండించబోగా, కాంగ్రెసువారు విపులంగ ప్రచురించిన రిపోర్టుచదివి ఆయన నోరెత్తకుండచేశారు.

ఒకసారి ఆల్బర్టు హాల్లో జలియన్‌వాలాబాగ్ దురంతాలను, స్త్రీలకు జరిగిన అవమానాలను గురించి చెపుతువున్నప్పుడు కొంతమంది రౌడీలు కావాలని అల్లరిచేయ నారంభించారు. ఆమె భద్రకాళిలాగ నోరుమూయండి అనిపెట్టిన కేక ప్రతివాళ్లను ఆశ్చర్యపరచింది.

1928 సెప్టెంబరులో ఆమె అమెరికా వెళ్లారు. ఒకనాడు ఒకచర్చిలో వుపన్యసించుతువున్నారు. ఇసుక వేస్తేరాలనంత జనం ఆమె వాక్ప్రవాహానికి చకితులై వింటున్నారు. ఆమె యేకరువు పెట్టిన సమస్యలకు వారిలో యెవరు గాని జవాబులు యివ్వలేక పోయినారు. అప్పుడొక గొప్ప వ్యాపారవేత్త "యిటువంటిశక్తి నేను యే స్త్రీలోను చూడలేదు. నిజం చెప్పాలంటే యే పురుషులు ఆమెకు సరితూగ లేర"ని శ్లాఘించాడు. స్వేచ్ఛా భావాలపట్ల, దేశస్వాతంత్ర్యం పైన గౌరవంగల అమెరికనులు సరోజినీదేవి అంతర్యంలోగల న్యాయతత్పరతను, స్వాతంత్ర్యగౌరవాన్ని వెలికి తీసుకువచ్చారని మెచ్చారు. ఆమె యీ సందర్భంలో యిచ్చిన 200 వుపన్యాసాలలోను ఒక్కసారి కూడ మిస్ మేయోపేరు ఎత్తలేదు. ఐనా అమెరికనులు ఆమె చక్కని వుపన్యాసాల ద్వారా మిస్‌మేయో చేసిన అసంబద్ధప్రచారాలను తెలుసుకుని సరిదిద్దుకోగలిగారు.

గాంధీజీ ప్రతి వుద్యమాన్ని త్రికరణశుద్ధిగానమ్మి ఆమె వాటిలోపాల్గొనే వారు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో దండియాత్ర చేసినవారిలో ఆమె ముఖ్యులు. గాంధీజీని అరెస్టు చేసిన తరువాత ఆమె దర్శన వుప్పు కొఠార్లపై జరిగిన దాడికి నాయకత్వం వహించారు. పోలీసులు ఆమెకు అన్నం, నీళ్లు అందకుండ చుట్టు ముట్టి వుండేవారు. ఆమె నవ్వుతు ప్రళయం వచ్చేవరకు నేను యిక్కడ యిట్లాగే వుంటాను, మరి మీరు వుండగలరా అని ప్రశ్నించారు. ఏ జవాబు యివ్వలేక పోలీసులు చివరకామెను 1930 మే 16న అరెస్టుచేశారు. 1932 ఏప్రిల్ 23న శాసనోల్లంఘనం సందర్భంలో ఆమెను బొంబాయిలో అరెస్టు చేసి ఒక సంవత్సరం జైలులో వుంచారు. తిరిగి క్విట్టిండియా వుద్యమ సందర్భంలో గాంధీజీ, మీరాబేన్, మహదేవ దేశాయి గార్లతో పాటు అరెస్టుచేసి పూనాలోని ఆగాఖాన్ మందిరంలో బంధించారు. 1931లో జైలునుండి విడుదల చేసి రౌండుటేబులు కాన్ఫరెన్సుకు భారత మహిళా ప్రతినిధిగా ప్రభుత్వమే ఆమెను ఇంగ్లండు పంపించారు.

ఆమె అధ్యక్షత వహించిన సభలు, సమావేశాలకు లెక్కలేదు. 1920లో అంతర్జాతీయ మహిళా సభకు భారత ప్రతినిధిగా జినీవా వెళ్లారు. తన వైదుష్యంతో, జంకుగొంకులు లేని స్వభావంతో, సర్వసమతతో, ఋజువర్తనతో భారతస్త్రీలు యింతటివారు అనే సద్భావాన్ని మిగతా దేశస్తులకు కలిగించారు. 1947 మార్చి 23 నుంచి ఏప్రిల్ 2 వరకు ఢిల్లీ ఎర్రకోటలో జరిగిన ఆసియా

ఖండ సమైక్య సభ ఆమె అధ్యక్షతన బ్రహ్మాండంగ జరిగినై. ఆమె అఖిల భారత మహిళాసభల కధ్యక్షత వహించారు. రౌండుటేబులు సభలకు హాజరయినారు. ఎక్కడికి వెళ్లినా ఆమె శాంతిదూత.

1917 దక్షిణాఫ్రికాలో బానిసలకన్న హీనంగ, నికృష్టంగ జీవితం గడుపుతున్న ప్రవాస భారతీయుల వుద్ధారణ కోసం, నిర్బంధ కూలి చట్టానికి వ్యతిరేకంగా పనిచేశారు. 1923 కాకినాడ కాంగ్రెసు సందర్భంలో ఆమె విదేశాలలో ఉన్న భారతీయుల రక్షణశాఖకు అధ్యక్షురాలుగా యెన్నికయి కెన్యా వెళ్లారు. బ్రిటిష్ప్రభుత్వ దమన నీతిని నిరూపించుతు కెన్యా భారతీయులచేత సహాయ నిరాకరణోద్యమం నడిపించారు. భారతదేశం సామ్రాజ్యాంతర్గతంగా వుండేది లేనిది ఆఫ్రికా భవితవ్యంపై ఆధారపడి వుంటుందని అధికారులతో నిస్సంకోచంగ అన్నారు. 1924 లో కెన్యానుంచి తిరిగి వచ్చి బెల్గాం కాంగ్రెసు సమావేశానికి హాజరయినారు. ఆ సమావేశానికి ఆఫ్రికా నుంచి వచ్చిన కెన్యా ప్రతినిధులు "మేము గాంధీ మహాత్ముడిని మీ భారతదేశానికి యిచ్చివేశాము. మీరు శ్రీమతి సరోజినీదేవిని మా దేశానికి పంపించండి" అని కోరుకున్నారు. గాంధీజీ తర్వాత ఆమెలో వారికంత విశ్వాసం, నమ్మకం కలిగినవి. 1929లో ఆమె తూర్పు ఆఫ్రికాకుపోయి అక్కడి భారతీయుల రక్షణకోసం కృషిచేశారు. గాంధీజీ తర్వాత ఆమెలాగ ప్రవాసభారతీయుల కోసం కష్టించిన వాళ్లులేరు.

స్త్రీలు ప్రత్యేక రక్షణలు కోరకూడదు, అది అశక్తతకు సూచన అని ఆమె వాదించేవారు. దేశస్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు పాల్గొంటే హక్కులు సహజంగానే వచ్చితీరగలవని ఆమె నమ్మకం. సంఘంలో సగభాగమైన స్త్రీలకు వోటింగు హక్కుకోసం ఆమె అలజడి లేవతీశారు. ఆ ప్రయత్నంలో ఇంగ్లండు కూడ వెళ్లివచ్చారు.

1945 జనవరి 17 న మద్రాసు ఆంధ్ర మహిళాసభలో వుపన్యసించుతు "మహమ్మదు ప్రవక్తకు ముందుచేయూత నిచ్చిన వ్యక్తి ఆయనభార్య ఫాతిమా. ఆమె తోడ్పాటు కారణంగా యీనాడు ఆయన మతం ప్రపంచంలో సగభాగం అవలంబించుతున్నారు. స్త్రీశక్తి అంతటిది"ని వుద్బోధించారు.

స్వతంత్ర భారతంలో ఉత్తరప్రదేశ్ గవర్నర్గా కేవలం ఆమె సామర్థ్యాన్ని నిరూపించటానికే పదవి స్వీకరించారు. మనలో మనకు మర్యాదలు

అనవసరం, నేను మీకు తల్లి, సోదరిలాంటి దానిని అని గౌరవవాచకమైన "హర్ ఎక్సలెన్సీ" వాడనివ్వలేదు. ఏవిధమైన ఆడంబరం లేకుండ అందరితో కలసిమెలసి వుండేవారు. వేడుకలకు, పేరంటాలకు సైతం వెళ్లివచ్చేవారు. స్వయంగా గృహనిర్వహణ భారం వహించేవారు.

ఆమె పెద్ద కుమార్తె కుమారి పద్మజానాయుడు బెంగాలు గవర్నరు పదవి నలంకరించారు. రెండవ కుమార్తె కుమారి లీలామణి కాలేజీ ప్రొఫెసరు గాను, విదేశాంగ కార్యాలయంలోను వుండేవారు. పెద్దకుమారుడు మేజరు జయసూర్య గొప్పడాక్టరు. హోమియో స్పెషలిస్టు, పార్లమెంటుసభ్యుడు. రెండవ కుమారుడు శ్రీరణధీర ఉర్దూ, ఇంగ్లీషులలో కవితలల్ల నేర్చినవాడు. తల్లివెంట జాతీయోద్యమంలోపాల్గొన్న దేశభక్తుడు. 1945 లోనే అస్తమించాడు. ఇక శ్రీ గోవిందరాజులు నాయుడు గొప్పవేదాంతి. దయాదాక్షిణ్యాలుగల సుప్రసిద్ధ వైద్యులు. నిత్యఖాదీధారి. ఆయన యిల్లుకదలరు, ఆమె యింట్లో వుండరు. అయినా వారిది పరస్పర అనురాగ ఆదరగౌరవాలుగల దాంపత్యం. ఒకసారి చూసినవారిని ఆమె మరచిపోక ఆప్యాయత కనపరచేవారు. నిరాడంబరజీవి; సర్వప్రియ. ఆంధ్రమహిళ మాత్రమేకాదు, ఆమె భారత మహిళలకే ప్రతినిధి. 1949 మార్చి 2వ తేదీన గవర్నరు హోదాలో పెద్ద ముత్తయిదువుగా తేజోమండలం చేరుకున్నారు.

# శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి

జననం 1891 మరణం 1951

రాయవేలూరుజైలు 1930 లో పెళ్లిపందిరిలాగ కిక్కిరిసి వుండేది. దాని జీవితంలో యేనాడు అంతమంది స్త్రీ ఖైదీలను చూసి వుండదు. మాలింతలు, బాలింతలు, చిన్నపిల్లలు, వృద్ధులు, విద్యావంతులు, అఆలు రాని వారు, పేదలు, ధనికులు, అన్నిరకాల వారితోను అదొక వింత ప్రపంచంగా కనిపించేది. ప్రతి రోజు "ఏ" క్లాసు నుంచి ఒకామె భుజాన మజ్జిగకుండ పెట్టు కుని "సి" క్లాసువైపు వెళ్లేది. ఆమె నడ కలో హుందాతనం, ముఖాన సంపన్న గృహిణి నిండుతనం, విద్యావంతురాలి సంస్కారం వుట్టిపడుతు వుండేవి. ఆమె శ్రీమతి ఆచంట రుక్మిణీదేవి. అసలు మామూలు పరిస్థితులలోనే "సి" క్లాసు చిన్న నరకం. తగినట్లు గంట



శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి

గంటకు వచ్చిపడే ఖైదీలు. దాంతో లెక్కప్రకారం ముట్టవలసిన భోజనాదులు కూడ "సి" క్లాసు ఖైదీలకు అందేవికావు. ఆమె సున్నిత హృదయం వారి అగచాట్లుచూసి తట్టుకోలేక పోయేది. అందువల్ల ప్రతిరోజు కొంత మజ్జిగ మిగిల్చి స్వయంగా వారికి అందచేసేది. రూల్సుప్రకారం ఆమె "సి" క్లాసుకు వెళ్లి వాళ్లను కలవకూడదు. మొదట అధికారులు వొప్పుకొనక ఆటంకపర చారు. కాని ఆమె సౌజన్యమూర్తి, ఆమెపట్ల ఖైదీలకేకాక అధికారులకు చాలా గౌరవం. పరిపూర్ణ విశ్వాసం. అందువల్ల ఆమెకు అనుమతి యిచ్చారు.

జైలులో బొట్టు పెట్టుకోనిచ్చేవారు కాదు. అంచుగల చీరలు కట్టుకో కూడదు. గాజులు (పెంకువి) వేసుకోకూడదు. ఇంతని మించిన అవాచ్యం స్త్రీలకు యేముంటుంది? ఏ చెడుపనో పాపపుపనో చేసి పట్టుబడిన స్త్రీలు కాదు వీళ్లు. అన్నీ వుండి, కావాలని దేశంకోసం యిష్టపూర్వకంగా జైలుశిక్షను ఆహ్వానించి వచ్చినవాళ్లు. సంఖ్యాబలం విపరీతం. దాంతో స్త్రీలందరు యెదురుతిరిగారు. నిరశనవ్రతం చేశారు. అల్లరిపెట్టారు. చివరకు అంచు చీరలు, బొట్టు అనుమతించారు. కాని గాజులుమాత్రం వీల్లేదంటే వీల్లేదన్నారు. మాకూ వీల్లేదన్నారు స్త్రీలు. ఏ వుపాయంతోచక జైలు అధికారులు శ్రీమతి రుక్మిణీదేవితో మొరపెట్టుకున్నారు. ఆమె శాంతంగా తోటి స్త్రీలను పిలిచారు. “మనం గాంధీజీ శిష్యులం శాంతిప్రియులమైన సత్యాగ్రహులం. జైలు అధికారులు వాళ్ల విధాయకం నిర్వహించటంలో మనం అడ్డు రాకూడదు. పెంకుగాజుముక్కలతో స్త్రీలు యే అఘాయిత్యమైనా చేసుకోగలరని వీళ్ల భయమేమో! వద్దంటున్నారు. మనం యీ సమస్యను శాంతియుతంగానే పరిష్కరించుకుందాం” అన్నారు. వెంటనే అన్ని సైజులలోను రబ్బరుగాజులు వచ్చినవి. అందరిచేతులు కళకళలాడినవి. సమస్య తీరిపోయింది.

ఆమె కడు సుకుమారి. జైలులో దినబత్యాలు పట్టించుకు రావటానికి స్టోరుకు వెళ్లేటప్పుడుకూడ చిన్న గొడుగు వేసుకుని మరీ వెళ్లేవారు. తెలిసో తెలియకో స్టోరువాళ్లు చాలా అన్యాయాలు, అక్రమాలు చేసేవాళ్లు. అవన్నీ ప్రశాంతంగ వాళ్లకు తెలియచెప్పి, వివరించి, నవ్వంగా పనిసాధించుకుని వచ్చేవారు. న్యాయప్రకారం, లెక్కప్రకారం మన వస్తువులు మనం తెచ్చు కోవటానికి వీళ్లను దేబిరించటం, నచ్చచెప్పటం ఎందుకు, మనం వాళ్లతో సుతి మెత్తగా మాట్లాడవలసిన అగత్యం యేమిటని ఆమె మిత్రులు శ్రీమతి దుర్గా బాయమ్మగారు సందుదొరికితే వాళ్లను దులిపివేసేవారు. స్వభావాలలో వేరైనా వారిద్దరు జైలులోను బయట చాలా మంచి స్నేహితులు.

ఆమెది చాలా వుదారస్వభావం. జైలులో వుండగా మద్రాసునుండి ఆమె భర్త వారం వారం చెక్కపెట్టెలలో తిండిపదార్థాలు ప్రత్యేక అనుమతితో పంపేవారు. తన వార్డులో అందరికి తలా కొంచెం పంచి యింకా మిగిలినవి ఆమె తన గదిలోకి తీసుకువెళ్లేవారు. ఆ చెక్కలన్నీ వుపయోగించి తీరు బాటుగా పిండివంటలు వండుకునేవారు జైల్లో. ఆమె వీణ వాయించుతున్నా,

పాడుతున్నా తీయగా మెత్తగా వుండి తోటిస్త్రీలు ఆస్తగా ఆలకించేవారు. ప్రతినిత్యం టైము ప్రకారం ఇంగ్లీషు పాఠాలు తోటి రాజకీయ బందీలకు చెప్పేవారు. మొదటిసారి 1930 లో వేదారణ్యంలో వుప్పు తయారుచేసి, శ్రీ రాజగోపాలాచారి అరెస్టు తరువాత స్వయంగా శిబిరం నడిపి 1930 మే 14న అరెస్టు అయినారు. రాయవేలూరులో శ్రీమతులు భారతీదేవిరంగా, వేదాంతం కమలాదేవి, దుర్గాబాయి, జానకీబాయమ్మగార్లతో ఒక సంవత్సరం శిక్ష అనుభవించారు. శాసనోల్లంఘనం జరిపి అరెస్టయి 1932 ఆగష్టు 26 న విడుదలయినారు. 1940 వ్యష్టిసత్యాగ్రహం చేసి శ్రీమతులు అమ్మన్నరాజా, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగార్లతో ఆరునెలలు జైలుజీవితం రాయవేలూరు లోనే గడిపారు. తిరిగి 1942 లో క్విట్టిండియా వుద్యమంలో పాల్గొని రాయవేలూరులోనే జైలుశిక్షను అనుభవించారు. ఆమె వివిధ కాలాలలో వివిధ వుద్యమాలలో పాల్గొని జైలుకు వెళ్లినా అక్కడ ఆమె ఒక్కతీరుగానే ప్రవర్తించారు. ఒక్కతీరు సద్భావాన్నే కలిగించారు.

జైలుకు వెళ్లటం 1930 లో మొదటిసారి అయినా ఆమె 1914 ప్రాంతాలకే రాజకీయాలలో ప్రవేశించారు. సాంఘిక, సారస్వత సమావేశాలు గోష్ఠులు అంటూ పోట్లపూడిలో శ్రీమతి పొణకా కనకమ్మ యింట యీమె భర్త శ్రీ లక్ష్మీపతిగారు, యింకా శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు, ఉన్నవదంపతులు, రాయప్రోలు సుబ్బారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం గార్లు, శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు అంతా సమావేశమై రకరకాల సమస్యలు, రాజకీయాలు, ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకతతో సహా చర్చించు కుంటూ వుండేవారు. 1919 లో ప్రథమ సత్యాగ్రహం సందర్భంలో అరెస్టయి మద్రాసువచ్చిన ఆంధ్ర నాయకులందరికి ప్రభుత్వ ప్రత్యేక అనుమతితో యీమె తమ యింట ఆతిథ్యం యిచ్చేవారు. అస్పృశ్యతా నివారణ చిహ్నంగా తమ యింట హరిజన యువతిని వంటకు నియమించు కున్నారు. 1920 ప్రాంతాలనుంచి స్త్రీ జనాభ్యున్నతికి పాటుపడ నారంభించారు. మిసెస్ కజిన్సు, డాక్టరు ముత్తులక్ష్మీరెడ్డిగార్లతో సన్నిహితత్వం యేర్పడింది. బాల్యవివాహాలు నిరోధించుతు స్త్రీ విద్యను ప్రోత్సహించేవారు. ప్రతి సంవత్సరం జరిగే ఆంధ్రమహాజన సభల్లో ప్రధాన పాత్ర వహించేవారు.

1921 లో గాంధీజీని కలుసుకోవటం జరిగింది. ఖద్దరు ప్రచారం, విదేశవస్తు బహిష్కరణ ఆరంభంనుంచి చేస్తూనే వున్నారు. 1926 లో పారిస్‌లో జరిగిన ప్రపంచ మహిళాసభకు భారతదేశ ప్రతినిధిగా వెళ్లారు. ఆ సందర్భంలోనే యూరప్‌లోని కొన్ని యితర దేశాలుకూడ పర్యటించి వచ్చారు. అన్ని దేశాలవారికి ఒక జాతీయగీతం, ఒక జండా, ఒక జాతీయ వేషధారణ వున్నది. తన దేశం భారతదేశానికి ఇవేవి లేవు. ఆమె మనస్సు బాధతో మెలితిరిగింది. అవమానంతో కుంగిపోయింది. కాని యివేవీ లేక పోయినా బానిసబ్రతుకు బ్రతుకుతున్న భారత మహిళలు సంస్కారవంతులు, కట్టు, బొట్టు అట్లాగే నిలుపుకుంటారు. కళాజీవులు అని తమ శక్తికొద్ది ప్రచారం చేశారు. ఆమె నుదుటిబొట్టును, నిండైన కట్టును, రాళ్లుకరిగి ప్రవహించేట్లు చేయగల ఆమె వీణావాదనాన్ని చూసిన విదేశీయులు భారత మహిళల సామర్థ్యాన్ని విశ్వసించారు. విదేశ సంచారం ముగించుకుని వచ్చిన ఆమె హృదయం ఆవేదన జ్వాలతో దహించుకు పోయింది. ఎట్లాగయినా తమ జాతికొక జండా, జాతీయగీతంతో స్వాతంత్ర్యాన్ని సంపాదించాలను కున్నారు. మరింత తీవ్రంగా రాజకీయాలలో ప్రవేశించారు. 1929 లో అఖిల భారత మహిళాసమాఖ్య (A. I. W. C.) వారు సమావేశపరచిన అఖిల ఆసియా మహిళానభకు అధ్యక్షత వహించి శ్లాఘనీయంగా నడిపించారు. అఖిల భారత మహిళాసమాఖ్య కార్యవర్గంలో వుండి చాలాకాలం మహిళాభ్యున్నతికి కృషి చేశారు.

ఆమె 1929 లో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మతో కలిసి ఆంధ్ర దేశ సంచారం చేసి జాతీయోద్యమ ప్రచారం చాలా తీవ్రంగా చేశారు. మాట సుతిమెత్తన గాని వేదిక యెక్కితే అది వుపన్యాసంకాదు సింహగర్జనగా వుండేది. ఆమెలాగ ఇంగ్లీషులో ధాటిగా వుపన్యసించగలవారు ఆనాడు పురుషులలోనే తక్కువ. తమిళనాడుకు గుండెకాయవంటి తంజావూరు సమీపానగల వేదారణ్యంలో శ్రీ రాజగోపాలాచారి, కామరాజనాడారుగార్ల అభ్యర్థనతో 1930లో సత్యాగ్రహంచేసి వుప్పువండి చివరకు శిబిర నియంతగా వుద్యమం నడిపారు. ఆమె వేదారణ్యంలోను, శ్రీమతి దుర్గాబాయమ్మ మద్రాసులోను పురుషులనుమించి నాయకత్వం వహించి వుద్యమం నడిపి ఆంధ్రమహిళల ఖ్యాతి శాశ్వతం చేశారు. దేవుడు పరీక్షించుచున్నట్లుగా ఆ సమయంలోనే మద్రాసులో ఆమె కుమారుడు బాల్యచేష్టగా కిరసనాయిలు

తాగటంతో భర్త ఒకసారి యింటికివచ్చి చూసి వెళ్లమని కబురు చేశారు. దేశంకోసం రణరంగంలో ప్రవేశించిన ఆమె వెళ్లలేకపోయినారు. దేవుడే కాపాడినట్లు ఆ బిడ్డకు ఆరోగ్యం కలిగింది. ఆమె వేదారణ్యంలో 1930 మే 14న అరెస్టయి ఒక సంవత్సరం శిక్ష "ఎ" క్లాసులో అనుభవించటానికి రాయవేలూరు జైలు ప్రవేశించారు. ఉప్పుసత్యాగ్రహ సందర్భంగా అరెస్టు కాబడిన మొదటి భారతమహిళ ఆమె. ఆరోజుల్లో ఆమె పూనుకుని స్థాపించిన స్వదేశీ వస్తువిక్రయశాల యీనాటికీ నిల్చివున్నది.

ఆమె అనేకసంవత్సరాలు కాంగ్రెసు సంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా వున్నారు. మద్రాసు రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా వున్నారు. ఆ సమయంలోనే యూత్‌లీగ్ స్థాపించారు. విద్యావంతులు, వుత్సాహవంతులు అయిన యువతీ యువకులు అనేకమంది దేశంలో సాంఘిక, రాజకీయ మార్పులు తీసుకురావటానికి బద్ధకంకణు లైనారు. మద్రాసురాష్ట్రం మొత్తంమీద వున్న యూత్‌లీగ్ సమాజాలు, అవి నడిపే సంస్థల సభ్యులు యావన్మంది ఆమెను అతి గౌరవసూచకంగా ఆత్మీయతతో "మమ్మీ" అని పిలిచేవారు. చంగల్పట్టుజిల్లా బోర్డుమెంబరుగా, అన్నామలై యూనివర్సిటీ సెండికేటు మెంబరుగా వున్నారు. కాంగ్రెసు అభ్యర్థిగా కార్పొరేషన్ ఎన్నికలో నిలిచి, ప్రాబల్యంగల జస్టిస్‌పార్టీ అభ్యర్థిని ఓడించగలిగారు. 1936 జనరల్ ఎలక్షన్లలో కాంగ్రెసు అభ్యర్థిగా గెలిచి శాసనసభ సభ్యురాలయినారు. 1937 లో శ్రీ రాజాజీ ఆధిపత్యాన ఏర్పడిన మంత్రివర్గంలో డెప్యూటీస్పీకరుగా నియమితులై గౌరవం పొందారు. 1946 లో శ్రీ ప్రకాశం గారి ఆధిపత్యాన యేర్పడిన కాంగ్రెసు ప్రథమ మంత్రివర్గంలో ఆరోగ్యశాఖా మంత్రిణిగా ఆంధ్రస్త్రీల గౌరవం పెంపొందించారు. ఆరోగ్యశాఖా మంత్రిణిగా వుండి ఆంధ్రులకు గుంటూరులో మరొక మెడికల్‌కాలేజి ప్రసాదించారు. అది కేవలం ఆమె కృషిఫలితం. మద్రాసు కీల్పాకులో వుండే ఆయుర్వేదపాఠశాల 1928 లో మూసివేయవలసి వచ్చింది. ఆమె ఆరోగ్యశాఖామంత్రిణిగా వున్న సమయంలో దానిని తిరిగి తెరవటమేకాక ఆయుర్వేదకళాశాలగా రూపొందించారు. జాతీయ వైద్యవిధానంపట్ల ఆమెకు గల గౌరవ విశ్వాసాలే దీనికి కారణం. ఆమె పట్టుదలకు, నిర్మాణాత్మక కృషి సాధనకు యీ రెండు కళాశాలలు గట్టి తార్కాణం.

ఆమె యిన్నివిధాల యింతగా సేవారంగంలో పాల్గొనటానికి కారణం ఆమె భర్త డాక్టరు శ్రీ ఆచంట లక్ష్మీపతి. ఆయన వైద్యశాస్త్రం కన్న ముందుగానే సంస్కారభావాలను, దేశభక్తిని, సాహిత్యాభిరుచిని వంట పట్టించుకున్నారు. మొదటిభార్య చనిపోగా, శ్రీమతి రుక్మిణీదేవిని 1912 లో వివాహం చేసుకున్నారు. ఆమె గోల్కొండ వ్యాపారులయిన శ్రీ పుగ్గిళ్ల శ్రీనివాసరావు శ్రీమతి చూడమ్మగార్ల అమ్మాయి. మద్రాసులో 1891 లో జన్మించారు. రాజా శ్రీ తుమ్మలపల్లి రామారావు దౌహిత్రి. సంపన్న కుటుంబంలో పుట్టారు. ఆనాటి పద్ధతిన చిన్న వయస్సులోనే వివాహం చేయాలని పెద్దలు పెద్ద ప్రయత్నంచేశారు. కాని తగిన సంబంధం దొరకలేదు. ఆ సమయంలో మద్రాసు ప్రెసిడెన్సి కాలేజిలో తెలుగు పండితులుగా వుంటున్న శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు బాల్యవివాహం చేయవద్దని, చదివించమని సలహా యిచ్చారు. తలిదండ్రులకు స్త్రీ విద్యపట్ల ఆస్తవుండి చదివించారు. మెట్రిక్యులేషను ముగిసింది. మద్రాసులో సుప్రసిద్ధ వైణికురాలయిన శ్రీమతి వీణధనమ్మ దగ్గర 12 సంవత్సరాలు వీణ నేర్చుకున్నారు. శ్రావ్యమైన కంఠం. ఉత్తరహిందుస్తానీ సంగీతం నేర్చుకున్నారు. వీణతోపాటు వయొలిన్, సితారు గొప్పగా వాయించేవారు. అందమైన ముఖము. డాక్టరు లక్ష్మీపతి, ఆమె ప్రేమించుకున్నారు. కాని ఆమె పెద్దలకు నియోగిబ్రాహ్మణుడి కివ్వటానికి యిష్టంలేకపోయింది. ఇద్దరి పట్టుదలవల్ల, యిరువైపుల పెద్దలు ఒప్పుకుని వివాహం జరిపించారు. అతి వైభవంగ జరిగింది. బంధుమిత్రు లనేకులు వచ్చారు. శాఖాంతరమే కాక శార్దాచట్టం రానిరోజుల్లో ఇరవయ్యోయేట పెళ్లిచేసిన కారణంగా ఆమె అత్తవారిని వెలివేశారు. మామగారు పాపం తద్దినం మంత్రాలు పుస్తకంచూసి చదువుకుంటు కొంతకాలం శ్రాద్ధకర్మలు జరుపుకోవలసి వచ్చినది. కాని పేపర్లుమాత్రం యీ సంస్కరణ వివాహాన్ని శ్లాఘించుతు అదొక పెద్ద విచిత్ర విషయంగా పేర్కొన్నవి. రుక్మిణీస్వయంవరం అంటూ పద్యాలు కావ్యాలు వ్రాశారు. భర్త ప్రోత్సాహంతో ఆమె మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో బి. యే. ముగించారు. గోల్కొండ వ్యాపారులలో ప్రథమ పట్టభద్ర ఆమె. 1939 లో మద్రాసులో ఆలిండియా రేడియోకేంద్రం నెలకొల్పబడింది. ఆమె తరుచు రేడియోద్వారా తమ మధుర వీణావాదన ప్రోగ్రాములను యిచ్చేవారు. అంత ధాటిగా ఇంగ్లీషులో వుపన్యసించగలవారు అరుదు. అది సింహగర్జనే.

ముగ్గురు బిడ్డల తల్లిగా యిల్లు దిద్దుకోవలసిన యిల్లాలుగా, ఆమెకు కావలసి నంత వ్యాపకం, పని, వున్నది. ఐనా యెప్పుడు భర్తతో కలసి సాహిత్య గోష్ఠులకు, సభలకు, సమావేశాలకు వెళ్లేవారు. రాజకీయవేత్తగా సంప్రదింపులకు వచ్చే ఆంధ్రదేశ సేవికలతో మంతనాలు జరిపేవారు. అంతట తానే అయి బాధ్యత వహించు శాంతిప్రియగా, విధినిర్వహణకు మారుపేరుగా శాశ్వతం పొందారు. తమ దేశం స్వతంత్ర దేశంగా సాటిదేశాలతో సరి తూగాలన్న కాంక్షతో స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నందులకు, అది సాధించటమేకాక స్వతంత్ర భారత యంత్రాంగంలో పాల్గొని పదవులను నిర్వహించిన ప్రథమ ఆంధ్రమహిళగా గౌరవం పొందారు. 1951 లో కీర్తికాయులైనారు.

# శ్రీమతి వేదాంతం కమలాదేవి

**జననం 5-5-1897** **మరణం 11-3-1967**

గుంటూరులో శ్రీమతి వేదాంతం కమలాదేవిగారి అధ్యక్షతన 5-6-1932 న ఆంధ్రరాష్ట్ర మహాసభ జరుగుతుంది కాబట్టి ప్రతినిధులు సకాలానికి రావలసినదని, ఆంధ్రులందరు విరివిగా పాల్గొనాలని పత్రికల్లో ప్రకటించారు. గోడలనిండా కాగితాలు అంటించారు. ఆ సభ యెట్లాగయినా విచ్ఛిన్నం చేయాలి, జరగనివ్వకూడదన్న దృఢనిశ్చయంతో పోలీసులు అప్రమత్తులై శ్రీ కమలాదేవిని అరెస్టు చేయటానికి వేచివున్నారు. నాలుగవతారీకు రాత్రి దాటినా ఆమె జాడ లేదు. సభ ప్రయత్నాలు అసలే కనిపించలేదు. అగ్రహారంలో శ్రీ సంపత్కుమారాచార్యులుగారి వ్యాయామ శాలలో నాల్గవతేదీ వుదయంనుంచి రాములవారి పూజలు ఉత్సవాలు జరిగినై. రాత్రి పదింటివరకు ప్రసాదాలు, భజనలు, సందడిగావున్నది. నలుగురు మనుష్యులుచేరితే ఆరుగురు పోలీసులు వచ్చేవారు. అట్లా వచ్చిన పోలీసులు ప్రసాదాలు తీసుకుని భజనలు ముగిసిపోవడంతో చుట్టుపక్కల అరుగులమీద పడుకుని నిద్రపోతున్నారు. తెల్లవారి కళ్లు నులుముకుంటు కలవరపాటుతో పరుగులెత్తి, లాఠీచార్జీ చేస్తున్న పోలీసు సిబ్బందితో వాళ్లు కలిశారు. తెల్లని ఖాదీ ధరించి జండాలు పట్టుకుని జాతీయ గీతాలు పాడుతు, "వందేమాతరం మనదేరాజ్యం" అని సింహగర్జనలు చేస్తున్న కాంగ్రెసు పెద్దలు, పౌరులమధ్య విజయోత్సాహం విజయగర్వం ముఖాన తాండవించుతుండగా శ్రీమతి కమలాదేవి నిలబడివున్నారు. ఆమె అనుకున్న ప్రకారం కాకినాడలో బయలుదేరి గుంటూరుకు ముందు స్టేషనులో



శ్రీమతి వేదాంతం కమలాదేవి

దిగి పెళ్లికి హాజరయి వస్తున్న పల్లెటూరు ముత్తయిదువల్లే తయారయి రైలులోనే గుంటూరు చేరుకున్నారు.. వ్యాయామశాల చుట్టువక్కల అనేక మంది యిళ్లల్లో రహస్యంగావచ్చి దిగిన ప్రతినిధులు పౌరుగూరి ప్రేక్షకులతో పాటు ఆమెకూడ వచ్చి చేరుకున్నారు. తెల్లవారుఝామున కోనేటిగట్టున అందరూ సమావేశమై జండావందనం చేశారు. శ్రీమతి కమలాదేవిగారు అచ్చువేయించిన తమ అధ్యక్షోపన్యాసం చదివారు. కాంగ్రెసు మహాసభల్లో ఆమోదించిన శాసన ధిక్కార తీర్మానాలన్నీ చదివి ఆమోదించారు. మరికొన్ని వుపన్యాసాలు ప్రబోధాలయేటప్పటికి తెల్లవారింది. ఆ సభకు హాజర యినవారందరు యింత నిర్విఘ్నంగా తమ సభ ముగిసినందుకు సంతోషించి జాతీయగీతాలు పాడుతు పరిసర వీధుల్లో వూరేగింపుకు బయలుదేరారు. ఇక లాఠీచార్జీలకు వూరేగింపులకు అరెస్టులకు విలువ యేమున్నది, భయమే మున్నది. అనేకమందితోపాటు అప్పుడు అరెస్టుచేసి శ్రీమతి కమలాదేవిని గుంటూరు సబ్‌జైలులో పదిహేనురోజులు వున్న తరువాత 6 నెలలు శిక్షవేసి రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమె సాహసం, వుత్సాహం, పట్టుదల అటువంటివి.

1897 మే 5 న ఆమె కడపజిల్లా నందలూరులో జన్మించారు. సోదరీ సోదరులు వున్నారు. శ్రీమతి భ్రమరాంబ శ్రీ ప్రతాపగిరి గోపాలకృష్ణయ్యలు ఆమె తలిదండ్రులు. తండ్రికామె గారాబు పట్టికావటాన ఆ ప్లీడరుగారు ఆమెను తమవెంట రోజు కోర్టుకు తీసుకువెళ్లేవారు. అందువల్ల ఆమెకు జంకు, అర్థంలేని సిగ్గు తెలియవు. ఉపరివయసుకు మించి రాజకీయ సాంఘిక విషయపరిజ్ఞానం కలిగింది. 12వ యేట బాపట్ల వాస్తవ్యులయిన శ్రీ వేదాంతం వెంకటకృష్ణయ్యతో వివాహం అయింది. ఆయన విద్యావంతులు సంస్కారభావాలు కలవారు. ఆనాటి అనేకమంది యువకుల మాదిరిగా ఆయనా బ్రహ్మమత ప్రభావితులైనారు. కొంతకాలం ఆమెను పంపకుండావుంటే అల్లుడు తప్పకుండ మామూలు మార్గానికి వస్తాడని ఆశించారు పెద్దలు. కాని 13 యేళ్ల చిన్న వయసులోనే ఆమె భర్త అభిప్రాయాలతో ఏకీభవించుతు నిశ్చింతగ కాకినాడ భర్త దగ్గరకు వెళ్లారు.

ఆయన అప్పుడు కాకినాడలో హెడ్‌మాస్టరుగావుంటు పిఠాపురం రాజావారు స్థాపించిన అనాధ ఆశ్రమం నిర్వహించుతు వుండేవారు. జాలి,

సహానుభూతితో పాటు ఆమె లేతమనసులో కార్యనిర్వహణ అభిలాష, సేవానక్తి, పనిచేసి సాధించగలమన్న ఆత్మవిశ్వాసం చక్కగా నాటు కున్నవి. ఆమెనేర్పు, పట్టుదల పరిచయులకు వింతగాతోచేవి. కొద్దికాలానికే ఆయన డాక్టరు పరీక్షకు చదవటానికి కలకత్తా వెళ్ళగా వెంట ఆమెకూడ వెళ్లారు. అక్కడ మహిళాభ్యున్నతికి యెంతో కృషిచేసిన శ్రీమతి సుప్రభా దేవి శిష్యరికం చేశారు. బెంగాలీ చక్కగా నేర్చుకోవటమేకాక విజ్ఞానదాయ కమైన అనేక బెంగాలీ పుస్తకాలు, ఇంగ్లీషు పుస్తకాలు చదివారు. కొన్ని బెంగాలీ పుస్తకాలను తెలుగులోకి అనువదించారు. 1919 నాటికి డాక్టరుగా వెంకట కృష్ణయ్యగారు కాకినాడలో స్థిరపడ్డారు. అనేక విశాలభావాలతో, దేశానికి, సంఘానికి చేయగలిగిన, చేయవలసిన సేవాకార్యకలాపాల జాబితాతో ఆమె కాకినాడ చేరుకున్నారు.

1920 లో గాంధీమహాత్ముడు పూరించిన స్వాతంత్ర్య శంఖారావం యీ దంపతులిద్దరి హృదయాలను పూపివేసింది. చక్కగా పదును అయివున్న వారి మనసులల్లో జాతీయోద్యమ బీజం యిట్టేపెరిగి వేరూనింది. ఉద్యమంలో చొచ్చుకు పోయినారు. విదేశవస్త్ర, వస్తు బహిష్కారం, నూలువడకటం, ఖాదీ ధరించటమే కాక యిల్లిల్లుతిరిగి అమ్మటం చేసేవారు. 1921 లో మనదేశంలో శాసనోల్లంఘనంపట్ల ప్రజాభిప్రాయాన్ని విచారించటానికి అఖిల భారత శాసనోల్లంఘన విచారణ సంఘం సామర్లకోట వచ్చింది. అప్పటికి కొద్దిరోజుల కిందటే శ్రీమతి కమలాదేవిగారి బిడ్డ స్వరాజ్యం అనే అమ్మాయి చనిపోయింది. ఆ బాధను అణచిపెట్టి ఆమె ఆ విచారణ సంఘం వారిని ఆహ్వానించి వినతి పత్రం సమర్పించారు. నాటికి నేటికి 1923 లో ఒక్కసారే కాంగ్రెసు మహా సభలు తెలుగుదేశాన జరిగినవి. కాకినాడలో జరిగిన ఆ సమావేశాలు అంగ రంగ వైభవంగా మహోత్సాహవంతంగ అడుగడుగున ఆంధ్రుల దేశాభిమానం ప్రస్ఫుటం చేస్తు శాశ్వతమైనకీర్తి సంపాదించుకున్నవి. ఘోషాయిబ్బంది లేని కారణంవల్ల కావచ్చు అంధ్ర మహిళలు చెప్పనలవికాని వుద్రేకంతో వుత్సాహంతో పాల్గొన్నారు. పురుషులను మించి ఒకొక్కరంగంలోను విజృం భించారు. బాలికా వాలంటీరు దళాలు స్త్రీవాలంటీరు దళాలు ఎన్నెన్నో యేర్పడి విసుగు విరామంలేకుండ స్వచ్ఛందసేవ చేశారు. స్త్రీల శాంతిదళాలకు శ్రీమతి కమలాదేవి ఆధిపత్యం వహించారు. ఆమె భర్త వైద్య దళానికి అధిపులుగా సేవచేశారు. ఆంధ్రదేశమంతా సంచారంచేసి మహిళాసంఘ కార్యదర్శినిగా ఖాదీ

ప్రచారం యెంతగానో చేశారు. తిలక్ స్వరాజ్యనిధికి భారీగా విరాళాలు వస
చేశారు.

1930లో ఉప్పుసత్యాగ్రహం నాటికి ఆమె ఆరోగ్యం బాగాలేదు. వాతం వచ్చి సరిగాతిరగలేని స్థితిలోఉన్నారు. ఇంట్లో అంతా పసిబిడ్డలు. ఇల్లు ఆనందనిలయం కాంగ్రెసు ఆసుపత్రిగా రూపొందింది. అతిథి అ గతులతో, క్షతగాత్రులతో యిల్లు కిటకిటలాడుతు వుండేది. విశాఖపట్నంజిల్లా వుద్యమం నడిపించటానికి నాయిక కనిపించక మహర్షి సాంబమూర్తి గా ఆదుర్దాపడుతున్న తరుణంలో ఆమె అన్నియిబ్బందులను అనారోగ్యా దులిపేసుకుని రణరంగంలో ప్రవేశించారు. ఆవేశపూరితంగ వుపన్యాసి వుద్బోధించేవారు. పురుషులు వెనుకాడే పరిస్థితులలో ఆమె అతిచాకచక్యం నేర్పుగ ముందుకు చొచ్చుకుపోయేవారు. ఒక చక్కని ప్రజానాయిక వుద్యమ సంచారికగా పేరుతెచ్చుకున్నారు. ఏ జిల్లావారు ఆ జిల్లాలో శాస ల్లంఘనం జరపాలని కాంగ్రెసు ఆదేశం. అందువల్ల ఆమె నౌపడావు కొఠారులమీదికి దండియెత్తారు. ఆ సంరంభం, వుద్రేకం, పట్టుదల సామా మైనవి కావు. లాఠీదెబ్బలకు జంకులేదు అరెస్టులంటే భయంలేదు. శాసనో ఘనం ఒక పవిత్రవ్రతంగా జనం ముందుకుసాగారు. అనేకమంది స్త్రీ పురుష తోపాటు నౌపడా ఉప్పుకొఠార్ల దగ్గర సత్యాగ్రహంచేసి 1930మే 20న ఆ అరెస్టు అయినారు. ఆరునెలల జైలుశిక్ష అనుభవించటానికి రాయవేలూ జైలు "బి" క్లాసులో ప్రవేశించారు.

అక్కడ ఆమెకు అందరు పరిచితులే. శ్రీమతులు ఉన్నవ లక్ష్మీ బాయమ్మ, ఆచంట రుక్మిణీలక్ష్మీపతి, దుర్గాబాయమ్మ, దువ్వూరి సుబ్బమ గార్లు వంటి అగ్రనాయికలు యెంతోమంది అక్కడవున్నారు. శ్రీమతి కమ దేవిది కళాత్మకహృదయం ఆమెకు రాని, తెలియని చేతిపనిలేదు. ఏ చేసినా తిరుగులేకుండ ఉత్తమంగాచేయటం ఆమెకు అలవాటు. చమ్కీ, పట్టు జరీపూలకుట్లు, అల్లికలు, నందనవనంలాంటి తోటను స్వయంగా పెం తయారుచేయటం మృదుమధురంగా పాడటంతోపాటు అత్యంత రుచికరంగా వివిధ రకాల వంటలు వండటం ఆమెకు వేడుక. జైలులో ఏ, బి, క్లాసు రాజకీయ స్త్రీబందీలు వంతులవారీగా వంటపని నిర్వహించేవారు. ఆమె తనవంతు వచ్చినప్పుడు ముందువంటయిల్లు పరిసరాలు అద్దంలాగ పరిశుభ్రంచేసే

ఆతరువాతనే పొయ్యివెలిగించి కమ్మని వంటలు వండేవారు. నిండుగా గంభీ రంగ శుభ్రంగ శుచిగావుండి యెప్పుడు అల్లుతు కుడుతూ వుండేవారు. నవంబరు 12, 1930న విడుదల అయి యిల్లు చేరుకున్నారు. ఆమెకు యింట్లో ఆరుగురు బిడ్డలు. చిలకలు, మైనాలు, పిల్లులు, కుక్కలు, కుందేళ్లు, ఆవులు, బండిలాగే గుఱ్ఱం యిన్ని పెంపుడు పశుపక్ష్యాదులు, ఆమె అండకోరివచ్చిన ఆశ్రితులు, కాంగ్రెసు ఆసుపత్రిలో రోగులసేవ, తోటపెంపకం, యిన్నివున్నా ఆరోగ్యం అసలుస్థితికి చేరుకోకపోయినా ఆమె కాంగ్రెసు వుద్యమప్రచారం మానలేదు. ఖాదీప్రచారం మానలేదు. స్త్రీలలో నిరంతరం చైతన్యం కలిగించుతూనే వుండేవారు. మహిళల సభలు సమావేశాలు ఆమెకు యెంతో ముఖ్యమైన కాలక్షేపం. 1931 లో ఇచ్ఛాపురంలో జరిగిన గంజాంజిల్లా మహిళాసభకు అధ్యక్షత వహించారు.

ఇంతలో 1932లో శాసనోల్లంఘనం రెండవ అధ్యాయం తీవ్రంగ ఆరంభమైంది. ప్రభుత్వం యీ తిరుగుబాటును అణచటానికి కొత్తవిధానాలు అవలంబించారు. సాధ్యమైనంతవరకు అరెస్టులుమాని లాఠీచార్జీలు ఆరంభించారు. ఖాదీయెత్తున సభలు సమావేశాలు జరగకుండ వాటికి అంతరాయం కలిగించే వారు. 144వ సెక్షను పెట్టి వాటిని అమలు జరపటం అటుంచి హాజరుకావ టమే రాజద్రోహంగా వెల్లడించారు. ఢిల్లీలో కాంగ్రెసు సమావేశం జరపకూడ దన్నారు. దానిని లెక్కపెట్టకుండ అక్కడికి వెళ్లిన శ్రీమతి ఉన్నవ లక్ష్మీ బాయమ్మ, దేశభక్త శ్రీ కొండావెంకటప్పయ్య ప్రభృతులను వందలసంఖ్యన స్టేషనులోనే అరెస్టుచేశారు. కాని ప్రకటించినచోటుకు బదులు మరొకపేటలో గుట్టుచప్పుడుగా కాంగ్రెసు సమావేశం జరిపి తీర్మానాలు ఆమోదించారు. అనేకులు వుత్సాహంతో హాజరయినారు. శ్రీమతి వేదాంతం కమలాదేవి సలక్షణంగా సభజరిపించారు. దాంతో ప్రజలకు యీ కొత్తపద్ధతి ఒకటి తెలిసి వచ్చింది. పోలీసులకూ తెలిసివచ్చి ప్రజల పూనిక, శక్తిమేరకు కనిపెట్టి వుండేవారు. ప్రతిప్రాంతంలోను రాష్ట్ర, జిల్లా తాలూకా స్థాయిలో మహాసభలు జరిపి తీర్మానాలు ఆమోదించవలసి వున్నది. ఈ కొత్తప్రయోగం అమలులో పెట్టి శ్రీమతి కమలాదేవిగారి ఆధ్వర్యాన గుంటూరులో తెల్లవారుజామున మహాసభను ప్రకటించిన ప్రకారం నిర్విఘ్నంగా జరిపితీర్మానాలు ఆమోదించారు. అట్లతద్దె, ఉండ్రాళ్లతద్దె ఆంధ్రుల ప్రత్యేక పండుగలేమోమరి, కంట్లోవత్తులు వేసుకుని పోలీసులు కనిపెట్టివుంటే యింతముచ్చటగా సభజరపటం అధికారులకు

అవమానంగాతోచి లాఠీచార్జీచేసి చిక్కిన వారినందరిని కొట్టి జైలులోకి తోశారు. ఆ విధంగా ఆమె వీరనారిగా మరింత ప్రఖ్యాతితెచ్చుకుని రెండవ సారి ఆరునెలలు జైలుశిక్ష అనుభవించటానికి రాయవేలూరు వెళ్లారు. ఆమెతో పాటు గుంటూరులో అరెస్టయిన కొండా సత్యవతమ్మగారికి జైలులో టైఫాయిడ్ జ్వరం వచ్చింది. అసలే జైలు, అందులో సి క్లాసు చిన్న నరకం, ఇక టైఫాయిడ్‌వంటి జబ్బులువస్తే ఆ పరిస్థితి వూహించుకోవటం కూడ కష్టమే. అటువంటి సమయంలో శ్రీమతి కమలాదేవి కంటికి రెప్పలాగ ఆమెను కాపాడి, వాత్సల్యంతో సపర్యలు చేసినగాథ-నలభై ఆరు సంవత్సరాల తరవాత చెపుతుకూడా శ్రీమతి సత్యవతమ్మ కళ్లతుడుచుకుంటారు. శ్రీమతి కమలాదేవిది జాలిగుండె. అట్లాగని మాటలతోకాక చేతలతో సహానుభూతి, సహాయం అందించుతారు. శ్రీమతి కమలాదేవిలో క్రియాత్మకమైన వుదాత్తభావాలు అనేకం.

రెండవసారి జైలునుండి విడుదల అయినర్వాత. ఆమె 1929లో' 30 లో' 34లో అఖిల భారత కాంగ్రెసు స్థాయీ సంఘసభ్యులుగా గౌరవాన్నందుకున్నారు. మూడుపర్యాయములు కాకినాడ పట్టణ మున్సిపల్ కౌన్సిలర్‌గా వున్నారు. విద్యావ్యాప్తి, అందులోను ప్రాథమిక విద్యను విస్తారంగా వ్యాపింపచేశారు. అస్పృశ్యతానివారణ చేసిచూపించారు. జాతీయభావాలు స్త్రీలలో ప్రత్యేకించి ప్రచారం చేశారు. ఇంతలో కాంగ్రెసు అసహాయోద్యమ దృష్టిమారి ప్రభుత్వంలో పాల్గొన తీర్మానించింది. దేశవ్యాప్తంగా జరిగిన యెన్నికలలో ఆమెకు వ్యక్తిగతంగా సంబంధం లేకపోయినా, కాంగ్రెసు తరఫున వాదవాదల తిరిగి ప్రచారం చేశారు. ప్రత్యర్థుల కుతంత్రాలకు భయపడక, అవరోధాలను అపాయాలను కూడ లెక్కచేయక ధైర్యంగా పనికొనసాగించారు. ప్రత్యర్థులు తమ పలుకుబడిని ప్రయోగించి ప్రచార సమయంలో ఆమెకు కొన్నిచోట్ల మంచినీళ్లుకూడ పుట్టనివ్వలేదు. అందువల్ల కాంగ్రెసు అభ్యర్థులు గెలిచినందుకు ఆమె సంతృప్తి చెందారు. మద్రాసు కార్పొరేషను ఎన్నికల సందర్భంలో కాంగ్రెసు అభ్యర్థిని అయిన శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతికి తోడ్పడ్డారు. ఆమె పదికాలాలపాటు బ్రతికితే మరింకెన్ని మహత్తరకార్యాలు సాధించేవారో. కాని 1940 జూలై 14వ తేదీన తమ 43వ యేట పక్షవాత కారణంగా యీ త్యాగమయికి అకాలమరణం వాటిల్లింది.

---

# డాక్టరు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

జననం 10-7-1909 | మరణం 9-5-1981

**1979** జనవరి 28 న హైదరాబాదులో ఆంధ్ర మహిళాసభ జనంతోను, పెద్దల కార్లతోను, కిక్కిరిసి ఉన్నది. యునైటెడ్ నేషన్స్‌వారు తాము సంకల్పించిన సమాజాభ్యున్నతికి రూపకల్పన చేసిన శిల్పిగా, డాక్టరు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారికి పాల్. జి. హాఫ్‌మన్ సన్మానం అందించుతున్నారు. నిజానికి ఆ వేడుక న్యూయార్కు నగరంలో జరుగవలసి వున్నది. కాని అంతదూరం ఆమెను రప్పించటం ఇష్టం లేక ఆమెపట్లగల గౌరవంకొద్దీ, నిర్ణయ సమితి చైర్మన్ అయిన శ్రీ ఇర్వింగ్ ఎస్. ఫ్రీడ్‌మన్ ఆ సరంజామా తీసుకుని సతీ సమేతంగా హైదరాబాదుకే వచ్చేశారు. బహుకాలంగా శ్రీమతి దుర్గాబాయమ్మగారిని, ఆమె సేవను, సంస్థలను తెలిసివున్న తమిళనాడు గవర్నరు శ్రీ



శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

ప్రభుదాసు పట్వారీ సభకు అధ్యక్షత వహించగా, ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ కె. సి. అబ్రహాం ముఖ్య అతిథిగా వచ్చారు. భారతదేశంలో పిల్లలు, స్త్రీలు, వికలాంగులు, వ్యాధిగ్రస్థుల పరిస్థితులను బాగుపరుస్తు, రక్షణ కల్పించటంలో చేస్తున్న కృషికి ఆమెను దేశదేశాల తరపున శ్లాఘించుతు శ్రీ ఇర్వింగ్, ఎస్. ఫ్రీడ్‌మన్ సన్మానపత్రం సమర్పించారు. బంగారు పతకంతోపాటు 5 వేల డాలర్ల చెక్కును ఆమెకు అందించారు. భారత మహిళ సేవను గుర్తించి గౌరవ సన్మానాలు జరుపుతున్నందుకు కృతజ్ఞత తెలియపరుస్తు, స్వర్గీయ శ్రీ హాఫ్‌మన్ సేవాతత్పరతను, వారితోతనకుగల పరిచయాన్ని ఆమె వివరించారు. తగిన ప్రజాహిత కార్యనిర్వహణకు

వినియోగపరచేట్లుగా ఆదేశించుతు మహిళాసభ నర్సింగ్‌హోముకు ఆ చెక్కును ఆమె వెంటనే యిచ్చేశారు.

దక్షిణ భారతంలో నిరక్షరాశ్యతను నిర్మూలించి, వయోజన విద్యావ్యాప్తితోపాటు శ్రామికులు, కర్షకులు, గ్రామీణులకు కూడ వుపకరించే విధానంలో విద్యనేర్పి, వారివారి వృత్తులలో వ్యాసంగాలలో తోడ్పడుతున్న లిటరసీహౌస్(సాక్షరతాభవనం) స్థాపించి, శిశువిహార్లు, హైస్కూళ్లు, కాలేజీలు, బి.ఇడి. ట్రెయినింగ్ కాలేజి, కన్డెన్సుడు కోర్సులు, సహాయనర్సు, మంత్రసాని శిక్షణాలయం, చేతిపనుల శిక్షణాలయం వంటి వివిధకేంద్రాలను శిక్షణలను తన నిర్వహణలోవున్న ఆంధ్రమహిళా సభలో కల్పించి స్త్రీలకు, పిల్లలకు, ప్రజలకు అమూల్యసేవ చేస్తున్నందుకు యు. ఎన్. ఎస్. కో. వారుకూడ 1978 సెప్టెంబరులో ఆమెకు గౌరవసన్మానాలు, సంస్థకు పతకం యిచ్చారు. 1978 నవంబరు 13న భారత ప్రధాని శ్రీ మొరార్జీదేశాయి డిల్లీనుంచి వచ్చి స్వహస్తాలతో ఆమెకాసన్మాన పతకం, పత్రం అందజేశారు.

1978 అగస్టు 12న కేంద్రసంఘ సంక్షేమ సమితి రజతోత్సవాల సందర్భంలో, ప్రథమ చైర్మన్‌గానిల్చి కనివిని యెరగని ప్రశస్త రూపాన్ని సమితికి కల్పించి స్త్రీలు, శిశువులు, రోగులు వ్యధితులసేవకు వరవడి పెట్టిన తమ గురువుగా సన్మాన పత్రం సమర్పించారు. టెల్కోన్‌వారు స్వయంగా నిర్మించి బహూకరించిన లక్షల విలువచేసే ఆసుపత్రివాన్‌కు మూడులక్షల విలువగల వైద్యపరికరాలను జోడించి నడయాడు ఆసుపత్రిని ఆమెకు గురుదక్షిణగా బహూకరించారు. ఆ 'మినీ హాస్పెటల్ ఆన్‌వీల్సు' ని శ్రీమతి ఇందిరాగాంధి ఆవిష్కరించారు. ఖర్చులకు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం 75 వేలు రికరింగుగ్రాంటు యిచ్చింది. ఆ వాన్‌లో నర్సింగ్ హోమ్ సిబ్బంది వారంవారం పరిసర ప్రాంతాల్లో పర్యటించి వుచిత వైద్య సహాయం అంద చేస్తున్నారు. 1973 లో విద్యావేత్తగా, స్త్రీ విద్యా ప్రదాయినిగా ఆమెకు నెహ్రూ అవార్డు లభించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారు హైదరాబాదులో అత్యంత రమణీయమైన భవనంలో తాము స్థాపించిన బాలికల పాలిటెక్నిక్ సంస్థకు ఆమె పేరుపెట్టి గౌరవించారు. ఇటువంటివి అనేకం.

ఆమె తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రిలో 10-7-1909న జన్మించారు. కాకినాడ వాస్తవ్యులయిన శ్రీమతి కృష్ణవేణమ్మ శ్రీ బెన్నూరి రామారావు

గార్లు ఆమె తల్లిదండ్రులు. శ్రీ బెన్నూరి నారాయణరావు ఆమె ఏకైక సోదరుడు. 12వ ఏటనే రాజమండ్రిలో గాంధీ మహాత్ముడిని చూడటం, ఆయన స్వాతంత్ర్య సమరశంఖారావం విని వుత్తేజితురాలు కావటం జరిగింది. చేతులకున్న బంగారు గాజులను నిధికి కానుకగాయిచ్చి, నాటినుండి ఖాదీధారణ ఆరంభించారు. తల్లివెంట ఖాదీఅమ్మకం చేస్తూ యింటింటికివెళ్లి ప్రచారం చేసేవారు. ఇంగ్లీషు బోధించుతున్నారన్న నెపంతో చదువుతున్న 5వ క్లాసు ముగియకుండానే ఆ స్కూలు వదిలివేశారు. తమయింట్లోనే చేతిపనులు, జాతీయగీతాలు పాడటం, నూలువడకటం, హిందీనేర్పటానికి బాలికా హిందీ పాఠశాలను స్థాపించారు. స్వయంగా ఒకప్రక్కన హిందీనేర్చుకుంటు మరొకవైపు హిందీక్లాసులు నడిపేవారు. తల్లిని, యితర వయోజనులనేకులను స్కూలులో చేర్చుకున్నారు. ఆవిధంగా ఆమె విద్యావ్యాప్తిమేకాక వయోజన విద్యకు కూడ నాందిపలికారు. కాకినాడలో జరిగిన 1923 నాటి కాంగ్రెసు మహాసభలకు, హిందీ సాహిత్యసమ్మేళనానికి ఆమె హిందీనేర్పి, వాలంటీర్లుగా అవసరమైన శిక్షణనిచ్చి తీర్చిదిద్దిన స్త్రీలు వందల సంఖ్యన వనిచేసి మెప్పుపొందారు. ఆ గురువుకు మాత్రం వయసు చాలలేదు పాపం.

1927లో ఖాదీప్రచారం సాగించుతు గాంధీమహాత్ముడు కాకినాడ వచ్చారు. స్త్రీలకు ప్రత్యేక సభల అవకాశంలేనందువల్ల ఘోషాపద్ధతి పాటించే స్త్రీలు, ముస్లిముస్త్రీలు మనసులో అభిమానం వున్నా ప్రత్యక్షంగా ఆయనను చూచివుపన్యాసాలు వినడానికి వీలుపడేదికాదు. తనకున్న రాజకీయ ప్రవేశాన్ని, పలుకుబడిని పట్టి ఆమె ముందువరసనుంచే చూడగల అవకాశంవున్నా, తోటి స్త్రీలపైగల సహృద్భావంతో, కార్యకర్తలతో తీవ్రంగవాదించి ప్రత్యేకసభ యేర్పాటు చేశారు. ఆ మహదవకాశాన్ని పురస్కరించుకుని వేలకొద్దీ స్త్రీలు సభకు హాజరయి అత్యంత దేశభక్తితో తమ నగలు కాంగ్రెసు నిధికి యిచ్చారు. పది నిమిషాలుమాత్రమే ఆ సభకు కేటాయించిన మహాత్మా గాంధీ గంటకు పైగా అక్కడే గడిపారు. ఆ సందర్భంలో ఆమె 25 రోజులపాటు గాంధీజీ వెంట ఆంధ్రదేశ పర్యటనంచేసి ఆయన వుపన్యాసాలను అనర్గళధారతో తెలుగులోకి అనువదించేవారు. ఆ సమయంలో ఆమెకు గాంధీజీ తత్వాన్ని, సేవాతత్పరతను క్షుణ్ణంగా అవగాహన చేసుకోగల అవకాశం వచ్చింది. బహుశ అందువల్లనే ఆమెకు వేలు, లక్షల లెక్కన విరాళాలు వసూలు చేయటమేతప్ప దానిని చేతితోతాకే అలవాటు అంటలేదు.

1930లో ఉప్పు సత్యాగ్రహం ఆరంభమయినప్పుడు ఆమె మద్రాసులో వున్నారు. అప్పట్లో సత్యాగ్రహంలో స్త్రీలుపాల్గొనరాదన్న మహాత్ముని ఆదేశం ఆమెకు బొత్తిగానచ్చలేదు. స్వయంగా ఆయనకువ్రాసి అనుమతి యిచ్చేట్లు చేశారు. ఆమె వీర విహారానికి అంతులేదు. ఉద్రేకపూరితంగా అనర్గళధారతో వుపన్యసించేవారు. లాఠీదెబ్బలు తిన్నారు. నాటిఅగ్రనాయకులలో ఒకరుగా, నియంతగా వుద్యమం నడిపారు. ఉదయవన శిబిరం ఆమెకోట. చివరకు అర్కాటులో 25-5-1930న ఆమెను అరెస్టుచేసి ఒకసంవత్సరం శిక్షవేశారు. రాయవేలూరు జైలుకు పంపించారు. అక్కడ అడుగడుగునా అధికారులకు సమస్యలే సృష్టించి, నిర్భయంగ నిలవేసి ప్రశ్నించేవారు. తోటిస్త్రీ రాజకీయ ఖందీలకు హిందీనేర్పుతు, శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతి దగ్గర ఇంగ్లీషు నేర్చుకునేవారు.

తిరిగి శాసనధిక్కార సమయంలో 17-1-1932న కాకినాడలో అరెస్టు అయినారు. ఆరునెలల శిక్షతో రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమెకు "ఏ" క్లాసు యిచ్చారు. ఒకేజాతీయోద్యమంలో పాల్గొని జైలుశిక్ష పొందిన వారిలో కొంతమందికి "ఏ"క్లాసువైభోగం, మరికొంత మందికి "సి"క్లాసు నరకం ఆమెకు నచ్చలేదు. ఆమాటనే చెప్పి "సి" క్లాసులో ప్రవేశించారు. చిన్నహాలులో మందతోలినట్లు ఖైదీలనువుంచటం, సాయంత్రంకాగానే తలుపులు తాళాలువేయటం అన్యాయం, అనారోగ్యకరం అని అధికారులతో వాదించారు. అడుగడుగున ఆమె సృష్టించే సమస్యలకు తట్టుకోలేక గుట్టుచప్పుడుగా ఆమెకు కఠిన ఏకాంతవాస శిక్షవేసి మధురజైలుకు మార్చారు. మరణశిక్ష విధింప బడిన స్త్రీలు మాత్రమే అక్కడవుండేవారు. నిరాశ నిస్పృహలకు లోనయిన ఆ స్త్రీలు మానవత్వమే మరచిపోతారు. అటువంటి స్త్రీలను అదుపులోపెట్టే ప్రయత్నంలో అధికారులు అసలే రాక్షసత్వం వహిస్తారు. శరీరకష్టంతోను, యీ వాతావరణంతోను ఆమె ఆరోగ్యం క్షీణించింది. ఒకనాటి రాత్రి పక్క గదిలో యిద్దరు మరణశిక్ష విధించబడిన స్త్రీలు కొట్టుకుని, చివరకు ఒక పసి విల్లను గొంతుపిసికారు. వద్దన్నా అంతా వినిపించిన కారణంగా శ్రీమతి దుర్గా బాయమ్మగారు సాహసించి గోడయెక్కి పక్కగదిలోకిదూకి పసివిల్లను సొంతం చంపకుండ రక్షించారు. ఆమె త్యాగానికి సాహసానికి అధికారులు ఆశ్చర్య పోయినారు. విద్యలేక అజ్ఞానంవల్ల యీ స్త్రీలు ఘాతుకాలు చేస్తున్నారు. వాళ్ళకు విద్యనేర్పటమేకాదు, వాళ్లపక్షాన సహానుభూతితో న్యాయస్థానంలో

వాదించగలిగితే యెట్లా వుంటుందాఅని ఆలోచించేవారు. ముందు తాను విద్యావంతురాలై, తరువాత అజ్ఞాన అసహాయ స్త్రీలకు చేయూత నివ్వాలని ఆమె ఆకాంక్ష.

విడుదలయ్యేనాటికి ఆమె ఆరోగ్యం ప్రమాదకరంగా పరిణమించింది. తీవ్రరాజకీయాలలో పాల్గొనరాదని, ప్రశాంతంగ గడపాలని, డాక్టరుసలహా. రాజకీయ చర్చలు; సభల్లో వుపన్యాసాలు మానకపోయినా చదువువైపు ఆమె దృష్టి మరలించారు. బెనారస్ హిందూవిశ్వవిద్యాలయ మెట్రిక్యులేషను పరీక్షకు ప్రైవేటుగా వెళ్లి వుత్తీర్ణులయినారు. హాస్టలులోవుండి ఇంటర్‌మీడియట్ చదివారు. శ్రీ మదనమోహనమాలవ్యాగారు విరాళాలు సేకరించి స్థాపించిన విశ్వవిద్యాలయ భవనాలు, కన్నతండ్రిలాగ వాత్సల్యంతో అభిమానంతో విద్యార్థులను పరిరక్షించుతు విద్యాదానంచేయటం ఆమెకు కొత్తవూహలను కలిగించినవి. గాంధీజీ తరువాత ఆమెకు ఆదర్శమూర్తి శ్రీ మాలవ్యాజీ.

విశాఖపట్నంలో ఆనర్సుచదివారు. స్త్రీలకు ప్రత్యేక హాస్టలులేదు. ఎంతో అన్యాయం స్త్రీలకు జరుగుతున్నదని ఆమె హృదయం క్షోభించింది. ఐతే బాధపడుతుకూర్చోక, నిబ్బరంగా నిలబడి పదిమంది స్త్రీలను కూర్చుకుని హాస్టలు ప్రారంభించారు. ఒకసమస్యరావటం, ధైర్యంతో దానిని ఎదుర్కొని పరిష్కారమార్గం ఆలోచించటం ఆమె పద్ధతి.

మద్రాసులో లా చదివారు. ఆ సమయంలోనే అక్కడ ఆంధ్రమహిళా సభ నెలకొల్పారు. స్త్రీవయోజన విద్యావ్యాప్తికి కన్డెన్స్‌డ్‌కోర్సు ద్వారా కొద్ది కాలంలోనే మెట్రిక్యులేషను పరీక్షకు, ఇంటరు పరీక్షకు స్త్రీలు వెళ్లగల అవకాశాలు కల్పించారు. హిందీ పరీక్షలకు, కుట్టుఅల్లికలకు–నేతవంటి వృత్తివిద్యలలో పరీక్షలకు స్త్రీలకు శిక్షణయివ్వనారంభించారు. ఎంతోమందిస్త్రీలకు స్వతంత్రంగా తమకాళ్లపైతాము నిలబడగలశక్తి కలిగింది. మహిళాసభ తరఫున ఆంధ్ర మహిళ అనే మాసపత్రిక ఆరంభమయింది. స్త్రీలకు రచనావ్యాసంగంపట్ల ఆసక్తిపెరిగింది. స్వంతప్రెస్సును స్థాపించి మహిళలకు అచ్చుకూర్పు, బైండింగు వంటి వృత్తులలో ప్రవేశం కల్పించారు. గాంధీజీ స్వహస్తాలతో స్పృశించి దీవించిన ఫలకాలు మహిళాసభ స్వంతభవనాలకు పునాదివేసినవి. ఎందరో దాతలు ఔదార్యంతో వుత్సాహంతో నిండుమనస్సుతో భవనాలు కట్టించారు. చిన్నమాంబ విద్యా మందిరం, మల్లమదేవి హాస్టలు, రాజ్యలక్ష్మి మురళీ కృష్ణా

రావు ఇండస్ట్రియల్ సెక్షన్, ఆంధ్ర మహిళ ప్రెస్ భవనం నిర్మాణమైనై. నర్సింగుహోం, ఈశ్వరీప్రసాద దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటరు నెలకొన్నవి. వికలాంగుల చికిత్సలో వారికి విద్యావికాసాలు జీవనోపాధులు కల్పించటంలో ఆ విభాగం దేశంలో అత్యున్నత స్థాయిని అందుకున్నది. శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఎప్పుడు సభసభ్యులను, విద్యార్థినులను వివిధ శాఖల కార్యనిర్వాహకులను అభిమానంతో ఊతకలుపుకునేవారు. ఏమమ్మా? మనం యిట్లాచేద్దామా! ఆ పేరుపెడదామా! యీ పని ఆరంభించుదామా అంటువుంటే మిగతావారందరు తాముా స్వయంగా అంతా నిర్వహించుతున్నట్లే సంతృప్తులై నిస్సంకోచంగ పాటుపడేవారు. అట్లా సంస్థలను స్వతంత్రంగా, దిగ్విజయంగా నడపగల సమర్థులైన కార్యకర్తలను సృష్టించారు. ఒకదీపం పది దీపాలను వెలిగించినట్లే, పదిమందిని రంగంలోకిదించి కార్యసాఫల్యతను పొందగలనేర్పు ఆమెకు వెన్నతో పెట్టిన విద్య.

స్వతంత్ర భారతానికి అవసరమైన రాజ్యాంగ నిర్మాణానికి అర్హత వున్నలాయరుగా ఆమెను ఢిల్లీ ఆహ్వానించారు. ఆ సందర్భంలో స్త్రీలకు సమాన హక్కులు, వివాహ, విడాకుల, దత్తత విషయాలలో తగిన న్యాయం వంటి ముఖ్యవిషయాలు యెన్నిటినో ఆమె సూచించారు. సమర్థవంతంగా వాదించి అనేక సందర్భాలలో జయించారు.

ఆమెకున్న నిర్వహణాశక్తి గమనించిన భారత ప్రధానినెహ్రూజీ ఆమెను ప్లానింగు కమీషనులో మెంబరుగా తీసుకున్నారు. తనకున్న అనుభవాన్నిపట్టి, నామమాత్రావశిష్టంగావున్న సంఘసంక్షేమశాఖకు పూపిరిపోశారు. ఇంతింతై, వటుడంతై ముల్లోకాలు వ్యాపించినట్లు ఆ శాఖ ఒక ప్రత్యేక విభాగం అయ్యే పరిస్థితి సంభవించింది. సెంట్రల్ సోషల్‌వెల్‌ఫేర్‌బోర్డు అవతరించింది. ఆమె దానికి ఛైర్మన్ అయినారు. అంతకుకొద్దికాలంముందే కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ చింతామణ్ దేశ్‌ముఖ్‌తో ఆమె వివాహంజరిగి, అటు రాజకీయ రంగంలో పెద్దలు యిటు సంఘసేవా రంగంలో నిష్ణాతులు సంతోషించారు.

సెంట్రల్ సోషల్‌వెల్‌ఫేర్‌బోర్డు అధ్యక్షులుగా ఆమె, కనివిని యెరగని సేవచేశారు. స్వచ్ఛందసేవా సంస్థలకు అండగానిల్చి స్త్రీ జనాభ్యుదయానికి ప్రత్యేకప్రణాళికలద్వారా నిర్మాణాత్మకమైన కార్యకలాపాలను నెరవేర్చారు.

స్వతంత్ర జీవనోపాధులు వివిధ రంగాలలోను స్త్రీలకు కలిగినవి. ఢిల్లీలో ఆంధ్రఎడ్యుకేషనుబోర్డు నెలకొల్పి విద్యాలయాలు, కాలేజీలు స్థాపించగలిగారు. దృష్టిలోపించినవారి సౌకర్యార్థం వసతులు కల్పించటంలో సహకరించారు.

ఆంధ్రరాష్ట్రంవచ్చింది. హైదరాబాదులో ఆంధ్ర మహిళాసభశాఖ అవతరించింది. ఆంధ్ర మహిళాసభ నర్సింగుహోంలో పుట్టిన పాప-శిశు విహార్‌లో, విద్యాలయంలో, కాలేజీలో, చదివి పట్టభద్రఅయి బి.యిడి. కాలేజీలోటీచరుగా పట్టంపొందవచ్చు, లేదా నర్సుగానో, ప్రెస్సులోనో, చేతిపనుల శాఖలోనో జీవనోపాధికి అవకాశం వున్నది. లిటరసీహౌస్ తరపున దక్షిణ భారతదేశానికంతకీ నాన్‌ఫార్మల్ విధానంలో విద్యావ్యాప్తి జరుగుతున్నది. సంగారెడ్డి, మహబూబ్ నగరు, షాద్‌నగరులలో కూడ ఆంధ్ర మహిళాసభ శాఖలు నెలకొల్పి ఆడపిల్లలకు హైస్కూళ్లు, సహాయక మంత్రసాని, నర్సు ట్రెయినింగు కోర్సులు ప్రారంభించారు.

ఇన్ని కమటాలువున్నా చిన్నప్పుడు తెలుగులో 'లక్ష్మి'వంటి నవలలు వ్రాసిన రచయిత్రి శ్రీమతి దుర్గాబాయమ్మగారు యిప్పుడు డజన్లలెక్కన ఇంగ్లీషులో వుద్గ్రంథాలు సంఘసంక్షేమం గురించి, సమాజ అభ్యుదయంగురించి అంతర్జాతీయస్థాయిలో వ్రాస్తూవుంటారు. ఆమె బహిఃప్రాణం ఆంధ్రమహిళా సభ. అందువల్ల దాని, సవిస్తరచరిత్రను 'The stone that speaketh' అనే పేరుతో వ్రాశారు. స్వచ్ఛందసేవ పెరగగలయెత్తుకు, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ సామర్థ్యానికి అదొక శిలాశాసనం కాగలదు.

మహాత్మా గాంధీ, కస్తూర్బా గాంధి శతజయంత్యుత్సవాల సందర్భంగా స్త్రీల, పిల్లల శాఖతరపున కార్యనిర్వాహకురాలిగా సహకరించమని రాష్ట్ర ప్రభుత్వం శ్రీమతి దుర్గాబాయిని కోరింది. కార్యక్రమాలకు రెండులక్షల డబ్బును కూడ కేటాయించారు. కేవలం ఏవో సభలు సమావేశాలు, నినాదాలు, నాటకాలు, పాటకచేరీలతో తాత్కాలిక కార్యకలాపాలు జరపటం ఆమెకు గిట్టదు. ఆంధ్రదేశం నాలుగు మూలల గాంధీ దంపతుల దివ్యస్మృతి చిహ్నంగా స్త్రీలకు పిల్లలకు, శాశ్వత విధానంలో సేవ జరగాలి. ఒక భవన మంటు వుంటే యే సహృదయులో పూనుకుని నిర్మాణాత్మకమైన సేవ చేయగలరని ఆమెకు గట్టినమ్మకం. అందువల్ల సేవాపరాయణులైన సహచరులతో విరాళాలు వసూలు చేసి ఆంధ్ర రాష్ట్రంలోని పదుకొండు జిల్లాలలో గాంధీ

భవనం అనో బా-బాపు మందిరం అనే పేర్లతో పక్కా భవనాలు కట్టించారు. కాని నెల్లూరు, అనంతపురం జిల్లాలో మాత్రం కలెక్టర్ల వంటివారు పూనుకున్నా ప్రజా సహకారం దొరక్క భవన నిర్మాణం చేయించలేక పోయినారు. కాని వాటి వంతు డబ్బు వాటికై యీనాటికీ యెదురుచూస్తున్నది.

స్వాతంత్ర్య సమరంలో వేలకొద్ది ఆంధ్ర మహిళలు పాల్గొని వీరవిహారం చేశారు. వెయ్యిమంది స్త్రీలు ఆమెతో పాటు జైలుశిక్షలే అనుభవించారు. వారందరి త్యాగమయ వీరగాథలను మరచిపోతున్న నేటివారికి అసలు తెలియని భావి తరాలవారికి తెలియచెపుతు శాశ్వతంగా నిల్చేట్లు పుస్తక రూపం యివ్వాలని ఆమె తపన. కారణాంతరాలవల్ల జైలుకు వెళ్లక పోయినా అమాల్యము అసాధారణమైన దేశసేవ సమాజ సేవ చేసిన స్త్రీలన్నా ఆమెకు చాలా గౌరవం. తను జీవించి వుండగా యీ గ్రంథ రచన జరగకపోతే ఆతరవాత యెవరికీ ఇటువంటి విషయాలు పట్టవు. యింతమంది వుజ్జ్వలగాథలు మరుగున పడిపోగలవని ఆమె వ్యథ-వందలకొద్ది పేర్లను వారి వివరాలు సేకరించటానికిగల మార్గాలను, అవకాశాలను, వారి బంధు మిత్రుల వివరాలను, అమూల్యవిషయ సేకరణకు తోడ్పడగల ప్రఖ్యాతవ్యక్తులను యెప్పటి కప్పుడు ఫైళ్లకెక్కించేవారు. అంతర్జాతీయ, జాతీయ, రాష్ట్రప్రముఖలతో సంస్థల విషయమై ఫోన్లమీద మాట్లాడుతు, చర్చించుతు, మధ్య మధ్యన యెంతో జ్ఞాపకంగా అభిమానంగా దేపులపల్లి సత్యవతమ్మగారి ఫొటో వచ్చిందా-జయంతి సూరమ్మగారి వివరాలు పూర్తిగా అందినవా అంటు ప్రశ్నించేవారు. మరుక్షణం యే డాక్టరునో ప్రొఫెసరునో మీ బామ్మగారు యేపూళ్లో పుట్టారో చెప్పగలరా అని ఫోన్‌లో నిలవేసేవారు. ఆమె కృషి, పట్టు అటువంటివి. ఒక్కొక్కటిగా కొన్ని సంపుటాలు వెలువరించాలని, గాంధీ మహాత్ముడికి అంకితం చేయాలని ఆమె కోరిక.

ఆమె స్వయంసిద్ధ. ఆత్మధృతితో, విడని పట్టుతో, సంకల్పసిద్ధి పొదిన ధన్యజీవి. జాతీయస్థాయిని అధిగమించి అంతర్జాతీయ మన్ననలను పొందటానికి ముఖ్యకారణం స్త్రీజనాభ్యున్నతి పట్ల ఆమెకు గల సహానుభూతి. స్వాతంత్ర్య సమరయోద్ధగా, భారత రాజ్యాంగ చట్ట రచనా సహకారిణిగా, సేవాసంస్థల పట్టుకొమ్మగా విశ్వవిఖ్యాత విద్యావేత్తగా శాశ్వత కీర్తిని పొందిన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ 1981 మే 9న అమరత్వంపొందారు.

---

# శ్రీమతి ఓరుగంటి మహాలక్ష్మమ్మ

జననం 1884 మరణం 1945

**1930** లో శ్రీమతి సరోజినీనాయుడు జగ్గన్నపేట స్త్రీల సమావేశంలో మాట్లాడుతు "లేనిపోని హక్కులను సృష్టించకండి. తక్కువవారి మనేభావం పారదోలండి. మానవసేవతో నూతన నాగరిక ప్రపంచాన్ని నిర్మించండి." అని సలహా యిచ్చారు. ఆమె వెల్లడించిన వున్నత భావాలకు చక్కని రూపకల్పన శ్రీమతి ఓరుగంటి మహాలక్ష్మమ్మగారి ఉజ్జ్వలగాధ.

తెలుగుదేశాన, నెల్లూరుజిల్లాలో కావలి ఒకసామాన్యమైన వూరు. అక్కడ 1884లో సంపన్నులయిన శ్రీ తూములూరి శివకామయ్య, శ్రీమతి రమణమ్మగార్ల కనిష్ఠ కుమార్తెగా ఆమె జన్మించారు. చదువుకోవటానికి ఆడపిల్లలకు బడి అంటూ లేనికాలం అది. ఇంట్లోనే చదివి చక్కని పాండిత్యం సంపాదించి, వుత్తమ గ్రంథాలు అనేకం చదివారు. ఆనాటి ఆచారాన్ని పట్టి 1895లో పదకొండవయేట ఆమెకు శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యతో వివాహం అయింది. వారిదీ సంపన్న కుటుంబమే. కావలిలో నిరతాన్న దాతలుగా పేరువున్నది. అప్పటికి హైస్కూలులో చదివే అబ్బాయే అయినా తరువాత తాత, తండ్రులలాగ ఆయనా లాయరయినారు. ఆయనకు చదువుకునే రోజులనుంచి ఆయుర్వేదమంటే విపరీతమైన అస్త. స్వయంగా ఆయుర్వేదమందులు తయారుచేసి అమ్ముతు, వైద్యం చేస్తు వుండేవారు. ఆయనకా అభిమానం యెంతవరకు వెళ్లిందంటే 92 ఏళ్ల పండు వయసులో కుదురుగా కూర్చుని "ఆయుర్వేదయోగసింధు" అనే వైద్య గ్రంథాన్ని సృష్టించారు. వైద్యాభిరుచికి జతగా చిన్ననాటినుంచి దేశాభిమానం హెచ్చు. తనకు తెలిసిన విషయం నలుగురూ తెలుసుకొని, మంచికూడ నలుగురు అనుభవించాలన్న వుద్దేశంతో తన భావాలు విడమరిచి యితరులకు నచ్చచెప్పే స్వభావం ఆయనది. ఫలితంగా సంసారంలో ప్రవేశించటంతో పాటే రాజకీయాలలోను, భర్త ఆశయాలలోను ప్రవేశించారు. ఆమెకూ దేశాభిమానం, సేవాభావం, జాలి, స్వతస్సిద్ధంగా వుండటంతో యేమాత్రపు

అరమరిక లేకుండ యిట్టే ఆ వాతావరణంలో యిమిడిపోయినారు. ఆమె స్వయంగా వండి, ఆర్తితో అన్నదానం చేసేవారు. బాధల్లో కష్టాల్లో వున్న వారికి సేవ చేయటం, చేయూతనివ్వటం ఆమెకు తృప్తి.

1899 నుంచే ఆమె విదేశీ బట్టలను బహిష్కరించి స్వదేశీ బట్టలు కట్ట నారంభించారు. అంటే చేనేతబట్టలన్నమాట. అప్పటికింకా ఖాదీ అంటే యేమిటో యెవరికి తెలియదు. నిజానికి గాంధీజీ భావనలో కూడ ఖాదీలేదు. ఆయన అప్పటికింకా దక్షిణాఫ్రికాలోనే వున్నారు. కాని తిలక్ మహాశయుడు విదేశీవస్తు, వస్త్రబహిష్కరణ, స్వదేశీవస్తు, వస్త్రఅభిమానం స్వాతంత్ర్య సంపాదనకు చాలా ముఖ్యమని ప్రజలకు బోధించారు. ఇంగ్లండులో తయారయివచ్చే బట్టలకన్న మిల్లునూలుతో భారతీయులు చేనేతమగ్గాలమీద నేసిన బట్టలు శ్రేష్టమేకదా. ఆనాటి పరిస్థితులలో అవే స్వదేశీబట్టలు. శ్రీమతి మహాలక్ష్మమ్మ గారు ఆ స్వదేశీ బట్టలు ధరించటమేకాక కావలిలో స్వదేశీ వస్త్ర విక్రయశాల నొకదానిని స్థాపించారు. చక్కని రంగులలో మంచి జరీ పనితనంతో లక్ష్మీ ప్రదమైన బట్టలు ఎంతోమందికి అందుబాటులోకి వచ్చినవి. నేతపనివల్ల చాలామందికి జీవనోపాధి యేర్పడింది. ఆమెకదే పండగ.

ఇంతలో 1905లో బెంగాలు రాష్ట్రవిభజన జరిగింది. అది ప్రజలను మరింత వుద్రిక్తపరచి పరప్రభుత్వం పట్ల విముఖత్వం కలిగించింది. ఇక బహిరంగంగా జాతీయోద్యమ ప్రచారం చేయవలసి వచ్చిందని శ్రీమతి మహాలక్ష్మమ్మ ఆమె భర్త గుర్తించారు. సంగీత సమాజం, భజనమండలి స్థాపించి వాటి సహాయంతో నగర సంకీర్తనం చేస్తూ నాలుగురోడ్ల కూడలిలో వుపన్యసించుతు ఎంతో చక్కని ప్రచారం చేశారు. శ్రీ తిలక్ మహాశయుడు గణపతి వుత్సవాలవంటి పర్వదినాలలో ప్రచారంచేయటం ఆ దంపతులకు బాగా నచ్చివుంటుంది. ఏమైనప్పటికి కావలిలో కనివిని యెరుగని ప్రయోగం యిది. ఆమెకింకా తృప్తి కలగలేదు.

ఏ పని అయినా అందరూ పూనుకుని చేసినప్పుడే విజయవంతం అవుతుంది. దేశవ్యాప్తంగా స్త్రీలు కూడ పరిస్థితి గ్రహించి జాతీయోద్యమంలో చేరాలి. తగిన చైతన్యం కలిగించటానికి 1910 లో ఆమె కావలిలో మహిళా సమాజం నెలకొల్పి కార్యదర్శినిగా భారం వహించారు. బొంబాయి కలకత్తాల వంటి పెద్ద పట్టణాలలో అయితే యిది సామాన్యవిషయమేమో. కాని కావలి

వంటి చిన్న వూళ్లో యిప్పటికి 70 ఏళ్ల కిందట మహిళాభ్యున్నతికోసం ప్రయత్నించటమే వింత విషయం. ఇక మహిళా సమాజంవంటి సరికొత్తస్థాపన యెంతటి అపూర్వ విషయమో వూహించుకోవచ్చు. ఆమెకున్న ఆత్మ విశ్వాసం, మహిళాభ్యున్నతిపట్లగల ఆస్త, దేశభక్తి అంతటివి.

సర్వ అనర్థాలకు మూలం అజ్ఞానం. విద్యతోటే అజ్ఞానం అంతరించుతుంది. మరి నెల్లూరుజిల్లా మొత్తంమీద ఒకటి రెండు మిషనరీ స్కూళ్లతప్ప ఆడపిల్లలకు బడి అంటులేదు. స్వయంగా పూనుకుని ఆమె 1912 లో కావలిలో బాలికా పాఠశాల స్థాపించారు. తమ యింట్లోనే ఒక రాత్రి పాఠశాలను ఆరంభించారు. ఏ పని చేసినా పదిమందికి ప్రయోజనకరంగా వుండాలి. నవసమాజ నిర్మాణానికి దారితీస్తు వుండాలి. ఆమె మానసిక పరిణితికి యివన్నీ సూచనలు.

1914-15 ప్రాంతాలలో కర్నూలులో శ్రీ ముత్తరాజు వెంకట కృష్ణయ్య బాలవితంతువైన తమ కుమార్తెకు పునర్వివాహం చేశారు. మహిళాభ్యున్నతికి సదా ప్రయత్నించుతున్న శ్రీమతి మహాలక్ష్మమ్మ కి విషయం యెంతో సంతోషం కలిగించింది. ఆమె ఆ మంచి పనికి తగిన ప్రచారం యివ్వాలన్న తలంపుతో ఆ కుటుంబాన్ని కావలికి ఆహ్వానించి పెద్ద పెట్టున వనభోజనాలు యేర్పాటు చేశారు. అంతటితో లంక అంటుకున్నది. స్వాములవారు ఆంక్షాపత్రాన్ని పంపించారు. ఆమె పుట్టింటివారు కూడ ఆమె కుటుంబాన్ని వెలివేశారు. ఆమె చలించలేదు. మరికొంత కాలానికి కాశీవిద్యాపీఠంలో చరిత్ర, ఆయుర్వేద, వేదాంత, వ్యాకరణ అలంకార శాస్త్రకోవిదుడైన తమ మూడవ కుమారునికి ఒక బాలవితంతువునిచ్చి మద్రాసులో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి సమక్షాన శాస్త్రోక్తంగ వివాహం జరిపించారు. నమ్మినది చెప్పటం చెప్పిందిచేయటం ఆమె పద్ధతి.

1917 నాటికి శ్రీ వెంకటసుబ్బయ్యకి న్యాయవాద వృత్తిపైన విముఖత్వం కలిగింది. సంపూర్ణంగా దేశసేవలోనే గడపాలనుకున్నారు. కుటుంబం నెల్లూరు తరలింది. మద్రాసులో శ్రీమతి అనిబిసెంటు కొత్తగా హోంరూలు వుద్యమం స్థాపించిన రోజులవి. శ్రీ వెంకటసుబ్బయ్య నెల్లూరులో హోంరూలు లీగ్ స్థాపించారు. శ్రీమతి మహాలక్ష్మమ్మ ఆ బేడ్జి ధరించి తీవ్రంగ వుద్యమ ప్రచారం చేశారు. ఊరంతా హోంరూలు బాడ్జీలే.

కాంగ్రెసు సంస్థలో విరివిగా స్త్రీలుచేరి, క్రమబద్ధంగా జాతీయోద్యమంలో పాల్గొనేట్లు చేయటం ముఖ్యమని ఆమె తలచారు. శ్రీమతి పొణకా కనకమ్మ వంటి స్త్రీలతో కలసి 1921లో నెల్లూరులో కాంగ్రెసు సంఘ మహిళావిభాగం స్థాపించారు. ఆమె అధ్యక్షురాలు. శ్రీమతి కనకమ్మ కార్యదర్శిని. ఆనాటినుంచి వారిద్దరిమధ్య సన్నిహితత్వం యేర్పడి ప్రతిపనీ కలిసి చేస్తువుండేవారు. జాతీయవిధానంలో విద్య నేర్పటానికి కస్తూరిదేవి విద్యాలయం స్థాపించారు. దానిని గురించి గాంధీజీ నెల్లూరులో ముఖ్యాతి ముఖ్యమైన చూడతగిన స్థలం కస్తూరిదేవి విద్యాలయం అన్నారు. వివిధ విభాగాలతో అభివృద్ధి చెందిన ఆ బాలికాపాఠశాల యీనాడు కాలేజీగా రూపొందింది.

1921లో గాంధీజీ పూరించిన స్వాతంత్ర్య శంఖారావం వేలజనాన్ని రణరంగంలోకి దూకించింది. మొదటినుంచి ఆ వుద్యమంలోనే వున్నవారు నాయకత్వం వహించి వుద్యమం నడిపించారు. శ్రీమతులు మహాలక్ష్మమ్మ, తిక్కవరపు సుదర్శనమ్మ, కందాళై యతిరాజమ్మగార్లు ఎల్లాయిపాలెం, బుచ్చిరెడ్డిపాలెం వంటి గ్రామాల్లో సంచారంచేసి ఖాదీప్రచారం, మద్యపాననిషేధ ప్రచారం చేశారు. శ్రీ వెంకట సుబ్బయ్య, వెన్నెలగంటి రాఘవయ్య, తిక్కవరపు రామిరెడ్డిగార్ల వంటివారేకాక స్త్రీలు కూడ పాల్గొని ప్రచారం చేయటంతో రెండులక్షల పైచిలుకు రాబడిగల అబ్కారీవిభాగ ఆదాయం బొత్తిగా రెండు వందలకు దిగజారిపోయింది. అది ప్రభుత్వానికి సహించరాని నష్టం, అవమానం.

శ్రీమతి మహాలక్ష్మమ్మగారి కుటుంబం యావత్తు ఖాదీ ధరించటమేకాక నూలు వడికేవారు. ఆనాటికి చిన్నపిల్లఅయిన ఆమె మూడవ కుమార్తె శ్రీమతి మైత్రేయి నూలువడకటం పోటీలో బంగారు పతకం బహుమతిగా గెల్చుకున్నది. కావలిలో చేనేత వస్త్రాలయ స్థానంలో ఖాదీ విక్రయశాలను స్థాపించారు. నూలు వడకటం, నేయటం ద్వారా యెంతోమందికి జీవనోపాధి యేర్పడింది. ఉత్పత్తి అయిన ఖాదీబట్టలను భుజాన పెట్టుకొని జాతీయగీతాలు పాడుకుంటూ శ్రీమతి మహాలక్ష్మమ్మగారు యిల్లిల్లు తిరిగి అమ్మేవారు.

ఈ దేశ సేవా కార్యకలాపాలలో వున్నా ఆమె మానవసేవ మానలేదు. 1927లో నెల్లూరు తుఫాను సందర్భంలోను, కావలిలో కలరావ్యాధి ప్రబలిన

సందర్భంలోను, 1928లో కావలిలో పేదలయిళ్లు కాలిపోయి నిరాధారులయి నప్పుడు ఆమె స్వయంగా పూనుకొని తిండి పదార్థాలు బట్టలు మందులు మాకులు సేకరించి వారిని ఆదుకున్నారు.

1930లో ఉప్పు సత్యాగ్రహం రానే వచ్చింది. శ్రీ వెంకటసుబ్బయ్య నాయకత్వం వహించారు. మైపాడు, తుమ్మలపెంట, గోగుల పల్లెలలో పెద్దపెట్టున సత్యాగ్రహం జరిగింది. శ్రీమతులు మహాలక్ష్మమ్మ, కనకమ్మ గార్లు తోటి స్త్రీ లనేకమందిని కూర్చుకుని ముందువరసన నిలిచారు. ఆ వీరావేశానికి ఉత్సాహానికి అవధులులేవు. ఫలితంగా అరెస్టయినారు. ఆరునెలలు జైలుశిక్ష అనుభవించటానికి రాయవేలూరు వెళ్లారు. రాయవేలూరు జైలు రాజకీయ బందీలైన స్త్రీలతో నిండివున్నది. ఆ స్త్రీలకది జైలూకాదు, వారను భవించేది శిక్షాకాదు. మహిళలకది విజయలాస్యం. శిక్షాకాలం యిట్టే గడిచి పోయింది. 1930 డిశంబరు 26న విడుదల అయివచ్చారు.

స్వాతంత్ర్య సమరంలో కొత్త సాహసంతో మళ్ళీ ప్రవేశించారు. ఖాదీ ప్రచారం, మద్యపాననిషేధం, విదేశవస్తు, వస్త్ర బహిష్కారాలతో పాటు అస్పృశ్యతానివారణ వుద్యమంకూడ ఆరంభించారు. జాలి, సహానుభూతి, సంస్కరణ భావాలు సహజంగావున్న ఆమె క్రమబద్ధంగా హరిజనసేవ చేయ సాగారు. 1932లో శాసనోల్లంఘనం రెండవకెరటం దేశాన్ని ముంచెత్తింది. పాతపద్ధతి ననుసరించి ఆమె బహిరంగోపన్యాసాలు యిచ్చారు. నెల్లూరు శ్రీరంగనాయకస్వామి తిరుణాల సందర్భంలో జనసందోహం మధ్య వుపన్య సించుతు వుండగా ఆమెను అరెస్టు చేశారు. దుకాణాల దగ్గర పికెటింగు చేస్తుండగా అరెస్టు చేసినట్లు కేసు బనాయించి ఒక సంవత్సరం శిక్ష విధించి రాయవేలూరు పంపించారు. ఆమె కక్కుడ నరాల బలహీనత యేర్పడి పక్షవాతంగా పరిణమించింది. అందువల్ల శిక్షాకాలం పూర్తికాకుండానే 1932 ఆగస్టు 27న విడుదల చేశారు. ఆమెకాజబ్బు ఒకసారికాదు రెండుసార్లుకాదు ఐదుసార్లు వచ్చింది. భర్త వైద్యంతో కోలుకో గలిగారు.

ఆమె బహు కుటుంబిని. నలుగురు కుమారులు నలుగురు కుమార్తెలు. పరాయివారిని తనవారిగా భావించి చేయూతనివ్వటమే తప్ప యే పరిస్థితిలోను ఎవ్వరిని పరాయిగా భావించలేదు. శ్రీమతి కస్తూర్బాగాంధీ అనుక్షణం మహాత్మాగాంధీ అడుగుజాడలలో నడిచి సేవాకలాపాలలో పాల్గొన్నట్లే

ఆమె ప్రతిరంగంలోను భర్త వెంట నీడలాగ వ్యవహరించారు. బిడ్డలను విద్యావంతులు దేశభక్తులుగా తయారుచేశారు. ఆమె సత్యాగ్రహోద్యమంలో సకుటుంబంగ పాల్గొన్నారు. దంపతులేకాక యిద్దరు కొడుకులుకూడ జాతీయోద్యమంలో జైలుకువెళ్లారు. 1942లో ఆమె అనారోగ్యంగావున్న సమయంలో భర్త 3వ సారి జైలుకు వెళ్లటం తటస్థించింది. ఆ దుర్బల స్థితిలో ఆమె దానిని పూర్వంలాగ భరించలేకపోయినారు. మతి చలించింది. మరి మామూలు స్థితి పొందలేకపోయినారు. 1945లో స్వాతంత్ర్యసిద్ధికి ముందే ఆమె కన్ను మూశారు. ఆమె బహుముఖ సేవాపరాయణి. నిరాడంబర దేశసేవిక. హృదయంగల సంస్కారిణి. సహానుభూతిగల సంఘసేవిక.

# శ్రీమతి కోటమర్తి కనక మహాలక్ష్మమ్మ

జననం 1873 మరణం 1960

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకాలో శృంగవృక్షం ఒక గ్రామం. 1930 వ సంవత్సరం జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలంలో శ్రీ కరిదిండి వెంకట రామరాజు యింటిముందుగల పెద్ద ఖాళీస్థలంలో బహిరంగసభలు జరుగుతుండేవి. ఆనాడు జూన్ 10 వ తేదీ అయివుండవచ్చు. సాయంత్రం ఏడుగంటలకు బహిరంగసభ జరుగుతుందని తెలిసిన జనం ఆరుగంట లకే కిక్కిరిసి పోయినారు. ప్రక్క పల్లెల నుంచికూడ వచ్చారు. శ్రీమతి కోటమర్తి కనక మహాలక్ష్మమ్మగారు ఆనాడు వుపన్యసించుతారని తెలియటమే ఆ జనాకర్షణకు కారణం. సాధారణంగా ఆమెను కనకమ్మగారు అనే పిలిచేవారు. ఏభై సంవత్సరాలకు పైబడిన బ్రాహ్మణ వితంతువు ఆమె. తెల్లని ఖాదీపంచె ముసుగు ధరించి కట్టుకునేవారు. తన వుపన్యాసాలలో ఆమె రాజకీయాలను వర్ణించరు, దేశ ఆర్థిక వనరులను గురించి మాట్లాడరు. ఆమె కవన్నీ నిజానికి అంతగా తెలియవుకూడ. కాని శ్రోతల హృదయాలను ఆకట్టుకోవటం ఆమెకు బాగా తెలుసు. ఆమె మాటల్లో వారికి ఆదరణ కనబడుతుంది. అధికారం వినపడుతుంది. ప్రబోధం ప్రచారం వుంటుంది.



శ్రీమతి కోటమర్తి
కనక మహాలక్ష్మమ్మ

ఆమె పేరు కనకమ్మగారయినా కంఠస్వరం కంచుగంట. వేదికనెక్కి పురాణాలలోని పద్యాలు, శ్లోకాలు రాగవరుసలలో సందర్భోచితంగా దొర్లించి వేస్తుంటే నాటకం చూస్తున్నట్లు సభికులు తన్మయులయ్యేవారు. దేశభక్తి

గీతాలుపాడుతూవుంటే సంగీత విద్వాంసులు సంగీత కచ్చేరి చేస్తున్నట్లువుండే ఉపమానాలతో సామాన్యుల కష్టాలు వర్ణించుతుంటే ప్రజాజీవితానికి అద్దం పట్టినట్లు వుండేది. పరప్రభుత్వపు దౌర్జన్యాలను, దురాగతాలను దుయ్యబడుతుంటే నిర్భీతి నిర్మొగమాటం వుట్టిపడేవి. అందుకే శ్రీమతి కోటమర్తి కనకమహాలక్ష్మమ్మగారి వుపన్యాసాలు వినటానికి ప్రజలు తండోపతండాలు గంటముందే హాజరయేవారు.

అనుకున్న ప్రకారం సభప్రారంభమయింది. అసంఖ్యాకులైన సభికులను చూసి ఆమె ఉప్పొంగిపోయినారు. జడివానలాగ వుపన్యాసం సాగిపోతున్నది. మంత్రముగ్ధులై వింటున్నారు ప్రజలు. ఊహించినట్లుగానే అక్కడికి పోలీసుల లారీ వచ్చింది. కొంతమంది పోలీసులు అక్కడక్కడ సమావేశం చుట్టు గబగబ నిల్చున్నారు. ఇద్దరు ముగ్గురు జవాన్లతో అధికారి వేదిక చేరుకున్నాడు. ఏదో చెప్పబోతు వుండగానే ముందు వరుసలో కూర్చునివున్న సుప్రసిద్ధ జాతీయవాది, లాయరు అయిన శ్రీ ముష్టిలక్ష్మీనారాయణ లేచినిలబడి పోలీసు అధికారితో "అయ్యా నమస్కారం. వుపన్యాసం మంచిరసవత్తరంగా సాగుతున్నది. ఇట్లా సభలు ఏర్పాటు చేసుకుని భావాలు వెళ్లబుచ్చుకోవటం ఒక్కటే ప్రస్తుతం యీ పరిపాలనలోవున్న స్వేచ్ఛ. మీరు దానిని కూడ తీసివేయకండి. ఉపన్యాసం ముగియనిచ్చి మీ విధినిర్వహణను మీరుచేసుకోండి'' అని అన్నారు. ఒకఖాళీకుర్చీ చూపించగా పోలీసు అధికారికూడ కూర్చున్నాడు. సభ చెల్లాచెదురు కాకుండ వుండాలన్న ఉద్దేశ్యంతో శ్రీమతి కనకమ్మగారు మరింత స్థాయిపెంచి ''అయ్యా మీరందరు తల్లిభారతమాతను దాస్యంనుంచి తప్పించడానికి కంకణం కట్టుకున్న వీరభారతీయులు. ఆ పోలీసులను చూచి బెదరకండి, వాళ్లు మనసోదర భారతీయులే. పాపం పొట్టకోసం పిరికిగా పరులకు దాస్యం చేస్తున్నారు. ఇటువంటివారి పిస్తోలు గుళ్లకు పెసరంతకూడ పసఉండదు. ఏమయ్యా ఇన్‌స్పెక్టరు మీ తుపాకిగుండు గట్టిదో, నా బోడిగుండు గట్టిదో చూస్తావా'' అంటూనె త్రివిూది ముసుగు తొలగించి తలముందుకు వంచారు. సభంతా ఒకేచప్పట్లు కేకలు భారతమాతకుజై, మహాత్మాగాంధీకిజై, కోటమర్తి కనకమ్మగారికిజై అనే నినాదాలతో మైదానం మార్మ్రోగింది. మరికొంత సేపటికి శ్రీమతి కనకమ్మగారు అరెస్టు అయి పోలీసులారీలో వెళ్లిపోయినారనుకోండి.

1928–42 మధ్య దాదాపు 14, 15 సంవత్సరాల కాలం శ్రీమతి కనకమ్మగారు ఉధృతంగా రాజకీయాలలో పాల్గొన్న సమయం. ఆ రోజుల్లో పైన చెప్పిన సంఘటనల వంటివి ఆమెకు మామూలు విషయాలు అయిపోయినవి. ఆ కాలంలో కాంగ్రెసు సంస్థనడిపే ప్రతిఉద్యమంలోను ఆమె పాల్గొన్నారు. పశ్చిమ గోదావరిజిల్లాలో, అందులో ముఖ్యంగా భీమవరం తాలూకాలో హరిజనోద్ధరణ, విదేశ వస్తుబహిష్కరణ, మద్యపాన నిషేధం, ఖాదీ ప్రచారం, ఉప్పు సత్యాగ్రహం రాజకీయ ప్రబోధం వంటివి ఏవి జరిగినా ఆమె పాత్ర చాలా ముఖ్యమైనదిగానే ఉండేది. ఆమె ప్రదర్శించే ఉత్సాహం, ఉద్రేకం, విప్లవ ధోరణి, వివేచనాశక్తి, తెగింపు, త్యాగం, ఓర్పు, నేర్పు–తోటి స్త్రీలకేకాక పురుషులకు కూడ మార్గదర్శకంగా ఉండేవి.

శ్రీమతి కనకమహాలక్ష్మమ్మ పుట్టిపెరిగిన వాతావరణానికి ఆమె జీవితం నడిచినమార్గానికీ ఎక్కడా పొంతన కుదరదు. భీమవరంలో గునుపూడి ఒక పేట. శ్రీ వేలూరి లక్ష్మీనారాయణ, శ్రీమతి వెంకమ్మగార్లకు 14వ సంతానంగా కడగొట్టు బిడ్డగా జన్మించారు శ్రీమతి కనకమహాలక్ష్మమ్మ. ఆమె తండ్రి సంస్కృతాంధ్రాలలో గొప్పపండితుడు. శ్రోత్రియుడు, పరమ ఛాందసుడు, యజ్ఞం చేసిన సోమయాజి. ఆమెకు ఐదవఏటనే శ్రీ కోటమర్తి సూర్యనారాయణతో వివాహం జరిగింది. శ్రీ సూర్యనారాయణకి అది రెండవ వివాహం. దాదాపు 40 సంవత్సరాల వయస్సు. మనకు యిప్పుడు వినటానికి నవ్వొచ్చినా పెళ్లి సమయంలో ఆ ఐదేళ్ల అమ్మాయి పేచీ పెడితే పాపం ఆయన ఎత్తుకు ఆడించినట్లు చెప్పుకుంటారు.

అగ్రహారికుడూ, మర్యాద, పలుకుబడి, సిరిసంపదలు గల శ్రీ సూర్య నారాయణ మామగారిని మించిన పరమ ఛాందసుడు. కాని పండితుడు. అందువల్ల వారింట్లో ప్రతినిత్యం పురాణ పఠనాలు, సత్కథాకాలక్షేపాలు; ఛాందస పండితుల చర్చలు జరుగుతు ఉండేవి. పుట్టినప్పటినుంచి వినివిని ఆమెకు భారత భాగవతాది పురాణాలన్నీ కొట్టినపిండి అయినవి. మంచి ధారణా శక్తి ఉండటాన నోటికిరాని పద్యం, శ్లోకం లేవు. పుట్టింటి నుంచి సంక్రమించిన కర్ణాటక శాస్త్రీయ సంగీతం జతపడటంతో పద్యాలు, శ్లోకాలు అర్థ యుక్తంగా, ఇంపుగా చక్కగా ఆనర్గళంగా పాడగల శక్తి అబ్బింది. ఎన్నో పాటలు, పద్యాలు కూడ వ్రాసారు. సులువుగా అర్థమయ్యే ఉపమానాలతో

తనకు తెలిసిన విషయాలను సహజంగా ఉండేటట్లు కథలు చెప్పటంలో ఆమె దిట్ట. అలవడిన విజ్ఞాన మనోవికాసాలతో బయటకి వ్యక్తం చేయలేకపోయినా లోలోపల విప్లవభావాలు చెలరేగేవి. అప్పటికి ఆమె వయస్సు ముప్పయి సంవత్సరాలైనా లేవు. ఐదుగురు బిడ్డలు, ఆరవ బిడ్డ పుట్టే కొద్దిరోజుల ముందుగా వైధవ్యం ప్రాప్తించింది.

పుట్టింటికి భీమవరం చేరుకున్నారు. కాని ఆమెకు అక్కడ ఆశించిన ఆప్యాయత, ఆదరణ కరువైనవి. ఆమె అహం దెబ్బతిన్నది. అంతవరకు అంతర్యూతంగావున్న విప్లవభావాలు యధేచ్ఛగా బయటకి రాసాగినవి. స్వతంత్రకాంక్ష బలపడింది. గుండెబలం, పట్టుదలవుంటే ఈ విశాలప్రపంచంలో మనుగడకు మార్గాలు వుండకపోవు అనే నిర్ణయానికి వచ్చారామె. నాగరికతా ప్రపంచంతో సంబంధం లేకుండా మారుమూలవున్న అత్తవారిఊళ్లో ఆ పరమ ఛాందస వాతావరణంలో బిడ్డలకు తగిన అభివృద్ధివుండదు. అందువల్ల తన విప్లవభావాలు, స్వతంత్ర జీవితేచ్ఛ బంధువర్గానికి రుచించకపోయినా భీమవరంలోనే ఒక కుటీరం నిర్మించుకుని పిల్లలతో అక్కడే స్థిరపడిపోయినారు. జీవితాంతం అక్కడే గడిపారు. వివేచనాశక్తి, పాండిత్యప్రకర్ష, పురాణేతిహాసాలలో గల ప్రవేశం, మధురగానం, ధర్మబోధనా పటిమ, నిస్సంకోచంగా చెప్పి వినిపించగల శక్తిచూసి, ఆ వూరిలోని సంపన్న క్షత్రియాంగనలు ఎంతో మంది శ్రీమతి కనకమ్మగారిని పెద్దదిక్కుగా గురుతుల్యులుగా, గౌరవభావంతో చూసేవారు. ఏ లోటూలేకుండా ఆదుకునేవారు.

ఆ సమయంలోనే ఆమె సంఘ సంస్కారం పట్ల, రాజకీయాలపట్ల ఆసక్తి కనపరచటమే కాక, కుతుకబంటిగా వాటిల్లో ప్రవేశించారు. మాటాడుతున్నా చివరకు నడుస్తున్నా ఆమె తకిలీ మీద నూలు తీసేవారు. ఖద్దరు ధరించడమే కాక ఇంటింటికి తిరిగి అమ్మేవారు. స్వదేశ వస్తువులనే వాడేవారు. పిల్లలుకూడ అటువంటి జాతీయ భావాలతోనే పెద్దవాళ్లు అయినారు. తండ్రి యజ్ఞం చేసిన భీమవరంలో ఆమె కాంగ్రెసు పెద్దలను, హరిజనులను ఆహ్వానించి కొడుకు కోడలుచేత సత్యనారాయణవ్రతం లాంటివి జరిపించేవారు. హరిజన వాడలకు వెళ్ళి స్వయంగా వాళ్ళ పిల్లలకు స్నానాలు చేయించేవారు. వాళ్ల ఇళ్లను శుభ్రపరచేవారు. రోగులకు సపర్యలు చేసేవారు. ఒకసారి ఆమె రైలు ప్రయాణం చేస్తూండగా నిండుచూలాలైన ఒక హరిజన యువతికి పురిటి

నొప్పులు రావటం చూసి పక్క స్టేషనులో ఆమెను దింపి ఒక చెట్టుకిందకు చేర్చారు. తనుకట్టుకున్న బట్టనే ఆవరణగా కట్టి ఆ హరిజన యువతికి పురుడు పోశారు. నిజమైన సేవకు యిదిపరాకాష్టగా నిలుస్తుంది.

ఆమె సేవానిరతిని నిర్మాణకార్యక్రమాలపట్ల ఆసక్తను, స్వాతంత్రేచ్ఛను, అనర్గళవుపన్యాస ధోరణిని చక్కగా గమనించిన కాంగ్రెసు పెద్దలు ఆమెను కాంగ్రెసు వుద్యమ ప్రచారాలకు సాధనంగా వాడుకున్నారు. ముఖ్యమైన ప్రచారకురాలిగా ప్రబోధకురాలిగా యెన్నుకున్నారు. ఆమె స్త్రీ అన్నవిషయం ప్రజల సంగతి అటుంచి ఆమే మరచిపోయినారు. ప్రచారకార్యక్రమాలలో రాత్రిఅనక పగలనక తిరిగేవారు. తరచు యిల్లువదలి పొరుగూరువెళ్లి ప్రచారం చేస్తూ బహిరంగసభల్లో వుపన్యసించుతు ప్రజలను ఉత్తేజితులనుచేస్తువుండేవారు. స్వాతంత్ర్యపోరాటపు ఆరోజుల్లో రెండవ బార్డోలీగా ప్రసిద్ధి చెందిన భీమవరం నుంచి అంతమంది స్వాతంత్ర్యసమరయోధులు బయలుదేరారన్నా, కాంగ్రెసు సంస్థకు అంత ఆర్థికబలం సమకూరిందన్నా ఆమె ప్రచార ప్రబోధాల ప్రభావ మని ఒప్పుకోవాలి. అందువల్లనే ఆమెను పోలీసువారు ఒక కంట కనిపెడుతూనే ఉండేవారు. అయినా వాళ్లు అనుకున్న సమయంలో ఆమె కనిపించేవారుకాదు. కనిపించినట్లే కనిపించి మాయమయ్యేవారు. ఒకసారి ఆమె, నిండు చూలాలైన తన కూతురిని పురిటికి మేనాలో అక్కగారింటికి తీసుకువస్తూండగా పోలీసులు అటకాయించారు. అప్పుడామె తాను కనకమ్మకాదని కూతురు ప్రసవకాలానికి ఆమె తప్పక వస్తుందని చెప్పారు. పోలీసులు యింటిముందు కావలాఉన్నారు. పురుడు వచ్చిందికాని వాళ్లు ఎదురుతెన్ను చూసిన "కనకమ్మ" బయట నుంచి రానేలేదు.

ఎన్నిసార్లో ఈ విధంగా పోలీసులకు చిక్కకుండ ఆమె ప్రచారంచేస్తూ ఉంటే నాయకులే ఆశ్చర్యపోయేవారు. అయినా ఆమెను శాసనోల్లంఘనం జరిపి నందుకు, 1930జూన్ 10న, 1931లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని ఉప్పు తయారు చేసినందుకు మళ్లీ అరెస్టుచేసి రాయవెల్లూరు జైలులో ఉంచారు. 1940 లో రెండవ ప్రపంచ సంగ్రామం వచ్చింది. భారతదేశంతో మాట మాత్రమైనా సంప్రదించకుండా యుద్ధవ్యూహంలోకిదించి బ్రిటిష్ ప్రభుత్వం నిరంకుశత్వం తెలియబర్చుకున్నది. అది భరించలేక ఐచ్ఛికంగ యిష్టం వచ్చిన తీరుగా తమనిరసన తెలియచేస్తూ సత్యాగ్రహం చేసారు. ఆ సందర్భంలో

ఆమెకు మూడవసారి జైలు ప్రవేశం సిద్ధించింది. 1941 లో వ్యక్తి
సత్యాగ్రహంలో పాల్గొని 3వ సారి మూడుమాసాలు జైలుకు వెళ్లారు. రాయ
వేలూరు, బళ్ళారి, కర్నూలు జైళ్లలో ఇంచుమించు ఆమె ఐదుసంవత్సరాలు
వెళ్లదీశారు. ఇతరులకు అయోమయం అనిపించినా ఆమె దానినికూడ ఒక
విశిష్టతతోనే గడిపారు. అపక్వ ఆహారంమాత్రమే తినేవారు. నానపోసిన
శనగలు, పెసలు, బిడ్డలు యింటినుంచి బంగీలో పంపిన పళ్లు మాత్రమే తినేవారు.
కాని అతివుత్సాహంగ పాటలు పద్యాలు పాడుతూ భోజనశాల గోవింద నామస్మర
ణలు చేస్తూ ఖంతులవెంట తిరిగి వడ్డించేవారు. పురాణ కాలక్షేపాలతో హాస్యపు
మాటలతో ఆమె తోటి ఖైదీలను, జైలు అధికారులను ఒకే విధంగా ఆకర్షించే
వారు. ద్వేషం, క్రోధం, అసూయ, నిరుత్సాహం నిండిన జైలువాతావరణాన్ని
తేలికపరుస్తూ ఉండేవారు. మాట్లాడుతూ, నడుస్తూ తకిలీమీద ఆమె వడికి
నంత నూలు యింకెవరు జైలు జీవితంలో వడికి ఉండరు. అంతటి నేర్పరి.

కాలం గడిచిపోయింది. సత్యాగ్రహ సమరం ముగిసి దేశానికి
స్వాతంత్ర్యం వచ్చింది. మహాసౌధాలలో సర్వసుఖాలు అనుభవించే అదృష్ట
వంతులకు దానికి కారణభూతులైన కూలీల శ్రమ, కష్టం గుర్తుండవు,
కాంగ్రెసు సంస్థకూ అదే అయింది. భారత స్వాతంత్ర్య సౌధ నిర్మాణానికి
నెత్తిపై రాళ్లుమోసిన ఒక కూలీగ శ్రీమతి కనక మహాలక్ష్మమ్మ మరుగున్న
పడిపోయినారు.

అయినా ఆమె పూరుకోలేదు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమం పేర
1952 లో స్వామి సీతారాం భీమవరంలో సత్యాగ్రహ శిబిరం నిర్వహించారు.
మానసికంగా, శారీరకంగా కుంగిపోయిన ఆమె ఏడురోజులు నీళ్లయినా
ముట్టకుండా పచ్చివుపవాసం చేశారు. రాష్ట్ర విషయమై ప్రధానితో సంప్ర
దింపులు జరపటానికి యీ వృద్ధనారి ఢిల్లీ వెళ్లారు. ఆ పెద్ద వయసులోకూడ
ఆమెకు దేశం, రాష్ట్రం అంటే మమకారం పోలేదు. స్వశక్తిపై విశ్వాసం
నశించలేదు. స్వతంత్ర జీవనం పట్ల అభిప్రాయం మారలేదు. భర్త గతించిన
కొత్తల్లో ఏర్పరచుకున్న తన కుటీరంలోనే చివరివరకు జీవించారు. చివరకు
తన బిడ్డలపైన ఆధారపడటంకూడ ఆమెకు నచ్చలేదు. పోలీసుల తుపాకి
గుళ్లకు తనతలను ఎదురొడ్డిన వీరనారి. శ్రీమతి కోటమర్తి కనక
మహాలక్ష్మమ్మ 1960వ సంవత్సరంలో కీర్తికాయులైనారు.

---

# శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ

**జననం 6-3-1899** **మరణం 30-8-1949**

గాంధీ మహాత్ముడు 1929 వేసవిలో ఖాదీ ప్రచారంచేస్తూ ఆంధ్రదేశ సంచారంచేశారు. ఆ సమయంలో ప్రత్యేకంగా తీరుబాటు కల్పించుకుని భాగల్లులో శ్రీమతి తల్లాప్రగడ విశ్వ సుందరమ్మ ఆమె భర్త శ్రీ నరసింహశర్మ నిర్వహించుతున్న ఆనంద నికేతన ఆశ్రమానికి వెళ్ళారు. నిజానికి గాంధీజీ అప్పటికి అస్పృశ్యతా నివారణను ముఖ్యసమస్యగా భావించి పెద్ద ఎత్తున ప్రచారం చేయటంలేదు. అప్పటికి ఆరు సంవత్సరాలుగా జాతి, కుల, మత వివక్షతలేకుండ ఆశ్రమంలో హరిజన బాలబాలికలను యితర అనాధ బాల బాలికలను కన్నబిడ్డల కన్న ఎక్కువగా ఆదరించటం, జాతీయ విధానంలో వాళ్ళకు విద్య చెప్పటం గాంధీజీకి ఎంతోనచ్చింది. పైగా జాతీయోద్యమంలో పాల్గొనే వుద్రేక ఉత్సాహపూరితులైన యువతరానికి అది స్థావరం. గాంధీజీ పరిపూర్ణమైన సంతోషంతో ఆ రాత్రికి ఆశ్రమంలోనే విశ్రమించారు. పిల్లల ఆటపాటలు, కార్యకలాపాలు చూసి దీవించారు. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, కంభంపాటి సత్యనారాయణ సీనియర్, మల్లవరపు వెంకట కృష్ణారావుగార్ల వంటి యువకులు ఆయనతో సంభాషణకు వుపక్రమించారు. "బాపూ, శాంతి సమరం మీరు ఆదేశించుతున్నారు. సరి, కాని సాయుధపోరాటం సత్వర విజయాన్నికూర్చదా?" అని అడిగారు. గాంధీజీ చిన్నగా నవ్వి "ఒక ఖైదీ వుంటాడు. కాలక్రమాన అధికారులు అతనిని వార్డరుగా నియమించారు. తనూ



శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ

ఖైదీనని, తాను హింసలు భరించానని మరిచిపోయి అతను తోటి ఖైదీలను హింసించటం ఆరంభించాడు. మీరు విద్యావంతులు, వివేకవంతులు మరి ఆలోచించండి" అన్నారు. శ్రీమతి విశ్వసుందరమ్మ విద్యాబుద్ధులు చెప్పించి తీర్చిదిద్దిన సోదరుడు డాక్టరు శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావు నాటికి నేటికి శాంతిప్రియులుగానే నిల్చిపోయినారు.

సరిగా సంవత్సరానికి ఉప్పు సత్యాగ్రహ వుద్యమం దేశం నాలుగు ప్రక్కల వ్యాపించింది. ప్రజల వుత్సాహానికి ఆవేశానికి, అంతులేదు. ఆనంద నికేతన ఆశ్రమం నుంచి 1930ఏప్రిల్ 13న శ్రీ తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, ఆమె భర్త, తమ్ముడు, చెల్లెలు, శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు వంటి బంధుజనులు, మిత్రులు పెద్ద దళంగా ఏర్పడి సత్యాగ్రహం చేయటానికి, శాసన ధిక్కారం చేయటానికి బయలుదేరారు. ఆమె పాల్గొనని బహిరంగ సభలేదు. విదేశీ వస్త్రదహనాలకు పికెటింగులకు అంతులేదు. పశ్చిమ గోదావరిజిల్లా మహిళలకు నాయకత్వం వహించి ఆమె వుద్యమం నడిపారు. ఆశ్రమం పిల్లలు కూడ వుత్సాహంతో బాలభటులుగా పనిచేశారు. ఆమె భర్త, సోదరుడు అరెస్టుఅయినారు. ఆమె ద్విగుణీకృతమైన బాధ్యతలతో పనిచేశారు. చివరకు 1930 మే మొదటివారంలో ఏలూరులో ఆమెను అరెస్టుచేశారు.

విచారణ జరిపి 6 నెలలు శిక్షవిధించి 'బి' క్లాసు యిచ్చారు. ఆ సమయాన ఆమె కోర్టులో యిచ్చిన వాఙ్మూలం ఒక ప్రత్యేక స్థానాన్ని అందుకున్నది. జూలియస్ సీజరు నాటకంలోని మార్కు ఆంటనీ అభిభాషణం గుర్తు చేస్తు వుంటుంది. పైగా సజ్జనస్తుతి, కుజననింద, మిత్రులకు అభినందనలు, ప్రభుత్వ దమన నీతి వర్ణనలు మొదలైన కావ్యసామగ్రితో ఆమె వైదుష్యాన్ని కవితా సామర్థ్యాన్ని వెల్లడించుతు వుంటుంది. చిరునవ్వుతో ''వందేమాతరం'' అంటూ రాయవేలూరు జైలుకు వెళ్లారు, కోర్టుబయట కోలాహలం వర్ణనాతీతం. 1930 నవంబరు 7న విడుదల అయి వచ్చారు. దేశభక్తి, త్యాగం ఆమెకు యీనాడు కొత్తగా వచ్చినవి కావు.

1899 మార్చి 6న ఆమె శ్రీ మల్లవరపు శ్రీరాములు, శ్రీమతి సీతమ్మగార్ల ప్రథమ సంతానంగ జన్మించారు. పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకాలోని ఉండిగ్రామం ఆమె జన్మస్థలం. ఆమె కిద్దరు తమ్ములు

ఒక చెల్లెలు వున్నారు. తొమ్మిదవ యేటనే ఉంగుటూరుకు చెందిన తల్లాప్రగడ నరసింహశర్మగారితో వివాహం అయింది. అందువల్ల ఆమెకు స్కూలుచదువు దాదాపులేదు. కాని పండితులైన తండ్రి ప్రోత్సాహ సహకారాలతో ఆమె యింట్లోనే యెనలేని పాండిత్యం సంపాదించారు. ఆనాడు ప్రచురింప బడుతున్న విజ్ఞానచంద్రికామండలి, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయం ప్రచురణలన్నీ చదివారు. శ్రీ చిలకమర్తి, శ్రీ కందుకూరివారి రచనలన్నీ భారత భాగవతాలతో పాటు చదివేశారు. నరసాపురంలోని ప్రోగ్రెసివ్-యూనియన్‌వారు, విజ్ఞాన చంద్రికామండలివారు నిర్వహించుతున్న ఉభయ భాషాప్రవీణ, సాహిత్యశిరోమణి వంటి పరీక్షలకు చదివారు. 16వ ఏట గృహిణిగా కాకినాడ వెళ్లారు. అనుష్ఠానిక బ్రహ్మసమాజీ అయిన ఆమె భర్త అప్పుడు పిఠాపురం రాజావారు నడిపే అనాథ శరణాలయానికి సహాయ సూపరింటెండెంటుగా వుండేవారు. విద్యతో, ఉత్తమ గ్రంథపఠనతో పక్వమైన ఆమె లేతమనసులో సంస్కార భావాలు, దయ, సహానుభూతి వాత్సల్యంవంటి దొడ్డభావాలు వట వృక్షంలాగ విస్తరించినవి. అక్కడ ఐదు సంవత్సరాలు వున్నారు.

ఇంతలో 1920 లో గాంధీజీ స్వాతంత్ర్య శంఖారావం వినిపించింది. దంపతులు రాజకీయాలవైపు ఆకర్షితులై 1921 లో విజయవాడలో జరిగిన చారిత్రాత్మక కాంగ్రెసు సమావేశాలకు హాజరయినారు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి ఆధ్వర్యాన కాకినాడలో జరిగిన తూర్పుగోదావరి జిల్లా రాజకీయ మహాసభలో శాసనోల్లంఘన తీర్మానాన్ని ఆమెగారే ప్రతిపాదించారు. శాసనోల్లంఘన ప్రథమదళంలో తనపేరు వ్రాయించుకున్నారు. నాటినుంచి విదేశీవస్త్ర దహనాలు, బహిరంగసభల్లో వుపన్యసించటం, ప్రతి కాంగ్రెసు సమావేశానికి హాజరుకావటం మామూలు విషయాలు అయినవి. 1921 లో అహమ్మదాబాదు కాంగ్రెసుకు వెళ్లినప్పుడు సబర్మతీ ఆశ్రమానికి పోయి గాంధీజీని కలుసుకున్నారు. కొన్ని విషయాలు సంప్రదించి, కొన్ని సలహాలు తీసుకున్నారు. కొంతకాలం రాజమండ్రిలో వుండి వీరేశలింగంపంతులుగారి వితంతు శరణాలయం నడపటంలో సహకరించారు. 1923 లో వంగరాష్ట్ర సంచారం చేశారు. కలకత్తాలోని బ్రహ్మసాధనాశ్రమం, చంద్రనాగోర్‌లోని ప్రవర్తకాశ్రమం, బోల్పూరులో శాంతినికేతనం మొదలైనవన్నీ చూసివచ్చారు. నెల్లూరు ప్రాంతం పల్లెపాడులోని పినాకినీ ఆశ్రమంలో కొంతకాలం వున్నారు.

అప్పటికే నెల్లూరు మండలంలో పొణకా కనకమ్మగారు స్వాతంత్ర్య ఉద్యమంలో వీరవిహారం చేస్తున్నారు.

శ్రీమతి విశ్వసుందరమ్మ శ్రీ నరసింహశర్మ యిక ఒక చోటస్థిరపడి తమదైన ఒక కార్యకలాపాన్ని నిర్వహించతలచారు. రాజమండ్రి పట్టణం ఆర్యాపురంలో గోదావరి గట్టున 1923 లో ఆనందనికేతనాశ్రమం స్థాపించారు. అస్పృశ్యతా నివారణ, స్త్రీజనాభ్యుదయం, నూలువడకటం, ఖాదీనేయటం, వంటి నిర్మాణాత్మక కార్యకలాపాలకు అదిసాధనమయింది. కుల, మత విచక్షణలేకుండ అందరు ఒక్కకుటుంబంగా ఉండేవారు చాగల్లులో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు యీ ఆశ్రమభవన నిర్మాణానికి తోడ్పడ్డారు. అప్పటి నుంచి ఆశ్రమంతో పాటు ఆమె కూడ చాగల్లువచ్చారు. మరికొంత కాలానికే గాంధీ మహాత్ముడు ఆశ్రమంచూసి సంతృప్తి కనపరచటం, ఆమె ఉప్పు సత్యాగ్రహంలో ప్రముఖపాత్ర వహించి జైలుకు వెళ్లడంజరిగింది

విడుదలయి వచ్చిన తరువాత ఏలూరులో శ్రీమతి శృంగారకవి లక్ష్మీనరసమ్మ యింట్లో మీరాబాయి చరఖా పాఠశాల నిర్వహణకు తోడ్పడ్డారు. శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ వంటి యువతులకు వుద్యమంలో పెద్దదిక్కుగా అండగా వుండేవారు.

1932 లో శాసనోల్లంఘనం రెండవఘట్టం దేశాన్ని ఒక్క కుదుపు కుదిపింది. దమననీతిని అవలంబించిన ప్రభుత్వం సభలు, సమావేశాలు నిషేధించారు. ప్రచారాలు వీల్లేదన్నారు. ఆ నిషేధాజ్ఞను అతిక్రమించి 1932 జూలై 6న తెనాలిలో మండల కాంగ్రెసు సభజరిపారు. దానికి శ్రీమతి విశ్వసుందరమ్మ అధ్యక్షత వహించారు. చురుకుగ సభ ముగించి, విజయోత్సాహంతో పూరేగింపు జరుపుతు వుండగా పోలీసులు వచ్చారు. లాఠీఛార్జీ జరిగింది. ఆమెతోపాటు 26 మందిని అరెస్టు చేశారు. దెబ్బల నుంచి రక్తం కారుతు వుండగా "శ్రీ గాంధీ నామాంమరువాం, మరువాం, సిద్ధాము జైలూకు వెరువాం వెరువాం" అంటూ ఆరు నెలల జైలుశిక్ష అనుభవించటానికి రెండవసారి రాయవేలూరు వెళ్లారు. ఈసారి కూడ 'బి' క్లాసు యిచ్చారు.

1942 లో క్విట్టిండియా వుద్యమం సమయంలో ప్రభుత్వం ఆనందనికేతనాశ్రమాన్ని స్వాధీనపరుచుకున్నది. అయినా ఆ దంపతులు చలించలేదు. నిడదవోలులో కాలవగట్టున పర్ణకుటీరం వేసుకుని వున్నారు.

ఇన్ని ఒడుదుడుకుల మధ్య, అలజడుల మధ్య ఆమె అసంఖ్యాక కవితల్లల్లారంటే ఆశ్చర్యంగా వుంటుంది. 1920-49 మధ్యకాలంలో వివిధ విషయాలపైన ఆమె రచించిన 125 గీతాలను "కవితా కదంబం" అనేపేరుగల 235 పేజీల గ్రంథంగా ప్రచురించారు. ఆధునిక ఆంధ్రకవయిత్రులలో ఆమె ప్రథమస్థానం వహించారు. తనశక్తిని, సమయాన్ని, సంఘ సంస్కారానికి, సంఘసేవకు, దేశ సేవకు వినియోగించినట్లుగానే, ఆమె తన కవన శక్తిని కూడ సంఘంకోసం, దేశంకోసం వెచ్చించారు. నియమబద్ధ జీవితం ఎన్నోకట్టడుల మధ్య గడపటం వల్ల గాంధీజీ ప్రభావంవల్ల మద్యపాన నిషేధం ఆమె కార్యక్రమంలో ముఖ్యాంగమే అయింది. పికెటింగులు చేసి చేసి, వివిధకోణాల నుంచి మద్యపాన సమస్యను పరిశీలించిన ఆమె తాగుడు నిరసిస్తూ అనేక కవితలు వ్రాశారు. ఒకచోట "కల్లు స్వదేశియే, కనుక త్రావగవచ్చు ననెడి దుర్వాదమున్ వినకుమయ్యా" అని హెచ్చరించుతారు. ఈ పాయింటు అసలు యింకెవరికి తోచనేలేదేమో. బాలవితంతువుల గోడు వినమంటారు. స్త్రీజనాభ్యుదయానికి పాటు పడమంటారు. సంస్కరణ భావాలతో మానవసేవ చేసిన శ్రీ వీరేశలింగం పంతులు, గాంధీజీలను కీర్తించుతారు. వారి అడుగు జాడలలో నడవమని ప్రజలను వుద్బోధించుతారు.

కవితలలో అధికభాగం స్వాతంత్ర్యోద్యమ ప్రబోధానికి రచించారు. ఉగాది పండగ గురించి, "పరుల పాలనము నిరసించి మన దేశప్రజల పాలనము నాశించి ద్రోహుల ప్రచారముల ద్రుంచమని తెల్పుతూవచ్చెనిదే సంవత్సరాది" అంటారు. రాట్నంతిప్ప మంటారు. ఖద్దరు కట్టమంటారు. ఉప్పు చట్టమును జయింపగా అహింసా మార్గము విడువక, స్వహింసనైనా సహించి సత్యాగ్రహం చేయమంటారు. "భారతీయుల మగుచు ప్రభవించి ఫలమేమి నిజదేశ స్వాతంత్ర్యమును గాంచక" అని ప్రశ్నించుతారు. బ్రిటిషువారిని దుయ్యబట్టిన విధం చూస్తే నవ్వువస్తుంది ఉత్సాహం కలుగుతుంది. "కొంపతీయు వర్తకుడై కొట్టినాడు దేశమంత మాటలాడితె శిక్షలంట, పాటపాడితే కేసులంట" అని వర్ణించుతారు. "వనితలందర నగచాట్ల పాలొనర్ప ఆంగ్లజాతికి గౌరవమంత రించె, చాలునింక ఆంగిలేయుల పాలనమ్ము-చోటులేదిక వారికిచ్చోటసుంత" అని తేల్చి చెప్పేశారు.

ఆ నాటి స్త్రీలచెరసాల పరిస్థితులగురించి ఆమెలాగ వున్నది వున్నట్లు సవిస్తరంగ సమగ్రంగ వర్ణించగలిగినవారు మరొకరులేరేమో. "బహువస్త్రములు కల్గుభామలేయచ్చట జతవస్త్రములు తోడజరుప వలసె — నేతివెన్నలతోడ నేస్తమాడెడి వారె తైలహీనాన్నమును దినగవలసె" నని వ్యథ చెందుతారు. "కాన్విక్టు వార్డరు క్రమముగా ప్రతిరోజు అధికార్లయాజ్ఞల నందజేయ-నల్లచీరల గట్టినట్టి జైల్వార్డరు అడుగడుగున మమ్ముహడలజేయ-లక్ష్యమింతయుజేయక, లక్ష్యమెరిగి, అల యశోకవనాన సీతమ్మలనగ, గడుపుచున్నారు నెలతలు ఖైదు బ్రతుకు-రాయ వెల్లూరు జైలు నిర్బంధమందు" దీన్ని మించిన సర్టిఫికెటు యింకేమిటున్నది?

ఆమె జాలిగుండెను సీక్లాసు ఖైదీల బాధలు కదలించేవి. "మామాటకేమి ఏమి పాపం బోసీక్లాసు నీసడించి, గౌరవము జ్ఞాపకినుమంత, క్రౌర్యమునను అడలు గొల్పెదరెంతొ నిరాదరమున మోటులాఠీల వార్డరుల్ మూఢమతులు" అనివాపోతారు. వారిలో సజ్జనులను మెచ్చుతు "డాక్టరు ఖానుడాదరముతో మాకిందు పోషణలారసి బ్రోచుచుండ; కన్నను, చంద్రమల్ ఘనులైన రైటర్లు వలయుసప్లయిల నేర్పరచు చుండ-మిస్స్మిత్తు, మిస్ఫ్రానుసెస్ లాంగ్లొ యిండియన్ కాంతలు మమ్మురక్షణ సేయ" జైలు జీవితం నెట్టుకు వచ్చేవారమని తృప్తిపడతారు. ఖర్చులేకుండ వేళకు భోజనాలు, నౌకర్లసేవలు, విశ్రాంతి జీవితం జైలులో లభించుతవి. కాబట్టి సోదరీమణు లందరు దేశసేవ చేసి జైలుశిక్ష అనుభవించ వచ్చునని ప్రోత్సహించుతారు. ఆమె పరిశీలనా శక్తి, వర్ణనాపటిమ అమోఘం. రాయవెల్లూరు జైలుశానిటేషను గురించి గృహలక్ష్మి పత్రికలో సుదీర్ఘవ్యాసం వ్రాశారు. ఇంజనీరులాగ ప్లానుతోసహావర్ణించుతూ మరుగుదొడ్ల దుస్థితిని మరుపురాకుండ వివరించారు. ఆమె కవితలు చదివి ఆనందించటానికి పాండిత్యం అవసరంలేదు, అతిసహజంగ, అప్రయత్నంగ హృదయాంతరాళాలలో నుంచి వచ్చిన మాటలవి. అందువల్ల ఆమెకవిత వసివాడదు. శాశ్వతమైన కీర్తిని సంపాదించుకుని-1949 ఆగష్టు 30న ఆమె కాయం విసర్జించారు.

———

# శ్రీమతి జయంతి సూరమ్మ

**జననం 1887** **మరణం 10-2-1969**

కొంతమంది జీవితాలు సంఘానికి, దేశానికి చెందిన అనేక వుద్యమాలతో చక్కగా అల్లుకుపోయి ఉంటాయి. వ్యక్తిగా ఏ ఒక్కరో కాక కుటుంబ సభ్యులు అందరూ ఈ వుద్యమాలలో కలసి పాల్గొన్నప్పుడు ఒక సినిమా తీయటానికి, ఒక నవల వ్రాయటానికి తగిన సరంజామా తయారవుతుంది. శ్రీమతి జయంతి సూరమ్మగారి విషయం ఈ కోవకు చెందుతుంది.



శ్రీమతి జయంతి సూరమ్మ

అది 1922వ సంవత్సరం, మహాత్మా గాంధీ బరంపురం వచ్చారు. ఆయన పాదం మోపినచోట పది తిరనాళ్ల జనం, యిరవైతీర్థాల సందడి, సభ జరుగుతూనే వున్నది. ఖద్దరుధారి ఒకాయన జోలెపట్టి విరాళాలు వసూలు చేస్తున్నారు. ఖద్దరు ధారిణి ఒకామె గాంధీటోపీ తిప్పి పట్టుకుని విరాళాలు వసూలు చేస్తున్నారు. క్షణాలమీద నాణేలు, నోట్లు, వెండి, బంగారం అన్నీ వచ్చిపడుతున్నవి. అవన్నీ జాగ్రత్తగా మహాత్మునికి చేరవేస్తున్నారు. తమ వంటిమీద ఉన్న కాసులు, ఉంగరాలు కూడ ఆ వసూళ్లలోనే చేరిపోయినవి. అతి చురుకుగా క్రమ విధానంలో వందల కొద్దీ జనాన్ని పావలా సభ్యులుగా కాంగ్రెసులో చేరుస్తున్నారు. వారిని సంతృప్తితో చూస్తున్న గాంధీజీ స్వయంగా పిల్చి వాళ్లను పరిచయం చేసుకున్నారు. వాళ్లే జయంతి వెంకట నారాయణగారు ఆయన భార్య సూరమ్మగారు. ఆవేశం ఉత్తేజం కలిగించుతూ బహిరంగ సమావేశాలలో హిందీ, తెలుగు, ఒరియా భాషలలో దేశభక్తిగీతాలు పాడుతూ ప్రచారం చేసేవారు. ఆదంపతులు ఇంతగా ప్రచార కార్యక్రమాలలో

పాల్గొన గలగటానికి కారణాలు అనేకం. వారికి జాతీయోద్యమాలలో పాల్గొనటం, 1914 లో హోంరూలు ఉద్యమంతోనే ఆరంభమయింది. ఇక మనస్ఫూర్తిగా ప్రచారం చేయడం ఆ దంపతులు చిన్ననాడు కలకత్తాలో బ్రహ్మసమాజ మిషనరీలుగా తర్ఫీదు పొందిననాడే అబ్బింది.

శ్రీమతి సూరమ్మ 1867 లో శ్రీ కొండూరి సీతారామయ్య, శ్రీమతి నరసమ్మగార్ల ఐదవ కూతురుగా జన్మించారు. శ్రీకాకుళం జిల్లా కవిటి అగ్రహారం ఆమె జన్మస్థలం. ఆమె 8వ ఏట బరంపురం వాస్తవ్యులు శ్రీ జయంతి వెంకట నారాయణతో వివాహం అయింది. అటు, ఇటు, కూడ శుద్ధ శ్రోత్రియ కుటుంబాలు. 19 ఏళ్ల చిన్న వయసులోనే శ్రీ వెంకట నారాయణ బ్రహ్మమత ప్రభావితులైనారు. రెండువైపుల కుటుంబాలవారు ఎంతగానో మందలించారు. వెలివేస్తామని భయపెట్టారు. ఐనా లెక్కచేయకుండ ఆమె తానుకూడ భర్తతో పాటు బ్రహ్మధర్మ స్వీకారం చేశారు. ప్రభుత్వోద్యోగము మానివేసిన భర్త వెంట రాజమండ్రి వెళ్లారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారు నడుపుతున్న వితంతు శరణాలయంలో భర్త టీచరుగా పని చేసిన సమయంలో ఆమె శ్రీ వీరేశలింగం దంపతుల సాంగత్యంలో అనేక సంస్కార భావాలను జీర్ణింపచేసుకున్నారు. ఆ సందర్భంలోనే బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడు గారి పరిచయం కలిగింది. రాజమండ్రి నుండి ఆ దంపతులు కలకత్తా పోయి, పండిత శివనాథ శాస్త్రిగారి దగ్గర సాధనాశ్రమములో మిషనరీ ట్రెయినింగు పొందారు. కాకినాడలో పిఠాపురం రాజా స్థాపించిన బ్రహ్మ మందిరము అనాథ శరణాలయాలను నిర్వహించే కార్యక్రమంలో సహకరించుతూ ప్రచారకులుగా ఉన్నారు. వేశ్యావృత్తి నిర్మూలనం వంటి కార్య కలాపాలలో పాల్గొంటూవుండేవారు. హరిజనసేవ, వారిలో విద్యాప్రబోధం కూడ చేస్తూ ఉండేవారు. అక్కడ నుంచి బ్రహ్మమత ప్రచారకులుగా మద్రాసు వెళ్లారు.

మద్రాసులో భారత బ్రహ్మసమాజం తరపున ప్రార్థనలు, రాత్రి పాఠశాలలు నడిపేవారు. రామమోహనరాయ్ హోంపేర ఒకలాడ్జిని కూడ నడిపేవారు. బ్రాహ్మయువకులు వసతికోసం, క్రమశిక్షణకోసం ఆ లాడ్జిలో ఉండేవారు. వారిని ఎంతో ఆదరంతో కనిపెట్టి ఉండేవారు. డాక్టరు శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డితో ఆమెకు మంచిస్నేహం కుదిరింది.

ఆ సందర్భంలోనే డాక్టరు అనిబిసెంటు హోంరూలు వుద్యమం లేవదీశారు. పుటకతో స్వాతంత్ర్య భావాలుగల శ్రీమతి సూరమ్మ వెంటనే అందులో మెంబరు అయినారు.

1917 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు సమావేశానికి డాక్టరు అనిబిసెంటు అధ్యక్షులు అయినారు. శ్రీమతి సూరమ్మ పిల్లలతో సహా ఆ సమావేశానికి హాజరుఅయినారు. అటు బ్రహ్మధర్మసభలు, సమావేశాలు, ఇటు జాతీయోద్యమ సభలు సమావేశాలు అన్నిటిలోనూ తప్పనిసరిగా పాల్గొనటంతో ఆమెలో గొప్ప భావచైతన్యం కలిగింది. సహజంగా ఉన్న సద్భావాలు క్రమవిధానంతో చక్కని రూపంధరించినవి. పరోపకారం, నలుగురితో పంచుకోవటం అలవాటయి పోయింది.

పిల్లల చదువులకు అనుకూలంగా ఉంటుందని స్వస్థలం బరంపురం వెళ్లారు. లోకమాన్య బాలగంగాధరతిలక్ ఆ నాటి రాజకీయ నాయకుడు. ఆయన మరణించడంతో విదేశీవారిచ్చే డిగ్రీలపట్ల, ఇంగ్లీషు చదువులపట్ల విముఖత ఏర్పడిన ప్రజలు స్కూళ్లు, కాలేజీలు బహిష్కరించారు. ఆమెకూడ తనపిల్లలను మామూలు స్కూళ్లనుండి తీసి హిందీ చదవటం, నూలు వడకటం, నేయటం మొదలైన చేతి పనులు నేర్పే జాతీయవిద్యాలయంలో చేర్చారు. 1921 నాటికి మహాత్మా గాంధీ అసహాయోద్యమం తీవ్రరూపం దాల్చింది. పత్రికల నిండా ఆ వార్తలే. శ్రీ కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, ప్రకాశం, ఉన్నవ లక్ష్మీనారాయణగార్ల పేర్లు ప్రతినోట వినిపించేవి. ఉన్నవ వారి "మాలపల్లి" ఇంటింట గీతా పారాయణలాగ సాగింది. ఈ ప్రభావం ఆమె కుటుంబంమీద పడింది. శ్రీ వెంకట నారాయణ గారు "హ్యుమానిటీ" అనే ఇంగ్లీషు వార పత్రికను ప్రారంభించారు. ఆయన, ఆయన సోదరులు దేశభక్తి ప్రబోధం చేస్తూ ఆవేశ పూరితంగా అందులో వ్యాసాలు వ్రాసేవారు. వారి పెద్ద అబ్బాయి బ్రహ్మానందం హిందీలోనూ, నూలు వడకటంలోనూ పండితుడైనాడు. కుటుంబంలోని అందరి విదేశ వస్త్రాలు ఆమె స్వయంగా పరశురామ ప్రీతి చేశారు. రాట్నాలు ఇంటికి వచ్చినవి. అందరూ వడికేవారే. అసలు ఆ ఊళ్లోనే విజ్జపువారు, ఇమ్మిడిశెట్టి వారు లాంటి ప్రసిద్ధ కుటుంబాల వారు రాట్నాలు ఏకులు లెక్కలేనన్ని ఊరంతా పంచారు. దాంతో ఊరంతా రాట్నాల మోతే. ఆ ఊరి సాలెవాళ్లకూడ తమ

పట్టు నేతను ఆపి యీ వడికిన నూలుతో ఖద్దరు బట్టలు నేసి ఇవ్వటం ఆరంభించారు. ఉడతాభక్తిగా దేశసేవ, ఖాదీ ప్రచారం చేశారు. శ్రీమతి సూరమ్మ నాజూకైన ఎంతో సన్ననినూలు వడికేవారు. ఆమె ఇంటింటికి తిరిగి ఖద్దరు బట్టలను అమ్మి ఖాదీప్రచారం చేసేవారు. 1922 లో బరంపురంలో కాంగ్రెసు జరిగిన కొద్ది రోజులకే ఆమె భర్త, వారి సోదరులు అరెస్టు అయినారు. అయినా ఆమె బాధపడలేదు. జంకలేదు. ఖద్దరు అమ్మకము, హరిజన వాడలకు వెళ్లి ప్రచారంతో పాటు కల్లుదుకాణాల దగ్గర పికెటింగు చేసేవారు. తాగుడు వల్ల నష్ట, కష్టాలను ఆమె పాటల ద్వారా వెల్లడించుతూవుంటే తాగుబోతులు ముందు అపహాస్యం చేసేవారట, తరువాత తూలుతూప్రలాపాలతో భయపెట్టేవారట. ఆ తరువాత నిదానంగా వినేవారట. చివర మెట్టుగా చాలా మంది ముంత కింద కొట్టి ఇంకెప్పుడూ త్రాగం అంటూ ఆమె పాదాలమీద వాలేవారట. పొరుగు వూళ్లు కూడా పోయి ప్రచారం చేస్తూ ఉండేవారు. అహింస జయించి తీరుతుంది అనే ఆమె గట్టినమ్మకం సఫలమయేది.

బరంపురంలో జాతీయ విద్యాలయం స్థాపించారు. ఆమె తనపిల్లలను అక్కడే చదివించారు. ప్రసిద్ధి పొందిన వరహాగిరి వారి ఇంట్లోనూ, దిగుమర్తి వారి ఇంట్లోనూ స్త్రీల సమావేశాలు జరుగుతూ వుండేవి. ఆమె అన్నింటిలోనూ పాల్గొనేవారు. ఇంటి దగ్గర తొమ్మిదిమంది బిడ్డలు, భర్త జైలులో ఉన్నారు. కాంగ్రెసు వాలంటీర్లకు, ప్రచారకులకు ఏనాడు జీతభత్యాలు లేవు. ఐనా ఇన్నిటిని సమర్థించుకుంటూ, దేశసేవలో ప్రధాన పాత్ర వహించారు. కాంగ్రెసు సమావేశాలు రాష్ట్ర సభలలో శ్రీమతులు దువ్వూరి సుబ్బమ్మ, ఉన్నవ లక్ష్మీ బాయమ్మ గార్లను కలుసుకుంటూ ఉండేవారు. 1923 లో కాంగ్రెసు సమావేశం కాకినాడలో జరిగింది. శ్రీమహమ్మదాలీ అధ్యక్షులు. ఆమె బిడ్డలతోసహా సమావేశానికి కాకినాడ వెళ్లి వాలంటీరు దళంలో చేరి పనిచేశారు. ఒకక్షణం స్థిమితంగా ఉండేవారు కాదు. వాడ వాడల తిరిగి వుపన్యాసాలిచ్చేవారు.

"మాకొద్దు ఈ తెల్ల దొరతనము, పన్నెండు దేశాలు పండుచున్నవి కాని పుట్టెడన్నము లోప మండీ, ఉప్పు ముట్టుకుంటేదోషమండీ నోట మట్టిగొట్టి పోతాడండీ, అయ్యో-కుక్కలతో పోరాడి కూడుతింటా డండీ-మాకొద్దీ తెల్లదొర

తనము". "అచ్చర లొచ్చీ అచ్చనగాయ లాడుకుండే రాజ్యములో అయ్యో కొయ్యోడా॥" "స్వేచ్ఛాపతాకంబిదే" వంటి పాటలను ఆవేశ పూరితంగా గొంతెత్తి పాడితే పల్లెప్రజలు కూడ కళ్లు తెరుచుకుని కార్యరంగంలో ప్రవేశించేవారు. ఇట్లా ఎంతకాలం జరుగుతుంది? 1930 లో నౌపడా ఉప్పు కొఠారుల దగ్గర ఉప్పు సత్యాగ్రహం సందర్భంలో శాసనోల్లంఘనం జరిపి నందుకు 1930 జూన్ 19 న అరెస్టయినారు. ఆరునెలలు జైలుశిక్ష "బి" క్లాసులో అనుభవించటానికి రాయవేలూరు జైలుకు వెళ్లారు. అక్కడ అంత కన్న సందడిగా ఉన్నది. శ్రీమతులు వేదాంతం కమాలాదేవి, దువ్వూరి సుబ్బమ్మ, పొణకా కనకమ్మ, ఆచంట రుక్మిణీదేవి వంటి దేశసేవికలు వందలకొద్ది ఉన్నారు.

1930 డిశంబరు 21 న శిక్షపూర్తి అయి యిల్లు చేరుకున్నారు. కాని ప్రచారం మానలేదు. ద్విగుణీకృతోత్సాహంతో కాంగ్రెసు సేవలో నిమగ్ను లైనారు. 1932 లో శాసనోల్లంఘనం చేసినందుకు బరంపురంలో అరెస్టు అయినారు. మరి అధికారుల దృష్టిలో ఇది రెండవసారి నేరం చేయటం. అందువల్ల ఆమెకు ఒక సంవత్సరం కఠినశిక్షవేసి "సి" క్లాసు ఇచ్చారు. మళ్లీ రాయవేలూరు జైలుకు పంపించారు. అక్కడ పరిస్థితులు దారుణంగా ఉండేవి. తలస్నానంవంటివి ఊహించరాని రాజభోగాలు. తెలుగు వారికి అలవాటులేని ఉప్పుడు బియ్యపు అన్నం, జొన్నరొట్టెలు, అంబలి పెట్టేవారు. వంటలో వుప్పు ఉండదు. మజ్జిగ వుండదు. కొంతకాలానికి కన్ననూరు జైలుకు మార్చారు. అక్కడ భాషకూడరాదు. మరీఅవస్థ అయింది. అయినా రాజకీయ స్త్రీ ఖైదీలందరూ ఒక్కమాటమీద నిలబడి కష్టాలు సహించి శిక్షపూర్తిగా అనుభవించి బయటపడ్డారు. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు విడుదలఅయి వచ్చినవారి నందరిని మద్రాసులో తమ ఇంటికి తీసుకువెళ్లి ఆతిధ్య మిచ్చేవారు. శ్రీమతి సూరమ్మ వారు ఇచ్చిన కొత్తబట్టలను ధరించి బరంపురం చేరుకున్నారు.

ఆమెకు సంసారం చిన్నదేమీకాదు. గంపెడుమంది బిడ్డలు. కాని ఎప్పుడూ తీరుబాటుగా కూర్చునే తత్వంకాదు. ఏ డిగ్రీలు లేకపోయినా జన్మతః వచ్చిన సంస్కారం, అభివృద్ధి పరుచుకున్న ఆత్మవికాసం, పెద్ద వయసులో కూడ స్వతంత్ర జీవనం పట్లగల ఆసక్తితో చిన్న పిల్లలకు పాఠాలు

చెప్పేవారు. ఆమె బిడ్డలంతా ప్రయోజకులైనారు. ఆమెగారి అల్లుళ్ళు గరిమెళ్ల సత్య వీరభద్రరావు, ధరణీప్రగడ శేషగిరిరావుగార్లు సుప్రసిద్ధ దేశ సేవకులు. వాళ్లుకూడా స్వాతంత్ర్య సమరంలో జైలుకు వెళ్లి వచ్చినవారే. అట్లా వారి కుటుంబసభ్యు లనేకమంది దేశ సేవ చేశారు. తమ కృషి ఫలితంగా ఏర్పడిన స్వతంత్ర భారత పౌరిణిగా ఆమె బహుకాలం జీవించారు. 1969 లో ఫిబ్రవరి పదిన పరిపూర్ణమైన తృప్తితో నిశ్చింతగా కన్ను మూశారు. ఆమె కడగొట్టు కుమారుడు శ్రీ ధర్మతేజాగారు ఆంధ్ర మహిళాసభకు లక్ష రూపాయలు విరాళం యిచ్చారు. హైద్రాబాదులో మహిళాసభ నిర్వహించుతున్న నర్సింగ్ హోంలో ఆంధ్ర మహిళాసభ వారు ఒక వార్డుకు "జయంతి సూరమ్మ వార్డు" అని పేరు పెట్టారు. పదిమంచాలు వుండే ఆ వార్డులో స్వర్గీయ జయంతి సూరమ్మగారు ఆప్యాయత, ఆనందం, ఉట్టిపడే కళ్లతో చూస్తున్న ఫొటో ఆమెను యెరగని వారికి కూడ ఆమెను పరిచయం చేస్తూవుంటుంది.

---

# శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

జననం 1898 మరణం 27-8-1970

**1970** వ సంవత్సరం ఆగస్టునెల నాలుగోవారంలో శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మగారు అనారోగ్యంగ పడుకొని ఉన్నారు. అల వాటు ప్రకారం మహిళా సమాజ కార్య కర్తలు, మిత్రులు, పరివేష్టించి వున్నారు. సమాజం సంగతులు చర్చించు కుంటు వున్నారు. అప్పుడు ఆమె "ఏదో భగీరథ ప్రయత్నం చేసి, భీమవరం సాక్ళనడుమ చక్కని స్థలం సమకూర్చ గలిగాము, కాని ఆ మున్సిపల్ వారి ఆమోదముద్ర మన ప్లానుల మీద యెప్పటికి పడుతుందో, ఈ లోపల నిరుత్సాహపడి, మాట యిచ్చిన వాళ్ళు విరాళాలు పంపడం అశ్రద్ధ చేస్తా రేమో. మరికొంతమంది కొత్తవాళ్ళను కూడ కలుసుకొని యింకా కొంతడబ్బు



శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

వచ్చే ఏర్పాటు చేసుకోవాలి. అనుకున్న ప్రకారం 'బా-బాపు భవనం' నిర్మాణం వీలయినంత త్వరగా జరిగిపోవాలి." అని చెపుతూనే వున్నారు. మరికొంతసేపటికి ఆమె మాట పడిపోయింది. అవే ఆమె చివరి మాటలు. మరి మూడురోజులకు 27-8-1970 ఆమె భగవత్సాన్నిధ్యాన్ని చేరుకున్నారు. మహాత్మాగాంధీ, కస్తూర్బాల శత జయంత్యుత్సవాల సందర్భంలో రాష్ట్రస్థాయిన స్త్రీలు, పిల్లల శాఖ ఒకటి ఏర్పరచి రెండు లక్షలు దాని ఖర్చులకు కేటాయించారు. ఆ శాఖ నిర్వాహకులు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్. ప్రతి జిల్లాలోను ఒక చిన్న కట్టడాన్ని బా-బాపుల స్మృతి చిహ్నంగా రూపొందించడానికి పదివేలు నిధి నుంచి ఇస్తు ఒక్కొక్క జిల్లాకు సబ్‌కమిటీని ఏర్పాటు చేశారు. తమ శక్తి

సామర్థ్యాల సుపయోగించి స్థానికంగా విరాళాలు పోగు చేసి, తగినంతగా బా-బాపు భవన నిర్మాణం చేయటం వారి పని. పశ్చిమ గోదావరి జిల్లా సబ్ కమిటీకి శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మ చైర్మన్. చరమ కాలంలో ఆమె మనసును ఆవరించిన తపన దీన్ని గురించే. దేశానికి, మహిళా లోకానికి అది ఆమె ఆఖరు సేవ.

శ్రీమతి లక్ష్మీబాయమ్మ 1898 లో శ్రీ చన్నా ప్రగడ సుందర రామయ్య-శ్రీమతి రామ లక్ష్మాంబల కడగొట్టు బిడ్డగా జన్మించారు. పశ్చిమ గోదావరి జిల్లా, నర్సాపురం తాలుకా లోని ముత్యాలపల్లి ఆమె జన్మ స్థలం. అదొక విద్వత్కుటుంబం. అందరు కవులు, పండితులే. నిత్యం పండిత గోష్టులు, సాహిత్య చర్చలు జరుగుతు వుండేవి. తన రెండవ యేటనే తల్లిని పోగొట్టుకున్న లక్ష్మీబాయమ్మ కవులు, పండితుల మధ్య తండ్రివడిలో పెరిగారు. సంస్కృత పద భూయిష్ట మైన భాషనే యింట్లో అందరు మాట్లాడటంతో ఆభాషే ఆమెకు సహజంగ వచ్చేసింది. భోజనానికి వెళ్ళబోతూ "అన్నయ్యా యీవేళ సూపమా? చోష్యమా? భక్ష్యములేమిటి" అనిఅడిగే వారట. ఆమెది బడికివెళ్ళి నేర్చిన చదువుకాదు. అంతా స్వయం కృషివల్ల సాధించినదే. హిందీ, ఇంగ్లీషు భాషలు చక్కగా చదవను, వ్రాయను వచ్చు. సంస్కృత, ఆంధ్రభాషలలో గొప్ప విద్వత్తుగలవారు. కవిత లల్లగల వారు. చిన్న వయసులోనే ఆమె కంద పద్యాలలో 'కృష్ణ శతకం' వ్రాశారు. మరి మూడేళ్లకు 'వీరమతి' అనే నవలను వ్రాశారు. 'శాంతి కాముడు' అనే పద్య కథానికను, ఇంటరంటే ఏమిటనే వ్యాసం, నారాయణ రావు అనే కథానిక, 'దుర్గా దండకం', శ్రీకృష్ణ పరంగా 'ప్రభూ' అనే శీర్షికతో పద్య వ్యాసం వ్రాశారు. గృహ లక్ష్మి పత్రికలో అనేక కథలు, గేయాలు, వ్యాసాలు వ్రాశారు. భారతి పత్రికలో కూడ అసంఖ్యాకంగ గద్య పద్యరచనలు వ్రాశారు. విదుషిగా, కవయిత్రిగా తెలుగు నాట పేరుపొందగలిగారు.

ఆమెకు చాలా చిన్నతనంలోనే వివాహం అయింది. ఆమె భర్త శ్రీ ద్రోణంరాజు శేషగిరిరావు లాకుల సూపరింటెండెంట్‌గా వుండితరువాత బందరు జాతీయ కళాశాలలో మెకానికల్ ట్రెయినింగు అయినారు.

అప్పుడు లక్ష్మీబాయమ్మ కూడ బందరులోనే వుండేవారు. ఆ సందర్భంలోనే ఆమెకు వ్యక్తిగతంగ రాజకీయాలతో పరిచయం ఏర్పడింది.

శ్రీమతి మనపాకం కమలమ్మ వంటి దేశసేవికలతో పరిచయం కూడ కలిగింది. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యా గారు ఆమెకు రాజకీయ గురువు. గాంధీ మహాత్ముని పిలుపువిని రంగంలోకి ప్రభంజనంలాగ ప్రవేశించారు. ప్రతి రోజు విదేశ వస్తుదహనాలే. ఖద్దరు యింటింటికి తీసుకు వెళ్ళి అమ్మేవారు. కవయిత్రిగా పెంపొందించుకున్న అనర్గళధారను రచయిత్రిగా సమకూర్చు కున్న భావక్రోడీకరణను, సమన్వయం చేసి జనరంజకంగ వేదికలపైన వుపన్యసించగల పటిమవున్న వక్తగా తయారయినారు. దానికి దేశభక్తి, ఆవేశం జతకాగా, ఆమె వుపన్యాసాలు సభికులను వుత్తేజపరచేవి. ఆ కారణంగా ఉపన్యసించే విషయంలో కొందరు పురుషులుకూడ ఆమెను సంప్రదించే వారని అంటారు. సాహిత్యంలాగా ఆమెను రాజకీయాలు చల్లగా నీడపట్టున వుండనివ్వలేదు. జైలుకు పంపించినవి. మొదట భీమవరంలో ఉప్పు సత్యాగ్రహ సమయంలో 1930లో అరెస్టు చేశారు. రాజమండ్రి సెంట్రల్ జైలులో కొంతకాలం వున్న తరువాత రాయ వేలూరు సెంట్రలు జైలుకు పంపించారు. 'సీ' క్లాసుయిచ్చారు. జైలు జీవితం రుచిచూసిన శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ గారు వ్రాసిన "ఏమి పాపంబొ సీక్లాసు నీసడించి, గౌరవముఁజూవ కిసుమంతక్రౌర్యముననుఅడలు గొల్పెదరెంతో. నిరాదరమున మోటు లాఠీల వార్డరుల్ మూఢ మతులు" కవిత నాటి స్త్రీల చెరసాలలో 'సీ' క్లాసును చక్కగా వర్ణించుతుంది. విద్య, వివేకం ఆత్మాభిమానంగల శ్రీమతి లక్ష్మి బాయమ్మ ఆ అనాగరికతను సహించలేక పోయినారు. తోటి స్త్రీ ఖైదీలను కూర్చుకొని జైలులో అనేక సత్యాగ్రహాలు సాగించారు. అంతా కాకపోయినా కొంతవరకు జయించారు. కాని ఆమె ఆరోగ్యం దెబ్బ తిననే తిన్నది.

1931లో శాంతి సమర వీరులను తీర్చి దిద్దటానికి ఆమె భీమవరంలో శిబిరం నిర్వహించారు. శ్రీమతులు కంభంపాటి మాణిక్యాంబ వంటి అనేక యువతులకు అక్కడ శిక్షణ యిచ్చారు. 1932 అక్టోబరు ఆఖరున పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభలో పాల్గొని శాసన ధిక్కారం చేసిన కారణంగా ఆమెను భీమవరంలో అరెస్టు చేశారు. తిరిగి రాయవేలూరు జైలుకు వెళ్ళారు. విడుదలై వచ్చినా ఆమె కార్యకలాపాలు ఆగిపోలేదు. 1924 లో బెల్గాం కాంగ్రెసుకు హాజరై పాల్గొనటంతో ఆరంభించిన ఆమె ప్రతి కాంగ్రెసు సమావేశానికి వెళ్ళి పాల్గొనేవారు. కాంగ్రెసు నడిపించిన అన్ని

ఉద్యమాలలోను జీవితాంతం ఆమె పాల్గొంటునే ఉన్నారు. కాంగ్రెసు ప్రచారం చేస్తూనే ఉన్నారు.

1939 లో కృష్ణా జిల్లా బోర్డు ఎన్నికలు వచ్చినవి. కాంగ్రెసు పార్టీవారు జనరల్ సీటుకు వల్లభనేని రామబ్రహ్మంగారిని, స్త్రీల రిజర్వుడు సీటుకు శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ని నిలబెట్టారు. మంచి పలుకుబడి గలవారు. వారికి ప్రత్యర్థులుగా నిల్చారు. శ్రీమతి లక్ష్మీ బాయమ్మకు కాంగ్రెసు విజయం ముఖ్యం. అందువల్ల ఆమె వెంటనే అక్కడకు వెళ్ళి తీవ్ర ప్రచారం చేసి కాంగ్రెసు విజయానికి తోడ్పడ్డారు.

ఆమె ఏకైక పుత్రుడు సుందర రామారావు. తల్లి మెచ్చే గుణగణాలు గలవాడు. తానొక అవసరాన్ని మానుకొని అయినా యితరులకు ఆ మొత్తాన్ని అందించి తృప్తిపడేత్యాగి, రూపసి, విద్యావంతుడు. బి.ఏ. చదువుతు 1940 లో తల్లి తండ్రులను ఘోర దుఃఖ సాగరంలో ముంచి పరమ పదించాడు. లోకమంతా శూన్యంగా తోచిన ఆ తల్లి అరుణాచలం వెళ్ళారు. శ్రీ రమణ మహర్షి సాన్నిధ్యంలో కొంతకాలం ఉన్నారు. సుప్రసిద్ధ వీరాంగన, దేశసేవిక, విదుషి అయిన శ్రీమతి పొణకా కనకమ్మ గారు తమ ఏకైక సంతానమైన కుమార్తెను పోగొట్టుకొని, శ్రీ రమణ మహర్షి సాన్నిధ్యంలోనే ఆ సమయాన వున్నారు. ఈ యిద్దరు మహిళలను దేశభక్తి జైలులో కలపి నట్లే కడుపు శోకం మహర్షి ఆశ్రమంలో కలిపింది. ఆనాటినుండి వారిది విడని జంట అయింది. మనసు తేలిక పరచుకోవటానికి సాహిత్యం, అధ్యాత్మిక చింతన మిశ్రితం చేశారు. జ్ఞాన నేత్రము, ఆరాధన, ఉన్నది అంతా ఒకడే, తానెవరు, పూజాకుసుమము వంటి వేదాంత రచనలెన్నో సాగించారు. శ్రీ రమణ మహర్షి ఆశ్రమ ఆముష్మిక జీవితాన్ని అభివర్ణించుతు, ఎన్నో వ్యాసాలు వ్రాశారు. భగవద్గీతను తేటగీతాలలో, అతి చక్కగ సుబోధకంగ తెలుగు చేశారు. అప్పటికి యిప్పటికి భగవద్గీత జోలికి వెళ్ళిన స్త్రీలు వీరిద్దరే. చివరకు జంటకవయిత్రులుగా ప్రసిద్ధమైనారు. గృహలక్ష్మి స్థాపకులైన డాక్టరు కే. యస్. కేసరిగారు శ్రీమతి లక్ష్మీబాయమ్మ గారికి స్వర్ణకంకణాన్ని గృహలక్ష్మి పత్రిక తరఫున సమర్పించి సత్కరించారు.

"శారద యామినీ మధుర చంద్రికలన్ యమునా తరంగిణీ తీర వినిర్మలోపవని తీయని గీతము లాలపించునీచారు మనోహరాకృతి,

నచంచలదృక్కుల కోర్కెలూరగా సారెకు చూచిచూచి. తమితాళక సోలుట తీయవే ప్రభూ" ఇదీ ఆమె రచనాశైలి. ఎంతో సరళం, మధురం.

ఆమెకు తలకు మించిన బాధ్యతలు లేవు. ఈదవలసిన పెద్ద కుటుంబం అసలే లేదు. కాని ఆమెకు స్వాతంత్ర్య జీవనంలో ఆసక్తి యెక్కువ. తాను నాలుగు డబ్బులు సంపాదించ గలిగితే అవి పరిపూర్ణమైన స్వేచ్ఛతో ఆపన్నులకు, అసహాయులకు నిస్సంకోచంగ యిచ్చి ఆదుకోవచ్చును. నలుగురికి వుపకారం చేయవచ్చును. ఆ సంకల్పంతో ఆమె విజయవాడలో వున్న దక్కన్ ఇన్సూరెన్సు కంపెనీకి ఏజంటుగా పనిచేశారు. ఆ కంపెనీ యెత్తేసేవరకు పని చేసి ఎంతోమంది బీద విద్యార్థులకు సహాయం అందించారు.

ఎక్కడ ఏ అవకాశం వచ్చినా దానిని సద్వినియోగం చేసుకుని తన కష్టార్జితాన్ని యితరులకు సంతోషంగ పంచారు. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ ఆధ్వర్యాన నడుస్తున్న కేంద్ర స్త్రీ సంక్షేమసలహా సంఘంలో శ్రీమతి లక్ష్మీబాయమ్మ 1955 నుంచి సభ్యురాలుగావున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా ఇంప్లిమెంటింగు కమిటీ ఛైర్మన్‌గా నాలుగయిదు సంవత్సరాలు సేవ చేశారు. తాలూకాలలో, గ్రామాలలో విరివిగా సెంటర్లు నెలకొల్పి వాటి తరపున స్త్రీలకు చదువుకునే అవకాశాలు, కుట్లు అల్లికలవంటి వుపయోగకరమైన చేతిపనులు, ప్రసూతి కేంద్రాలు, వైద్య సౌకర్యాలు యెన్నో ఆమె కల్పించి యెనలేని సహాయంచేశారు. ఎంతోమంది స్త్రీలకు తమకాళ్ళపైన తాము నిలబడగల శక్తిని ఆత్మధృతిని కల్పించారు. మహిళాభ్యున్నతి ఆమెకు అతి ప్రధానం.

1956లో ఆంధ్రప్రదేశ్ అవతరించింది. దానికొక ప్రభుత్వయంత్రాంగం అవసరమయింది. మొట్టమొదట యేర్పరచిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన మండలికి శ్రీమతి లక్ష్మీబాయమ్మను సభ్యురాలుగా ఎన్నుకున్నారు. ఆ పదవిలో ఆమె రెండుసంవత్సరాలు వున్నారు. ఆ తరువాత విధానపరిషత్తులో సభ్యురాలుగా ఆరు సంవత్సరాలు పనిచేశారు. ప్రభుత్వ యంత్రాంగంలో వున్నా యెనిమిది సంవత్సరాలకాలంలోను పూచిక పుల్లంత ఆస్తి పాస్తులు సమకూర్చుకోలేదు. నిస్వార్థంగాను ఏవిధమైన ప్రతిఫలాపేక్ష లేకుండానే సేవజేశారు. వీలైనంత మందికి చేతనయినంతగా వుపకారం చేశారు. ఆమెజీవితకాలంలో స్వాతంత్ర్య సమరయోధులకు పెన్షను యిచ్చే

పథకం కూడ లేదు. అందువల్లకానీడబ్బు తీసుకోకుండానే ఆమెజీవితం గడిచి పోయింది. వార్ధక్యం వచ్చింది. ఆధ్యాత్మిక, సాహిత్య స్త్రీ విద్యారంగాలలో పేడని జంటగావున్నా శ్రీమతి పోణకా కనకమ్మ అస్తమించారు. శ్రీమతి మనపాకం కమలమ్మవంటి మిత్రులు దాటిపోయినారు. అయినా ఆమెకు జీవితం భారంగా తోచలేదు. స్వార్థచింతనతో తమ అశక్తతకు బలహీనతకు తమపై తామె జాలిపడి నీరుగారిపోయేవారికి ఆ బాధలు - తనది, తనకు అనే ధ్యాస లేకుండా ఇతరులకు యిది చేయాలి, అదిచేయాలి, యింకా చేయాలి అనే సేవాతత్పరతతో జీవించే వారికి ఏ ఆధి వ్యాధులు అడ్డురావు. మహిళా సమాజ కార్యకలాపాలు చక్కగా నెరవేర్చాలి. బాబాపూమందిరం త్వరలో నిర్మాణం చేయాలి అనే ఆరాటంతోనే ఆమె పరమపదించారు. చాలా స్నేహశీలి. ఎవరిని విమర్శించి ఎరుగని వ్యక్తి. శ్రీమతి లక్ష్మీబాయమ్మ గొప్పకవయిత్రి. భగవద్భక్తురాలు. ఆధ్యాత్మిక సాధనలో జీవితం గడిపిన సాధకి. మాతృదేశ దాస్యవిమోచనమే సర్వస్వంగా ఎంచి కార్యరంగంలోకి దూకిన దేశ సేవిక. మొరటు లాఠీ దెబ్బలకు, జైలు జీవితానికి వెరువని ధీర. సాహిత్యసేవను, సంఘసేవను, దేశసేవను మానవసేవకు వినియోగించుకుని, నిస్వార్థసేవగా రూపొందించ గలిగిన ధన్యురాలు.

ఇన్ని రంగాలలో ప్రతిభా వంతురాలయిన శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మ గారిని బహుకాలం గుర్తు ఉంచుకోగలరు.

---

# శ్రీమతి గోళ్ళమూడి రత్నమ్మ

జననం 1886 మరణం 5-7-1972

సముద్రంలో కొత్త అలలేచినప్పుడుచూడ ముచ్చటయిన రకరకాల గవ్వలను ఆలిచిప్పలను తీరాన వెదజల్లి వెళ్తు వుంటుంది. అట్లాగే స్వాతంత్ర్యోద్యమం, సర్దుగా నాలుగు గోడల మధ్య జీవితాలు గడుపుతున్న స్త్రీలను చైతన్య వంతులను చేసి మహోజ్జ్వల దేశసేవికలుగా దేశం నాలుగు మూలల ప్రకాశింప చేసింది. వారిలో కొందరు ఆవేశంతో, వుత్తేజంతో అంతటా తామే అయి వ్యవహరించితే మరికొందరు కర్మ యోగినులుగా ప్రశాంతంగ, నలుగురిని కూడగట్టుకుని, నలుగురి చేత నిరవధిక కృషిచేయించి గురుత్వం వహించి వుద్యమాలకు వెన్నె ముకలయినారు. శ్రీమతి గోళ్లమూడి రత్నమ్మ అటువంటివ్యక్తి.



శ్రీమతి గోళ్ళమూడి రత్నమ్మ

గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని చేబ్రోలులో ఆమె 1886 లో జన్మించారు. సంపన్న రైతుకుటుంబంలో శ్రీ వాసిరెడ్డి సాంబయ్య, శ్రీమతి పార్వతమ్మగార్ల ఏకైక సంతానంగా జన్మించారు ఆమె. బట్టలో సొమ్ములో, బొమ్మలో అడగటానికి బదులు ఆమె చదువుపట్ల ఆసక్తి కనపరచేది. అసలే ఆనాడు ఆడపిల్లలకు బడులు లేవు. ఆపైన ఘోషా పద్ధతి వుండేది వారి యిళ్లలో. అయినా తల్లి దండ్రులు చేతనయినంతగా సహకరించారు. ఆమె భారత, భాగవతాది వుద్గ్రంథాలు, సద్గ్రంథాలు నిత్యం చదువుతునే వుండడంతో తెలుగులో మంచి పాండిత్యం అబ్బింది. చిన్నవయసులోనే తండ్రి చనిపోయినారు. ఆనాటి ఆచారం ప్రకారం ఆమెకు బాల్యంలోనే చేబ్రోలు

వాసిఅయినా శ్రీ గోళ్ళమూడి చంద్రమౌళితో వివాహమయింది. బహుకాలం ఆమె అనారోగ్యంగా వుండి వైద్యాలు, నోములు, వ్రతాలు గ్రంథ పఠనంతోనే కాలంగడిచిపోయింది.

1921లో స్వరాజ్య యాత్రచేస్తు గాంధీజీ చేబ్రోలు వచ్చారు. ఆముష్మిక స్వాతంత్ర్యానికి మార్గాలు అన్వేషించుతున్న ఆమెకు దేశ స్వాతంత్ర్యం కూడ మనిషికిఅవసరమని గాంధీజీ వుపన్యాసాలతో దృఢ అయింది. గాంధీజీ శిష్యరికం వహించి, రాట్నం తిప్పటం, ఖాదీ ధరించటం ఆరంభించారు. దేశ సేవలో పరిపూర్ణంగానిమగ్నులు కావాలని వాంఛించారు. కాని దురదృష్టవశాత్తు ఆమె కప్పుడు వైధవ్యం ప్రాప్తించింది. బిడ్డలయినా లేని ఆమె ఆ బాధకు తట్టుకోవటానికి కొన్ని సంవత్సరాలు పట్టింది. గ్రంథపఠన చేస్తు రాజకీయ పరిస్థితులను అవగాహన చేసుకుంటు కాలం దొర్లించారు.

1928 లో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభలకు ఆమె వెళ్లి వచ్చారు. ఆ మరుసటి సంవత్సరం ఖాదీ ప్రచార యాత్ర చేస్తు గాంధీజీ మరొకమారు చేబ్రోలు వచ్చారు. పై సంవత్సరమే 1930లో ఉప్పు సత్యాగ్రహ వుద్యమం దేశంలో గొప్ప సంచలనం కలగచేసింది. అచంచల దేశ సేవకు లయిన శ్రీ ఉన్నవ దంపతులు తమ ప్రచార సందర్భములో తరుచు చేబ్రోలు వచ్చి ప్రజలను, వుద్బోధించుతు వుండేవారు. దేశసేవను, రాజకీయాలను తమ ముఖ్య వ్యాసంగంగా భావించి శ్రీమతి రత్నమ్మగారు వుద్యమంలో ప్రవేశించారు. స్వయంగా ఖాదీ ధరించటంతోను, తల్లి శ్రీమతి పార్వతమ్మగారు సన్నగా నూలు వడికి బట్టలు నేయించి దేశనాయకులకు కానుకలుగా పంపటం తోను ఆమె తృప్తి పడలేదు. విదేశీ బట్టల దుకాణాలముందు పికెటింగు ఆరంభించారు. నలుగురిని కూడగట్టుకుని, నలుగురికి తాను విశ్వసించిన విషయం విడమరచి చెప్పటం, తన మార్గాన వారిని నడిపించటం ఆమెకు సహజ లక్షణం. అందువల్ల తోటి స్త్రీలననేకమందిని సమకూర్చుకుని, ఘోషా పద్ధతిని పక్కకు నెట్టించి సామూహికంగా దుకాణాల దగ్గర పికెటింగు ముమ్మరంగా చేయించారు. తనకున్న చక్కని భాషా పాండిత్యాన్ని, విషయ పరిజ్ఞానాన్ని, అనర్గళధారను వుపయోగించి వుత్తేజ పూర్వకంగా బహిరంగ సభలలో వుపన్యసించేవారు. ఘోషా స్త్రీ యీవిధంగా వుద్యమంలో పాల్గొనటం చూసిన పురుషులు, స్త్రీలు నిస్సంకోచంగ తామూ వుద్యమంలో పాల్గొన

నారంభించారు. ఈ విప్లవనాయికను యిక వుపేక్షించరాదని ఆమెను పికెటింగు చేస్తుండగా అరెస్టు చేశారు. రకరకాల నేరాలు మోపి ఆమెకు 6 నెలలు శిక్ష విధించారు. 15 రోజులు పొన్నూరు సబ్ జైలులో వుంచారు. రాయవేలూరు పంపక ముందే, గాంధీ ఇర్విన్ ఒడంబడిక ననుసరించి ఆమెను విడుదల చేశారు.

విడుదలయితే చేశారు కాని స్వరాజ్యం యివ్వలేదు కదా. ఆమె తన ప్రచార కార్యకలాపాలను తిరిగి ఆరంభించారు. ఉపరి శ్రీమతి భారతీదేవి రంగాతో కలిసి పొన్నూరు, బాపట్ల, చీరాల, తెనాలి వంటి పొరుగూళ్లువెళ్లి కాంగ్రెసు ప్రచారం, ఖాదీ ప్రచారం చేస్తు వుపన్యాసాల ద్వారా ప్రబోధించేవారు. అహింసా యుద్ధంలో పాల్గొనే శాంతి సైనికులను తీర్చి దిద్దటానికి ఆరోజుల్లో అనేక ప్రాంతాలలో శిబిరాలు స్థాపించి నిర్వహించేవారు. పోలీసులు పురుషులపై దారుణంగా లాఠీచార్జీలు చేసి శిబిరాలను ఛిన్నా భిన్నం చేస్తుండే వారు. ఆ సమయాలలో స్త్రీలు సమర్థవంతంగ శిబిరనిర్వహణను అందుకునేవారు. అందులోను శ్రీమతి రత్నమ్మ అందెవేసినచెయ్యి కావటంతో యెక్కడ శిబిరం స్థాపించినా ఆమెకు కబురు రావలసిందే. ఆవిధంగా ఆమె అతి సహజంగ, అప్రయత్నంగ నాయికగా, వుద్యమం నడపటానికి పూతంగా నిలిచేవారు. తీరిక కలిగినప్పుడల్లా పికెటింగులు, వుపన్యాసాలు వుండనే వున్నవి. 1932 మార్చి 13న శాసన ధిక్కారంచేస్తు నగర సంకీర్తనం పికెటింగులు చేసిన కారణంగా ఆమెను ఆమె బృందాన్ని అరెస్టు చేసి సాయంత్రం వదిలారు. ఆమె భయపడక శ్రీమతులు తుమ్మల చంద్రమ్మ, కోనేరు మంగమ్మ, హనుమాయమ్మగార్లతోపాటు 75 సంవత్సరాల వయసుగల తన తల్లితో సహా మార్చి 17న తిరిగి సత్యాగ్రహంచేశారు. ఇక యీసారి వాళ్లను అరెస్టుచేసి పొన్నూరు జైలులో కొన్ని రోజులు వుంచారు. అక్కడనుంచి రేపల్లె జైలులోకొన్నిరోజులు వుంచి విచారణ జరిపి 6 నెలలు కఠిన శిక్ష విధించారు. సీక్లాసు యిచ్చి ఆమెను కన్ననూరు జైలుకు, తల్లినిరాయవేలూరు జైలుకు పంపించారు.

విడుదలయి వచ్చియింకా తీవ్రంగ వుద్యమంలో పాల్గొన్నారు. వివిధ ప్రాంతాలలో శాసనధిక్కారంచేయించటానికి నియమితులైన ఆంధ్ర రాష్ట్ర మహిళానియింతల మహాసభ 1933 మార్చి 10న గుంటూరులో జరిగింది.

ఆ మహాసభకు ఆమె అధ్యక్షత వహించారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు ఆమెను మహిళా నియంతలందరిపైన దళాధిపతిగా ప్రధాన నియంతగా నియమించారు. ఆమె పదిమందిని కూడగట్టుకుని శాసన ధిక్కారం ఎంత తీవ్రంగా చేయించగలదో గ్రహించిన ప్రభుత్వం మార్చి 16న ఆమెను అరెస్టు చేసి 10 నెలలు శిక్ష విధించారు. రాయవేలూరు జైలులో కొంత కాలం, కన్ననూరులో కొంత కాలం వుండి విడుదలయి వచ్చారు. ఇప్పటి కది రెవ సారిజైలు వాసం.

అనేక మంది 1930, 32 వుద్యమాలలో పాల్గొని, అంతటితో రాజకీయాలకు దూరంగా వెళ్లారు. కాని శ్రీమతి రత్నమ్మగారు వదల లేదు. ప్రతి సంవత్సరం ఆచార్య రంగాగారు నిడుబ్రోలులో జరిపే రాజకీయ పాఠశాలలో పాల్గొనే వారు. దేశంలో యెక్కడ రాజకీయ సభలు, సమావేశాలు జరిగినా హాజరయేవారు. జిల్లా కాంగ్రెసు సంఘం, రాష్ట్ర కాంగ్రెసు సంఘాలలో సభ్యురాలుగా వుండి కాంగ్రెసు ప్రచారం చేసేవారు. అసహాయోద్యమం బదులు, రాజ్యాంగ నిర్వాహణలో సహకరించటానికి, అఖిల భారత కాంగ్రెసు సంఘం తీర్మానించు కున్నారు. అందువల్ల 1936లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులను నిలబెట్టారు. గుంటూరు జిల్లా బోర్డుకు తెనాలి, రెవెన్యూ ఫిర్కా నుండి కాంగ్రెసు అభ్యర్థినిగా ఆమెను ఎంపిక చేశారు. బారిస్టరు, ప్రముఖ జస్టిస్ పార్టీ నాయకుడు అయినా శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిని అధికమెజారిటీతో వోడించి, ఆమె తనపార్టీకి విజయం సమకూర్చారు. తిరిగి 1939లో పొన్నూరు నియోజక వర్గంనుంచి గుంటూరు జిల్లా బోర్డుకు కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేశారు. ప్రముఖ భూస్వామి, జస్టిస్ పార్టీ నాయకుడు అయిన శ్రీ పాముల పాటి వెంకట కృష్ణయ్యని ఓడించి మరొకసారి ఆమె తనపార్టీ గౌరవం పెంపొందించారు.

ఆమె కెప్పుడు పదిమందిని కూడగట్టుకుని పదిమందికి పనికివచ్చేపనులు చేయటం అలవాటు. చిన్ననాటి నుంచి పుస్తకాలు చదవటం ఆమెకు దినచర్యలో ఒక భాగం. అందువల్ల 1939లో చేబ్రోలులో ఒక మహిళా గ్రంథాలయం స్థాపించి ఆమె అధ్యక్షులుగా శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి దేవి కార్యదర్శినిగా, నిర్వహించారు. అక్కడ తరుచు పురాణకాలక్షేపాలు, రాజకీయ చర్చలు సమావేశాలు కూడ జరుగుతు వుండేవి. స్త్రీ విద్యయెంత వృద్ధిపొందితే

దేశం అంత పురోగమించగలదని శ్రీమతి రత్నమ్మగారి విశ్వాసం. అందు వల్ల 1940లో చేబ్రోలులో స్త్రీలకు ప్రత్యేకంగా హిందీ విద్యాలయం స్థాపించ టానికి కారణభూతులైనారు. అదే గుంటూరు జిల్లా హిందీ మహావిద్యా లయంగా ప్రఖ్యాతి పొందింది. పేరు గడించిన విద్యాసంస్థకావటంతో అనేక మంది పురుషులుకూడ అక్కడ హిందీలో పట్ట భద్రులైనారు. ఆమె యేసంస్థనెలకొల్పినా స్వయంగా దాని అభివృద్ధికి పాటు పడటం, అర్థికంగా శక్తికొద్ది ధన సహాయం చేయటం, యింకా అవసరపడితే చందాలు విరాళాలు సేకరించి చేయూత నివ్వటం పరిపాటి. అందువల్ల ఆ సంస్థలన్నీ విజయ వంతంగా పనిచేయటం జరుగుతుంది.

ఈ కార్యకలాపాలలో పాల్గొంటున్నా ఆమె రాజకీయాలను మరవలేదు. అనుక్షణం దేశసేవ చేయగల అవకాశాల కోసం ఎదురుచూస్తునే వుండేవారు. 1940లో వ్యక్తి సత్యాగ్రహం జరపమని గాంధీజీ ఆదేశించారు. ఆమె సత్యాగ్రహం చేశారు. కాని ప్రభుత్వం ఆమెను అరెస్టు చేయలేదు. ఇంతలో 1942లో క్విట్ ఇండియా ఉద్యమం దేశాన్ని సంక్షోభ పరచింది. ఆమె సత్యాగ్రహం చేసి అరెస్టయినారు. కాని శిక్షవిధించకుండా విడుదల చేశారు. ఆమె మళ్లీ కొంతమంది స్త్రీలను సమకూర్చుకుని శాసన ధిక్కారం చేయటానికి నిశ్చయించుకుని 1944 జనవరి 26న స్వతంత్రదిన వుత్సవాలను పెద్ద పెట్టున జరిపారు. ఫలితంగా మరొక మారు అరెస్టయి రాయవేలూరు జైలులో 6నెలలు శిక్షననుభవించి వచ్చారు.

1945లో చేబ్రోలులో ఆంధ్ర రాష్ట్ర మహిళారాజకీయ శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. అప్పుడు సమర్థనీయులయిన యువతులకు బాసటగా మార్గదర్శకులుగా గురువులుగా వ్యవహరించారు. ఆశిబిర నిర్వాహణ సమయంలో శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు, అయ్యదేవర కాళేశ్వర రావు, ఆచార్య రంగా, శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగార్లు వంటి ఆంధ్రనాయకులు, శ్రీమతి కమాలాదేవి చట్టోపాధ్యాయ కూడ చేబ్రోలు రావటంతో వూరంతా ఒక తిరణాలగా కోలాహలంగా ఉండేది. గ్రామస్థులందరు వుత్సాహంతో సహకరించారు. శిబిర నిర్వహణ విజయ వంతంగా ముగిసింది. 1946లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థుల విజయానికి ఆమె అవిరళ కృషిచేసి తోడ్పడ్డారు.

రాజకీయాలలో మునిగి తేలినా ఆమె యేనాడు ఆధ్యాత్మిక చింతనకు దూరంకాలేదు. రెండింటిని చక్కగా సమన్వయ పరచారు. సత్తెనపల్లిలోవున్న తమ గురువుకు గురువుగారి మఠం అభ్యున్నతి కోసం విరాళాలు సేకరించి శాశ్వత ఆదాయం కల్పించారు. స్వయంగా అనేక మందికి బ్రహ్మ విద్య బోధించారు. చేబ్రోలులో తమ గురువుగారి పేరు ఒక మఠం నిర్మించారు. దాని నిర్వాహణకు స్వయంగా కొంత భూమిని యిచ్చి, విరాళాలు సేకరించి తోడ్పడ్డారు. అక్కడ జాతిపిత గాంధీజీ, శ్రీమతి కస్తూరిబాయి గాంధీ చిత్రపటాలు ఆవిష్కరించారు. ఒక గ్రంథాలయం ఏర్పర్చారు. అక్కడ జాతీయోత్సవాలు కూడ జరిపి, దేశభక్తులను స్వాతంత్ర్య సమరయోధులను సమావేశ పరచేవారు. స్వాతంత్ర్యసమరంలో పెద్ద వయసులో అమితోత్సాహంతో పాల్గొని జైలుకు కూడ వెళ్లి వచ్చిన ఆమె తల్లి శ్రీమతి వాసిరెడ్డి పార్వతమ్మ గారు 94 సంవత్సరాల పండు వయసులో గాంధీ జయంతినాడు మరణించారు. అందువల్ల జాతిపిత జయంతిని, కన్నతల్లి వర్ధంతిని పురస్కరించుకుని గాంధీ జయంతిని మరింతఘనంగా జరిపేవారు.

సంపన్న గృహిణి అయిన ఆమె తన సంపద యావత్తు ప్రజాహితకార్యాలకు దానధర్మాలకు వినియోగించారు. ఆమెకెప్పుడు తానుయేవో ఘనకార్యాలు సాధించి కీర్తి పొందాలన్న వాంఛ వుండేదికాదు. పదిమందిని కూడగట్టుకుని వారిచేత గొప్పపనులు చేయించి వారిలో వున్న సామర్థ్యాన్ని బయటికి తీసుకు వచ్చేవారు. చేబ్రోలు గ్రామంలో శ్రీమతులు పాటిబండ్ల పార్వతమ్మ, రావెళ్ల వెంకాయమ్మ, సూర్యదేవర రాజ్యలక్ష్మి దేవి, రాజకీయ సోది చెప్పి ప్రఖ్యాతిగాంచిన దేవభక్తుని హనుమాయమ్మ, వాసిరెడ్డి నాగమ్మ, సూర్యదేవర అన్నపూర్ణమ్మగార్లు వంటి 15-20 మంది ఘోషా స్త్రీలుబయటికి వచ్చి అమితోత్సాహంతో స్వాతంత్ర్య సమరంలో పాల్గొని రెండు సార్లు మూడుసార్లు కూడ జైలు శిక్షలను ఆనందంగా అనుభవించారంటే అది శ్రీమతి రత్నమ్మగారి ప్రభావమే. ఆమె పుటకతో మార్గదర్శకురాలు, నాయిక, గురువు. నిరంతర భగవద్ధ్యానంలో 86 ఏట 1972 జులై 5న ఆమె పరమపదించారు.

---

# శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మ

జననం 1902

శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మగారికి యినాడు 77 సంవత్సరాల వయసు బక్కపలచగా, పచ్చని శరీర ఛాయతో, సాత్వికంగా వుంటారు. ఏ సమయంలో యింటికి వెళ్లినా అప్యాయతతో 'అమ్మా రవంత మజ్జిగ యివ్వనా, కాస్త పానకం చేసి తీసుకురానా?' అని అడుగుతారు. ఆమె వంగిన నడుముకు కారణం పాదాలమీదకు జీరాడే ఖాదీచీరె భారమూ కాదు, వయోభారము కాదు. దాని వెనక కావలసినంత గాథ వున్నది.


శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మ

అది 1932వ సంవత్సరం. మాతృదేశ సేవలో శాంతి సమరంలో పాల్గొనిన స్త్రీ రాజకీయ బందీలతో రాయవేలూరు జైలు కిక్కిరిసి వున్నది. వారిలో శ్రీమతి జానకీ బాయమ్మగారు ఒకరు. ఉన్నట్లుండి ఒక రోజున అమె గదిలో నుంచి బుల్లిపాప యేడుపు వినిపించింది. ఎ, బి క్లాస్లు స్త్రీ ఖైదీలందరు ఒకేవార్డులో వుండేవారు. 'జానకీ బాయమ్మ వదినగారి యోగమాయను చూద్దాం రండి' అని వరసలు కలుపుకుంటా, సంబరపడుతు వార్డులో వాళ్లందరు వచ్చారు. ఆ యోగమాయే శ్రీమతి జానకి బాయమ్మ గారి తొలిసంతానం చిరంజీవి రఘుమాయాదేవి. మామూలు పరిస్థితులలో అయితే మాతామహులు శ్రీ మల్లిమడుగుల బంగారయ్య పంతులు, శ్రీమతి లలితాంబల యింట విశాఖపట్నంలో పుట్టవలసిన బిడ్డ ఆమె. విశాఖ పట్నంలో తీవ్రంగ శాసనోల్లంఘన ప్రచారం చేసి, సభలు సమావేశాలు జరిపి, పికెటింగులు, హర్తాళులు నడిపి, ఉప్పు తయారు చేసి 18 నెలలు శిక్ష అనుభవించటానికి

వచ్చిన శ్రీమతి జానకీ బాయమ్మగారికి రెండవ నెల గర్భమని యింట్లో వారికే తెలియదు. పురిటి సమయం వచ్చింది. ఇక మీదట రాజకీయాలలో పాల్గొనని ఒక కాగితం ముక్క వ్రాసిచ్చి సుఖంగా యింటికి పొమ్మని జైలు అధికారులు ఆమెకు యెన్ని విధాలుగానో చెప్పిచూశారు. నేను జైలుకు వచ్చి స్వాతంత్ర్యం తేలేక పోతున్నానేమో, కాని క్షమార్పణ యిచ్చి యింటికి పోయినా దేశానికి అపఖ్యాతి తీసుకురాను అని ఖచ్చితంగా చెప్పేశారు. కాన్పు జైలులోనేజరిగింది. నెలల పర్యంతం బూడిద గుమ్మడికాయకూర తినటం, చాలింతగా బాలింతగా నేల మీద పడకోవటంతో పాపం ఆమెకు నడుమునొప్పి, బలహీనత ఏర్పడి, యిప్పటికి ఆమెను దిగ దీస్తున్నవి. పుట్టిన పాపకు మాత్రం శ్రీమతి కోటమార్తి కనకమ్మ స్నానంచేయించితే, శ్రీమతి భారతీ రంగా చొక్కా వేస్తే, శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి షికారు తిప్పుతు రాజోపచారాలు చేశారు.

ఆమెకు యిది రెండవసారి జైలు వాసం. ఆమె కుటుంబ వాతావరణం పరిశీలించితే ఆమె యీ విధంగా రెండవసారి జైలు శిక్ష అనుభవించటం గాని క్షమార్పణ చెప్పకోనని నిరాకరించిటం గాని చాలా సహజంగ తోస్తుంది. ఆమె పెద్ద తల్లి శ్రీ గిరిగారి తల్లి అయిన శ్రీమతి వరహాగిరి వెంకటసుబ్బమ్మ, పెద్ద తండ్రి శ్రీ జోగయ్య పంతులుగారు, వారి కుటుంబ సభ్యులందరు దేశ సేవకులే. అత్తవారి యింట్లో బావగారు శ్రీ దిగుమర్తి హనుమంతరావు, తోటికోడలు శ్రీమతి బుచ్చి కృష్ణమ్మ, భర్తగారు శ్రీ రామస్వామి దేశభక్తికి గాంధీజీ శిష్యరికానికి ప్రసిద్ధి పొందినవారే. అత్తగారు శ్రీమతి బంగారమ్మగారిని గురించి చెప్పకు తీరాలి. ఆమె చాలా నిష్టపరురాలు. కాని నెల్లూరు పినాకినీ ఆశ్రమంలో వున్నప్పుడు అన్నికులాలకు చెందిన ఆశ్రమ వాసులయిన పిల్లలకు స్వయంగా తలలు దువ్వి, స్నానాలు చేయించే వారు. అన్ని జబ్బుల రోగులను తాకి స్వయంగా సపర్యలు వైద్యాలు చేసేవారు. నూలు వడికేవారు ఆ నూలుతో తువాళ్లు నేయించి బీదలకు పంచేవారు. కోడళ్లను నివారించకపోగా ఆమె స్వయంగా అన్ని సభలు సమావేశాలకు వెళ్లి లాఠీ దెబ్బలు కూడ తిన్నారు. సత్యాగ్రహంచేయబోతున్న స్త్రీలకు బ్రతిమలాడి పెరుగన్నం పెట్టి బయటికి పంపిన చల్లని తల్లి. ఇంతనీ స్వతంచేసుకున్నారు శ్రీమతి జానకీబాయమ్మగారు.

ఆమె 1902లో విశాఖపట్నంలో జన్మించారు. ఆరోజుల్లో ఆడ పిల్లలకు ప్రత్యేకించి స్కూళ్లు లేవు. అందువల్ల సోదరులతోపాటు వాళ్ల బడిలోనే చదువుకుంటూవుండేవారు. 12 ఏళ్లకు శ్రీ దిగుమర్తి రామస్వామితో వివాహం అయింది. అ తరువాతనే విశాఖపట్నంలో క్వీన్ మేరీస్ హైస్కూలు స్థాపించబడింది. భర్త అనుమతితో ఆస్కూలులోనే స్కూలు ఫైనలు చదివి స్కూలు మొత్తం మీద మొదటి స్థానంలో వచ్చి బంగారు పతకం సంపాదించుకున్నారు. మద్రాసు క్వీన్ మేరీస్ కాలేజిలో చేరి ఇంటర్మీడియట్ చదివారు. కాని కంటి జబ్బు కారణంగా ముగించలేదు. 1918లో భర్త వుద్యోగరీత్యా గుంటూరు వెళ్లారు. ఆ కాలంలో కాలేజీలో చదువుకున్న స్త్రీలు చాలా అరుదు. అందువల్ల ఆమెను ఎడ్యుకేషనల్ కమీటీలో సభ్యురాలుగా ఆహ్వానించారు. అక్కడ యెవరి సలహా సంప్రదింపులకు విలువ వుండదన్న వుద్దేశంతో ఆమె నిరాకరించారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గారు శారదా నికేతనమనే స్కూలును తమ యింట్లోనే స్థాపించారు. వయోజనులైన స్త్రీలకు చదువు చేతిపనులు నేర్పేవారు. అక్కడ ఆమె ప్రతిరోజు లెక్కలు ఇంగ్లీషు బోధించి తమ చదువు సార్థకమైనదని సంతోషించేవారు.

1919లో రౌలట్ చట్టాన్ని గాంధీజీ నిరసించారు. పర్యవసానంగా అనేక మంది ప్రభుత్వోద్యోగాలను వదిలివేసి గాంధీజీ మాట పాటించారు. శ్రీరామస్వామి కూడ గుంటూరులో తమ వుద్యోగానికి రాజీనామా యిచ్చి నెల్లూరులో గాంధీజీ శంఖుస్థాపన చేసిన పినాకినీ ఆశ్రమానికి చేరుకున్నారు. అక్కడవున్న ఒక్కటిన్నర సంవత్సరం శ్రీమతి జానకీబాయమ్మ ప్రఖ్యాత దేశ సేవిక శ్రీమతి పొణకా కనకమ్మతో కలిసి ప్రతి వుదయం ప్రభాత ఫేరీలు జరిపేవారు. జాతీయ కార్యక్రమాలన్నిటిలోను పాల్గొనేవారు. ఆమె వుత్సాహానికి తృప్తికి అవధులు లేవు. ఇంతలో అఖిలభారత కాంగ్రెసు సంఘంవారు ఆమె భర్తను బరంపురం కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా నియమించటంతో అక్కడకు వెళ్లవలసి వచ్చింది. కాంగ్రెసు ఆశయాలు, లక్ష్యాలు సాధన మార్గాలు అన్నీ ఆమెకు నిత్యజీవితంలో భాగంగా అయి పోయినవి. జాతీయోద్యమాలతో సన్నిహిత సంబంధం యేర్పడింది.

1923లో కాంగ్రెసు మహాసభలు కాకినాడలో జరిగినవి. అంతకు ముందే తుఫానువచ్చి రాకపోకల సౌకర్యాలు చెడిపోయినవి. ఐనా తన్మ

యత్నంతో తెలుగువారంతా అక్కడికి చేరుకున్నారు. శ్రీమతి జానకీబాయమ్మ గారు వాలంటీరు దళంలో చేరి కార్యనిర్వాహణకు సహకరించారు. ఆ తర్వాత ఢిల్లీలో జరిగిన రెండవ మహిళా విద్యా సభకు విశాఖపట్నం ప్రతినిధులుగా శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మతో కలిసి వెళ్లారు. పురుషులతో సమానంగా స్త్రీలకు ఆస్తిహక్కులు తదితర హక్కులు వుండితీరాలని ప్రత్యేక సమావేశములో వీరిద్దరు చాలా తీవ్రంగ వాదించారు. అంతటి అవగాహన శక్తి అటుంచి, నిస్సంకోచంగ తమ భావాలను నిండు సభలో వ్యక్తపరచి వాదించ గల శక్తి ఆనాడు యెంతమంది స్త్రీలకున్నదీ వూహించుకోవచ్చు. తను చేసేపని సరిఅయినది అని తోచినప్పుడు తరగని ఆత్మవిశ్వాసంతో ఆమె సహసం ప్రదర్శించగలరు.

1929 డిశంబరులో లాహోరు కాంగ్రెసు సభలకు వెళ్లారు. సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ఆమోదించిన ఆ మహాసభ జాతీయోద్యమ చరిత్రలోనే ముఖ్యఘట్టం. అర్ధరాత్రి 12 గంటలకు నడిరొడ్డునచేరి సభికులందరు స్వాతంత్ర్య సిద్ధికి పాణాలర్పిస్తామని శపథం చేశారు. బహుకాలంగ జాతీయో ద్యమంలో పాల్గొంటున్న శ్రీమతి జానకీ బాయమ్మ గారు వుత్తేజితులు కాకుండ వుండటం అసంభవము. భర్త వెంట ఉప్పుసత్యాగ్రహంలో ప్రధానపాత్ర స్వీకరించారు.

విజయనగరం నుంచి పాదయాత్రచేస్తు, సత్యాగ్రహంలో పాల్గొన మని ప్రజలను వుద్బోధించుతు విశాఖపట్నం చేరుకున్నారు. సముద్రతీరాన అనేకసార్లు ఉప్పువండి శాసనధిక్కారం చేశారు. వేలజనం ఆనందోత్సాహాలతో పాల్గొనేవారు. ఒకనాడు ఉప్పు తయారయ్యే సమయానికి పోలీసు అధికారులు వచ్చారు. శ్రీరామస్వామిగారి చేతి బొటనవ్రేలు విరిగేట్లుగా వంచి బలవంతాన అయన గుప్పిటనుంచి ఉప్పు లాక్కున్నారు. సాండర్సుదొరకు శ్రీమతి జానకీబాయమ్మ చేతిని పట్టుకోవటానికి అతని సంస్కారం అడ్డు వచ్చింది. పక్కనున్న భారతీయ పోలీసు అధికారికి ఆ పని అప్పగించారు. దుశ్శాసనుడి కథ జ్ఞప్తికి తెస్తు ఆ అధికారి ఆమె చేతిని మొరటుగా నొక్కివేయ నారంభించాడు. "నన్ను అరెస్టుచేసి ఈ ఉప్పు స్వాధీనం చేసుకో అంత వరకు ఇవ్వను." అని ఆమె బలమంతా వుపయోగించి గుప్పిట ఉప్పును పట్టుకున్నారు. అధికారి ఇంకా బలంగా చేతిని నొక్కివేస్తున్నప్పుడు ఆమె

సాత్వికంగ నవ్వుతూ చూసిన ఆ చూపు వర్ణనాతీతం. గాంధీజీ శాంతిసమరం మాత్రమే ఆమోదించిన కారణంగ వేలజనం నోరెత్తలేదు. భర్తని అరెస్టు చేసినప్పుడు ఆమె "త్వరలోనే జైలులో మిమ్ములను కలుసుకుంటానని" చెప్పి వీడ్కోలిచ్చారు. నాయకులందరు అరెస్టుకాగా ఆమె ధైర్యసాహసాలతో వంటరిగా వాలంటీరు శిబిరాన్ని నిర్వహించారు. నాయికగా శాంతిసైనికులను ఆదేశించారు. విశాఖపట్నం నుంచి యలమంచిలి, మాడుగుల వంటి వూళ్లలో సభలుచేసి ప్రచారం చేశారు. 30 మంది వాలంటీర్లతో విశాఖ శిబిరంలో ఉప్పు వండారు. పోలీసులు ఆమె రాకపోకలను అటకాయించారు. ఆమె నిరసన వ్రతం సాగించారు. పోలీసులు శిబిరాన్ని కొల్లగొట్టి ఆమెను అరెస్టు చేశారు. ఆరు నెలలు కఠిన శిక్ష, జరిమానా విధించారు. అప్పటివరకు స్త్రీలకు జైలు శిక్షమాత్రమే వేసేవారు. అందువల్ల జరిమానా విధించబడిన ప్రథమ ఆంధ్ర మహిళ ఆమె. రాయవేలూరు జైలులో శ్రీమతులు దుర్గాబాయమ్మ, ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి, మవ్వూరి సుబ్బమ్మ గార్లు వంటి ప్రముఖ నాయికల పరిచయం అయింది. ఇదంతా 1930 నాటి గాథ.

జైలునుంచి విడుదలయిన శ్రీ రామస్వామి బందరు జాతీయ కళాశాలకు ప్రిన్సిపాలుగ నియమితులైనారు. అందువల్ల శ్రీమతి జానకీ బాయమ్మ జైలునుంచి విడుదలయిన తరువాత బందరు వెళ్లారు. దుర్ల వెంకట రమణమ్మ వంటి వుత్సాహపరులను కూర్చుకుని ఆమె నగర సంకీర్తనలు సభలు సమావేశాలు జరుపుతూ వుద్యమ ప్రచారం చేసేవారు. 1932 జనవరిలో గాంధీజీ అరెస్టు పట్ల నిరసన ప్రకటించుతూ స్త్రీలు బహిరంగ సభలు చేశారు. ఆమెను, వాలంటీర్లను, తరిమికొట్టి పోలీసులు సభను చెల్లా చెదరు చేశారు. ఆమె, ఆమె అత్తగారు శ్రీమతి బంగారమ్మగారు యింకా అనేకులు మర్నాడు మళ్లీ నిరసన సభ చేశారు. వృద్ధురాలైన అత్తగారిమైన పోలీసులు చెయ్యిచేసుకున్నారు. శ్రీమతి జానకీబాయమ్మగారిని కాళ్లు, చేతులు పట్టుకుని నాలుగుసార్లు విసిరివిసిరి పడేశారు. వాతావరణం వుద్రిక్తం కావటం చూసి ఆంధ్రనాయకులు ఆ సందర్భంలో స్త్రీలు సత్యాగ్రహంలో పాల్గొన కూడదని శాసించిరి.

దేశంకోసం ప్రాణాలివ్వటానికి సిద్ధపడి వచ్చిన ధీరులు వూరికిగా కూర్చోలేరుకదా. తిరిగి యథాప్రకారం కార్యకలాపాలు ఆరంభమైనవి.

విశాఖపట్నంలో సత్యాగ్రహం చేసి 1932 ఫిబ్రవరి 16న అరెస్టు అయినారు. ఒక సంవత్సరము శిక్ష, రూ॥ 500 జరిమానా విధించారు. జరిమాన చెల్లించ నిరాకరించినందుకు అదనంగా 6 నెలలు శిక్ష వేశారు. అందువల్ల ఆమె రాయ వేలూరు జైలులో మొత్తం ఒకటిన్నర సంవత్సరాల జైలుశిక్ష అనుభవించ వలసి వచ్చింది. అప్పటికామెకు రెండవనెల గర్భం. పదినెలల అమ్మాయిని ఎత్తుకుని విడుదలయి ఇల్లు చేరుకున్నారు.

ఆమెదృష్టి సంఘసేవ, నిర్మాణాత్మక కార్యకలాపాలవైపు మళ్లింది. విశాఖపట్నం పురపాలక సంఘ సభ్యురాలుగా పోటీలేకుండ రెండుసార్లు ఎన్నికయినారు. ఉపాధ్యాయ వృత్తిలో నున్న స్త్రీల అభ్యున్నతికి యెంతగానో సహకరించారు. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌చే ప్రారంభించబడిన భారతీయ స్త్రీ సమాజం అభివృద్ధికి చాలాకృషిచేశారు. వయోజనులకు తరగతులు, పసిపిల్లలకు పాలపంపకం, జాతీయ వుత్సవాలు, సభలు, సమావేశాలు యెన్నో అక్కడ నిర్వహించేవారు. అది యీనాటికీ నిల్చియున్నది.

1944 ప్రాంతంలో యెలమంచిలిలో ఆమె నూలువడకటం పోటీలు నడిపేవారు. చేతిపనులు ఖాదీనేత ప్రోత్సహించి ప్రచారం చేశారు. 1952-57 మధ్యన సంఘ సంక్షేమ కమిటీవారి విశాఖజిల్లాశాఖకు అధ్యక్షులుగా వున్నారు. బాలచెరువు, కణితి, గాజువాక వంటి ఐదు గ్రామాలలో కేంద్రాలు స్థాపించి వైద్యసహాయం కలిగించారు. వయోజనులకు రాత్రిపాఠశాలలు స్థాపించి విద్యా ప్రచారం చేశారు. ఏదోకృషి సాగించుతునే వుంటారు.

స్వాతంత్ర్య సమర రజితోత్సవ సందర్భంలో ఆంధ్ర మహిళా సభవారు హైదరాబాదులో ఆమెకు, శ్రీ రామస్వామిగారకు సన్మానం చేశారు. ఆ సంవత్సరమే తామ్రపత్రం సమర్పించి ప్రభుత్వం ఆ వీరాంగనను గౌర వించింది. 1962 మే 28న సభ రజితోత్సవాల సందర్భంలో ఆంధ్ర మహిళా సభ రజితఫలకం ఇచ్చి ఆ దేశసేవికను గౌరవించారు. ఆమె వంగిన నడుము వెనక అంతటి సహనం, చిరునవ్వు వెనక అంతటి సాహసం దాగివున్నది.

---

# శ్రీమతి సంగెం లక్ష్మీబాయమ్మ

జననం **1911** మరణం **2-6-1979**

"వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ, పూసిపోదుము, మెడను వైతుము పూలదండలు భక్తితో" శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గేయాన్ని ఆలపించుతు గుంటూరు శారదా నికేతనం బాలికలు నూరుమంది శాంతి సైనికులకు వీరగంధం పూశారు. నుదుట తిలకం దిద్దుతు "శాంతి పర్వము చదువ వచ్చును శాంతి సమరంబైన పిమ్మట, తెనుగునాటిని వీర మాతనుజేసి మాత్రము తిరిగి రమ్మిక" అని హెచ్చరించు తున్నారు సోదరులను. ఆంధ్ర యువకులు వుత్సాహం వుబికిరాగా అప్పుడే విజయం సాధించినంత సంభ్రమంతో సంతోషంతో ముందుకు నడిచారు. భారత మాతాకిజై నినాదాలతో గుంటూరు కోనేరు పరిసరాలన్నీ మారు మ్రోగినవి. ఆ దృశ్యం అంతగా హృదయాలలో హత్తుకుపోతు దేశభక్తితో వుద్రేకంతో ప్రతిజీవిని వూపేసింది.



శ్రీమతి సంగెం లక్ష్మీబాయమ్మ

1930 మార్చి, 12న గాంధీమహాత్ముడు ప్రపంచ ప్రసిద్ధిపొందిన దండీయాత్ర తన అనుచర బృందంతో సాగించారు. ఏప్రిల్ 5కి దండిచేరుకుని వుప్పువండి బ్రిటిష్ ప్రభుత్వపెద్దరికాన్ని ధిక్కరించారు. దేశవ్యాప్తంగ ఆనాటి నుంచి శాంతి ప్రధానంగ అహింసా వ్రతం తప్పకుండ శాసన ధిక్కారం చేయటానికి యేర్పాట్లు జరిగినవి. శిబిరాలు నెలకొల్పారు. శాంతి సైనికులకు శిక్షణ నిచ్చారు. స్వరాజ్య శపథం ప్రతి యువకుడు తీసుకున్నాడు. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ ఆది శక్తివలె అంతటా తానై వుప్పు వండింది. వండించింది. అమ్మ వుత్సవం చేస్తుంటే అమ్మాయిలు సంబరంగా

పాల్గొనటం సహజమేకదా! శారదా నికేతన విద్యార్థినులందరు జాతీయ గీతాలుపాడుతు, పూరేగింపులు జరుపుతు, నూలువడుకుతు, సత్యాగ్రహం చేస్తూ అమ్మకు చేయూతనిచ్చారు. వారిలో శ్రీమతిసంగెం లక్ష్మీబాయమ్మగారు ముఖ్యులు. ఆమె అత్యంత శ్రద్ధతో హృదయ పూర్వకమైన భక్తితో వుద్యమంలో పాల్గొన్నారు సత్యాగ్రహంచేశారు. అరెస్టయినారు. రాయ వేలూరు జైలుకు చేరుకున్నారు. అప్పటికామె వయసు 19సంవత్సరాలు మాత్రమే.

నిజాం ప్రభువు నిరంకుశ పాలనలోవున్న తెలంగాణా ఆమె పుట్టిన ప్రదేశం. 1911లో హైదరాబాదు సమీపానవుండే ఘటికేశ్వర్‌లో జన్మించారు. ఆమె అప్పటిపేరు సత్తెమ్మ. శ్రీమతి సీతమ్మ, శ్రీ దొంతుల రామయ్యగార్లు ఆమె తలిదండ్రులు. పుట్టిపెరిగిన పల్లెమొత్తంమీద బళ్లో చదువుకుంటున్న అమ్మాయి ఆమె ఒకరే. మోయలేనంత పెద్ద కర్రపలకకుతాడు కట్టి దోవవెంట లాక్కుని వెళ్ళి కాళ్ల మీద పెట్టుకుని వ్రాసుకునే వారు. గోడనీడలు, సూర్యాస్తమయలే వాళ్లకు గడియారం. చిన్ననాటినుంచి నదురు బెదురు లేని ధైర్యవంతురాలు. 13 సంవత్సరాల వయసుకే విధి వక్రించింది. వైధవ్యంకలిగింది ఆరోజుల్లో నిజాం వాసులకు అటు ఇంగ్లీషులోనో యిటు ఉర్దూతోనో చదివే అవకాశాలున్నవి. కాని తెలుగు వారికి యే అవకాశాలు లేవు. అందువల్ల శ్రీమతి లక్ష్మీబాయమ్మ అక్కడ చదువు కుందామన్నా యెటువంటి అవకాశాలు లేవు. గుంటూరు శారదా నికేతనంలో చేర్చి చదివించమని ప్రజా నాయకులు, సంస్కర్తలు అయిన ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు గారు సలహాయివ్వటంతో ఆమె మేనమామ సంగెం సీతారామయ్య యాదవగారు 1926 లో ఆమెను గుంటూరు తీసుకువెళ్లి శారదా నికేతనంలో చేరిపించారు. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ ఆమెకు లక్ష్మీబాయి అని తన పేరు పెట్టి తనవలె వర్ధిల్లమని దీవించారు. ఆమె అక్కడ 1933 వరకు ఏడు సంవత్సరాలు వున్నారు. అక్కడ చదివి 1927లో విద్వాన్ పరిక్షలో ఉత్తీర్ణులయినారు. విదుషి పట్టం కూడ అక్కడే తీసుకున్నారు. ఆమె తత్వానికి శారదా నికేతన వాతావరణం చక్కగా సరిపోయింది. దాంతో 1928లో సైమన్ కమీషన్ పట్ల నిరసన ప్రదర్శన వుద్యమంలో పాల్గొన్నారు. 1930లో ఉప్పు సత్యాగ్రహం ఆరంభమయినప్పటి నుంచి ఆమె యెంతో వుత్సాహంతో, దీక్షతో పాల్గొన్నారు. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారి వెంట వూరూర

ప్రచారం చేసేవారు. ప్రబోధం చేసేవారు. చుట్టు పక్కల వుండే తెనాలి, విజయవాడ, నరసారావుపేట వంటి ప్రదేశాలకు వెళ్ళి కల్లు, సారాదుకాణాల దగ్గర, విదేశవస్తు, వస్త్ర దుకాణాల దగ్గర సత్యాగ్రహం చేసేవారు. అనేక సార్లు అరెస్టు చేసి, ఒకరోజు, రెండు రోజులు వుంచి విడుదల చేసేవారు. అరెస్టని చెప్పి యే నిర్జన ప్రదేశంలోనో దిగ విడిచి వచ్చేవారు. చివరకు వాళ్ల ప్రాణం విసిగి ఆమెను అరెస్టు చేసి, కని తీరా ఒక సంవత్సరం శిక్ష వేశారు. రాయవేలూరు పంపించారు.

రాయవేలూరు జైలులో ఆ సమయానికి శ్రీమతులు ఉన్నవ లక్ష్మీబాయమ్మ, దుర్గాబాయమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, పొదర్తి సుందరమ్మగార్లు యెందరో వందల సంఖ్యలో వున్నారు. అదొక పెండ్లి యిల్లులాగ సందడిగా వుండేది. ఆమెకు ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు అమ్మ, దుర్గాబాయమ్మగారు అక్కయ్య, సుందరమ్మ గారు వదినగారు వయసులో చిన్న కావటం చేత యిట్లా అందరిని వరసలు పెట్టి పిలుస్తు అందరికి చిన్న చిన్న పనులుచేసి పెడుతు వుషారుగా తిరుగుతు వుండేవారు. దుర్గాబాయమ్మగారంటే ఎనలేని గౌరవం. అక్క మీదవుండే ప్రేమ, రాయవేలూరు జైలు జీవితానికంతకీ కిరీటంలాంటిది- ఆమె ప్రతిరోజు వ్రాసిన డైరీ కేవలం నాడు జరిగిన విషయాలే కాక కలుసుకున్న మనుష్యుల ప్రవృత్తులను వర్ణించుతు, ఘట్టాలను వివరించుతు వ్రాశారు, ఉదాహరణకు 5-12-30 నాటి కొన్ని విషయాలు:— "నాలుగు గంటలకే లేచి చదువుకున్నాను. దీపములు పోగానే సోదరీలందరు భజన చేసితిమి. వదినగారు (శ్రీమతి పొదర్తి సుందరమ్మగారు) వీరిది విజయవాడ ఏమియు పని చేయక పడుకొని యుండిరి. భాగ్యలక్ష్మమ్మ గారికి కూడ జ్వరము వచ్చినది. బహన్‌జీ (దుర్గాబాయమ్మగారు) యేదో మందుచేసి అందరికీ వేసెను. జావగాచి యిచ్చెను. బంగారమ్మ గారు విడుదలై వెళ్లనప్పుడు రామకోటి వున్నమ్మ గారు యేడ్చినారు. మేమందరము జయ జయ ధ్వానములతో పంపితిమి. బంగారమ్మగారు కాకినాడ వాసులు. ధైర్య శౌర్యములు గలవారు. మహా అల్లరిచేసేవారు. సర్కారు రూల్సుకు సర్వదా వ్యతిరేకి. పొణకా కనకమ్మ గారు నెల్లూరు. మా గదిలో నిద్రించిరి. వారు పసితనంలో చేసిన విప్లవ సంఘప్రయత్నములు, దోపిడికి పేసినప్లానులు, పడిన శ్రమలు, చేసినత్యాగము వినగా మాకత్యంతానందముకలిగినది. మరలమరల చెప్పినదే చెప్పమనివేడుచుంటిమి"— ఇట్లా సాగిపోతుందాబంగారుకలం. ఆంధ్రుల అదృష్టం బాగుంటే

చిన్నదే అయినా ఆమెడైరీని త్వరలో ముద్రింపించి అమూల్యవిషయాలు తెలుసుకోగల భాగ్యం కలిగించవచ్చు. జైల్లో ఆమె శ్రీమతి దుర్గాబాయమ్మగారి దగ్గర హిందీచదివి రాష్ట్రభాష పరీక్షనెగ్గారు. మొత్తం ఎనిమిది సంవత్సరాలు కృషిచేసి హిందీలో "సాహితి" సంస్కృత ఆంధ్రలలో విదుషి డిగ్రీలు తెచ్చుకున్నారు. ఆసమయంలోనే ఆమె కార్వేయూనివర్సిటీ బి.ఏ. పరీక్ష ప్రైవేటుగా వ్రాసి కృతార్థులైనారు. కర్ర పలకకుతాడు కట్టిలాక్కుని వెళ్లివీధిబడిలో చదువుకున్న ఆమె తెలుగు, సంస్కృతం, హిందీ, ఇంగ్లీషులలో చిత్రకళలలో పండితురాలైనారు.

1932 శాసనోల్లంఘనం సందర్భంలో తిరిగి అరెస్టయి రాయవేలూరు జైలుకు వెళ్లారు. 1933లో విడదలయినారు. ఇక అంతటితో అప్పటికి రాజకీయాల నుంచి దృష్టి మరలించారు. వస్తుతః వుండి, శారదానికేతనంలో వృద్ధి చెందిన చిత్రకళా నైపుణ్యానికి మెరుగులు దిద్దాలనుకున్నారు. అందువల్ల మద్రాసువెళ్లి అక్కడ ఆర్టుస్కూల్లో 1933 నుంచి 1938 వరకు శిక్షణ పొంది డిప్లొమా తీసుకున్నారు. తీరికవేళల్లో వాటర్‌కలర్ చిత్రాలు వేస్తూవుండేవారు. 1938లో హైదరాబాదు చేరుకున్నారు. వెంటనే గుల్బర్గా బాలికా పాఠశాలలో ఆమెకు డ్రాయింగు టీచరుగా వుద్యోగం యిచ్చారు. ఆమెకు సర్వదా సహాయ సానుభూతులు అందించుతు ప్రతి విషయంలోను కన్న తండ్రిలాగ కనిపెట్టే శ్రీ మాడపాటి హనుమంతరావుగారు తమ ఆడపిల్లల హైస్కూలు హాస్టలుకు వార్డెనుగా వుండమని కోరారు. 1938 నుంచి 46 వరకు 8 సంవత్సరాలు జీతంభత్యం తీసుకోకుండ గౌరవ వార్డెనుగా వుండటమే కాక ఆమె భోజన ఖర్చు స్వంతాన యిచ్చుకున్నారు. ఇంకెవరు యిట్లా చేసినట్టు వినలేదు.

1947లో బ్రిటిష్ ప్రభుత్వం వైతొలగి భారతదేశం స్వతంత్ర దేశం అయింది. అప్పుడే పాకిస్థాన్‌కూడ ఏర్పడింది. నైజాం రాష్ట్రప్రజలు నిరంకుశపాలనతో విసిగిపోయినారు. దేశంలోని ప్రజానీకం అందరిలాగ స్వేచ్ఛా వాయువు పీలుస్తు పురోగమించాలని కోరుకున్నారు. ఇటువంటికోరికలు కలగకుండ చూడటానికి, అణచటానికి నిజాం దమననీతిని అవలంబించటం, రజాకర్ల వంటి దుష్టశక్తులను ప్రజల మీదికి వదలటం జరిగింది. అంతకు పూర్వం కొంతకాలంగా రాజకీయ పరిస్థితులను గమనించుతు దేశసేవచేయ

సంకల్పించుకున్న శ్రీమతి లక్ష్మీబాయమ్మ వుద్యోగాదులు వదిలేసి కుత్తుక బంటిగా రాజకీయాలలో ప్రవేశించారు. బహిరంగంగానే సత్యాగ్రహం ఆరంభించారు. శాంతి సమరాన్నే యెన్నుకున్నారు. విద్యార్థులలోను స్త్రీలలోను బహుళప్రచారం చేశారు. ఉద్బోధించారు. వాడ వాడల కరుకుకత్తులకు, నీచుల దురాగతాలకు వెరవకమరొకమారు "వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరొదెల్పుడీ" అంటు శాంతి సమరంలో వీరవిహారంచేశారు. "ఇమ్‌రోజ్" ఉర్దూ పత్రిక సంపాదకుడైన శ్రీ షోహాబుల్లా ఖాను జాతీయభావాలు గలిగి నైజాం రాష్ట్రంకూడ మిగతా దేశంలో విలీనమయితే బాగుంటుందని పత్రికలో వ్రాసిన ఫలితంగా రజాకర్లు అతని యింట్లోజొరపడి ఖండతుండేలుగా అతనిని చిత్రవధ చేశారు. కుడిచేతిని నరికి తమనాయకుడికి నజరానాగాపంపి మురిసిపోయినారాముష్కరులు. ఇది పోలీసులు కాపలావుండే బర్కత్ పురాచమను దగ్గర బూర్గుల వారింటికి 50 గజాల దూరంలో జరిగిన ఘాతుక చర్య. కబురు తెలియగానే శ్రీమతి లక్ష్మీబాయమ్మ అతిసాహసంతో ఆ మృత వీరుడియింటికి వెళ్లారు. గోడలు, పూలమొక్కలు, మంచినీళ్ల కూజాలతోసహా నెత్తురుపడి చూడ శక్యంకాకుండ వున్నది. నిండుచూలాలైన అతని భార్యకదలలేని పరిస్థితిలో యెడ బిడ్డను వొళ్లోపెట్టుకుని అయోమయ స్థితిలో వున్నది. అప్పుడేయిల్లు చేరుకున్న వృద్ధతలిదండ్రులగోడు చూస్తే శ్రవణ కుమారుని మరణం జ్ఞప్తికివస్తుంది. అటువంటి పరిస్థితుల్లో శ్రీమతి లక్ష్మీబాయమ్మ ఆకుటుంబాన్ని వోదార్చి అండగానిలబడి, దేశమాతకు నిలువునా ప్రాణాలర్పించిన వీర షోహబుల్లా ఖానుకు, యితరనాయకుల తోడ్పాటుతో వీరోచిత అంత్యక్రియలుజరిపించి వచ్చారు. ఎన్నెన్ని మీటింగు లకో వెళ్లినేలకూలిన వారిని లేవనెత్తి ధైర్యం చెప్పి స్వాతంత్ర్య పోరాటం సాగించిన వీరనారి ఆమె.

నైజాం రాష్ట్ర ప్రజల అదృష్టంపండి భారత ప్రభుత్వ సాయుధ ఆక్రమణంతో రాష్ట్రానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. దేశంలోని యితర రాష్ట్రాలతో విలీనమైపోయింది. 1952 లో శాసనసభకు ఎన్నికలు హైదరాబాదు రాష్ట్రంలో కూడ జరిగినవి. ఆమె నిజామాబాదు బాన్సువాడ నియోజక వర్గంనుంచి కాంగ్రెసు అభ్యర్థినిగా అఖండ విజయం పొందారు. శాసన సభ్యురాలుగా ఆమెకు మహిళాసేవచేయటానికి మరింత అవకాశం కలిగింది. ఆమె సహాయ మపేక్షించుతు అనాథలు, అనదలు, యెప్పుడు ఆమెను

చుట్టుముట్టి వుండేవారు. శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా యేర్పడిన మంత్రివర్గంలో ఆమెను విద్యాశాఖకు ఉపమంత్రినిగా చేర్చుకున్నారు. ఈ పదవలంకరించిన ప్రథమ తెలంగాణామహిళ ఆమె.

నాటివరకు ఆరాష్ట్రంలో నిరాశ్రయులైన మహిళలను ఆదుకోవటానికి ఎటువంటి ఆశ్రమాలు, శరణాలయాలులేవు. అందువల్ల 1952 లో హైదరాబాదులోని సైదాబాదులోవున్న తమ స్వంతభవనంలో నలుగురు స్త్రీలతో ఒక మహిళా సేవాసదనం స్థాపించారు. అదే ఇందిరా సేవాసదనంగా నేడు శాఖోపశాఖలుగ విస్తరించింది. శ్రీ కొండా వెంకటరంగారెడ్డి ప్రారంభం నుంచి దానికి అధ్యక్షులుగా తగిన దక్షులుగా చేయూత నిస్తూ వున్నారు. శ్రీ బూర్గుల రామకృష్ణారావు కూడ భారీయెత్తున ఆ సంస్థకు ప్రభుత్వ గ్రాంట్లు, సహకారాలు అందించి అభిమానించారు. శ్రీమతి లక్ష్మీ బాయమ్మ ఆ నాటినుంచి చనిపోయే నాటివరకు కార్యదర్శిని గానే వున్నారు. ఆమె తనకున్న సమస్త సంపద దానికే సమర్పించారు. జాతి, కుల, మత, బేధాలు పాటించబడని ఆ సదనంలో ఒక శరణాలయం, హాస్టలు, హైస్కూలు, ఆసుపత్రివంటి శాఖలెన్నో వున్నవి. అది స్వయం సమృద్ధం. స్వంత భూముల్లో వరి, గోధుమలు, యితరధాన్యాలు పండించుతారు. పళ్ళ తోటలు, కూరగాయల తోటలు వున్నవి. మోటబావులతో సాగుబడి జరుగుతున్నది. ఆదర్శ వ్యవసాయ క్షేత్రంగా వ్యవసాయ విద్యార్థులను తీసుకువచ్చి ఉదాహరణగా చూపుతు వుంటారు. ఆ బృందావన గోకులంలో అనేక పశువులున్నందువల్ల క్రమపద్ధతిన పాల కేంద్రం నడుపుతున్నారు. కోళ్ళ పెంపకం కేంద్రం వున్నది. ఇందిరా సేవా సదనాన్ని గాంధీజీ సబర్మతీ ఆశ్రమ పద్ధతులలో నడుపుతున్నారు. అన్ని పనులు సదన వాసులే స్వహస్తాలతో చేస్తారు. ఆమె శ్రీ వినోబా భావే శిష్యురాలు. తరుచు వెళ్ళి సంప్రదించుతు వుంటారు. శ్రీ వినోబాజీ 1950 లో తెలంగాణా పర్యటన చేసినప్పుడు అనువాదకురాలుగా వెంట వున్నారు. 1953 లో శ్రీ వినోబాజీ సందేశానుసారం భూదానయజ్ఞం జరిపినప్పుడు, మూడు రోజులలో దాదాపు 350 ఎకరాల భూమిని ఆమె సేకరించ గలిగారు. పార్లమెంటు మెంబరుగా 20సం॥ కాలం వున్నారు. మహిళా వుద్యమాన్ని గురించి సమస్యల గురించి అనేక రేడియో ప్రసంగాలు చేశారు. ఆమె రచన "నా అనుభవాలు" చిన్నదే అయినా అమూల్య విషయాలను సాధికారంగ వివరించారు. ఆమెది చక్కని గంభీరమైన విగ్రహం. చిన్నమెత్తు బంగారం ధరించరు. తెల్ల

ఖద్దరు తప్ప ధరించరు. ఎవరు అనుకోరుగాని ఆమె చాలా హాస్య ప్రియులు. ఎప్పుడు ఏవో కబుర్లు చెప్పి నవ్వించుతు వుంటారు. విశుద్ధ గ్రాంధికంలో అతి సరళంగ సహజంగ మాట్లాడుతు వుంటారు. విపరీతమైన దైవభక్తి, భగవంతునిలో విశ్వాసం కల వ్యక్తి ఆమె. ఆమెకు అనుక్షణం ఇందిరా సేవాసదన సేవ సరిపోతుంది. అహర్నిశలు అదేలోకం.

ఈ గాంధీజీ, వినోబాజీల శిష్యురాలిని తామ్రపత్రం యిచ్చి ప్రభుత్వం గౌరవించింది. ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా సన్మానించారు. ఆమె దేశానికి, సంఘానికి మహిళాలోకానికి చేస్తున్న అకుంఠిత సేవకు ఇంకా గొప్పసన్మానాలు పొందినా ఆశ్చర్యంలేదు.

---

# శ్రీమతి కామేశ్వరమ్మ కుప్పుస్వామి

**జననం 15–5–1906**

పెద్దాపురంలో ఒక తోట చుట్టూ వేసిన ముళ్ల కంచెను కొద్దిగా తొలిగించి కార్లు వచ్చేటంత దోవ చేశారు. 1930 డిశంబరు 21న తోట లోపల రెండు వందల మంది పైగా జనం కూర్చుని వున్నారు. శ్రీమతులు దేశభాందవి దువ్వూరి సుబ్బమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ వంటి స్త్రీలు కూడ పదిహేను పదహారు మంది వారిలో వున్నారు. వారందరి చేతుల్లోను యేవో తినుబండారాలు వున్నవి. ఇంతలో నాలుగైదు లారీలు తోటలోకి చొచ్చుకువచ్చినవి. బిలబిల మంటు పోలీసులు దిగారు. కూర్చున్న జనం లేచి నిలబడే లోపుగానే లాఠీచార్జి ఆరంభమయింది. స్త్రీలందరిని ఒక పక్కకు నెట్టి వేశారు. కాంగ్రెసు పెద్దలను,



శ్రీమతి కామేశ్వరమ్మ కుప్పుస్వామి

దీనికి సహాయ పడుతున్న వారిని మరీ యెక్కువగా కొట్టనారంభించారు. శ్రీ పైడా వెంకట నారాయణ గారిని ఐదారుగురు పోలీసులు కిందపడవేసి కొట్టటం చూడశక్యంకాక స్త్రీలందరు పెద్దగా కేకలు వేయసాగారు. శ్రీమతి కామేశ్వరమ్మ ఒక్క ఉదుటునపోయి అడ్డు నిలిచారు అనుకోని సంఘటన కావడంతో ఆ దెబ్బలన్నీ ఆమెకే తగిలి రక్తం చిమ్మింది. ఆమెను నడిపించుకుంటు చెదిరిన గుండెలతో స్త్రీలు కార్ల దగ్గరకు వచ్చారు. కాని కార్లు టైర్లతో సహా యీకకుయీక తోకకుతోకగా పడివున్నవి. తప్పించుకు పారిపోయిన యువకులు కొంతమంది, తోటలో జరుగుతున్న హింసాకాండను వూరివారికి తెలియచేశారు. వెంటనే యిద్దరు డాక్టర్లు మందుల పెట్టెలతో వచ్చారు. కాని పోలీసులు ఆ మందులన్నీ నేలపాలుచేసి డాక్టర్లను లాఠీలతో

కొట్టడంతో యెవరు యేమి చేయలేక పోయినారు. చివరకు రాత్రి పదిన్నరకు స్త్రీలందరు యిళ్లు చేరుకో గలిగారు. పెద్దాపురం లాఠీ చార్జీ వార్త దేశమంతా గుప్పు మన్నది. పార్లమెంటు మెంబర్లే లండన్‌లో ప్రశ్నించారు. వివరాలు పంపమని, శ్రీమతి కామేశ్వరమ్మకు వుత్తరాలు గుప్పించారు. ఇంతగా కాకపోయినా మొత్తానికి ఆంధ్రదేశంలో ఆ సమయంలో వూరూర అదే పరిస్థితిగా వుంది. ఇది 1930 చివరి భాగంనాటి గాథ.

ఉప్పు సత్యాగ్రహం 1930 ఏప్రెల్ మే నాటికి పరాకాష్ఠ అందు కున్నది. వేల సంఖ్యన స్త్రీలు పురుషులు శాసనోల్లంఘనం చేసి అరెస్టయినారు. ఆ తాకిడికి యెన్ని జైళ్ళు చాల లేదు. ప్రభుత్వానికి యీ అసంఖ్యాక ఖైదీలను యెక్కడ వుంచటమో, యేమిపెట్టడమో తెలియ లేదు. చివరకు యీ పద్ధతి లాభం లేదని యెవరిని అరెస్టు చేయటం మానేశారు. అదిలించి బెదిరించ తగిన సందర్భం కాకపోయినా లాఠీ చార్జీలు చేయనారంభించారు. మనిషి యిల్లుకదలితే యేదశలో తిరిగి వచ్చేది తెలియని పరిస్థితి యేర్పడింది. పిరికి పారి పోయి వుద్యమానికి తిలోదకాలు యివ్వకుండ ఆ జ్యోతిని పూనికతో కాపాడవలసిన తరుణం వచ్చింది. శ్రీమతి కామేశ్వరమ్మ అప్పుడు తీవ్రంగ వుద్యమంలో చొచ్చుకు పోయి, నిర్వహణా భారాన్ని వహించారు. కార్య నిర్వహణకు పూనుకోవటం ఆమెకు అది మొదలూ కాదు, చివరా కాదు.

రాజమండ్రికి 25 మైళ్ల దూరాన వున్న పోలవరంలో మాతా మహుల యింట్లో ఆమె 1906 మే 15న జన్మించారు. శ్రీ పెద్దాడ సుందర శివరావు, శ్రీమతి వెంకట సుబ్బమ్మ గార్ల రెండవ సంతానం ఆమె. రాజమండ్రిలో పేరెన్నికగన్న లాయరు శ్రీ సుందర శివరావు, వారి కుటుంబం యావత్తు అటు బ్రహ్మసమాజ ప్రభావానికి, యిటు జాతీయోద్యమ ప్రభావానికి లోనయినవారే. శ్రీమతి అనీబిసెంటు, మిసెస్ మార్గరేట్ కజిన్స్‌వంటి విద్యా వేత్తలు, సంస్కార ప్రియులు జాతీయ వాదులు ఆ కుటుంబానికి మిత్రులు. మిసెస్ కజిన్స్ ప్రోత్సాహంతో శ్రీమతి వెంకట సుబ్బమ్మ రాజమండ్రిలో ఆలిండియా విమెన్సు కాన్ఫరెన్స్ శాఖ స్థాపించి కార్యదర్శినిగా మహిళా ప్రబోధం చేశారు. రాజమండ్రిలో ఆమె మొట్టమొదటి స్త్రీ మున్సిపల్ కౌన్సిలరు. ఈ వాతావరణ ప్రభావం మొత్తం శ్రీమతి కామేశ్వరమ్మ మీద పని చేసింది. అందువల్ల ఆమెకు చిన్ననాటి నుంచి జాతీయాభిమానం, సంస్కరణాభిలాష,

కార్యదక్షత, చొరవ అలవడినవి. గారాబంవల్ల కావచ్చు స్వభావమే అంత కావచ్చు ఆమెకు ఆవేశం, సాహసం, పట్టుదల కొంచెం అధికం. స్కూల్లో చదివే రోజులలోనే తల్లికి బాసటగా నిలిచి హిందీ క్లాసులు నడపటం మహిళా సభలు నిర్వహించటంవంటివి చేస్తు వుండేవారు. గాంధీజీ 1921 లో రాజమండ్రి వచ్చినప్పుడు, 1923 లో కాకినాడ కాంగ్రెసులోను, 1927 లో మద్రాసు కాంగ్రెసులోను ఆమె వాలంటీరుగా పనిచేశారు. రాజమండ్రిలో ఆరోజుల్లో ఆడపిల్లల కాలేజి లేనందున మద్రాసులో చదివి బి. ఏ. డిగ్రీ తీసుకున్నారు. ఆ రోజుల్లో పట్టభద్రలయిన ఆంధ్ర మహిళలు చాలా తక్కువ.

మద్రాసులో చదువుతున్న రోజుల్లో ఆమె ప్రతిసభకు సమావేశానికి తప్పనిసరిగా హాజరయేవారు. శ్రీమతులు సరోజినీ నాయుడు, కమలాదేవి చట్టోపాధ్యాయ, డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డి గార్లతో ఆమెకు బాగా పరిచయం. వారితోకలిసి కార్యక్రమాలలో పాల్గొంటు వుండేవారు. శ్రీమతి ఆచంట రుక్మిణి లక్ష్మీపతి ఆమెకు రాజకీయ గురువు. వారి యింట్లో ఒకవ్యక్తిగా మెసులుతు వుండేవారు. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి స్థాపించిన యూత్‌లీగ్ సభ్యులుగా చాలా కృషి చేశారు. ఆమె విద్యాధికురాలు వుత్సాహ వంతురాలు కావటంతో మంచి వక్తగా కూడ తయారయినారు. ఆవేశపూరి తంగ జంకు లేకుండ సరళ భాషలో యిచ్చే వుపన్యాసాలు జాతీయోద్యమ సందర్భంలో చక్కగా వుపకరించినవి. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి శాసనోల్లంఘనం చేసి, వేదారణ్యంలో అరెస్టయి 1930 మే14న రాయ వేలూరు జైలుకు వెళ్లినప్పుడు వారి కుటుంబ సభ్యులతో పాటు శ్రీమతి కామేశ్వరమ్మ కూడ రాయ వేలూరు వెళ్లారు. ఆ నాటి సాయంత్రం బహిరంగ సభ జరిపి వుపన్యసించారు. సత్యాగ్రహులు వండిన వుప్పును సభలో విక్రయించి కాంగ్రెసుకు విరాళాలు వసూలు చేశారు.

అక్కడ నుంచి రాజమండ్రి చేరుకునేటప్పటికే పరిస్థితులు మారినవి. అనేకానేకులు జైళ్ల పాలయినారు. ప్రభుత్వం దమన నీతిని అవలంబించింది. బహిరంగంగా నలుగురు సమావేశమయితే పోలీసులు తయారు. డప్పులు మోగించి, లాఠీ ఛార్జి చేసి సభను చెదరగొట్టేవారు. అందువల్ల ఆమె వుత్సాహ వంతురాలయిన యువతీ యువకులను కొంతమందిని సమకూర్చుకొని, కాకినాడలో

ఒక వాలంటీరు శిబిరం స్థాపించారు. ఖాదీ అమ్మకం నెపంతో యింటింటికిపోయి వుద్యమవార్తలను తెలిపేవారు. స్వదేశీవస్త్ర, వస్తుప్రదర్శనలంటు యేర్పాటు చేసి అక్కడ వందలకొద్దీ జనంచేరి జాతీయోద్యమ విషయాలు వినే అవకాశం కల్పించేవారు. పోలీసులకు తెలియకుండ ముందుగా యేర్పాట్లుచేసి పల్లెలలో బహిరంగ సభలు జరిపి వుపన్యసించేవారు. అప్పటికి పోలీసులు పసిపట్టి వచ్చి, చిక్కినవారినల్లా నిర్దాక్షిణ్యంగ కొట్టేవారు. ఎక్కడకు వెళ్ళినా పోలీసులు ఆమెను వెంటాడేవారు. ఒకసారి కారులో వెళ్తూవుండగా అమలాపురంలో ఆమెను పోలీసులు వెంబడించారు. శ్రీ కళా వెంకటరావుగారి అత్త వారింటిముందు కారు ఆపి ఆమె లోపలకు వెళ్లారు. కను చీకటి సమయంలో కారు అక్కడే వదిలి అడ్డ దోవన అడంగు చేరు కున్నారు. మోసం గ్రహించిన అధికారులు అవమానంతో కోపంతో అమాయికులను హింసించారు. ఎన్నో సందర్భాలలో ఆమె అర్ధరాత్రి, అపరాత్రి నడిచి, మారువేషాలు ధరించి, వుద్యమ ప్రచారం చాలా తీవ్రంగా చేశారు. ఆంధ్రదేశంలో పోలీసు జులుం అధికంగా వున్నదని గాంధీమహాత్ముడికి తెలిసింది. అక్కడ స్త్రీలు తరగని వుత్సాహంతో ప్రచారంచేస్తున్నందుకు మహాత్ముడు సంతోషించి మరింత ప్రోత్సాహం కలిగించటానికి తనముఖ్య శిష్యురాలయిన మీరాబేన్‌ను, రాజమండ్రి పంపించారు. శ్రీమతి కామేశ్వరమ్మ ఆమెను కాకినాడ తీసుకుపోయి బ్రహ్మాండమయిన స్వదేశీ వస్తు వస్త్రప్రదర్శనకు ప్రారంభోత్సవం చేయించారు. నాలుగు రోజులు వారందరి మధ్యగడిపి, సలహాసంప్రదింపులయిన తర్వాత ఆమె శ్రీమతి మీరా బేన్‌ను, బెజవాడలో రైలెక్కించి వెళ్లారు. ఇట్లా మొక్కవోని సాహసంతో పట్టుదలతో ఆమె ఏడు నెలలపాటు వుద్యమ ప్రచారం చేశారు. ఉన్నచోట తినకుండ, తిన్నచోట కూర్చోకుండ శ్రమించారు. అప్పటికి తొలిదశలో అరెస్టయిన వారు చాలా మందివిడుదలయి రాసాగారు. దువ్వూరి సుబ్బమ్మగారు కూడ విడుదలయి వచ్చారు. ఆ పరిస్థితులలో తానక్కడ యింకా వుండటం అనవసరమని తోచింది ఆమెకు. ఉమ్మడి రాజధాని అయిన మద్రాసులో కొంత కృషి చేయాలని అనుకున్నారు. జైలు నుంచి విడుదలయి వచ్చిన పెద్దలు, స్థానికంగా వున్న పెద్దలు అందరిని సమావేశ పరచి తన అభిప్రాయం తెలియపరచి వాళ్ల వుద్దేశం కనుక్కోవాలను కున్నారు ఆమె. కాని ఆ సమయంలో యింతమంది ఒక చోట సమావేశమై విషయాలు చర్చించు కోవటం అసంభవం. పోలీసులు జరగనివ్వరు. అందువల్ల వనభోజనం లాంటి కార్యక్రమం అడ్డుగా పెట్టి, పెద్దాపురం తోటకు అందరిని అహ్వానించారు.

రెండు వందల మందికి పైగా హాజరయినారు. భోజనాలు, పాటలు పద్యాలు మధ్యన ముఖ్యవిషయాలు చర్చించుకుంటు సంప్రదించుకుంటు వున్నారు. ఇంతలో లారీలలో పోలీసులు రావటం చిన్నతరహా జలియన్ వాలా బాగ్ వుదంతం లాంటిది జరగటం ఆరంభంలో వివరించిన విషయమే. ఆ తరువాత ఆమె మద్రాసు చేరుకున్నారు. జైలు నుంచి అప్పుడే విడుదలయి వచ్చిన శ్రీ సి. రాజగోపాలా చారిగారిని సంప్రదించారు. రాజధాని నగరంలో చేయవలసినపని చాలా వున్నదని ఆయన అన్నారు. ప్రభుత్వ దమన నీతి కారణంగా దేశంలో క్షతగాత్రులు వేల సంఖ్యన తయారయినారు. వారందరికి చికిత్స, సపర్యలు చేయటానికి మద్రాసులో సుప్రసిద్ధులయిన డాక్టరు యు. రామారావు గారు కాంగ్రెసు హాస్పెటలు నెలకొల్పారు. దాంట్లో సిబ్బందిగా పనిచేయటానికి, సత్యాగ్రహం చేయటానికి ఆంధ్రదేశం నుంచి స్త్రీలు పురుషులు అనేక మంది వచ్చారు. అట్లా వచ్చిన వాలంటీర్లు పది, పది హేను మంది ఒకదళంగా యేర్పడి షాపుల దగ్గర పికెటింగు ఆరంభించారు. శ్రీమతి కామేశ్వరమ్మ తానూ ఒకదళం కూర్చుకుని సత్యాగ్రహం చేస్తువుండే వారు. ఒకనాడు శ్రీమతులు శివరాజు వెంకట సుబ్బమ్మ, యామినీ పూర్ణ తిలకమ్మ, కృష్ణా బాయి, జానమ్మ, అంబుజమ్మాళ్ మొదలయిన వారితో కలిసి చైనా బజారులోని విదేశీ దుకాణాల దగ్గర పికెటింగు చేస్తువుండగా అరెస్టయి నారు. మద్రాసు సెంట్రలు జైలులో అండర్ ట్రయల్సుగా వుంచారు. అప్పట్లో గాంధీ ఇర్విన్‌ల మధ్య రాజీకుదిరే సూచనలు కనిపించినవి. అందు వల్ల యెవరిని కొత్తగా విచారణ జరిపి శిక్షించటం ఆపు చేశారు. అట్లా యీమెనూ శిక్షవిధించకుండ వుంచారు. అది సాధ్యంకాని పరిస్థితి వచ్చి తప్పని సరిగా విచారణ జరిపారు. ఆరునెలలు విడిఖైదు శిక్షవేసి, ఏక్లాసు యిచ్చి రాయవేలూరు జైలుకు పంపించారు. అక్కడ జైలు కిక్కిరిసి వున్నది. కాలుపెట్టసందులేదు. శ్రీమతులు దుర్గాబాయమ్మ, వేదాంతం కమలాదేవి, రుక్మిణి లక్ష్మీపతి అందరు ఆ జైలులోనే వున్నారు. చోటులేని కారణంగా శ్రీమతి కామేశ్వరమ్మను తోటి దళసభ్యులను హాస్పెటల్ వార్డులో వుంచారు. వాళ్లకది మరీ సుఖంగా వున్నది. కాని నిర్వ్యాపకంగా కూర్చోగల మనిషికాదు ఆమె. అందువల్ల మామూలునేరాలుచేసి బంధితులయిన వారికి చదువు చెపుతామని అధికారులను అడిగారు. వాళ్ల అంగీకారంతో ఆమె, ఆమె మిత్రురాలు శ్రీమతి కృష్ణాబాయి క్లాసులు నడపడం ఆరంభించారు. జైలు

జీవిత మెంతో వుత్సాహంగా వున్నది. వారం పదిరోజులు గడిచినవి. గాంధీ ఇర్విన్‌ల ఒడంబడిక కుదిరినందువల్ల రాజకీయ ఖైదీలందరిని దేశవ్యాప్తంగ ఒక్కసారిగా విడుదల చేశారు. ఇక ఆ సమారోహాలకు సన్నాహాలకు అంతులేదు.

కాంగ్రెసు ప్రచారం మరింతవుత్సాహంగా చేయనారంభించారు. జిల్లా మహిళా సభలు, రాష్ట్ర మహిళా సభలు, ఆలిండియావిమెన్సు కాన్ఫరెన్సులు, ఆంధ్ర రాజకీయ మహా సభలు యెక్కడ చూసినా ఆమె వుపన్యసించవలసిందే. 1931 లో కరాచీ కాంగ్రెసుకు హాజరయినారు. ఆ సమయంలో శ్రీ భగత్ సింగు, రాజగురు, శుకదేవ్‌లకు ప్రభుత్వం వురిశిక్ష వేసిన విషయం అందరి హృదయాలను కదిలించి వేసింది. ఆమె వుపన్యాసాలలో ఆ వుధంతం విన్నవారుకంటతడిపెట్టటం మానలేక పోయేవారు. శ్రీమతి పెద్దాడకామేశ్వరమ్మ ఆంధ్రులందరికి అభిమాన పాత్రురాలుగా వుండేవారు.

ఆమె ఆరోగ్యం దెబ్బతిని, చికిత్సకోసం మైసూరు వెళ్లారు. పరిపూర్ణ ఆరోగ్యం కలగటమేకాక, మైసూరు యూనివర్సిటిలో ప్రొఫెసరుగా వుంటున్న శ్రీ కుప్పుస్వామితో 1932 లో వివాహం అయింది. మైసూరు వాస్త వ్యులయినారు. కాని ఆంధ్రా యూనివర్సిటీ సెనేట్‌లో చాలా కాలం సభ్యులుగా వున్నారు. జాతీయోద్యమంలో పాల్గొన్న అనేకమంది ఆంధ్ర మహిళల వలెనే ఆమె కూడ నిర్మాణాత్మకంగా సంఘసేవా కార్యకలాపాలలో ప్రవేశిం చారు. అనాథలకు, సాంఘికంగా అట్టడుగున మిగిలిపోయినవారికి ఆమె చేసిన, చేస్తున్న సేవ ప్రత్యేకంగా వ్యాసం వ్రాయవచ్చు. విదేశ పర్యటన చాలాసార్లు చేశారు. బంధుమిత్రుల పట్ల ప్రేమ, అభిమానం యెక్కువ. ఢిల్లీ, మదరాసు, మైసూరు, బెంగుళూర్లలో ఆమె 73 ఏళ్ల వయసులో యెంతో వుత్సాహంగ యింకా యేదో చేయాలన్న తపనతో సంఘసేవా కార్యకలాపాలలో ప్రధాన పాత్ర వహించుతు వున్నారు. నిర్విరామంగ దేశాభ్యుదయానికి సంఘ శ్రేయస్సుకు పాటుపడే మహిళ శ్రీమతి కామేశ్వరమ్మ.

---

# శ్రీమతి తుమ్మల దుర్గాంబ

**జననం 15-1-1907**

అడుగడుగున ప్రతిపక్షంవారితో సహకరించటానికే ముందడుగు వేసి, వివరించి, నచ్చచెప్పపూనుకునే గాంధీ మహాత్ముడే 1942 జూలై నాటికి విసిగి పోయినాడు. మరి యే సంప్రదింపులు, రాయబారాలు నిష్ప్రయోజనమని తేల్చు కున్నాడు. యావన్మంది నాయకులు తుది ప్రయత్నంగా అటో యిటో అంతుతేల్చు కోవాలనే దృఢ నిశ్చయానికి వచ్చారు. ఇక బ్రిటిష్‌వారిని నయానో భయానో మన దేశంనుంచి బయటికి పంపటమే ఏకైకమార్గంగా ఎన్నుకున్నారు. "క్విట్టిం డియా - ఇండియా వదలిపొండి" అని గర్జిస్తు దేశం యావత్తు విరుచుకుపడ్డది. 1930-32 లలో నడచిన వుద్యమాలు దీని



శ్రీమతి తుమ్మల దుర్గాంబ

ముందు ధూపానికి రాలేదు. అదొక మహోజ్జ్వల ప్రళయనృత్యం. అందులో ఆంధ్రులు యథాప్రకారం ముందువరసన రంగప్రవేశం చేశారు. స్త్రీలు, పురుషులు, పీరికి రెట్టింపుగా పట్టరాని సాహసంతో యువతీ యువకులు వీరవిహారం సాగించారు. స్వాతంత్ర్య సంగ్రామంలో ఆరితేరిన యోద్ధ తుమ్మల దుర్గాంబగారు ఇంటిపట్టున యెట్లా కూర్చోగలుగుతారు. ఊరూరా వుద్యమ ప్రచారం చేశారు. ప్రబోధం చేశారు. ప్రోత్సహించారు. ఫలితంగా తెనాలి తాలూకా రేపల్లెలో 27-8-1942న అరెస్టయినారు. జైలు పరిభాషలో ఆమె పాతనేరస్థురాలు. ఉద్యమ సరళిచూసి అసలే మతి తున్న ప్రభుత్వం, కసితీర ఆమెకు 15 నెలలు శిక్షవిధించి జైలుకు పంపించారు. రాయవేలూరు జైలును రాజకీయబందీగా ఆమె తరింపచేయటం యిది మూడవసారి. గాంధీజీ నిరశనవ్రతం పూనినందున ఆమె రాత్రివేళల భోజనం మానేశారు. అదే ఒక

నేరంగా పరిగణించిన అధికారులు ఆమెకు ఒక నెల అదనంగా శిక్ష విధించారు. అందువల్ల ఏక బిగిన 16నెలల శిక్ష అనుభవించారు.

ఆమె 1907వ సంవత్సరం జనవరి 15న తెనాలి తాలూకా తురిమెళ్ల గ్రామంలో జన్మించారు. శ్రీమతి భూషమ్మ, శ్రీ పర్వతనేని కృష్ణయ్యలు ఆమె తలిదండ్రులు. ఆమె కిద్దరుసోదరులు. పెత్తల్లి అయిన శ్రీమతి యలమంచి మహలక్ష్మమ్మ పెంచి పెద్ద చేశారు. తురిమెళ్లలో ఎడ్వర్డు బోరు హైస్కూలులో ఏడవ తరగతి వరకు చదువుకున్నారు. 1918 లో పదకొండు ఏళ్ల వయసులో ఆమెకు కాపూరు గ్రామవాసులయిన తుమ్మల బసవయ్యగారితో వివాహం అయింది. అత్తవారి కుటుంబమంతా దేశభక్తి, జాతీయాభిమానంగలవారు. వారితోపాటు ఆమె కూడ గాంధీ మతావలంబిణి. 13 సంవత్సరాల వయసునుంచే ఆమెకు నూలు వడకటం, ఖాదీ ధరించటం అలవాటయింది. 1920 అక్టోబరు 2వ తేదీ గాంధీజీ జన్మదినోత్సవం నాడు హరిజనులను పిలిచి అభ్యంగన స్నానాలు, కొత్తబట్టలు, విందు భోజనాదులతో సంతృప్తిపరచారు. ఆరోజుల్లో అదియేమంత చిన్న విషయంకాదు. ఆ సందర్భంలోనే స్వామి సీతారాంగా ప్రసిద్ధి పొందిన గొల్లపూడి సీతారామ శాస్త్రిగారితో పరిచయం ఏర్పడింది. నాటినుంచి దుర్గాంబ, బసవయ్యగారు ఆ గాంధీజీ శిష్యుడి అడుగు జాడల్లో నడవసాగారు. మామూలు చదువుల బడులను బహిష్కరించి ప్రతి వూరిలోను జాతీయ విద్యాలయాలు స్థాపించి పిల్లలను చదివించుతున్న కాలం అది. అందువల్ల కావూరులో ఆ దంపతులు శ్రీ తిలక్ జాతీయ పాఠశాలను 1923 లో స్థాపించారు. బాలబాలికలకు జాతీయ విధానంలోవిద్యను వుచితంగా బోధించే యేర్పాట్లు చేశారు. విదేశీ వస్త్రబహిష్కరణ తానుచేయటంతో తృప్తిపడక, ఆమె 1929లో చుట్టుపక్కల గ్రామాలన్నీకూడ తిరిగి స్త్రీలలో బహుళప్రచారం చేశారు వారిచేత విదేశీ వస్త్రాలన్నీ పరశురామప్రీతిచేయించి, ఖాదీనేధరించుతామని ఆ స్త్రీ లందరిచేత ప్రమాణాలు చేయించారు. ఇంటింటరాట్నం జాతీయగీతం పాడనారంభించింది. ఆ సమయంలో గాంధీజీ ఖాదీ ప్రచారం చేస్తు, ఖాధీ నిధికి విరాళాలు వసూలుచేస్తు ఆంధ్ర దేశంలో సంచారం చేస్తున్నారు. కావూరులో జరుగుతున్న ఖాధీ ప్రచారానికి సంతోషించి ఆమె కోరికపైన ఆవూరు వచ్చారు. బాపూజీ బాగ్‌లో ఆ దంపతులు నివసించటానికి ఒక కుటీరానికి గాంధీజీ స్వహస్తాలతో శంకుస్థాపనచేసి, దీవించారు. ఆమె ప్రజలను సంఘటిత

వరచటంలో మంచి దిట్టకావటంతో అఖండ సూత్రయజ్ఞం జరిపించారు. ఎటుచూసినా రాట్నాలే. అంతటా రాట్నాలమోతే.

బాపూజీ బాగ్‌లో నిర్మాణమైన కుటీరం హరిజనసేవకు, హిందీ ప్రచారానికి స్థావరమయింది.

ఇంతలో 1930 ఉప్పు సత్యాగ్రహం ఆరంభమయింది. గుంటూరులో ఉప్పు సత్యాగ్రహం అదొకవింతవాతావరణం సృష్టించింది. శాంతి సైనికులను తయారు చేయటానికి ప్రచారం చేయటానికి శిబిరాలు నెలకొల్పారు. ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి ఆధ్వర్యాన వుప్పువండటంలో దుర్గాంబగారు పాల్గొన్నారు. శిబిరంలో వుండి శిక్షణ పొందారు. ఊరూరు తిరిగి ప్రచారం చేశారు. చివరకు స్వగ్రామంలో సత్యాగ్రహం చేసి 16-7-1930న అరెస్టయి నారు. ఆరునెలలు జైలు శిక్ష అనుభవించటానికి రాయవెల్లూరు చేరుకున్నారు. అప్పుడక్కడ శ్రీమతులు దుర్గాబాయమ్మ, ఆచంట రుక్మిణీలక్ష్మీపతి, దువ్వూరి సుబ్బమ్మ, పొణకా కనకమ్మగార్లు యెందరో వున్నారు. 15-1-1931 న విడుదలయినారు.

ఆమె గాంధీజీని రాజకీయ గురువుగా భావించటమేకాదు, ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించారు. భగవద్గీతార్థాన్ని తు. చ. తప్పకుండ పాటించే దీనజనోద్ధారకుడైన బాపూజీని భగవదంశ సంభూతుడిగా భావించేవారిలో ఆమె ఒకరు. 1931 లో కాపూరులో గాంధీజీ విగ్రహాన్ని ప్రతిష్టించారు. సర్వమత సమైక్యత సాధించి విశ్వసందేశము వ్యాపింప చేయటానికి కృషి చేశారు.

గాంధీజీ గంపెడాశతో రౌండు టేబులు సమావేశానికి భారతదేశ ప్రజలందరి తరఫున హాజరయినారు. కాని అది విఫలమయింది. ఎప్పటికాలు అట్టిట్లేనన్నకథ అయింది. దాంతో 1931 లో తిరిగి శాసనధిక్కారం చేయటానికి ఆయన భారతీయులకు అనుమతియిచ్చారు. శాంతి సమరంలో రెండవ ఘట్టం ఆరంభమయింది. విదేశీ వస్త్రవస్తు బహిష్కరణలు, కల్లు సారాదుకాణాల వేలంపాట నిరోధాలు, దుకాణాల దగ్గర సత్యాగ్రహాలు, ఆంధ్ర స్త్రీలు అవిరళంగా చేశారు. శ్రీమతులు కొల్లా కనకవల్లి తాయారమ్మ, పొదర్తి సుందరమ్మ, భారతీదేవి రంగాలతో కలసి ఆమె తెనాలి తాలూకా

పల్లెలలో విరివిగా సంచారంచేసి సత్యాగ్రహం చేశారు. చివరకు 27-1-1932 న తెనాలిలో ఈ నలుగురిని అరెస్టుచేసి 6 నెలలు కఠిన శిక్ష, రూ. 500/- జరిమానా, అది చెల్లించని పక్షంలో మరొక ఆరు వారాలు అదనపుశిక్ష విధించారు. రెండవసారి రాయవేలూరు జైలుకు వెళ్లారు. ఆ సమయంలో అక్కడ వేదాంతం కమలాదేవి, మూల్పూరిచుక్కమ్మ, ఆదుర్తి లక్ష్మీబాయమ్మ, దిగుమర్తి జానకీబాయమ్మగార్లు అనేక మంది వున్నారు. జరిమానా చెల్లించకమొత్తం ఏడునెలల పదిహేనురోజుల శిక్ష ననుభవించి వచ్చారని చెప్పకుండానే వూహించుకోవచ్చును. 26-12-1933 ఆమె జీవితంలో మహోజ్వలమైన రోజు. ఆమె, ఆమెభర్త బసవయ్యగారు సబర్మతీ ఆశ్రమాన్ని పోలిన ఆశ్రమం కావూరులో స్థాపించారు. అదే వినయాశ్రమం. దానికి వాళ్లు తమ సమస్త ఆస్తిపాస్తులు, సిరిసంపదలు, చివరకామెమెళ్లో మాంగల్యంతో సహా అర్పించారు. పూజ్య బాపూజీ స్వయంగావచ్చి ఆశ్రమ ప్రారంభోత్సవం చేశారు. నిస్వార్థసేవాతత్పరులైన ఆ దంపతులను దీవించి, వారిత్యాగాన్ని శ్లాఘించారు. ఆ సమయంలోనే ఆమె పట్టుదలగా కృషి చేసి అక్కడవున్న శ్రీరామలింగేశ్వరాలయంలోకి గాంధీజీ హరిజనులతో సహా ప్రవేశించ గలిగేట్లు చేశారు. గాంధీజీ ప్రత్యేకించి హరిజనులను దేవాలయ ప్రవేశం చేయించి, అస్పృశ్యతా నివారణ దేశవ్యాప్తంగా చేయటానికే ఆ సమయంలో ఆంధ్రదేశ సంచారం చేశారు. అందువల్ల దుర్గాంబగారి కృషి మహాత్ముడి మన్ననలను అందుకున్నది. ఆమెకు స్థిమితముగా, స్థబ్దుగా కూర్చోవటం గిట్టదు. ఎప్పుడు యేదో ఒక వుద్యమ ప్రచారంలో సంచారం చేస్తు ప్రబోధంచేస్తునే వుంటారు. గోవాడ గ్రామంలో నిర్విరామకృషి చేసి బాలకోటేశ్వర స్వామివారి దేవాలయంలో హరిజనులకు 1934 ఫిబ్రవరి, మార్చి నెలల్లో ప్రవేశం కలిగించారు. అంతటితో తృప్తిచెందక ప్రతివూరిలోను హరిజనులకు దేవాలయ ప్రవేశం కలిగించటానికి నిశ్చయించుకున్నారు. పది వూళ్లకు ఒక యాత్రాసంఘాన్ని యేర్పరచి తమలక్ష్యాన్ని సాధించారు.

వినయాశ్రమం తరఫున ముగ్గురు ఆడపిల్లలు, యిద్దరు మగపిల్లలతో 1940 లో ఒక అనాథ శిశుశరణాలయాన్ని నెలకొల్పారు. అది చక్కగా అభివృద్ధిలోకి వచ్చింది. జాతి, మత, కుల వివక్షతలేకుండ బాల బాలికలు విశాల భావాలతో పెరుగుతున్నారు.

1942 లో క్విట్టిండియా వుద్యమం ఆంధ్ర దేశాన్ని అతలాకుతలం చేసింది. శ్రీమతి దుర్గాంబ అందులో పాల్గొని 16 మాసాలు శిక్ష అనుభవించి రావటం మొదటనే చెప్పుకున్నాము. దేశసేవలో జైలుకు ఆమె మూడు సార్లువెళ్లినట్లే ఆమె భర్త కూడ మూడు సార్లు జైలు శిక్ష లనుభవించారు. ఆమె అత్తగారు శ్రీమతి చంద్రమ్మ. వయసుతో నిమిత్తంలేకుండ ప్రభాత భేరీలలోను, సత్యాగ్రహంలోను పాల్గొని జైలుశిక్షలు రుచిచూశారు. ఆమె తోడికోడలు తులశమ్మగారు రెండు సార్లు జైలుశిక్ష అనుభవించారు. మరది, మేనల్లుడు మొదలయిన ఆత్మీయులందరు జాతీయోద్యమంలో పాల్గొని జైళ్లకు వెళ్లివచ్చిన వారే. అవకాశం దొరికి నప్పుడల్లా ఆమె హరిజన దేవాలయాల ప్రవేశానికి కృషి చేస్తునేవున్నారు. ప్రచారం చేస్తునే వున్నారు. అఖిల భారత హరిజన సేవాసంఘ మహాసభలు ఆమె కావూరులో వారంరోజుల పాటు విజయవంతంగా జరిపించారు. భారతదేశం నాలుగు మూలలనుంచి నాయకులు హాజరయినారు. ఇన్ని కార్యకలాపాల మధ్య శ్రీతిలక్ జాతీయ పాఠశాల నిర్విరామంగ బాలబాలికలకు జాతీయ భావాలు, వృత్తి విద్యలు నేర్పితీర్చిదిద్దుతు నే వున్నది. శ్రీవినోబా భావే వంటి పెద్దలు స్వయంగా వచ్చి 1949 లో ఆ విద్యాలయానికి రజతోత్సవాలు సలక్షణంగా జరిపించి, తమ అభిమానం తెలియ చేశారు.

జాతీయంగా సమస్యలు ఒక గమ్యానికి వచ్చినవి, స్వాతంత్ర్యం సిద్ధించింది. పాకిస్థాన్ ఏర్పడింది. జాతిపిత జాతికి కరువైనా, ఆయన అభిమతానుసారం భాషా ప్రయుక్త రాష్ట్రాల విభజన చేయాలన్నారు నాయకులు. ఆంధ్ర రాష్ట్రోద్యమం ఆరంభమయింది. స్వామి సీతారాంగారు ఆ వుద్యమంలో తీవ్రకృషి చేశారు. ఆయన ప్రధాన శిష్యులయిన శ్రీమతి దుర్గాంబ కుత్తుకబంటిగా వుద్యమ ప్రచారంలో ప్రవేశించారు. నెలల పర్యంతం కృష్ణా, గోదావరీమధ్య ప్రదేశాలన్నీ కాలినడకన తిరిగారు. అటు మద్రాసు, తిరుపతి వరకు వెళ్లి ప్రచారం చేశారు. రాష్ట్ర నిర్మాణ నిమిత్తం జరిపిన అనేక యాగాలలో, యజ్ఞాలలో, వుపవాసవ్రతాలలో అకుంఠిత దీక్షతో పాల్గొన్నారు. రాష్ట్రప్రాప్తితోశాంతించారు.

ఆశ్రమం దినదినాభివృద్ధి పొందుతూ వున్నది. దుర్గాబాయి దేశముఖ్ గారు 1957 లో ఆశ్రమం తరఫున బాల్వాడి ప్రారంభించారు. ఇంతలో విన యాశ్రమ రజతోత్సవాలు వచ్చినవి. జాతీయ విధానంలో సంఘసేవచేస్తు

ఆశ్రమం పాతికేళ్ల ప్రౌఢఅయిన శుభసందర్భంలో రాష్ట్రపతి శ్రీ రాజేంద్ర ప్రసాదు కావూరుగ్రామం వచ్చి 24-8-1958లో రజతోత్సవాల్లో పాల్గొన్నారు.

ఆమెకు యెప్పుడు పదిమందిని సంఘటిత పరచటం, ప్రయోజనాత్మకంగా ఒక పనిచేయటం సరదా. అందులో ఆమెకున్న ఓర్పు నేర్పు నిజంగా మెచ్చతగినవి. గాంధీజీ, వినోబాజీ, స్వామిసీతారాంగార్ల శిష్యరికంతో ఆమెకు శ్రమదానం పట్ల చాలా గౌరవం, నమ్మకం. అందువల్ల యెప్పుడుయే అవసరం వచ్చినా గ్రామప్రజలను సంఘటిత పరచి అఖండ సూత్రయజ్ఞం ద్వారా నూలు చిలపలు సేకరించుతారు. అవే ఆమెకు మూలధనం. గాంధీజీ ఆత్మకథను అమరపద్యకావ్యంగా రచించిన అభినవ తిక్కన తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారికి 2-10-1957న శ్రమదానం ద్వారా లభించిన ఖాదీతో తులాభారమహోత్సవం జరిపించారు. 2-10-1959న అఖిల భారత హరిజన సేవాసంఘ వుపాధ్యక్షులయిన పండితయోగిహరిగారు వచ్చిన సందర్భంలోకూడ కావూరుగ్రామ స్త్రీలచేతశ్రమదానం ద్వారా 14,094 చిలపల నూలుసేకరించి దుప్పట్లు, బట్టలు పంచిపెట్టి, యింకా మిగిలిన నూలు విక్రయంతో వచ్చిన డబ్బు పెట్టి 256 రాట్నాలుకొని పంచి పెట్టారు. అంటే మరొక సమయానికి పెట్టుబడి అన్నమాట.

దేశంలో వరదలు, వానలు, భూకంపాలు, తుఫానులవంటి చికాకులు కలిగినప్పుడు ఆమె స్వయంగా పూనుకుని బట్టలు, తిండిగింజలు సేకరించి పంపుతు వుంటారు. ఈ నాటికీ ప్రతి సంవత్సరం గాంధీ జయింతి సందర్భంలో వారం రోజులు అఖండ సూత్రయజ్ఞం జరిపించుతారు. హరిజనులకు సన్మాన సత్కారాలు పుష్కలంగా జరిపించుతారు. ఆమె 1920 నుంచి యీనాటి వరకు ప్రతి వుద్యమంలోను పాల్గొన్నారు. గాంధీజీ, వినోబాజీల ఆశయాలకనుగుణ్యంగా జాతీయ విద్యాలయం, వినయాశ్రమం నడిపించుతున్నారు. శిశు సంరక్షణాలయం, వ్యవసాయం, పశుపోషణ, పశువుల వైద్యశాల, చర్మపరిశ్రమ, ఖాదీనేత, ఆసుపత్రి, హిందీ బోధన, తేనెపరిశ్రమలనే కాక 'గాంధీ సందేశం', 'ఆంధ్రహరిజన', 'సర్వోదయ', 'వన్యజాతివంటి' పత్రికా ప్రచురణకూడ నిర్వహించుతున్నారు. ఆమె నిర్విరామకృషికి ఫలితంగా అఖిలభారత ఖాదీ గ్రామోద్యోగ కమీషను వారు సహకరించి అనేక కుటీరపరిశ్రమలను నిర్వహించటానికి సహాయం చేస్తున్నారు. కావూరు గ్రామాన్నికల్యాణ కావూరు చేసిన సేవామూర్తి శ్రీమతి తుమ్మల దుర్గాంబ.

---

# శ్రీమతి మూల్పూరి చుక్కమ్మ

జననం 1900 　　　　　　　　　　　　　　　　　　మరణం 11-3-1967

''సౌందరనందం'' మహాకావ్యంలో ''తెలిసి లసితాత్ములై వుజ్జగించినను పోలు'' అనేది ఒక పద్యభాగం. లోతు పాతులు, మంచి చెడ్డలు తెలిసి ఒక విషయాన్ని త్యజించటమో మరొక విషయాన్ని పరిగ్రహించటమో అనేది హృదయాంతర్గతమైవుండే పరిణతికి సూచకం. అది యించుమించు శాశ్వతం. నక్షత్రం ఆకాశాన్నంతని వెలుగుమయం చేయదు. కాని చీకటి వెలుగులతో నిమిత్తంలేకుండ మినుకు మినుకుమని ఒక్క తీరున ప్రకాశించుతు వుంటుంది. శ్రీమతి చుక్కమ్మ ఆ కోవకు చెందిన సార్థక నామధేయులు.



శ్రీమతి మూల్పూరి చుక్కమ్మ

ఆమె 1900 సంవత్సరంలో శ్రీ కట్నేని రంగయ్య, శ్రీమతి లక్ష్మమ్మల కుమార్తెగా జన్మించారు. పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరుకు ఆరుమైళ్ల దూరానవున్న పెద్దపాడు గ్రామం ఆమె జన్మస్థలం. 12 వ ఏట వివాహం అయింది. మరి ఒకటి రెండు సంవత్సరాలకే వైధవ్యం ప్రాప్తించింది. ఆనాటియువకులు అనేకమంది బ్రహ్మమత ప్రభావితులైనారు. సంస్కరణ భావాలను వంట పట్టించుకున్నారు. మనస్ఫూర్తిగా మంచి చెడ్డలు తెలుసుకున్న కారణంగా తామునమ్మిన సిద్ధాంతాలకు స్థిరంగా నిలిచారు. అటువంటి యువకులలో శ్రీ మూల్పూరి రంగయ్య ఒకరు. ఆయన అప్పుడు డాక్టరు పరీక్షకు చదువుతు వున్నారు. ఆయనా పెద్దపాడు గ్రామవాసి. చుక్కమ్మ గారిని 1918 లో వివాహం చేసుకున్నారు. విజయవాడలో అయ్యదేవర కాళేశ్వరరావుగారి ఆధ్వర్యాన ఆ వివాహం సలక్షణంగా జరిగిపోయింది.

శ్రీ మూల్పూరి రంగయ్య చుక్కమ్మగార్ల వివాహం కమ్మకులంలో ప్రప్రథమ వితంతువివాహం.

డాక్టరు రంగయ్య ఏలూరు పట్టణంలో వృత్తిరీత్యా స్థిరపడ్డారు. వాళ్ళను దాదాపు పది సంవత్సరాలపాటు వారి సంఘం బహిష్కరించింది. అయినా ఆదంపతులు కుంగిపోలేదు. తమసంసారంలో పరిపూర్ణతృప్తిపొందుతు, ఆమె సంఘం, సమాజం, దేశంవున్న పరిస్థితిని అవగాహన చేసుకోనారంభించారు. 1923 లో రాజమండ్రి, గోదావరి ఒడ్డున ఆనందనికేతనాశ్రమం స్థాపించి హరిజనసేవ, ఖాదీ, జాతీయ విద్యలకు, స్త్రీజనోద్ధరణకు పాటుపడుతున్న శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, శ్రీనరసింహశర్మ మూల్పూరి దంపతులకు మిత్రులు, గౌరవనీయులు. ఆ విధంగానే గుంటూరులో శ్రీ ఉన్నవ దంపతుల కృషి వీరికి మహత్తరంగా స్ఫురించింది. మూఢాచారాలు, విద్యావిహీనత, పిరికితనం వంటి అవలక్షణాల నుంచి విముక్తిపొందాలి. స్వేచ్ఛ కలిగించుకునే నిమిత్తం భావదాస్యం దూరం చేసుకోవాలి. స్వాతంత్ర్యం పొందాలి.

స్థూలంగా చెప్పాలంటే 1920 నుంచి భారత దేశంలో జనసామాన్యంలో రాజకీయ జాగృతి ప్రవేశించింది. శాంతి సమరంలో గాంధీజీ పూరించిన శంఖారావం ప్రజలలో నిద్రాణమై వున్న స్వాతంత్ర్యేచ్ఛను రెచ్చగొట్టింది. మూఢాచారాల దాస్యం సంఘవినాశకరమైన భావదాస్యమే సహించలేని శ్రీమతి చుక్కమ్మ పరప్రభుత్వ కబంధ హస్తాలనుంచి దేశస్వాతంత్ర్యం కాపాడుకోవటం చాలా అవసరమని గ్రహించారు. జాతీయ విద్యాలయాల విలువను తెలుసుకున్నారు. వెంటనే గుంటూరులో వున్న శారదానికేతనానికి, ఏలూరులో వున్న శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి బాలికా పాఠశాలకు, బాగల్లులో వున్న ఆనందనికేతనాశ్రమానికి ఒక్కొక్క వెయ్యిరూపాయలు విరాళం యిచ్చారు. ఖాదీ ధారులయి రాట్నంతిప్పుతు జాతీయ గీతాలను ఆలపించుతు సభలు సమావేశాలలో పాల్గొన ప్రారంభించారు. ఆమె తనకున్న మరికొంత ఆస్తిని అమ్మిన మొత్తాన్ని స్త్రీ విద్యాభివృద్ధికి, నిమ్న జాత్యుద్ధరణకు, కమ్మకుల బాలవితంతువుల పునర్వివాహాలకు వుపకరించేట్లు ఒకట్రస్టు యేర్పరచారు. శ్రీయుతులు తల్లాప్రగడ నరసింహశర్మ, కొత్త సత్యనారాయణ, దండు నారాయణరాజు, రంగయ్యగార్లు దానికి ట్రస్టీలు. దేశసేవకోసం వైద్యవృత్తినే త్యజించి అంతకన్న త్యాగంచేశారు శ్రీరంగయ్య.

1930 జనవరి 26న గాంధీజీ, కాంగ్రెసునాయకులు స్వాతంత్ర్య ప్రతిజ్ఞ తీసుకున్నారు. శాసన సభల బహిష్కరణ తీర్మానం ఆమోదించుతు వైస్రాయికి తమనిశ్చయం తెలియపరచారు. దేశవ్యాప్తంగ అప్పుడే అరెస్టులు ఆరంభమైనవి. పరప్రభుత్వశాసనోల్లంఘనం చేస్తున్న సూచనగా దండిలో ఏప్రిల్ 5న గాంధీజీ వుప్పువండారు. అంతటితో భారతీయులందరికి శాసనోల్లంఘనం చేయటానికి అనుమతిలభించింది. పట్టలేని వుత్సాహంతో ప్రజలు వుప్పుకొఠారులపై దాడిచేయటమో, సముద్రతీరాన వుప్పుచేయటమో సాగించారు. ఏప్రిల్ 30వ తేదీన చుక్కమ్మగారు, రంగయ్యగారు యింకా అనేక మంది స్త్రీ పురుషులు మట్లపాలెం వెళ్లారు, ఉప్పువండారు. ఆ చుట్టుపక్కల సత్యాగ్రహంచేశారు. అప్పటి వరకు వుప్పువండినా, సత్యాగ్రహంచేసినా ప్రభుత్వం అరెస్టు చేయటంతో ఖైదీల సంఖ్య విపరీతంగ పెరిగిపోయింది. వారి అజమాయిషీ అటు ప్రభుత్వానికి ఇటు పోలీసులకు అనుకోని సమస్యలు తెచ్చిపెట్టింది. అంతటితో దాదాపు అరెస్టులు నిలిపివేసి ప్రజలు వుద్యమంలో చేరకుండ బెదిరిపోయేట్లు చేయటానికి పోలీసులు లాఠీఛార్జీలను విరివిగా చేయనారంభించారు. తప్పు చేసినా, చేయక పోయినా పోలీసులు ప్రజలను హూనం చేయసాగారు. 1930 డిశంబరు 21న పెద్దాపురం తోటలో చిన్నసైజు జలియన్‌వాలాబాగ్ దురంతంలాంటిది జరిగింది. అనేకమంది తీవ్రంగ గాయపడ్డారు. శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మకి బాగాదెబ్బలు తగిలినవి. తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసు అధ్యక్షురాలుగా శ్రీమతి చుక్కమ్మ యీ హింసాకాండపట్ల నిరసన ప్రదర్శించ వలసినదిగా ప్రజలకు విన్నపంచేశారు. నిరాయుధులుగా తోటలోచేరిన ప్రజలపై నిష్కారణంగా తీవ్ర హింసాకాండ జరిపిన ప్రభుత్వదమననీతికి నిరసనకూడ శాంతి సమరమార్గంలోనే చూపించాలని నిశ్చయించుకున్నారు. డిశంబరు 31వ తేదీన శ్రీమతులు చుక్కమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, సత్తిరాజు శ్యామలాంబలు నిరశనవ్రతం ద్వారా తమ నిరసన ప్రకటించారు. ప్రభుత్వానికది బాధకలిగించిందా అంటే చెప్పలేముకాని ప్రజలలో వుత్తేజం కలిగించింది.

స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ఏలూరులో 26-1-1931న ఆమె, దుగ్గిరాల కమలమ్మగారు అరెస్టు అయినారు. నాలుగు నెలల శిక్షతో, 'ఏ' క్లాసు యిచ్చి ఆమెను రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమె

భర్త అరెస్టుఅయినారు. వారి మూడేళ్ల ఏకైకపుత్రుణ్ణి బంధువుల కప్పగించి నిర్విచారంగ దంపతులు జైలుకు వెళ్లారు.

ఆ సమయంలో రాయవేలూరు స్త్రీలజైలు రాజకీయ స్త్రీ బందీలతో కిటకిటలాడుతూ వున్నది. ప్రతిరోజు రెండు పూటల నియమిత సమయానికి దైవప్రార్థనచేసి తీరాలని గాంధీ మహాత్మునికి వున్నంత పట్టుదల చుక్కమ్మగారికి వుండేది. మనం గాంధీజీ మతం స్వీకరించాము. ఆయన అడుగుజాడల్లో నడుస్తున్నాము. దైవప్రార్థన విషయంలోను మనం అంత పట్టుదల, నియమం చూపించాలి అని తోటివారితో అనేవారు. ప్రార్థన సమాజాలలో పాడేపాటలన్నీ ఆమె ఎంతో ఏకాగ్రతతో పాడి ప్రార్థనలు చేయించేవారు. చాలా నియమనిష్ఠలుగల వ్యక్తి. సరళస్వభావి, నిరాడంబరంగ వుండేవారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి మార్చిలో రాజకీయ బందీలందరు ఒక్కసారిగా విడుదలయినారు. అంతకు పూర్వమే తమ 6 నెలల శిక్షను అనుభవించి విడుదలయివచ్చిన శ్రీమతులు పాదర్తి సుందరమ్మ, శ్రీ పెరంబుదూరు సుభద్రమ్మ, మరికొందరు మహిళలు కలిసి ఒక సన్మాన సంఘంగాయేర్పడి విడుదలయి అటుగా వెళ్తున్న దేశసేవికలకు విజయవాడలో ఆతిథ్యమిచ్చి, సన్మానించి పంపించేవారు. అట్లా సన్మానింపబడిన వారిలో శ్రీమతులు దుర్గాబాయమ్మ, చుక్కమ్మలు కూడ వున్నారు.

సత్యాగ్రహ వెల్లువ శాంతించింది అనుకుంటే, ఆర్థిక మాంద్యం వచ్చిపడింది. పండిన ధాన్యానికి తగిన ధరరాక రైతులు కష్టపడుతున్న సమయంలో రాష్ట్ర ప్రభుత్వం ఒక్క సారిగా రూపాయకు మూడు అణాల వంతునశిస్తు, రూపాయకు నాలుగణాలు నీటిపారుదలపన్ను అధికం చేస్తున్నారని తెలిసింది. సేద్యమే ప్రధాన వృత్తిగాగల కృష్ణా, గోదావరి జిల్లాలలో రైతులు మరీయిరుకునపడిపోయినారు. మరొక పక్క నెల్లూరు మండలంలో జమీనురైతు వుద్యమం నడుస్తున్నది. శ్రీ నెహ్రూ, పటేల్ మొదలైన నాయకులు శాసనోల్లంఘనానికి అనుమతి యిచ్చారు. చుక్కమ్మగారు అసలైన రైతుబిడ్డ. ఏమి పట్టనట్లుఎట్లా వూరుకోగలరు? ఆమె కృష్ణా గోదావరీ జిల్లాల రీసెటిల్మెంటు ఆందోళనలో ఎక్కువగానే పాల్గొన్నారు. 22-11-1931 న ఏలూరు పురమందిరంలో ప్రశంసనీయంగ వుపన్యసించారు. అట్లాంటి

అనేక సభలు, సమావేశాలలో ప్రబోధం చేశారు. డిశంబరు నెలలో ఈడ్పుగల్లు అనే గ్రామంలో యీవుద్యమంలో పనిచేయటానికి సత్యాగ్రహులను తీర్చిదిద్దే తలంపుతో ఒక శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. బెజవాడ గోపాలరెడ్డిగారు పతాకావిష్కరణ జరిపారు.

ఆమె అతిసావధానంగ చుట్టు పక్కల జరుగుతున్న విషయాలను పరికించి వాటి లోతుపాతులను చక్కగా గుర్తించగలరు. అందువల్ల అతిసహజంగ నేర్పుగ అన్ని వుద్యమాలలోను యిమిడిపోయి పనిచేశారు. 1932 లో శాసనోల్లంఘనం పెద్దయెత్తున జరిగింది. ఆమె అందులో పాల్గొన్నారు.

అరెస్టయి 6 నెలల శిక్ష రాయవేలూరు జైలులో అనుభవించారు. తిరిగి 1934 లోను 1941 లోను వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. అట్లా మొత్తం నాలుగు సార్లు ఆమె ప్రభుత్వం వారి ఆతిథ్యం స్వీకరించి వచ్చారు.

త్యాగమూర్తి కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి గారితో చుక్కమ్మగారికి చిన్ననాటినుంచి సన్నిహితత్వంవుండేది. ఆమె ఆశయాలపట్ల, ఆమె నెలకొల్పిన సంస్థల పట్ల యీమెకెంతో అభిమానం. ఆమె అకాల మరణం తర్వాత ఆమె పేరుతో యెక్కడ యేసంస్థ ప్రారంభించినా అభిమానంతో పాల్గొనే వారు చుక్కమ్మగారు. జమీగొల్వేపల్లిలో వల్లభనేని రామబ్రహ్మంగారు 1932 అక్టోబరు 10 న శ్రీ అన్నపూర్ణాదేవి నేత పరిశ్రమాలయం స్థాపించారు. కలగర పిచ్చమ్మగారు పతాకావిష్కరణ చేయగా చుక్కమ్మగారు అత్యంత వైభవంగ ప్రారంభోత్సవం జరిపారు. మరియెన్నోసార్లు, ఆధ్వర్యంవహించి వుత్సవాలు జరిపించారు.

ఆమెకు యే కాలేజి డిగ్రీలులేవు. కాని విద్యావ్యాప్తి పట్ల అత్యంతశ్రద్ధ, ఏనాటికయినా సంఘం, సమాజం, దేశం బాగుపడాలంటే ప్రజలు చక్కని విద్యావంతులై, వివేకవంతులు కావాలని ఆమె గట్టినమ్మకం. అందువల్ల విద్యాసంస్థలకు పదేపదే భారీవిరాళాలు యిచ్చారు. ఆ నాటి జాతీయ విద్యాలయాలయిన శారదానికేతనం, అన్నపూర్ణాదేవి బాలికా విద్యాలయం, ఆనందనికేతనాశ్రమాలకు యిచ్చిన విరాళాలు కాక విజయవాడ లయోలా కాలేజిభవనాలలో తనపేర ఒక గది నిర్మించారు. ఏలూరులోవున్న సెయింటు థెరసా కాలేజీలో తన పేర ఒక గది నిర్మించటానికి సహకరించారు.

సి. ఆర్. రెడ్డికాలేజికి యిట్లాగే యిచ్చారు. పశ్చిమ గోదావరి జిల్లా మహిళా మండలి అధ్యక్షులుగా వుండి మహిళాభ్యున్నతికి కృషి చేశారు. కుట్లు, అల్లికలు, సంగీతం తదితర లలితకళలు నేర్చుకోవటానికి మహిళలకు అవకాశం కల్పించి ఆమె జీవితాంతం కృషి చేశారు.

ఆమె దృష్టిని ఆకర్షించని రంగంలేదు. ఆమె సేవచేయని విభాగం లేదు. రాష్ట్ర ఖాదీ బోర్డు మెంబరు, జిల్లా కాంగ్రెసు మెంబరు, టౌను కాంగ్రెసు ప్రెసిడెంటు, జిల్లా బోర్డు మెంబరు, జిల్లా పరిషత్తు మెంబరు, పశ్చిమ గోదావరి జిల్లా ట్రాన్సుపోర్టు కమిటీ మెంబరు, ఆంధ్ర సాహిత్య అకాడమీ మెంబరు, యిట్లా సాగుతుంది జాబితా. ఆమెకు చేతనయినన్ని విధాల అన్ని రంగాలలోను ప్రజలను ఆదుకోవాలి, సహకరించాలి అన్నతపన అధికం. అందువల్లనే ఆమె పరిచయమున్న కిందటి తరంవారు మూల్పూరి చుక్కమ్మ గారంటే సాన పట్టనివజ్రం అని సగర్వంగా అంటారు. 11-3-1967న ఆమె తేజో మండలం చేరుకున్నారు.

---

# శ్రీమతి పాదర్తి సుందరమ్మ

**జననం 22–12–1902**

గుంటూరులో జనరల్ ఆసుపత్రికి పక్కనే ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి వుంటుంది. ఒకనాడు ఒక రోగి ఖాళీ మందు సీసాలు చేతుల్లో పట్టుకుని ఆసుపత్రిముందు బండి దిగింది. అటుచూసి, యిటు చూసి, దభాలున కాలేజిగేటులో ప్రవేశించింది. పెద్దగా యెలుగెత్తి ''నాయనలారా యిది సుఖంగా చదువు కొనసాగించే సమయంకాదు. ఈ ఇంగ్లీషు చదువులుమాని బయటికి వచ్చేయండి. దేశనాయకులందరు చెరసాలల్లో మగ్గుతున్నారు. మీరంతా బయటికివచ్చి వాళ్ల అడుగు జాడల్లో నడవండి'' అని ప్రచారం సాగించింది. బిలబిలమంటూ విద్యార్థులు బయటికి వచ్చారు. మరి పది



శ్రీమతి పాదర్తి సుందరమ్మ

నిమిషాలలో పోలీసు వ్యాను వచ్చింది అధికారులలో. ప్రచారం చేస్తున్న ఆమెను ఎక్కించుకుని మంగళగిరి సమీపాన దింపేశారు. ఎటువైపు వెళ్లటానికి ఆమెకు టిక్కెట్టు అమ్మవద్దని స్టేషనులో కట్టడి చేశారు. ఆమె రోగివేషంలో పోలీసుల కళ్లుకప్పి ప్రచారంసాగించటానికి వచ్చిన శ్రీమతి పాదర్తి సుందరమ్మ. 1930 లో బందరుకోనకు వెళ్లి ఉప్పు తయారుచేశారు. అనేకచోట్ల బహిరంగ సభలు జరిపి ప్రచారం చేసేవారు. ఉద్రేక పూరితంగా వుపన్యసించి ప్రజలను ప్రబోధించేవారు. అందువల్ల సి. ఐ. డి. లు ఆమె వెనకనే నీడలాగ తిరుగుతు వుండేవారు. నాయకులందరు అరెస్టయినారు. ఇంతలో విద్యారులు ప్రభుత్వోద్యోగులు తమ తమ వ్యాసంగాలు విడిచి బయటికి రావలసినదిగా గాంధీజీ ఆదేశించారు. అది పత్రికలో చదివిన ఆమె తనవెంటనే వుండి కనిపెడుతున్న సి. ఐ. డి. లను ఏమార్చి పైవిధంగా విజయం సాధించారు. అది ఆమెకు కొత్తకాదు.

1902 డిసెంబరు 22న శ్రీమద్ది నరసింహ్వం శ్రీమతి అన్నపూర్ణమ్మల మూడవ పుత్రికగా ఆమె బ్రాహ్మణ కోడూరులో జన్మించారు. ఆమె పినతండ్రులు శ్రీయుతులు మద్ది వెంకట సుబ్బయ్య, వెంకటరంగయ్య, రాధా కృష్ణయ్య తదితరకుటుంబ సభ్యులు పేరెన్నికగన్న దేశాభిమానులు, గాంధీజీ శిష్యులు. అందువల్ల ఆమె 1920 లో గాంధీజీని దర్శించటం, వుపన్యాసాలు విని ప్రభావితురాలు కావటం జరిగింది. ఆ నాటి నుంచి ఖాదీ వుద్యమ ప్రచారం, విదేశవస్త్ర బహిష్కారం జరుపుతు వున్నారు. 1921 నాటికి యిద్దరు పసిపిల్లల తల్లి. వాళ్లను పెద్దల రక్షణలో వుంచి పినతండ్రి శ్రీ వెంకట రంగయ్య, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగార్ల వెంట చీరాల పరిసరాలలో ప్రచారానికి వెళుతువుండేవారు. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ వంటి అగ్రశ్రేణినాయికల వెంట స్త్రీల బహిరంగ సభలు జరుపుతు, వుపన్యసించుతు వుండేవారు. మహానాయకులు గాంధీజీ, పటేలు మహాశయులు గుంటూరు, విజయవాడ వచ్చినప్పుడు వారి వెంట అనేక ప్రదేశాలకు వెళ్లే అవకాశం కలిగింది. అందువల్ల మొదటి నుంచి ఆమెకు యిట్లా చెయ్యాలి అన్న వుత్సాహం, యిది చెయ్యగలను అన్న ఆత్మధృతి, యిది చేసితీరాలి అన్న పట్టుదల సహజగుణాలుగా తయారయినవి. ఆ సమయంలోనే ఆమె తన చెల్లెలు శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మ, శ్రీ వరదదాసు, రాజయ్య గార్ల వెంట కాళహస్తి, యేర్పేడు, వెంకటగిరి వంటి ప్రదేశాలలో కల్లు, సారావేలం పాటలు జరుగుతుండగా వెళ్లి, పాట జరగకుండ పికెటింగు చేశారు. అరెస్టు చేసిమర్నాడు వదిలారు. ఇటు రాజకీయాలలో పాల్గొంటునే అటు 'శుష్క వేదాంత తమో భాస్కరమనే' వేదాంత గ్రంథం జీర్ణంచేసుకున్నారు. త్యాగం, సత్యం సేవాతత్పరతను మననం చేసుకుంటు శాంతంగా కష్ట పరంపరలను యెదుర్కొనాలని నిగ్గు తేల్చుకున్నారు. వెలిదండ్ల హనుమంతరావుగారి నాయకత్వాన దండి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని విరివిగా పశ్చిమ కృష్ణాజిల్లాలో ప్రచారం సాగించారు. అగ్నిదేవుడికి వాయుదేవుడు తోడ్పడినట్లు యీమెకు శ్రీపెరంబుదూరు సుభద్రమ్మగారి పరిచయం అయింది. ఇద్దరు కలిసి కాలినడకన కృష్ణాజిల్లా యావత్తు తిరిగి ప్రచారం చేశారు. ఉపన్యాసాలు యిచ్చేవారు. అవన్నీ విని చివరకొక రోజున సుందరమ్మగారి ఎనిమిదిఏళ్ల చిన్నకుమారుడు నిండుసభలో వుద్రేకపూరితంగ తానూ వుపన్యసించి అందరిని ఆశ్చర్యపరిచాడు.

1930 లో బందరుకోనకు వెళ్లి ఆమె వుప్పుతయారు చేశారు. విజయవాడలో అప్పటికే 144 వ సెక్షన్ అమలులో వున్నది. ఎవరు దానిని అప్పటి వరకు వుల్లంఘించలేదు. ఆమె ఒక్కరే జాతీయ జండా బుజాన పెట్టుకుని జాతీయగీతాలు పాడుతు వీధులన్ని తిరిగారు. "మహాత్మా గాంధీకి సోదరీమణులు మంగళహారతు లివ్వరే-" "రవి అస్తమించని రాజ్యంబులో నేడు రమణులు పోరాడగా అవునో కాదో విజయంబను సంశయంబేల, ఆత్మబలమున కడ్డామున్నదె యెందూ" వంటి పాటలు యెలుగెత్తి పాడుకుంటు, ఆమె తిరుగుతు వుంటే యిళ్లల్లోనుంచి అందరు బయటికి వచ్చిచూసేవారు. రిజర్వుపోలీసులు ఆనాడంతా మధ్యమధ్యన లాఠీలు రోడ్డుమీదబాదుతు తిరిగారు. ఆమె నిబ్బరానికి, మొండి సాహసానికి ఆశ్చర్యం కలుగుతుంది. మర్నాడు అరెస్టు చేశారు. 1930 ఆగస్టులో 6 నెలలు సాధారణ శిక్షవేసి రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమె పరమ సంతోషంగా చుండూరి రత్నమ్మ, దుర్గాబాయమ్మ, రుక్మిణీదేవిగార్లతో రకరకాల వ్యాసంగాలతోను వెళ్లబుచ్చి 1931 ఫిబ్రవరి 26న విడుదలయి విజయవాడ తమయింటికి చేరుకున్నారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడికననుసరించి ఒక్క సారిగా అందరిని జైళ్లనుంచి విడుదల చేశారు. విజయవాడ అన్ని రైలు మార్గాలకు కూడలి కావటాన, ఆమె మరికొందరు మిత్రులు కలసి జైలునుంచి విడుదల అయి వెళ్తున్న ఆంధ్ర స్త్రీలందరికి తమయింట ఆతిథ్యమిచ్చి, నూలుహారాలతో సన్మానించి పంపించేవారు. జైలుకు వెళ్లివచ్చిన కారణంగా, ఆమెను అనేక గ్రామాలవారు సగౌరవంగా ఆహ్వానించి సభలు సమావేశాలు జరిపి, ఆమెను వుపన్యసించమని కోరేవారు. అలవాటయిన అనర్గళధారతో ఆమె ప్రబోధం చేసేవారు.

1931 లో కరాచీ కాంగ్రెసుకు అనేక మంది ఆంధ్ర నాయకులతోపాటు ఆమె బొంబాయినుంచి స్టీమరులో వెళ్లారు. తెల్లవారేసరికి శ్రీ భగత్సింగును ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగ వురితీసినట్లు తెలిసింది. అందరికి విచారం కలిగింది. ఆ సాయంత్రం సభకు పుత్రశోకంతో భగత్సింగు తండ్రి వచ్చి, గాంధీజీ పాదాలపైనపడి శోకించాడు. గాంధీజీ అనునయించారు. ఈ దృశ్యం సుందరమ్మగారితో పాటు అందరి హృదయాలను ద్రవింప చేసి మరుక్షణం మరింత దృఢనిశ్చయంతో దేశసేవకు వురికొల్పింది. ప్రతిరోజు అక్కడ ఆమె ప్రభాతభేరీలు, జండావందనం, ప్రార్థన సమావేశాల

కన్నిటికి నియమం తప్పకుండ హాజరయ్యేవారు. ఒకనాడు వుదయాన శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావుగార్లు గాంధీజీకి ఆమెను పరిచయం చేసి ఆమె సేవలను, ప్రచారాలను వుగ్గడించారు. గాంధీజీ వాత్సల్యపూరితంగా ఆమె శిరస్సుపైన చెయ్యివేసి "అమ్మా మీరంతా యింతసేవ చేస్తున్నందుకు సంతోషం. స్త్రీలు పూనుకుని ఖద్దరు వుత్పత్తి, ప్రచారం, అమ్మకం, స్వదేశ వస్తువుల దుకాణాలను తెరవటం, స్వయంగా అమ్మటం అన్నీ చెయ్యాలి" అన్నారు. అప్పుడే ఆమెకు మహాత్ముడి మాటలను చేతలలో పెట్టాలన్న ఆరాటం పట్టుకున్నది. బొంబాయిలో స్వదేశీ బజారు స్త్రీలే నిర్వహించుతున్నారు. తానూ యీ రకంగా చేయవచ్చు ననుకుంటూ యిల్లు చేరుకున్నారు. మళ్లీ వెనక సి.ఐ.డి.లు తయారు.

ఆమెను అఖిల భారత కాంగ్రెసు కమిటీకి సభ్యురాలుగా నియమించారు. టౌను కాంగ్రెసు కమిటీకి ఉపాధ్యక్షురాలు ఐనారు. మామూలు ప్రచారాలు వుండనే వున్నవి. ఇంతలో బొంబాయిలో అఖిల భారత స్త్రీ సేవాదళం శిబిరం నెలకొల్పారు. అక్కడ వాలంటీరు శిక్షణ పొందటానికి శ్రీమతులు దేవులపల్లి సత్యవతమ్మ, దుర్గాబాయమ్మ, రంగనాయకమ్మగార్లు వెళ్తున్నట్లు తెలిసి సుందరమ్మగారు పూలమాలలతో స్టేషనుకు వెళ్లారు. వాళ్లందరు ఆమెను తమతో వచ్చేయమనటంతో అటునుంచి అటే బొంబాయి వెళ్లారు. శిబిరంలో కర్రసాము, గస్తీ తిరగటం వంటివి ఒక నెల అభ్యసించారు. నాయకుల ప్రబోధాలు విన్నారు. రౌండుటేబులు సమావేశం విఫలం కావటంతో ప్రభుత్వం యీ శిబిరాన్ని మూసివేయించారు. 144 వ సెక్షన్ అమలులో పెట్టినట్లు విజయవాడ స్టేషనులోనే ఆమెకు నోటీసు అందించారు. అదిమొదలు సి. ఐ. డి.లు ఆమెవెనకనే తిరుగుతూ వుండేవారు.

మరి నాలుగురోజులకు గాంధీజీని అరెస్టు చేయటంతో ఆమెకు వెర్రి ఆవేశం ముంచుకు వచ్చింది. బజారులన్నీ తిరిగి దుకాణాలు మూయించి హర్తాళ జరిపించారు. హోటళ్లు వెంటనే మూయనందున జంకుగొంకులు లేకుండ లోపలకువెళ్లి పొయ్యి మీది గిన్నెలు దింపి హోటళ్లు కూడ మూసివేసేవరకు స్థిమితపడలేదు. ఎట్లాగయినా స్త్రీలను వుద్బోధించి 144వ సెక్షన్ ధిక్కరింప చేయాలని ఆమె సంకల్పం. సంకల్పసిద్ధికి ఆమె దృష్టిలో యేవీ అడ్డురావు, అందువల్ల రాత్రివేళల ప్రయాణాలు చేసి

భట్టిప్రోలు, కూచిపూడి, తెనాలివంటి వూళ్లలో ప్రచారం చేశారు. ఫలితంగా ఆమెను, ఆమె చెల్లెలు శ్రీమతి కనకవల్లి తాయారమ్మను తెనాలిలో అరెస్టు చేశారు. మూడురోజుల పాటు అక్కచెల్లెళ్లను తాలూకా పోలీసుస్టేషనులో వుంచారు. క్షమాపణ వ్రాసియిస్తే విడుదలచేస్తామని రాయబారం పంపించారు ప్రభుత్వంవారు. ఆ పనిమాత్రం చేయమని ఖచ్చితంగా చెప్పేయటాన చెరి 6 నెలలు జైలుశిక్ష, ఐదువందలు జరిమానా విధించారు. జరిమానా చెల్లించటానికి నిరాకరించినందున ఒకటిన్నర నెలలు శిక్ష అదనం. రాయవేలూరు జైలులో రెండవసారి ఏడున్నర నెలలు శిక్షననుభవించి వచ్చారు. అక్కడ హిందీ, కుట్లు, అల్లికలు, ఎన్నో నేర్చుకున్నారు. జైలులో రాట్నాలు వడకనిచ్చేవారు. అందువల్ల తీరుబాటుగా ఎంతో నూలు వడికి యింటికి తెచ్చుకున్నారు.

అప్పటికి రవంత స్థిమితం చిక్కింది. గాంధీజీ చెప్పిన స్వదేశీ వస్తు విక్రయశాల స్థాపించారు. లాహోరు, అలహాబాదు, గ్వాలియర్, ఝాన్సీ, విష్ణుపూర్, కలకత్తావంటి అనేక ప్రదేశాల నుంచి స్వదేశవస్తువులు, ఖాదీ బట్టలు తెప్పించి విక్రయించేవారు. స్త్రీలే ఆ విక్రయశాల నిర్వహణచేశారు. బాపూజీ ఆదేశాన్ని అక్షరాలా పాటించిన సుందరమ్మగారి శక్తి సామర్థ్యాలు వెల్లడి అయినవి. విక్రయశాల ఎనిమిది సంవత్సరాలకుపైగా దిగ్విజయంగా నడిచి ప్రజలలో ఖాదీపట్ల, స్వదేశ వస్తువులపట్ల అభిమానం పెంపొందించింది.

ఇక ఆమె దృష్టి సంఘసంస్కారం మీదకు ప్రసరించింది. మహిళా సభలు ప్రతి గ్రామంలోను జరిపి బాల్య వివాహ నిరోధాన్ని విరివిగా ప్రచారం చేశారు. శారదా చట్ట ప్రాధాన్యతను ప్రజాబాహుళ్యానికి సుబోధకంగ వివరించేవారు. 1934 లో విజయవాడ పురపాలక సంఘ సభ్యులుగా, పోటీలేకుండ ఎన్నికయినారు. ఆ స్థానంలో ఏకబిగిన 1952 వరకు 18 సంవత్సరాల పాటు వున్నారు. అందరికి సేవచేయాలి, అందరు సుఖంగా వుండాలి అన్న తపన అధికం. అది తన వార్డా కాదా, తాను చేయాలా అక్కరలేదా అన్న సందేహం వచ్చేదికాదు. అన్నిటా తానే అయి కార్యసానుకూలతకు సహకరించేవారు. ఆ సమయంలోనే బెజవాడగా చెలామణి అవుతున్న పట్టణానికి విజయవాడగా నామకరణం జరిగింది.

స్త్రీ విద్యపట్ల ఆమెకున్న ఆసక్తివల్ల బాలికా విద్యాభివృద్ధికి చాలా దోహదం చేశారు. ఆమె కృషి ఫలితంగా ఆడపిల్లలకు ఒక హైస్కూలే రూపొందింది. పొదర్తి సుందరమ్మ గరల్స్ హైస్కూలు పేర ఆ స్కూలును పురపాలక సంఘంవారు యీ నాటికి చక్కగా నడిపించుతున్నారు. 1942 క్విట్టిండియా వుద్యమంలో ఆమె సత్యాగ్రహులకు అండగానిల్చి ఆశ్రయమిచ్చి ఆదుకున్నారు. 1948 లో హైద్రాబాదులో రజాకర్ల గొడవలు వచ్చి పడినవి. మానప్రాణాలను రక్కించు కోవటానికి జనం యిళ్లు, వాకిళ్లు వదలి వలస పోయినారు. ఆ సందర్భంలో సుందరమ్మగారు వ్యక్తి పరంగాను, విజయవాడ పురపాలక సంఘం తరఫున కాందిశీకులకు చేతనయి నన్ని విధాల సహకరించారు. కేంద్ర సంఘ సంక్షేమ సమితివారి సహాయ సహకారాలతో విజయవాడలో ఆమె ఒక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ నెలకొల్పారు. అక్కడ దాదాపు మూడువేల మంది స్త్రీలు తమ శక్తి సామర్థ్యాలనుపట్టి యెంతో కొంత సంపాదించుకోగలుగుతున్నారు. ఆ ఫ్యాక్టరీకి శంకు స్థాపన దుర్గాబాయమ్మగారే చేశారు. అనేక వైశ్య మహాసభల కధ్యక్షత వహించారు. మద్రాసు, మైసూరు రాష్ట్రాలలో వైశ్య మహాసభలు దిగ్విజయంగా జరిపించారు. ఆమె యేమీ చేయకుండ వుండలేరు. ఏదో ఒక కార్య కలాపం జరిపించుతునే వుండాలి.

1940 లో ఆమె హృషీకేశంలో ఒక ఆశ్రమం కట్టించారు. హరిద్వార్ వెళ్లే రోడ్డు పక్కగా, అనేక ఆశ్రమాల మధ్యన దక్షిణ భారతక్షేత్రం అనే పేరుతో గంగ ఒడ్డున వున్న ఆ ధర్మశాల దాక్షిణాత్యులకు బంధువుగా స్వాగతం యిస్తుంది. ఏ అద్దెలులేకుండ అక్కడ యాత్రికులు బస చేయవచ్చు. స్థిమితంగా జపతపాదులు చేసుకోవచ్చు. సంవత్సరంలో ఆరు నెలలకు పైగా ఆమె అక్కడే బస. స్వాతంత్ర్య సమరంలో తనతోపాటు పాల్గొని, జైలు జీవితం తనతో పంచుకున్న తనతోటి దేశసేవికలతో మళ్లీకలిసి కాలంగడపాలని ఆమెకు వుబలాటం కావచ్చు. ఆ నాటి వృద్ధ దేశసేవికలు యెవరైనా నిశ్చలంగా గంగ ఒడ్డున ఆశ్రమంలో సత్కాలక్షేపాలతో కాలం గడప తలుచుకుంటే వుచిత బససౌకర్యం కలిగించుతానంటూ ఆహ్వానించుతూ వుంటారు. ఇన్నిరంగాలలో యింతనిరాఘాటంగా ఆమె గట్టిసేవ చేయగలిగారంటే భర్త వెంకట సుబ్బయ్యగారి సహకారం, తోడ్పాటు యెంతగావుండేవో

పూహించుకోవచ్చు. 1932 లో శాసనోల్లంఘనంచేసి ఆయన జైలుకు వెళ్లారు. దానధర్మాలకు వారి పెద్దలు పేరు పొందినవారు.

పాదర్తి సుందరమ్మగారు శ్రీ కృష్ణునిరాజకీయ అభిరుచిని, గీతాభావాన్ని కలగలువుగా జీవితంలో రంగరించుకున్నారని పించుతుంది. వృద్ధాప్యంలో సిరిసంపదలతో తులతూగుతు, ఆమె అన్నిటిపట్ల ఎంతో ఆసక్తిని, వుత్సాహాన్ని కనపరుస్తారు.

---

# శ్రీమతి ఎర్నేని అమృతమ్మ

**జననం 1905**

గాంధీ మహాత్ముడిని కేవలం రాజకీయ నాయకుడుగా మాత్రమేకాక, తమ ఆధ్యాత్మికగురువుగా అడుగడుగునా జీవితంలో మార్గదర్శకుడుగా భావించి, తదనుగుణ్యంగా నడిచినవారిలో ఎర్నేని అమృతమ్మగారు ఒకరు.



శ్రీమతి ఎర్నేని అమృతమ్మ

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరులో 1905 లో ఆమె జన్మించారు. శ్రీమతి రామమ్మ, శ్రీ బొప్పన వెంకటాద్రులు ఆమె తలిదండ్రులు. అప్పట్లో ఆవూళ్లో అందుబాటులోవున్న సామాన్యవిద్యే ఆమెకు లభ్చింది. వదమూడవ ఏట 1918 లో ఆమెను మేనత్త కుమారుడైన శ్రీ ఎర్నేని సూర్యనారాయణ కిచ్చి వివాహం చేశారు. సూర్యనారాయణ గారు, ఆయనతమ్ముడు సుబ్రహ్మణ్యంగారు హోంరూలు నాటినుంచి జాతీయోద్యమంతో సన్నిహితత్వం గలవారే. వారి దొక పెద్ద వుమ్మడికుటుంబం. కుటుంబమంతా స్వదేశీవ్రతం పూనిన వారే. వడకటం, ఖాదీ ధరించటం, స్వదేశీ వస్తువులే వుపయోగించటం పరిపాటి. కుటుంబ సభ్యులందరు చేరి రాజకీయ చర్చలు చేసేవారు. వుద్యమ ప్రచారం చేసేవారు. అమృతమ్మగారికి అత్తవారు మేనత్త కుటుంబమే కావటాన ఆమెకు వివాహానికి ముందునుంచే ఆ వాతావరణం అలవాటయి పోయింది. ఆ తరువాత ఎర్నేని అమృతమ్మగా ఆమె సాధికారంగ జాతీయోద్యమంలో ప్రవేశించారు. 1919 లో రౌలట్ శాసన నిరసన ప్రదర్శనం, 1922 లో గుంటూరు జిల్లా పన్నుల నిరాకరణోద్యమం, సైమన్ కమిషన్ బహిష్కరణ, కాంగ్రెసునిధికి కోటి రూపాయల సేకరణ మొదలైన ఆంధ్ర జాతీయోద్యమ కార్యకలాపాలన్నిటిలోను యింట్లో అందరితోపాటు ఆమె పాల్గొన్నారు.

1930 లో గాంధీ మహాత్ముడు వుప్పు తయారుచేసి దేశవ్యాప్తంగ ప్రజలందరిచేత బ్రిటిష్ ప్రభుత్వ శాసన ధిక్కారం చేయ నిర్ణయించుకున్నారు సబర్మతీ ఆశ్రమం నుంచి శిష్యవర్గంతో దండికి పదయాత్ర సాగించారు. అప్పటికే సబర్మతీ ఆశ్రమంలో వుంటున్న ఆమె మరది సుబ్రహ్మణ్యంగారు యావదాంధ్రుల ప్రతినిధిగా దండి వెళ్లారు. దండినుంచి తెచ్చిన వుప్పు పొట్లాలు తామందరు కొన్నారు. ఇతరులకు అమ్మి కాంగ్రెసు నిధికి డబ్బు సేకరించారు. తామందరూకూడా వుప్పువండి శాసన ధిక్కారం చేయా లనుకున్నారు. అంగలూరులోని వారి స్వంతయిల్లే ఒక వాలంటీరు శిబిరం అయింది. ఊరుచెరువు సమీపాన మరొక శిబిరం ఏర్పాటయింది. కుటుంబ సభ్యులు, బంధువులు, మిత్రులు పౌరులు అంతా అత్యుత్సాహంతో సమరంలో పాల్గొన్నారు. నలుగురు నలుగురుస్త్రీలు ఒక దళంగాచేరి వుదయం బయలు దేరేవారు. కోర్టులు, ఆఫీసుల ముందు నిలబడి వాటిని బహిష్కరించమని ప్రబోధించేవారు. కల్లు సారాదుకాణాల దగ్గర, విదేశీ వస్త్రదుకాణాల దగ్గర పికెటింగులు జరిపేవారు. జండాలతో వూరేగింపులు జరిపి, సభలు జరిపి శాసన ధిక్కారంచేసేవారు. పోలీసులు వచ్చి అరెస్టని లారీలలో ఎక్కించు కునివెళ్లి కంకిపాడు, బంటుమిల్లి జంక్షను, బందరువంటిచోట్ల వదిలి వెళ్లేవారు. తిరిగి సాయంత్రం అయేటప్పటికి నానా బాధలుపడి వీళ్లందరు యిల్లుచేరుకునే వారు. ఈ విధంగా ఆమె మూడునెలలు విసుగు విరామంలేకుండా నానా బాధలు సహించి వుద్యమంలో పాల్గొన్నారు. ''శ్రీ గాంధి నామాము మరు వాము మరువాము, సిద్ధాము జైలుకు వెరువాము వెరువాము'' అనేదే వారి తారక మంత్రం. ఆమెను అంగలూరులో అరెస్టు చేశారు. ఒక సంవత్సరం శిక్ష విధించారు. వందరూపాయలు జరిమానా విధించారు. జరిమానా చెల్లించటానికి నిరాకరించిన కారణంగా ఆరువారాలు అదనపు శిక్ష. కన్న నూరు జైలుకు వెళ్లారు. ఆ సమయంలో అక్కడ శ్రీమతులు కోయం బత్తూరు సావిత్రమ్మ, కుట్టిమాలు అమ్మ వున్నారు.

ఆమె కది చెరసాలగా తోచలేదు. ఈశ్వరదర్శనానికి, ఆత్మదర్శనానికి మోక్షద్వారంగా తోచింది. శ్రీకృష్ణుడు జన్మించిన పవిత్రస్థలంగా ఆమె భావించి సంతోషంతో శిక్ష అనుభవించి వచ్చారు. అప్పట్లో యీామె కుటుంబ సభ్యులు, బంధువులు కనీసం 16 మంది వివిధ జైలుశిక్షలు అనుభవించారు.

1931 అక్టోబరు 2న కొమరవోలు గ్రామంలో గాంధి ఆశ్రమస్థాపన జరిగింది. అంగలూరులోవున్న స్వంతయిల్లు బ్రిటిష్ ప్రభుత్వం స్వాధీన పరుచుకున్నది. అందువల్ల కుటుంబమంతా ఆశ్రమంలోనే గాంధీజీ ఆదేశాను సారం నిర్మాణాత్మక కార్యకలాపాలను నిర్వహించుతు గడపనారంభించారు. తిరిగి 1932 లో తీవ్రంగ శాసనోల్లంఘన కార్యక్రమాలలో పాల్గొనటంతో ప్రభుత్వం ఆశ్రమాన్ని చెల్లాచెదురుచేసింది. సీళ్ళు వేసింది. కాని వీరవనితలు ఒకొక్క దళంగా వచ్చి ఆ సీళ్ల అతినిర్లక్ష్యంగా పగలగొట్టి ప్రవేశించేవారు. మర్నాడు అధికారులు వచ్చి వీరినితరిమికొట్టి తిరిగి సీళ్ల వేసేవారు. కుటుంబ సభ్యులందరు జైళ్లకు వెళ్లటం, ప్రభుత్వం సీళ్లువేయటంతో ఆశ్రమం మూతపడింది. 1935 లో బాబు రాజేంద్రప్రసాదుగారు వచ్చి ఆశ్రమాన్ని తిరిగి ప్రతిష్ఠించారు. కుటుంబసభ్యులు, స్త్రీలతోసహా వార్ధా ఆశ్రమానికి వెళ్లి శిక్షణ పొందినవారే కావటాన స్వావలంబన విధానంలో పత్తిపండించటం, ఏకటం, వడకటం, నేయించటం, పొలంపనులు, చిన్నచిన్న రోడ్లు వంతెనలు నిర్మించు కోవటం, సేద్యం, పశువుల పెంపకం, ప్రకృతి చికిత్సవంటి కార్యక్రమాలు యెన్నో స్వయంగాపూనుకుని అందరితోపాటు తాను చేసేవారు.

1929 లో గాంధీమహాత్ముడు ఖాదీ ప్రచారంచేస్తు దేశమంతట తిరిగారు. ఖాదీ ప్రచారం, ధారణ కూడ ఆంధ్రులంత ప్రబలంగా మరెవరుచేయ లేదని ఆయన విశ్వాసం. ఆ సంతృప్తితో ఆయన ఆంధ్రులను, అందులోను ఆంధ్ర మహిళల కృషిని శ్లాఘించుతు ఆంధ్రదేశ పర్యటన చేశారు. ఆ సందర్భంలో అంగలూరు వచ్చి ఎర్నేని వారికుటుంబ సభ్యులు యావన్మందిని ఆశీర్వదించారు. వారి ఒక్కొక్కరి కృషిని గుర్తించారు. శ్రీమతి అమృతమ్మ గారు, కుటుంబంలోని తదితరస్త్రీలు తమనగలన్నీ మహాత్ముని కాంగ్రెసునిధికి సమర్పించారు. తిరిగి 1933 డిశంబరు, 1934 జనవరిలో గాంధీజీ హరిజన యాత్రసందర్భంగా ఆంధ్రదేశం వచ్చారు. అప్పుడు ఆమె కుటుంబముతో సహాకృషిచేసి అంగలూరులోను బొమ్మలూరులోనువున్న దేవాలయాలలో హరిజన ప్రవేశానికి అవకాశాలు కల్పించారు. గాంధీజీ ఆ వూర్లు వచ్చి స్వయంగా హరిజనులను వెంటపెట్టుకుని ఆలయప్రవేశాలు చేశారు. ఆ సందర్భంలో ఆమెను, కుటుంబసభ్యులందరిని పేరు పేరు వరసన గాంధీజీ ఆశీర్వదించారు. అప్పుడు ఆమె తోడికోడలు, ఆడపడుచులు, మేనగోడళ్లు మొదలయిన కుటుంబ స్త్రీలందరు మంగళసూత్రాలతో సహావున్న బంగార

మంతా కాంగ్రెసునిధికి సమర్పించారు. ఈ చేతితోయిచ్చి ఆ చేతితో తిరిగి ధరించలేదు. నాటికినేటికి ఆమె నుదుటకుంకుమ బొట్టు మెడలో పసుపుకొమ్ము మాత్రమే ఆమెకు అలంకారాలు. స్థిరచరాస్థులన్నీ బ్రిటిష్ ప్రభుత్వవశమైనవి. గాంధీ ఆశ్రమంలో వివిధ నిర్మాణాత్మక కార్యకలాపాలు కొనసాగించుతు పత్తి ఏకటం దగ్గరనుంచి ఏకులు చేయటం, వడకటం, బట్ట నేయించటం వంటివన్నీ గ్రామస్థులకు నేర్పుతు శ్రమపూరితమైన నిరాడంబర జీవితం గడుపుతున్నారు. శ్రీమతి రాధా మనోహరమ్మ ఆమె యేకైక సంతానం. కూతురు చేత రాష్ట్రభాషా విశారద చదివించారు. వార్ధా ఆశ్రమంపంపి శిక్షణ యిప్పించారు. కస్తూరిబా ట్రస్టుకు పంపిగ్రామసేవికగా శిక్షణ యిప్పించారు. గ్రామసేవికగా పనిచేయించారు. హిందీ భాషా ప్రచారం చేయించారు. ఆమె కూడ తలిదండ్రులతో పాటు ఆశ్రమంలో నిర్విరామంగా పనిచేస్తువుండేవారు.

ఇంతలో క్విట్టిండియా వుద్యమం తలెత్తింది. స్వాతంత్ర్య సమరంలో అది ఆఖరుఘట్టం. తమ యావచ్ఛక్తిని వినియోగించి విజయమో వీర స్వర్గమో తేల్చుకోవాలని అమృతమ్మగారూ అత్యుత్సాహంతో రంగంలో ప్రవేశించారు. ఆమె తోడికోడలు, తదితరబంధువర్గం వుండనేవున్నారు. ఆ కుటుంబంలో మూడవతరపు దేశభక్తులు త్యాగశీలులు అయిన శ్రీమతి రాధా మనోహరమ్మ, ఆమె మరది కుమార్తె కుమారి కస్తూరిదేవి బాలాభిమన్యులుగా విజృంభించారు. నెలలపర్యంతం వూరూరుతిరిగి రాత్రింబగళ్లు ప్రచారంచేశారు. వాళ్లందరిని అరెస్టుచేశారు. శ్రీమతి అమృతమ్మగారిని రాయవేలూరు పంపించారు. విడుదలై వచ్చి వ్యక్తి సత్యాగ్రహం చేసి, మళ్లీ అరెస్టయినారు. 1944 లో తిరిగిఅరెస్టయి దీర్ఘకాలం శిక్ష అనుభవించి వచ్చారు. వృద్ధులైన ఆమె అత్తగారు శాసనధిక్కారంచేసి ఒక సంవత్సరం జైలుకు వెళ్లారు. ఆమె భర్త శ్రీ సూర్యనారాయణ నాలుగుసార్లు, మరది నాలుగుసార్లు, తోడికోడలు నాలుగు సార్లు, కుమార్తె 2 సార్లు, ఆమె నాలుగుసార్లు దేశసేవలో జైలుశిక్షలు అనుభవించారు. స్థిరచరాస్తులు నగలు నాణేలు హరించుకు పోయినవి. ప్రభుత్వంచేతిలో నానాబాధలు, కష్టాలు, అవమానాలు అనుభవించారు. కాని ఆమెకాని ఆమెవారుకాని లొంగలేదు. పరమసంతోషంతో అది తమకు గాంధీ మహాత్ముడి రూపేణ భగవంతుడు యిచ్చిన అవకాశంగామాత్రమే భావించారు. ఆమె తన పైతరానికి దేశసేవలో పూతంగానిల్చారు. తనతరంవారికి

చేదోడుగా, సహచరులుగా చరించారు. భావితరాన్ని త్యాగశీలులుగా, దేశారాధకులుగా తీర్చిదిద్దారు.

ఆమెకిప్పుడు 75 సంవత్సరాలు దాటినై, శక్తి వుడిగి పోయింది. నిత్యనూతనంగా రాజకీయసమస్యలలో పాల్గొనే దారుఢ్యంలేదు. కానిదంపతులు తమదేశ సేవఘట్టాలను, జైలు జీవితాన్ని త్యాగమూర్తి గాంధీజీ ప్రవచనాలను పునః పునః స్మరించుకుంటు ధన్యులమనితృప్తి పడుతు వుంటారు.

---

# శ్రీమతి శ్రీ పెరంబుదూరు సుభద్రమ్మ

జననం 1904 మరణం 1974

కొంతమంది జీవితాలు సాఫీగా ఒక పద్ధతిలో గడిచిపోతవి. మరి కొందరి జీవితాలు యేక్షణాన యేమలుపు తిరుగుతుందో తెలియకుండ వింతనడకలు నడుస్తు వుంటవి. అందుకు చక్కని తార్కాణం శ్రీ పెరంబుదూరు సుభద్రమ్మ గారి గాథ.



శ్రీమతి పెరంబుదూరు సుభద్రమ్మ

వైష్ణవ సాంప్రదాయానికి చెందిన మామిళ్లపల్లి రామానుజాచార్యులు తాయారమ్మగార్ల కుమార్తెగా ఆమె 1904 లో జన్మించారు. తూర్పు గోదావరిజిల్లా, కాకినాడ ఆమె స్వస్థలం. అన్నతమ్ములు, అక్కచెల్లెళ్లు వున్నారు. చాలా చిన్నతనంలోనే ఆమెకు శ్రీ పెరంబుదూరు బుచ్చయాచార్యులుగారితో వివాహం జరిగింది. మరి కొద్దికాలానికే విధి వక్రించింది. నందనవనం అవుతుందనుకున్న ఆమె జీవితం తల్లిదండ్రుల కొక విషమ సమస్యగా తయారయింది. 4-5 తరగతులవరకు చదివించటం తప్ప యేమి చేయటానికి వారికితోచలేదు. ఆమె చిన్నన్నగారయిన గోపాలాచారిగారికి చెల్లిలిపైన యెంతో అభిమానం, జాలి. ఉద్యోగరీత్యా మెసపొటేమియాలో వుంటున్న ఆయన చెల్లెలిని క్రమవిధానంలో చదివించమని తల్లితండ్రులకు ధైర్యం కలిగించి, తగిన ధన సహాయం చేశారు. 15 సంవత్సరాల వయసు వచ్చిన అమ్మాయి వున్నవూళ్లో చిన్న క్లాసులు చదవటం బాగుండదు. అందుకని చాలా సాహసంచేసి ఆమె తల్లిదండ్రులు ఆమెను విశాఖపట్నంలో క్వీన్ మేరీ గరల్సు హైస్కూల్లో 5వ తరగతిలో చేర్పించారు. ఆమెకి హాస్టలులో వసతి. 1927 లో స్కూలు

ఫైనలు ముగించారు. ఆమె గుండె చాలా మెత్తనిది. ఇతరుల కంటతడి సహించలేదు. వాళ్లకు కలిగిన కష్టాలు బాధలు తొలగించటానికి నిస్సంకోచంగ ముందుకు వచ్చేవారు. పేద విద్యార్థినులకు తనదగ్గరవున్న డబ్బు, పుస్తకాలు చివరకు తనబట్టలుసైతం యిచ్చేసేవారు. అది చేయటం తెలికేనేమోకాని తాను చేసిన సహాయం మూడవ వ్యక్తికి తెలియనిచ్చే స్వభావంకాదు ఆమెది. అవుదాత్తత, స్థైర్యం చివరిదాకా నిల్చిపోయినవి.

కాకినాడ పిఠాపురంరాజావారి కాలేజిలో ఇంటరు ముగిసింది. అప్పటికే ఆమె దృష్టిక్లాసులుదాటి రాజకీయ ప్రాంగణంలో నిలవసాగింది. ఊరేగింపులలో, సభలలో, సమావేశాలలో పాల్గొనటం సాగించారు. ఖద్దరు ధారణ, రాట్నం మీదనూలు వడకటం, జాతీయగీతాలు ఆలపించుతు ప్రచారం చేయటం దినచర్య అయింది. అట్లాగే ఇంటరుమీడియట్ ముగించారు.

ఆమెకొక స్వతంత్ర జీవనోపాధి మార్గం చూపించి, స్థిరమైన భవిష్యత్తు కల్పించాలనుకున్న చిన్నన్నగారికి విశాఖపట్నంలో వుద్యోగమయింది. ఇక చెల్లెలి చదువు నిరాఘాటంగా సాగుతుందన్న తలంపుతో ఆమెను విశాఖపట్నం రప్పించి అక్కడ బి. ఏ. ఆనర్సులో చేర్పించాడు. కాని అప్పటికే ఆమెకు ఇంగ్లీషు చదువులమీద మోజుపూర్తిగా నశించి, జాతీయావేశం దృఢ పడింది. జాతీయోద్యమంలో చేరి, స్వరాజ్య సంపాదనకు పాటుపడితీరాలని నిశ్చయించుకున్నది. ఆనర్సు చదువు ముగియకుండానే బహిరంగ సభల్లో వుపన్యసించటం, సత్యాగ్రహం చేయనారంభించింది. ఉద్యమ ప్రచారంలో ఏలూరు, విజయవాడ, గుంటూరువంటి వూళ్లన్నీ తిరిగారు. ఆ సందర్భంలో శ్రీమతులు పొదర్తి సుందరమ్మ కొల్లా కనకవల్లి తాయారమ్మ, సంగం లక్ష్మీబాయమ్మ, దేవులపల్లి సత్యవతమ్మ వంటి అనేకమంది దేశసేవికలతో సన్నిహితత్వం యేర్పడింది. ఆమె నిస్వార్థ స్వభావం, చురుకుతనం, సాహసం ప్రతివారిని ఆకర్షించేవి. ఉత్సాహానికి అవధులు లేవు. ఆ వాతావరణమే అటువంటిది. సుందరమ్మ గారితో కలిసి పశ్చిమ కృష్ణాజిల్లా అంతా తిరిగి ప్రచారం చేశారు. కాళ్లరిగేట్టు కాలినడకనే తిరిగారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో నాయకులందరు అరెస్టయిన తరవాత వుద్యమం చల్లారి పోకుండ యీామె, సుందరమ్మగారు బందరు కోనకువెళ్లి వుప్పువండేవారు. కల్లుసారా దుకాణాల దగ్గర పికెటింగు చేసేవారు. చివరకు 1930 లో అరెస్టు అయినారు. 6 నెలల

కఠినశిక్ష అనుభవించటానికి రాయవేలూరు జైలుకు వెళ్లారు. తోడుగా వెళ్లి జైలులో దింపివచ్చిన సుందరమ్మగారు 27-8-1930న అరెస్టయి ఆ జైలుకే వెళ్లారు. 1930 సత్యాగ్రహ సందర్భంలో పశ్చిమ కృష్ణాజిల్లాలో అరెస్టయిన 168 మందిలోను స్త్రీలు వీరిద్దరే. ఆ సమయంలో రాయవేలూరు జైలులో వున్న రాజకీయ స్త్రీ బందీలు శ్రీమతులు ఎక్కల పున్నమ్మ, చుండూరి రత్నమ్మ, దుర్గాబాయమ్మ, సంగం లక్ష్మీబాయమ్మ, వేదాంతం కమలాదేవి, ఇంకా ఎందరో.

జైలు శిక్షపూర్తి చేసుకుని వచ్చారు. సంపూర్ణ స్వరాజ్య సాధనలక్ష్యం కావటాన ఆ ఆవేశంయింకా చల్లారలేదు. ఉత్సాహం తగ్గలేదు. ఇంతలో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక కారణంగా భారత దేశం మొత్తంమీద రాజకీయ బందీలందరిని విడుదల చేశారు. ఏరైలు చూసిన విడుదలయిన సత్యాగ్రహులే. శ్రీమతులు సుభద్రమ్మ, పాదర్తి సుందరమ్మ మరికొంత మంది సహచరులను కూర్చుకుని విజయవాడలో ఒక సన్మాన సంఘం నెలకొల్పారు. ఆవూరు ఆంధ్రదేశానికి కూడలి కాబట్టి అటుగావెళ్లే స్త్రీ సత్యాగ్రహులను తీసుకువెళ్లి తలంట్లు పోయించి, విందులు చేసి సన్మాన సభలు జరిపి గౌరవపూర్వకంగా వారి వారి వూళ్లు పంపేవారు. ఇట్లా ఆమె తరగని వుత్సాహంతో కావలసినంత కాలక్షేపం కల్పించు కున్నారు.

ఇంతలో కరాచీ కాంగ్రెసు వచ్చింది. 1931 మార్చి ఆఖరున సమావేశం. ఆంధ్ర దేశంనుంచి స్త్రీలు పురుషులు తండోప తండాలుగ వెళ్లారు. శ్రీమతి సుభద్రమ్మ ముందేతయారు. బొంబాయి స్టీమరుమీద కరాచీ చేరుకున్నారు. స్టీమరు ప్రయాణం ఒక వింత అనుభవం. బాలవితంతువుగా చదువుసంధ్యలు లేకుండా నాలుగు గోడల మధ్య నిర్లిప్తంగ గడచిపోవలసిన జీవితం. ఆమె తనకున్న అవకాశాన్ని వుత్సాహాన్ని, చురుకుతనాన్ని కలబోసి జాతీయ సమైక్యతా భావాన్ని, కార్య నిర్వహణా దక్షతను పెంపొందించు కోవటానికి వినియోగించు కున్నారు.

గాంధీ మహాత్ముడు మొదలయినవారు రౌండు టేబులు సమావేశానికి ఇంగ్లండు వెళ్లారు. వారి సంధి ప్రయత్నాలు విఫలమైతే దేశవ్యాప్తంగ తిరిగి శాసనోల్లంఘనంచేయాలి. అందుకు స్త్రీలకు చక్కని తర్ఫీదు నివ్వటం కోసం బొంబాయిలో 1931 డిశంబరు 15 ప్రాంతాలనుంచి హిందుస్తానీ సేవాదళశిబిరం

కఠినశిక్ష అనుభవించటానికి రాయవేలూరు జైలుకు వెళ్లారు. తోడుగా వెళ్లి జైలులో దింపివచ్చిన సుందరమ్మగారు 27-8-1930న అరెస్టయి ఆ జైలుకే వెళ్లారు. 1930 సత్యాగ్రహ సందర్భంలో పశ్చిమ కృష్ణాజిల్లాలో అరెస్టయిన 168 మందిలోను స్త్రీలు వీరిద్దరే. ఆ సమయంలో రాయవేలూరు జైలులో వున్న రాజకీయ స్త్రీ బందీలు శ్రీమతులు ఎక్కలి వున్నమ్మ, చుండూరి రత్నమ్మ, దూర్గాబాయమ్మ, సంగం లక్ష్మీబాయమ్మ, వేదాంతం కమలాదేవి, ఇంకా ఎందరో.

జైలు శిక్షపూర్తి చేసుకుని వచ్చారు. సంపూర్ణ స్వరాజ్య సాధనలక్ష్యం కావటాన ఆ ఆవేశంయింకా చల్లారలేదు. ఉత్సాహం తగ్గలేదు. ఇంతలో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక కారణంగా భారత దేశం మొత్తంమీద రాజకీయ బందీలందరిని విడుదల చేశారు. ఏ రైలు చూసిన విడుదలయిన సత్యాగ్రహులే. శ్రీమతులు సుభద్రమ్మ, పొదర్తి సుందరమ్మ మరికొంత మంది సహచరులను కూర్చుకుని విజయవాడలో ఒక సన్మాన సంఘం నెలకొల్పారు. ఆవూరు ఆంధ్రదేశానికి కూడలి కాబట్టి అటుగావెళ్లే స్త్రీ సత్యాగ్రహులను తీసుకువెళ్లి తలంట్లు పోయించి, విందులు చేసి సన్మాన సభలు జరిపి గౌరవపూర్వకంగా వారి వారి వూళ్లు పంపేవారు. ఇట్లా ఆమె తరగని వుత్సాహంతో కావలసినంత కాలక్షేపం కల్పించు కున్నారు.

ఇంతలో కరాచీ కాంగ్రెసు వచ్చింది. 1931 మార్చి ఆఖరున సమావేశం. ఆంధ్ర దేశంనుంచి స్త్రీలు పురుషులు తండోప తండాలుగ వెళ్లారు. శ్రీమతి సుభద్రమ్మ ముందేతయారు. బొంబాయి స్టీమరుమీద కరాచీ చేరుకున్నారు. స్టీమరు ప్రయాణం ఒక వింత అనుభవం. బాలవితంతువుగా చదువుసంధ్యలు లేకుండా నాలుగు గోడల మధ్య నిర్లిప్తంగ గడచిపోవలసిన జీవితం. ఆమె తనకున్న అవకాశాన్ని వుత్సాహాన్ని, చురుకుతనాన్ని కలబోసి జాతీయ సమైక్యతా భావాన్ని, కార్య నిర్వహణా దక్షతను పెంపొందించు కోవటానికి వినియోగించు కున్నారు.

గాంధీ మహాత్ముడు మొదలయినవారు రౌండు టేబులు సమావేశానికి ఇంగ్లండు వెళ్లారు. వారి సంధి ప్రయత్నాలు విఫలమైతే దేశవ్యాప్తంగ తిరిగి శాసనోల్లంఘనంచేయాలి. అందుకు స్త్రీలకు చక్కని తర్ఫీదు నివ్వటం కోసం బొంబాయిలో 1931 డిశంబరు 15 ప్రాంతాలనుంచి హిందుస్తానీ సేవాదళశిబిరం

నెలకొల్పారు. ఆంధ్రరాష్ట్రం తరపున సుభద్రమ్మగారు కూడాఅక్కడ శిక్షణపొంది కర్రసాము, గస్తీ తిరగటం, నగర సంకీర్తనం వంటి విద్యల నభ్యసించి వచ్చారు.

1931 డిశంబరు 31న దేశ వ్యాప్తంగ శాసనోల్లంఘనం చేయటానికి గాంధీజీ అనుమతించారు. దాంతో వుద్యమంలో క్రొత్త కెరటం ఉవ్వెత్తునలేచింది. ఆంధ్రులు, స్త్రీలు పురుషులు అమితమైన సాహసంతో పట్టుదలతో పాల్గొన్నారు. ఆ కార్యకలాపాలను ఆపకుండానే సాగించుతున్న శ్రీమతి సుభద్రమ్మ తీవ్రకృషిని సాగించారు. ఆంధ్ర రాష్ట్ర నియంతగా వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1932 ఏప్రిల్ 2న గుంటూరు జిల్లా పెనుమాకలో అరెస్టయినారు. 2వ సారి అరెస్టు కావటంవల్ల, ఆమె నియంత కావటం వల్ల ఒక సంవత్సరం 'సి' క్లాసు కఠినశిక్ష వేశారు. శిక్ష అనుభవించటానికి రాయవేలూరు జైలు ప్రవేశించారు. ఆసమయంలో అక్కడ శ్రీమతులు దిగుమర్తి జానకీబాయమ్మ, కొల్లా కనకవల్లి తాయారమ్మ, భారతీరంగా వున్నారు. అప్పుడు జైలులో వుండగానే ఆమెకు మళ్లీ చదువుపైన ధ్యాస కలిగి పరీక్ష వ్రాసి బి. ఏ. అయినారు.

విడుదలయివచ్చిన తరవాత బ్రిటిష్ ప్రభుత్వం క్రింద వుద్యోగం చేయరాదని నిశ్చయించుకున్నారు. ఆరోజుల్లో విజయవాడలో తంగిరాల రాఘవయ్యగారు నేషనల్ ఇండియన్ లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీ నిర్వహించుతు దానిలో స్త్రీలకు ప్రత్యేక విభాగం ఏర్పరచారు. ఆ కంపెనీ ఏజంటుగా ఆమె అతిసమర్థవంతంగా పనిచేశారు. అప్పట్లో ఇన్సూరెన్సు రంగంలో అంత పేరు తెచ్చుకున్న మహిళలు లేరు. ఆమె ఆ పనిమీద తరుచు మద్రాసు వెళ్లవలసి వస్తు వుండేది. చివరకు మద్రాసుకే మకాం మార్చారు. ఆమెకు చిన్ననాటి నుంచి తనది, తనకోసం అనేమమత తక్కువ. ఉన్నదానిని అవసరమైన నలుగురికి వుపయోగపరచాలనే తత్వం. దాంతో ఆమె సహాయం పొందేవారితో యిల్లు నిండుగా వుండేది. కులమత భేదాల పట్టింపు ఆమెకు బొత్తిగాలేదు. నిరాధారులు సహాయమపేక్షించితే ఆశ్రయమిచ్చి యేదో ఒక చేతి పనివృత్తి నేర్చుకోవటానికి సహకరించేవారు. చదువుపట్ల అభిరుచి వున్నవారికి పరీక్షలకు కట్టటానికి తోడ్పడేవారు. పునర్వివాహం కావాలనుకుని సహాయమర్థించిన వాళ్లకు సలక్షణంగా పునర్వివాహం జరిపించి స్థిరపడేటట్లు చూసేవారు. ఇట్లా ఆమె ఒక విధంగా శక్తికి మించి వివిధ రకాలుగా

మహిళలకు సేవచేశారు. మద్రాసులో లేడి సుబ్బరావు స్థాపించిన సేవాసదన్‌కు కొంతకాలం సూపరింటెండెంటుగా పనిచేశారు.

ఆ రోజుల్లో మద్రాసు నగరంలో తెలుగు పిల్లలకు తెలుగు చదువుకునే అవకాశం వుండేదికాదు. తెలుగు మీడియం అసలు లేకపోగా ఇంగ్లీషు మీడియంలో చదవటానికి సిద్ధపడినా మాతృభాషగా తమిళం చదవవలసి వచ్చేది. తెలుగువున్న బడులు చాలా కొద్దిగా వుండేవి. ఇవన్నీ చూసిన మీదట తాను తెలుగు పిల్లల విద్యారంగంలో ప్రవేశించా లనుకున్నారు. మద్రాసులోని పెరంబూరులో వెంకటరమణ ప్రాథమిక పాఠశాలను తెలుగు పిల్లలకోసం స్వయంగా నెలకొల్పారు. అదిచక్కగా అభివృద్ధి పొందటంచూసి పెరంబూరు పరిసరాలలో రెండు పల్లెలలో మరిరెండు తెలుగు ప్రాథమిక పాఠశాలలు పెట్టారు. ఆ మూడు చక్కగా పనిచేయసాగినవి. కేవలం పాఠాలు చెప్పటంతో తృప్తిపడక పిల్లల మనసులకు ఆహ్లాదం కలిగించుతు కళాభిరుచి కలిగించటానికి, లోకజ్ఞానం, సంఘీభావం కలిగించటానికి యెంతగానో ప్రయత్నించారు. ప్రభుత్వము ఒక్కదమ్మిడీ సహాయం చేయలేదు. ఈ మూడు పాఠశాలలు ఆమె విరాళాలు సేకరించి, స్వంత డబ్బు ఖర్చు పెట్టి నడిపించారు. పెరంబూరులో బాలానంద సంఘం ఏర్పరచి దానిని ఆంధ్ర బాలానంద సంఘానికి అనుబంధంగ చేర్చి తెలుగు బాలలకు విజ్ఞాన దాతలయినారు. పిల్లల సేవతో తృప్తిపడక, వారి తల్లులకోసం ఒక మహిళా మండలి స్థాపించారు. హిందీక్లాసులు నడిపి పరీక్షలకు పంపటం, కుట్లు అల్లికలు వంటివినేర్పి పరీక్షలకు పంపటం అక్కడ జరిగేవి.

అప్పటికి భాషాప్రయుక్త రాష్ట్ర విభజన ప్రసక్తి ప్రభుత్వస్థాయిలో వచ్చింది. ఆంధ్ర రాష్ట్రోద్యమం తీవ్రత తాల్చింది. ఆమె అందులోను పాల్గొన్నారు. అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణం జరిగిపోయినా ముగింపు కనిపించలేదు. ఆంధ్రులు అనేక సభలు సమావేశాలు జరిపి ప్రబోధం చేసేవారు. కమిటీలు నెలకొల్పి సూచనలు ప్రభుత్వానికి అందించేవారు. శ్రీమతి సుభద్రమ్మ పూనికతో కృషి చేశారు. శ్రీమతి జాస్తి సీతా మహలక్ష్మమ్మ అధ్యక్షతన 20-1-1953 న మద్రాసు శుభోదయ భవనంలో జరిగిన సమావేశంలో శ్రీమతులు సుభద్రమ్మ, న్యాయపతి కామేశ్వరమ్మ, పప్పుల లక్ష్మమ్మ అనేకులు హాజరయినారు. అటు ఏకభాషా ప్రయుక్తంగానో,

యిటు పరిపాలనాసౌలభ్యమో మనసులో పెట్టుకుని రాష్ట్ర విభజన చేయటం అవసరమని సత్వరం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కావాలని వాంఛూ కమిటీకి ఒక మెమొరాండం పంపించారు.

ఆమె విద్యావంతురాలు, సమర్ధురాలు. ఏ రంగంలోను శృంఖలాలను భరించలేని స్వేచ్ఛావాది. తన భవిష్యజీవనానికి బంగారుబాట అయిన ఆనర్సు చదువును కాలదన్ని దేశసేవచేసి జైలు నరకం అనుభవించారు. పరప్రభుత్వం కింద బానిసగా వుండనంటు స్వతంత్రమైన జీవికను ఎన్ను కొన్నారు. ఆంధ్ర బాలలకు, మహిళలకు సేవచేశారు. ఆర్తులకు, నిస్సహాయులకు, అనాధలకు ఆఖరు పైసా వరకు సహాయం అందించారు. 1974 లో హైదరాబాదులో శాశ్వతంగా కన్నుమూశారు.

# శ్రీమతి కొండా అలివేలుమంగ సత్యవతమ్మ

**జననం 6-10-1911**

గుంటూరు పట్టణం నల్ల చెరువుగట్టున 1932వ సంవత్సరం జూన్ 5వ తేదీ తెల్లవారు జామున బ్రహ్మాండమైన బహిరంగ సభజరిగింది. అన్ని సంధి ప్రయత్నాలు విఫలంకాగా గాంధీజీ ఆదేశానుసారం బహిరంగంగా ఉప్పు వండి, పికెటింగులు చేసి, ఖారీయెత్తున శాసనోల్లంఘనం చేయటానికి నిర్ణయించి, కాంగ్రెసు సంఘం తీర్మానాలు ప్రవేశపెట్టింది. ఆ తీర్మానాలు ప్రజానీకానిక విశదపరుస్తు, వాటిని రాష్ట్రస్థాయిలో బలపరుస్తూ నాయకులు యీ బహిరంగ సభ తంతును పూర్తి కానిచ్చారు. అప్పటికి తెల్లవారింది. ప్రభుత్వానికి, పోలీసులుకు వార్త అందింది. తక్షణం పోలీసు సిబ్బంది చెరువుగట్టున హాజరయింది. కాని అప్పటికె సభముగిసిపోయింది. ఈ రేగింపు జరుగుతున్నది. అధికారులకు చాలా చిన్నతన మనిపించింది. పగలు యే సభలు, సమావేశాలు జరగకుండ అప్రమత్తులై ఉంటున్నారు తప్ప తెల్లవారుజామున అట్లతద్దె ఆటల్లాగ బహిరంగ సభ జరుపుకుంటారని వూహించలేదు. అందువల్ల ప్రతీకారం చేసితీరాలన్న సంకల్పంతో, ప్రధానపాత్రవహించిన శ్రీమతులు వేదాంతం కమలాదేవి, కొండా అలివేలుమంగ సత్యవతమ్మలను, యింకా 200 మందిపైగా అనేకులను అరెస్టు చేసి గుంటూరు సబ్ జైలులో 15 రోజులు వుంచారు. విచారణ జరిపి శిక్షలు విధించారు. శ్రీమతి సత్యవతమ్మకి నాలుగు నెలలు శిక్షవేసి ''సి'' క్లాసు ఇచ్చి రాయవేలూరు జైలుకు పంపించారు. జాతీయోద్యమంతో పాల్గొనటం ఆమెకు పరిపాటే. జైలు శిక్ష అనుభవించటం యిది మూడవసారి కాబట్టి అదీ అలవాటే అనాలి.



కొండా అలివేలుమంగ సత్యవతమ్మ

ఆమె 1911 అక్టోబరు 6న నర్సరావుపేట తాలూకా, రూపెనగుంట్ల గ్రామంలో జన్మించారు. శ్రీ రూపెనగుంట్ల సీతారామయ్య శ్రీమతి సరస్వతమ్మల రెండవ కుమార్తె. ఆమెకు 8వ ఏట వివాహం కావటం, 12వ ఏట వైధవ్యం ప్రాప్తించటం జరిగింది. ఆ గ్రామంలో వీలైనంతగా స్కూలుచదువు కొనసాగింది. కాని కుటుంబ వాతావరణంవల్ల పరిసరప్రభావాలవల్ల ఆమెకు చక్కని శైలిలో ధారావాహికంగా వ్రాయగల శక్తి, అనర్గళంగా వుపన్యసించ గలపటిమ అలవడినవి. ఆమెకన్న ఆమె అక్కగారు శ్రీమతి కనువర్తి హనుమాయమ్మగారు పది సంవత్సరాలు పెద్ద. ఆమెకూ ఆ సమయంలోనే వైధవ్యం ప్రాప్తించింది. ఇవేవీచాలనట్లు మరిరెండు సంవత్సరాలకు, ఆమె 14వ ఏట తల్లిదండ్రులిద్దరు గతించారు. చివరకు గుంటూరులో వున్న తమ ఆత్మీయులు శ్రీ దేచిరాజు సాంబశివరావుగారి దగ్గరకు అక్కచెల్లెళ్లిద్దరు చేరుకున్నారు. నాటినుంచి వాళ్లకు ఆయనేతండ్రి, గురువు. ఆయనకు 1920 నుంచే జాతీయోద్యమంతో సంబంధంవున్నది. గుంటూరులో కల్లు పాకల దగ్గర పికెటింగు చేసి అరెస్టయినారు. దేశభక్త శ్రీ కొండావెంకటప్పయ్య పంతులు, ఉన్నవ లక్ష్మీనారాయణగార్ల వంటి నాయకులు ఆయన ముఖ్యమిత్రులు. శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రి, ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశం పంతులు గార్లు వుద్యమ ప్రచారానికి ధన సహాయార్థం తరుచు ఆయన దగ్గరకు వస్తు వుండేవారు. గోష్ఠులు, సంప్రదింపులు జరుగుతువుండేవి. ఇది ఆమె పెరిగిన యింటి వాతావరణం. అందువల్ల 1930 లో గాంధీ మహాత్ముడి స్వాతంత్ర్య శంఖారావం వినిపించగానే ఆమెలో చైతన్యం కలిగింది. అప్పటిదాకా పోలీసులను చూస్తేయింట్లోకి వెళ్లిపోయే ఆమె, ఆమె అక్కగారుదేశసేవ చేయాలను కోవటమేకాక, అవసరమైతేప్రాణాలు యివ్వటానికి కూడ నిశ్చయించు కున్నారు.

ఆంధ్ర రాష్ట్రానికి దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు నియంతగా, ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి ఆధ్వర్యాన గుంటూరులో వుప్పువండారు. గోరంతవుప్పు పొట్లాలు కట్టివందల కొద్దిడబ్బు కాంగ్రెసు నిధికి వసూళ్లు చేశారు. ఆవూళ్లో ప్రజలేకాక చుట్టుపక్కల వూళ్లనుంచి తిరనాళ్లకు వచ్చినట్లు జనంవచ్చేవారు. సభలు సమావేశాలు వూరేగింపులు లెక్కలేనన్ని. ఆమెకు యీ కాలక్షేపంతో రోజుకు 24 గంటలు సరిపోయేవికావు, ఇదేధ్యాస.

ఆ సమయంలోనే దేశంలో అనేకచోట్ల కాంగ్రెసు శిబిరాలు నెలకొల్పి శాంతి సైనికులుగా వాలంటీర్లకు నాయకులు శిక్షణ, ప్రోత్సాహంయిస్తూ వుండేవారు. గుంటూరు కొత్తపేట యడవల్లివారి సత్రంలో ఒక శిబిరం వెలిసింది. శ్రీమతులు కాళంగి శేషమాంబ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, శ్రీయుతులు ఉన్నవ లక్ష్మీనారాయణ, కొండా వెంకటప్పయ్య, నడింపల్లి లక్ష్మీనరసింహారావు, మద్ది రంగయ్యగార్ల వంటి పురప్రముఖులు, నాయకులు అనేకమంది అక్కడవుండి శిబిరపర్యవేక్షణ చేసేవారు. నగర సంకీర్తనలు, జండావందనాలు, పూరేగింపులు, సభలు పుపన్యాసాలతో బహుళప్రచారం చేసేవాళ్ళు. నిస్వార్థసేవానిరతితో వాళ్లు వుంటున్న శిబిరం తేజోపూర్ణమై ఒక ఋషివాటికగా వుండేది. ఒకనాడు రెండు వందల విస్తళ్లువేసి, సగభాగం వడ్డనలు అయినవి. ఇంతలో రెండువందల పైచిలుకు పోలీసులు వచ్చారు. దొరికిన వారిని దొరికిన పరిస్థితిలో లాఠీలతో కొట్టారు. వడ్డించిన విస్తళ్లు కాళ్లతో మట్టగించివేసి, గుండిగలన్నీ కింద వంచేశారు. అనేకమంది వాలంటీర్లు గాయాలు తగిలిస్పృహతప్పి పడిపోయినారు. ఆ పెద్దరోడ్డు పొడుగుకీ పోలీసులు వీరవిహారం చేశారు. రోడ్డుమీద కనిపించినవారి నల్లా క్రూరంగా హింసించారు. వారిని అడ్డుకుని తప్పించ లేక, అహింసా కాండకళ్లతో చూడలేక భయంతోను, జాలితోను మనసు వికలంకాగా, గుంటూరు పౌరులు యిళ్లతలుపులు మూసుకున్నారు. నెమ్మదిగాలేచి గాయపడిన శాంతి భటులు కొంతమంది పాతగుంటూరులో ఉన్న శ్రీ దేచిరాజు సాంబశివరావుగారి యిల్లు చేరుకున్నారు. సత్యాగ్రహులకు అన్నపానాలు సమకూర్చినా, ఆశ్రయం యిచ్చినా ఆరునెలల జైలుశిక్ష తప్పదు. కాని అది లెక్కచేయకుండ ఆయన వాళ్లందరిని చాటుగా వారంరోజుల పాటు ఆదుకున్నారు. ఆశ్రయం యిచ్చారు. ఆయన కుమార్తెగా సత్యవతమ్మగారు అత్యంత ఆదరంతో శ్రద్ధతో వాళ్లకు సపర్యలు సేవలు చేశారు. మళ్లీ వారం పది రోజులకు అంతా పరిసిపోయింది. యథాప్రకారం సభలు, వుపన్యాసాలు ఆరంభ మయినవి.

ఆమె బహిరంగంగా తానూ పికెటింగు చేయ నారంభించారు. కల్లు సారాయిదుకాణాల దగ్గర పికెటింగులు చేసినందుకు ఆమెను అరెస్టుచేసి గుంటూరు సబ్‌జైలులో ఇరవై రోజులు వుంచి వదిలిపెట్టారు. అప్పటికామె వయసు పద్దెనిమిదేళ్ళు.

ఈ మొదటి జైలుశిక్షతో ఆమెకు జంకు తీరిపోయింది. మరింత ఉత్సాహం కలిగింది. పాదర్తి సుందరమ్మగారితో కలిసి విదేశీవస్త్ర దుకాణాల దగ్గర, కల్లు సారా దుకాణాల దగ్గర పికెటింగు చేసేవారు. కాలేజి దగ్గరకు పోయి "బ్రిటిషువారి గుమాస్తాగిరికి పనికివచ్చే యీ చదువులను మాని బయటికిరండి. తమ్ముళ్లూ, దేశమాత దాస్యం తొలగించండి" అని వుద్బోధిం చేవారు. చివరకొకనాడు శ్రీమతి సుందరమ్మను అరెస్టుచేసి తీసుకు వెళ్లిన గంటకు మళ్లీవచ్చి శ్రీమతి సత్యవతమ్మను అరెస్టు చేశారు. కారులో యెక్కించుకుని గుంటూరు సమీపానవున్న పేరేచర్ల స్టేషను దగ్గర ఆమెను దించారు. చేతికి డబ్బు అందించుతు "యిప్పుడు రైలువస్తుంది. అది యెక్కి నరసరావుపేట పోయి అక్కడినుంచి మీ వూరు వెళ్లు. లాఠీఛార్జీలు జరుగుతవి. కాబట్టి యే సభలకు వెళ్లవద్దు. వుపన్యాసాలు యివ్వవద్దు. బుద్ధిగా యింట్లో కూర్చో"మని హితబోధచేసి పోలీసులు నిష్క్రమించారు. "శ్రీగాంధీ నామాము మరువాము మరువాము, సిద్ధాము జైలాకు వెరువాము వెరువాం" అనే దివ్యమంత్రాన్ని జపించుతున్న ఆమె వాళ్ల మాటలు విని పాటించగలరా ? పేరేచర్లగ్రామస్థులు కనిపించగా వాళ్లవెంట వూళ్లోకి వెళ్లారు. అవకాశం దొరకనే దొరికిందని బహిరంగసభ యేర్పాటుచేసి వుపన్యసించారు. ఆమె మర్నాడు గుంటూరు చేరుకున్నారు. ఆమె కార్యక్రమం అంతా తెలుసుకున్న పోలీసులు వెంటనే ఆమెను 20-8-1930న అరెస్టుచేశారు. చివరకు విచారణచేసి నేరంచేసినట్లు వొప్పుకొనమన్నారు. ఆమె "నేను నేరంచేయలేదు. నా దేశానికి సేవచేశాను. అంతే" నన్నారు. 'అయితే ఆరునెలల శిక్ష, 50 రూపాయలు జరిమానా తప్పదన్నారు. "సి" క్లాసు యిస్తున్నాము. చాలా బాధలు పడాలి, క్షమాపణ చెప్పుకుంటే యీ గొడవలేవుండవని' సహానుభూతి వొలకపోశారు అధికారులు. వారి సలహాను చిరునవ్వుతో తిరస్కరించి ఆమె "వందేమాతరం" అంటూ శిక్షనే స్వీకరించారు. ఆ రోజే ఆగష్టు 20న రాయివేలూరు జైలుకు ఆమెను తీసుకువెళ్లారు.

జైలులో ప్రవేశించగానే ఆమె చేతులకువున్న నాలుగు నవర్సుల మురుగులను కత్తిరించి తీసుకుని యాభై రూపాయల జరిమానాకింద చెల్లు పెట్టుకున్నామన్నారు. ఈ తతంగమంతా పూర్తిచేసుకుని లోపలికివెళ్లిన ఆమెకు ప్రాణాలు లేచివచ్చినై. బంధువుల యింటికి శుభకార్యం నిమిత్తం వెళ్లినంత సంతోషం వుత్సాహం కలిగినవి. అక్కడ అంతా పరిచయులు,

మిత్రులు, కలసి వుద్యమంలో పాల్గొన్న వారే. ఏ, బి, క్లాసులలో శ్రీమతులు పొదర్తి సుందరమ్మ, దుర్గాబాయమ్మ, ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మలు కనిపించారు. ''సి'' క్లాసులో శ్రీమతులు రామకోటి వున్నమ్మ, తుమ్మల దుర్గాంబ, కంది నాగరత్నమ్మ, పాటిబండ్ల పార్వతమ్మ, గోగినేని పార్వతమ్మ అనేకులు వున్నారు. ''సి'' క్లాసు ఖైదీలకు మజ్జిగ కూడ యిచ్చేవారుకాదు. దయార్ద్రహృదయ అయిన శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి స్వంతఖర్చుతోనైనా ''సి'' క్లాసు రాజకీయ ఖైదీలకు మజ్జిగ సరఫరా చేస్తాను, చూసి చూడనట్లు వూరుకోమని అధికారులను అడిగారు. కాని ఒప్పుకుంటే రాజకీయద్రోహులకు, ఖైదీలకు లొంగిపోయినట్లు అవుతుందని భావించి అధికారులు ఒప్పుకొనక మజ్జిగను నేలపాలు చేసేవారు. ఆమె బహుపట్టుదల సహనంగల వ్యక్తే కాక ప్రశాంతంగ వివరించి ఒప్పించగల నేర్పుకూడ కలది. అందువల్ల ఆమె కోరినట్లుగా ''సి'' క్లాసు వారికి ఆమెమజ్జిగ అందించటానికి అధికారులు ఒప్పుకున్నారు. ఇన్ని యిబ్బందులు భరించినా, విడుదలై వచ్చేవారు, సంతోషించకపోగా ఎంతో బాధపడి తోటివారిని వదిలిరాలేక కళ్లనీళ్లే కార్చేవారు. అందులోను శ్రీమతి సత్యవతమ్మకి వయసు తక్కువ, స్నేహశీలి, సాధుస్వభావంకల వ్యక్తి కావటంతో మరీ విచారంతో తోటివారికి వీడ్కోలు పలికివచ్చారు.

గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం కొంతవరకు పరిస్థితులు మెరుగు పడినవి. జైళ్లనుంచి రాజకీయ ఖైదీలందరిని విడుదల చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం తరఫున ఇర్విన్ ప్రభువుసంతకం చేస్తే అంతే ప్రతిపత్తితో గాంధీ మహాత్ముడు భారతీయులందరి తరఫున మకుటంలేని ప్రభువుగా సంతకం చేశారు. దురదృష్టవశాత్తుకొద్ది రోజులకే ఇర్విన్ ప్రభువు పదవీవిరమణ చేసి, విల్లింగ్టన్ వచ్చాడు. అయన వైఖరితో పరిస్థితులు మళ్లీ మొదటికి వచ్చినవి. ఆయన ఎంత మాత్రము ప్రజా ప్రాతినిధ్యానికి అంగీకరించలేదు. చేసిన ఒడంబడికను నిల్పుకోలేదు. దాంతో గాంధీజీకి విరక్తి, విసుగుకలిగింది. దేశవ్యాప్తంగ శాసన ధిక్కారంచేసి, శాంతి సమరంతోనే శత్రువులను లొంగ దీసుకోవటానికి అనుమతి యిచ్చారు. వెంటనే కాంగ్రెసు సమావేశంలో 1931 డిశంబరు ఆఖరున శాసన ధిక్కారం చేయాలని తీర్మానాలు ప్రవేశ పెట్టారు. ఆవి ప్రజలకు వివరించుతు రాష్ట్రస్థాయిన ఆ తీర్మానాలను ఆమోదించుతు,

బలపరుచుతు సమావేశాలు జరిపారు. సమావేశాలు జరిపినందుకే, తీర్మానాలు ఆమోదింప చేసినందుకే లక్షల జనాన్ని అరెస్టు చేశారు. ఆవిధంగా 1932 లో జాతీయోద్యమ రెండవఅల ఉవ్వెత్తున లేచి దేశాన్ని తడిపేసింది. గుంటూరు నల్లచెరువుకట్టన ఆ తెల్లవారుజామున బహిరంగ సభ జరిపి శ్రీమతి వేదాంతం కమలాదేవితో పాటుప్రధాన పాత్రవహించిన కారణంగా శ్రీమతి సత్యవతమ్మ మూడవసారి అరెస్టయి 4 మాసాల జైలుశిక్ష ''సి'' క్లాసులో అనుభవించటానికి మళ్లీ రాయవెల్లూరు వెళ్లారు. ఆమె కక్కడ టైఫాయిడ్ జ్వరం వచ్చింది. జైలు లేడీడాక్టరు చాలాకఠినంగా ప్రవర్తించేదట. కాని ''ఏ'' క్లాసులో వున్న శ్రీమతి కమలాదేవిగారు ఆమెకు సకలోపచారాలు సవర్యలు చేసి ఆదుకున్నారు. సత్యవతమ్మగారిది చేసినమేలు కలకాలం గుర్తు వుంచుకునే దొడ్డస్వభావం. అందుకే ఆమె కమలాదేవిగారు సపర్యలు చేశారని చెప్పేటప్పుడు, ఆత్మీయులైన శ్రీ దేచిరాజు సాంబశివరావుగారు కన్నతండ్రి కన్న మిన్నగా పెంచిపెద్దచేశారని వివరించేటప్పుడు కన్లు చమర్చుతు వుంటవి.

మూడవసారి, విడుదల అయివచ్చిన తర్వాత ఆమె దృష్టి నిర్మాణాత్మక కార్యక్రమాలవైపుమళ్లింది. పత్తికొని యేకులు చేయించి, వడికించి, నేయించి స్వయంగా ఖాదీ అమ్మకం చేయనారంభించారు. వార్ధాఆశ్రమంలో బహుకాలం వుండి వచ్చిన ఆమె అక్క కనుపర్తి హనుమయమ్మాగారు కూడ యీ ఖాదీ ప్రచారానికీ సహకరించారు. చిన్నప్పుడు తల్లిదండ్రులులేక, రక్షణ లేక బాధపడి పెంపుడు తండ్రిగారి చల్లని అండన సేద తీర్చుకున్నందుకుగాను తానూ ఒక పేదబాలికను పెంచి పెద్దచేసి ఆనేర్చుకున్న పాఠాన్ని చక్కగ ఆచరణలో పెట్టారు. ఆ అమ్మాయిని ప్రోత్సహించి 1942 వ్యష్టి సత్యాగ్రహంలో ఆమె పాల్గొనేట్లు చేశారు. అక్కగారితో కలిసి వుడతాభక్తిగా యీనాటికి శక్తికొద్ది దేశసేవచేస్తు తన దేశభక్తితోను తీర్చిదిద్దుకున్న సత్స్వభావంతోను శ్రీమతి కొండా అలివేలుమంగ సత్యవతమ్మగారు ఆదర్శ జీవితం గడుపుతున్నారు.

———

# శ్రీమతి కాశీభట్ల వెంకటరమణమ్మ

జననం 15-3-1911

గాంధీ మహాత్ముడి స్వాతంత్ర్య శంఖారావం విని స్త్రీలు, పురుషులు అధికోత్సాహంతో యుద్ధరంగం ప్రవేశించారు. కాని స్త్రీలు తమలో కలిగిన చైతన్యం కారణంగా జాతీయోద్యమంతో ఆగక, తమ నిర్వహణా శక్తిని, సంస్కరణాభిలాషను గాంధీజీ నిర్మాణాత్మక కార్యక్రమాలతో జోడించి శాశ్వతమైన విధానంలో సంఘసేవకు పునాదులు వేశారు. శ్రీమతులు పొణకా కనకమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ దుర్గాబాయమ్మగార్లు విద్యాసంస్థలు నెలకొల్పితే కొల్లా కనకవల్లీ తాయారమ్మ, కాశీభట్ల వెంకట రమణమ్మగార్లు హరిజన సేవకు, ఖాదీకి ప్రాధాన్యత నిచ్చారు. రాజకీయాలలో నుంచి ప్రజాసేవను ఆశయంగా నిల్పు కున్నారు.



శ్రీమతి కాశీభట్ల వెంకట రమణమ్మ

శ్రీమతి కాశీభట్ల వెంకట రమణమ్మ పశ్చిమ గోదావరి జిల్లా, బోడపాడు అగ్రహారంలో 15-3-1911న జన్మించారు. అన్నపూర్ణమ్మ, చిపులకొండ సూర్యనారాయణశాస్త్రిగార్ల తృతీయ పుత్రిక ఆమె. బోడపాడు ఎలిమెంటరీ స్కూలులోను, తరవాత గణపవరం ప్రాచీన పాఠశాలలో రెండు సంవత్సరాలు చదువుకున్నారు. తూర్పు గోదావరిజిల్లా వాస్తవ్యులయిన డాక్టరు కాశీభట్ల లక్ష్మీనరసింహరావుగారితో 1923 లో ఆమె వివాహం జరిగింది. చదువుకుంటున్న రోజులలోనే జాతీయోద్యమంలో పాల్గొని ఆయన జైలుశిక్ష అనుభవించి వచ్చారు. సీతానగరంలో గౌతమీ ఆశ్రమ స్థాపనచేసిన డాక్టరు బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారు, భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు,

మహర్షి బులుసు సాంబమూర్తిగారు, తదితర ఆంధ్రనాయకులు లక్ష్మీ నరసింహారావుగారితో కలిసి వారింట తరచు రాజకీయ చర్చలు, సమావేశాలు, సంప్రదింపులు జరుపుతు వుండేవారు. విదేశీవస్తు, వస్త్ర బహిష్కరణ, పికెటింగులు, హరిజనవాడలలో ప్రచారం, హరిజన సేవ మొదలయిన కార్యక్రమ ప్రణాళికలను నాయకులు వారింట రూపొందించుతు వుండేవారు. ఆ సందర్భంలో యీ కార్యక్రమాలను స్త్రీలు చేపట్టితే విజయవంతం కాగలవన్న నమ్మకంతో 1930 లో దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారి నాయకత్వాన శ్రీమతులు వెంకట రమణమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ, చల్లపల్లి సీతాదేవి ముప్ఫయిమంది స్త్రీలు జాతీయోద్యమంలో ప్రవేశించారు.

అప్పట్లో అక్కడ పోలీసు అధికారులు ప్రజలను బెదరగొట్టి వుద్యమాన్ని అణచివేయాలన్న తలంపుతో అవసరాన్ని మించి కఠినంగా ప్రవర్తించేవారు. అది కేవలం ఉద్యోగధర్మ నిర్వహణలో భాగం. అయినా వుద్యమంలో ప్రవేశించిన స్త్రీలు భయపడక, నిస్సంకోచంగ వుత్సాహంతో వుద్యమంలో చేరి, వుప్పు సత్యాగ్రహం చేశారు. కల్లు, సారా దుకాణాలదగ్గర, విదేశీ వస్తు వస్త్రాలదుకాణాల దగ్గర శ్రీమతి వెంకటరమణమ్మ సత్యాగ్రహం చేసేవారు. శాసనధిక్కారం చేయగలిగినన్ని విధాల చేశారు. ఎనిమిదినెలలు ఆ విధంగా విజృంభించి అధికారులను చికాకుపరిచారు. మరి యెంతకాలం గడుస్తుంది? ఆమె, శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మమ్మ, సుప్రసిద్ధనాయకులు దేశభక్తులు అయిన మద్దూరి అన్నపూర్ణయ్యగారి సతీమణి రమణమ్మగారు కలిసి విదేశీబట్టల దుకాణాలదగ్గర పికెటింగు జరుపుతు వుండగా వాళ్లను 1931 జనవరి 26న అరెస్టు చేశారు. ఆ రోజు పోలీసు స్టేషనులో వుంచి, మర్నాడు జిల్లా కోర్టులో విచారణ చేశారు. శ్రీమతులు శివరాజు సుబ్బలక్ష్మమ్మకి, మద్దూరి రమణమ్మకి చెరి ఆరునెలలు శిక్షవేసి జైలుకు పంపించారు. కాని శ్రీమతి వెంకట రమణమ్మకు ఆరు వారాలు మాత్రమే శిక్షవేసి రామచంద్ర పురం సబ్‌జైలుకు పంపించారు. ఒకేనేరం చేసిన ముగ్గురిలో యిద్దరికి పెద్ద శిక్షలు వేసి తనకు తక్కువ శిక్ష వేయటం ఆమెకు అన్యాయంగాను, అవమానకరంగాను తోచింది. చివరకు అధికారులను ఆమాటే అడిగారు. ఆమె ఎనిమిది మాసాలు గర్భవతి కావటమే దానికి కారణమని జవాబు వచ్చింది. చాలా కించపడుతు దిగులుతో ఆమె మిత్రురాళ్లకు వీడ్కోలు యిచ్చి, రామచంద్రపురం సబ్‌జైలుకు వెళారు.

అంతటితో ఆమె ప్రత్యక్షంగా రాజకీయాలలో పాల్గొనక పోయినా సంఘసేవవైపు, నిర్మాణాత్మక కార్యకలాపాలవైపు దృష్టి సారించారు. 1936 లో భారీయెత్తున 25 రాట్నాలతో నూలు వడకటం నేర్పించేవారు. చక్కగా నూలువడుకుతున్న 50 మంది స్త్రీలకు నెలనెల నూలు వడకటంలో పోటీలు పెట్టి బహుమతులుయిచ్చి ప్రోత్సహించేవారు. ఆ స్త్రీలందరికి వుచితంగా హిందీ క్లాసులు నడిపేవారు.

1936 లో హరిజన విద్యార్థినులకు 30 మందికి హాస్టలు ఏర్పాటు చేశారు. అది యెంతో వుపయోగకరంగ విద్యావ్యాసంగానికి దోహదకారిగా వుండేది. ఈ రెండు కార్యక్రమాలను ఆమె తమయింట్లో స్వంత ఖర్చుతో, కుటుంబసభ్యుల తోడ్పాటుతోనే నిర్వహించారు. బీహారు భూకంపం సంభవించి వేలకొద్ది జనం హతులు, క్షతగాత్రులు నిరాశ్రయులు అయినారు. ఆ సమయంలో గాంధీ మహాత్ముడు కూడ వారికి తోడ్పడటానికి పూనుకున్నారు. అందువల్ల దేశవ్యాప్తంగ గాంధీజీ మార్గాన నడిచేవారు స్వయంగా పూనుకుని విరివిగా విరాళలు సేకరించి వారికి అందించారు. ఆ సందర్భంలో "సోదరసమితి" స్త్రీల విభాగానికి వెంకటరమణమ్మగారు నాయకత్వం వహించి, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు రెంటిలో తిరిగి ధనరూపేణ, వస్తు రూపేణ విరాళాలు సేకరించి బాధితులకు సహాయం అందించారు.

1962 లో భారతదేశానికి వుత్తర సరిహద్దులమీద దురాక్రమణ దాడి జరిగినప్పుడు తమ సేనల సౌకర్య సంరక్షణార్థం దేశవ్యాప్తంగ మహిళలు చాలాకృషి చేశారు. ఆ సమయంలో వెంకట రమణమ్మగారు తన ఆధ్వర్యాన మహిళాసంఘం ఏర్పాటు చేశారు. ఎంతో శ్రమపడి విరాళాలు పోగుచేసి వున్ని స్వెట్టర్లను అల్లి ప్రభుత్వానికి అందించి ఆ రూపేణ దేశసేవ చేశారు.

1936 తరువాత వరసగా మూడుసార్లు ఆమె రాజమహేంద్రవర పురపాలక సభ్యురాలుగా, జిల్లా పరిషత్ సభ్యురాలుగా ఎన్నికయి సేవచేశారు.

గాంధీజీ ఖాదీయాత్ర సందర్భంగా 1929 మే 8వ తేదీన రాజమండ్రి వచ్చినప్పుడు ఎవరికివారు కానుకలు కాంగ్రెసు నిధికి సమర్పించటంతప్ప ఒకరు పూనుకుని సేకరించి యివ్వవచ్చునన్న విషయం చిన్నవయసువల్ల

ఆమెకు అవగాహన కాలేదు. తిరిగి 1930 డిశంబరు 26న హరిజన యాత్రా సందర్భంగా గాంధీజీ రాజమండ్రి వచ్చారు. అప్పుడు ఆమె రాజమండ్రి టౌను కాంగ్రెసు కార్యదర్శినిగా వున్నారు. ఆమె పూనుకుని వెయ్యిరూపాయల విరాళాలు పౌరులదగ్గర సేకరించి గాంధీజీ హరిజననిధికి సమర్పించారు. గాంధీజీ శ్రీమతి సరోజినీనాయుడు మొదలయిన తన పరివారమందరితోను సీతానగరం లోని గౌతమీ సత్యాగ్రహాశ్రమంలో విడిదిచేశారు. అప్పుడు వెంకట రమణమ్మగారికి రెండు రోజులు ఆశ్రమంలోవుండి గాంధీజీతోను తదితర నాయకులతోను గడపగల అవకాశం లభించింది. చివరసారిగా 1946 జనవరి 20న హిందీ ప్రచారసభ రజతోత్సవాల సందర్భంగా మద్రాసు వెళ్తు గాంధీజీ రాజమండ్రి వచ్చారు. రాజమండ్రిలోదిగి బహిరంగ సభలలో పాల్గొనలేదు కాని ఆయన ప్రయాణం చేస్తున్న స్పెషలురైలు ఆపూరు స్టేషనులో ఆగింది. ముందుగానే ఆ వార్త తెలుసుకున్న ఆంధ్రప్రజలు గ్రామగ్రామాలనుంచి తమ నాయకుని కోసం వచ్చారు. యథాప్రకారం గాంధీజీ హరిజననిధికి విరాళాలు అడిగారు. ఆంధ్ర మహిళలు తిరిగి మరొకసారి తమ నగలను సంతోషంతో యిచ్చారు. పురుషులు నగదును యిచ్చారు. అవన్నీ జాగ్రత్తగా సేకరించి వెంకటరమణమ్మగారు రైలు పెట్టెలోకి వెళ్లి గాంధీజీకి అందించారు. పాతపరిచయాన్ని పురస్కరించుకుని ఆయన ఏమైన నిర్మాణాత్మక కార్యక్రమాలను జరిపించుతున్నావా అని అడిగారు. అప్పుడామె మహిళా హిందీ, ఖాదీ శిక్షణశిబిరం, హరిజన హాస్టలు విషయాలు వినిపించారు. ఆయన సంతృప్తితో ఆమెతలను నిమిరి కార్యక్రమాలను విజయవంతంగా నడిపించమని దీవించారు.

ఆమె నేటికీ యేదో ఒకవ్యాసంగం కల్పించుకుని మహిళాసేవ, హరి జనసేవ చేస్తూనే వుంటారు. జాతీయోద్యమ సందర్భంగా జాతిపిత ఆమె హృదయాంతరాళంలో వెలిగించిన సేవాజ్యోతిని వుత్సాహంతో, భర్తగారి ప్రోత్సాహంతో జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నారు కాశీభట్ల వెంకటరమణమ్మగారు.

---

# శ్రీమతి కలగర పిచ్చమ్మ

జననం 10-8-1883 మరణం 21-6-1952

1932 వ సంవత్సరం ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు ప్రాంతాలలో రాయవేలూరు జైలు రాజకీయ స్త్రీ బందీలతో నిండి వుండేది. మధ్యవయస్కురాలైన ఒక ఆమె నాలుగేండ్లు నిండిన చిన్న బిడ్డను వెంటపెట్టుకుని జైలు శిక్ష అనుభవించటానికి వచ్చారు. ఆమె చాలా కృశించి వున్నట్లు కనిపించుతు వున్నా, యెప్పుడు యేదోఒకపని చేస్తూనే వుండేవారు. అందులోను తోటివారు పదిమందికి సౌకర్యం కలిగించే పనులు యే ఆర్భాటం లేకుండా నిశ్శబ్దంగా చేసుకుపోతు వుండేవారు. ఆమె సేవాతత్పరతను గమనించుతున్న తోటి రాజకీయ స్త్రీ బందీలు కొందరు తెలిసో తెలియకో, తాము చూపుతున్న స్వార్థపరత్వానికి మొగమాటపడేవారు. ఆమె కలగర పిచ్చమ్మగారు. క్రియాత్మకంగా పనిచేసుకుంటు పోవడం ఆమె స్వభావం.



శ్రీమతి కలగర పిచ్చమ్మ

పశ్చిమ గోదావరిజిల్లా చాటపర్రు గ్రామంలో ఆమె 10-8-1883 న జన్మించారు. శ్రీమతి మహలక్ష్మమ్మ, శ్రీ మాగంటి రామినీడు ఆమె తలిదండ్రులు. ఒక అక్క, ఒక చెల్లెలు, యిద్దరు సోదరులు వున్నారు. చాటపర్రులో ఆనాడు మొగపిల్లల చదువులకే అవకాశాలు లేవు. అందువల్ల ఆమెకు బడి చదువు లేదనే చెప్పవచ్చు. బ్రహ్మమత ప్రభావితులైన ఆమెభర్త శ్రీ కలగర రామస్వామిగారి ప్రోద్బల ప్రోత్సాహాలతో ఆమె చక్కని విజ్ఞాన వికాసాలను సంతరించుకున్నారు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, మహర్షి శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు వంటి సంఘ సేవకులు, సంస్కరాభిలాషుల పరిచయం ఆమెకు బాగావుండేవి. వారి ఆదర్శాలను

జీర్ణంచేసుకుని భర్తగారి ఆశయాలకు రూపం కల్పించటంలో సహకరించుతు వుండేవారు. ఏలూరులో మహిళలకు ప్రార్థనా మందిరం కట్టించటంలో ఆమె ప్రముఖ పాత్రవహించారు. 1910 నుంచి 1927 వరకు కార్యదర్శినిగా వుండి దానిని నిర్వహించారు. 1944 నుంచి మరికొంతకాలం అధ్యక్షత వహించారు. పదిహేడేళ్ల వయసులో 1900 లో ఆమెకు ఏకమాత్ర సంతానమైన అన్నపూర్ణాదేవి జన్మించింది. ఆ బిడ్డను వున్నత విద్యావంతురాలుగా చేయాలని ఆ తలిదండ్రుల అభిలాష, ఆశయం. అందుకు తగిన అవకాశాలు ఏలూరులో లేవు. అందువల్ల తమ బిడ్డను కలకత్తా పంపించి కాలేజి చదువుకూడా చదివించారు. వాళ్లు వున్న పరిస్థితులలో ఆనాడు ఒక ఆడపిల్ల, ఎక్కడో దూరానవున్న కలకత్తావంటి మహాపట్టణం పంపి చదివించటానికి డబ్బు, స్థైర్యము కూడా అధికంగానే కావాలి. తలవంచుకుని పనిచేసి చూపటం తప్ప మాటలు, వాదనలు, వగర్పులు ఆమెపద్ధతికాదు. అందువల్ల యేఅనవసరపు ఆందోళనలు సందేహాలు పెట్టుకోక కుమార్తెను కలకత్తాలో చదివించారు. కష్ట పడి మిషనుమీద కుట్టుపనిచేసి, ఆ రాబడికూడ బిడ్డచదువు నిమిత్తం వాడేవారు. తన తమ్ముడు, విద్యావంతుడు అయిన శ్రీ మాగంటి బాపినీడుగారికి ఆమె తన కుమార్తె శ్రీమతి అన్నపూర్ణాదేవిని యిచ్చి 1920లో వివాహం జరిపించారు. ఆ దంపతులే విఖ్యాత దేశసేవకులై, త్యాగులై, గాంధీ మహాత్ముడి ప్రత్యేక అభిమాన, ప్రశంసల నందుకున్న శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి శ్రీ బాపినీడుగార్లుగా చిరస్మరణీయులయినారు.

శ్రీమతి పిచ్చమ్మకు 1921 ముందునుంచే జాతీయోద్యమంతో సంబంధం వున్నది. మూఢవిశ్వాసాలు, గుడ్డినమ్మకాలు అనవసర ఆచారాలను పారదోలి ఆధ్యాత్మిక స్వేచ్ఛని సంపాదించుకోవటం యెంత అవసరమో, పరతంత్రాన్ని పారదోలి రాజకీయపరంగా స్వాతంత్ర్యం సాధించటం కూడా అంతే ముఖ్యమని శ్రీమతి పిచ్చమ్మగారు ఆమె భర్తగారు గట్టిగా నమ్మేవారు. అందువల్ల గాంధీ మహాత్ముడి నాయకత్వాన్ని త్రికరణ శుద్ధిగా విశ్వసించారు. రెండురకాల స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవటానికి మహిళాభ్యున్నతిని, స్త్రీ విద్యను, సర్వసమతను వ్యాపింపచేశారు. 1910 నుంచి హరిజనోద్ధరణలో పాల్గొన్నారు. పశ్చిమ గోదావరిజిల్లా హరిజన సంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యురాలుగా వున్నారు. నూలువడకటం, ఖాదీ ధరించటమేకాక ఆమె యింటింటికి తీసుకువెళ్లి ఖాదీ బట్టలను విక్రయించేవారు. శ్రీమతి మూల్పూరి

చుక్కమ్మ వంటి నాటి యువతరానికి ప్రోత్సాహం యిస్తు అండదండలుగా వుండేవారు. ఆమె అక్క శ్రీమతి బొప్పన మాణిక్యాంబ స్వయంకృషితో గొప్ప పాండిత్యం సంపాదించి "హిందూ సుందరి" పత్రికలో అమూల్య వ్యాసాలు అనేకం వ్రాసేవారు. సాక్షాత్తు తమసౌకర్యంకోసం, రక్షణకోసం, ఆసుపత్రులకువెళ్ళి పురుడుపోసుకోవటమే పెద్దతప్పుగా అనాచారంగా భావించే ఆ కాలంలో శ్రీమతి మాణిక్యాంబ తమ యింటికి బహిరంగంగా క్రైస్తవులను హరిజనులను ఆహ్వానించి ఆదరించేవారు. అక్కచెల్లెళ్ల శ్రీమతులు మాణిక్యాంబ, పిచ్చమ్మల వింతధోరణి పెద్ద సంచలనమే కలిగించినా యిది తప్పు అని బాహాటంగా వారిని నిరోధించగలశక్తి నాటిఛాందసులకు లేకపోయింది.

భర్త పై చదువులకు అమెరికా వెళ్లటాన తానూ వున్నత విద్యలను పొందాలన్న కోరికతో కుమార్తె శ్రీమతి అన్నపూర్ణాదేవికూడా ప్రయాణానికి కావలసిన వీసాలు, విలువయిన దుస్తులు సమకూర్చుకున్నది. కాని ఆమెకు తల్లిదండ్రులు పసితనంనుంచి రంగరించిపోసిన స్వాతంత్ర్యేచ్ఛ, దేశాభిమానం, ఆత్మాభిమానాలు, నేర్పిన చదువుతో కలగలసి వంట జీర్ణించిపోయినవి. గాంధీ మహాత్ముడు స్వాతంత్ర్య సమరంలో పూరించిన శంఖారావం ఆమెను దేశం వదలనివ్వలేదు. ఆమె తన విలువైన పట్టుబట్టలన్నీ పరశురామప్రీతి చేయటమేకాక పెళ్లి ఉంగరంతోసహా తన నగలన్నీ గాంధీజీకి సమర్పించింది. విస్తుపోయిన గాంధీజీ నీ తల్లిదండ్రులు కోపించరా అని అడిగితే నా తలిదండ్రులు నేను యిటువంటి పనులుచేస్తే వద్దనరని జవాబు యిచ్చింది. అది గారాబంకాదు. తలిదండ్రులు నిరోధించవలసిన చెడ్డపని తానుచేయను అనే ఆత్మధృతి, తలిదండ్రుల విశాల హృదయాలపట్ల విశ్వాసం అంతటివి. అంతటి ఆత్మస్థయిర్యాన్ని వ్యక్తిత్వాన్ని బిడ్డకు సమకూర్చగలిగిన మాతృమూర్తి శ్రీమతి పిచ్చమ్మగారు తల్లిగా సఫలీకృతులైనారు. ఆమెకు జాతీయోద్యమంతో అటు అక్కగారు యిటు కుమార్తెకూడ జతకలిశారు. తమయింట్లో హరిజన బాలికలను బిడ్డల్లాగ పెంచారు. ఒకామెను వార్ధా ఆశ్రమంలోకూడ చేర్పించారు. ఏలూరులో 1924-25 మధ్య ఒక హిందీ పాఠశాలను స్థాపించారు. ఇంగ్లీషు చదువులు వ్యర్థమని త్యజించిన రోజులవి. తెలుగు, హిందీ, సంస్కృతం వంటి భాషలు, కుట్లు, అల్లికలు, వడకటం, నేయటం, అద్దకం వంటి చేతిపనులు నేర్పే జాతీయ విద్యాలయాలు వెలిసినవి. ఏలూరులో ఆమెకూడా ఒక జాతీయ పాఠశాలను నెలకొల్పి ఆడపిల్లలకు చక్కని వ్యాసంగం కల్పించారు. ఆమెకు

స్వయంపోషకత్వంపట్ల, కష్టించి పనిచేయటంపట్ల చాలా గౌరవం. అందువల్లనే పెద్ద, చిన్న అనే వ్యత్యాసం లేకుండ స్వహస్తాలతో అన్నిపనులు చేయటానికి సిద్ధపడేవారు. కుట్టుపని, మంత్రసానిపని నేర్పి యెందరో స్త్రీలకు ఆమె స్వతంత్రజీవికను కల్పించారు. ఆమె పాల్గొనని సభలు సమావేశాలు వుండేవికావు.

కూతురు శ్రీమతి అన్నపూర్ణాదేవి ప్రచార కార్యకలాపాలలో, బయటి వూళ్ల సభలు, సమావేశాలలో ఆవేశపూరితంగా వుపన్యసించుతు పాల్గొనేవారు. తన ఆరోగ్య పరిస్థితిని కూడ విస్మరించి మితిమీరి పాటుపడిన కారణంగా 1927 లో ఆమె మరణం తన కుటుంబానికేకాక గాంధీ మహాత్మునివంటి దేశనాయకులకు కూడ వ్యధ కలిగించింది. శ్రీమతి పిచ్చమ్మగారి లోకమే తలక్రిందులయింది. కాని ఆమె తన దుఃఖం అణుచుకుని కూతురు విడిచి వెళ్లిన రోజుల పసిగుడ్డు చిరంజీవి ఝాన్సీ లక్ష్మీబాయిని ఒకచేతిలో, జాతీయోద్యమ కార్యకలాపాలను రెండవ చేతిలో పొదువుకుని ప్రాణప్రదంగ సాకటానికి పూనుకున్నారు. ఆ విధంగా ఆమె తనబిడ్డ ఆత్మకు పరిపూర్ణమైన తృప్తి కలిగించటానికి నడుముకట్టి నిల్చారు. అన్నపూర్ణాదేవి స్మారక సంఘానికి కార్యదర్శినిగా 1938 లో "సుకుమారి" పేరుతో అన్నపూర్ణాదేవి జీవితాన్ని ప్రచురించారు. బాలికా జాతీయ విద్యాలయాన్ని అన్నపూర్ణాదేవి జాతీయ విద్యాలయం అనే పేరుతో మరింత ఉన్నతదశకు తీసుకువచ్చారు. 25-6-1929 న జరిగిన ద్వితీయ వార్షికోత్సవానికి విద్వాన్ అల్లూరి సీతమ్మగారు అధ్యక్షత వహించారు. అప్పటికి స్కూలులో 50 మంది అమ్మాయిలకు హిందీ, ఇంగ్లీషు, తెలుగు, కుట్లు అల్లికలు, పూలు అల్లికలు మొదలైనవాటిలో శిక్షణనిచ్చేవారు. సంవత్సరానికి పదిహేనువందల వరకు వసూళ్లు వుండేవి. మరుసంవత్సరం వార్షికోత్సవాలకు మద్రాసునుండి డాక్టరు శ్రీమతి ముత్తు లక్ష్మిరెడ్డి వచ్చి అధ్యక్షత వహించారు. తన కుమార్తె మరణానికి కేవలం దుఃఖంతో కుంగిపోతూ కూర్చొనక పిచ్చమ్మగారు నిర్విరామంగా నిర్మాణాత్మక కార్యకలాపాలను నెరవేర్చుతు కూతురు కీర్తి శాశ్వతం చేస్తున్నందుకు ఆ కర్మయోగిని యెంతో సంతోషించారు. పోనుపోను శ్రీమతి పిచ్చమ్మ కృషిఫలితంగా పాఠశాల పెరిగి విద్యార్థినులకు హాస్టలు ఆవశ్యకతకూడ యేర్పడింది. ఆరవ వార్షికోత్సవానికి శ్రీమతి దుర్గాబాయమ్మ గారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, శ్రీమతులు మద్దుల దమయంతి

కనుపర్తి వరలక్ష్మమ్మగార్లు యెందరో వచ్చి శ్రీమతి పిచ్చమ్మగారి స్త్రీ విద్యా వ్యాప్తిని శ్లాఘించారు. కూతురుపేర "అన్నపూర్ణాదేవి స్మారక సదనం" ఆమె నిర్మించారు. మోహనదాసు కరంచందు పరిశ్రమాగారానికి తదితర సంస్థలకు భూములు ఇచ్చి స్థిరత్వం కల్పించారు. ఆమె యీ సంస్థలద్వారా గాంధీమహాత్ముడి ఆదేశాలను ఆచరణలో పెడుతు, గాంధిజీతోను జాతీయోద్యమంతోను సన్నిహిత సంబంధం పెంచుకున్నారు. దేశనాయకులు అనేకులువచ్చి యీ సంస్థలను సందర్శించేవారు.

1932 నాటికి శాసనోల్లంఘన వెల్లువ దేశాన్ని ముంచెత్తింది. అప్పటికి ఆమె మనుమరాలు చిరంజీవి ఝాన్సీ పాపకు నాలుగేళ్లు నిండినవి. అందువల్ల శ్రీమతి పిచ్చమ్మగారు నిబ్బరంగా ఉద్యమంలో పాల్గొన్నారు. సంవత్సరాల తరబడిగా గాంధీజీ ఆదేశాలకు రూపకల్పన చేస్తున్న ఆమెపై చర్య తీసుకోగల అవకాశానికి బ్రిటిష్ ప్రభుత్వం ఎదురుచూస్తునే వున్నది. అవకాశం రానే వచ్చిందని ఆమెను అరెస్టు చేసి 6 నెలలు శిక్ష విధించి రాయవేలూరు జైలుకు పంపించారు. మనుమరాలిమీది మమకారంతో ఆమెను కూడ వెంట తీసుకు వెళ్లారు. ఏలూరులో యెన్నో సంస్థలు నడుపుతు, సభలు సమావేశాలకు హాజరవుతు వుండటం పరిపాటి. ఆ అలవాటునుపట్టి ఆరోగ్యం బాగా లేక పోయినా తనకైతాను యేదో పనికల్పించుకుని నలుగురికి తోడ్పడుతు సేవచేస్తు వుండేవారు. 3 నెలలు గడిచేటప్పటికి ఆమె ఆరోగ్యం బొత్తిగాక్షీణించి ప్రమాదకరమైన పరిస్థితి యేర్పడింది. అందువల్ల ప్రభుత్వం ఆమెను శిక్ష ముగియకుండానే వెంటనే విడుదల చేశారు.

మరి చాలాకాలము దేశానికి సేవచేయవలసివున్న కారణంగా ఆమెకు ఆరోగ్యం బాగుపడింది. ఆమె నిర్వహించుతున్న సంస్థలేకాక యెవరు యెక్కడ స్త్రీ విద్యావ్యాప్తికి పూనుకున్నా, చేతి పరిశ్రమలను ప్రోత్సహించుతున్నా ఆమె యెనలేని అభిమానం శ్రద్ధకనపరుచేవారు. స్వయంగా అన్నిటిలోను పాల్గొనేవారు. జమీగొల్వేపల్లిలో శ్రీ వల్లభనేని రామబ్రహ్మం దంపతులు స్థాపించిన "శ్రీ అన్నపూర్ణాదేవి నేత పరిశ్రమాలయం" ఆమెకు మరొక అభిమాన పుత్రిక. ఆమె జిల్లా, తాలూకా, పట్టణ కాంగ్రెసు సంఘ సభ్యులుగా వున్నారు. మరికొంతకాలం ఏలూరు పట్టణ కాంగ్రెసుసంఘం అధ్యక్షురాలుగా వున్నారు.

ఆమె పెంపు ఫలితంగా మనుమరాలు ఝాన్సీ పాప నాలుగేళ్ల వయసులోనే శాసనోల్లంఘనంలో పాల్గొన్నది. ఉప్పు మడులకు నీరు పెట్టటం, వుప్పు పోగుచేయటం శాసనధిక్కార సూచకంగా దానిని అమ్మటంవంటి పెద్ద పనులేచేసింది. తన పుట్టినరోజు పండగనాడు యితర పండగలు పబ్బాలలోను హరిజనుల పిల్లలను యింటికి పిలిచి వారితో ఆడిపాడి ఆదరించేది. గాంధీజీ ఆంధ్రదేశం వచ్చినప్పుడు ఆ అమ్మాయిని ముద్దుచేసి దీవించారు. గాంధీ తాతకు ఆమె వుత్తరాలు వ్రాయటమేకాక తన యేడవఏట గాంధీజీని కీర్తించుతు ఒక చక్కని పాటనుకూడ వ్రాసింది. శ్రీమతి పిచ్చమ్మగారి ప్రభావం అంతటిది. కూతురు స్మారక సంస్థలను నిర్వహించటంలోగాని మనుమరాలిని పెంచటంలో గాని వింత, అతిశయంలేవు. కాని ఆ పని నిర్వహించటంలో తన ఆశయాలను సిద్ధింప చేసుకుంటు తనవారి కీర్తినిపెంచుతు సంఘానికి సమాజానికి దేశానికి సేవచేయ పూనుకోవటం మహత్తర విషయం. 1952 జూన్ 21 న తన అంతిమక్షణాలలో ఆమె గాంధీజీని స్మరించుతు దేశమాత ఒడిలో ఒరిగిపోయినారు.

# శ్రీమతి ఎర్నేని లీలావతీదేవి

**జననం 1906** **మరణం 1951**

ప్రజలలో వున్న వుత్తమ స్వభావాన్ని బయటికి తెప్పించి, శాశ్వత విధానంలో ప్రజాహితకార్యాలు చేయించగలవాడే నిజమైన నాయకుడు. గాంధీజీ భారతదేశానికి నాటికి నేటికి యేకైక నాయకుడుగా ప్రతిహృదయంలోను నిల్చిపోవటానికి కారణం అదే. తమ ఆలోచనలకు, కార్యకలాపాలకు వ్యాసంగాలకు యిల్లే యెల్లలుగా బ్రతుకు యీడుస్తున్న భారత స్త్రీలలో గాంధీ మహాత్ముడు గొప్పచైతన్యం కలిగించాడు. అందులోను ఆంధ్ర మహిళలు అత్యధిక సంఖ్యలో, సంకుచితపరిధి దాటి బయటికి వచ్చి తమ చైతన్యస్రవంతితో శాంతి సమరాన్ని మూడుపూవులు ఆరుకాయలుగా సఫలంచేశారు. సేవానురక్తి, దేశభక్తి, త్యాగనిరతితో దేశానికంతకీ ఆదర్శప్రాయులై గాంధీ మహాత్ముడి అభినందనలు ఆశీస్సులు అందుకున్నారు. శ్రీమతి ఎర్నేని లీలావతీదేవి వారిలో ఒకరు.



శ్రీమతి ఎర్నేని లీలావతీదేవి

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా గుడ్లవల్లేరు ఆమె జన్మస్థలం. 1906 లో శ్రీ వల్లభనేని జానకిరామయ్య, శ్రీమతి వెంకమ్మల కడగొట్టుబిడ్డగా జన్మించారు. ఆమె కిద్దరు అన్నలు, ఇద్దరు అక్కలు. పెద్దక్క శేషమాంబగారికి సంతానం లేనందున, యీ చిన్నచెల్లెలిని తమదగ్గర పెట్టుకుని పెంచి విద్యాబుద్ధులు చెప్పించారు. 1915 లో గాంధీ మహాత్ముడు ఆంధ్రదేశ పర్యటనం చేశారు. ఆ సమయంలో కృష్ణాజిల్లా వచ్చినప్పుడు ఎనిమిదేళ్ల కుమారి లీలావతి గాంధీమహాత్ముని చూడటం సంభవించింది. అప్పుడే ఆమె పసిహృదయంలో దేశభక్తి, తానూ యేదో చేయాలన్న ఆకాంక్ష బయలుదేరినవి.

అక్కగారితోపాటు ఆమెకూడా వడకటం, ఖాదీ ధరించటం ఆరంభించింది. శ్రీమతి శేషమాంబ తన పినమామగారి చిన్న కుమారుడైన ఎర్నేని సుబ్రహ్మణ్యంగారికిచ్చి తన చెల్లెలి వివాహం అత్యంతవైభవంగా జరిపించారు. అంగలూరు వాస్తవ్యులయిన సుబ్రహ్మణ్యంగారు ఆ వూరి గ్రంథాలయం ఆసాంతం చదివి సారం గ్రహించారు. హోంరూలు నాటినుంచి ఆయనకు, ఆయన అన్న సూర్యనారాయణగారికి జాతీయోద్యమంతోను గాంధీజీతోను సన్నిహితత్వం వున్నది. పుట్టిపెరిగిన యింటి వాతావరణం, దేశాభిమానమే మెట్టిన యింటకూడ వుండటంతో శ్రీమతి ఎర్నేని లీలావతీదేవి నిశ్చింతగా, రెట్టింపు వుత్సాహంతో తమ దేశభక్తి వూహలను పెంపొందించుకున్నారు. సబర్మతీ ఆశ్రమంలో గాంధీ మహాత్ముని శిష్యరికం చేస్తున్న ఆమె భర్త సుబ్రహ్మణ్యంగారు 1930 లో గాంధీజీ వెంట దండియాత్ర వెళ్లి వుప్పు వండి శాసన ధిక్కారంచేశారు. ఆ గౌరవం పొందిన ఏకైక ఆంధ్రుడు ఆయన కావటం ఆమెకు యెంతో సంతోషం కలిగింది. దండిలో వండితెచ్చిన వుప్పును బంగారంకన్న విలువగా చిన్నచిన్న పొట్లాలు కట్టి అమ్మి కాంగ్రెసునిధికి డబ్బు సమకూర్చేవారు. అందువల్ల ఆ పొట్లాలకు తమశక్తి, వుత్సాహమే ధరగా యెంతైనా యివ్వవచ్చు. స్త్రీ పవిత్రంగా భావించే కాలి మట్టెలను భక్తితో యిచ్చి, మొదటి పొట్లం ఆమె బందరులో కొన్నారు. ఆమె భర్త, బావగారు, తోడికోడలు అమృతమ్మగార్లు వుప్పు సత్యాగ్రహ సందర్భంలో అరెస్టయి ఒక్కొక్క సంవత్సరకాలం శిక్షలనుభవించారు. వారిదొక పెద్ద వుమ్మడి కుటుంబము. వాళ్లేకాక వాళ్లబంధువర్గంలోని స్త్రీలు పురుషులు పదహారుమందికి పైగా సత్యాగ్రహంచేసి వివిధ జైళ్లలో వివిధ శిక్షలు అనుభవించారు. ఆ సందర్భంలో అంగలూరులో వారి స్వంతయిల్లు వాలంటీరు శిబిరంగా శాంతి సమరసైనికులతో కిటకిట లాడుతువుండేది. ఆ కారణంగా ప్రభుత్వం ఆ యింటిని జప్తుచేసి స్వాధీనపరుచుకున్నది. ఇంకా రెండు మూడు చోట్ల శిబిరాలు నడిపారు. అవన్నీకూడా పోలీసులు చెల్లాచెదరుచేశారు. ఒక్కొక్కరుగా కుటుంబసభ్యులు విడుదలయి వచ్చారు.

నిర్మాణాత్మక కార్యక్రమాన్ని క్రమవిధానంలో నిర్వహించమని గాంధీజీ స్వయంగా వారిని ఆదేశించారు. అందువల్ల ఆమె, ఆమెకుటుంబం కొమరవోలు గ్రామంలో గాంధీ ఆశ్రమం స్థాపించారు. అక్కడ వస్త్ర స్వావలంబన పద్ధతి ననుసరించి పత్తిపండించటం, ఏకటం, వడకటం, బట్ట

నేయించటం చేసేవారు, స్వయంగా సేద్యంచేసి పంటలు పండించేవారు. ప్రకృతి చికిత్సాలయం స్థాపించి గ్రామీణులకు వైద్యసహాయం అందించేవారు. గ్రామంలోని పశువులకు సైతం ఒక ఆసుపత్రి స్థాపించారు. గ్రామస్థుల సహకారంతో ఒకగ్రామాన్ని యింకొకగ్రామంతో కలుపుతు రోడ్లు, చిన్న చిన్న వంతెనలు కట్టేవారు. పాతచెరువులు మరమ్మత్తు చేసేవారు. అక్షరాల రెక్కలాడించి డొక్కలాడించు కోవటం ఆమె నిత్యకృత్యమయింది. అప్పటి కామెకు యిద్దరు చిన్నకూతుళ్లు.

1932 లో శాసనోల్లంఘనం మరింత వుద్రిక్తంగా దేశాన్ని ముంచెత్తింది. ఆశ్రమవాసులందరు ఆవేశంతో వుత్సాహంతో తిరిగి ప్రచారాలు, సత్యాగ్రహాలు సాగించారు. బ్రిటిష్ ప్రభుత్వం యీకుటుంబాన్ని ఒక విప్లవదండుగా భావించింది. బంధుమిత్ర సపరివారంగ అరెస్టుచేసింది. ఆమెకు, ఆమె అత్త గారు 80 సంవత్సరాల వృద్ధురాలు పుల్లమ్మగారికి, తోడికోడలు అమృతమ్మ గారికి అందరికి సంవత్సరంవంతున శిక్షలు విధించి కన్ననూరు జైలుకు పంపించారు. ఆశ్రమాన్ని పోలీసులు కొల్లగొట్టి భీభత్సం చేసి సీళ్లు వేసేశారు.

1935 లో ఆశ్రమం తిరిగి ప్రారంభించారు. బాబురాజేంద్రప్రసాదు స్వహస్తాలతో ప్రారంభోత్సవంచేశారు. రెండు సంవత్సరాలు వార్ధా ఆశ్రమంలో వుండి శిక్షణ పొందివచ్చిన శ్రీమతి లీలావతీదేవి ఆశ్రమ కార్యకలాపాలను మరింత విస్తృతపరచారు. ఆశ్రమ అధ్వర్యాన హిందీ టీచరు ట్రెయినింగు క్లాసులు ఆరంభమయినవి. హరిజనులకు గ్రామంలో నీటివసరులు కల్పించేవారు. సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేసేవారు.

మండవల్లిలో యింకొక ఆశ్రమం స్థాపించారు. అక్కడ హరిజన హాస్టలుకూడ నెలకొల్పారు. వార్ధా ఆశ్రమంలో చెప్పులు కుట్టటం నేర్చుకుని ఆమె భర్త సుబ్రహ్మణ్యంగారు కొమరవోలు ఆశ్రమంలో 20 జతలపైగా చెప్పులుకుట్టటం గొప్పసంచలనమే కలిగించింది. ఆమె అన్నిటినీ చిరునవ్వుతో భరించేవారు. ఆమె, ఆమెకుటుంబ సభ్యులు తాము రాత్రింబగళ్లు శ్రమపడి కఠోరనియమాల కనుగుణ్యంగా ఆశ్రమ జీవితం గడపటమేకాక బిడ్డలను కూడ ఆమూసలోనే పోసి తయారు చేశారు. హిందీ చదివించారు. వార్ధా ఆశ్రమం పంపి, శిక్షణ నిప్పించారు.

1942లో స్వాతంత్ర్య సమరంలో ఆఖరుఘట్టంగా క్విట్టిండియా వుద్యమం దేశాన్ని ముంచెత్తింది. ఆమె, ఆమె తోడికోడలు, వారిద్దరి అమ్మాయిలు కుమారి రాధామనోహరమ్మ, కస్తూరిదేవి, బంధువులు, పౌరస్త్రీలు కలిసి అత్యుత్సాహంతో రాత్రింబగళ్లు మూడు నెలలు పరిసరప్రాంతాలన్నీ తిరిగి ప్రచారంచేశారు. దళాలుగా చీలి సత్యాగ్రహం చేసేవారు. పోలీసులను రకరకాలుగా చికాకుపెట్టి శాసన ధిక్కారం చేసేవారు. మొత్తంగా అందరు అరెస్టయినారు. వివిధ శిక్షలను అనుభవించటానికి వేరువేరు జైళ్లకు వెళ్లారు. ఆమె తనపసిబిడ్డ చిరంజీవి ప్రఫుల్ల కుమారిని తీసుకుని రాయవేలూరు జైలుకు వెళ్లారు. ఆమె కుమార్తె 13 సంవత్సరాల కుమారి కస్తూరిదేవి కూడ ఆరునెలల శిక్ష అనుభవించింది.

1943 లో తిరిగి జైలుకు వెళ్లారు. పసిపిల్లవెంటనే వున్నది. ఆమె జైలులో వున్న సమయంలోనే చిన్నకూతురు కుమారి కస్తూరి దేవికి పెత్తల్లి శ్రీమతి ఎర్నేని శేషమాంబ పూనుకుని వివాహం జరిపించారు. వూహలలోనే బిడ్డపెళ్లి చూసిందాతల్లి.

1944 లో శ్రీమతి లీలావతీదేవి తిరిగి అరెస్టయినారు. ప్రభుత్వానికి ప్రాణంవిసిగి దీర్ఘకాల శిక్షవేసింది. ఇప్పుడూ పాపంచిన్నపిల్ల కుమారి ప్రఫుల్ల తల్లివెంట జైలుకు వచ్చింది. 1944 నవంబరులో వున్నట్లుండి ఒకనాడు పెద్ద కుమార్తె శ్రీమతి కరుణ కలలో కనిపించి "అమ్మా నేను చనిపోయినాను, ఇకనీకు కనిపించను" అని చెప్పింది. వ్యాకుల పడుతున్న ఆ మాతృ మూర్తిని తోటిరాజకీయ బందీలు కలలుకల్లలని ఓదార్చుతూవుండగానే ఆ బిడ్డ మరణం నిజమేనని తెలిసింది. తనతల్లిని చూడాలని తపనపడిందనికూడ తెలిసింది. ఆ తల్లిబాధ వూహించుకోవచ్చు. ఆమె దేశసేవలో తన మమకారాన్ని, బిడ్డలను, సుఖాలను, మంచినిచెడుని, అన్నిటినీ త్యాగంచేశారు. ఆమెకు గాంధీజీ ఆదేశం వేదాక్షరం. మహాత్ముడు రాజకీయనాయకుడు మాత్రమేకాదు. కర్మయోగవ్యాఖ్యానం చేసే ఆధ్యాత్మికగురువు కూడాను.

గాంధీజీ 1929 లో ఖాదీ యాత్రచేస్తు ఆంధ్ర దేశపర్యటన చేశారు. అప్పుడు అంగలూరు వచ్చి ఎర్నేనివారి కుంటుంబ సభ్యులను ఆశీర్వదించారు. శ్రీమతి లీలావతీదేవి తదితర కుటుంబస్త్రీలు తమనగలను భక్తితో కాంగ్రెసు నిధికి సమర్పించారు. తిరిగి 1933 డిశంబరు, 1934 జనవరిలో హరిజన

యాత్రా సందర్భంగా గాంధీజీ అంగలూరు వచ్చారు. అంగలూరు, బొమ్మలూరులలో ప్రచారంచేసి హరిజనులకు దేవాలయ ప్రవేశం కలిగించారు. ఆ సమయంలో తిరిగి గాంధీ మహాత్ముడు ఎర్నేని కుటుంబ సభ్యులందరిని పేరుపేరున అభినందించి ఆశీర్వదించారు. అప్పుడు ఆమె, బంధు స్త్రీలు తమ మంగళ సూత్రాలతోసహా కాంగ్రెసునిధికి సమర్పించారు. నాటినుంచి పసుపుకుంకుమలే వాళ్లకు అలంకారం. వారియింట అందరు మూడు నాలుగు సార్లు జైలుశిక్షలు అనుభవించిన దేశభక్తులే. గాంధీజీ ఆదేశాలకు రూపకల్పన చేస్తు తమ జీవితాలనుమీచు కట్టిన త్యాగధనులే. అందువల్లనే వారందరిగాథలు ముడిపడి ఒకటిగానే వుంటవి. ఐదుగురు కూతుళ్లు, యిద్దరు కొడుకుల తల్లిగా, గృహిణిగా, ఆశ్రమ కార్యకర్త్రిణిగా, బహుకాలం జైలులో శిక్షలనుభవించిన దేశసేవికగా, హిందీస్కూలు ద్వారా రాష్ట్రభాషాప్రచారంచేస్తు హరిజనసేవచేస్తు కఠోరనియమాలనుసరించి ఆశ్రమ జీవితంగడిపిన ఆమె యెంతటిసమర్థురాలు, వివేకవతి, త్యాగశీలిగావుండేవారో వూహించుకోవచ్చు.

1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని ఆమె జీవిత విధానంలో మార్పురాలేదు. ఏ పదవులు, ఆర్థికమద్దతులు, సన్మానాలు ఆమెను వరించలేదు. తాను సృష్టించుకున్న ఉత్కృష్ట ఆశ్రమ జీవితంలో శ్రమదానం తోనే ఆమె మిగిలిపోయినారు. గబగబ అన్నీ ముగించుకుని యిక వచ్చిన పని అయిపోయిందన్న విధంగా 45 సంవత్సరాలకే 1951 నవంబరులో కార్తీక పౌర్ణమినాడు ఆ త్యాగమూర్తి శాశ్వతంగా కన్నుమూశారు.

---

# శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మ

**జననం 15–6–1893**

రాత్రి పదిగంటల సమయం. నిడదవోలు స్టేషనులో హౌరామెయిలు ఆగింది. ఒక పెట్టెలో నుంచి శ్రీమతి దుర్గాబాయమ్మ "ఏమండోయ్ సత్యవతమ్మగారూ యిటు యిటు నేనిక్కడ వున్నాను'' అని చెయ్యిఊపుతూ కేకపెట్టారు. ప్లాటుఫారంమీద చేతిలో లాంతరు పట్టుకుని, ప్రతిముఖం పరీక్షగా పరికించుతున్న శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు సంతోషంతో అటువైపు నడిచారు. "రండి బండియెక్కండి, ఇట్లాగే నాతోపాటు బొంబాయి వచ్చేయండి, పై స్టేషనులో టిక్కట్టు తీసుకుందాం మరి అడ్డుచెప్పకండి'' అని దుర్గాబాయమ్మగారు అనటం విన్న ఆమెకు కొంత ఆశ్చర్యం కొంత యిబ్బందికూడ తోచింది. స్టేషనుకు వచ్చి కలుసుకోమని వుత్తరం వ్రాయటంతో



శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మ

కొద్దిపాటి డబ్బు, లాంతరు తీసుకుని చలికి శాచే శాలువ కప్పుకుని ఆమె స్టేషనుకువచ్చారు తప్ప, బొంబాయి ప్రయాణానికి సిద్ధపడి రాలేదు. కాని యితరుల మాట చెవిన దూరనీయని దుర్గాబాయమ్మగారు ఆమెను మరి కదలనివ్వ లేదు. లాంతరును అప్పగించి తాను అనుకోకుండ బొంబాయివెళ్ళిన కథను తమ యింటికి చేరవేయమని ఆమె టిక్కెట్టు కలెక్టరును బ్రతిమాలుకున్నారు. బెజవాడ స్టేషను వచ్చింది. మిత్రురాళ్ళను కలుసుకోవాలన్న సంబరంతో పొదర్తి సుందరమ్మగారు పూలహారాలు పళ్లబుట్ట తీసుకుని, చలికి రగ్గు కప్పుకుని స్టేషనుకు వచ్చారు. బొంబాయివచ్చే ప్రయత్నంలో రాలేదని, యింటిదగ్గర ఆదుర్దాగా ఎదురుచూస్తువుంటారని ఆమెచెప్పినా వినిపించుకోలేదు దుర్గాబాయమ్మగారు. ఆమెనూ తక్షణం తమప్రక్కన కూర్చోపెట్టుకున్నారు. ఇది 1931 డిశంబరు 10 న జరిగిన ఘట్టం.

శ్రీమతి సత్యవతమ్మగారు 1893 జూన్ 15 న పశ్చిమ గోదావరిజిల్లా తణుకు తాలూకా అత్తిలిగ్రామంలో జన్మించారు. ఐదుగురు సోదరులు తప్ప అక్క చెల్లెళ్లులేరు. శ్రీ వంగల వాసుదేవుడు శ్రీమతి సుబ్బమ్మలు ఆమె తల్లిదండ్రులు. ఎంతో అపురూపంగా, గారాబంగా పెరిగారు. బాల్యంలోనే వివాహం, వైధవ్యప్రాప్తి జరిగిపోయినవి. ఏమి జరిగిపోయిందోకూడా తెలుసుకోలేని పసివయసు. రాజమండ్రిలో మాధ్యమిక స్కూలు విద్యతో బడిచదువు మానివేసినా తల్లి యింట్లో తీర్చిదిద్దారు. ఇంట్లోనే మంచి సాహిత్యం చాలా రుచిచూశారు. అన్నగారు శ్రీ వంగల దీక్షితులుగారి ప్రోత్సాహంతో వందేమాతరం ఉద్యమంనుంచే జాతీయాభిమానం కలిగింది. 11, 12 ఏళ్ల వయసులో రాజమండ్రిలో బిపిన్ చంద్రపాల్ ఆవేశపూరిత ఉపన్యాసాలను వినటం తటస్థించింది. నాటినుంచి దేశసేవపట్ల ఆసక్తి కలిగింది. విదేశవస్తు బహిష్కరణలో చాలా పట్టుదలగా పాల్గొన్నారు. 1920 నుంచి అఖిల భారత సంఘంలో సభ్యులుగా గాంధీజీ ఆదేశానుసారం నేటికీ రాట్నంమీద నూలువడికి, నేయించిన బట్టలు కట్టుకోవటం అలవాటు. 1923 లో కాకినాడ కాంగ్రెసు జరిగిన నాటినుంచి దుర్గాబాయమ్మగారితో పరిచయం అయింది. 1929-30లలో భారతీయులు యావన్మందిని ఉత్తేజ పరచిన ఉప్పు సత్యాగ్రహోద్యమం ముమ్మరంగా కొనసాగింది. ఎక్కడ చూసినా ఉప్పువండటాలే, ఉప్పుకొటార్లమీద దాడి నడపటాలే. శాసనోల్లంఘనం చేసిన పర్యవసానంగా లాఠీ చార్జీలు, హింసలు. ఆమె జంకు గొంకులు లేకుండా నిర్భయంగా శాసనోల్లంఘనాలుచేసి లాఠీదెబ్బలను తినేవారు. నర్సాపురం తాలూకా లింగనబోయిచర్ల ఉప్పు సత్యాగ్రహంలో అతిదీక్షగా పనిచేశారు. లాఠీదెబ్బలు తిన్నారు. శ్రీమతులు శృంగారకవి లక్ష్మీనరసమ్మ, తల్లాప్రగడ విశ్వసుందరమ్మలతో కలిసి మీరాబాయి చరఖా పాఠశాలలో దూది యేకటం, యేకులు చేయటం నేర్పేవారు. తణుకులో హిందీ క్లాసులు నడిపేవారు. అనేక బహిరంగ సభలకు అధ్యక్షత వహించేవారు. అనేక సమావేశాలలో దేశభక్తిపూరితమైన కవితలు వ్రాసి చదివేవారు.

రౌండుటేబులు కాన్ఫరెన్సు సందర్భంలో భారత ప్రజా ప్రాతినిధ్యాన్ని చర్చించి కొంతకు కొంత ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి సాధించాలన్న సంకల్పంతో గాంధీజీ ఇంగ్లండు వెళ్లారు. ఆ సమయంలో 1931 డిశంబరులో బొంబాయిలో అఖిల భారత స్త్రీ సేవాదళ శిబిరం నెలకొల్పి శిక్షణ నిచ్చారు.

అక్కడ శిక్షణ పొందటానికి పోతూ దుర్గాబాయమ్మగారు బలవంతం చేయటాన సత్యవతమ్మగారు అనుకోకుండ బొంబాయి చేరుకున్నారు. నెలరోజులు శిబిరంలో శిక్షణపొందారు. డ్రిల్లు, మార్చింగు, కర్రసాము, రాత్రులు గస్తీ తిరగటంవంటి వన్నీ నేర్చుకున్నారు. శ్రీమతులు కమలాదేవి చటోపాధ్యాయ, సరోజినీనాయుడు లాంటి దేశ సేవికలు, నాయికలు చెప్పే అనుభవాలను వుపన్యాసాలను ప్రబోధాలను ఆకళింపు చేసుకున్నారు. శిబిరంలో అప్పుడు మూడువేలమంది స్త్రీలు వుండేవారు. డిశంబరు 18న గాంధీజీ భారతదేశం తిరిగివచ్చారు. హార్బరంతా జాతీయ పతాకాలతో, ఇండియా పటాలతోను అలంకరించారు. మూడువేలమంది వాలంటీర్లు ఖాదీ తెల్లచీరెలు పచ్చ జాకెట్లు ధరించి గాంధీజీకి అభివాదనం చేశారు. పూలమాలల గుట్టలు పడి హరివిల్లు నేల వాలినట్లున్న ఆ సుందర దృశ్యం చూసి ఆమె పరవశించారు. భారతీయుల హృదయాధినేత గాంధీజీకి మనస్ఫూర్తిగా నమస్కరించారు. ఆయన ఆజ్ఞను శిరసావహించటానికి మరొక మారు నిశ్చయించుకున్నారు.

చర్చలు విఫలమైనవి, శాసనోల్లంఘనం తప్పదని తేలింది. పోలీసులు శిబిరం స్వాధీనపరుచుకుని మూసేశారు. ఇతర స్త్రీలతోపాటు ఆమె యిల్లుచేరుకున్నారు. 144 వ సెక్షను అమలుపరచినట్లు స్టేషనులోనే శ్రీముఖం అందించారు. ఆమె లెక్కచేయలేదు. మరింత పట్టుదలతో పికెటింగులు జరిపారు. ఫలితంగా తణుకులో అరెస్టుచేసి ఆరుమాసాలు కఠినశిక్షవేసి సి క్లాసు యిచ్చి రాయవేలూరు జైలుకు పంపించారు. జరిమానా రెండువందలు చెల్లించ నిరాకరించిన కారణంగా ఆమెగాజులు, రాట్నం జప్తుచేశారు.

అప్పటికే అక్కడ శ్రీమతులు బెన్నూరి కృష్ణవేణమ్మ, దుర్గాబాయమ్మ, సుందరమ్మగార్లు అనేకులు ఆమెమిత్రులు పరిచయులువున్నారు. సి క్లాసువాళ్లు జైలుబట్టలే ధరించాలని ఒక నిబంధన. తనకు 'ఏ' క్లాసు యిచ్చినా ఒకే నేరానికి ఒకేశిక్ష సిద్ధాంతం ప్రకారం ఐచ్ఛికంగా 'సి' క్లాసులోకి వచ్చిన దుర్గాబాయమ్మగారు రాజకీయబందీలయిన స్త్రీలు మామూలు నేరస్థులు కాదని, వాళ్లు జైలుబట్టలు కట్టుకోవలసిన అగత్యంలేదని అలజడి లేవదీశారు. సంఘబలం పుష్కలంగా వుండటాన ఆమె పోరాటం జయించింది. ప్రభుత్వం ఆమెను వేరేజైలుకు పంపించివేసినా, రాజకీయ బందీలయిన సి క్లాసు స్త్రీలు తమబట్టలే తాము కట్టుకోవచ్చునని అనుమతి యిచ్చింది. అందువల్ల అప్పుడేజైలు

ప్రవేశంచేసిన శ్రీమతి సత్యవతమ్మకి జైలు బట్టలు కట్టుకోవలసిన బెడద తప్పిపోయింది. తిండి తిప్పలు వగైరా యిబ్బందులు యెటూవుండనేవున్నవి. ఆరునెలల కఠినశిక్ష అనుభవించి విడుదలయి యిల్లుచేరుకున్నారు.

నిజంచెప్పాలంటె అప్పటివరకు స్త్రీలకు స్వేచ్ఛగాని స్వతంత్రంగాని లేవు. గుళ్లకు గోపురాలకు హరికథలకు పురాణాలకు మించి వాళ్లు యెక్కడికి వెళ్లే అవకాశంలేదు. వాళ్లతో నిమిత్తం లేకుండానే చిన్న, పెద్ద పనులన్నీ తీరిపోయేవి. అటువంటి భారత స్త్రీకి గాంధీ మహాత్ముడి జాతీయోద్యమం పేరుతో స్వతంత్రం లభించింది. స్వేచ్ఛ చవిచూశారు. తమకున్న శక్తిసామర్థ్యాలు గమనించారు. తమవిలువ కనీసం తామైనా గ్రహించగలిగారు. అందువల్ల 1932లో జాతీయోద్యమ వుధృతం తగ్గిపోయినా స్త్రీలలో కలిగిన చైతన్యం నిల్చిపోయింది. మళ్లీ యథాస్థానానికిపోయి తృప్తిపడలేకపోయినారు. ఏదోఒకటి చేయాలి, ప్రగతి సాధించాలి అన్నతపన అనేకమంది స్త్రీలలో కలిగింది. అందులోను పరదాపద్ధతి పాటించని ఆంధ్రమహిళలు జాతీయోద్యమంలో తొలినుంచి పురుషులతో సరిసమానంగా పాల్గొన్నకారణాన మరింత బిగువుగా నిలబడి తమంతటతాము రకరకాల నిర్మాణాత్మక కార్యకలాపాలను నిర్వహించపూనుకున్నారు. సత్యవతమ్మగారి ఆలోచనా సరళి అదే అయింది. పేదలు, వితంతువులు, నిరక్షరాస్యులు అయిన స్త్రీలకు ఒక మార్గంచూపించాలని నిశ్చయించుకున్నారు. ఆ సమయంలో యేవో పనులమీద వచ్చిన కలెక్టరుతో తమ అభిప్రాయం చెప్పారు. అప్పటికి ప్రభుత్వ అధికారుల వైఖరికూడ కొంత మారటం మొదలుపెట్టింది. వృత్తిధర్మం నెరవేర్చుతు బ్రిటిషువారి ఆజ్ఞలకు బద్ధులయి వుంటున్నా, దేశనాయకుల, దేశసేవకులపట్ల అభిమానం, గౌరవం, ఆదరణ వారికి హెచ్చినవి. అందువల్ల ఆమె స్త్రీ విద్యాభివృద్ధికి సంస్థ నెలకొల్పాలని వున్నదన్నప్పుడు అదొక రాజకీయనేరంగా రాజద్రోహంగా భావించటానికి బదులు సంతోషంతో కొంత స్థలం మంజూరు చేశారు. అకాలమరణం చెందిన తమ కుమార్తెపేర భవన నిర్మాణానికి ఒక తహసీల్దారు ధన సహాయంచేశారు. ఆ విధంగా తణుకులో శ్రీ బాలసరస్వతీ స్త్రీ సేవా సమాజం 1932లో నెలకొన్నది. ఆ సంస్థ ఆధ్వర్యాన ఒక సంస్కృత కళాశాల, ఆడపిల్లలకు హైస్కూలు, చక్కని గ్రంథాలయం యేర్పాటయినవి. వేల్పూరు రోడ్డుకు తూర్పువైపున మంజూరైన

స్థలంలో ఒక సంస్కృత పాఠశాలను స్థాపించి ఆ మెతన మిత్రుల సహకారంతో విరాళాలు సేకరించి స్వంత భవనాలు ఆ పాఠశాలకుకూడ కట్టించారు. రెవెన్యూశాఖవారు దీనికిచాలా సహకరించారు. స్త్రీలకు చేతిపనులు, టైపు, మొదలయిన ధనార్జనకు వుపకరించే వృత్తులలో క్లాసులు నడిపి పరీక్షలకు పంపుతున్నారు. మూడుపువ్వులు ఆరుకాయలుగ సంస్థ వర్ధిల్లుతు వున్నది.

ఏడెనిమిది క్లాసులతో బడిచదువు ముగిసిపోయిన సత్యవతమ్మగారు అనేకమంది పేద స్త్రీలకు, వితంతువులకు, ఆర్తులకు, వృద్ధిలోకి రావలసిన అసంఖ్యాక బాలికలకు జ్ఞానభిక్ష పెడుతున్నారు. విద్యాధనం పంచుతున్నారు. ఏ విద్వత్పరీక్షలు నెగ్గని యీమె, మృదుమధుర శైలిలో సరళ భావాలను వెలిబుచ్చుతు అనేక కవితలు వ్రాశారు. మనసులోనుంచి సూటిగా వెలువడిన చక్కని భావాలకు వ్యాకరణ నియమాలు ఛందోలక్షణాలు తెలియవలసిన అగత్యంకూడలేదు. హృదయస్పందన వాటినన్నిటిని సమన్వయపరచుకో గలిగి సరిదిద్దుకోగలుగుతుందేమో. ఆమె యెన్నుకున్న విషయాలుకూడ జాతీయోద్యమానికి గాంధీయుగానికి సంబంధించినవే.

''రథచోదితుండౌ చురాజిల్లు కేశవున్
మఱపించు శ్రీగాంధి మహిమ దలచి,
యుద్ధ విశ్రాంతి గైకొని యుండుడయ్య
మరల రాగల సంగ్రామ మహిత విజయ
లక్ష్మి కరగ్రహణముకొరకు లక్ష్య మెంచి,''

అంటు సత్యాగ్రహులకు తమకొచ్చిన అమూల్య అవకాశాన్ని విశద పరుస్తున్నారు. తమనాయకుల చేవనెంచి, నిబ్బరంగ యుద్ధ విశ్రాంతి గైకొనమని తన చదువు సంధ్యలతో ఆటపాటలతో సంతృప్తి కలిగించిన బిడ్డవీపు నిమిరి తల్లిచెప్పినంత చల్లగా సత్యాగ్రహులకు చెపుతున్నారామె. అంతటి చేవగల నాయకులు, యింతటి వుత్సాహముగల శాంతిసేనావాహిని ప్రపంచ చరిత్రలో మరెక్కడా కనిపించదేమో. ఇంకొక కవితలో

''మనభాష, మనజాతి, మనదేశమభివృద్ధి
నెనయు మార్గముల నూహింపరమ్మ''

అంటారు.

నిర్మాణాత్మకంగా కార్యరంగంలో ప్రవేశించి స్త్రీలు విజయవంతంగా సాధించగలరన్న నమ్మకం ఆమెకు వున్నది. అందుకే స్త్రీలను ప్రోత్సహించుతున్నారు. అభివృద్ధినెనయు మార్గముల నూహింపరమ్మ అని తోటిస్త్రీలకు చిన్నచురక అంటించుతున్నారు. తల్చుకుంటే వూహించగల ధీశక్తి ప్రతిస్త్రీలోను వున్నదనే ఆమెనమ్మకం ఆ ఆత్మ ధృతికి తార్కాణమే ఆమె నెలకొల్పిన సంస్థ.

ఆమెకు యేపదవీ వ్యామోహాలులేవు, గౌరవాలందుకోవాలన్న కోరిక లేదు. సాధుశీల సేవానిరతిగల కర్మయోగిని. అందుకే

ఎక్కడి యాంగ్లదేశమిది, యెక్కడి భారతదేశమద్దిరా!
ఇక్కడికేగుదెంచి, యిటులెంతయు దీక్షను మాదుముక్తికై
తక్కకరాత్రియుంబవలు తల్లిరో! స్లేడురో! పాటునొందునీ
ఎక్కువయైన ఈ ఋణమునే గతి నీగెదమమ్మ యిమ్మహిన్".

"... ... ... ... ... ... ... ...
దగను విలాసమును విడిచి తల్లీ! స్లేడూ
నిగ మాంతవేది గాంధికి
దగకూతురవైతి, వెంత ధన్యవౌ ధాత్రిన్!''

అని శబరిని నుతించిన త్యాగరాజస్వామిని జ్ఞప్తికి తెస్తున్నారు. ఆమె ప్రబోధించిన విషయాలు, ఆమె శ్లాఘించిన కారణాలు ఆస్లేడు కన్యను శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మని కూడ కవితాలోకంలో స్థిరంగా నిల్పగలవు. 86 సంవత్సరాల వయసులో ఆమెయింకా సంస్థకు సేవచేస్తు కాలం విలువను కార్యసాధనలోవున్న ఆనందాన్ని తెలియచెపుతున్నారు.

ప్రతిఫలం అపేక్షించని వారిసేవలు ప్రభుత్వం, ప్రజలు గుర్తించుతునే వుంటారు. పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకా, నల్లజర్లబ్లాకులో పంచాయతీ తరపున, కొన్నివేలమంది ప్రేక్షకుల సమక్షంలో 30-9-1975 న శ్రీమతి సత్యవతమ్మగారికి ఘనసన్మానం జరిగింది. 5-10-75 న గణపవరం పంచాయతీ స్త్రీల విభాగం తరపున గౌరవించారు. 16-12-75 న ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఓబుల్‌రెడ్డిగారి అధ్యక్షతన కవయిత్రిగా,

దేశ సేవికగా గౌరవించారు. ప్రపంచ స్త్రీల సంవత్సరోత్సవాల సందర్భంగా యీ సన్మానాలు జరిగినవి. 24-3-1974 ఉగాది పండగనాడు తామ్రపత్రం యిచ్చి ప్రభుత్వం ఆమెను సత్కరించింది. ఆ సమయంలో పెద్దపెట్టున పౌరసన్మానం కూడ జరిగింది. రాజమండ్రి ఇన్నర్‌వీల్ క్లబ్బు తరఫున స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో 15-8-1976న త్యాగశీలిగా గౌరవించారు. దేశ సేవికగా స్త్రీ విద్యా వ్యాప్తికి నిరంతరం శ్రమించుతున్న సాధకిగా, కవయిత్రిగా ఆమెకు యెన్ని సన్మానాలు జరిగినా వింతలేదు.

---

# శ్రీమతి భారతీదేవి రంగా

జననం 1908 మరణం 27-9-72

వెంకటగిరి స్టేషను ప్లాటుఫారంమీద గాంధీ మహాత్ముడు రైలు ఎక్కటంకోసం నిలబడి వున్నారు. మరికొంత వ్యవధానంవున్నదని తెలిసిన ఆయన, శ్రీమతి భారతీదేవి భుజంపైన ఒకచేయి, శ్రీమతి పొణకా కనకమ్మ భుజాన ఒకచేయి వాత్సల్య అభిమానాలతోవుంచి, పచార్లుచేస్తు "అమ్మా భారతీదేవీ ఆంధ్ర మహిళలకు పురుషులలో వుండే వుత్సాహమేకాదు, కార్యశూరత్వంకూడ వున్నదమ్మా. ఆంధ్ర కాంగ్రెసు మహిళా విభాగానికి మీరిద్దరు పట్టుకొమ్మలు. నీవు కనకమ్మను జత కలుపుకుని పనిచేయటం నాకెంతో సంతోషముగా వున్నదమ్మా" అని అన్నారు. 1932 శాసనోల్లంఘన సందర్భంలో గుంటూరు జిల్లాలో ఆమె వహించిన ప్రముఖపాత్ర, అంతకుపూర్వం 1930 ఉప్పుసత్యాగ్రహం నాటినుంచే ఆమె జాతీయోద్యమంలో పాల్గొనటం అన్నీసవిస్తరంగా తెలుసుకుంటున్న కారణంగా గాంధీజీ శ్రీ రంగా దంపతుల స్వగ్రామమైన నిడుబ్రోలు వచ్చారు. వారి ఆతిథ్యం స్వీకరించారు. బహిరంగ సభలో వుపన్యసించారు. ప్రజలనుండి సేకరించిన విరాళాలకు తన బంగారు గాజులను జతచేసి స్వయంగా అల్లి తయారుచేసిన చక్కని సంచీలోవేసి శ్రీమతి భారతీదేవి అందించగా చిరునవ్వుతో స్వీకరించారు. ఆ మర్నాడు జాతీయోద్యమంలో పాల్గొని ఘోషావదలి జైళ్లకువెళ్లిన చేబ్రోలు వీరవనితలు పదిమందిని పేరుపేరువరసన ఆమె మహాత్మునికి పరిచయంచేశారు. జమీన్ రైతుల సమస్యలను పరిశీలించటానికి వెంకటగిరి వెళ్లిన మహాత్ముని కోరికపై ఆమె తిరిగి వెంకటగిరిలో కలుసుకుని సంభాషించారు.



శ్రీమతి భారతీదేవి రంగా

A M 11x

ఆమెతండ్రి వెలగా సుబ్బయ్యగారు 1923 లో జరిగిన చరిత్రాత్మక మైన పెదనందిపాడు శిస్తులనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. దాదాపు అర వై సంవత్సరాలవయసులో ఆయన వాలంటీరుగా, సంచి భుజాన తగిలించుకుని తీవ్రప్రచారంచేశారు. బహిరంగసభల్లో వుపన్యసించారు. ఆయన అన్న కూడ ఆ వుద్యమంలో అమితోత్సాహంతో పాల్గొన్నారు. ఆమెకు ఆ విషయాలన్నీ మన సులో చక్కగా నాటుకున్నవి. ఆమె బాపట్లతాలూకా మాచవరంలో 1908 లో జన్మించారు. ఆమె తల్లిపేరు శ్రీమతి పిచ్చమ్మ. అచంచలదైవభక్తి శ్రీమతి భారతీదేవికి తల్లినుంచే సంక్రమించింది. చిన్నప్పుడు యింట్లో తెలుగు, ఇంగ్లీషు నేర్చుకున్నారు. సంపన్నులు విద్యావంతులు సంస్కరణ భావాలుగల రంగాగారితో వివాహం నిశ్చయంకాగానే తాను విద్యావంతురాలిని కావాలన్న పట్టుదలతో ఆమె పొరుగూరైన గుంటూరు వెళ్లి శ్రీ ఉన్నవ దంపతులు నడుపుతున్న జాతీయవిద్యాలయం శారదానికేతనంలోచేరి చదువుకున్నారు. 1924 లో వివాహంఅయింది. ఆ తరువాతనే మద్రాసులోని విద్యోదయ పబ్లిక్ స్కూల్లో చదివారు. ఉన్నతవిద్యల నభ్యసించటానికి ఇంగ్లండు వెళ్తున్న భర్త వెంట ఆమెకూడ వెళ్లారు. 1925-26 లో ఆక్సుఫర్డు యూనివర్సిటీలోని రస్కిన్ స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో కళలనభ్యసించారు. అప్పటి కామెవయసు 17 సంవత్సరాలు. అయినా విదేశాలలో విలాసపూరితమైన జీవితానికి పుబ్బి పోవటానికిబదులు ఆమె మనదేశంలో యిట్లాంటి చదువులకు అవకాశాలు కల్పించాలి, మూఢాచారాలు పోగొట్టి మన స్త్రీలకు విద్యావికాసాలు, సమాజంలో స్థానం కల్పించాలి అని ఊహించుకుంటూ నిర్ణయాలు చేసు కుంటు వుండేవారు. ఆ సమయంలోనే ఆక్సుఫర్డులో వుండి చదువుకుంటున్న మాజీ భారత అధ్యక్షులు రాధాకృష్ణన్‌గారు "జీవిత విధానంపై హిందూ దృక్పథం" అనే శీర్షికపైన యిచ్చిన వుపన్యాసాలు ఆమె మనసులో హత్తుకు పోయినవి. యూరప్‌దేశాలతో పాటు ఆఫ్రికాప్రాంతాలు కొన్నిచూచారు. అక్కడి దేశీయులు బానిసత్వంలో భారతీయులకన్నా ఘోరమైన పరిస్థితులలో వుండటం గమనించిన ఆమె లేతహృదయం స్వతంత్రసిద్ధికి యెటువంటి త్యాగాలైనా చేయటానికి, కష్టాలు సహించటానికి త్వరపడసాగింది.

స్వదేశం చేరుకుని భర్తగారు పచ్చయప్ప కాలేజిలో ప్రొఫెసరుగా వుంటున్న సమయంలో ఆమె యంగ్ విమెన్సు క్రిష్టియన్ అసోషియేషను నిర్వహించుతున్న అనేక సాంఘిక కార్యకలాపాలలో పాల్గొని మంచి

అనుభవజ్ఞానం గడించారు. 1930 లో గాంధీమహాత్ముడి పిలుపు ఆ దంపతుల భవిష్యత్తును నిర్ణయించింది. అంతటితో ఆ వుద్యోగానికి పట్టణవాసానికి వీడ్కోలిచ్చి నిడుబ్రోలుగ్రామం చేరుకున్నారు. భర్తతోపాటు ఆమె జాతీయోద్యమంలో ప్రవేశించారు.

ఆమె జాతీయోద్యమ ప్రవేశం ఆంధ్రకర్షక కుటుంబాలలో గొప్ప సంచలనం కలిగించింది. నూతనఅధ్యాయం ఆరంభమయింది. సంపన్నగృహిణి విద్యావంతురాలు, రైతుకుటుంబానికి చెందిన ఆమె నిస్సంకోచంగ సభలు సమావేశాలకు హాజరుకావటం, బహిరంగ సభల్లో వుపన్యసించటం, వివిధ వాలంటీరు శిబిరాలలో వుండటం, ప్రచారం చేయటం, కొత్త వుత్సాహ వుద్రేకాలను మహిళలకు కలిగించింది. 1932 లో శాసనోల్లంఘనం చేయటానికి విదేశీవస్తువస్త్ర బహిష్కరణను ముఖ్యసాధనంగా వుపయోగించింది కాంగ్రెసు. అందువల్ల అనేక ప్రదేశాలలో శాంతిసైనికులకు శిక్షణనివ్వటానికి, క్రమబద్ధంగా పికెటింగులు జరపటానికి శిబిరాలు స్థాపించారు. శ్రీమతి భారతీదేవినాయకత్వాన తెనాలిలో ఒక బ్రహ్మాండమైన మహిళా విభాగ శిబిరం వెలిసింది. సంపన్న గృహిణులు నాలుగుగోడల మధ్యవుండటంతప్ప తెలియనివారు, ఎండకన్నెరుగని పరదాస్త్రీలు, వృద్ధులు, కొత్తపెళ్లికూతుళ్లు అన్నికులాలవారు అధికసంఖ్యలో వచ్చి ఆ శిబిరంలో శిక్షణపొంద నారంభించారు. విదేశీ వస్తు వస్త్రాలయాల దగ్గర, కల్లుసారాదుకాణాల దగ్గర రోజుకు ఆరుగంటలు శాంతి సహనాలతో పికెటింగులు చేయనారంభించారు. ఆ విధంగా ఆ శిబిరం ఆంధ్రదేశాని కంత టికీ తలమాణిక్యంగా ఆరునెలలు నడిచింది. ఇంతమంది మహిళలు ఇంత చక్కగా శిబిరంలో వుండటం నిరవధికంగా శాసనోల్లంఘనం జరుపుతువుంటే నాయకులు అనేకమంది వచ్చి చూసి ఆశ్చర్య సంతోషాలను వెలిబుచ్చేవారు. ఆ ఖ్యాతి చివరకు గాంధీ మహాత్ముడివరకు వ్యాపించింది. ఆంధ్ర మహిళలపట్ల ఆయనకున్న గౌరవం మరింత ఎక్కువయింది. భారతీదేవి నిర్వహణాశక్తి, దీక్ష ఆయనకెంతో సంతోషం కలిగించినవి. ఇదెంతకాలం అధికారులు సహించగలరు? 1932 జనవరి 27న తెనాలిలో అరెస్టుచేసి ఒక సంవత్సరం జైలు శిక్ష, ఐదువందల రూపాయల జరిమానా విధించారు. ఆమె బంధువులు జరిమానా చెల్లించటంతో ఒక సంవత్సరం జైలుశిక్ష అనుభవించటానికి ఆమెను రాయవేలూరు పంపించారు.

ఆ సమయంలో అక్కడ శ్రీమతులు దిగుమర్తి జానకీబాయమ్మ, పొదర్తి సుందరమ్మ, కొల్లా కనకవల్లి తాయారమ్మ, తుమ్మల దుర్గాంబగార్లు యెందరోవున్నారు. ఆమె తన సాధుస్వభావంతో చల్లనిమాటలతో, ఆప్యాయతతో అందరికి ఆత్మీయురాలుగావుండి శిక్షాకాలం పూర్తిచేశారు. జైలులోవున్న యిబ్బందులు కష్టాలు ఆమెను కుంగతీయలేదు.

ఆమె రైతుబిడ్డ. ఆమె భర్త విదేశాలలో దక్షిణ భారతదేశంలో పత్తిపంట అభివృద్ధి అనే విషయంపైనే డి. లిట్. పట్టంతీసుకున్నారు. దాంతో ఆమెకు యెప్పుడూకృషి, కృషీవలులు, వాళ్లఅభ్యుదయమే మనసులో మెదులుతు వుండేది. విదేశాలలో వున్నప్పుడు, పర్యటన చేస్తున్నప్పుడు కూడ వ్యవసాయం గురించిన విషయాలు, రైతులపంటలకు భీమాలు, పశువులకు భీమాలు, వారి బిడ్డలకు విద్యావికాసాలు, వారి స్త్రీల సంక్షేమంగురించి తెలుసుకుంటు మన దేశంలో వాటినివుపయోగించగల విధానాలు ఆలోచించుతు వుండేవారు. 1931 నుంచే రైతురక్షణకమిటీ సభ్యురాలుగా వున్నారు. పన్నుల నిరాకరణోద్యమం, భూమిశిస్తు పునర్వ్యవస్థీకరణపట్ల నిరసన వుద్యమాలలో శ్రీమతి మూల్పూరి చుక్కమ్మకి సహకరించి బహుళప్రచారం చేశారు. కర్షకులకు సేద్యవిషయకమైన విజ్ఞానవికాసాలు అభ్యుదయరీతులు బోధించటానికి నిడుబ్రోలులో శ్రీరంగా నిర్వహించిన వేసవి విద్యాలయంలో 1934 నుంచి అవిచ్ఛిన్నంగ 22 సంవత్సరాలు ఒక్కతీరున వందల సంఖ్యన గల విద్యార్థులకు కన్నతల్లికన్న మిన్నగా సమస్త సదుపాయాలు అమిరేట్లు చూశారు. పోనుపోను కర్షక సేవ ఆమె జీవితంలో ప్రధాన అంశమయింది. భర్త జైళ్లలో వున్న సమయంలో కూడ ఆమె ఓర్పుతో, నేర్పుతో, దీక్షతో, ఆ కార్యకలాపాలను కొనసాగించారు. పరిమితకుటుంబం కర్షకులకు అత్యంత శ్రేయోదాయకమని, అవసరమని ఆమె 1927 లోనే గ్రహించారు.

ఆమెకు దైవభక్తి అధికం. తత్వవిచారం, పుణ్య పురుష దర్శనం, క్షేత్ర సందర్శనానురక్తి యెక్కువ. కాని మూఢాచారాలు మానవాభ్యుదయానికి ప్రతిబంధకాలు అనుకున్న విషయాలపై చిరాకు అంతకన్న అధికం. అస్పృశ్యత గిట్టదు. 1931 లోనే భజన మండలి స్థాపించి అస్పృశ్యతా నివారణకు పూనుకున్నారు. ఆ తర్వాత, వారితో సహపంక్తి భోజనాదులు యేర్పాటు చేసేవారు. తగిన అర్హతలువున్న సందర్భాలలో హరిజనులతో

వివాహ సంబంధాలుకూడ ఆమె ప్రోత్సహించేవారు. శ్రీమతి మూల్పూరి చుక్కమ్మతో కలిసి వితంతువివాహాలు అనేకం జరిపించారు. అజ్ఞానంచేత యెవరైనా భార్యలను అవమానపరచినా, హింసించినా, నిష్కారణంగా త్యజించినా, ఆమె కోమల హృదయం విలవిలలాడేది. వ్యక్తిగతంగా జోక్యం కలగచేసుకుని సరిదిద్దేవారు.

ఆమెకు విద్యపట్ల అభిమానం గౌరవం అధికం. 1931 ప్రాంతాలలో నిడుబ్రోలులో ఒక బాలికా ప్రాథమిక పాఠశాలను నెలకొల్పారు. బంధువు లయిన శ్రీ బుచ్చినాయుడు నిడుబ్రోలులో కళాశాల స్థాపించటానికి సహక రించారు. సంతోషంతో భారం వహించి రైతాంగ వేసవి పాఠశాల నిర్వ హణ చేయించారు. మహిళలకు రాజకీయ పాఠశాలలు నిర్వహించి చైతన్యంకలిగించారు. చేబ్రోలువంటి చోట్ల అవి నిర్వహించటానికి సహక రించారు.

మానవులు దైవభక్తి, దేశభక్తి కలిగివుండాలన్నా, సమాజసేవ, మానవసేవ చేయాలన్నా, వీరులను సన్స్మరించి వారి దీక్షను ఘనవిజయాలను గుర్తుచేసుకుని వుత్తేజితులు కావాలనేవారు. ఆమె తన తండ్రిగారు పన్నుల నిరాకరణోద్యమంలో 1923లో వుపయోగించిన వాలంటీరు సంచీని యెంతో విలువయిచ్చి దాచుకున్నారు. ఆమె వెల్లూరు జైలులో వుండగా గాంధీజీ వ్రాసిన కార్డు ముఖమల్ సంచిలో దాచివుంచారు. దేశసేవకులకు, త్యాగధనులకు సభలలో సన్మానాలు చేయించేవారు. మందసా జమీలో ప్రభుత్వానికి కర్షకులకు మధ్యన కొన్ని అవాంఛనీయ దుర్ఘటనలు జరిగినవి. పోలీసులు దారుణంగా జరిపిన హింసాకాండలో అనేకమంది పేదలు, నిర్భాగ్యులు నిష్కారణంగా మరణించారు. సాసుమాను గున్నమ్మఅనే పాటకస్త్రీ వీరావేశంతో అధికారులకు ఎదురునిల్చింది. చూలాలైన ఆమెను పోలీసులు తుపాకులకు బలిచేశారు. శ్రీమతి భారతీదేవి హృదయం యిది భరించలేకపోయింది. గున్నమ్మ నేలకొరిగినచోట ప్రజల సహకారంతో చిన్నమందిరం నెలకొల్పి సాసుమాను వీరగున్నమ్మ పేరు చిరస్థాయి చేశారు.

ఆమె దేశాటనం యెంతగానోచేశారు. ఆసేతు హిమాచలం తిరిగారు. ప్రతిచోట ప్రాచీన ఔనత్యాన్నే ఆమె చూడగలిగారు.

ఆమె వివిధ సంఘాలకు సమావేశాలకు సారథిగావుండి సేవచేశారు తప్ప, పిలిచియిచ్చినా మంత్రిత్వంలాంటి పదవులు స్వీకరించలేదు. ఆమెకు వాటిపై నిరసనే అధికం. ఆమెసేవలను నిరంతరకృషిని వివరిస్తు అనేక బృహద్గ్రంథాలే వెలువడినవి. కవితలే ప్రచురింపబడినవి. కాని శ్రీమతి భారతీదేవి బహుసౌమ్యురాలు అని ఆమెతో జైలు జీవితంగడిపిన దేశసేవికలు అంటున్నప్పుడు, మమ్ములను ఝాన్సీ రాణిలాగ స్వాతంత్ర్య సమరంలో నడిపించారు, అని పల్లె స్త్రీలు కళ్లతుడుచుకుంటున్నప్పుడు, మమ్ములను అమ్మలాగ ఆదరించేవారని నిష్కపట రైతుయువకులు గౌరవం చూపినప్పుడు ఆమెకీర్తి మరింతగా ప్రకటితం అవుతూవుంటుంది. హృద్రోగంవల్ల 1972 సెప్టెంబరు 27న అకాలమరణం పొందిన యీ బహుముఖ సేవాధురీణ చిత్రపటానికి 1978 సెప్టెంబరు 2న శ్రీమతి ఇందిరాగాంధి పుష్పాంజలి ఘటించి గౌరవించారు.

---

"సంఘ సేవా పరాయణి"

# శ్రీమతి చుండూరి రత్నమ్మ

**జననం 7-2-1892** **మరణం 4-8-1965**

"దుర్మార్గుడగు విష్ణువర్ధనరాజు మన కుల సంజాతయగు వాసవి కన్యను గాంచి మోహపరవశుడై బలాత్కారము చేయనెంచెను. దుర్మార్గుని చేపట్టుటకంటే అగ్నిలోపడి చచ్చుటమేలని తలచి వాసవి అగ్నిలో దూకెను. అట్టి యామెయే మనకులదేవత. రాజు దుర్మార్గుడైనప్పుడు అసహాయయోగ మొనరించి శాంతముగా తన దేహ మర్పించిన యామె త్యాగము, స్వధర్మదీక్ష మన కాదర్శములు. మన మట్టి కులమున జన్మించితిమి'' అని ఒకానొక సమావేశములో శ్రీమతి చుండూరి రత్నమ్మ ఆర్య వైశ్య స్త్రీలను వుద్బోధించారు. ఆ సూత్రమే ఆమె తు. చ. తప్పకుండ పాటించారు. 1932 లో పర ప్రభుత్వాన్ని శాంతిప్రదమైన అసహాయయోగంతో ఆమె యెదుర్కొన్నారు. ఫలితంగ ఏలూరు పట్టణంలో 23-5-1932 న అరెస్టయినారు. ఆరునెలల జైలుశిక్ష అనుభవించటానికి రాయవేలూరు వెళ్లారు. ఆ సమయంలో అక్కడ శ్రీమతులు తుమ్మల చంద్రమ్మ, ఓరుగంటి మహాలక్ష్మమ్మ, మద్దుల రామాయమ్మ, జవ్వాది రాజరత్నమ్మగార్లు అనేకులు వున్నారు.



శ్రీమతి చుండూరి రత్నమ్మ

ఏ వాడ చిలక ఆ వాడపలుకు పలుకుతుంది. కాకినాడలో రావుబహదూర్ పైడా వెంకట చలపతిరావుగారు గొప్ప జమీందారు. స్వంతఖర్చుతో ప్రజోపయోగార్థం ఆయుర్వేద వైద్యశాల, టౌనుహాలు, సత్రాలు యింకా అనేక ధర్మ సంస్థలు నిర్మించారు. సంస్కార భావాలు గలవారు. అంతకుమించి గొప్ప కాంగ్రెసువాది. తొలిదశనుంచి జాతీయోద్యమంలో ప్రవేశించి

ప్రచారానికి రెండుచేతులా డబ్బు గుప్పించిన వ్యక్తి. పార్లమెంటులో చర్చకు వచ్చిన 21-12-1930 నాటి విఖ్యాత పెద్దాపురంతోట లాఠీచార్జీ సమయంలో నలుగురు పోలీసులు ఒక్కసారిగా ఆయనను క్రిందపడవేసి లాఠీలతో కొట్టిన ఘట్టం మరువరానిది. అయినా ఆయన చలించక కాంగ్రెసు ప్రచారానికి సర్వవిధాల సహకరించారు. ఆయన కూతురే శ్రీమతి రత్నమ్మ. ఆమె 1892 ఫిబ్రవరి ఏడవ తేదీన జన్మించారు. రత్నమ్మగారికి తొమ్మిదవ యేట 1901 లో శ్రీ చుండూరి శ్రీరాములు శ్రేష్ఠితో వివాహం జరిగింది. ఆ కుటుంబం కూడ గొప్ప స్థితిపరులేగాక గుళ్లు, గోపురాలు, సత్రాలు, చలివేంద్రలు నిర్మించినవారే. కాని శ్రీరాములుగారికి వీరేశలింగం పంతులుగారి ప్రభావంవల్ల, ఏకేశ్వరోపాసనయందు ఆసక్తి యెక్కువ. సంస్కార భావాలుగలవారు. అందువల్లనే భార్య సంస్కృత, ఆంధ్ర, హిందీలలో వైదుష్యం, సంగీతంలో, చిత్రలేఖనాది లలితకళలలో నైపుణ్యం సంపాదించటానికి సహకరించారు. శ్రీమతి రత్నమ్మ విదేశీవస్తు, వస్త్ర బహిష్కరణోద్యమంలో ప్రవేశించి చాలా ప్రచారంచేశారు. స్వదేశీ వస్తు వస్త్రాల పట్ల అభిమానమేకాక జాతీయవిద్యపట్ల చాలా గౌరవం.

ఆమె దేశభక్తి, జాతీయాభిమానం తాత్కాలికఆవేశంకాదు. ఆమెదృష్టిలో ప్రతిజీవికి దేశభక్తి నిరంతరం వుండవలసిన ఒక సహజ లక్షణం. అందు వల్ల సర్వకాల సర్వావస్థలలోనూ దేశభాగ్యోన్నతికి పాటుపడుతు శాశ్వత విధా నంలో పూనుకోవాలని ఆమెసిద్ధాంతం. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్న శ్రీ గురజాడవారి దివ్యవాక్కుకు రూపకల్పన చేయాలని ఆమె ప్రయత్నం. అన్ని రేకులు సమానంగ పుష్టికలిగి వికసించినప్పుడే పూవు అందం. లేకపోతే గుడ్డిపూవు, కుంటిపూవు అయి విలువపోగొట్టుకుంటుంది. అట్లాగే సంఘంలో స్త్రీలు, పురుషులు, అన్నికులాలవారు, అన్నిజాతులవారు విద్యావంతులు కావాలని, మంచిచెడ్డలు తెలుసుకోగల దిట్టలు కావాలని అప్పుడే భారతదేశం ప్రగతిపథాన నడుస్తుందని ఆమె నమ్మకం. ఆమె పుట్టిన ఆర్యవైశ్యకులంలో ఆరోజుల్లో స్త్రీ విద్య బొత్తిగాలేదు. విద్యావంతులైన స్త్రీలను ఒక్కచేతి వేళ్లమీద లెక్కించవచ్చు. అటువంటికాలంలో ఆమె పెద్దబహిరంగ సభల్లో అనర్గళంగా వుపన్యసించేవారు. స్త్రీలను, మరిముఖ్యంగా వైశ్య స్త్రీలను నిద్రాణస్థితినుంచి తట్టి లేపి, వాళ్లూ అందరిలాంటి సమర్థులేనని తెలియచెప్పటానికి చెప్పలేనంతగా శ్రమించారు. అవకాశం కలిగినప్పుడల్లా

సభలు, సమావేశాలలో వుద్బోధించుతు, హెచ్చరించుతు మాట్లాడేవారు. కర్నూలు జిల్లా వైశ్య మహిళా సభకు అధ్యక్షత వహించిన సందర్భంలో- "మన వైశ్య స్త్రీలకు ఆభరణములందు అధిక ప్రీతి. ఇదిమంచిదికాదనను. నేడుమనకు కావలసినవి సరస్వతీ ఆలయాలు, విజ్ఞాన మందిరములు. మన జాతి నుద్ధరించి దేశసౌభాగ్యమునకు తోడ్పడు మంచి పరిశ్రమలు కావలయును. మనమేమి చేసినను—భారతదేశము, మన ఆర్యవైశ్య జాతి ముందుకు వచ్చునట్లు చూడవలయును. అంతేకాని అర్థంలేని పిచ్చిపనులు చేయుట ఈ కాలమునకు వెగటుగా నుండును. మన సంఘములో అనేక లోపములు కలవు. అవి వేళ్ల పాతుకుని పోయినవి. సంఘ దురాచారములను రూపుమాపినగాని మన ఆర్య వైశ్య జాతికి మోక్షములేదు. నలుగురిలో గౌరవ మర్యాదలుండవు. విద్యావివేకములను అపారముగా పొందుడు" అని హెచ్చరించేవారు. ఆమె హెచ్చరికలో హేళనగాని, నిరసనగాని వుండదు. ఆవేదన, ఆరాటం కనిపించుతుంది.

ఆమె తాతగారయిన శ్రీ పైడా రామకృష్ణయ్య, శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు మిత్రులు. ఉద్యమ ప్రచారకులుగా వేలకువేలువిరాళం యిచ్చి తోడ్పడ్డారు. భర్త శ్రీ పంతులుగారి శిష్యులు. అందువల్ల ఆమెకు జాతి కులమత ప్రసక్తులు నచ్చవు. హరిజనులతో సహా ఆమె దృష్టిలో అందరు ఒకటే. భారత జాతి పరిపుష్టం కావటానికి ఆర్యవైశ్యకులంలో వేళ్లు పాతుకు పోయిన దురాచారాలు, మూఢ నమ్మకాలుగాని, స్త్రీ విద్యావిహీనతగాని అడ్డు రాకూడదని ఆమె ఆవేదన. వ్యర్థకులాభిమానం ప్రదర్శించితే ఆమె చాలా బాధ పడతారు. ఎంతో నిజాయితీతో లోపంయెత్తిచూపి సరిదిద్దుతారు. రాజమండ్రి లోవున్న వైశ్యసేవాసదన వార్షికోత్సవాలకు అధ్యక్షతవహించిన ఆమె—"మన వాడలలోను, గ్రామాలలోను, పట్టణాలలోను, మనసంఘంలోను, వుద్యోగాల లోను, పదవులలోను స్థానిక సంస్థలలోను కులభేద పిశాచం తలవిరియబోసు కుని యథేచ్ఛగా నృత్యం చేస్తున్నది. రెడ్డి వసతిగృహం, కాపు వసతిగృహము, కమ్మవసతిగృహము, వైశ్య వసతిగృహము, నియోగిఫండు- వైదికిఫండు- అని పేర్లుపెట్టి కులములరీత్యా మనము వేరైనట్లే విద్యాసంస్థలలోకూడ యీ కుల భేదమనెడు వేరుపురుగును మన నాశనము కొరకు పోషించుచున్నాము. మన జాతీయ ఆదర్శములకు కులములు అడ్డుతగులకూడదని నా విన్నపము. ఈ మహాప్రతిష్ఠాపన నెలకొల్పిన దానకర్ణులగు నాళం రామలింగయ్య శ్రేష్ఠిగారిని,

దీనిని నిర్వహించుతున్న శ్రీమతి బత్తుల కామాక్షమ్మకిని నా వినయపూర్వక వందనములతో సంగతులు మనవిచేయుచున్నాను. మనము కులక్షల కోటను జయించవలెను. జాతి, మత, కులవివక్షతలేక యెల్లమానవులు సరస్వతీదేవి నుపాసించుటకు అవకాశ మీయవలెనని మనవి చేయుచున్నా"నని అన్నారు. అప్పటినించి వైశ్యసేవాసదనం ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలగా మారింది.

ఆమె గొప్పభక్తురాలు. భారతదేశంయావత్తు తిరిగిచూశారు. అన్ని క్షేత్రాలు దర్శించారు. దానివల్ల ఆమెకు మన భారతదేశం యింతచక్కటి దేశం, ఇన్నిమతాల, కులాల, జాతులవాళ్ల ఒక్కటై ఆ దేశమాత సేవ చెయ్యాలి, కీర్తి దిగంతాలకు పెంచాలి అన్నభావనే కలిగింది. ఆమె భావనలో కులం, మతం, సంఘం, దేశం, భగవంతుడు అనే విడివిడి గదులు లేవు. మోక్షసాధనకు యివన్నీ మెట్లని, ఒకదాని నధిగమించి మరొకటి చేరుకోవాలని, యిన్నిటికి మూలసూత్రం సర్వసమత, నిజాయితీలనీ ఆమెవాదన. "నా కులదేవత యగు కన్యకా పరమేశ్వరియే నా జీవితమునకు ఆదర్శం" అని ఆమె యింటాబయటా అనటం పరిపాటి. అది అక్షరాల నిజం. మూఢ భక్తితో ఆమె గాలిలో దణ్ణాలు పెడుతు చెంపలు వేసుకోరు. తాను నమ్మిన దేవత త్యాగాన్ని, వివేచనాశక్తిని, నిస్వార్థాన్ని ఆచరణలో పెడుతువుంటారు. అదే చెప్పుతు వుంటారు. ఒక సమావేశంలో ఆమె - "ప్రతియూరునను దేవాలయము లనేకములుండగా ప్రతిపట్టణవాసమునను అనేక సత్రములు నిర్మింపబడియుండ ముఖ్యముగా మనవైశ్యులలోను, యితర కులాలలోను దేవాలయ ప్రతిష్ఠాపనా, సత్రనిర్మాణముల పిచ్చి మనవారికింకను వదలలేదు. ఈ దేవాలయములును, సత్రములును కపటభక్తులకును, సోమరులకును నిలయములగుతున్నవి. ప్రస్తుతము యీ పనులు కట్టిపెట్టి భారతనిర్మాణమునకు పూనుడని భూస్వాములను, శ్రీమంతులను, మన వర్తక సంఘములను ప్రార్థించుచున్నాను. మన ఆంధ్రులు కార్యశూన్యులు జిహ్వప్రియులు. దేశములో చెప్పతగిన ఒక్క ప్రతిష్ఠాపన కూడా జాతీయచిహ్నముగ కన్పించుట లేదని విచారముతో మనవిచేయుచున్నాను" అంటారు. ఇందులో మూఢ నమ్మకాలను వదలమని, వివేకంతో దేశసేవకు, జాతిగౌరవం పెంచటానికి పూనుకోమని ఆమె పడే ఆవేదన విదితం అవుతున్నది. ప్రతిమాటలోను వ్యక్తులు, సంఘం బాగుపడి శాశ్వత విధానంలో దేశ సౌభాగ్యానికి తోడు పడమని ఆమెపడే ఆరాటం, మానసిక వ్యథ వ్యక్తమవుతున్నవి.

ఆమె తాను చెయ్యగలిగినవే యితరులను చేయమని ప్రబోధించారు. చెప్పినవి స్వయంగా చేసిచూపించారు. స్వయంకృషితో, స్వంతఖర్చులతో ఉత్తమ గ్రంథాలను 13 వేలకు పైగా సేకరించి శారదా గ్రంథాలయాన్ని నెలకొల్పారు. ప్రతియిల్లు సరస్వతీ నిలయం కావాలనీ, ప్రతి ఆంధ్ర స్త్రీ సరస్వతీ పుత్రికఅయి విజ్ఞాన వివేకాలను దేశ సేవకు వినియోగించాలని ఆమె యెప్పుడు ప్రబోధించేవారు. మన దేశంలోవున్న స్త్రీ విద్యాసంస్థలు బొత్తిగా చాలవని శారదానికేతనం, కస్తూరిదేవి విద్యాలయం, అన్నపూర్ణాదేవి విద్యాలయం, ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలవంటి జాతీయ విద్యాలయాలు విరివిగా స్థాపించాలని చెప్పుతు వుండేవారు. హిందీ ప్రచారం చేసేవారు. ఏలూరులో జరిగిన హిందీప్రచారక సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు. ఆమె విరాళాలు యివ్వనిసంస్థ ఆనాడు ఆంధ్రదేశంలోలేదు. స్థానిక విద్యాలయాలలో విద్యార్థినులకు నాట్యం, సంగీతం, చిత్రలేఖనం, వ్యాసరచనా వ్యాసంగాలలో పోటీలు నిర్వహించి గెలుపొందినవారికి వెండికప్పులు, బంగారు పతకాలు, షీల్డులు బహూకరించి, విద్యార్థినులలో ఆసక్తి పెంపొందిచుతు వుండేవారు. స్త్రీలు శారీరకంగా అబలలుకావటాన యెన్నో అత్యాచారాలకు గురి అవుతున్నారని, కనీసం ఆత్మరక్షణ, మానరక్షణార్థం ప్రతిస్త్రీ వ్యాయామం యోగాసనాలు, సాముగరిడీలు, యీతవంటివి అభ్యసించి తీరాలని స్త్రీలను హెచ్చరించేవారు. ఏ వుద్యమ ప్రసక్తిలేకుండానే హరిజనోద్ధరణ, మద్యపాన నిషేధము ప్రచారం చేస్తుండేవారు.

1936 నుంచి చనిపోయేనాటి వరకు యేకబిగిన 30 సంవత్సరాలపాటు ఏలూరు మున్సిపల్ సంఘ సభ్యులుగా వున్నారు. 1940లో ఏలూరు పట్టణ మున్సిపల్ సంఘ అధ్యక్షులుగా ఎన్నికయినారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం మొత్తంమీద ఆ పదవిని అలంకరించిన ప్రథమ స్త్రీ ఆమె. ఆంధ్ర మహిళలకే అది గౌరవదాయకమై నిల్చింది. ఆంధ్రదేశంలోనే కాక సేలం, కోయంబత్తూరు, మద్రాసువంటి అనేక దక్షిణ నగరాలలో ఆమెను ప్రథమ స్త్రీ చైర్మన్‌గా సన్మానించి గౌరవించారు. 1941 లో నెల్లూరులో జరిగిన ఆర్యవైశ్య మహాసభ సందర్భంలో ఆమెకు "సంఘసేవాపరాయణి" బిరుదుయిచ్చి సత్కరించారు.

ఆమె కులాభిమానం, ఆంధ్రాభిమానం, మహిళాభిమానం యేనాడు వెర్రితలలువేయలేదు. వాటిని ఆమె వ్యక్తిగతంగాగాని, రాజకీయంగాగాని,

సంకుచిత భావాలను, వుద్రేకాలను రెచ్చగొట్టడానికి వాడుకోలేదు. వాటిలోవున్న చెడును వదిలించి భారతదేశ సేవకు సాధన సంపత్తిగా మాత్రమే భావించారు. ఆమె గురువు గాంధీజీ. ఆమె లక్ష్యం భారతదేశ పూర్ణస్వాతంత్ర్యం. 1932లో సమిష్టిగా దేశంలోని వేనవేలు జనంతోపాటు సత్యాగ్రహంచేసి జైలుకువెళ్ళి 1940 ఆఖరున వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మహాత్ముని ఒప్పుదలతో యేవ్యక్తికి ఆ వ్యక్తిగా చేసిన యీ సత్యాగ్రహ సందర్భాన ఏలూరు పట్టణంలో 16-12-1940న అరెస్టయినారు. రాయవేలూరు జైలులో ఆరుమాసాలపాటు శిక్షననుభవించారు. ఆమె క్షణం వ్యర్థపుచ్చటానికి యిష్టపడరు. శుష్క-ప్రియాలు గిట్టవు. అందువల్ల రకరకాల కుట్లు, అల్లికలుచేస్తూ, సంగీతం సాధన చేసుకుంటు పుస్తకాలు చదువుకుంటు శిక్షాకాలం పూర్తి చేశారు. 28-5-1941న విడుదలైనారు.

ఆమె యే పనికి పూనుకున్నా మనస్ఫూర్తిగా చేస్తారు. నామకః యే హోదాలోను వుండరు. భర్త, బిడ్డలు, మనమలుగల పెద్ద సంసారం. సంపన్న గృహిణిగా, జమీందారిణిగా యెన్నో బాధ్యతలు, రోజురోజుకు పైబడుతున్న వయసు. కాని ఆమె సేవానిరతికి, పట్టుదలకు యివేవీ అడ్డు రాలేదు. వైశ్య మహిళా మహాసభకు అధ్యక్షులు, ప్రభుత్వంవారి స్త్రీ సంక్షేమ విభాగానికి నాయిక, నర్సాపూరు విశంతు శరణాలయానికి ట్రస్టీ, ఆంధ్ర మహాసభ కేంద్ర సమితి సభ్యులు, జిల్లాకుటీర పరిశ్రమల కమిటీ మెంబరు, వైశ్య మహాసభ కేంద్రకమిటీ మెంబరు, పశ్చిమ గోదావరిజిల్లా ఆహార కమిటీ మెంబరు, గిల్డు ఆఫ్ సర్వీసుకు కార్యదర్శిని. ఇట్లా యెన్ని సంస్థలు నిర్వహించారో. ఆమెకున్న ప్రజ్ఞ, లలితకళలలో ప్రవేశం, వివేచనా శక్తులను గమనించి జిల్లా మ్యూజియం కమిటీమెంబరుగా యెన్నుకున్నారు.

ఆలిండియా రేడియోవారి కవి సమ్మేళనాలలో పాల్గొనేవారు. అనేక విషయాలపై ప్రసంగాలు చేసేవారు. కొల్లూరు వరదలు, దివితుఫానుల వంటివి వాటిల్లినప్పుడు వ్యక్తిగతమైన విరాళాలు యివ్వటమేకాక, స్వయంగా యిల్లిల్లు తిరిగి తిండిపదార్థాలు, డబ్బు విరివిగా సేకరించి బాధితులను ఆదుకున్నారు.

ఆమె తనకున్న విద్య, సంపద, అనుభవం, అవకాశం అన్నీ సంఘ శ్రేయస్సుకోసం, దేశాభ్యుదయం కోసం వెచ్చించుతు 73 ఏళ్ల వయస్సులో 4-8-1965న తన ఆదర్శమూర్తి అయిన శ్రీ కన్యకాపరమేశ్వరి పాదసాన్నిధ్యం చేరుకున్నారు.

---

# శ్రీమతి ఆదుర్తి లక్ష్మీబాయమ్మ

**జననం 12–10–1899**

"అరెరే మీరెందుకమ్మా వచ్చారు. గొప్పకుటుంబములో స్త్రీలు, మీరు స్వయంగా రావాలా? మాటమాత్రం చెపితే మేము కొట్లుకట్టేసేయమా? అమ్మా కుర్చీలో కూర్చోండి. కాఫీ తెప్పించమంటారా? లైంజూసు తీసుకుంటారా'' అంటూ మర్యాదలు చేసేవారు దుకాణదారులు. 'మాకేమీ వద్దుబాబూ మీరు యీ విదేశీబట్టలు అమ్మకండి, కల్లు సారాలుఅమ్మకండి అంతే చాలు. అదే దేశసేవ, మీ ధర్మం' అంటూ వుండగానే దుకాణదారులు తలుపులు మూసి తాళాలు వేయించేవారు. సంతృప్తితో లేచి పక్కకొట్టుకు వెళ్లేవారు. అక్కడా యిదే కథ. ఇంతసులువుగా తమపని సానుకూలం అవుతున్నదని ఆశ్చర్యపడుతు వెనక్కు తిరిగిన వాళ్లకు దుకాణాలు వెనకతలుపులు



శ్రీమతి ఆదుర్తి లక్ష్మీబాయమ్మ

తెరిచి యథేచ్ఛగా విదేశీ బట్టల అమ్మకం, కల్లు, సారాల వ్యాపారం కనిపించేవి. మళ్లీ మొదటికివచ్చి 'నాయనలారా యిది తగదు' అని అంటే తమ వ్యాపారం పోయి నష్టంకలుగుతున్నందుకు దుకాణదారులు చికాకుపడి ఆశీర్వచనాలకు దిగేవారు. ఆదుర్తి లక్ష్మీబాయమ్మగారు 1932 లో బరంపురంలో సత్యాగ్రహం జరిపేరోజుల్లో పరిస్థితులు అట్లావుండేవి. కల్లు, సారాదుకాణాల వేలంపాటలు ఆపి, విసుగు విరామం లేకుండ పికెటింగు జరిపిన కారణంగా అరెస్టయినారు. కొంతశిక్షవేసి కొంతమొత్తం జరిమానావేస్తే ప్రభుత్వానికి డబ్బు ముట్టుతుంది. బాధ్యత తగ్గుతుంది. అందుకని ఆమెకు ఒక సంవత్సరం కఠినశిక్షవేసి, ఐదు వందలు జరిమానా వేశారు. అది చెల్లించకపోతే మరి 6 నెలలు కఠినశిక్ష. ఆ రోజుల్లో సర్వసాధారణంగా మేజస్ట్రేటు శిక్షవిధించుతు మీ పేరేమిటమ్మా అని

అడిగినంత సహజంగా, సులువుగా, మీకీబాధ లెందుకమ్మా, క్షమాపణ వ్రాసి యిస్తే యేగొడవ వుండదుగదా అని వుచితసలహాలిచ్చేవారు. అట్లాగే ఆమెనూ అడిగారు. ఆ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న స్త్రీలలో వెయ్యికి ఒక్కరుకూడ మంచిదని సంతోషించి ఆ సలహాను పాటించేవారుకాదు. ఆమె అసలే ఒప్పుకో లేదు. జరిమానా అంతకుముందే చెల్లించలేదు. అందువల్ల మొత్తం ఒకటిన్నర సంవత్సరం కఠినశిక్ష అనుభవించటానికి రాయవేలూరు జైలుకు వెళ్లారు.

బరంపురంలో వరహాగిరివారు, దిగుమర్తివారు, పేరెన్నికగన్న సంపన్న కుటుంబాలు. 1922లో ఆ వూళ్లో చాలా భారీ యెత్తున ఆంధ్ర మహాజన సభలు, రాష్ట్రీయ సభలు జరిగినవి. వేలకొద్ది జనం వచ్చారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఆవేశపూరితంగ, ఆసక్తికరంగ వుపన్యసించుతున్నారు. అనుకోకుండ కుంభవర్షం కురిసింది. ప్రేక్షకులు ముద్దఅయినారు. కాని వుపన్యాసం అయ్యేవరకు మంత్రంవేసినట్లుగా కదలకుండ కూర్చున్నారు. ఎట్లా సమకూర్చారోగాని వరహాగిరివారు, దిగుమర్తివారు మూటలు మూటలుగా కొత్తబట్టలు తెప్పించి సభికులకు సర ఫరాచేశారు. శ్రీ వరహాగిరి జోగయ్యపంతులు శ్రీమతి వెంకట సుబ్బమ్మల కుమార్తెగా శ్రీమతి లక్ష్మీబాయమ్మ 1899 అక్టోబరు 12న జన్మించారు. బరంపురం ఆమె జన్మస్థలం. జోగయ్య పంతులుగారు 1894 నుంచి జాతీయోద్యమాలలో పాల్గొంటు వుండేవారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యులు. భారతదేశ అధ్యక్షులయిన శ్రీ వి. వి. గిరిగారు ఆమె సోదరుడు. తల్లిగారైన శ్రీమతి వెంకట సుబ్బమ్మ బరంపురంలో ఆంధ్ర మహిళా సమాజం స్థాపించి స్త్రీల అభ్యున్నతికి పాటుపడినవారిలో ఒకరు. గాంధీజీ మొదలు ప్రతి దేశ నాయకుడు దేశసేవకుడు వారి ఆతిథ్యం పొందిన కారణంగా ఆమె చూడనివారు లేరు. ఆమె పెరిగిన వాతావరణం అది. ఆమెకు చిన్నప్పుడే వివాహం జరిగింది. దురదృష్టవశాత్తు చిన్ననాడే వైధవ్యం ప్రాప్తించటం జరిగింది. ఆ రోజుల్లో ఆడపిల్లల చదువుకు బరంపురంలో అట్టే అవకాశాలు లేవు. అందువల్ల ఆమె కాశీలో మెట్రిక్యులేషను ముగించి కలకత్తాలో కాలేజి చదువు కొనసాగించారు.

1920 నుంచే తమ కుటుంబంలోని యితర సభ్యులతో పాటు జాతీయోద్యమంలో పాల్గొనేవారు. గాంధీజీ ఆదేశానుసారం జిల్లాఅంతా పర్యటించి

ప్రచారంచేశారు. ఇంటింటికి తిరిగి ఖాదీ అమ్మకంచేసేవారు. స్వయంగా వడికిన నూలుతో యింట్లో అందరికి బట్టలునేయించేవారు. వడికిననూలు సభ్యత్వ రుసుముగా యిచ్చి చాలాకాలం కాంగ్రెసు మెంబరుగా ఉండేవారు. విదేశ వస్తు, వస్త్రబహిష్కరణ వుద్యమంలో తీవ్రంగ పాల్గొంటు బరంపురంలో 1932 లో అరెస్టుఅయి రాయవేలూరు జైలుకు వెళ్లటం వినిపించిన విషయమే.

ఆ సమయంలో రాయవేలూరు జైలులో శ్రీమతులు మార్గరేట్ కజిన్సు, వేదాంతం కమలాదేవి, ఆచంట రుక్మిణీలక్ష్మీపతి, పొదర్తి సుందరమ్మ అనేక మందివుండేవారు. శ్రీమతి లక్ష్మీబాయి పినతల్లి కుమార్తె అయిన శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మ కూడ ఆమెతోపాటు ఒకటిన్నర సంవత్సరం శిక్ష అనుభవించారు. కఠినశిక్ష పడినవాళ్లు జైల్లో కొన్నిపనులలో పాల్గొనవలసి వుంటుంది. శ్రీమతి లక్షీబాయమ్మ విద్యావతికాబట్టి ఆమెను ఆఫీసులో పని సహాయానికి నియమించారు. కొత్తబియ్యం, కొత్తకుండలలో వండి తినటంవల్ల ఆరంభదశలో అందరు రక్తవిరేచనాలతో బాధపడి నీరసించిపోయినారు. అలవాటులేక రోజుకొకకుండ పగలకొట్టి చివాట్లుతినేవారు. శ్రీమతి మారరేటు కజిన్సు భారతీయ సాంప్రదాయాలు, అలవాట్లు అన్నీ తెలుసుకుంటు, తమ దేశాచారాలు తెలియపరుస్తు వుండేవారు. ఎన్నోపాటలునేర్పి, పాడుతు అందరికి వుత్సాహం కలిగించుతు వుండేవారు. శ్రీమతి లక్ష్మీబాయి నిరాడంబరంగా, నలుగురితో చల్లగా మాట్లాడుతు, జైలులో తోటిఖైదీల పసిపిల్లలకు స్నానాదికాలు చేయించుతు, స్నేహమయిగా పేరు తెచ్చుకున్నారు.

విడుదల అయివచ్చిన తరువాత మరింత పూనికగ జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1930 నుంచి పదిసంవత్సరాలకుపైగా గంజాంజిల్లా కాంగ్రెసు కమిటీకి వైస్‌ప్రసిడెంటుగా, బరంపురం టౌన్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా వున్నారు. తర్వాత ఉత్కల ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ మెంబరుగా వ్యక్తి సత్యాగ్రహంచేసి బరంపురంలో అరెస్టయి కటకం జైలులో ఆరు మాసాలు శిక్ష అనుభవించారు. 1940 లో, 1942 లో క్విట్టిండియా వుద్యమం ప్రబలంగా జరిగింది. ప్రభుత్వబాధ్యతను భారతీయులకు అప్పగించటమేకాక తక్షణం భారతదేశాన్నివదిలి, వచ్చినదోవన పొమ్మని బ్రిటిషువారికి భారతీయులు నిర్మొగమాటంగ యిచ్చిన హెచ్చరిక అది. సత్యాగ్రహోద్యమంలాగ దేశవ్యాప్తంగ జరగటమేకాక అటోయిటో తేల్చుకోవాలన్నంత ఆవేశపూరితంగ

కూడ జరిగిన విప్లవం అది. అది కాంగ్రెసు అనుమతితోనే ఆరంభమయింది. శ్రీమతి లక్ష్మీబాయి యీ క్విట్టిండియా వుద్యమంలో పాల్గొన్నారు. బరంపురంలో అరెస్టయి కటకం జైలులో వున్నారు. 6 మాసాలకాలం శిక్ష ననుభవించారు. ఒరిస్సాలో రాజకీయ స్త్రీ బందీలకు ప్రత్యేకించి కట్టిన జైళ్లులేవు. ఎక్కడ అరెస్టు అయినవారిని అక్కడవుండే జైలులోనే ఒక భాగంలో వుంచేవారు. రాయవేలూరు స్త్రీల చెరసాల పెళ్లి పందిరిలాగ కిటకిటలాడుతు వుంటే-కటకంలో ఆమెవున్న జైళ్లు నాగవల్లి మర్నాడుపెళ్లియిల్లు వున్నట్లువుండేది. ప్రత్యేకించి తెలుసుకోవలసినవి, చెప్పుకోతగ్గ ఘట్టాలు యేమీ లేకపోయినా జైలు సహజ లక్షణాలు మాత్రం నిలబడి వున్నవి. ఉప్పుడు బియ్యం, ఆవనూనె అలవాటులేని కారణంగా ఆమె ఆరోగ్యం చెడిపోయింది. అందులోను రెండవసారి కటకం జైలు శిక్షతో ఆరోగ్యం బాగాశిథిలమయింది. ఆ సమయంలో స్త్రీల నియోజక వర్గం నుంచి అసెంబ్లీకి యెన్నికయిన శ్రీమతి సరళాదేవి, అసెంబ్లీ కాంగ్రెసు వర్గనాయకులు శ్రీ గదాధరదత్తా భార్య శ్రీమతి విమాలాదేవి యింకా ముగ్గురు స్త్రీలు వుండేవారు. శ్రీమతి విమాలాదేవికి చాలాతీవ్రంగ గుండెనొప్పివచ్చింది. లక్ష్మీబాయిగారు పూనుకుని ఆమె వెంటనే విడుదల అయి వెళ్లగలిగేట్లు తోడ్పడ్డారు. శిక్షాకాలం పూర్తయి యెవరిదోవన వారు వెళ్లగా ఆమె వంటరిగా మిగిలిపోయినారు. ఏవ్యాపకంలేక, ఆరోగ్యం అంతకన్నా బాగలేక బాధ పడుతున్న ఆ రోజులలో ఆమెకు చిన్ననాడు నేర్చుకున్న త్యాగరాజకృతులు, తులసీ రామాయణం, ఆదుకున్నవి. రెండున్నర సంవత్సరాలు జైళ్లకువెళ్లి శిక్షలు అనుభవించారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగావున్న ఒరిస్సా 1936లో ప్రత్యేక రాష్ట్రం అయింది. ఆ మరు సంవత్సరం ఎన్నికలు జరిగినవి. ఆమె శాసనసభకు ఎన్నికయినారు. ఆ గడువుతీరిన తరువాత రెండవసారి ఎన్నికలు వచ్చినవి. ఆమెను యే పోటీలేకుండానే యెన్నుకున్నారు. ఆ విధంగా ఆమె యేక బిగిన 12 సంవత్సరాలకుపైగా శాసన సభలో వున్నారు. ఊరికే సభ్యత్వం కాక ఆమె ఏడుసంవత్సరాలు ఒరిస్సా శాసన సభకు డిప్యూటీ స్పీకర్‌గా వుండి ఆంధ్ర మహిళల గౌరవాన్ని పెంపొందించారు. ఏదో అలంకార ప్రాయంగ కాకుండ ఆమె ప్రజోపకరమైన కార్యక్రమాల నెన్నిటినో కార్యరూపంలో పెట్టి హోదాను సార్థకపరుచుకున్నారు. ఉత్తర ఒరిస్సా, దక్షిణ ఒరిస్సాలలో ఒకేవిధంగా పన్నులు విధించాలని, ఒరిస్సారాష్ట్రంలో

స్త్రీ విద్య చాలా వెనకబడివున్నది, కాబట్టి మెట్రిక్యులేషనువరకు ఆడపిల్లలకు వుచితంగా విద్యనేర్పాలని, స్త్రీలకు ప్రత్యేకంగా కాలేజీలు వుండితీరాలని ప్రతిపాదనలు చేశారు. ఆడపిల్లల స్కూళ్లలో పనిచేసే హెడ్‌మిస్ట్రెసులకు తప్పనిసరిగా స్కూలువారు వసతి సౌకర్యాలు కలిగించాలని, ప్రభుత్వోద్యోగులు బదిలీఅయివెళ్తే మధ్యలో ఆడపిల్లల చదువు వ్యర్థమైపోకుండా వాళ్లచదువు కొనసాగించటానికి అనువుగా హాస్టళ్లు అనేకం నిర్వహించాలని సూచించారు. ఒరిస్సా రాష్ట్రంలో కొంత ఆంధ్రభాగం చేర్చినందువల్ల అక్కడి ఆంధ్రులు తమవారికి తమగడ్డకు దూరమైపోతారు. కాబట్టి వారికి మరిన్ని సదుపాయాలు కల్పించవలసిన అగత్యం వున్నదనికూడ అన్నారు. ఆమె అసెంబ్లీలో వున్న సమయంలోనే పూరీ సమీపానగల డెలాంగ్ గ్రామంలో, గాంధీ సేవాసంఘం సమావేశాలు కాంగ్రెసు సభలను మించిన బ్రహ్మాండమయిన సభలు మూడు రోజులపాటు శ్రీ గోపబంధు చౌదరీగారి ప్రోద్బలంతో జరిగినవి. గాంధీజీ, నెహ్రూలతోపాటు ప్రతిఒక్క దేశనాయకుడు అందులో పాల్గొని యెన్నో అభ్యుదయకరమైన విషయాలను చర్చించారు. ఆమె రెండవసారి శాసనసభలో వున్న సమయంలోనే కటకం బదులు భువనేశ్వరాన్ని ఒరిస్సా రాజధాని చేయటానికి, హీరాకుడ్ ఆనకట్ట కట్టటానికి బిల్లులు ఆమోదించబడి శ్రీ నెహ్రూ పండితుడు ఆనకట్టకు ప్రారంభోత్సవం చేయటం జరిగింది.

అందువల్ల ఆమెకు శాసన ధిక్కారం చేయటం, శాసనాలు ఆమోదించటం మాత్రమే యిష్టమని అపోహ పడకూడదు. ఆమెకు భగవంతుడిపట్ల భక్తి, గృహకృత్యాలపట్ల శ్రద్ధ, మానవసేవపట్ల తత్పరత అధికం. పరిపూర్ణ మానవజీవితానికి యివన్నీ ముఖ్యాంగాలని ఆమెభావన. ఎవరికి యే అవసరం వచ్చి నిస్సహాయంగ కనిపించితే వారికి అక్కడ నిస్సందేహంగ చేయూత నివ్వటం ఆమెకు అలవాటు. అందువల్లనే ప్రభుత్వ నిషేధానికి సందేహించకుండ ఆమె 1936 లో కుళదాలో జరిగిన గంజాం కర్షక సమావేశానికి అధ్యక్షత వహించి సహనంతో ఆదుకున్నారు.

ఇక సంఘసంక్షేమ కార్యకలాపాలు అసంఖ్యాకం. వేవెల్ బాలాశ్రమం, రెడ్‌క్రాసు సంఘం, కేంద్ర సంఘ సంక్షేమ సమితివారి ఒరిస్సా రాష్ట్ర శాఖ, ఆంధ్ర మహిళా సమాజం, ప్రభుత్వ బాలికా వున్నత పాఠశాల కార్యనిర్వాహక వర్గంవంటి అనేక కమిటీలలో ఆమె ముఖ్యపాత్ర వహించుతు వుంటారు.

సాంఘికంగా అడుగున మిగిలిపోయినవారి అభ్యున్నతికోసం పాటుపడుతున్న వారికి ఆత్మధృతి కలిగించటానికి యేర్పడిన పతితపావన మిషన్‌లోను, రకరకాల కారణాలవల్ల అనాథలు అనదలయిన స్త్రీలకు చేయూతనిస్తున్న నారీ మంగళ సమితి వంటివి ఆమెకు అత్యంత ప్రీతికరమైనవి.

60 వ సంవత్సరంలో యీనాటికీ తోటివారికోసం తపనపడే ఆదుర్తి లక్ష్మీబాయిగారికి ప్రభుత్వం తామ్రపత్రం యిచ్చి గౌరవించినా సేవా సంస్థలు ఘనసన్మానాలు చేసినా వింతలేదు.

# శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మ

**జననం 1896** **మరణం 7-3-1965**

"మనకు యిక్కడ స్కైముప్రకారం పనులన్నీ అయిపోతున్నయ్. తరువాత యింకే వ్యాపకం వుండటంలేదు. పోనీ హిందీ పాఠాలు మొదలు పెడదామా" అన్నారు కృష్ణవేణమ్మ గారు. ఆ మాట వినగానే ప్రాణాలు లేచి వచ్చినట్లయింది చాలామందికి. నేర్చుకుంటాం. ఇవాళే మొదలుపెట్టండి అంటూ ఆమెను సమీపించారు వుత్సాహంగా. ఆమె దగ్గర పలకలు బలపాలు గాని, పెన్సిళ్లు పేపర్లుగాని వారికి కనిపించ లేదు. తమదగ్గర అసలేవుండవు. ఇంతకు యీ చదువు సాగేదెట్లా? వాళ్ల వుత్సాహం ఆవిరి అయిపోయింది. వ్రాసుకోవటానికి యేమి లేవుగదా యెట్లాగండిమరి అన్నారు



శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మ

కొందరు. లేకపోవట మేమిటట్లా. బళ్లకొద్ది ఇసుక యిక్కడ పోసివున్నది చూడండి. పూర్వం వీధిబళ్లలోలాగ గుంట ఓనమాలు దిద్దుకుందాం అని నవ్వారు. ఆమె స్వచ్ఛమైన నవ్వులో వాళ్లకు నిజాయితీ కనిపించింది. వెంటనే తామూ నవ్వుకుంటూ వెళ్లి తలాయింత యిసుకతెచ్చి వరండాలో పోసుకుని అక్షరాభ్యాసానికి కూర్చున్నారు. ఏ అడ్డపనులులేకుండా కూర్చుని శ్రద్ధగా చదువుకోవటాన త్వరత్వరగానే చదువురాసాగింది. ఈ వింతబడికథ అందరికి యిట్టేతెలిసిపోయింది. విశ్వదాత బిరుదాంకితులైన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వెంటనే పలకలు, బలపాలు, హిందీ బాలబోధిని పుస్తకాలు, ఒకటవ, రెండవ, మూడవ వాచక పుస్తకాలు, సూదులు దారాలు గంపెడు సరఫరా చేశారు. ఆ గురుశిష్యుల ఆనందానికి అంతులేదు. ఇదంతా యే కుగ్రామం వీధిబడిలోనో జరిగినకథ కాదు. 1932వ సంవత్సరం రాయ

వేలూరు జైలు "సి" క్లాసు స్త్రీల వార్డులో జరిగిన యధార్థ విషయం. అది బాగులేదు యిది బాగులేదని పేచీలు పెట్టకుండ ప్రశాంతంగ చదువుకుంటున్నారు. అంతేచాలని జైలు అధికారులు సంతోషించి అడ్డుచెప్పలేదు. ఆ హిందీ క్లాసులు నిర్విఘ్నంగ జరిగినవి.

ఏ క్లాసు, బి క్లాసు ఖైదీలు సాయంత్రంవేళ భోజనాలయిన తరువాత ఒకసారి ఆవరణలోపల షికారు తిరిగి రావటానికి అనుమతించుతారు. వాళ్లు అట్లా సి క్లాసు వార్డు ముందునుంచి వెళ్తువెళ్తు చిన్న పొట్లాలో మూటలో జారవిడిచి వెళ్లేవారు. శ్రీమతి కృష్ణవేణమ్మగారు ఆ పొట్లాలు విప్పి అందులో వున్నకొబ్బరి పచ్చడో కంది పచ్చడో జాగ్రత్తగా దాచేవారు. మర్నాడు తలా గోలికాయంతవేస్తే దానినే అమృతంలాగ భావించి తినేవారు సి క్లాసు ఖైదీలు. ఏ క్లాసు బి క్లాసువారికి స్వేచ్ఛాకొరత తప్ప వేరేకొరతలు వుండవు. కాని సి క్లాసు వారికి అన్నీకరువే. అసంతృప్తే. కృష్ణవేణమ్మగారు వాళ్లందరికి యింట్లో పెద్ద దిక్కుమాదిరి వున్నంతలో సంరక్షణ చేస్తు అనవసర ఉద్రేకాలకు, ఆవేశాలకు లోనుగాకుండ వాళ్లను తగిన వ్యాపకాలలో పెడుతు వుండేవారు.

ఒక నెలగడిచింది. ఉన్నట్లుండి ఒక రోజున ఆమె కుమార్తె శ్రీమతి దుర్గాబాయి ఆ జైలు వార్డులోకే వచ్చారు. జైల్లో శిక్ష అనుభవించటానికి వచ్చిన బిడ్డను చూసి సంతోషించాలో బాధపడాలో తెలియలేదా మాతృమూర్తికి. కనీసం బిడ్డ యోగక్షేమాలయినా తెలుస్తు వుంటవని ఒకవిధంగా తృప్తిచెందారు ఆమె. కాని ఆమె కాతృప్తిఅట్టే రోజులు నిలవలేదు. ప్రశాంతంగ చల్లగా ప్రవహించే సెలయేరు తల్లి. మహోజ్వలవేగంతో యెత్తిపోతలతో ఉద్ధృతంగా ప్రవహించే ప్రవాహం బిడ్డ. ఇచ్చిన ఏ క్లాసు తిరస్కరించి సీ క్లాసు స్వీకరించారామె. అప్పుడే ఆమెను ప్రమాదకరమైన విప్లవ వాదిగా అధికారులు అంచనా వేశారు. అందులోను యిది రెండవసారి జైలుకు రావటం. జైలు అధికారుల పరిభాషలో తెలిసినేరం చేసిన దోషిఅన్నమాట. ఇవన్నీచాలనట్లు అక్కడికి చేరుకున్న కొద్దిరోజులకే ఆమె డెభ్భై, ఎనభైమందిని ఒక్కహాలులో బంధించి వుంచటం రూల్సా, రెగ్యులేషన్సా, మానవత్వమా అని అధికారులను నిలవేశారు. దాంతో వాళ్ల గుట్టు చప్పుడుగా ఒకనాడు ఆమెను మధుర జైలుకు పంపించివేశారు. కృష్ణవేణమ్మగారికిది చాలా ఆందోళన కలిగించింది. అయినా ఆమె నిందుకుండ. ఎవరిని దూషించలేదు.

ఆమెవి చారెడేసి పెడదకన్నులు. మనసుకు ఎక్కువ బాధతోచినప్పుడు ఆ కళ్లలో నీటిపొరయేర్పడుతుంది తప్ప పరుషవాక్యాలు రావు. కూతురు ఏ అగచాట్లు పడుతున్నదో అన్న బాధను దాచేసుకుంటు, చుట్టూవున్న వారి యోగక్షేమాల కుపక్రమించారు. వారికి సత్కాలక్షేపం కలిగించటంలో లీనమైపోయేవారు. ఇట్లా మూడునెలలు జరిగేటప్పటికి ఆమెను మరికొంత మందిని రాయవేలూరు నుంచి కన్ననూరు జైలుకు మార్చారు. శ్రీమతులు వాసిరెడ్డి హనుమాయమ్మ, తట్టా వెంకటనరసమ్మ, కొత్తపల్లి సరళాదేవిగార్లు ఆ సమయంలో ఆమెతో పాటు జైలులో వున్న అసంఖ్యాకులలో కొంతమంది. కన్ననూరులో కూడ ఆమె తన ప్రోగ్రాము మార్చుకోలేదు. మరింత విస్తృతపరుచుకున్నారు. ఈసారి రాజకీయ స్త్రీబంధితులకే కాకుండ, యితరనేరాలుచేసి జైలు శిక్ష అనుభవించుతున్న స్త్రీలకు కూడ అధికారుల ఆమోదంతో ఆమె హిందీ పాఠాలు నేర్పనారంభించారు.

రాజమండ్రిలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారి మిత్రుడు, సంస్కార కార్యకలాపాలలో ఆయనకు కుడిభుజం అయిన శ్రీ గుమ్మిడిదల మనోహరం పంతులుగారు పోలీసు సూపరింటెండెంటుగా వుండేవారు. ఆ రోజులలో ఆ హోదాను అలంకరించిన తొలి ఆంధ్రుడు ఆయన. శ్రీ మనోహరం పంతులు శ్రీమతి లక్ష్మీబాయమ్మలకు — నలుగురు అబ్బాయిలమధ్య పుట్టిన ఒక్కగా నొక్క కూతురు కృష్ణవేణమ్మగారు. ఆమె పోణంగిపల్లిలో 1896 లో జన్మించారు. సుప్రసిద్ధ వైణికులయిన శ్రీ ఈమని అచ్యుత రామశాస్త్రిగారి దగ్గర వీణ నేర్చుకున్నారు. సాహిత్యంలో పాండిత్యం సంపాదించుకున్నారు. శ్రీ బెస్నూరి రామారావుగారితో వివాహమయి కాకినాడ వాస్తవ్యులయినారు. చిన్నతనంలోనే కుమార్తె శ్రీమతి దుర్గాబాయి, మరిరెండు సంవత్సరాలకు కుమారుడు శ్రీ నారాయణరావు జన్మించారు. వారియిల్లు యెప్పుడు సంగీతసాహిత్య గోష్ఠులతో కలకలలాడుతువుండేది. దంపతులిద్దరు సంఘ జీవులు. గృహిణిగా ఆమెకు యెన్ని బాధ్యతలు, పనులువున్నా తీరిక కలిగించుకుని యిరుగుపొరుగు స్త్రీలతో కలిసి కుట్లు, అల్లికలు నేర్పుతు, నేర్చుకుంటు, కథలు కావ్యాలు వినిపించుతు, పాటలుపాడుకుంటు, నేర్పుతువుండేవారు. అప్పట్లో కాకినాడలో ప్రసిద్ధిగాంచిన సరస్వతి గాన నిలయంలో నిర్వాహణతో యెక్కువ సంబంధం వుండేది.

1920 ప్రాంతాలలో గాంధీజీ రాజమండ్రి వచ్చినప్పుడు 11 ఏళ్లకుమార్తె బంగారుగాజులు మహాత్ముడికి కానుకయిచ్చినా విదేశీబట్టలన్నీ పరశురామప్రీతి

చేసినా ఆమె వద్దనలేదు. మంచివిషయాలు చిన్నవాళ్లుచెప్పినా ఆమోదించటానికి ఆమె సందేహించరు. పైగా సహకరించుతారు. అంతటి సహనం, వినయసంపద ఆమెలో జీర్ణించి వున్నవి. ఆమెస్వయంగా ఖాదీ ధరించటమేకాక, యింటింటికి తిరిగి ఖాదీఅమ్మకంచేసి ప్రచారంచేశారు. కాకినాడ కాంగ్రెసు స్త్రీల విభాగానికి చాలాకాలం కార్యదర్శిగావున్నారు. కొంతకాలం కోశాధ్యక్షతకూడ వహించారు. అమ్మాయి మామూలు చదువులబడి మానివేసి, పన్నెండేళ్లవయసులో హిందీ, కుట్లు, అల్లికలు, నూలువడకటం, చేతిపనులతో స్కూలును స్థాపించుతానంటే చెప్పలేనంతగా సహకరించారు. సంస్థానిర్వహణకు ఆనాడు తల్లియిచ్చిన ప్రోత్సాహం, సహకారం, తర్ఫీదులే శ్రీమతి దుర్గాబాయిలో ఘనీభవించివున్న నిర్వహణాశక్తిని ఒక క్రమపద్ధతిలో పెట్టటానికి కారణం అయింది. కృష్ణవేణమ్మగారికి విద్యా విజ్ఞానతృష్ణ అధికం. 12 ఏళ్ల కూతురు స్థాపించిన బాలికా పాఠశాలలో విద్యార్థినిగాచేరి హిందీనేర్చుకోవటమేకాక వుత్సాహంతో పరీక్షలుకూడ వ్రాసి నెగ్గారు. నేను హిందీ ప్రవీణ పరీక్ష ముగించేనాటికి నాకు మనుమరాలు పుట్టింది అని ఎన్నోసార్లుచెప్పి నవ్వేవారు. ఆ హిందీ చదువు, నూలు వడకటం, ఖాదీ అమ్మకం, అన్నీ గాంధీమహాత్ముడి ఆదేశమే ఆమె భావనలో.

1930 లో ఉప్పు సత్యాగ్రహం వెల్లువలాగ దేశమంతట వ్యాపించింది. వాడవాడన అదేఘోష. గుండెగుండెలోను అదేభాష. భర్త చనిపోవటం, ఆర్థిక పేచీలు ఆమెను చికాకు పరుస్తున్నవి. అయినా అకుంఠిత విశ్వాసంతో ఖాదీఅమ్మకం, హిందీ నేర్పటం చేస్తునేవున్నారు. ఇంతలో కుమార్తె వెళ్లి మద్రాసులో ప్రముఖపాత్ర వహించి, ఉప్పు సత్యాగ్రహోద్యమంలో శిబిరం నడిపి, లాఠీదెబ్బలుతిని, ఉప్పు వండి చివరకు అరెస్టయి రాయవేలూరుజైలుకు వెళ్లారు. కృష్ణవేణమ్మగారు కుటుంబాన్ని దిద్దుకోవటమే కాక బాలికా హిందీ పాఠశాలను అతిదక్షతతోనడిపి కంటికి రెప్పలాగ కాపాడుకున్నారు.

ఇంతలో 1932లో సత్యాగ్రహోద్యమం రెండవకెరటం విరుచుకు పడింది. 1920 ప్రాంతాలలో చేసిన ఖాదీ అమ్మకమే 1930 నుంచీ నిర్విరామంగా ఆమెసాగించారు. అదేపెద్దకారణమయింది ప్రభుత్వానికి. దాంతో 1932 జనవరిలో ఆమెను అరెస్టుచేశారు. మండుటెండలో సబ్‌జైలుకు నడిపించుకునివెళ్లారు. కొద్దిరోజులు అక్కడ వుంచిన పిదప ఆరునెలలు శిక్ష విధించి 'సి' క్లాసుయిచ్చి రాయవేలూరు జైలులో వుంచారు. జైలుశిక్ష

అనుభవించుతు హిందీప్రచారంచేయటం కథ వినిపించినదే. జైలులో అనేక మంది నూలువడికారు. కుట్లు అల్లికలు నేర్చుకున్నారు. పుస్తకాలు చదివారు. వ్రాశారుకాని అక్కడా ఆచార్యపీఠమే వహించి మహిళలకు హిందీనేర్పుతు సత్కాలక్షేపం చేయించటమేకాక పరీక్షలకు కూడ కట్టించి ప్రయోజనం సాధించారు ఆమె.

1934 లో కుమారుడి చదువురీత్యా ఆమె పాతికేళ్లకుపైగా గడిపిన కాకినాడను వదిలి రాజమండ్రి రావలసివచ్చింది. అందులో వింతలేదు. కాని బాలికా హిందీ పాఠశాలను, భవనాలు, పరికరాలు, వస్తు సముదాయంతో సమూలంగా బ్రిటిష్ ప్రభుత్వం కబళించివేసింది. రకరకాల ఆర్థిక చిక్కులు వచ్చిపడినవి. ఉన్నవూరు విడిచివచ్చినందుకు మానసికంగా బాలావ్యథపడినా ఆమె యే బంధుమిత్రులను ఆశ్రయించలేదు. నేషనల్ గరల్స్ స్కూల్లో హిందీ టీచరుగా కుదిరారు. కుటుంబాన్ని ఆదుకుని ఆత్మాభిమానాన్ని మరింత పైస్థాయికి చేర్చారు. ఆనాడూ ఆమె తమయింట్లోను, సమీపానవున్న భవకేశ్వరంలోను హిందీ క్లాసులు నడుపుతూనేవున్నారు. ఇరుగుపొరుగు స్త్రీలను తమయింటచేర్చి కుట్లు, అల్లికలు, పాటలు, పద్యాలు నేర్పుతు ఎప్పుడు సంతోషంగ, తృప్తిగ కాలక్షేపంచేసేవారు. ఇక కాంగ్రెసుతో సంబంధమున్న పెద్దలు వచ్చేవారు వస్తూవుంటే, వెళ్లేవారు వెళ్తువుండేవారు. కన్నీరన్నది కేవలం ఆర్తులు, అనదలకోనం వెచ్చించవలసిన అమూల్య పదార్థమని ఆమె అభిప్రాయం. అందువల్ల ఎటువంటి పరిస్థితులలోను తనపై తాను జాలిపడలేదు. ఇతరులను నిందించలేదు. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగారు.

1937 లో కొడుకు వుద్యోగరీత్యా, ఆమె అన్నివిధాల సంతృప్తిగా మద్రాసు వచ్చారు. కాని అక్కడ నిర్వ్యాపకంగా కూర్చోలేదు. సేవా సదనం స్కూలులో హిందీ, తెలుగు బోధించేవారు. అప్పట్లో దుర్గాబాయమ్మగారు ఆనర్సు చదువుతు విశాఖపట్నంలో వుండేవారు. కృష్ణవేణమ్మగారు తాము మైలాపూరులో అద్దెకున్న కొత్తయింటిముందు యినుక కుప్పలతో ఆడుకుంటున్న చిన్నపిల్లలందరిని పిలిచి వాళ్లకు కథలు చెపుతు, పాటలు, పద్యాలు నేర్పుతు వుండేవారు. వాళ్లందరు ఆమెను అమ్మమ్మగారు అనిపిలుస్తూ ఎంతోఉత్సాహంగా రోజుసాయంత్రం ఆమెదగ్గరకు వచ్చేవారు. ఆనాటినుంచే ఆమె అసలుపేరు మరుగుపడి అమ్మమ్మగారుగా స్థిరపడిపోయినారు. ఆ పిల్లలే

బాలానందంగా రూపొందిన మద్రాసు రేడియోవారి పిల్లల ప్రోగ్రాములు ఆరంభమైనవి. వింతచూడటానికి కాలక్షేపానికి పిల్లలవెంట తల్లులు అక్కలు వచ్చేవారు. ఆమె అలవాటుప్రకారం వాళ్లందరికి హిందీ బోధించేవారు. స్కూలు వుద్యోగం, గృహకృత్యాలు వున్నా మళ్లీ సాయంత్రవేళల బాలల ఆట పాటలు, పెద్దల హిందీబోధన వుంటేనేకాని ఆమెకు తోచేదికాదు. 1938 లో ఆంధ్ర మహిళాసభ ఏర్పడినప్పటినుంచి అక్కడ తెలుగు, హిందీ బోధించేవారు. ఆమెకు బోధన ఒకవృత్తి కాదు. పుటకతో వచ్చిన అద్భుతకళ. ఆమె ఎవరిని కోప్పడేవారుకాదు కించపరచేవారు కాదు. వాళ్ళకు ప్రోత్సాహం యిస్తు ధైర్యంచెబుతు చెయ్యిపట్టుకుని అవగాహనతో పైమెట్టు యెక్కించేవారు. విద్యార్థినులు అమ్మమ్మగారు నాకు పద్యం రావటం లేదండి అంటే ఫరవాలేదమ్మా మిగతావాళ్లందరు అప్పచెప్పేటప్పటికి నీకు అదేవస్తుంది అనేవారు. ఆమెదగ్గర గజేంద్ర మోక్షం చదివిన నాకు దైవభక్తి తెలుగు సాహిత్యంలో అభిరుచికూడ యెక్కువైనదని మరొకరంటారు. చివరకు హైదరాబాదులో, ఢిల్లీలోకూడ ఆంధ్ర మహిళాసభ కార్యకలాపాలు ఆమె పాఠాలతోనే ఆరంభమైనవి.

ఆమెకు మనిషిలో నమ్మకము ఎక్కువ. ఎవరిని అనుమానించరు. మహిళాసభలో ప్రతిఒక్కరు ఆమెకు యింట్లో సభ్యులమాదిరే తోచేవారు. మనం యిలాచేద్దాం మనం అలాచేద్దాం అంటు అహర్నిశలు చిన్న, పెద్ద, ధనిక, బీద, విద్యావిహీనులు, విద్యావంతులు అనే తారతమ్యం లేకుండ ఒక తీరుగా కూడగట్టుకుని పిల్లలకోడిలాగా తిరిగేవారు. ఆమె విగ్రహమెంత గంభీరమో, మనసు అంత చల్లన. మాట అంత తీయన. ఎంతకొత్తవాళ్లయినా ఆమె మాట్లాడేతీరు, చూపే ఆప్యాయతకు ఆమెను గౌరవించకుండ, ప్రేమించకుండ వుండలేకపోయేవారు. ఇతరుల కష్టసుఖాలు విచారించటం, ధైర్యంచెప్పి ఆదుకోవటమే ఆమెస్వభావం. ఆమెలేకపోతే మద్రాసు ఆంధ్ర మహిళాసభ వుండివుండేదికాదు. ఐనా ఆమె యే ఫోటోలో వుండరు. యే వేదికమీద కనిపించరు. యే గంభీర భీకరోపన్యాసాలు యివ్వరు. ఇది నాకొందు అని భావించే కార్యకర్తలు సభకు అవసరమని యెప్పుడు అనేవారు. ఆమెమాటలు వంటజీర్ణించి ఆనాడు యెంతమందో కార్యకర్తలు, సేవాతత్పరలు తయారయినారు. ఈ ఆనందమయి 1965 మార్చి ఏడవతేది స్నానంచేసి భక్తిరంజని వింటు పూలమొక్కలమధ్య అనుకోకుండా సునాయాసంగ కన్నుమూశారు.

# శ్రీమతి ఉప్పల మెల్లీ (షోలింగరు) లక్ష్మణరావు

**జననం 3-3-1898** **మరణం 27-7-1965**

"విజయమో వీరస్వర్గమో అంతుతేలాలి. శాంతి సమరంలో ఇది ఆఖరు ఘట్టం. బ్రిటిష్ సామ్రాజ్యవాదులారా భారతదేశాన్ని వదలివెళ్లిపొండి. క్విట్టిండియా" అని 1942 క్విట్టిండియా కాలంలో ఒక వీరనారి సివంగివలె గర్జించుతూ ఉండేది. గట్టివరస శరీరంతో, తేజోవంతమైన ముఖంతో ఖాదీ నిక్కరు, చొక్కా ధరించి ఒక యూరోపియన్ వనిత ఈ నినాదాలు ఇవ్వటం వినిన పౌరులు గూరువారు క్షణకాలం బిత్తరపోయి చూసేవారు. ఆమె శ్రీమతి మెల్లీ షోలింగరు. సరిగ్గా చెప్పాలంటే ఆంధ్రుల అభిమానం సంపూర్ణంగా పొందిన తెలుగింటికోడలు శ్రీమతి ఉప్పల మెల్లీ షోలింగరు లక్ష్మణరావు. ఆమె వుద్రేకం గమనించిన బ్రిటిష్ ప్రభుత్వం ఎందుకయినా మంచి



శ్రీమతి ఉప్పల మెల్లీ షోలింగర్

దని 1942 సెప్టెంబరులోనే అరెస్టుచేశారు. ఆ ఊళ్లోనే తాలూకా ఆఫీస్ సబ్ జైలులో రెండునెలలపాటు రిమాండులో ఉంచారు. అక్కడ ఒక్క సదుపాయం లేకపోగా స్త్రీ ఖైదీలకు కనీసపు అవసరాలు అయిన మరుగుదొడ్లు, స్నానాల గదులుకూడాలేవు. ఎందరెందరో విన్నవించుకున్నారు. బ్రతిమలాడుకున్నారు, విసుక్కున్నారు. ప్రయోజనం లేకపోయింది. ఇక ఇదిమార్గం కాదని శ్రీమతి మెల్లీ నిరశనవ్రతం పూనారు. పచ్చి మంచినీళ్లు ముట్టకుండా వారం గడిచింది. ఆమె ఆరోగ్యం క్షీణించింది. చాలా నీరస స్థితిలో ఉన్నారు. శక్తి కూడతీసుకుని "క్విట్టిండియా" అని ఉచ్చరించుతునే ఉన్నారు. జైలు అధికారులకు కొంచెం జంకు కలిగింది. ఆమె కోరికప్రకారం జైలులో స్త్రీ ఖైదీలకు కనీసపు సదుపాయాలు కల్పించారు. ఆమె కేసు విచారణచేసి ఒకటిన్నర సంవత్సరాలు కఠినశిక్ష వేశారు. "సి" క్లాసు ఇచ్చి రాయవేలూరు పంపారు.

రాయవేలూరు జైలుకు వెళ్లటం ఆమెకది మొదటిసారికాదు, రెండవ సారికాదు, మూడవసారి. అందుకనే కసితీర ఆమెకు శిక్ష ఘాటుగా వేశారు. ఆ నిరశనవ్రతం సందర్భంలో క్షీణించిన ఆరోగ్యం ఆమె తిరిగి కోలుకోనేలేదు.

ఆమె 1898 వ సంవత్సరం మార్చి మూడవ తేదీన స్విట్జర్లాండు ముఖ్యపట్టణమైన జూరిచ్‌లో జన్మించారు. శ్రీ అథల్ఫ్, శ్రీమతి బెర్తా షోలింగరు లకు కుమారులు ఉన్నారుగాని కూతురు ఈమె ఒకరే కావటాన మక్కువతో చదివించారు. హోంసైన్స్‌లో పట్టభద్రురాలు అయింది. మెడికల్ కాలేజీకి పంపించారు. రెండు సంవత్సరాలు చదువు ముగిసింది. ఇంతలో మొదటి ప్రపంచయుద్ధ కారణంగా తండ్రి ఆస్థి అంతా విధ్వంసమై ఆమె చదువు నిలిపివేశారు. తండ్రికి వ్యాపార నిర్వహణలో సాయపడుతూ ఉండేవారు. వ్యాపారరీత్యా దక్షిణ జర్మనీలోఉన్న ట్యూబెన్‌గెన్ నగరంలోవున్న మిత్రులను కలుసుకోవటానికి వెళ్లవలసివచ్చేది. ఆ సమయంలో అక్కడ డాక్టరేటుకు చదువుతున్న శ్రీ ఉప్పల లక్ష్మణరావును కలుసుకోవటం తటస్థించింది. ఆమె మాతృభాష జర్మన్. అప్పటికే ఆమె జర్మన్‌భాషలో సుప్రసిద్ధ ఇండాలజిస్ట్ శ్రీ ఓల్డెన్‌బర్గు పండితుడు వేదాలను గురించి, బౌద్ధమతాన్ని గురించి వ్రాసిన గ్రంధాలను చదివారు. నోబెల్ బహుమతి గ్రహీత ప్రఖ్యాత రచయిత శ్రీ హెర్‌మన్ హెస్సే హిందూ దేశాన్ని గురించి, సింహళ దేశాన్ని గురించి వ్రాసిన పుస్తకాలు చదివారు. మనదేశంపట్ల సంస్కృతిపట్ల ఎంతో అభిమానం, సద్భావము కలిగినవి. అందువల్ల శ్రీ లక్ష్మణరావు పట్ల గౌరవము, స్నేహము ఏర్పడినవి. అప్పటికే భారత దేశ రాజకీయాలలో గాంధీయుగం ఆరంభమయింది. ఆమెకు సోషలిజం పట్ల ప్రపంచ కార్మికోద్యమంపట్ల అంతకు పూర్వంనుంచే అభిమానం ఉండేది. అందువల్ల భారతదేశంలో బ్రిటిష్‌వారి దమన నీతిని, హింసాకాండను ఏవగించుకుంటూ భారతదేశస్వాతంత్ర్యోద్యమంపట్ల సహానుభూతి కనపరచే వారు. మిత్రులైన శ్రీ లక్ష్మణరావు గారి ద్వారా మత, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలను సవిస్తరంగా తెలుసుకుంటూ ఉండేవారు. పర్యవసానంగా హిందూదేశం చూసితీరాలన్న కోరిక కలిగింది.

వస్తుతః ఆమెకు సాంఘిక చైతన్యం ఎక్కువ. తమదేశంలో స్త్రీలకు వోటింగు హక్కులేదని, ఆమెచదువుకునే రోజులలోనే ఆవిషయమై తీవ్ర

ప్రచారంచేశారు. 1923, 1924 ప్రాంతాలలో స్విట్జర్‌లెండు దేశంలోని పెట్టుబడిదార్లు కార్మికుల పనిచేసేకాలం ఎనిమిదినుంచి పదిగంటలకు మార్చి నప్పుడుకూడా, ఈమె శ్రమజీవులపట్ల సానుభూతితో దేశవ్యాప్తంగా కొత్త విధానాన్ని నిరసించుతూ ప్రజాభిప్రాయం సేకరించి, న్యాయరక్షణకు తోడ్పడ్డారు. అందువల్ల ఆమెకు రోజురోజుకు హిందూదేశం పట్ల అభిమానం, బ్రిటిష్ సామ్రాజ్యవాదులపట్ల ద్వేషం హెచ్చుసాగినవి. బ్రిటిష్ ప్రభుత్వం రెండుసార్లు ఆమెకు ఈ దేశం రావటానికి అనుమతి ఇవ్వలేదు. చివరకు తంత్రివ్యాపారం పేరుతో ప్రభుత్వానికి అనుమతించక తప్పలేదు. అందువల్ల 1929లో మనదేశం రావటానికి అవకాశం కలిగింది.

ఆమె ఆశ్చర్యానికి నిరాశకు అంతులేదు. పుస్తకాలలో చదివిన ప్రాచీన సంస్కృతి వైభవం ఔన్నత్యం కంచుకాగడావేసి వెతికినా కనిపించటం లేదు. జాతి నిప్పచ్చగా నిర్వీర్యమై పేదరికంతో వెలవెలబోతున్నది. ఇదంతా దురాశాపరులు, దురాగతులు అయిన బ్రిటిష్‌వారి ఘాతుకచర్యగా ఆమెకు మనస్సులో రూఢి అయింది. ఎట్లాగయినా భారతీయుల స్వాతంత్ర్యోద్యమం సఫలం అయేటట్లు తోడ్పడాలని, లోతుకుపోయి యదార్థ పరిస్థితులు గ్రహించాలని నిశ్చయించుకున్నారు. ఏదైనా ప్రజాఉద్యమం అయినప్పుడు త్వరలో ఫలవంతం అవుతుంది. అందువల్ల సామాన్య గ్రామీణప్రజలలో జాగృతి ఎట్లా ఉన్నదో తెలుసుకోవటానికి ఆంధ్ర, ఒరిస్సా ప్రాంతాలలోని అనేక గ్రామాలకు ఆమె స్వయంగావెళ్లి పరిశీలించారు. ఆ సందర్భంలోనే రాజమండ్రిలోని దామెర్లవారు, బరంపురంలోని దిగుమర్తివారు, వరహాగిరివారువంటి దేశాభిమానం గలిగి జాతీయోద్యమముతో సంబంధంగల పెద్దకుటుంబాలతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. శాకాహారి అయిన ఆమెను యే వ్యత్యాసము కనబరచకుండా ఈ కుటుంబాలవారు ఆప్యాయతతో తమమధ్యకు ఆహ్వానించారు. వారందరూ ఖాదీధరించటం చూసిన ఆమె తాను ఖాదీధరించడం ఆరంభించారు. చివరకు జీవితాంతం పాటించారు.

దిగుమర్తి రామస్వామిగారి కుటుంబంతోపాటు ఆమె 1929 లో లాహోరు కాంగ్రెసుకు హాజరైనారు. సామాన్య ప్రజలను కలుసుకోవాలన్న కోరికతో మూడవతరగతిలో ప్రయాణాలుచేస్తూ మామూలు సత్రాలు, ధర్మశాలల్లో ఉంటూ అనేక ప్రదేశాలను చూసి, లాహోరు చేరుకున్నారు. మొదటి

సారిగా గాంధీమహాత్ముడిని, నెహ్రూ పండితుడిని చూసి పరవశులైనారు. కాంగ్రెసు ప్రతినిధులందరితోపాటు డిశంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గం॥లకు రావీనది ఒడ్డున సంపూర్ణ స్వరాజ్య సాధనకు ఆమెకూడా దీక్ష తీసుకున్నారు. ఆనాటినుంచి మహాశ్రద్ధతో ఆ దీక్షను పాటించారు. ప్రతి కాంగ్రెసు ఉద్యమం లోను పాల్గొన్నారు.

మహాత్ముని దండీయాత్ర, ఉప్పు సత్యాగ్రహం దేశాన్ని ఒక్కఊపు ఊపింది. ఆ ఉత్సాహంలో ఆమె తలమునకలైనారు. తనదాదేశంకాదు, తనదాభాషకాదు అన్న భావనే ఆమెకులేదు. ఖాదీ ధరించి ఆంధ్ర మహిళలతో సరిసమానంగా ఉద్యమంలో పాల్గొన్నారు. విజయవాడలో శ్రీమతులు పాదర్తి సుందరమ్మ, శ్రీ పెరంబుదూరు సుభద్రమ్మలవంటి పురస్త్రీలతో కలసి బందరుకోనకు వెళ్ళి ఉప్పువండారు. వండిన ఉప్పును బంగారంలాగ పొట్లాలు కట్టి ప్రజలకు అమ్మి కాంగ్రెసు నిధికి డబ్బు వసూలు చేశారు. విదేశవస్తు, వస్త్రదుకాణాల దగ్గర పికెటింగు చేసేవారు. ఆమె ఆసక్తికి, ఉత్సాహానికి, పరిధిలేదు. అయినా ఆమె స్విట్జర్లాండుకు చెందిన యువతి కనుక అరెస్టు చేయటానికి బ్రిటిష్ ప్రభుత్వం జంకింది.

గాంధీ మహాత్ముడు సబర్మతీ ఆశ్రమంలో ఉండకపోయినా ఆ ఆశ్రమ విషయాలను స్వయంగా తెలుసుకోవాలన్న కోరికతో అక్కడకువెళ్లి ఒక సంవత్సరం అక్కడ ఉన్నారు. దూదిని గింజలు తీయడం, ఏకటం, ఏకులు చేయటం, నూలు వడకటం మొదలైన విషయాలన్నీ చక్కగా నేర్చుకున్నారు. అన్నివిధులు నిర్వహించటం తెలుసుకున్నారు. ఆ రోజులలో ఆశ్రమంచుట్టూ అడవి వుండేది. పాములు విస్తారంగా ఆశ్రమంలోకి వచ్చేవి. వాటిని చంపకుండా పట్టుకుని తిరిగి అడవిలో వదిలే విధానంకూడా ఆమె సాహసంతో నేర్చు కున్నారు. స్త్రీలను రాత్రివేళ గస్తీ తిరగటానికి అనుమతించేవారుకారు. ఆమెకది చిన్నతనంగాతోచి, దానికి సమ్మతించవలెనని మహాత్ముడికి యరవాడ జైలుకు వ్రాసి, చివరకు ఇష్టపడి శక్తిఉన్న మహిళలు ఇద్దరిద్దరువంతున గస్తీ తిరగ వచ్చునని ఆయన ఒప్పుకునేటట్లుచేశారు. సబర్మతీ ఆశ్రమంలో ఉన్న సమయంలోనే ఆంధ్రోద్యమానికి ప్రాణా లర్పించిన పొట్టి శ్రీరాములుగారితో ఆమెకు పరిచయం అయింది. ఆనాటినుంచి ఆయన మరణించేవరకు ఆమెను కలుసుకుంటూ, ఆమెఇంట ఆతిథ్యం స్వీకరించుతు సోదరీ సోదరుల మాదిరి ఉండేవారు.

సబర్మతీ ఆశ్రమంనుంచి వచ్చిన తరువాత నాజూకు ఖాదీ ఉత్పత్తి స్థావరమైన శ్రీకాకుళంలో మూడుసంవత్సరాలు గడిపారు. పొందూరు, బొంతలకోడూరు వంటి ప్రదేశాలలో పట్టు, జరీలతో కలిపి అతి సన్నని ఖాదీ బట్టలు తయారుచేసే విధానం అభ్యసించారు. చివరకు నూలునాణ్యతను ధరనుకూడ నిర్ణయించగల నైపుణ్యం అలవరుచుకున్నారు. తన పరిశోధనా ఫలితాలను భారతి, మోడరన్ రివ్యూ వంటి పత్రికలలో వ్యాసాలు వ్రాసి ప్రచురించేవారు. చివరకు గాంధీ మహాత్ముడికి కూడ స్వయంగా వ్రాసి వివరించారు. మామూలు రాట్నంకన్న చాలసులువుగా తిరిగే రాట్నాన్ని శ్రీ దంతులూరి లక్ష్మీనరసింహరాజుగారు తయారుచేశారు. శ్రీమతి మెర్లీ ఆంధ్రదేశమంతటతిరిగి ఆ చరఖా ప్రచారంచేశారు. అట్లా ఊళ్లు తిరుగుతూ రాట్నప్రచారం చేస్తున్న సమయంలో బాలికా హిందీ పాఠశాల, శారదా నికేతనం, వినయాశ్రమం, కస్తూరిదేవి విద్యాలయం, ఆనంద నికేతనాశ్రమం వంటి జాతీయ సంస్థలుచూసి కొన్నిరోజులు వాటిలో గడిపివచ్చారు. విజయ నగరం, నెల్లూరులలో గాంధీజీ ఆమెను చూసినప్పుడు మాట్లాడి దీవించారు.

ఆ రోజుల్లో పోలీసు అధికారిగా ఉంటున్న ముస్తఫాలీఖాన్‌కి ఒక యూరోపియన్ స్త్రీ ఖాదీధరించి, రాట్నప్రచారం చేయటం బొత్తిగా నచ్చలేదు. ఒకనాడు ఆమెతో "విదేశీయులయిన మీరు ఇట్లా ఖాధీ, చరఖాల ప్రచారంచేస్తే ఈ దేశంనుండి బహిష్కరించవలసి ఉంటుంది. జాగ్రత్త" అని హెచ్చరించారు. అందుకామె బ్రిటిష్ ప్రభుత్వం ఖాదీని, చరఖాను నిషేధించిన ఉత్తరువును చూపించమని అడిగి అనవసరంగా తనకు చికాకు కలిగించితే స్విట్జర్లాండు ప్రభుత్వం, అంతర్జాతీయ సమితిదాకా వెళ్తుందని అన్నారు. అంతటితో ఆమెకు పోలీసు బెడద తప్పింది. సహేతుక ధైర్యం జయించుతుంది.

తండ్రి అనారోగ్య కారణంగా ఆమె 1934 చివరన స్వదేశం వెళ్లి పోయినారు. 1937 ఆగస్టు 30న మాస్కోలో డాక్టరు శ్రీ ఉప్పల లక్ష్మణ రావుగారితో ఆమె వివాహం జరిగింది. 1937 లో భారతీయ వనితగా ఆంధ్ర మహిళగా విజయవాడలో భర్తగారితో స్థిరపడ్డారు. 1956 దాకా అక్కడే ఉన్నారు. అంతా అలవాటుపడిన దేశము, పరిస్థితులే కాబట్టి అందరితో కలిసిపోయి హాయిగా ఉండగలిగారు. దేశసేవా అలవాటే కనుక తిరిగి 1940లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. గాంధీజీ ప్రత్యేక అనుమతితో

విజయవాడలో సత్యాగ్రహంచేసి అరెస్టుఅయి రాయవేలూరు జైలులో 9 నెలలు శిక్ష అనుభవించారు. ఐరిష్ దేశీయురాలై భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లిన మార్గరేటు కజిన్స్ సతి అప్పుడు ఆ జైలులో ఉన్నారు.

ఎట్లాగైనాసరే స్వాతంత్ర్యం సాధించితీరాలన్న పట్టుదలవుంటే జైలు శిక్షలు, లాఠీచార్జీలు అడ్డురావు. పైగా మరింత ధైర్యం సమకూరుతుంది. అందువల్ల విడుదలఅయి వచ్చిన కొద్దికాలానికే మద్రాసులో సత్యాగ్రహం చేసి శ్రీమతి మెల్లీ అరెస్టు అయినారు. ఇది రెండవసారి అరెస్టు అవటం కాబట్టి దాదాపు సంవత్సర కాలం రాయవేలూరు జైలులో శిక్ష అనుభవించవలసి వచ్చింది. 1942 సెప్టెంబరులో క్విట్టిండియా సందర్భంలో మూడవసారి రాయవేలూరు జైలులో ఒకటిన్నర సంవత్సరాల కఠిన శిక్ష "సి" క్లాసుతో అనుభవించి వచ్చారు. మొత్తం మూడుసార్లు జైలుకు వెళ్లి దాదాపు మూడున్నర సంవత్సరాల కాలం శిక్ష అనుభవించి వచ్చినందుకు, దేశానికి స్వతంత్రం రావడమేకాక ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కూడా చూశారు.

స్వతంత్రభారత దేశంలో ఆమెకు రామరాజ్య లక్షణాలేమీ కనిపించలేదు. సంఘోద్ధరణ చేయవూనుకున్న గాంధీమహాత్ముడు దారుణంగా హత్యచేయబడి నందువల్ల ముమ్మందు బాగుపడే అవకాశము ఆమెకు గోచరించలేదు. అప్పట్లో అనేకమంది భారతీయుల మాదిరి ఆమెకు అసంతృప్తి కలిగింది. సిద్ధాంతాలు వేరైనవి, కమ్యూనిజం వైపుదృష్టి మళ్లింది. 1957లో తన సోదరులను చూడటానికి, ఆమె భర్తతో సహా తూర్పుజర్మనీకి వెళ్లారు. అక్కడ ఉన్న రెండు సంవత్సరాల కాలంలోను అనేక పట్టణాలలో భారతదేశ స్వాతంత్ర్యోద్యమం, భారత మహిళాభ్యుదయం వంటి అనేక విషయాలపై ఉపన్యసించేవారు, గోష్ఠులు జరిపేవారు. 1959లో దంపతులు మాస్కో వెళ్లారు. 1965 జూలై 27న ఒక రోడ్డుప్రమాదంలో ఆమె తనువు చాలించారు. ఆనాటికీ ఆమె ఖాదీ ధారణ మానలేదు. ఆమె పట్టుదల, సేవానిరతి, త్యాగం, కలకాలం నిలచి ఉండగలవు.

# శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మ

**జననం 1906**

"నా దేశానికి సేవచేస్తున్నానని నేను భావించుతున్నాను. ప్రభుత్వం అదినేరంగా భావించి ఆరునెలలు కఠినశిక్ష విధించారు. సంతోషంగా స్వీకరించుతాను. కాని ఐదువందల జరిమానా సంగతే బోధపడటంలేదు. అనేకమంది ఐ.పి. పెట్టి ఆడవాళ్ల పేరిట ఆస్తి దాచటం అందరికి తెలిసిన విషయమే. అటువంటి పరిస్థితులలో మీరు వేసిన జరిమానా యెట్లా చెల్లుతుంది?" అని తెనాలి సబ్ కోర్టులో విచారణ జరిపి శిక్ష విధించిన అధికారులను ఆవేశంతో ప్రశ్నించారు కొల్లా కనకవల్లి తాయారమ్మగారు. తీర్పు చెప్పిన ఆర్.డి.ఒ. గారికి చాలాకోపం వచ్చింది. సూటిగా ఆమెను ఏమీఅనకుండా డాక్టరును పిలవండి అన్నారు. డాక్టరువచ్చి "అమ్మా రాయవేలూరు వరకు ప్రయాణం చేయగలవా?" అని నిండు చూలాలైన ఆమెను ప్రశ్నించారు. నిరభ్యంతరంగా చేయగలనని జవాబు యిచ్చారు ఆమె. ఆ సాయంత్రమే ఒకటిన్నర సంవత్సరం వయసుగల కూతురు చిరంజీవి ఝూన్సీలక్ష్మిని వెంట తీసుకుని రాయవేలూరు జైలుకు వెళ్లారు. ఆమెతోపాటు అరెస్టయి ఆమెలాగానే శిక్షింపబడిన ఆమె అక్క శ్రీమతులు పాదర్తి సుందరమ్మ, గోగినేని భారతీదేవి, తుమ్మల దుర్గాంబలుకూడ ఆమెతోపాటే జైలుప్రవేశం చేశారు. ఏ క్లాసు కావటాన స్వంత ఖాదీబట్టలే ఆమెను కట్టుకోనిచ్చారు. ప్రతిరోజు యిద్దరు ఖైదీలు వెళ్లి జైలు స్టోర్సు నుంచి లెక్క ప్రకారం పప్పు, వుప్పు, బియ్యం, కూరలన్నీ తెచ్చుకునేవారు. వంతులప్రకారం ఏ, బి, క్లాసు రాజకీయ బాధితులయిన స్త్రీలే వంటలు చేసుకుని ఒక్క పంక్తిన భోజనాలు చేసేవారు. వీళ్లకు తిండి సమస్యలేదు. మంచి సంబారాలే యిచ్చేవారు.



శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మ

మంచి మంచి రుచులతో వంటలు పిండివంటలు కూడ ఆ పదార్థాలతోనే సృష్టించుకునేవారు. రాత్రింతల గోధుమరొట్టెలు తినాలి. ఆంధ్రులవంట వేరు. తమిళుల, మలయాళీల వంటవేరు. ఆ సమయంలో శ్రీమతులు అంబుజమ్మాళ్, జానమ్మాళ్, కుట్టిమాలు అమ్మగార్లు, 75 మంది ఆ విభాగంలో వుండేవారు. శ్రీమతులు కోటమర్తి కనకమ్మ, మద్దుల రామాయమ్మ, చిలకమర్తి రామానుజమ్మ, ఎల్లాప్రగడ ఇందుమతీదేవి, చుండూరి రత్నమ్మ, పసుమర్తి దమయంతి, కందుల నాగరత్నమ్మ, దిగుమర్తి జానకీబాయమ్మ, ఆదుర్తి లక్ష్మీబాయమ్మగార్లు 90 మంది ఆంధ్రభోజన విభాగంలో వుండేవారు. కుట్లు అల్లికలు నేర్చుకుంటూ, హిందీ, జాతీయగీతాలు నేర్చుకుంటూ, చర్చలు జరుపుకుంటు కాలం ఎంతో ఆహ్లాద కరంగాను, వుపయోగకరంగాను గడిపేవారు. కాని 'సీ' క్లాసువారి బాధలు వర్ణనాతీతం. సంకటిముద్ద, దేవతాపులుసుతప్ప హితమైన భోజనం ఒక్కనాడు యిచ్చేవారు కారు. దాంతో ఏ, బి, క్లాసులవారికి మనసు కరిగి, వీలైనంతగా తమకు యిచ్చిన కూరలు, కందిపప్పు వంటివి 'సీ' క్లాసు వారికి చాటుగా చేర్చేవారు. జైలుకు వెళ్లిన ఐదువారాలకు శ్రీమతి కనకవల్లి తాయారమ్మకు మార్చి 7 న పనసపండులాంటి కొడుకు పుట్టాడు. తోటివారంతాచేరి పదకొండవ రోజున సౌజ్ఞ భక్ష్యాలతోసహాచేసి, పిల్లవాడికి "చరచంద్ర" అని నామకరణ మహోత్సవం చేశారు. క్రమేపి ఆ చిరంజీవి చరచంద్రుడు శరత్ చంద్రుడుగా విద్యావంతుడై యీనాడు ఐర్లెండులో వున్నత పదవులలో వున్నాడు. నాటి జైలు జీవితం ఆమెకు మరుపురాని మధురస్మృతి.

మద్ది వారికుటుంబం జాతీయోద్యమంలో తొలిదశనుంచీ పాల్గొన్నది. శ్రీయుతులు వెంకటరంగయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలక్రిష్ణయ్యగార్ల వంటి నాయకులలో ఒకరు. రాధాకృష్ణయ్యగారు సంస్కార భావాలుగల జాతీయవాది. వీరిద్దరి అన్నగారైన లక్ష్మీనరసింహంగారి నాల్గవ కూతురు కనకవల్లి తాయారమ్మగారు. 1906 లో బ్రాహ్మణ కోడూరులో జన్మించారు. అన్నపూర్ణమ్మగారు ఆమె తల్లి. పదకొండవ సంవత్సరాన తెనాలి వాస్తవ్యులైన కొల్లా కాశీవిశ్వనాథంగారితో వివాహం అతివైభవంగ జరిగింది. ఆమె స్కూలు చదువు ఎనిమిదవ క్లాసుతో ముగిసింది.

ఆమె భర్త, ఆయన కుటుంబ సభ్యులు కూడ తొలినుంచి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆమెకు యిరువైపుల యింతచక్కని వాతావరణం

తటస్థపడటంతో చిన్ననాటి నుంచి ఖాదీధారణ, సభలు సమావేశాలలో పాల్గొనటం అలవాటయింది. అక్కగారు శ్రీమతి పొదర్తి సుందరమ్మగారితో కలసి ఉత్సాహంగ ప్రచారకార్యక్రమాలలో 1921-22 నుంచే పాల్గొనేవారు. ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి నాయకత్వాన వుప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, తన పినతండ్రి వెంకట రంగయ్యగార్ల వెంట వూరూరు తిరిగి సత్యాగ్రహం చేసేవారు. ఏర్పేడు, వెంకటగిరి, కాళహస్తి వంటి చోట్ల కల్లు సారా వేలంపాటలు జరగకుండ అడ్డుకుని నిలవగలిగారు. ఆమెను కొన్నిసార్లు అరెస్టు చేసి సాయంత్రం వదిలేవారు. 1930 లో దేవరంపాడులో వుప్పువండారు. అప్పుడు ముప్పయిమంది స్త్రీలను అరెస్టు చేసి పోలీసువానులో ఎక్కించుకుని తీసుకు వెళ్లారు. చిలకలూరుపేట రోడ్డుమీద అర్ధరాత్రిదింపి పోలీసులు వెళ్లి పోయినారు. ఈ సత్యాగ్రహులందరు వివిధరాగాలతో, తాళాలతో, గీతాలు, భజనలు ఆరంభించారు. సందడికిలేచి వచ్చిన పౌరులు వీళ్లను తీసుకువెళ్లి భోజనాలు పెట్టించారు. ఇటువంటి వన్నీ ఆమె చాలా సరదాగా, తేలికగా భావించుతు పట్టుదలగా కార్య కలాపాలలో పాల్గొంటు వుండేవారు. 1930 లో ఆమెకు పెద్దగా జైలు శిక్షపడలేదు, కాని భర్త, పినతండ్రి రాయవేలూరులో సంవత్సరం కఠినశిక్ష అనుభవించి వచ్చారు. అక్క సుందరమ్మగారు అరెస్టయి 6 మాసాలు శిక్ష ననుభవించటానికి రాయవేలూరు వెళ్లినప్పుడు చెల్లెలు ఆమె వెంట వెళ్లి జైలులో దిగవిడిచివచ్చారు. అందువల్ల 1930 లోనే ఆమె జైలు దర్శనం చేసుకున్నారు.

1932 లో దేశవ్యాప్తంగ జరిగిన శాసనోల్లంఘనంలో ఆంధ్ర రాష్ట్రం ప్రముఖపాత్రే వహించింది. అసంఖ్యాకంగ స్త్రీలు ముందుకు వచ్చారు. విదేశవస్తు, వస్త్రదుకాణాల దగ్గర, కల్లు సారాకొట్ల దగ్గర ఓర్పుతో, సాహసంతో స్త్రీలు పికెటింగులు చేసేవారు. కనకవల్లి తాయారమ్మగారికి ఆ సమయానికి ఐదుగురు బిడ్డలు. ఆరవసారి నిండుగర్భం. కాని చల్లగా నీడపట్టున యింట్లో వుండటం పౌరుషహీనంగా భావించారు. తమ వూరైన తెనాలిలోను, చుట్టుపక్కల కూచిపూడివంటి వూళ్లలోను పికెటింగులు చేస్తూ ఉండేవారు. బెజవాడనుంచి ఆమె అక్కగారు పొదర్తి సుందరమ్మ గారు వచ్చారు. కావూరు నుంచి తుమ్మల దుర్గాంబగారు, నిడుబ్రోలు నుంచి భారతీదేవిరంగాగారు వచ్చారు. పట్టుదల, సహనం, శాంతం,

తమ ఆయుధాలుగా ఈ వీరవనితలు తెనాలిలో దుకాణాల ముందు సత్యాగ్రహం చేశారు. ఆ నలుగురిని 1932 జనవరి 27 న ఒక్కసారిగా అరెస్టుచేశారు. రెండు రోజులపాటు సబ్‌జైలులో వుంచారు. అంటే క్షమాపణ యిచ్చి సుఖంగా యిళ్లకు వెళ్లమని వుచితసలహా యిచ్చి, సంధి ప్రయత్నాలు చేయటానికి వ్యవధి కల్పించటమన్నమాట. దేశం మొత్తం మీద క్షమాపణ యిచ్చి యిల్లుచేరుకున్న ఆంధ్ర మహిళలు యించుమించు లేరేమో. ఈ నలుగురు అస లెట్లా వొప్పుకుంటారు? అందువల్ల విచారణ జరిపి శిక్షలువిధించక తప్పలేదు ప్రభుత్వానికి. ఆరునెలలు కఠినశిక్ష విధించటం, ఆమె జరిమానాగురించి అధికారులను యెదురుప్రశ్న వేయటం కథ యావత్తు తెలిసిందే. ఎడబిడ్డ ఝాన్సీలక్ష్మి, చంటిబిడ్డ చరచంద్రలతో రాయవేలూరు జైలు నుండి విడుదలయివచ్చారు.

తమ శక్తికొద్దీ నిర్మాణాత్మకంగా దేశసేవ చేయాలన్న తీవ్ర సంకల్పం సత్యాగ్రహంలో పాల్గొన్న స్త్రీలు అనేకులలో కలిగింది. శ్రీమతి కనకవల్లి తాయారమ్మ వెలగలేటి దుర్గాంబగారితో కలిసి తెనాలిలో స్వదేశీ వస్తువిక్రయశాలను 'సరోజిని స్వదేశీ వస్తు విక్రయశాల' పేరున 1932 అక్టోబరు 4న స్థాపించారు. చాలాకాలం దానిని నిర్వహించారు. ఇంతలో 1933 ఆగస్టులో గాంధీజీ చేసిన 21 రోజుల నిరసనవ్రతం వేలాది స్త్రీల మనసులను కదిలించివేసింది. ఆయన అడుగు జాడలలో హరిజనోద్ధరణ చేయటానికి పూనుకున్నవారిలో కనకవల్లి తాయారమ్మ గారు ఒకరు. ఆమె వెంటనే దీక్ష వహించి కార్యరంగంలో ప్రవేశించారు. అనుమతియిచ్చేవరకు పురపాలక సంఘం వారిని వొత్తిడిచేసి రోడ్డువారగా ఓండేమార్జిను ఖాళీస్థలంలో ఒక పెద్దపాక వేయించారు. హరిజన బాల బాలికలకు పాఠశాల ప్రారంభించారు. తెనాలిలో ప్రస్తుతం శ్రద్ధానంద హరిజనకాలనీ వున్న ప్రదేశం పదహారు వందల చదరపుగజాలస్థలం కొన్నారు. అది పల్లపు భూమి, కాని ప్రజలు అలనాడు శ్రీరాముడికోసం వారధి కట్టిన విధంగా బండ్లు కొద్ది కాలువమట్టితోలి మెరకచేశారు. 23-12-1933న పూజ్య బాపూజీ తెనాలి వచ్చి స్వహస్తాలతో శంకుస్థాపనచేశారు. నిండు మనసుతో కార్యకర్తలను దీవించారు. శ్రద్ధానంద హరిజన హాస్టలులో బాలబాలికలు వుండి చదువుకుంటూ వుండేవారు.

అంతటితో కథ ఆరంభ మయింది. కొల్లావారి కుటుంబం బొత్తిగా వర్ణాశ్రమ ధర్మాలను నీటగలిపేస్తున్నారు. హరిజనులను కూడగట్టుకు తిరగటమేకాక వాళ్లలో లీనమైపోతున్నారని సంఘం వారి కుటుంబాన్ని బహిష్కరించింది. ఒకరు వారింటికిరారు, వారిని ఒకరు ఆహ్వానించరు. కనకవల్లి తాయారమ్మగారు ఆమెభర్త కాశీవిశ్వనాధంగారు యివేవీ లెక్కచెయ్యకుండ నిశ్చింతగా హరిజన సేవ చేస్తు వుండేవారు. ఇంతలో వారి పెద్దమ్మాయి సతీతులసి, వైశ్యకులంలోనే చిన్నశాఖాభేదంతో డాక్టరు కె.వి. స్వామిగారికి యిచ్చి వివాహం నిశ్చయించారు. వంటలకుగాని పెండ్లిపనులకుగాని ఒక్కరురాలేదు. ఆమెతండ్రి బ్రాహ్మణ కోడూరులో తమ అన్న సత్రంలో పనిచేస్తున్న వంట బ్రాహ్మణులను, యితర పనివారలను తీసుకువచ్చి పబ్బం గడిపారు. అయినా ఆదంపతులు చలించలేదు. వారికి శ్రద్ధానంద హరిజన హాస్టలు మరొక ప్రాణంగా తయారయింది. శ్రీ విశ్వనాధం స్వయంగా దగ్గరవుండి ఒక్కొక్కరాయిపేర్చి అన్నిభవనాలు కట్టించారు. మక్కువతో తోటవేశారు. అనాధ శరణాలయం, స్కూలు నడుపుతువుండేవారు. ఆయన బస అక్కడనే వారిమధ్యనే. అక్కడే 6-2-1970న ఆ సేవా వ్రతుడు కన్నుమూశారు.

ఆమెకు 73 సంవత్సరాల వయసు. నేత్రదృష్టి మందగించింది. పెరిగి పెద్దఅయి, సంతానవంతులయిన పెద్దకుమారుడు, పెద్ద కుమార్తె పరలోక గతులు కావటంతో అదొక వ్యధ. కాని యివేవీ ఆమెను కుంగతీయలేదు. భర్తపోయిననాటినుంచి ఆమె ఆశ్రమంలోనే హరిజన అనాధ బాలబాలికల మధ్య స్థిరపడిపోయినారు. అక్కడే స్త్రీలకు ఆధ్యాత్మిక చింతనకు అవకాశాలు కల్పించారు. ఆమెకా ఆశ్రమ వాకిలే వారణాసి, గడపే కైలాసం. నేడు అక్కడ హరిజన అనాధ శరణాలయం, హరిజన బాలికలకు హైస్కూలు, ఓరియంటల్ ఎలిమెంటరీ స్కూలు నడుస్తున్నవి. వీరుకల్పించిన వుచిత వసతిలో మునిసిపల్ సంఘం వారు ఆయుర్వేద వైద్యాలయం నడుపుతున్నారు. గాంధీ మహాత్ముడు స్వయంగా వుత్సాహంతో పాల్గొన్న ఆ ఆశ్రమ కార్య కలాపాలలో దేశనాయకులు, పెద్దలు అనేకమంది ఆస్త చూపించుతూ వుంటారు. ఆశ్రమ వాసులను దీవించి ప్రోత్సహించుతు వుంటారు. 1970 లో నాటి భారత అధ్యక్షులయిన శ్రీ వి.వి. గిరి గారు వచ్చి కీ. శే. కాశీవిశ్వనాథం

గారి శిలా విగ్రహాన్ని ఆవిష్కరించారు. కనకవల్లి తాయారమ్మగారు నేటికీ జాతీయోత్సవాల సందర్భంలో పెద్దలను ఆహ్వానించి ఆశ్రమ కార్య కలాపాలను విజయవంతంగ నడుపుతు వుంటారు. ఆమె దేశభక్తికి త్యాగాన్ని, మానవసేవను, ఆధ్యాత్మిక చింతనను జోడించి నిజమైన గాంధీ అనుయాయిగా గీతాతత్వమెరిగిన సాధకిగా నిరాడంబర జీవితం ఆదర్శప్రాయంగా గడుపు తున్నారు.

---

# శ్రీమతి చోడగం అమ్మన్న రాజా

**జననం 6-6-1909**

అది నవంబరు 23వ తేది, 1977 వ సం॥ శ్రీమతి అమ్మన్న రాజా హైదరాబాదులో విజ్ఞానపురిలో తమ ఇంటిముందు మిత్రుల కారు దిగారు. వెనుక డిక్కీలోనుండి అస్తవ్యస్థంగా కట్టిన పెద్దపెద్ద బట్టల మూటలు ఐదారు బయటికి లాగారు. అది చూచిన ఇరుగుపొరుగు స్త్రీలు ఈ రోజే వెళ్తున్నారా? అని అడిగారు. ఆమె ఔను వెళ్తున్నాను అన్నారు. వాళ్లు తమ ఇళ్ల నుంచి మరికొన్ని బట్టలు తెచ్చి యిచ్చారు. ఆమె తన మిత్రురాండ్ర తోడ్పాటుతో వాటి నన్నిటినీ ఏ రకానికారకం విడివిడిగా కట్టి మరొక పావుగంటలో బయలుదేరబోతున్న గుంటూరు రైలుకు ప్రయాణమైనారు. అవన్నీ తుఫాను బాధితుల సహాయార్థం ఆమె త్వర పడి పరిచయస్థులు నలుగురివద్ద ప్రోగుచేసిన



శ్రీమతి చోడగం అమ్మన్నరాజా

పాతబట్టలు. అసలే చలికాలం. సమస్తం పోగొట్టుకొని అలమటించుతున్న ఆర్తులకు ఇవి అందించి, స్వయంగా అక్కడ నిలబడి, చేతనయిన సహాయం చేయాలని ఆమె సంకల్పం. నాలుగు రోజులుముందు ప్రకృతి చేసిన విలయ తాండవం మనదేశస్థులనే కాకుండా, బహుదూరదేశస్థులను కూడ దయతో, జాలితో, సహానుభూతితో ముంచెత్తింది. ఎవరికి వీలయిన సహాయం వారు అందించుతున్నారు. ఆ ఉద్దేశంతోనే ఆమె తన 68వ ఏట వయస్సునుమరచి రైలు ఎక్కారు. ఆమె తత్వమే అంత.

1909 జూన్ 6వ తేదీన బందరులో శ్రీ గంధం వీరయ్యా నాయుడు, శ్రీమతి నాగరత్నమ్మకు ఏడవ సంతానంగా జన్మించారు. కృష్ణాజిల్లా బోర్డు స్కూల్లో టీచరుగా పనిచేస్తున్న వీరయ్యగారికి నెలజీతం తప్ప ఏ సంపాదనా

లేదు. 11 మంది సంతానం ఆయన ఆస్తి. కైకలూరువంటి మారుమూల ఉన్న ఊళ్లోఉంటూ చదువుకోవటానికి ఆమెపడిన యిబ్బందులు అన్ని ఇన్నీ కావు. ఆడపిల్లలకు హైస్కూలు లేదు. బందరులో స్కూలు ఉంటే హస్టలులేదు. నానా ఇబ్బందులుపడి, రాజమండ్రి హైస్కూలులో చేరి, ట్రెయినింగు స్కూలు హాస్టలులో ఉంటూ స్కూలు ఫైనల్ ముగించారు. శ్రీ కంచుమర్తి రామచంద్రారావుగారనే సంపన్న గృహస్థు తమ కుమార్తె పేర ఇచ్చిన స్కాలర్‌షిప్పు అందకపోతే తనచదువు సాగేదేకాదని, అందుకు కృతజ్ఞత కనపరుస్తారు ఆమె. ఆ సమయంలో, హాస్టలులో హైస్కూలు పిల్లలు ముగ్గురో నలుగురో ఉండేవారు.

కాలేజీ చదువులకు మద్రాసు వెళ్లారు. గవర్నమెంటువారి ఉపకార వేతనం లభించింది. అత్తవారి ఇంటికి ఆడపిల్లను పంపుతున్నట్లే అప్ప గింతలుపెట్టి, ప్రిన్సిపాల్‌కు అప్పగించి, ఆమెతండ్రి వెళ్లారుట. మిస్ డిలాహే అనే బ్రిటిష్ వనిత అప్పుడు ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. ఆమె నిజంగా ఎంతగానో కనిపెట్టి ఉండేవారు. సమయానికి ఇంటివద్ద నుండి డబ్బురాకపోతే బిల్లులు అన్నీ సకాలానికి స్వయంగాచెల్లించి ఆమెను ఎవరూ చిన్నబుచ్చ కుండా ఆదుకునేవారు. డబ్బు అందగానే తీసుకునేవారు. ఇక హాస్టలు విషయం. వంటవాళ్లు హాస్టలు పిల్లలందర్నీ తమ బిడ్డలులాగా అదరంగా కనిపెట్టి పోషణభారం వహించేవాళ్లుట. అదెంత మంచికాలమో అని అనుకుంటారు ఇప్పటి పిల్లలు.

1932 లో పట్టభద్రురాలయి ఆ ఊళ్లోనే లేడీ విల్లింగ్‌టన్ ట్రెయినింగు కాలేజీలో ఎల్.టి. అయినారు. ఈ కథ, వినిపించినంత అందమైనది కాదు. అప్పటికి ఆమె తండ్రిగారు ఉద్యోగంనుండి రిటైరు అయినారు. కుటుంబానికి ఆయన నెలజీతం బాసటకూడ లేకుండా పోయింది. ఆమె ఎప్పటికపుడు చదువు కట్టి పెట్టి కైకలూరు వెళ్లిపోదామనుకునేవారు. కాని తండ్రి అనుమతిలేనిదే పిల్లలు అటువేలు ఇటు కదప వీలులేదు. ఇంటి దగ్గర పస్తులు ఉంటూవుంటే మద్రాసు మహానగరంలో హాస్టలులో సుఖంగా గడపడానికి ఆమె మనసు మహాబాధపడేది. సికింద్రాబాదు ఆడపిల్లల స్కూలులో కొంతకాలం ఉద్యోగం చేసిన మీదట బాపట్లలో శ్రీ వెలగపూడి సుబ్బారావుగారు నెలకొల్పిన ట్రెయినింగు స్కూలులో హెడ్ మిస్ట్రెస్‌గా చేరారు.

ఆ సమయంలో మాంట్ఫోర్డు సంస్కరణ (reform) (సవరణ) ఫలితంగా దేశంలో ఎన్నికలు జరుపవలసి వచ్చింది. అప్పట్లో మద్రాసు ప్రెసిడెన్సీలో ఇమిడిఉన్న ఆంధ్రదేశం తరపున స్త్రీలకు రెండు స్థానాలు ప్రత్యేకించారు. ఒకటి ఏలూరు, రెండవది బళ్లారి. మద్రాసురాష్ట్ర ప్రభుత్వం జస్టిస్ పార్టీ చేతులలో చిక్కుకున్నది. ఆ ప్రభావం ఏలూరులోకికూడా వ్యాపించింది. అందువల్ల ఏలూరు నియోజక వర్గానికి పోటీచేయడానికి పాత కాంగ్రెసు స్త్రీలు ఎవరూ ముందుకురాలేదు. ఆ పరిస్థితులలో శ్రీమతి అమ్మన్న రాజాను కాంగ్రెసు అభ్యర్థినిగా నిలబెట్టడం జరిగింది. శ్రీమతి సరోజినీనాయుడు శ్రీ భూలాభాయిదేశాయివంటి నాయకులువచ్చి తీవ్రప్రచారం చేశారు. ఆమె గెల్చారు. లెజస్లేటివ్ అసెంబ్లీ మెంబరు (M.L.A.) అయినారు. అప్పటి అసెంబ్లీ మెంబర్లలో ఆమెకు అందరికన్న చిన్నవయసు. నిజానికి అప్పటి వరకు ఆమె ఖాదీ అమ్మకం, హర్తాల్ జరపటాలు, సైమన్ కమిషన్ నిరసన ప్రదర్శనలలో పాల్గొనటం వంటి చిన్నచిన్న సంఘటనలలో పాల్గొనటంతప్ప తీవ్రంగా ఏనాడు రాజకీయాలలో పాల్గొనలేదు. కాని అనుభవజ్ఞులు, విజ్ఞులు అయిన శ్రీమతులు రుక్మిణీ లక్ష్మీపతి, కుట్టిమాలు అమ్మగార్లవంటి వారి సహచర్య సహకారాలతో త్వరలోనే రాజనీతిజ్ఞులు కాసాగారు. ఇంతలో రెండవ ప్రపంచ సంగ్రామం వచ్చింది. ఎటువంటి సంప్రదింపులు భారతదేశంతో జరపకుండానే బ్రిటిష్ ప్రభుత్వం మనదేశాన్ని యుద్ధరంగంలోకి ఈడ్చింది. అది అవమానంగా భావించింది కాంగ్రెసు. అందువల్ల 1939 లో కాంగ్రెసు అభ్యర్థులైన అసెంబ్లీ మెంబర్లందరూ రాజీనామా యిచ్చి బయటికివచ్చారు. శ్రీమతి అమ్మన్నరాజా కూడా వచ్చారు.

1940 ఆగస్టు 27 న పొల్లాచిలో మునిసిపల్ ఇంజనీరుగా ఉంటున్న చోడగం జనార్దనరావు గారితో ఆమెవివాహం జరిగింది. గృహిణిగా పొల్లాచి వెళ్లారు. రెండునెలలు అయింది. బ్రిటిష్ ప్రభుత్వ నిరంకుశ విధానంపట్ల అసమ్మతి సూచకంగా వ్యష్టి సత్యాగ్రహం జరపమంటూ కాంగ్రెసునుంచి శ్రీముఖం వచ్చింది. తనతోటి స్త్రీలు, మిత్రులు పరిచయులు అంతమంది జైళ్లలో మగ్గుతు ఉంటే సుఖంగా సురక్షితంగా ఇల్లుదిద్దుకుంటూ ఆమె ఉండలేకపోయినారు. భర్తగారికి నచ్చచెప్పి ఏలూరుచేరుకున్నారు. అది సమిష్టిగా దేశమంతాఒకటై చేసిన సత్యాగ్రహంకాదు. వ్యక్తిగతంగా నిరసన తెలియపరచ తలుచుకున్నవారందరూ తమ ఇష్టమైతే చేసే సత్యాగ్రహం. 1940

నవంబరులో స్వస్థలమైన కైకలూరులో సత్యాగ్రహంచేశారు. అనుకున్నంత అయింది. ఒక సంవత్సరం కఠినశిక్ష, రూ॥ 500 జరిమానాతో బ్రిటిష్ ప్రభుత్వం ఆమెను సత్కరించింది. ఏ కట్నము కానుకలు స్వీకరించకపోయినా ఆమె భర్తగారు రూ॥ 500 జరిమానా కట్టక తప్పలేదని బంధుమిత్రులందరూ ఆమెను పరిహసించారు. రాయవేలూరు జైలుకు చేరుకున్నారు.

అదే సమయంలో ఆ జైలులో శ్రీమతులు రుక్మిణీ లక్ష్మీపతి, రాధాబాయి సుబ్బరాయన్, కృష్ణాబాయి నీంబ్‌కర్, ఉప్పల మెల్లీ షోలింగరు అనే స్విస్ యువతి, బెజవాడ లక్ష్మీకాంతమ్మ గోపాలరెడ్డి, వల్లభనేని సీతామహలక్ష్మమ్మ, కుట్టిమాలు అమ్మగార్లవంటి సత్యాగ్రహం చేసిన స్త్రీలు దాదాపు 80 మంది ఉన్నారు. ఎంత కోలాహలంగా ఉండేదో ఊహించు కోవచ్చు. మొదట కొంతకాలం ఈ రాజకీయ స్త్రీ ఖైదీలను కూడా సాయంత్రం 6 గంటలనుండి తెల్లవారి 6 గంటలవరకు గదులలో బంధించి తాళాలు వేసేవారు. అంటే సాయంత్రం 6 గంటల లోపలే భోజనాదులు ముగించుకుని ఉండాలి. గదులలో దీపాలు ఉండవు, గాలి ఉండదు. బందెల దొడ్లు జ్ఞాపకం చేసుకోవచ్చు. ఒకసారి మద్రాసునుండి ఇన్‌స్పెక్టర్ జనరల్ జైళ్ల తనిఖీచేయటానికి వచ్చారు. అప్పుడు ఆమె "మేము సాధారణ నేరస్థులం కాముకదా, కోరి మా దేశంకోసం జైలుశిక్షను ఆహ్వానించి వచ్చాము. మీరు పొమ్మన్నా మేము పారిపోము. అనవసరంగా రాత్రంతా తాళాలువేసి గదులలో బంధించడం ఎందుకని" ప్రశ్నించారు. ఆయనకది సబబని నమ్మకం కలిగింది. వెంటనే రాత్రంతా గదులకు తాళాలువేసి బంధించనవసరం లేదని ఉత్తరువు జారీచేశారు. అంతటితో ఆ బాధ విరగడ అయిపోయింది. స్త్రీ సత్యాగ్రహులందరూ వరసగా వరండాలో పక్కలు పరుచుకునేవారు. అక్కడ దీపాలుకూడా ఉండేవి. అందువల్ల చదువుకోవటానికి వీలుపడేది. ప్రతిరోజూ హిందీక్లాసులు, ఇంగ్లీషుక్లాసులు వారిలోవారే నడిపేవారు. చదరంగం, బాడ్‌మెన్‌టన్ ఆడేవారు. రాట్నంమీద నూలు వడకటంలో పోటీలుకూడా జరిగేవి. శ్రీమతి వల్లభనేని సీతామహలక్ష్మమ్మ అతినాజూకుగా నూలు తీయడంలో అగ్రస్థానం వహించితే శ్రీమతి అమ్మన్నరాజా అతిశీఘ్రంగా వడకటంలో ప్రథములు. ఆటలలోకూడా పోటీలు జరుపుకునేవారు. ఒక కొత్త సత్యాగ్రహి జైలుకువచ్చినా, ఒకరు గడువుతీరివెళ్లిపోయినా అదొక పెద్ద హడావిడి. దాదాపు అందరూ విడుదల అయినారు. కాని సంవత్సరం శిక్షపడిన

కారణంగా శ్రీమతులు రుక్మిణి లక్ష్మీపతి, కుట్టిమాలు అమ్మలతో ఈమె మిగిలిపోయినారు. అక్టోబరు 1941లో విడుదల అయినారు.

1946లో ఎన్నికలు వచ్చినవి. కాంగ్రెసు అభ్యర్థినిగా ఆమె ఏలూరు నియోజక వర్గంనుంచి స్త్రీల ప్రత్యేక స్థానానికి డాక్టరు కొమఱ్ఱాజు అచ్చమాంబ గారి ప్రత్యర్థిగా పోటీచేశారు. గెలవటమేకాక ఈసారి ఆమె అసెంబ్లీకి డిప్యూటీ స్పీకర్‌గా కూడ ఎన్నికయినారు. 1952 వరకు ఆ హోదాలో ఉండి ఆంధ్ర స్త్రీల సామర్థ్యాన్ని వెల్లడించారు. డాక్టరు ముత్తులక్ష్మీరెడ్డి తోడ్పాటుతో ఆమె దేవదాసీ విధానాన్ని గర్హించుతు, ఆ విధాన నిర్మూలనకు ఒకచట్టం ప్రవేశ పెట్టారు. ఎంతో సమర్థవంతంగా దానిని సాధించి డాక్టరు ముత్తులక్ష్మీరెడ్డిగారి బహుకాల కృషిని సఫలం చేశారు. 1947 మద్రాసు దేవదాసీ విధానరద్దు బిల్లుగా అది చారిత్రక ప్రఖ్యాతి పొందింది. మరి 11 సంవత్సరాలకు 1950లో ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో వరదక్షిణ నిరోధక చట్టం ప్రవేశపెట్టి సాధించారు. అదికూడ చాల ప్రముఖమైన చట్టంగా సంఘాభ్యున్నతికి దోహదకారిగా పేరు పొందింది. ఆమెసామర్థ్యానికి సంస్కార క్రియతకు, పదవీ నిర్వహణపట్లగల సామర్థ్యానికి ఇవి మచ్చుతునకలుగా మిగిలిపోయినవి.

స్వరాజ్యం సిద్ధించేవరకు భారతీయులందరూ ఒకతాటిపైన నడిచారు. తమ సర్వస్వం నిస్వార్థంగా దేశానికి అర్పించారు. కాని స్వరాజ్యం సిద్ధించిన తరువాత పరిస్థితులు మారిపోయినవి. ముఠాతత్వాలు, కులదురభిమానాలు మర్రిచెట్టులాగ విస్తరించుకు పోయినవి. 1952లో జరిగిన పార్లమెంటు ఎన్నికల సందర్భంలో ఈ కాలుష్యం విపరీతంగా కనిపించుతుంది. పర్యవసానంగా నేటివరకు అఖండ విజయం పొందిన కాంగ్రెసు, కొత్తదృక్పథాన్ని యింకా జీర్ణించుకోకపోవటాన అనుకోని విధంగా ఓడిపోయింది. అనేక మంది కాంగ్రెసు అభ్యర్థుల మాదిరిగానే శ్రీమతి అమ్మన్నరాజా కూడ ఓడిపోక తప్పలేదు. అయినా ఆమె ముఠాతత్వాలకు, కులతత్వాలకు దూరంగానే ఉండిపోయినారు.

ఆంధ్రరాష్ట్ర అవతరణ అనంతరం 1955 లో మధ్యంతర ఎన్నికలు జరిగినవి. ఆమె పశ్చిమ గోదావరి జిల్లా అత్తిలినుంచి కాంగ్రెసు అభ్యర్థినిగా పోటీచేసి గెలిచారు. 1960లో పార్లమెంటు మెంబరుగా ఎన్నికఅయ్యేవరకు లెజెస్లేటివు మెంబరుగా ఉన్నారు. 1968 వరకు పార్లమెంటు సభ్యులుగా

ఉన్నారు. అక్కడ ఆమెకు ముతారాజకీయాలే ఎదురైనవి. 1968లో బైటకు వచ్చిన తరువాత రాజకీయాలతో ఆమెకు అట్టే సంబంధంలేదు.

ఆంధ్ర రాష్ట్ర స్త్రీ శిశు విద్యా సమితికి ఆమె చాలాకాలం ఛైర్మన్‌గా ఉన్నారు. ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిలో స్త్రీలుకూడా పేర్లు నమోదు చేయించుకోగల అవకాశం కల్పించారు. సాయంత్రం వేళల నిర్వహింపబడే కాలేజీలలో ఉద్యోగాలలోలేని స్త్రీలుకూడాచేరి చదువుకునేందుకు కృషిచేశారు. స్త్రీలకు ఫిజికల్ ఎడ్యుకేషన్ శిక్షణకు ప్రత్యేక కాలేజీలు కావాలని కృషిచేశారు.

ఆమె ముక్కుకు సూటిగా పోయేవ్యక్తి. ఒక సిద్ధాంతం నమ్మితే పూర్తిగా నమ్మటమేకాని, 'కాని', 'అయినా' వంటి సరిపుచ్చుకోవటాలు తాత్సారాలు ఆమెకు బొత్తిగా పనికిరావు. బహుశా అందువల్లనే నేమో శ్రీమతి చోడగం అమ్మన్నరాజా తనకై తాను పూనుకుని స్వతంత్రంగా నిర్వహించగల కార్యకలాపాలలోనే ప్రస్తుతం విరివిగా పాల్గొంటున్నారు.

---

# శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ

జననం 12-1-1910

దేశంలో శాసనోల్లంఘనోద్యమం ముమ్మరంగ జరుగుతున్న రోజులు. కృష్ణాజిల్లాలో వందలకొద్ది స్త్రీలు శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారి నాయకత్వాన విడివిడిదళాలుగా ఏర్పడి యే దళాని కాదళం ఒక క్రమబద్ధమైన కార్యక్రమం ఏర్పరచుకున్నారు. జిల్లాలోని ప్రతి వూరు, గ్రామం, వాడవాడల యీ దళాలు చొచ్చుకు పోయినవి. విదేశ వస్త్ర దుకాణాల దగ్గర, కల్లు సారా దుకాణాల దగ్గర తీవ్రమైన పికెటింగు ఆరంభమైంది. పకడ్బందీగా క్రమవిధానాలలో యిన్ని దళాలు పనిచేయటంతో అమోఘమైన ఫలితాలు కనిపించినవి. ప్రభుత్వానికి చురుకు పుట్టింది. వెంటనే కళ్లనులుముకొని 144వ సెక్షను జారీచేశారు.



శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ

కాని స్త్రీ సత్యాగ్రహులు అది లెక్కచేయలేదు. మరింత హుషారుగా పికెటింగు చేసి శాసనోల్లంఘనం చేశారు. పై మెట్టుగా ప్రభుత్వం శ్రీమతి సీతామహలక్ష్మమ్మ యిల్లు కదలరాదని కట్టడి చేశారు. ఆమె ఆ నిషేధాజ్ఞను బుట్ట దాఖలుచేసి యథేచ్ఛగా ప్రచారంలో పాల్గొన్నారు. దాని పైమెట్టుగా పోలీసులు వీళ్లు పికెటింగుచేస్తూ కనిపించినపుడల్లా వాళ్లమీద కారపునీళ్లు, మురుగునీళ్లు పిచికారితోచల్లి చికాకు పెట్టటం ఆరంభించారు. అదంతా తేలికగా నవ్వులాట కిందకుతేల్చి స్త్రీ సత్యాగ్రహులు యింకా పట్టుదలగా పికెటింగులు యెడతెరిపి లేకుండ జరపనారంభించారు. పోలీసులు వీరిని బస్సులలోనూ, లారీలపైన 20-30 మైళ్లు దూరంతీసుకువెళ్లి దిగవిడిచిరావటం ఆరంభించారు. వాలంటీర్లు ఎట్లా అంతదూరం వెనక్కు రాగలిగేవారో తెలియదుకాని తెల్లవారేటప్పటికి యథాప్రకారం గుడివాడలో పికెటింగు జరుపుతువుండేవారు. కలయో వైష్ణవ

పాయయో తెలియక పోలీసులు ఆశ్చర్య పోయేవారు. మరినాలుగు రోజులు గడిచిన తర్వాత స్త్రీ వాలంటీర్లు బస్సులు, లారీలు యెక్కటానికి నిరాకరించ సాగారు. రోజుకొక సమస్య పుట్టుకురావటంతో పోలీసులకు యెప్పటికప్పుడు కొత్తమార్గాలు ఆలోచించవలసి వచ్చేది. ఆడపోలీసులను స్పెషల్‌గా పిలిపించి బలవంతాన యీవాలంటీరు దళాలను బస్సులు, లారీలు యెక్కించి, దూరంగా దించి వచ్చేవాళ్లు. తెల్లవారేటప్పటికి కథ మళ్లీ మొదలు. సత్యాగ్రహులకు యెవరైనా గ్లాసెడు మంచినీళ్లు యిచ్చినట్లు తెలిస్తేచాలు పోలీసులు వారిని చావకొట్టి, కేసులుపెట్టి పెద్దమొత్తాలను జరిమానా విధించేవారు. ఒకసారి పామర్రు గ్రామంలో శ్రీ సూరపనేని గోపాలకృష్ణయ్యగారు స్త్రీ వాలంటీరు దళానికి ఆతిథ్యమిచ్చిన నేరానికి ఆయనను అరెస్టుచేసి వెయ్యిరూపాయలు జరిమానా వేశారు. అందుకని సత్యాగ్రహులు యెవరింటికి పోకుండ జాగ్రత పడేవారు. కొమరవోలులో యెర్నేని సుబ్రహ్మణ్యంగారు గాంధీ ఆశ్రమం పేరుతో ఒక ఆశ్రమం స్థాపించారు. కాని డిప్యూటీ కలెక్టరు ఆ ఆశ్రమాన్ని స్వాధీనం చేసుకుని దానికి సీళ్లువేశారు. పోలీసు కాపలావుంచారు. రోజురోజుకు పోలీసులతో కయ్యానికి కాలుదువ్వుతున్న స్త్రీ సత్యాగ్రహుల కిదొక సమస్యగా తోచలేదు. అబలత్వం మరచిన ఆ వీరవనితలు సూటిగా వెళ్లిసీళ్లుపగులగొట్టి ఆశ్రమములో ప్రవేశించారు. వీరిసంఖ్య ఎక్కువ, పోలీసుల సంఖ్య తక్కువ. దాంతో వాళ్లు ఏమిచేయలేక పైఅధికారులకు విన్నవించుకున్నారు. వ్యానుల నిండుగా స్పెషల్ పోలీసులు, అధికారులు స్వయంగా వచ్చారు. ''మిమ్మల నందరిని అరెస్టుచేశాము వ్యానులో యెక్కం''డన్నారు. 20-30 మైళ్లదూరం బందరు పర్రలవైపు తీసుకుపోయి, వదలి వెళ్లిపోయినారు. ఒసారికాదు, రెండు సార్లుకాదు అనేక పర్యాయాలు యిట్లాజరిగింది. అయినా స్త్రీలు మరింత ఉత్సాహంతో కక్ష్యతీర్చుకుంటామన్న పుబలాటంతో పికెటింగులు చేసేవారు. బందరువరకు యీ యుద్ధం పాకిపోయింది. శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ నాయకత్వాన శ్రీమతులు *గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, ఆరికపూడి మాణిక్యమ్మ, ఆరికపూడి ఉషామణి, వయోవృద్ధులయిన ఆరికపూడి మహాలక్ష్మమ్మ, కోనేరు భారతమ్మ, కన్నెగంటి నాగరత్నమ్మ, చెరుకూరు సౌభాగ్యమ్మ, ఘంట మల్లికాంబ గార్ల వంటి స్త్రీల నెందరినో 1932 వ సంవత్సరం మే నెలలో అరెస్టు చేశారు. చిన్నపిల్లలు, పసిబిడ్డతల్లులు అనే వివక్షతలేకుండ అందరికి సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాయవేలూరు జైలుకు పంపించి వెన్ను విరుచుకున్నారు అధికారులు.

అక్కడనుంచి ఆమెను, ఆమెదళంలోని చాలామందిని కన్ననూరుకు మార్చారు. అసలే "సి" క్లాసు. అందులో కన్ననూరు మరీ ఘోరం. గంజి, వుప్పుడుబియ్యపు అన్నం, పులుసు యిచ్చేవారు. అదీ కడుపునిండదు. దాంతో ఆమె ఆరోగ్యం బాగా చెడిపోయింది. 1933 ఏప్రెల్ పదకొండున సంవత్సరం శిక్ష పూర్తిచేసుకుని విడుదలయినారు. తిరుచినాపల్లి వెళ్లి జైలులోవున్న భర్తగారిని చూసి స్వగ్రామం చేరుకున్నారు.

రాజకీయాలలో తీవ్రంగ పాల్గొనటం ఆమెకిది మొదలూకాదు, చివరా కాదు. భర్త రామబ్రహ్మంగారితో కలిసి 1930 లోనే వుప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. గుడివాడ. జిల్లా అంతా తిరిగి ఎంతో పట్టుదలగా ప్రచారం చేశారు. భర్త అరెస్టయి జైలుకు వెళ్లటం ఆమెను నిరుత్సాహ పరచలేదు. తోటిస్త్రీలను సమకూర్చుకుని మరింతయెక్కువగా ప్రచారోద్యమం కొనసాగించారు. వాడవాడల తిరిగి విదేశవస్త్ర దుకాణాలముందు, కల్లు, సారాయి కొట్లముందు పికెటింగ్ చేశారు. ఇంతలోనే గాంధీ ఇర్విన్ సంధి కారణంగా ఆమె భర్త విడుదలయి వచ్చారు. మిత్రబృందముతో పాటు ఆ దంపతులు గుడివాడలో సత్యాగ్రహ శిబిరం స్థాపించి అక్కడేఉండి పికెటింగులుచేశారు. విదేశీవస్త్ర దుకాణాలు తెరవటానికి యెవరు సాహసించ లేదు. అట్లా కొనసాగిన కార్యక్రమం 1932 లో ఆదంపతులను, వారి మిత్ర దళాలను జైలుకు తీసుకువెళ్లింది. విడుదల అయి వచ్చిన తరువాత మనకీగొడవ యింక చాలునని ఆమె భావించలేదు. కాంగ్రెసు సంఘాలు, అఖిలభారత మహిళా సంఘాలు వూరూర స్థాపించారు. వాటిలో సభ్యులను చేర్పించటం, మహిళలకు ప్రయోజనకరమైన కార్యకలాపాలు కొనసాగించటంలో నిమగ్న మయినారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యురాలుగా, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు సభ్యురాలుగా వాడవాడల తిరిగి ప్రచారంచేసి స్త్రీలలో రాజకీయ, ఆర్థిక చైతన్యాన్ని పెంపొందించారు. 1937 లో తూర్పు కృష్ణా జిల్లా రాజకీయ సభలు పామర్రుగ్రామంలో జరిగినవి. అప్పుడామె పూనుకుని, ఆహ్వాన సంఘ అధ్యక్షురాలుగా ఉండి జిల్లా మహిళాసభను నడిపించారు.

ఇన్నివిధాల మహిళాభ్యుదయానికి పాటుపడుతూవుండగా 1939 లో కృష్ణాజిల్లాబోర్డు ఎన్నికలు వచ్చినవి. పామర్రు నియోజకవర్గంలో స్త్రీల ప్రత్యేక స్థానానికి, కాంగ్రెసు పార్టీతరఫున ఆమెపోటీచేశారు. మంచి పలుకుబడిగలవారు

ప్రత్యర్థులుగా నిల్చినా, ఆమె అఖండ విజయం పొందారు. జిల్లాబోర్డు సభ్యులుగా సేవచేశారు.

1941 లో వ్యక్తి సత్యాగ్రహోద్యమం దేశాన్ని ఆవరించింది. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ స్వగ్రామమైన జమీగొల్వేపల్లిలో సత్యాగ్రహం చేశారు. ఫలితంగ 1941 మార్చిలో అరెస్టయినారు. క్రమక్రమంగా అనుభవం గడించిన బ్రిటిష్ ప్రభుత్వం అనవసరంగా సత్యాగ్రహులతో జైళ్లనింపి బాధలు కొనితెచ్చుకునే కన్న జరిమానాలువేసి లాభం సంపాదించాలనుకున్నారు. అందువల్ల ఆమెకు ఒక్కరోజుజైలుశిక్ష—మూడువందల రూపాయలు జరిమానా విధించారు. అది చెల్లించని పక్షంలో మూడునెలల కఠినశిక్షవుంటుంది. తగినట్లు సత్యాగ్రహులుకూడ జరిమానా చెల్లించటం అవమానంగా భావించేవారు. జైలుశిక్షనే సంతోషంగా సగర్వంగా అంగీకరించేవారు. అందువల్ల ఆమె మూడునెలల కఠినశిక్షను అనుభవించటానికి రాయవేలూరు జైలుకువెళ్లారు. ఈసారి ఆమెకు 'ఎ' క్లాసు యివ్వటాన మొదటిసారిలాగ పెద్ద యిబ్బందులు, బాధలు కలగలేదు. శ్రీమతులు కుట్టిమాలు అమ్మ, బెజవాడ లక్ష్మీకాంతమ్మ గోపాలరెడ్డి, అమ్మన్నరాజాలు యీమెతోపాటు జైలులో వున్నారు. నూలు వడకటం పోటీలు జరిగేవి. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మకు నాజూకుగా సన్నని నూలు తీయటంలో మంచినైపుణ్యం వున్నది. అందువల్ల ఆమెకా పోటీలలో ప్రథమస్థానం వచ్చేది.

శ్రీమతి కస్తూర్బాగాంధీ అస్తమించారు. ఆమె జ్ఞాపకార్థం జాతీయ నిధిని ఏర్పాటుచేసి, దానిని వెచ్చించి స్త్రీల అభ్యున్నతికి రకరకాల కార్యకలాపాలు రూపొందించారు. రాష్ట్రంలో శ్రీ బులుసు సాంబమూర్తిగారి ఆధ్వర్యాన కస్తూర్బా స్మారక సంఘం ఒకటి యేర్పడింది. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ ఉపఅధ్యక్షురాలుగా ఆ సంఘంతరఫున నిర్మాణాత్మకకృషి చాలా చేశారు. వాడవాడల ఆమెతిరిగి విరివిగా విరాళాలు వసూలుచేశారు. ఎన్నోచోట్ల మాతా శిశుసంక్షేమ కేంద్రాలు సంఘం తరఫున నెలకొల్పి స్త్రీలకు, పిల్లలకు సేవచేశారు.

అనేక సాంఘిక కార్యక్రమాలలోకూడ పాల్గొంటు వుండేవారు. ఎంత కాలం జరిగినా గ్రామాలలో యింకా అస్పృశ్యతా నివారణకాలేదు. హరిజనులు నీళ్లకుకూడ యిబ్బంది పడుతునే వుంటారు. 1941లో విజయవాడ తాలూకా

నైనవరం గ్రామంలో శ్రీసుంకర నాగభూషణంగారు ఒకపెద్ద మంచినీటిబావిని త్రవ్వించారు. ఆమె ఆ బావిని హరిజనుల వుపయోగార్థం ఆవిష్కరించారు. ఈనాటికీ ఆబావి హరిజనసేవలోనే నిల్చివున్నది.

1946లో మద్రాసు శాసనసభ యెన్నికలు వచ్చినవి. ఆమె బందరు జనరల్ సీటుకు కాంగ్రెసు అభ్యర్థినిగా నిల్చారు. అఖండ విజయం సాధించారు. 1952 వరకు శాసనసభ సభ్యురాలుగావుండి తమ నియోజకవర్గానికి యెంతో వుపయోగకరమైన అంశాలను ప్రవేశపెట్టారు.

1947 ఆగస్టు 15న స్వాతంత్ర్యం సిద్ధించింది. 1930 నుంచి చేసిన త్యాగాలు, తిన్న లాఠీదెబ్బలు, అనుభవించిన జైలుశిక్షలు సార్థకం అయినవి. స్వాతంత్ర భారత పౌరిణిగా ఆగస్టు 16న ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం నుంచి ప్రసారంచేసిన స్వాతంత్ర్యదినోత్సవ కార్యక్రమాలలో "స్త్రీలు-భావి భారతము" అనే అంశముపైన ఆమెచేసిన ప్రసంగం చెప్పుకోతగినది.

ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలలో వివాహ శుభకార్యాలపట్ల "దేవదాసీల మేజువాణీలు" జరుపుతు వుంటారు. అది సంఘశ్రేయస్సుకు ప్రతిబంధకమే. అందువల్ల సీతామహాలక్ష్మమ్మగారు శాసన సభ్యులుగా వున్నప్పుడు యీ మేజువాణీలను అరికట్టాలని ఒకబిల్లును ప్రవేశపెడుతు, దాని ఆవశ్యకతను వివరించుతు గంభీరంగ వుపన్యసించారు.

1948లో ఆమెను ఆంధ్రయూనివర్సిటీ సెనేట్ మెంబరుగా రెండు సంవత్సరాలవరకు ఎన్నుకున్నారు. 1950 లో మద్రాసు శాసనసభ తరఫున 3సంవత్సరములకు ఎన్నుకున్నారు. అందువల్ల ఆమె ఏకబిగిన 5సంవత్సరాలు ఆంధ్రా యూనివర్సిటీ సెనేట్ మెంబరుగా వుండటం తటస్థించింది. ఆవిధంగా ఆమె విద్యారంగంలోకూడ స్త్రీల అభ్యున్నతికి పాటుపడటానికి అవకాశం కలిగింది.

ఆమె మంచి వ్యవహర్త. లౌకికజ్ఞానం గలవ్యక్తి. విషమ పరిస్థితులలో నయినా ఆవేశపడక చాతుర్యంతో విజయంసాధించగలరు. ఒకసారి గన్నవరం తాలూకా కృష్ణాపురమనే గ్రామంలో కలెక్టరు స్వయంగా నిలబడి ధాన్యం ప్రొక్యూరుమెంటు పనిచూస్తున్నారు. అధికారులకు గ్రామస్థులకు అభిప్రాయ భేదాలు వచ్చినవి. ప్రభుత్వలారీలు వూరుదాటకుండ చేయటానికి గ్రామస్థులు

రోడ్డువంతెనలను లాగేశారు. వేరేపనిమీద కలెక్టరుతో మాట్లాడటానికి వచ్చిన ఆమె, ఆమె భర్త కాలిబాటన గ్రామంలో ప్రవేశించారు. అధికారులతో విషయాలన్ని వివరించారు. అంతటితో ప్రొక్యూరుమెంటు ఆపి, ధాన్యం లారీలను బయలుదేరతీశారు. ప్రతిగోడమీదనుంచి, యింటికప్పుమీదనుంచి గ్రామస్థులు కర్రలతో, రాళ్లతో అధికారులపైకి దూకారు. అప్పుడు ఆమెభర్త రామబ్రహ్మంగారు వారందరిని బతిమాలి బుజ్జగించి ఓర్పుతో నేర్పుతో విషయం బోధపరచి భీభత్సకాండ ఆపగలిగారు. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ గుడివాడ తాలూకా గుడ్లవల్లేరు గ్రామంలో జన్మించారు. పొట్లూరి వెంకయ్య, శోభనాద్రమ్మగార్లు ఆమె తల్లితండ్రులు. ఆమెకు ఇద్దరు సోదరులు. 11 సంవత్సరాల వయస్సులో జమీగొల్వేపల్లి వాస్తవ్యులు ప్రఖ్యాత దేశసేవకుల అయిన రామబ్రహ్మంగారితో వివాహం అయింది. ఆమె 1910 జనవరి 12 న పుట్టినందువల్ల 69 సంత్సరాలు యీనాటికి నిండినవి. కాని యీనాటికీ అంత్యంతశ్రద్ధతో ఆసక్తితో స్త్రీల అభ్యున్నతికి విసుగు విరామం లేకుండా కృషి చేస్తునే వున్నారు.

---

# డాక్టరు శ్రీమతి నివర్తి లక్ష్మీదేవి శాస్త్రి

జననం 1896 — మరణం ఫిబ్రవరి 1976

ఆవగింజంత అయినప్పటినుంచి పొగడబంతి మొగ్గ, పచ్చని ఆకుల మధ్య కెంపులాగ మెరిసిపోతు వుంటుంది. అట్లాగే నిర్మాణాత్మక మార్గంలో విప్లవంకోరే సంస్కార ప్రియులు పసితనంనుంచి తమదైన ఒక ప్రత్యేకత కలిగివుంటారు. డాక్టరు లక్ష్మీదేవిగారి విషయంలోను యిదే కనిపించుతుంది. అనంతపురం తాలూకాలో కొప్పలకొండ ఒక కుగ్రామం. ఒక పేద బ్రాహ్మణ కుటుంబంలో 7, 8 ఏళ్ల అమ్మాయి నేను చదువుకుంటాను—బడికి పోతాను అని మొండికేస్తున్నది. రకరకాల ముగ్గులు వేసుకుంటు, చమ్మచక్క ఆడుకుంటు వుండవలసిన ఆడపిల్ల నోట్లోనుంచి యిటువంటిమాటలు రావటం ఆ గ్రామంమొత్తం మీద యెవరువినలేదు. ప్రహ్లాదుడి మాటలకు హిరణ్యకశిపుడు వింతపడినట్లు అయింది పెద్దలపని. ఇంకాపెద్దయితే రణపెంకె కావచ్చునని భయపడి మూడుముళ్లు వేయించారు. అప్పుడూ ఆ అమ్మాయి పలకా బలపం వదలలేదు. బడికి వెళ్తానని గొడవమానలేదు. కొద్దికాలానికే ఆ అమ్మాయికి వైధవ్యం ప్రాప్తించింది. ఆ దుఃఖం, బాధ అర్థంకాని ఆ చిన్నపిల్ల బడికి పోతానన్న వ్రతపదం వదలనేలేదు. తమ విధాయకం తీర్చుకున్న పెద్దలు యీసారి అడ్డే పేచీ పెట్టక ఒప్పుకున్నారు. హిందుపూరు హైస్కూలులో వుత్సాహంగ చదివింది. కొప్పలకొండ కుగ్రామంలో శ్రీ నరసయ్య, శ్రీమతి శేషమ్మల కూతురుగా 1896 లో పుట్టిన లక్ష్మీదేవి విద్యాభ్యాసం ఆ విధంగా జరిగింది.



డాక్టరు నివర్తి లక్ష్మీదేవిశాస్త్రి



A M 14x

బళ్లారిలో శ్రీ కోలాచలం వెంకటరావు పేరెన్నికగన్న లాయరు. విదేశాలకు వెళ్లివచ్చి, జాతి, కుల భేదాలే పనికిరావని, స్త్రీలు చదివితీరాలని వాదించే సంస్కారి. ఆయన భార్యకు మేనకోడలే లక్ష్మీదేవి. ఆమెకు యీమేనత్త కుటుంబం అండగా నిల్చింది. మద్రాసులో హాస్టలులో వుంచి స్కూలు ఫైనలు చదివించారు. అదిముగియగానే బొంబాయిలో మెడికల్ కాలేజిలో చేర్పించారు. 1925 నాటికి ఆమె L.C.P.S. డిగ్రీతో బళ్లారిజిల్లా స్త్రీలలో మొదటి డాక్టరు అయింది. ఆమె బొంబాయిలో చదువుతున్నప్పుడు విద్యావేత్తలు, నాయకులు, సంఘసంస్కారులను ఎంతమందినో చూసింది. వాళ్ల ఉద్బోధలు విన్నది. విద్యాతృష్ణ తీరుతున్నకొద్ది అన్యాయం సహించలేక పోవటం, స్వతంత్రవ్యక్తిత్వంపట్ల అభిరుచి యెక్కువయినవి. ఆమెచొరవకు ధైర్యానికి మిగతా విద్యార్థులు ఆమెను అభిమానంగ గౌరవంగ చూసేవారు. బళ్లారిలో వెంకటరావుగారి దగ్గర శ్రీ నివర్తి మృత్యుంజయ శాస్త్రి అనే జూనియర్ లాయరుండేవారు. ఆయన సంస్కారభావాలలో గురువునుమించిన శిష్యుడు. జంకుగొంకులు యెరగని ధైర్యశాలి. 1929లో కోరి శ్రీమతిలక్ష్మీదేవి కరగ్రహణంచేశారు. అంతటితో ఆమెజీవితం ఆనందభరితమయింది. కాని ఆ జిల్లాలోనే ఒక దుమారం రేగింది. తలిదండ్రులకు వారి సంపదకు శ్రీ శాస్త్రి గారు దూరంకావలసి వచ్చింది. వెంటనే డాక్టరు శ్రీమతి నివర్తి లక్ష్మీదేవిశాస్త్రి బోర్డు గోడమీద వెలిసింది. ఆమె విపరీతంగడబ్బు సంపాదించగల అవకాశాలు వున్నవి. కాని ఆమె అందుకు వ్యతిరిక్తంగ తానే మందుల ఖర్చులు భరించి పేదసాదలకు వైద్యసహాయం చేయనారంభించారు. ఆమెకు ధర్మాత్మురాలయిన డాక్టరుగా మంచి పేరు రాసాగింది. వ్యక్తుల జబ్బులు నయం చేయటంకన్న సంఘాన్ని ఆరోగ్యవంతంగ చేయాలన్న ఆకాంక్ష దేశసేవలో పాల్గొనాలన్న తపన ఆమెలో అధికం అయినవి. 1930లో ఆరంభమైన స్వాతంత్ర్య సమర దుమారం 1930లోనే ఆమె శ్రీమతి దుర్గాబాయమ్మగారి దగ్గరకు మద్రాసు శిబిరానికి వెళ్లేనాటికి పరాకాష్ఠ అందుకున్నది. స్వతంత్రభావాలు సహజంగానే అధిక పాళ్లలోవున్న ఆమె ఆ వుద్యమంలో 1932 లో చొచ్చుకుపోయినారు. అనర్గళ ధారతో గంభీరోపన్యాసాలు యివ్వసాగింది. తీవ్రంగ పికెటింగులలో పాల్గొన్నది. పర్యవసానం తెలిసిందే. అరెస్టుచేసి సబ్ మెజస్ట్రేటు కోర్టులో హాజరుపరచారు. ఉపన్యాసాలతో ప్రబోధాలతో ప్రజలలో విప్లవం, రాజద్రోహం రెచ్చకొడుతు శాసనధిక్కారం చేయటం నేరమన్నారు. దేశాన్ని

హీనాతి హీనస్థితికి తెచ్చి బానిసలుగా చూస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం చేసే శాసనాలు ఒక శాసనాలా, వాటిని ధిక్కరించటంకూడ ఒక నేరమేనా అని ఆమె అడిగారు. అమ్మామీరు ముందు చేసిన శాసనం ధిక్కారం సంగతి యెట్లావున్నా యిప్పుడు చేసిన ధిక్కారం సహించరానిది. కాబట్టి 6 నెలలు కఠినశిక్ష—రెండువందలు జరిమానా—అది చెల్లించని పక్షంలో మరిరెండు నెలలు కఠినశిక్ష వేయక తప్పదన్నారు. ఫిబ్రవరి 9న రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమెకు అక్కడ దృశ్యాలు భరించ శక్యంకాలేదు. క్రిమినల్ నేరాలు చేసి శిక్ష అనుభవించుతున్న ఆడఖైదీల కరుణామయ గాథలు ఆమెను కలవర పరచసాగినవి. వారిపక్షాన జైలు అధికారులతో వాగ్వాదాలు పెట్టుకున్నారు. జైలు సూపరింటెండెంటు ఖానుగారికి యిది ఒక సమస్యఅయింది. గుట్టు చప్పుడుగా ఆమెను, ఆడ క్రిమినల్ ఖైదీలను మాత్రమే వంటరిగా బంధించి వుంచే మధుర జైలుకు మార్చేశారు. ఆమె జరిమానా చెల్లించకుండ అదనపు శిక్షకూడ అనుభవించి విడుదలయినారని చెప్పకుండానే వూహించుకోవచ్చు.

గాంధీజీ హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టటంతో మళ్లీకావలసినంత సందడి కలిగింది దేశంలో. సభలు సమావేశాలు చేసి హరిజనోద్ధరణ ఆవశ్యకతను వివరించుతు అస్పృశ్యతా నివారణ జరపాలని కార్యకర్తలు బోధించేవారు. శ్రీమతి లక్ష్మీదేవి వుత్త బోధలతో వూరుకోక స్వయంగా హరిజనుల సహపంక్తిన భోజనాలు చేస్తు, అన్నికులాలవారికి సహపంక్తి భోజనాలు యేర్పాటు చేస్తూ వుండేవారు. ఆమె ఒప్పు అని విశ్వసించిన విషయం ఆచరణలో పెట్టటానికి వెనుకాడరు. మిత్రులతో విరోధంపెట్టుకో వలసి వచ్చినాగానీ, శత్రువులతో పొత్తుకలపవలసి వచ్చినా ఆమె సందే హించరు. బ్రాహ్మణ కులంలో అందులోనూ స్త్రీ యిట్లా సాహసించినందుకు అనేకమంది దుమ్మెత్తి పోశారు. మరియెంతో మంది ఆమె సాహసానికి మెచ్చారు. 1934లో గాంధీజీ బళ్లారి వచ్చినప్పుడు, ఆమె మహాత్ముని వెంట కొన్నిప్రదేశాలు తిరిగారు. విరాళాలు పోగుచేశారు. మహాత్ముని హరిజన నిధికి బహూకరించారు.

1935-38 మధ్య అమె జిల్లా కాంగ్రెసు కమిటీకి ఉపాధ్యక్షురాలుగా వున్నారు. కాంగ్రెసుకు అండదండలుయిస్తు నిల్చారు. స్వయంగా పూనుకుని యెంతో మంది స్త్రీలను కాంగ్రెసు సభ్యులుగా చేర్చి స్త్రీలలో కాంగ్రెసు అభిమానం పెంపొందించారు. కాంగ్రెసుకు బలంచేకూర్చారు.

1935 లో పరిపాలనా బాధ్యతలో సహకరించటానికి కాంగ్రెసు అంగీకరించింది. అందువల్ల జరిగిన ఎన్నికలలో ఆమె బళ్లారి నియోజకవర్గం స్త్రీల స్థానం నుంచి కాంగ్రెసు తరఫున పోటీచేశారు. అఖండ విజయం పొంది ఉమ్మడి మద్రాసు ప్రెసిడెన్సీ శాసన సభకు సభ్యురాలు ఐనారు. ఆ పదవిలో రెండున్నర సంవత్సారాలు వుండి యెంతో సేవచేశారు. మంచివక్త కావటాన తమ జిల్లా సమస్యలను, అవసరాలను, అతిసూటిగా, నిజాయితీగా చెప్పి పనులు సాధించేవారు. హరిజన విద్యార్థులకు ఆనాడు ఆమె యేర్పరచ గలిగిన హాస్టలు యీనాటికీ చక్కగా పనిచేస్తు వున్నది. కరువుకాటకాల నివారణకు ప్రభుత్వం బాధ్యతాయుతంగ పూనుకుని సేద్యానికి విత్తనాలు మొదలయినవి సరఫరా చేసేట్లు ఆమె చూశారు. ధనికులను కూడగట్టుకుని ప్రజాహిత కార్యాలను క్రమ విధానంలో చేయించారు. పౌరస్త్రీలలో నవచైతన్యం ప్రబలింది. క్లబ్బులలో విదేశీయులతో సరిసమానంగ పౌరులు పాల్గొనటమే కాక కార్యనిర్వాహక వర్గంలో బాధ్యత వహించసాగారు. ఇట్లా రెండున్నర సంవత్సరాలు జరిగేటప్పటికి రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. తమను సంప్రదించకుండానే బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని యుద్ధంలోకి దించిన కారణంగ కాంగ్రెసు ప్రభుత్వం రాజీనామా చేసింది. దాంతో ఆమెకూడ బయటికి వచ్చారు.

అప్పటికే ఆమెను బళ్లారి పురపాలక సంఘ సభ్యులుగా ఎన్నుకున్నారు. నగర పారిశుద్ధ్యమే కాక బీదలు నివసించే అనేక వాడలకు ఆమె కావలసిన వసరులను సమకూర్చటానికి పాటుపడ్డారు. ఆలిండియా వుమెన్సు కాన్ఫరెన్సుకు బళ్లారి ప్రతినిధిగా తోటి స్త్రీలను, మిత్రులను కూర్చుకుని స్త్రీలసమస్యలు స్త్రీలు బాగా అర్థంచేసుకుని, పరిష్కార మార్గాలు కనిపెట్టలేకపోయినా కనీసం చూపిన మార్గాన నడవగల చైతన్యం వాళ్లకు కలిగించాలని ఆమె చాలా ఆరాటపడే వారు.

స్వతంత్రం వచ్చింది. స్వతంత్రభారత పౌరులుగా అందరితోపాటు ఆమెకూడ సంతోషించారు. గర్వించారు. కాని అది ఆట్టేకాలం నిలవలేదు. స్వాతంత్ర్య సమరంతో సంబంధం లేనప్పటినుంచి ఆంధ్రరాష్ట్ర విభజన కాకముందునుంచి శ్రీ శాస్త్రి దంపతులకు రాయలసీమ అంటే వెర్రిమమకారం. దత్తమండలం పేరుతో, వుమ్మడి మద్రాసు రాష్ట్రంలో వెనుకబడిన ప్రదేశంగా

తరుచు కరువుకాటకాలతో యిబ్బందులకు, బాధలకు గురిఅయి వుండేది ఆ ప్రదేశం. దత్తమండలం అనేపేరే పౌరుషహీనంగ వున్నదని, ఆ ప్రాంతమంతా విజయనగర సామ్రాజ్యంగా ఒకనాడు రాయలు యేలిన దేశం కావటాన రాయలసీమ అని మార్చుకుందామని సూచించిన నాయకులలో శాస్త్రిగారు ముఖ్యులు.

ఆనాటినుంచి కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలు రాయలసీమ అనే ప్రసిద్ధి కెక్కినవి. రాయలసీమ రత్నాలసీమగా తయారయి కరువులు కాటకాలు లేకుండ ప్రజలు సుఖంగా వుండాలని మృత్యుంజయశాస్త్రి, లక్ష్మీదేవిగార్ల కోరిక. వెనుకబడిన ప్రాంతం అనే పేరుపోయి అన్ని వనరులతో ఆర్థికంగా సుసంపన్నంగా తయారు కావాలని తపన. అందువల్ల 1937 ప్రాంతాలలోనే వీరిద్దరు శ్రీ హెచ్. లింగారెడ్డి, శ్రీ హెచ్. సీతారామరెడ్డి వంటి రాజకీయ నాయకులతోకలసి తుంగభద్రపై ఆనకట్ట కట్టవలసినదిగా ప్రభుత్వాన్ని కోరారు. ఒత్తిడి పెట్టారు. చివరకు జయించారు. తుంగభద్ర ప్రాజక్టు అందరి మన్ననలు పొందేట్టుగా తయారయింది. ప్రజల కష్టాలు తీరినవి. స్వార్థమెరగనివారు సంతోషించారు. కాని మతాతత్వాలతో కూట నీతితో పైకి రావాలనుకునేవారు కులద్వేషాలను, భాషావిభేదాలను కష్టపడి పెంచి పోషించారు. అంతః కలహాలు ఆరంభమై రాష్ట్ర విభజనలు జరిగినవి. తుంగభద్ర ప్రాజెక్టు మాదంటె మాదని పోరాటాలు జరిగినవి. అది ప్రజలదని యెవరికి అనిపించలేదు. కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలు బళ్లారిజిల్లాలో నాలుగు తాలూకాలు ఆంధ్రులకు దక్కినవి. ఏ రాయలసీమను దత్త మండలాలనుంచి రత్నాలసీమగా తయారుచేయటానికి శ్రీ శాస్త్రి దంపతులు మరికొందరు ప్రజానాయకులు నిర్విరామకృషి జరిపారో, ఆ సీమ ఛిన్నాభిన్నమై పోయింది. ప్రజల ఆర్థిక వ్యవస్థ దెబ్బతినగలదన్న కలవరంలో డాక్టరు లక్ష్మీదేవి శ్రీమతి కె. జానకీదేవి వంటి నాయికలు ఆందోళన జరిపారు. తీవ్రసంచలన ఫలితంగా ఢిల్లీకి వీళ్లను ఆహ్వానించారు. శ్రీ గోవింద వల్లభపంత్ యింట్లోనే వీరికి బస యేర్పాటుచేశారు. అంతా సవ్యంగానే జరిగింది. పర్యవసానమే బెడిసి కొట్టింది. బళ్లారి జిల్లాలోని 5 తాలూకాలతోపాటు శ్రీయుతులు ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, బళ్లారి రాఘవమొదలయిన రత్నాలనుకన్న బళ్లారి నగరమే రాయలసీమకు, తెలుగు వారికి దక్కలేదు. లక్ష్మీదేవి మృత్యుంజయ శాస్త్రిగార్లకు యిది భరింప

శక్యంగాని వేదన కలిగించింది. 1934 నుంచి రాయలసీమకోసం వాళ్లుచేసిన కృషి ఒక్కకలంపోటుతో హతమారిపోయింది. వాళ్లుకలలుగన్న రాయలసీమ విచ్ఛిన్నమై ప్రజలు పరస్పరం ద్వేషించుకునే స్థితివచ్చింది. మానసికంగా యీ దెబ్బకు శాస్త్రి దంపతులు తట్టుకోలేక పోయినారు. తాము అంతగా ప్రేమించిన బళ్లారిని, స్వంత యిల్లువాకిలిని చిరకాల బంధుమిత్రులను తృటిలో వదలి మొదట ఆదోనికి, ఆ తరవాత హైదరాబాదుకు నివాసం మార్చేశారు. ఈ గాథ వింటుంటే శ్రీకృష్ణ నిర్యాణానికి తట్టుకోలేని పాండవుల హిమగిరి వనాల ప్రయాణం గుర్తుకు వస్తుంది. అంతటి నిజాయితీపరులు రాజకీయ రంగంలో కనిపించటం అరుదు.

బళ్లారి లేడీస్క్లబ్బుకు ఆమె కొంతకాలం కార్యదర్శినిగాను, ఆ తరువాత అధ్యక్షురాలుగాను వున్నారు. ఆ సమయంలో ఫోటోలు, టీ పార్టీలు, పేకాటలతో తృప్తిపడక, ఆమె సభ్యులను కూడగట్టుకుని డబ్బు, తిండిగింజలు వూళ్లో సేకరించి కరువు బాధితులకు పంపుతువుండేవారు. ఏ పని చేసినా ఒక సార్థకత వుండాలని, నిర్మాణాత్మకమైనదే సంఘసేవ అని ఆమె భావన.

ఆమెకు స్వార్థం తెలియదు. సంకుచితభావం సమీపానికిరాదు. రాజకీయ బాధితులకు కాంగ్రెసు ప్రభుత్వం యిచ్చిన భూములనుగాని, పెన్షనుగాని ఆమె తీసుకోలేదు. అవసరం కలిగిన మరియెవరికైనా యివ్వమన్నారు. ఆమెకిద్దరు బిడ్డలున్నారు. కాని ఒక తలిదండ్రులులేని అబ్బాయిని బిడ్డకన్న మిన్నగా పెంచి విద్యాబుద్ధులు చెప్పించి ప్రయోజకుడిని చేశారు. భర్త మరణించారు. వృద్ధాప్యం వచ్చింది. ఎంతమంది బంధువులనో ఆదుకుని ప్రయోజకులను చేసిన సహృదయ.

అతి సాదావేషం. ఏభేషజాలు లేవు. ఆడంబరాలు లేవు. మనిషిలోగాని, మాటలోగాని, ఆలోచనలోగాని వొంపుటంపు మచ్చుకైనా కానరావు. అతి నూటిగా మాట్లాడినా అవతలవారికి ఆమెపట్ల గౌరవం సద్భావం కలగటమేకాక మళ్లీమళ్లీ ఆమెను కలుసుకుని మాట్లాడాలని కోరుకుంటారు. ఆమె హృదయ నైర్మల్యం ముఖానికి వింతతేజస్సు నిస్తుంది. గొప్పదేశసేవిక, సంఘసేవిక. ఈ త్యాగమయి 1976 ఫిబ్రవరిలో కన్నుమూశారు.

---

# శ్రీమతి కాట్రగడ్డ రామసీతమ్మ

జననం 1883 మరణం 4-9-1973

గాంధీజీ తన జీవితకాలంలో ఆరుసార్లు ఆంధ్రదేశంలో అడుగు పెట్టారు. ప్రతిసారి చక్రవర్తికికూడ లభించని గౌరవం ప్రజాభిమానం అందించారు ఆంధ్రులు. స్వరాజ్య సంపాదనకు రాట్నం సుదర్శనాయుధం అని గాంధీజీ అన్నమాటను వేదాక్షరంగా పాటించి యింటింట రాట్నంపైన నూలు వడికేవారు. ముతక ఖాదీతో తృప్తిపడక దేశం మొత్తంమీద నాణ్యమైన నాజూకైన ఖాదీ బట్టలు, పట్టు, జరీలతోసహా తయారుచేసేవారు. దేశంలోని అన్నిరాష్ట్రాలకు నాటినుంచి నేటివరకు సరఫరా చేస్తునే వున్నారు. పాముకుబుసంలాంటి ఖాదీ ధరించి యే ఘోషా పద్ధతులు లేకుండ పురుషులతో సరిసమానంగ బహిరంగ సభలకు హాజరవుతు, ఏవంతయినా ముందువెనుకలు చూడకుండ మణుగులకొద్ది బంగారం జాతీయనిధికి సమర్పించే ఆంధ్ర మహిళలంటే మహాత్ముడికి మరీ గౌరవం, అభిమానం. 1929లో గాంధీజీ ఖాదీనిధి సేకరణకు వచ్చినప్పుడు కూడ అదే జరిగింది. నిధికి నగదు, నగలు సమర్పించినవారిలో శ్రీమతి కాట్రగడ్డ రామసీతమ్మ ఒకరు.



శ్రీమతి కాట్రగడ్డ రామసీతమ్మ

ఆమె కుమారుడైన శ్రీ మధుసూదనరావు 1920 నుంచీ జాతీయోద్యమంతో గట్టి సంబంధం పెట్టుకున్నారు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘానికి కొంతకాలం ఆయన కార్యదర్శిగా వున్నారు. 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని వాలంటీరు శిబిరానికి అధిపతిగా వుండి అరెస్టు అయినారు. లాఠీ దెబ్బలు తిన్నారు. అందువల్ల ఆమెకు దేశభక్తితో పాటు వాలంటీర్లపైన వాత్సల్యం, లాఠీ దెబ్బలుతిన్నవారిపైన జాలి పరిపాటి అయినవి. చేతనయినంతగ సహకరించుతూ వుండేవారు.

1932 నాటికి ప్రభుత్వం దమననీతిని బాగా ఆచరణలో పెట్టింది. ప్రతివారిని అరెస్టుచేసి జైళ్లు నింపటం లేనిపోనిబెడద అని గుర్తించింది. కాని ప్రజలు భయంతో వొణుకుపుట్టి వుద్యమంవైపు కన్నెత్తిచూడకుండ చేయాలని దురాశ పడ్డది. దాంతో సత్యాగ్రహులను తగిన కారణంవున్నా లేకపోయినా లాఠీలతో కొట్టటం, సభలు సమావేశాలు చెదరగొట్టి వుపన్యాసాలు ప్రబోధాలు వినపడకుండ అవరోధం కల్పించటంవంటి వికృత చేష్టలు ఆరంభించింది. ఐనా ప్రజలు నిత్య నూతనోత్సాహంతో సత్యాగ్రహం చేస్తునేవున్నారు. వాలంటీరు శిబిరం చెల్లాచెదరు చేసి అప్పటి అధిపతిఅయిన ఆమె కుమారుడు శ్రీ మధుసూదనరావుని రెండవసారి అరెస్టుచేశారు. పరిస్థితులు చాలా వుద్రిక్తంగా వున్నవి. శ్రీమతి రామసీతమ్మ యింటి పక్కన మంచినీళ్లబావి వున్నది. నలుగురు కూడే ఆ చోట పెద్దచెట్టుమీద కొంతమంది యువకులు 14–11–1932న యెంతో వుత్సాహంతో జాతీయ జండా ప్రతిష్ఠించారు. అంతే క్షణంమీద పోలీసులువచ్చి లాఠీచార్జీ చేశారు. ఎవరికి యెంత తీవ్రమైన దెబ్బలు తగిలినవో వారికి అనవసరం. 1932 సత్యాగ్రహ సందర్భంలో విజయవాడలోనే 250 లాఠీచార్జీలు జరిగినవి అని అంచనా. కొంతమందిని అరెస్టు చేశారు. అంతటితో పోలీసువారి పని ముగిసింది. లాఠీదెబ్బలకు డస్సిపోయి గాయాలతో పడివున్న యువకులను చూసి రామసీతమ్మగారి మాతృహృదయం భరించలేకపోయింది. వారిని తను యింటికిచేర్చి వాత్సల్యాభిమానాలతో మందులు మాకులుయిచ్చి,అన్నపానాలు చేతుల మీదుగా అందించారు. అది అప్పటి ప్రభుత్వ పరిభాషలో రాజద్రోహం, గొప్పనేరం. ఫలితంగా ఆమెను అరెస్టు చేశారు. ఒకసంవత్సరకాలం కఠిన శిక్షవేసి ''సి'' క్లాసు యిచ్చారు. ఇది చాలనట్లు ఐదు వందలు జరిమానా వేశారు. ఆమెకు యింత కఠిన గా శిక్ష వేస్తే భయపడి క్షమాపణ చెప్పుకోవటమో జరిమానా చెల్లించుకోవటమో చేస్తారని అధికారుల అభిప్రాయం. కాని ఆమె నిస్సంకోచంగ రాయవేలూరు జైలుకు వెళ్ళారు. జరిమానా యివ్వలేదు. తల్లీకొడుకులు జైల్లోవున్నారు. పోలీసులు కర్కశంగా యింటిపైన దాడి చేశారు. ధాన్యం, మంచాలు, పరుపులు, బట్టలు, సామాన్లు బళ్లకెత్తి తీసుకు వెళ్లి వేలం వేశారు. ఇంకా బాకీతేలింది. ఆమె కోడలు వంటిమీద నగలు తీసుకున్నారు. నరక సదృశమైన ''సి''క్లాసులో అన్ని యిబ్బందులు సహించుతు గడుపుతువుండగా పక్షవాతం వచ్చి కాలు చేయి పడిపోయినవి. జైలు అధికారులు నిర్దాక్షిణ్యంగా శవాలగదిలోనే ఆమెను వుంచారు. ఆమెకు తొంభై ఏళ్లు బ్రతకవలసిన గీతవుండటంతో ఆ పరిసరాలలో, ఆ పరిస్థితిలోనే కోలుకున్నారు. ఇప్పటికైనా క్షమాపణ చెప్పుకుంటే విడుదలచేస్తామని అధికారులు సానుభూతి వొలకపోశారు. ఆమె ఆ మాట చెవిన వేసుకోలేదు

వ్యాధిగ్రస్తమైన శరీరంతో అట్లాగే గడుపుతువుండగా ఆమెను రాయవేలూరు నుంచి మధుర జైలుకు మార్చారు. శిక్ష ముగిసి మధుర జైలునుంచి యిల్లు చేరుకున్నారు.

ఆమె శ్రీ నూతక్కి కొండయ్య, శ్రీమతి నాగమ్మల కనిష్ఠ పుత్రిక. గుంటూరు జిల్లా మంగళగిరి తాలూకా మందడం గ్రామంలో 1883 లో జన్మించారు. నలుగురు అక్కలు వున్నారు. ఆ గ్రామంలో వున్న వీధిబడిలో వున్నంతవరకు చదువుకున్నారు. 1900 సంవత్సరంలో విజయవాడ మొగల్రాజపురం వాస్తవ్యులు కాట్రగడ్డ నర్సయ్యగారితో వివాహం జరిగింది. 1916 లో వైధవ్యం ప్రాప్తించింది. బిడ్డలులేని కారణంగా కాట్రగడ్డ గంగయ్యగారి కుమారుడు శ్రీ మధుసూదనరావుని దత్తత తీసుకుని తన అక్క మనుమరాలైన శ్రీమతి తులసమ్మను కోడలుగా తెచ్చుకున్నారు. రాజకీయాలలోను గృహ విషయాలలోను తల్లీకొడుకులది ఒక్క మాట, ఒక అభిప్రాయం.

1933 డిశంబరు ఆఖరున గాంధీజీ హరిజనోద్యమ ప్రచారం చేస్తూ, నిధుల సేకరణకు ఆంధ్రదేశం వచ్చారు. విజయవాడ దుర్గా భవనంలో స్త్రీల బహిరంగసభ జరిగింది. గాంధీజీ స్త్రీలనుద్దేశించి అస్పృశ్యతా నివారణ, హరిజనోద్ధరణల గురించి వుపన్యసించారు. శ్రీమతి రామసీతమ్మ మరొకమారు గాంధీజీకి తమ బంగారు గాజులు, వుంగరం, పదమూడు వందల నగదు సంతోషంగ యిచ్చారు. అంతటితో ఆ కధముగిసిపోలేదు. తన శరీర దారుఢ్యం లోపించినా మహాత్ముడి ప్రతి అక్షరాన్ని అమలులో పెట్ట నిశ్చయించు కున్నారు. కార్యాచరణలో చూపించటానికి హరిజనులకు మిగతా కులాలవారికి సహపంక్తి భోజనాలు తమ యింట్లో ఏర్పాటుచేశారు. అది వారి బంధు వర్గమే ఆమోదించలేదు. ఆమె లెక్కచేయలేదు. కొడుకు సహకారం వున్నది. ఆమెకది చాలు. పుర ప్రముఖులు అనేకులు విందులో పాల్గొన్నారు. వారి సంస్కరణా భావాలను అభినందించారు. నాటినుంచి వారి యింట్లో వంట పనితో సహా అన్నిపనులకు హరిజనులు నియమితులైనారు. బంధువర్గం కొంత కాలం వారి కుటుంబాన్ని బహిష్కరించినా తరువాత ఆక్షేపణ సమసిపోయింది. ఆ రోజుల్లో సంఘాన్ని ఎదుర్కొనటానికి చాలా గుండె నిబ్బరం అవసరం.

1947 లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. స్వతంత్ర భారతంలో సంఘానికి దేశానికి వుపకరించే సత్కార్యాలు ఆమె యెన్నో చేశారు. పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు చరిత్ర సంగ్రహం మొదటి కూర్పు అయిపోగా

స్వంత డబ్బుతో రెండవసారి అచ్చు వేయించి స్వాతంత్ర సమర యోధులందరికి వుచితంగా పంపించారు. ఆమెకు దేశ సేవకుల పైన చాలా అభిమానం. తామ్ర పత్రం బహూకరించి స్వతంత్ర భారతప్రభుత్వం ఆమెను గౌరవించారు కాని ప్రభుత్వం యిచ్చే పెన్షను మాత్రం ఆమె స్వీకరించలేదు. బలి చక్రవర్తి చెప్పినట్లు "నాదుకరంబు మీదగుట మేల్గాదే" అన్నభావనతో యివ్వటమే జరిగింది. కొడుకు, కోడలు, మనుమలు, మునిమనుమల మధ్య ఆనందంగా తొంభై సంవత్సరాలు గడిపి 4–9–1973న పుణ్యలోకాలకు తర్లిపోయినారు.

---

# శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి

**జననం 18–5–1914**

"హర్షవర్ధన్" ఓడ 1977 జనవరి 20న కలకత్తా నుంచి అండమాను దీవులకు బయలుదేరింది. మరిమూడు రోజులకు అండమానులో నేతాజీ విగ్రహం ప్రతిష్ఠించటానికి భారత ప్రభుత్వం నిర్ణయించి, ఆ సమారోహంచూసి ఆనందించటానికి దేశవ్యాప్తంగ 60 మంది స్వాతంత్ర్య సమర యోధులను ఎంపికచేసి, ఓడయెక్కించింది. ప్రవాసంలో స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని నెలకొల్పవుద్దేశించి నేతాజీ సుభాష్ చంద్ర బోసు భారత ప్రభుత్వ చిహ్నంగ, సాధికారంగ జాతీయ జండా ఎగరవేసిన పవిత్ర స్థలంలో ఆయన దళనాయకుడయిన శ్రీ షానవాజుఖాన్, యావద్భారతానికి నేతాజీ అయిన బెంగాలు వీరబెబ్బులి బోసుబాబు నిలువెత్తు విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. నాటి ఆజాద్‌హింద్ ఫౌజులో పాల్గొన్న



శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి

కెప్టెను లక్ష్మీవంటి వీరాగ్రేసరు లనేకులు హాజరయినారు. దేశస్వాతంత్ర్యానికి సమస్తం అర్పించిన అమరవీరులకు జోహారులర్పించారు ప్రేక్షకులు. బ్రిటిష్ ప్రభుత్వం ద్వీపాంతరవాసశిక్ష విధించి పంపిన దేశభక్తులు, దీర్ఘశిక్షలతో అలమటించిన జైలుగదులు చూసినప్పుడు శరీరాలు జలదరించినవో పులకరించినవో తెలియలేదు వాళ్లకు. ఆ త్యాగధనుల అచంచలదేశభక్తికి ముగ్ధులయి ధన్యులమనుకున్న 60 మంది స్వాతంత్ర్య సమరయోధులలోను నలుగురే స్త్రీలు. వారిలో ఒకరు శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి.

కొంతమంది తమకు సమకూరిన జీవితంతో తృప్తిపడరు. తమకు నచ్చిన మార్గంలో జీవితం సాగించటానికి వేయికళ్లతో పరిస్థితులను, పరిసర వాతావరణాన్ని గమనించుతువుంటారు. సాహసంతో, వుత్సాహంతో పైపైకి

అడుగు వెనాపుతారు. అందువల్ల వాళ్లు ఒకవిధమైన ప్రత్యేకతతో, యితరుల కన్న పదిబారలు ముందుకనిపించుతు వుంటారు. ఆమె ఆ కోవకు చెందినవ్యక్తి.

కృష్ణా జిల్లా, నందిగామ తాలుకా వీరులపాడు ఆమె జన్మస్థలం. 1914 మే 18న వాసిరెడ్డి సీతారామయ్య, సుబ్బమ్మగార్ల కడసారి బిడ్డగా జన్మించారు. ఆమెకొక అక్క, యిద్దరన్నలు. పెదన్న శ్రీ మల్లికార్జునరావు బి.ఏ., ముగించి విదేశాలకు వెళ్లాలని పెద్ద హోదాలలో వుండాలని అనుకున్నా ఆయన 1920లో గాంధిమహాత్ముని పిలుపు విని దేశసేవకు పూనుకున్నారు. ఆమె పసిమనసు పైన ఈ విషయం బాగా హత్తుకు పోయింది. గురువుగారయిన శ్రీ జంగాహనుమయ్య చౌదరి కవి, పండితుడు కావటంవల్ల అర్థ సహితంగ వుత్తమ కావ్యాలన్నీ బోధించి మంచి విద్వత్తు కలిగించారు. తల్లి వైపు బంధువులు, గుంటూరు జిల్లా, తెనాలి తాలుకా, చేబ్రోలు వాస్తవ్యులయిన సూర్యదేవర నాగయ్యాగారితో ఆమెకు పదేళ్ల వయసులో వివాహం జరిగింది. పదహారు సంవత్సరాలు దాటి ఆమె అత్తవారింటికి వచ్చేవరకు అతిశ్రద్ధగా విద్యావ్యాసంగం కొనసాగించారు. కొత్తగా వీరులపాడులోస్థాపించిన గ్రంథాలయం నుంచి శ్రీయుతులు తాపీ ధర్మారావు, గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగం పంతులు, త్రిపురనేని రామస్వామి చౌదర్లవంటి సంస్కార ప్రియులు, సంఘసేవకుల రచనలు చదివి జీర్ణంచేసుకున్నారు. ఇవన్నీ కలిసి ఆమెలోవున్న స్వతంత్ర భావాలను స్వేచ్ఛాభిలాషను పెంపొందించినవి.

1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనాలని ఆమె చాలా ప్రయత్నించారు. కాని అంత చిన్న వయసులో సత్యాగ్రహం చేయటానికి, జైలుశిక్షఅను భవించటానికి పెద్దలు అనుమతించలేదు. 1932 శాసనోల్లంఘనం నాటికి ఆమె అత్తవారింటికి చేబ్రోలు వచ్చారు. చేబ్రోలు వీరులగడ్డ. అప్పటికి 15 సంవత్సరాల నుంచి జాతీయోద్యమంలో అనేకులు పాల్గొన్నారు. హిందీ నేర్చుకోవటం, రాట్నంమీద నూలు వడకటం, ఖాదీధారణ అక్కడ పరిపాటి. ఆ వూరు ప్రసిద్ధ ఖాదీ వుత్పత్తి కేంద్రం. ఉద్యమం ప్రచారం చేస్తూ శ్రీమతి భారతీదేవి రంగా చేబ్రోలు వచ్చారు. దాంతో శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి బహిరంగంగ వుద్యమంలో పాల్గొని శాసనధిక్కారం చేయ నారంభించారు. అప్పటివరకు వారి యిళ్లలో పాటించుతున్న ఘోషా పద్ధతి అంతటితో వదిలిపోయింది. ఆమె, ఆమె పినతండ్రి కూతురు శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మ, తోడికోడలు శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ, ముగ్గురు 1932 జనవరి 26న శాసనోల్లంఘనం చేయబోతున్నట్లు ముందుగానే చుట్టుపక్కల గ్రామాలకుకూడ తెలిసిపోయింది. చూడవచ్చినవారితో వీధులన్నీ కిక్కిరిసి

పోయినవి. జాతీయగీతాలు పాడుతు, శాసన ధిక్కారనినాదాలుచేస్తూ వూరే గింపు బయలుదేరింది. కొన్ని వీధులుదాటి రాజవీధి ప్రవేశించేటప్పటికి జన ప్రవాహంపై లాఠిఛార్జిచేసి పోలీసులు ఈ ముగ్గురిని అరెస్టుచేశారు. పొన్నూరులో విచారణజరిపి ఒక సంవత్సరం కఠినశిక్ష "సి" క్లాసుతో విధించారు. అదికాక 50 రూపాయలు జరిమానా లేక 2 నెలలు అదనపు శిక్ష వేశారు. ఇంతవరకు మామూలుకథే. కాని జాతీయోద్యమ ప్రభావం, గడపదాటి ఎరగని స్త్రీలు కష్టాలను వెతుక్కుంటు వుద్యమంలో ప్రవేశించటం ప్రభుత్వో ద్యోగులపైన, వారి కుటుంబ సభ్యులపైన బాగా పనిచేసిందని, వారికీ విచక్షణ, వున్నత భావాలు వున్నవని నిరూపించటాని కేమోనన్నట్లుగా, యిల్లాలిమంద లింపుతో, అభ్యర్థనతో మేజస్ట్రేటు కఠిన శిక్షను రద్దుచేసి ఆ ముగ్గురికి విడి శిక్షమాత్రం వేసినట్లు తెలుస్తున్నది.

ఆమె రాయవేలూరు జైలుకు చేరుకున్నారు. అక్కడ ఎంతోమంది దేశసేవికలను ఒక్కసారిగా ముఖాముఖి కలుసుకోగలిగినందుకు ఎంతగానో వుప్పొంగి పోయినారు. అంతకు ఒకటి రెండురోజుల క్రితమే సాహసంతో నిర్భయంగా జైలు అధికారులను నిలవేసి ప్రశ్నించినందుకుగాను దుర్గాబాయమ్మగారిని మధుర జైలుకు మార్చారు. జైలు శిక్ష అనుభవించుతున్న ఆమె తల్లి బెన్నూరికృష్ణవేణమ్మ గారు హిందీ నేర్పేవారు. మరికొందరు కుట్లు, అల్లికలు నేర్పేవారు. మహోత్సా హంతో క్షణం తీరిక లేని వ్యాసంగాలతో ఆరు నెలలు గడిచిపోయింది. జైలు కిక్కిరిసిపోయించె. అందువల్ల యెక్కడ ఖాళీవుంటే అక్కడికి కొంత కొంత మందిని పంపించారు. ఆ సందర్భంలో శ్రీమతి రాజ్యలక్ష్మీదేవిని ఆమె తోడికోడలుతోపాటు మరి ఎనిమిదిమందిని మద్రాసుకు మార్చారు. అప్పుడ క్కడ కజిన్సు సతి శిక్ష అనుభవించుతువుండేది. ఆమెకు హిందీరాదు. యహ్ క్యాహై అంటే యిది యేమిటి అని అర్థమని యెవరో వివరించారు. ఇక ఆమె ప్రతిదీ చూపించి యహ్‌క్యాహై అని ప్రశ్నించి తెలుసుకునేదట. ఆ విదేశాంగన చాకచక్యానికి తెలివికి అందరు ఆశ్చర్యపోయేవారు. శిక్షాపరిమితి ముగిసి విడుదలయిన రోజున శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి బృందానికి శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతి తమయింట ఆతిథ్యమిచ్చి వీడ్కోలుయిచ్చారు.

శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి యిల్లు చేరుకున్నారు. కాని వ్యాపకాలు మానలేదు. వెంకటేశ్వరమాంబ స్త్రీల గ్రంథాలయానికి కార్యదర్శిగావుండి నిర్వహించారు. ఖాదీ ప్రచారం, మహిళావుద్యమం, రాజకీయకలాపాలు పరిపాటి అయినవి. గ్రంథాలయంలో హిందీ క్లాసులు ఏర్పాటుచేశారు.

ఆమె ఆస్థతో చదివి రాష్ట్రభాష పరీక్షలో వుత్తీర్ణులయినారు. అంతటితో తృప్తిపడక తెనాలి వెళ్ళి హిందీ విద్యాలయంలో చదివి రాష్ట్రభాషా విశారద పట్టం పుచ్చుకున్నారు. ఆ కాలంలో ఒక గృహిణి యిల్లువాకిలి వదిలి పొరుగూరు పోయి పురుషుల దగ్గర చదువుకోవట మంటే సామాన్య విషయంకాదు. ఆమె ఒక పని చేయాలనుకుంటే వేటిని లెక్కపెట్టేస్వభావం కాదు. అస్పృశ్యతా నివారణ విషయంలోను ఆమె నిస్సంకోచంగా పాల్గొన్నారు. పేరంటం సమయంలో సైతం హరిజన స్త్రీలను ఆహ్వానించి అందరితోపాటు గౌరవించారు.

1940 లో వ్యక్తి సత్యాగ్రహం ఆరంభమయింది. బహుశా గుంటూరు జిల్లాలో ఆ సత్యాగ్రహం చేయటానికి అనుమతి లభించిన ప్రథమ స్త్రీ ఆమె. ఆ వూరి పెద్దల కోరిక ననుసరించి ఆమె బాపట్ల తాలూకా బ్రాహ్మణ కోడూరులో 1941 జనవరి 30 న సత్యాగ్రహం చేశారు. అరెస్టు చేసి ఆ రాత్రికే ఆమెను ఒంగోలు సబ్ జైలుకు తీసుకువెళ్ళారు. జైళ్లన్నీ రాజకీయబందీలతో నింపటంకన్న జరిమానాలు వసూలుచేయటం లాభదాయకమని ప్రభుత్వం అప్పటికి బాగా తెలుసుకున్నది. దాంతో ఆమెకు వందరూపాయల జరిమానా, రెండునెలల జైలుశిక్ష విధించారు. ఈసారి "ఏ" క్లాసుయిచ్చి రాయవేలూరు పంపించారు. అక్కడ ఆ సమయంలో శ్రీమతులు రుక్మిణీ లక్ష్మీపతి, రాధాబాయి సుబ్బరాయన్, కుట్టిమాలు అమ్మ, అమ్మన్న రాజా, మూల్పూరి చుక్కమ్మ మరి యెందరో వున్నారు. ఈమె హిందీపాఠాలు చెప్పేవారు. శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్ యెంతో వాత్సల్యంతో ఆమెకు ఇంగ్లీషు నేర్పేవారు. చక్కగా చదువుకోమని యెంతగానో ప్రోత్సహించేవారు. ఫలితంగా శ్రీమతి రాజ్యలక్ష్మీదేవికి చదువుకుని పరీక్షలకు వెళ్లాలన్న దృఢ సంకల్పం కలిగింది. మూల్పూరి చుక్కమ్మగారు విడుదలయి వెళ్తున్నప్పుడు మద్రాసు ఆంధ్రమహిళాసభలో తాను బెనారెస్ మెట్రిక్‌పరీక్షకు చదువు కోవటానికి తగిన ఏర్పాట్లు చేయమని దుర్గాబాయమ్మగారికి కబురు పంపించారు. జైలుశిక్ష రెండునెలలే కావటాన యిట్టే గడిచిపోయింది.

శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి ఆంధ్ర మహిళాసభకు చేరుకున్నారు. అప్పటికి అక్కడ యింకా హాస్టలు లేదు. అందువల్ల సభా భవనంలో ఒక గదిలోవుండి హోటలునుండి భోజనం తెప్పించుకుంటు చదువుకునేందుకు ఆమెకు ప్రత్యేక సదుపాయం కల్పించారు. ఇట్లా రెండు మూడు నెలలు గడిచినవి. కాని ఆమె యీవిధంగా వూరుగాని వూళ్లోవుండి అవసరంలేని చదువులు చదవటం యింటిదగ్గర పెద్దలకు బొత్తిగా నచ్చలేదు. చెప్పిచూశారు. లాభం లేకపోయింది. ఇది పద్ధతికాదని డబ్బు పంపటం మానేశారు. దాంతో ఆమె

మద్రాసువదిలి యిల్లుచేరుకోక తప్పలేదు. కాని ఆమె తాను యెన్నుకున్న మార్గం కంటకావృతమైనా వెనుతిరిగే వ్యక్తికాదు. మరికొద్దిరోజులకె తెనాలివెళ్ళి ట్యుటోరియల్ కాలేజీలోచదివి బెనారస్ మెట్రిక్యులేషను పరిక్షలో నెగ్గారు. చేబ్రోలు పట్టణ కాంగ్రెసు అధ్యక్షురాలుగా మహిళాభ్యున్నతికి, దేశాభ్యుదయానికి పాటుపడుతువున్నారు.

ఇంతలో క్విట్టిండియావుద్యమం వచ్చింది. విజయమో వీరస్వర్గమో తేల్చుకునే సమయం వచ్చింది. దేశనాయకులందరిని జైళ్ళలోవుంచారు. దేశ వ్యాప్తంగ ప్రజలు ఎదురు తిరిగారు. జైలునుంచి తప్పించుకున్న శ్రీ జయప్రకాష్ నారాయణ నాయకత్వం వహించారు. ఐదుగురు సభ్యులతో ఆంధ్ర రాష్ట్రంలో వుద్యమ సారధ్య సంఘం యేర్పడింది. అందులో ఆమెను శాసనధిక్కార శాఖ మెంబరుగా నియమించారు. ఆమె రహస్యంగా జిల్లాలన్నీ తిరుగుతు ప్రజలను వుద్బోధించుతు, శాసనధిక్కారం చేయించారు. పోలీసులు ఆమెను వెంటాడేవారు. కాని దేశభక్తులు అప్రమత్తతతో ఆమెను కాపాడేవారు. ఉద్యమంలో ప్రచ్ఛన్నంగా తిరుగుతు ప్రజలను రెచ్చగొడుతున్న కారణంగా చేబ్రోలులో ఆమె 1941 నుంచి స్థాపించి నడుపుతువున్న జాతీయమహిళా విద్యాలయ విద్యార్థినులనుకూడ ప్రభుత్వం శంకించి అరెస్టు చేసేవారు. ఆ విధంగా 1945 వరకు ఆమె ప్రభుత్వంతో దాగుడుమూతలు ఆడుకున్న మీదట అజ్ఞాతవాసం తీరిపోయింది.

1945 అక్టోబరు 2న ఆమె చేబ్రోలులో ఆంధ్రరాష్ట్ర మహిళా రాజకీయ పాఠశాలను ప్రారంభించారు. శ్రీమతి భారతీరంగా ఆ పాఠశాల కమిటీ అధ్యక్షురాలుగా వుండి ఆమెకు తోడ్పడ్డారు. పాఠశాల కారణంగా ఆంధ్ర నాయకులందరు తరచు ఆ వూరురావటం, ప్రజలకు యెంతో వుత్సాహోన్నిచ్చింది. ఉత్తేజపరచింది.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. కాని నైజాము వాసులకు విముక్తికలగలేదు. అక్కడి ప్రజలలో చైతన్యంకలిగి విప్లవం తలెత్తింది. దానిని వెంటనే సమూలంగా అణచివేయాలన్న వుద్దేశంతో నైజాం ప్రభుత్వం దమననీతిని చేపట్టింది. ముష్కరరజాకార్లకు మద్దతుయిచ్చింది. దురాగతాలకు అంతులేకపోవటంతో ప్రజలందరు ఒక్కటై స్వాతంత్ర్యసమరం సాగించారు. కాంగ్రెసు అండ వుద్యమానికివుంది. ఆంధ్రనాయకు లనేకులు సరిహద్దు ప్రాంతాలలో శిబిరాలు నెలకొల్పి ప్రచారం ముమ్మరంగా సాగించారు. శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి చందాలు, విరాళాలు పోగుచేసి తోడ్పడటానికి వెళ్లారు.

ధనసహాయంకంటే మాకు అంగబలంకావాలి, మాతో నిలబడి వుద్యమ ప్రచారానికి సహకరించమని నాయకులు అన్నారు. శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి పాటకచ్చేరీలద్వారా, చందాలు, విరాళాల సేకరణతోను శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి ధన సహాయంచేస్తు, వ్యక్తిగతంగా అక్కడ నిలబడి తీవ్ర ప్రచారం చేశారు. పోలీసు చర్య ముగిసి హైదరాబాదు సంస్థానం స్వతంత్ర భారతంలో విలీన మయ్యేవరకు ఆమె అక్కడేవుండి మాట నిలుపుకున్నారు. ఆ వెనువెంటనే బయలుదేరిన భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన వుద్యమంలోను తీవ్రకృషి చేశారు.

1948 జున్ 8వ తేదీన విజయవాడలో "తెలుగుదేశం" అనే వారపత్రిక స్థాపించి తానే నడపసాగారు. మరికొంత కాలానికి ఆంధ్రరాష్ట్ర రాజధానికి ఆ పత్రికను తరలించారు. దానికోసం స్వంత ప్రెస్సు నెలకొల్పారు. పుష్కరం పాటు నిరాఘాటంగా నిర్వహించారు. తెలుగుస్త్రీలు యథేచ్ఛగా చదువుకోవ టానికే తగిన బడులులేని హైదరాబాదులో ఒక ఆంధ్ర మహిళ స్వయంగా పత్రికను, ప్రెస్సును స్థాపించటం, నిర్వహించటం చాలా ఆశ్చర్యాన్ని సంతోషాన్ని కలగచేసినవి. ఆమె క్విట్టిండియా వుద్యమంలో ప్రచ్ఛన్నంగా నాయకత్వం వహించటం, హైదరాబాదు సంస్థాన స్వాతంత్ర్య పోరాటంలో నిర్భయంగా పాల్గొనటం, నిస్సంకోచంగ తెలుగు వారపత్రికను, ప్రెస్సును నిర్వహించటం తెలిసినవారికి 1977లో ఆమె దేశవ్యాప్తంగ ఎంపికయిన నలుగురు మహిళలలో ఒకరుగా అండమానువెళ్లి నేతాజీ విగ్రహప్రతిష్ఠాపనలో పాల్గొనటం చాలా సబబుగా కనిపించుతుంది.

---

# శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ

జననం 1904 మరణం 8-6-1975

"అమ్మా రాజ్యలక్ష్మిదేవి, మహిళా ఆశ్రమంలో శిక్షణ పొందటానికి నీవు వచ్చినందుకు చాలా సంతోషంగావుంది. భర్తృ వియోగంవంటి క్లేశాలన్నీ మరచిపో. త్రికరణశుద్ధిగా నీ జీవితాన్ని ప్రజాసేవకు అంకితంచెయ్యి. శిక్షణకాలంలో ఉత్సాహంగ పనిచేసి చక్కని సేవికగ తయారు కావాలని నిన్ను నేను ఆశీర్వదించుతున్నాను" అని శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మను సహానుభూతితో కన్న తండ్రిలాగ జాతిపిత మహాత్మాగాంధీ 1938లో ఆశీర్వదించారు. మహాత్ముడికి ఆంధ్రస్త్రీలంటే చాలా అభిమానం. అసహాయోద్యమంలో దేశం మొత్తం మీద ఆంధ్రస్త్రీలు మహోన్నతంగా పాల్గొన్నారని, ఖాదీ వుద్యమానికి వాళ్లు అద్వితీయ ప్రచారం చేశారని, నిస్వార్థంగా స్వాతంత్ర్య సమరంలోకి దూకారని ఆయన బాహాటంగా సంతృప్తి వెల్లడించారు.


శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ

1933 లోనే ఆమెను వార్ధా వచ్చి ఆశ్రమంలో వుండమని మహాత్ముడు పిలిచారు. ఆమె వెళ్లలేకపోయినారు.

ఇప్పుడు విజయవాడలో ఒక భాగంగా చేరివున్న పటమట గ్రామంలో బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు 1904లో జన్మించారు. శ్రీమతి రంగనాయకమ్మ, శ్రీ గోవిందరాజు బాలాజీరావులు ఆమె తలిదండ్రులు. వంశ పారంపర్యంగా వస్తున్న పాండిత్య ప్రకర్ష, కావ్యపురాణాల పరిచయంతప్ప స్కూలు చదువు అంతగాలేదు. తమ యింట్లోపుట్టి తమతోపాటు పెరిగిన మేనత్త కుమారుడు బసవరాజు అప్పారావుగారితో 1916లో ఆమెకు వివాహం అయింది. ఆయన హైస్కూలులో చదువుకుంటున్న రోజులనుంచి గేయాలు రచించేవారు. తరవాత విమర్శక గ్రంథాలు కొన్ని వ్రాశారు. అనేక దేశభక్తి గేయాలను రచించటమేకాక కాంగ్రెసు కార్యకర్తలకు స్వాతంత్ర్య సమరయోధులకు

అవసరమైన వ్రాతకోతల సలహాలు సంప్రదింపులలో సహకరించుతువుండేవారు. రాజ్యలక్ష్మమ్మగారి అన్న శ్రీ వెంకటేశ్వర రావు పది సంవత్సరాలు పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా వున్నారు. ఈ ముగ్గురు జతగా ప్రతి కాంగ్రెసు సమావేశానికి హాజరయ్యేవారు. ముగ్గురు కలిసి దేశసమస్యలు చర్చించేవారు. మహాత్ముడి ఆదేశాలు తు. చ. తప్పకుండ పాటించేవారు. కుటుంబ సభ్యులందరు నూలు వడికేవారు. ఖాదీ ప్రచారం చేసేవారు. అస్పృశ్యతా నివారణకు తీవ్ర కృషి చేశారు. ఎంతమంది అపహాస్యం చేసినా, బెదిరించినా లెక్కచేసేవారు కాదు. ఆమె బామ్మగారే ఒక హరిజన బాలికను పెంచి, పెళ్లిచేసి, సారెపెట్టి అత్తవారింటికి పంపిన గాథ ఆ ముగ్గురికి మరింత ధైర్యం ప్రోత్సాహం కలిగించి వుంటుంది. విదేశీవస్తు బహిష్కరణ ప్రచారం చాలా యెక్కువగా చేయటమే కాక వాళ్లు ముగ్గురు ఆ నియమం సర్వదా పాటించారు. మద్యపాన నిషేధం ప్రచారం చేశారు. విజయవాడలో కల్లు, సారా కొట్ల ముందు, విదేశీ వస్త్ర దుకాణాలదగ్గర శ్రీమతులు పొదర్తి సుందరమ్మ, శ్రీ పెరంబుదూరు సుభద్రమ్మతో కలిసి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ పికెటింగు చేసేవారు. వీరం దరు విజయవాడనుంచి బందరు రేవుకు వెళ్లి ఉప్పు వండిన సందర్భంలో వుత్తరోత్తర ఉప్పల లక్ష్మణరావుగారిసతీమణి అయిన స్విస్ వనిత శ్రీమతి మెల్లి షోలింగరుకూడ అతివుత్సాహంతో వీరివెంట ఉప్పు వండటం, అమ్మటం వంటివన్నీ చేశారు. 14, 15 ఏళ్ల వయసునుంచే జాతీయోద్యమంలో సకుటుంబంగ పాల్గొన్నందువల్ల రాజ్యలక్ష్మమ్మగారికి ఉన్నవదంపతులు, కాశేశ్వరరావు దంపతులు, శ్రీమతులు దువ్వూరి సుబ్బమ్మ, మాగంటి అన్నపూర్ణల వంటి వుద్యమ పెద్దలు, నాయకులు, పరిచయులు ఆప్తులు అయినారు.

1917—26 మధ్య కాలంలో ఆమె భర్త శ్రీ అప్పారావు భారతి పత్రికకు సహాయ సంపాదకులుగా వుండేవారు. ఆ తరువాత 1933 వరకు విజయవాడలో న్యాయవాదిగా వుండేవారు. వారి యిల్లు యెప్పుడు దేశనాయకుల తోను కవులతోను పండితులతోను కళకళలాడుతు వుండేది. అనుక్షణం సాహిత్యచర్చలు, కవితా గానాలు జరుగుతువుండేవి. ఆమె చదివింది చిన్నచదువే అయినా జన్మసంస్కారం వల్ల, భర్త సాహచర్యంతో సాహిత్యాభిరుచి కలగటమే కాక కవితలు అల్లనారంభించారు. చక్కని వాడుక భాషలో రమ్యమైన భావాలు అప్రయత్నంగ బయలు వెడలేవి. మొదట మొదట నవ్వుతారన్న భయంతో వ్రాసిన గీతాలు యెవరికి తెలియకుండ దాచుకున్నా చివరకు భర్త మెచ్చుకోలుతో జంకుతీరి గేయాలు, గీతాలు, కథలు, వ్యాసాలు అనేకం వ్రాశారు. భారతి,

గృహలక్ష్మి, ఆంధ్ర పత్రికలలో యెన్నెన్నో ప్రచురితం అయినవి. భర్తతో కలిసి విరివిగా దేశాటనం చేస్తూ వుండేవారు. ఒక కుమార్తె, ఒక కుమారుడు కలిగారు. కాని నిలువలేదు. కడుపుశోకంతో ఆదంపతుల హృదయాంతరాళాలలోనుంచి వచ్చిన కవితలు యెవరికైనా కన్నీరు తెప్పించగలవు. చివరకు 1933లో ఆకస్మికంగా భర్త మరణించటంతో ఆమె ప్రపంచమే తిరగబడిపోయింది. ఆమె పుట్టిన క్షణంనుంచి ఆనాటి వరకు వీడని జంట విడిపోయి ఆమె వంటరి అయింది.

''చల్లని చిరుగాలి పాట
మెల్లగ వీనులు సోకగ
వాకిట నిలబడి, అడుగుల
చప్పుడైనప్పుడెల్ల
ఆత్రముతో నీవె వచ్చి
తని భ్రమపడి చూతునాథ''

అంటూ విలపించారు. ఆ సమయంలోనే దయార్ద్ర హృదయుడైన గాంధీ మహాత్ముడు ఆమెను వార్ధారమ్మని పిలిచారు.

అప్పటి ఆమె మానసిక వ్యధతో మరీ అంతగా తను పరిసరాలకు దూరమైతే తట్టుకోలేరన్న సందేహంతో శ్రీ ఉన్నవ దంపతులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారివంటి పెద్దలు ఆమెను గుంటూరు శారదానికేతనంలో కొంతకాలం నిర్వహణాభారంలో సహకరించమని అన్నారు. ప్రతిసభలోను, సమావేశంలోను చిన్ననాటినుంచి కలిసితిరిగి, పనిచేసిన కారణంగా ఆమెకు అక్కడ ఉండటం వూరట కలిగించింది. ఉన్నవ దంపతులు బాలికలకు జాతీయ విద్య బోధించటానికి గుంటూరులో శారదానికేతనం నెలకొల్పారు. జాతి, మత, కులభేదాలు లేకుండ అమ్మాయిలకు వుచితంగా వివిధ విద్యలు, కళలు బోధించేవారు. అదొక గురుకులం. అక్కడ ఆమె హాస్టలు నిర్వహణాభారం వహించారు. ఆమెను అభిమానంతో బిడ్డలాగా ఆదరించేవారు ఉన్నవ దంపతులు. వీళ్లుముగ్గురు హాస్టలు పిల్లలకు తీరిక వేళల్లో ధర్మం, నీతి, దేశభక్తి సంఘసేవలవంటి యెన్నో విషయాలు చెపుతు, సభలు సమావేశాలకు చారిత్రక ప్రదేశాలకు తీసుకువెళ్తూ పిల్లలకు వున్నతభావాలు కలిగించుతు వుండేవారు. ఆ విధంగా నాలుగు సంవత్సరాలు జరిగినవి. 1938లో వార్ధా మహిళా ఆశ్రమంలో శిక్షణ పొందటానికి వెళ్లినప్పుడు గాంధీజీ ఆమెకు ధైర్యంచెప్పి ఆశీర్వదించారు.

ఆమె అక్కడ మూడు సంవత్సరాలు వున్నారు. అన్నిశాఖలలోను శిక్షణ పొందారు. ఆమెకు తెలుగు, కన్నడం, అరవం, మలయాళం, హిందీ, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, భాషలన్నీ వచ్చును. ఆశ్రమంలో అన్ని విభాగాలను నిర్వహించారు. పాకశాల, భోజనశాల, గోశాల, పాకీపని, గస్తీతిరుగటంతో సహా సమస్తవిధులు నిర్వహించగల దక్షత సంపాదించారు. 1940 ఆఖరున ఆమె తిరుగు ప్రయాణానికి సిద్ధమవుతు వున్నారు. అప్పుడే గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహం చేయటానికి అనుమతి యివ్వనారంభించారు. మొదటి సత్యాగ్రహి శ్రీ వినోబాభావే. రెండవవారు శ్రీ నెహ్రూజీ. మహాత్ముడు అనుమతియిస్తేతప్ప అది చేయటానికి వీలులేదు. అప్పుడాయన శ్రీమతి రాజ్యలక్ష్మమ్మతో ''అమ్మా నీవుకూడ ఆశ్రమ మహిళలతోపాటు సత్యాగ్రహం చెయ్యి'' అన్నారు. అందుకామె సంతోషంతో ''బాపూ తప్పక సత్యాగ్రహం చేస్తాను, కాని యిక్కడకాదు. తెలుగు గడ్డమీద, నావారిమధ్యచేస్తాను'' అన్నారు. మహాత్ముడు సరేననటంతో ఆమె తనఅన్న అనుమతికూడ పొంది గుంటూరు శారదానికేతనం చేరుకున్నారు. నిర్ణీతమైన 1941 ఫిబ్రవరి 2వ తేదీన ఆమె, శ్రీమతులు ఉన్నవ లక్ష్మీబాయమ్మ, నాళం నాగలక్ష్మి వుదయం పదిగంటలకు శాసనధిక్కారం చేశారు. ఫలితంగా ఆ ముగ్గురిని వెంటనే అరెస్టు చేశారు. ఆమెకు రెండునెలలు కఠినశిక్షవేసి రాయవేలూరు స్త్రీలచెరసాలకు పంపించారు; 'సీ' క్లాసు యిచ్చారు.

జైల్లో ఇచ్చేభోజనం నోట్లోపెట్టుకోవటానికి యోగ్యంగా వుండేది కాదు. బట్టలు వుతుక్కోవటానికి, స్నానానికి సబ్బుముక్కయిచ్చేవారు. తలకు రాచుకునేందుకు యిచ్చిననూనె సరిపోయేదికాదు. పగలు 'సీ'క్లాసు ఖైదీలందరు మాట్లాడుకోవచ్చు. కాని రాత్రింతల హాలులోపల బంధించేవారు. 15 రోజుల కొక వుత్తరం వంతున వారికి యివ్వబడేది. వాళ్ళు జవాబు వ్రాయటం నెలకు ఒక్కసారి మాత్రమే. ఈ 'సి'క్లాసు ఖైదీలచేత బట్టలు కుట్టించేవారు. బియ్యం బాగుచేయించేవారు. ఆ సందర్భంలో జైల్లో శ్రీమతులు ఉన్నవ లక్ష్మీబాయమ్మ ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, అమ్మన్నరాజా, కుట్టిమాలు అమ్మ, రాధాబాయి సుబ్బరాయన్ గార్లు అనేకులు వున్నారు. ఆ సమయంలో అక్కడ ఒక తమిళ స్త్రీకి చాలా జబ్బు చేసింది. శ్రీమతి రాజ్య లక్ష్మమ్మగారు, తదితర తోటి స్త్రీలు నిద్రాహారాలు కూడ లెక్క చేయకుండ ఆమెకు సేవలు చేశారు. ఈ గొడవలలో యిక పాల్గొనని కాయితం రాసిస్తే

తక్షణం యింటికి పంపించుతామని జైలు అధికారులు ఆ రోగితో అన్నారు. కాని అంత జబ్బులోవున్న ఆమె ఆ పనిమాత్రం చేయనని తేల్చి చెప్పేసింది. ఆమె సాహసమే గెల్చి నెమ్మదిగా ఆరోగ్యం పొందారు. తమ సపర్యలు సార్థక మైనవని అందరు సంతోషించారు. వార్తా పత్రికలు జైలు లోపలికి రానివ్వరు. అందువల్ల కొత్త ఖైదీలు వచ్చినప్పుడు బయటి తాజావార్తలు తెలిసేవి. మరొక వూరు బదిలీ చేసినా, విడుదలయి వారు వెళ్ళిపోతున్నా యిరుపక్షాల వారికి కళ్ళనీరు కారేది. ఆనాటి రాయవేలూరు జైల్లో 'సి' క్లాసు పరిస్థితి అది. ఐనా లెక్కచేయకుండ "వెల్లూరిజైలు ముస్తాబు వినండీ, భయము వదలండీ, జైలంటే జైలుగాదండీ—భూలోక స్వర్గమండీ" అని బయటి వారిని ప్రోత్సహించి సత్యాగ్రహం చేయమని వుద్బోధించేవారు.

ఒక నెల గడిచింది. ఇంతలో అదే జైల్లో 'ఏ' క్లాసులో వుంటున్న శ్రీమతులు కుట్టిమాలు అమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మలు 'సి' క్లాసు వారికి ఫలహారాది పదార్థాలు చాటుగా అందచేస్తున్నట్లు జైలు అధికారికి తెలిసింది. వెంటనే శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ మొదలయిన 15 మంది 'సి' క్లాసు వారిని కడలూరు జైలుకు పంపించివేశారు. శిక్షాకాలం అక్కడ పూర్తి చేసుకుని ఆమె విడుదలయి తిరిగి శారదానికేతనం చేరుకున్నారు.

1944లో శ్రీమతి కస్తూర్బా గాంధీ మరణించారు. ఆమె పేర కస్తూర్బా గాంధీ జాతీయ స్మారకనిధి అని ఒకటి యేర్పాటు చేశారు. స్మారకనిధి డబ్బు వెచ్చించి పల్లెలలో కొన్ని బేసిక్ స్కూళ్ళు, సంక్షేమ పథకాలు నిర్వహించ టానికి నిర్ణయించుకున్నారు. నిర్వహణకు అవసరమయ్యే సిబ్బందికి శిక్షణ నివ్వటానికి బొంబాయిలోని వ్రికోలీలో ఒక శిబిరాన్ని నెలకొల్పారు. గాంధీజీ స్వయంగా శిబిరంలో వుండి శిక్షణ యిప్పించారు. శ్రీ ఉన్నవ దంపతుల అనుమతితో రాజ్యలక్ష్మమ్మ గారు అక్కడికి వెళ్లారు. ఆ శిక్షణకాలం రెండునెలలే. కాని ఆ సమయంలోనే ఆమె తల్లి మరణించినట్లు వార్త వచ్చింది. గాంధీజీ ఆమెతో "అమ్మా జరిగిపోయినదేదొ జరిగిపోయింది. మనసు దిటవు పరుచుకొని మరికొద్ది రోజులు వుండి శిక్షణ పొంతం చేసుకో" మని సలహాయిచ్చారు. ఆమె అట్లాగే చేశారు. ఖాదీ కార్యకర్తల శిక్షణ శిబిరం ఒకటి బందరులో 1946లో వేసవి శలవుల్లో నెలకొల్పి ఒకనెల నిర్వహించారు. ఆమె హాస్టలు నిర్వహణభారం వహించారు. సీతానగరంలోను, బొబ్బిలిలోను కస్తూర్బా గాంధీస్మారకసమితి తరపున కార్యకర్తల హాస్టలు భారం వహించారు. ఈ విధంగా మధ్యమధ్య కొద్దికాలం యితర చోట్లకు వెళ్లినా నికరంగా ఆమె 14 సంవత్సరాల కాలం శారదానికేతనంలో వుండి ఉన్నవ దంపతులకు

సన్నిహితులుగా సంస్థలో ఒక భాగంగా అయిపోయినారు. 1952లో ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు మరణించారు. ఆమెలేని శారదానికేతనం రాజ్యలక్ష్మమ్మగారికి భరించరాని నిస్పృహకలిగించింది. ఆ పరిస్థితులలో మద్రాసు దక్షిణ భారత హిందీప్రచారసభవారు తమ మహిళా విద్యాలయ హాస్టలు నిర్వహించుతు హిందీ క్లాసులు తీసుకోమని కోరారు. కొంతకాలమయిన తర్వాత మద్రాసు గుజరాతీ మండలివారు హిందీక్లాసులు తీసుకోమని కోరడంతో ప్రచారసభవారి అనుమతితో దాదాపు ఐదు సంవత్సరాలు గుజరాతీ మండలిలో హిందీ పరీక్షలకు శిక్షణ యిచ్చారు. 1958 ఆఖరుకి యిక అలసిపోయి ఆత్మీయుల మధ్యకు, సోదరుల దగ్గరకు వెళ్లిపోయినారు.

ఆమె ఎప్పుడు ఒక శిక్షణ పొందటమో ఒకరికి శిక్షణ యివ్వటమో చేసినా మధ్యమధ్యన రచనలు సాగించారు. ''అప్పారావుగారు నేను'' అనే గ్రంథం, 'ఆకాశ కుసుమావళి' అనే రేడియో ప్రసంగాల సంకలనం ముద్రితమైనవి. ఆమె కవితలు ''వైతాళికులు'', ''మణిమకుటాలు'' 'నవీనకావ్యమంజిరి' అనే సంపుటాలలో పునర్ముద్రితమైనవి. 'నా శేషయాత్ర', ''గాంధీజీ వద్ద నా శిష్యరికం'' అనే పుస్తకాలు యింకా ముద్రించలేదు. ఆమె పాల్గొన్న సాహిత్య సభలు అనేకం. విజయవాడలో అభ్యుదయ వేదిక ఆధ్వర్యాన ఒకసారి, 26–1–74 న వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయంలో, మరొకసారి దేశసేవికగా, సత్యాగ్రహిగా యితర స్వాతంత్ర్య సమర యోధులతోపాటు సన్మానం జరిగింది. 'సౌదామిని' అనే కలం పేరుతో ఆమె చేసిన సాహిత్య సేవకు గుర్తింపుగా 19–2–72 న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు హైదరాబాదులో ఘన సన్మానంచేసి ప్రముఖ రచయిత్రిగా ఆమె కీర్తిని స్థిరం చేశారు.

వ్యక్తిగత క్లేశాలతో కారే కన్నీటిని గుండెలలో పదిలంగా దాచుకుంటూ, గాంధీజీ ఆదేశానుసారం ప్రజాసేవలో త్రికరణశుద్ధిగా లీనమయిన శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ తమ 72 వ ఏట 8–6–1975 లో పంచ భూతాలలో లీనమైపోయినారు.

---

# శ్రీమతి యలమంచిలి బసవమ్మాదేవి

**జననం 1913** **మరణం 1975 ఫిబ్రవరి**

"బసవమ్మా! నీవు యింకా చిన్న పిల్లవు. ముసలమ్మవలె తలవెంట్రుకలు ముడివేసుకున్నావే. బాగుండలేదు. ముడి వూడ తీసుకుని, వెంటనే వాలుజడ వేసుకో. మరి చప్పున కానివ్వు" అని ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు శ్రీమతి యలమంచిలి బసవమ్మాదేవిని మందలించారు. ఏ ఆడంబరాలు అలవాటు లేకుండ గ్రామీణ వాతావరణంలో పుట్టి పెరిగిన 16 ఏళ్ల ముగ్ధ అయిన శ్రీమతి బసవమ్మాదేవి యిష్టం లేక పోయినా, గబగబ వెళ్లి జడఅల్లుకుని వచ్చారు. ఆమెకు యెట్లాగయినా దేశసేవ చేయాలని తపన. వినయంగా శిబిరంలో శిక్షణ పొందటం ఆమె లక్ష్యం. గుంటూరు పట్టణంలో 1930 లో నడిపిన స్త్రీ వాలంటీర్ల శిబిరంలో జరిగిన ఘట్టంయిది. సనాతనాచారాలకు, జాతీయ పద్ధతులకు విలువ నిచ్చే లక్ష్మీబాయమ్మగారు పాతవే అయినా అర్థం లేనివి అనితోస్తే తీవ్రంగ ఆ పద్ధతులను ఖండించేవారు.



శ్రీమతి యలమంచిలి బసవమ్మాదేవి

గుంటూరుజిల్లా రేపల్లెతాలూకా కాట్రగడ్డ గ్రామం శ్రీమతి బసవమ్మాదేవి జన్మస్థలం. శ్రీ బొబ్బా బసవయ్య శ్రీమతి వెంకమ్మల కూతురుగా ఆమె 1913 లో జన్మించారు. సోదరీ సోదరులు వున్నారు. వ్యాసాశ్రమ పీఠాధిపతులైన శ్రీ విమలానంద స్వాములవారు యీామె సోదరులు. 12వ ఏట 1925 లో యలమంచిలి వెంకటప్పయ్యగారితో వివాహం జరిగింది. ఆయన విద్యాభిలాషి. హిందీ పండితుడు కావటంతో ఆమెకు తెలుగు, ఇంగ్లీషు, హిందీ బోధించేవారు. చదువుతో పాటు జాతీయాభిమానం, రాజకీయాలు, దేశసేవ వంటి వున్నత విషయాలు కూడ ఆయన సవిస్తరంగా విశదపరచేవారు,

1928 సైమన్ కమిషన్ బహిష్కరణ నాటికే ఆంధ్రులు స్వాతంత్రోద్యమంలో తీవ్రంగ పాల్గొనటం ప్రారంభించారు. ఆంధ్రకేసరి తుపాకీగుళ్లకు తన గుండెలను యెదురొడ్డి నిలబడగా సైనికులే ఆశ్చర్యపోయినారు. 1930 లో గాంధీమహాత్ముడు శాసనోల్లంఘనం చేయమని అనుమతివ్వగానే ఆంధ్రులు స్త్రీలు, పురుషులు వీరావేశంతో కదనరంగం ప్రవేశించారు. ఉప్పువండి శాసనధిక్కారం జరిపారు. ఊరూర శాంతిదళ శిబిరాలు నెలకొల్పి వాలంటీర్లకు శిక్షణనిచ్చారు. గుంటూరులో ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు శిబిరం నడిపేవారు. తనకు వయసుచాలదని సందేహించకుండ అనుభవంలేదని జంకకుండ పరిపూర్ణ పల్లెవాతావరణంలో ముద్దబంతి పూవులాగ పెరిగిన ముద్దరాలు శ్రీమతిబసవమ్మాదేవి. 16ఏళ్లవయసులో గుంటూరువచ్చి శిబిరంలో ప్రవేశించారు. ఆమె జన్మతః శాకాహారి. పైగా కాఫీ, టీ, ఉల్లిపాయలు, చింతపండు, కారం వంటి అనేక పదార్థాలు విసర్జించారు. ఇన్ని నియమాలు నిష్ఠలు పాటించుతు శరీరం కృశించిపోయినా లెక్కచెయ్యకుండ గ్రామ గ్రామాలు తిరుగుతు ఉద్యమ ప్రచారంచేస్తు శిక్షణ పొందుతు నిర్వాహకుల మెప్పులు పొందుతు వుండగా తల్లి ఆఖరుదశలోవున్నట్లు కబురువచ్చింది. చూడటానికి వెళ్లారు. ఆరోజునే కన్నతల్లి ఆమెకు కరువైంది. ఇంటినిండా సోదరీ సోదరులు, తండ్రి యితర బంధువులువున్నారు. కాని ఆమె మనసు చిక్కపట్టుకుని, యిచ్చిన మాట నిలుపుకోవాలన్న పట్టుదలతో, శిక్షణ పూర్తికాకపోతే సరిగ్గా దేశసేవ చేయలేనేమోనన్న ఆదుర్దాతో, మరి రెండు మూడు రోజులకే గుంటూరు వెళ్లి శిక్షణ పూర్తికానిచ్చారు. ఆమె మనోనిగ్రహం, పట్టుదల అంతటిది. శిక్షణ ముగిసిన మీదట అనేక చోట్ల పికెటింగులు జరిపారు. వాడవాడల ప్రచారం చేశారు. పోలీసులు ఆమెను చూసీ చూడనట్లు వదిలేశారు. కొంతకాలానికి ఆ అలజడి సద్దుమణిగింది. ఆమె తిరిగి శ్రద్ధగా చదువు కొనసాగింది. దక్షిణ భారతహిందీ ప్రచార సభవారి మధ్యమ పరీక్షలో నాలుగు దక్షిణ రాష్ట్రాలకు ప్రథమురాలుగా నెగ్గి బహుమతులు గెల్చుకున్నారు. తరువాత విశారద పట్టం పుచ్చుకున్నారు.

1932 దేశవ్యాప్తంగ శాసన ధిక్కారానికి గాంధీజీ అనుమతి లభించింది. దీనికోసమే ఆతృతతో యెదురుచూస్తున్న ప్రజలు రెట్టింపు సాహసంతో పూనికతో కార్య రంగంలో ప్రవేశించారు. అప్పటికి శ్రీమతి బసవమ్మాదేవి బాగా ఆరితేరారు. అన్న ప్రోత్సాహంతో శిక్షణతో అప్పుడే జాతీయోద్యమంలో అత్యుత్సాహంతో అడుగుపెట్టిన తన ఆడపడుచు కుమారి సరళాదేవిని కూడగట్టుకున్నారు. పోటీలుపడుతు పికెటింగులు

ఆరంభించారు. వదినామరదళ్లు మైనేనివారి పాలెంలో 16-1-1932న అరెస్టు అయినారు. ఆరు నెలలు కఠినశిక్షతో రాయవేలూరు సెంట్రల్ జైలు ప్రవేశించారు. ఏదో పరీక్ష నెగ్గినంతగ సంబరపడ్డారు. మూడు నెలలు అక్కడ వున్న తరువాత కన్ననూరు జైలుకు పంపించారు. అందువల్ల రెండు ప్రదేశాలలో జైలు జీవితాన్ని రుచిచూశారు. శ్రీమతులు బెన్నూరి కృష్ణవేణమ్మ, కొట్టగడ్డ రామసీతమ్మ యింకా యెందరో పరిచయులయినారు. భోజనం బాగుండేదికాదు. కష్టనిష్ఠూరాలు వుండేవి. కాని అవన్నీ పట్టించుకునే తత్వంకాదు. ఆమెది మొదటి నుండి నియమబద్ధ జీవితమే. కాబట్టి నిశ్చింతగా 'జైలన మిగులసుఖము' అనే పాట వల్లించుకుంటు శిక్షాకాలం పూర్తిచేశారు. ఇల్లుచేరుకున్నారు. సత్యాగ్రహంచేసి ఆమెకన్న కొంతకాలం వెనక జైలుకు వెళ్లిన ఆమె భర్త విడుదలయ్యే వరకు వేచివుండి తెనాలి వెళ్లారు.

తెనాలి తాలూకాలోవున్న అయితానగరం — నగరంకాకపోగా చిన్నపల్లె. అక్కడ ఆ దంపతులు 1929 నుంచే వుచిత హిందీవిద్యాలయం, ఆదర్శ బాలికా పాఠశాల నడుపుతు వుండేవారు. అది వుచిత పాఠశాల కావటంతో వారికి నికరంగా నెలసరి ఆదాయంలేదు. పల్లెవాసులు తమకు తోచిన కాయో, కసరో యిస్తేకద్దు. లేకపోతే ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లిలో వర్ణించిన మడతకుడుములు, శేషపాన్పులే దక్కుదల—అయినా వారికి లెక్కలేదు. ఒకపూట కూర, మజ్జిగతో భోజనంచేస్తే రాత్రివేళల కొంచెం పెసలు, బెల్లంముక్క, మజ్జిగతో సరిపెట్టుకునే వారు. అతిథి దేవుళ్లకూ అదే సత్కారం. ఆ విధంగా 1965 వరకు విద్యాభిక్ష పెడుతునే వున్నారు, స్కూలు నిర్వహించుతునే వున్నారు.

ఉత్తర హిందూస్థానంలో సరయూనది ఒడ్డున బర్హజ్ అనే పట్టణం వున్నది. ఆ వూళ్లో చాలా మార్వాడీ కుటుంబాలు వుండేవి. మార్వాడీ స్త్రీలు ప్రతిరోజు నియమబద్ధంగా సరయూ నదిలో స్నానం చేసి, ఒడ్డున ఒక గంట సత్కాలక్షేపంచేసి వెళ్లేవారు. అది 1935 వ సంవత్సరం. బసవమ్మా దేవిగారు ప్రయాగ హిందీ సాహితీ సమ్మేళనంవారి ప్రథమ పరీక్షకు చదువుతు అక్కడ వుండేవారు. ఆమె ప్రతి ఉదయం నది ఒడ్డున చేరిన ఆ మార్వాడీ వనితలకు గీతాపారాయణం చేసి వినిపించేవారు. అనర్గళంగా హిందీలో వివరించేవారు. ఆమె కొంతకాలం సేవాగ్రాం మహిళా మండలిలో విద్యనభ్యసించారు. ప్రతి ఉదయం సాయంత్రం తప్పని సరిగా ప్రార్థనలకు హాజరయ్యేవారు. గాంధీతత్వం జీర్ణింపచేసుకున్నారు. వ్యాసాశ్రమ పీఠాధిపతుల సోదరిగా కొంత పుటకతో వచ్చిన సంస్కారం వుండి వుంటుంది.

భర్త ప్రోత్సాహంతో, చేదోడుతో అది ఆత్మ నిగ్రహంగా స్థిరసంకల్పంగా ఘనీభవించివుంటుంది. గీతాతత్వం ఆమెకు వంటబేర్ణించి పోయింది. అందుకు నిదర్శనంగా ఆమె బాబా రాఘవదాసుగారి ఆశ్రమంలో హిందీ పరీక్షలకు శిక్షణ పొందుతువున్నా, ధనిక మార్వాడీ స్త్రీలకు గీత చదివి వినిపించి సన్నిహితంగా వుంటున్నా, ఆమె నివసించటానికి బర్‌హజ్‌లోని హరిజనవాడనే ఎన్నుకున్నారు. వారిమధ్య కలిసిమెలిసి వారి వుత్సవాలలో, పండగలు, పబ్బాలలో పాల్గొంటు అతి సహజంగ సంతృప్తిగా గడిపారు. ఆ సమయంలోనే లక్నోలో కాంగ్రెసు మహాసభ జరిగింది. అప్పుడొక పెద్ద స్వదేశీ వస్తు, వస్త్ర ప్రదర్శన కూడా జరిగింది. ఆంధ్రదేశం తరపున ఒక విభాగాన్ని నిర్వహించటంలో ఆమె చాల సహకరించారు, నిర్వహించారు. కృషికి చిత్తశుద్ధి జతపరచటం ఆమె సిద్ధాంతంకాగా సత్ఫలితాలు కనిపించటమే పర్యవసానం. అంతకు మునుపేవున్న విశారద పట్టానికి బెనారసు మెట్రిక్, హిందీ సాహిత్య సమ్మేళనంవారి ''ప్రథమా'', ప్రయాగ మహిళా విద్యా పీఠ్ వారి ''విద్యా వినోదిని''జతకలుపుకుని యిల్లు చేరుకున్నారు. తిరిగి తమ స్కూలు నిర్వహణలోనే ప్రవేశించారు. ఆమెకు ధనాపేక్ష ఉంటే యిన్ని అర్హతలు సంపాదించుకున్న తరువాతనయినా డబ్బు సంపాదించి విలాసాలు, సుఖాలు అనుభవించివుండవచ్చు. కాని అది ఆమెతత్వం కాదు.

క్విట్టిండియా వుద్యమం వచ్చింది. స్వాతంత్ర్య సమరానికి అది ఆఖరు మెట్టుగా ప్రజలు నాయకులు భావించారు. ఏదో వొకటి తేల్చుకోవాలన్న దృఢ నిశ్చయం ప్రతివారి మనసులోను నెలకొన్నది. అందువల్ల చాలా పట్టుదలగా ప్రజలు అందులోను ఆంధ్రులు పాల్గొన్నారు. ఆ సమయంలో ఒకనాడు ఆమె భర్తని అతి దీనంగ బతిమాలుకుంటున్నారు పెద్దయింటికి మారుదామనో, మంచి బట్టలు కావాలనో కాదు, ఉద్యమంలో పాల్గొంటానని. తెనాలి చివరన వంటరిగా వుండి జీతంలేని బడినడుపుతున్న వారికి ఆరేళ్ల అబ్బాయి, రెండేళ్లఅమ్మాయి వున్నారు. ఆమె ఉద్యమంలో పాల్గొంటే అంతుతేలేవరకు వదలరు. అరెస్టయే అవకాశాలే అధికం. పిల్లలెట్లాగని భర్త వాదం. ఏనుగంత తండ్రికన్న యేకుల బుట్టంత తల్లి మెరుగనే లోకోక్తి జ్ఞాపకం చేస్తూ పిల్లలను స్కూలునీ కూడ ఆమెకే అప్పగించి ఆమె భర్త క్విట్టిండియా ఉద్యమంలో ప్రవేశించి సంవత్సరకాలం జైలుకు వెళ్లారు. ఆ రోజుల్లో తెనాలిలో జరిగిన అల్లర్లు, భీభత్సాలు అన్నీ యిన్నీకావు. ఆమె నిబ్బరంగా నిలబడితినీ, తినక పిల్లలను పోషించుతు హిందీప్రచారంచేస్తూ గడిపారు.

ఈమెకు యే విధమైన బాహ్యాడంబరాలు పనికిరావు. నచ్చవు. మట్టి పాత్రలతో వంట. రెండే రెండు జతల ఖద్దరుబట్టలు ఆమె దుస్తులు.

ఒక దుప్పటి చిరుచాప ఆమె హంస తూలికాతల్పం. మూఢాచారాలు అంటే యేవగింపు. ఇతరులకు కనిపించే విధంగా మంగళసూత్రం ధరించితేనే పతివ్రతలవుతారా, మనస్ఫూర్తిగా భర్తను గౌరవించి అనుసరించటమే ప్రధానం అని వాదించటమేకాక మంగళసూత్ర విసర్జన చేసారు. మత విషయకమైన పండగలు పబ్బాల కంటె జాతీయోత్సవాలు యెక్కువ పట్టుదలగా జరిపేవారు. పిల్లలకు సైతం రెండు జతల బట్టలను కుట్టించే ఆ తల్లి గాంధీజీ జన్మదినంనాడు ఒక పాకీకుటుంబాన్ని ఆహ్వానించి నూనె కుంకుడు కాయలతో తలంట్లు పోయించి కొత్తబట్టలు యిచ్చి తమ పంక్తిన భోజనం పెట్టేవారు. దక్షిణ తాంబూలాలతో సంతృప్తిగా సాగనంపేవారు. ఎవరైనా మిఠాయిలు పంచవచ్చు, భోజనాలు వడ్డించవచ్చు. కాని కోరికోరి ఒక పాకీ కుటుంబాన్ని ఆహ్వానించి తీసుకువచ్చి యిన్నీ నడపటమంటే అది ఆమె మనసు చెందిన పరిణతికి సూచి. అట్లా ఆమె 1965లో ఆమె ఆరోగ్యం చెడిపోయేవరకు జరిపారు.

ఆ తరువాత రక్తపోటు మొదలయిన అనారోగ్యాల కారణంగా తమకూతురు దగ్గర విశ్రాంతి తీసుకుంటూ గడిపారు. 1975 లో ఒకనాటి సాయంత్రం తమవారికి యిష్టమైనవన్నీ తయారు చేయించిపెట్టి రాత్రి పది గంటల వేళ అకస్మాత్తుగా కన్నుమూశారు. సేవాగ్రాంలో శిక్షణ పొంది, నాయకులదగ్గర శిక్షణ పొంది, స్వాతంత్ర్య సమరంలో పాల్గొని దమ్మిడీ తీసుకోకుండ విద్యాభిక్షపెట్టి, హిందీ ప్రచారంచేసి, మనసుపడి హరిజన వాడల్లో నివసించి, ఉబలాటపడి పాకీవారికి తలంట్లు పోయించి కొత్తబట్టలు కట్టబెట్టి సరసన భోజనంపెట్టి గాంధీ తత్వాన్ని, భగవద్గీతాసారాన్ని వంటపట్టించుకున్న శ్రీమతి యలమంచిలి బసవమ్మాదేవి నిరాడంబర జీవితం ప్రతివారికి ఆదర్శప్రాయం. తామ్రపత్రంయిచ్చి ప్రభుత్వం యీమెను గౌరవించింది.

---

# శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ

**జననం 1917**

14–16 సంవత్సరాల మధ్యవయసు గల ముగ్గురు అమ్మాయిలు ఏలూరు సబ్ జైలునుంచి విడుదల అయినారు. వాళ్లది ఆ వూరుకాదు. వాళ్లదగ్గరఏమంత డబ్బు లేదు. ఏమిచేయాలో ఎటుపోవాలో తెలియక వాళ్లు శ్రీ కన్యకా పరమేశ్వరి ఆలయం అరుగుల మీదకు చేరుకున్నారు. లాఠీలు ఊపుకుంటు పోలీసులు వచ్చారు. మీరు యిక్కడ కూర్చోకూడదు, లేచివెళ్లి పొండి అని గదమాయించారు. ఇంతలో ఖద్దరు బట్టలు కట్టుకున్న కాంగ్రెసు వాలంటీర్లు ఆపద్బాంధవులలాగ వీళ్లసమీపానికివచ్చారు. అటుచూసి, యిటుచూసి "అమ్మా రాత్రి తొమ్మిదిగంటలకు తెల్ల గుఱ్ఱం కట్టిన బండివస్తుంది. అది ఎక్కి మీరు వెళ్లండి" అని అన్నారు. ఆ అమ్మాయిలు సంతోషంగా రాత్రి తొమ్మిది



శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ

గంటల కోసం యెదురు చూస్తు కూర్చున్నారు. తెల్లగుఱ్ఱం కట్టిన బండి రానే వచ్చింది. అమ్మాయిలు ముగ్గురు ఎక్కికూర్చున్నారు. నాలుగు బజార్లు తిరిగిన తర్వాతబండిలో వున్నవాలంటీరు "మీరు యెవరింటికి వెళ్లాలి ? ఈ ఊళ్లో మీవాళ్లు యెవరున్నారని" అడిగారు. 'మావాళ్లు యెవరులేరు, మాదియీవూరుకాదు' అన్నారు అమ్మాయిలు. మరినాలుగు బజార్లు తిరిగిన తర్వాత వాళ్లు అదేప్రశ్న. వీళ్లు బింకంగా కూర్చున్నారు. అరగంట కొకసారి వాలంటీర్లు మీరుయెక్కడికి వెళ్తున్నారని అడగటం, అమ్మాయిలు, అసలు మీరు యెవరని అడగటంతో తెల్లవారు ఝామునాలుగు గంటలయింది. తెల్ల గుఱ్ఱం అలసిపోయింది. ఏలూరు పవరు పేట స్టేషను దగ్గర బండి ఆగింది. "తల్లుల్లారా మీరు చిన్నవాళ్లేగాని అసాధ్యులుగావున్నారు. మాకు కావలసిన ఆచూకీయివ్వనేలేదు. ఇంక మీదోవను మీరు పొండి" అన్నారు కాంగ్రెసు వాలంటీర్లు. అప్పుడు అర్థమయింది అమ్మాయిలకు వాళ్లు కాంగ్రెసు వాలంటీర్ల వేషంలోవున్న పోలీసులని. ఇంకా

వివరాలు తెలుసు కోవటానికి వీళ్లను యింతసేపు తిప్పారని. పాపం ఆ అమ్మాయిలకు గుండెలు జల్లుమన్నవి. వారిలో ఒకామె శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ. మిగతా యిద్దరు ఆమె మిత్రులు శ్రీమతులు ఉద్దరాజు మాణిక్యాంబ, గుజ్జు నాగరత్నమ్మ. ఆసమయంలో వాళ్లకు ఉంగుటూరులో అనాథాశ్రమం, హరిజనసేవా ఆశ్రమం అయిన ఆనందాశ్రమం నడుపుతున్న దంపతులు శ్రీతల్లాప్రగడ లక్ష్మీనరసింహ శర్మ శ్రీమతి విశ్వసుందరమ్మ గుర్తుకు వచ్చారు. బ్రతుకు జీవుడా అని వారి దగ్గరకు చేరుకున్నారు.

శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ 1917లో జన్మించారు. తూర్పు గోదావరి జిల్లా, అమలాపురం తాలూకాలోని తొండవరం ఆమె జన్మస్థలం. రైలు, బస్సు వగైరా ఆధునిక సౌకర్యాలు లేని గ్రామంఅది. ఆమెతలిదండ్రులు శ్రీమతి సుభద్రమ్మ శ్రీవెంపరాల సుబ్రహ్మణ్య శాస్త్రిగార్లు యజ్ఞం చేసి కీర్తిసంపాదించు కున్నారు. ఆగ్రామంలో 4, 5 క్లాసులను మించి చదవగల అవకాశం లేదు. శ్రీకంభంపాటి సత్యనారాయణతో వివాహం అయింది. ఆయన సంస్కారి విద్యావంతులు. అందువల్ల ఆమెకు సాధ్యమైనంతగా విద్య, విజ్ఞానాలు కలిగించాలని నిశ్చయించుకున్నారు. ఆనాడు యింటింట తప్పని సరిగా పారాయణ చేయబడుతున్న ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయం, విజ్ఞాన చంద్రికా మండలి వారి ప్రచురణలన్నీ చదివేట్లుగా ఆమెను ప్రోత్సహించారు. రాణీ అహల్యాబాయి, భారతదేశ చరిత్ర, ఆంధ్రుల చరిత్ర, అబలా సచ్చరిత్ర రత్నమాల, విజయనగర సామ్రాజ్యం వంటి పుస్తకాలు ఆమె లేతహృదయంలో దేశాభిమానం, జాతిపట్ల గౌరవం బాగారేకెత్తించినవి. శ్రీ సత్యనారాయణ మద్రాసులో బి.ఏ. చదువుతు వున్నారు. గాంధీ మహాత్ముని స్వాతంత్ర్య శంఖారావం విని 1930లో రెండవ సంవత్సరం చదువు ముగించ కుండానే సమరరంగంలోకి దూకారు. అరెస్టయి జైలుశిక్ష అనుభవించారు. దాంతో ఆమె హృదయం ఆవేశ పూరిత మయింది. తానూ దేశ సేవ చేయాలన్న తీవ్ర సంకల్పంతో 14వ ఏటనే ఆమె సత్యాగ్రహోద్యమంలో ప్రవేశించారు. ఇంచుమించు ఆ వయసువాళ్లే అయిన శ్రీమతులు ఉద్దరాజు మాణిక్యాంబ, గుజ్జు నాగరత్నమ్మలతో కలిసి పికెటింగు చేయ నారంభించారు. వాళ్లు ముగ్గురు ఏలూరులో విదేశీ వస్త్రాల దుకాణాల దగ్గర పికెటింగు చేశారు. కొంతకాలం ఏదో చిన్న పిల్లలని అధికారులు అంతగా పట్టించు కోలేదు. కాని వీళ్లు మరింత ఉత్సాహంతో తిరగటంతో చివరకు అరెస్టు చేయక తప్పలేదు. ఏలూరు సబ్‌జైలులో పదిహేను రోజులు వుంచి వదలి పెట్టారు. కాని యింత చిన్నవాళ్లు ముగ్గురు తమకై తాము యింత సాహసం చేయలేరు, ఎవరో నాయకులు వెనుక వుండి చేయించు తున్నారు

వాళ్ళ ఆచూకి కనుక్కోవాలని పోలీసులు అనుకుని కాంగ్రెసు వాలంటీర్ల వేషంలో తెల్ల గుర్రం కట్టిన బండి తీసుకు వచ్చి వాళ్లను ప్రశ్నించారు. ఆరోజుల్లో పోలీసులు చాలా మర్యాదస్తులు, సజ్జనులు అని వొప్పుకు తీరాలంటు యీనాడు నవ్వుతారు మాణిక్యాంబగారు.

అయినా అంతటితో ఆమె భయపడి ఆగలేదు. ఇంకా అనేక ఊళ్లలో పికెటింగు చేస్తూనేవున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో నాయకులు కాంగ్రెసు సేవాదళ శిబిరం స్థాపించారు. ఆమె ఆ శిబిరంలో వుండి శిక్షణ పొందుతు పికెటింగు చేశారు. ఆసందర్భంలోనే ఆమెకు శ్రీమతి ద్రోణంరాజులక్ష్మి బాయమ్మ పరిచయం అయింది. అక్కడ జరిగిన పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభలలో పాల్గొని శాసన ధిక్కారం చేసిన నేరానికి శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, శ్రీతల్లా ప్రగడ ప్రకాశరాయుడు, శ్రీ కాళీ పట్నపు కొండయ్యలను అరెస్టు చేశారు. శ్రీమతి మాణిక్యాంబని రెండవ సారి అరెస్టు చేసి కొవ్వూరు సబ్‌జైలులో 15 రోజులు వుంచి తిరిగి విడుదల చేశారు. దాంతో ఆమెకు జంకు తీరిపోయింది. మరింత నిబ్బరంగ, పాతకాపులాగ సభలు, సమావేశాలలో పాల్గొనటం, ప్రచారం చేయటం సాగించారు. పశ్చిమ గోదావరిజిల్లాలో కొంతకాలం ప్రచారం, పికెటింగు చేశారు.

1932లో ప్రతిజిల్లాలోను, తాలుకాలోను రాజకీయ మహాసభలు అతిఉత్సాహంతో, పకడ్బందీగా జరప బడినై. అధ్యక్షత వహించవలసిన నాయకులు అరెస్టయినా మరొకరి ఆధ్వర్యాన సభలు జరిగినై. ఆ సందర్భంలో ప్రతి సభలోను, సమావేశంలోను లాఠీచార్జీలు పరిపాటి అయినా ప్రజలు వెనుదీయ లేదు. కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరిగి పోతునేవుండేవి. అటువంటి వుద్రిక్త పరిస్థితులలో పదహారు సంవత్సరాల వయసయినాలేని ఆమె తెనాలి తాలూకా కూచిపూడి గ్రామంలో అధ్యక్షత వహించి తెనాలి తాలూకా రాజకీయ మహాసభను నిర్భరంగ నడిపించారు. నల్లూరి రాజయ్య చౌదరి పాతూరి నాగభూషణంగార్ల వంటి పెద్దలనేకులు సభలో పాల్గొన్నారు. అనుకున్నట్లు గానే పోలీసులు లాఠీచార్జి చేశారు. ఆమెను, రాజయ్య చౌదరి, నాగభూషణంగార్లను అరెస్టు చేశారు. ఆమెకు 1932 ఆగస్టు 23న 6 నెలలు విడిఖైదు శిక్షవేసి, బి క్లాసు యిచ్చారు. ఆమె కిది మూడవసారి జైలు శిక్ష.

ఆ విధంగా ఆమె రాయవేలూరు జైలుకు చేరుకున్నారు. అప్పటికే అక్కడ మిసెస్ కజిన్సు, మిసెస్ ప్రభు, శ్రీమతులు కుత్తీవూలు అమ్మ, తల్లా ప్రగడ విశ్వసుందరమ్మ, ఆదుర్తి లక్ష్మీబాయమ్మ మొదలైనవారు శిక్ష అనుభవించుతు వున్నారు. మిసెస్ ప్రభును అరెస్టు చేసి జైలుకు పంపుతున్నప్పుడు

అధికారులు ఆమె మాంగల్యాన్ని కూడ స్వాధీన పరుచు కున్నారుట. పెద్ద అలజడి రేగింది. చివరకు పార్లమెంటులో ఒక బ్రిటిషు అతను యీ విషయాన్ని చర్చకు తెచ్చాడుట. అట్లా మాంగల్యం తొలగించి స్వాధీన పరుచు కోవటం యే జాతీయులకైనా యే మతస్థులకైనా తప్పు అని తేల్చారుట. అప్పటి నుంచి రాజకీయ స్త్రీ ఖైదీల మాంగల్యాలు, అవి గుచ్చిన బంగారు గొలుసులు అధికారులు తాకరాదనే వుత్తరువు అమలులోకి వచ్చింది. ఇంతటి గాథకు నాయకురాలైన మిసెస్ ప్రభును, మాణిక్యాంబ గారు కలుసు కున్నారు. విదేశీయురాలైనా, భారత స్వతంత్ర సమరంలో పాల్గొని జైలు శిక్ష ననుభవించుతున్న మిసెస్ కజిన్సును చూసి ఆమెకెంతో గౌరవ సద్భావాలు కలిగినవి. పూర్వ పరిచయం వుండటాన శ్రీమతి విశ్వసుందరమ్మ కొంగు పట్టుకుని తల్లి వెనక బిడ్డలాగ ఆమె తిరిగే వారు.

1936 లో వుమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభకు ఎన్నికలు జరిగినవి. కాకినాడ నియోజకవర్గానికి కాంగ్రెసు తరఫున శ్రీయుతులు బులుసు సాంబమూర్తి, మల్లిపూడి పళ్లంరాజుగార్లు అభ్యర్థులుగా నిల్చారు. కాంగ్రెసు కార్యకలాపాలలో కుత్తుక బంటిగా దిగిన శ్రీ సత్యనారాయణ, శ్రీమతి మాణిక్యాంబ అప్పుడు కాకినాడలోనే వుంటు వుండేవారు. దంపతులిద్దరు అమితోత్సాహంతో కాంగ్రెసు అభ్యర్థుల తరఫున తీవ్రంగ ఎన్నికల ప్రచారం చేశారు. శ్రీ సత్యనారాయణ తుని తాలూకా కోటనందూరులో ప్రత్యర్థుల క్రూరహింసా కాండకు కూడ గురి అయినారు. ఐనా కాంగ్రెసు ఘన విజయం ఆ దంపతులకు ఎంతో తృప్తి కలిగించింది. ఆ సమయంలోనే ఆమెకు దుర్గాబాయమ్మ గారితో పరిచయం ఏరడింది.

ఎన్నికల అనంతరం ఆమె మరికొంత కాలం కాంగ్రెసు ప్రచారం చేశారు. క్రమంగా కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ, ఆ తరువాత కమ్యూనిస్ట్ పార్టీ సిద్ధాంతాలు యీ దంపతులను ఆకర్షించినవి. ఏ పార్టీలోవున్నా తాము నమ్మిన సిద్ధాంతాలకు మనస్ఫూర్తిగా ప్రచారం చేయటం ప్రజలలో చైతన్యం కలిగించటమే ఆ దంపతుల లక్ష్యం. అందువల్ల అక్కడా పార్టీ ప్రచారమే చేశారు. విజయవాడలో డాక్టరు శ్రీమతి అచ్చమాంబ ఆధ్వర్యాన ఏర్పడిన ఆంధ్ర రాష్ట్ర మహిళా సంఘంలో చేరి ఆమె స్త్రీ జనాభ్యుదయానికి కృషి చేశారు. ఆసమయంలో కేంద్ర శాసన సభలో స్త్రీల హక్కులు, వివాహాలు, విడాకులు మొదలయిన బిల్లులు అనేకం చర్చకు వచ్చినవి. ఈ చర్చల సారాంశాన్నిబట్టి ఆ బిల్లులను దేశవ్యాప్తంగా శాసనాలుగా రూపొందించ వలసి వున్నది. అందువల్ల ఆంధ్ర రాష్ట్ర మహిళాసభ ఆధ్వర్యాన బిల్లుల ఆవశ్యకతను విపులీకరించుతు వాటినిబలపరుస్తు ఆమె మహిళా లోకంలో ప్రచారం చేశారు. ఆంధ్ర రాష్ట్ర

శాసనసభలో అయ్యదేవర కాళేశ్వరరావు గారు బహు భార్యా నిషేధ చట్టాన్ని ప్రవేశపెట్టారు. జాతి, మత, కుల, వర్గ భేదాలు లేకుండ యే స్త్రీ సౌఖ్యాని కయినా భద్రతకైనా ముఖ్యమైనది యీ చట్టం. అందువల్ల అప్పుడు కూడ ఆమె స్త్రీలలో విరివిగా ప్రచారం చేసి, అంగీకార ప్రకటనకు దోహదం చేశారు. మద్రాసు రాష్ట్ర శాసన సభలో ప్రవేశపెట్టబడిన దేవదాసీ విధాన నిర్మూలన చట్టం, ఆంధ్ర రాష్ట్ర శాసన సభలో ప్రవేశపెట్టబడిన వరదక్షిణ నిషేధ చట్టం సందర్భాలలో కూడ ఆమె స్త్రీ సామాన్యానికి మనసులో హత్తుకునే విధంగ వాటి ఆవశ్యకతను ప్రచారం చేశారు.

రెండవ ప్రపంచయుద్ధ కాలంలో ఫాసిస్టు రాజ్యాల దురాక్రమణ భయంకర రూపం తాల్చింది. అది అట్లా కొనసాగిపోతే ప్రపంచ భద్రతకే ముప్పు. అందు వల్ల స్త్రీలు యుద్ధం జరుగుతున్నది మనదేశంలో కాదుకదా అని అసావధానులై వుంటే దేశానికే అరిష్టం అని కష్ట నష్టాలను వివరంగా ప్రచారం చేశారు. ఒకవేళ శత్రువులు మన దేశంపైకే దాడి యెత్తివస్తే తమను తాము రక్షించుకోవటమే కాక పిల్లలను సురక్షితంగా కాపాడవలసిన బాధ్యత కూడ స్త్రీలపైన వున్నది. అందువల్ల ఆమె విమాన దాడులు జరిగేటప్పుడు పాటించవలసిన విధులను, రక్షణ మార్గాలను వనితా లోకానికి యెంతో ఆస్థతో బోధించేవారు.

స్వతహాగా ఆమెకు వున్నత విద్య నభ్యసించగల అవకాశాలు కలగలేదు. కాని, విజ్ఞాన వికాసాలపట్ల అభిరుచితో భర్త సంస్కార భావాలను మనస్ఫూర్తిగా స్వీకరించారు. నాటి నుంచి నేటివరకు యే పదవులను ఆశించ లేదు. అవి రాలేదని నిరాశపడలేదు. తమకై తాము పెంపొందించుకున్న జాతీయాభిమానంతో సేవా తత్పరతతో కార్యరంగంలో ప్రవేశించారు. ఏ కాలంలో అయినా యే పార్టీలోవున్నా స్త్రీజనాభ్యుదయానికి పనికివచ్చే విషయాలలో శక్తివంచన లేకుండ పనిచేశారు. శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ వంటి నిస్వార్థ సేవా తత్పరుల అవసరం దేశానికి యెప్పుడు వుంటునే వుంటుంది.

---

# శ్రీమతి కొత్తపల్లి సరళాదేవి

**జననం 1918**

శ్రీ కృష్ణుడు తన చెల్లెలు సుభద్రకు, "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అంటూ విలువిద్య, రథము నడపడం, యుద్ధకౌశలం అంతా నేర్పించాడు. భారతజాతి నడిపిన శాంతి సమర సందర్భంలో సుప్రసిద్ధదేశ సేవకులు, పండితులు, హిందీప్రచారకులు అయిన యలమంచిలి వెంకటప్పయ్యగారు తమ కడగొట్టు చెల్లెలు శ్రీమతి సరళాదేవి కి సత్యాగ్రహ పాఠాలు, హిందీ పాఠాలు కలగలుపుగా బోధించారు. వీరిద్దరు శ్రీ యలమంచిలి అంకప్ప శ్రీమతి ఆదెమ్మల బిడ్డలు. కృష్ణా జిల్లా పైడిగుండ్లవారి పాలెంలో 1918 లో పుట్టిన ఆమెకు 1932 లో సహాయ నిరాకరణోద్యమం దేశవ్యాప్తం అయేనాటికి చిన్నవయసే. 14 సంవత్సరాలే అయినా ఆ సమయంలో



శ్రీమతి కొత్తపల్లి సరళాదేవి

ఎక్కడ చూసినా విదేశీవస్తు బహిష్కరణ, విదేశ వస్త్రదహనం, మద్యపాన నిషేధం, ఉప్పు సత్యాగ్రహం రకరకాలుగా ప్రజలను ఉత్తేజపరుస్తున్నవి. బ్రిటిషువారి నిరంకుశ పరిపాలనా విధానం, దమన నీతి, వయసుతో నిమిత్తంలేకుండా పెద్దలను, పిన్నలను రణరంగంలోనికి పరుగులు పెట్టించింది. ఈమె అన్న శ్రీ వెంకటప్పయ్య, వదిన శ్రీమతి జనమ్మదేవి కుత్తుకబంటిగా ఆ వుద్యమంలో మునిగిపోయి వుండటం ఆమెను మరింతగా ప్రేరేపించింది. తానూ బయలుదేరింది. కల్లు, సారా పాకల దగ్గర, విదేశవస్త్ర దుకాణాలదగ్గర విరివిగా పికెటింగు ఆరంభించారు. నిజమైన గురువులు పరీక్షలు పెట్టనిదే, సుశిక్షితులు కానిదే శిష్యులను రంగంలోకి దింపరు. ఈ 14 ఏళ్లపిల్ల ఏదో బాల్య చాపల్యంతో పోయి అరెస్టయితే యెట్లా? పోలీసులు, తుపాకులు, కోర్టులు,



A M 16x

జైళ్లు, అదిలింపులు, వీటితో బెంబేలెత్తిపోతే యేమిచేయటం? అవి అన్నీ ఒక యెత్తు. బేలతనంతో ప్రభుత్వం వారి బోధలు బుర్రకెక్కి క్షమాపణ చెప్పుకొని బయటపడితే అసలే ప్రమాదం. దేశం పరువు, కాంగ్రెసుసంస్థ బిగువు నీటిలోకలసి పోగలవని అన్నగారిభయం. అందుకని ఎదుర్కొనవలసి వచ్చే లాఠీ ఛార్జీలు, తుపాకిపోట్లు, జైలు బాధలు విడమర్చి చెప్పారు. పరీక్షలు చేసారు. ఆమె చురుకుగా ధైర్యంగా అన్ని పరీక్షలలోనూ నెగ్గారు. నిస్సంకోచంగా బహిరంగంగా ఉద్యమంలో పాల్గొనటం ప్రారంభించారు. శ్రీమతి భారతీదేవి రంగాకి ఈమెపట్ల చాలా వాత్సల్యం. ఆమె కూడా వినిపించ వలసిన మాటలు వినిపించారు. చివరకు అనుకున్నంత అయినది. 1932 జనవరి 16 వ తేదీన 14 సంవత్సరాలపిల్ల కుమారి సరళాదేవిని అరెస్టు చేసి ఆరునెలలు జైలుశిక్ష వేసి గొప్ప నిరూపించుకున్నది బ్రిటిషు ప్రభుత్వం— రాయవేలూరు జైలుకు పంపించింది. ఆ రాత్రే శ్రీమతి దుర్గాబాయమ్మ ని కూడా అదే జైలుకు తీసుకువచ్చారు. ఆ రాత్రంతా దుర్గాబాయమ్మ గారు జాతీయ గీతాలతో జైలును అదరగొట్టివేశారు. ఆ ధాటికి తట్టుకో లేక జైలు అధికారులు రాజకీయ స్త్రీఖైదీలను వేరు వేరు చోట్లకు మార్చారు. ఆ మార్చటంలో కుమారి సరళాదేవిని కన్ననూరు జైలుకు పంపటం జరిగింది.

కన్ననూరు జైలులో ఆమెకు దుర్గాబాయమ్మ గారి తల్లి అయిన శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మ పరిచయం అయింది. కూతురు స్వభావానికి వ్యతిరిక్తంగా ఆమె శాంతిప్రియురాలు, నిండుకుండ. అలవాటు ప్రకారం జైలులోకూడా ఆమె హిందీపాఠాలు చెప్పేవారు. అన్నగారి దగ్గర హిందీ నేర్చుకుంటున్న కుమారి సరళాదేవి వెంటనే ఆమె దగ్గర చదువు కోవటం ప్రారంభించారు. సాధు సుబ్రహ్మణ్యంగారి కుటుంబ సభ్యులతోను 79 సంవత్సరాల వయస్సుగల వారి తల్లితోనూ జైల్లో పరిచయంఅయింది. ఇంట్లో శిక్షణ, దేశ పరిస్థితులు పుటకతో వచ్చిన ధైర్యసాహసాలు ఆమెను ఆ లేత వయసులో దేశసేవా కారణంగా జైలుకు రప్పించినవి. కాని పసిశరీరం జైలు జీవితానికి, ఆహార విహారాలకు, సరిపుచ్చుకోలేక పోయింది. జైల్లో బహుకాలం అనారోగ్యంతో బాధపడటమే అయింది. ఏదో విధంగా జైలుశిక్షాకాలం పూర్తిఅయి జూలై 15 న ఆమె విడుదలయినారు.

1932 లోనే సుప్రసిద్ధ హిందీ పండితులు, సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్లివచ్చిన దేశభక్తులు, కొత్తపల్లి వెంకట కృష్ణవర్మ గారితో ఆమె వివాహం అయింది. ముహూర్తం, మంత్రాలువంటి తతంగం లేకుండా

వధూవరులు కొన్ని ప్రమాణాలు చేసుకొని, దండలు మార్చుకోవటంతో శుభ కార్యం ముగిసింది. అనేకమంది హరిజనులుకూడ వచ్చి ఆశీర్వదించారు. సంసారం సాఫీగా జరిగిపోతున్నది. సంతానం కలిగింది. అయినా ఆమె పట్టువిడువక హిందీ చదువు సాగించారు. రాష్ట్రభాషా విశారద, ప్రవీణ, ప్రచారక్ పరీక్షలలో నెగ్గారు. అనేక గ్రామాలలో హిందీ ప్రచారం చేశారు. అసహాయోద్యమంలో జైలుకు వెళ్లివచ్చిన స్త్రీలందరూ యీ విధంగానే తమకు నచ్చిన రచనాత్మక కార్యక్రమాలలో పాల్గొన్నారు.

1945 లో కస్తూర్బా గాంధీ స్మారక జాతీయ సమితి (ట్రస్టు)వారు తాము నడిపే గ్రామ సేవికాశిక్షణ పొందటానికి ఆంధ్రరాష్ట్రం నుంచి కొంతమంది స్త్రీలు రావలసినదిగా కోరారు. ఆంధ్ర శాఖకు కార్యదర్శిని దుర్గాబాయమ్మగారు యెనిమిది మంది స్త్రీలను యెన్నుకొన్నారు. వారిలో శ్రీమతి సరళాదేవి ఒకరు. ఆమె తన బిడ్డలు ముగ్గురిని భర్త దగ్గర వదిలి బేసిక్ ట్రెయినింగుకు సేవాగ్రాం వెళ్లారు. అక్కడ ఒక సంవత్సరం వున్నారు. బాపూజీ సాన్నిధ్యాన వుండటంవల్ల సేవాభావం చక్కగ అలవడింది. హిందీలో వున్నత పరీక్షలు నెగ్గివున్న కారణంగా సేవాగ్రాం శిక్షణ యీామెకు క్షుణ్ణంగా అవగాహన అయింది. ఆమె కార్యదీక్ష, దక్షత, చురుకుతనం, పనినేర్పు చూసి, నిర్వాహకులు ప్రశంసించేవారు.

సేవాగ్రాం నుంచి తిరిగి వచ్చిన తరువాత తూర్పు గోదావరి జిల్లా సీతానగరంలోని కస్తూర్బా గ్రామ సేవాశిక్షణ కేంద్రంలో "బునియాదీ" శిక్షకులుగా నియమితులయినారు. మరికొంత కాలానికి కస్తూర్బా స్మారక నిధి, ఆంధ్రప్రదేశ కార్యాలయం వారు పల్లెలలో గ్రామ సేవా కేంద్రాలను నెలకొల్పారు. ఆమెను గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలోని కుగ్రామమైన బుర్రిపాలెం ముఖ్య గ్రామసేవికగా 1949 లో నియమించారు. నిజమైన సేవాభావంతో పనిచేసేవాళ్లకు కుగ్రామం, మహాపట్టణం ఒకటే. తమ కార్యనిర్వహణ మీాదనే వారి దృష్టి నిల్చివుంటుంది. నిర్మాణాత్మక కార్యక్రమాన్ని కుగ్రామంలో వుండే ప్రజలకుకూడా ఆకర్షణీయంగా లాభదాయకంగా కనిపించేటట్లు ఆమె యేర్పాటు చేసుకున్నారు. అంబర్ చరఖాలుపెట్టి స్త్రీల చేత నూలు వడికించి వాళ్లకు కొంత రాబడి చూపించారు. బియ్యం దంపుడు ప్రవేశపెట్టి యిటు దంపేవారికి కూలీ, అటు వుపయోగించే వారికి పుష్టి కలిగించారు. కొత్త విధానాల ననుసరించి మరుగు దొడ్లను యేర్పరిచారు. మహిళా సమాజం స్థాపించారు. దాని సహకారంతో మద్యపాన నిషేధం జరిపించారు. మద్యం తయారుచేసేవారి భుక్తికి లోటు

రాకుండా చేతి పనులతో నాలుగు డబ్బులు సంపాదించు కోవటం నేర్పారు. పిల్లలకు బేసిక్ విద్యాలయం, పెద్దలకు రాత్రి బడి తెరిచారు. హిందీ తరగతులు నడిపించారు. ఖద్దరు అమ్మకం జరిపి బుర్రిపాలెం వాస్తవ్యులకు ఖాదీపట్ల గౌరవం పెంపొందించారు. గ్రామాలు మూఢాచారాలకు పుట్టినిల్లు. ఆమె ఓర్పుతో నేర్పుగా నచ్చచెప్పి అటువంటి వాటి నెన్నిటినో మాన్పించారు. బాల్య వివాహాలను కూడ అరికట్ట గలిగారు.

గ్రామాలలో అన్నిటికన్న ముందు కుటిల రాజకీయాలు, ముఠా తత్వాలు కనుపించుతై. నిస్వార్థ సేవాఫలితంగా ఆమెకు కలుగుతున్న పేరు, పెద్దరికం మరి కొంతమందికి కంటక ప్రాయమయింది. ఆమెను యెట్లాగైనా కిందికి తోయాలని చూశారు. కాని యే విధంగా తప్పు పట్టటానికి వాళ్లకు అవకాశం దొరక లేదు. పెద్దరికం పెరిగింది. సహృదయంతో ఆమె తగాదాలను కూడా పరిష్కరించేవారు. ఒకసారి ఒక కుటుంబంలోని యిద్దరు సభ్యులు కొట్టుకుంటూండగా యీమె వెళ్లి మధ్య నిలిచారు. అనుకోకుండా దెబ్బ ఆమెపై పడింది. దాంతో కొట్టుకుంటున్న యిద్దరూ సిగ్గుపడి పశ్చాత్తాపపడి ఆవేశాలను తగ్గించుకున్నారు. ఆమె బుర్రిపాలెంలో 10 సంవత్సరాలు పనిచేసిన ఫలితంగా బుర్రిపాలెం ఆదర్శ గ్రామం, గాంధీ మహాత్ముడు కలలుకన్న గ్రామంగా రూపొందింది.

1959లో శ్రీమతి సరళాదేవి చిత్తూరు జిల్లాలో అంకిసెట్టిపల్లెకుముఖ్య గ్రామసేవికగా వెళ్లారు. అక్కడ ప్రాథమిక పాఠశాలకూడా లేదు. ప్రజలు అంధ విశ్వాసాలు, మూఢాచారాలలో మునిగివున్నారు. అంటువ్యాధులు వచ్చినపుడు కొలుపులు, జంతు బలులు అమలులో వుండేవి. అవన్నీ కొంతకు కొంత మాన్పించి, పరిశుభ్రతనేర్పి, యింటింటికివెళ్లి యింజక్షన్లు, యినాక్యులేషన్లు యిప్పించేటప్పటికి చరితార్థులైనట్లే సంతోషించారు. వ్యాధులు ప్రబలినప్పుడు స్వయంగావెళ్లి రోగులకు సేవలు చేసేవారు. అంటరానితనం గ్రామాలలో వున్నంత తీవ్రంగా యితరచోట్ల వుండదు. ఇటువంటి పాత ఆచారాలను యేతన్మాత్రంగా గ్రామస్థులు వదలరు. ఎంతో ఓర్పు చాకచక్యం వుంటేనేకాని వినిపించటం దుర్లభం. నిర్విరామ కృషితో శ్రీమతి సరళాదేవి జయించారు.

1921లో నెల్లూరు దగ్గర పల్లెపాడు గ్రామంలో పొణకా కనకమ్మగారు సత్యాగ్రహ ఆశ్రమం స్థాపించారు. గాంధీ మహాత్ముడే దానికి ప్రారంభోత్సవము చేశారు. కాలక్రమాన అది పాడుపడిపోగా దానిని పునరుద్ధరించవలసినదిగా కోరుతూ 1966లో ఆమెను కస్తూర్బా ట్రస్టువారు అక్కడికి పంపించారు. భర్త సహాయంతో యెంతో చక్కగా

ఆశ్రమం పునరుద్ధరించారు. నూలువడకటం, నేయటం, తేనె పరిశ్రమ, హిందీక్లాసులు, వ్యవసాయం మొదలైన కార్యకలాపాలతో పల్లెపాడు ఆశ్రమం మళ్లీ కల కలలాడింది. మహాత్మాగాంధీ, కస్తూర్బాగాంధీల శతజయంతి వుత్సవాల సందర్భంలో అక్కడ మహిళా శిబిరం నిర్వహించారు.

ఆమె ఆరుగురు బిడ్డల తల్లి. ఇల్లు దిద్దుకొనవలసిన గృహిణి, అయినా తన 14వ యేట ప్రారంభించిన దేశసేవను గాంధీ మహాత్ముని ఆదేశానుసారం రచనాత్మక కార్యక్రమంగా రూపొందించుకుని 1972లో ఆరోగ్యం పూర్తిగా దెబ్బతినే వరకు సేవారంగంలో ప్రముఖపాత్ర వహించారంటే నిజంగా శ్లాఘించి తీరాలి. అందుకే ''ముదితల్ నేర్వగ రాని విద్యగలదే ముద్దార నేర్పించినన్'' అన్నారు.

---

# శ్రీమతి తట్టా వెంకట నరసమ్మ

**జననం 1910**

"అమ్మాయి నరసమ్మా మా మాటవిను. మా యింటా వంటా యిట్లా కటకటాల వెనక నిల్చినవాళ్ళు లేరు. ఆడపిల్లవు, పోలీసులు కొడతారుట, తిడతారుట, ఎందుకొచ్చిన రభస. ఏదో పొరపాటయిందని ఒక కాగితం ముక్కమీద సంతకంచేసి పారేశావంటే మర్యాదగా మా వాళ్ళమధ్యకు వచ్చి పడవచ్చు" అని గ్రామపెద్దలు తెలిసినవారు హితం చెపుతున్నారు. 'నేను ఆ పని మాత్రం చెయ్యను. స్వతంత్రం నా జన్మహక్కు. ఒక్కొక్క జిల్లాలో వందలకొద్ది స్త్రీలు జైలు శిక్ష సంతోషంగా అనుభవించటానికి వెళ్తావుంటే నేను మాత్రం సిరికిసందలాగ చేయనా' అని యెదురుప్రశ్న వేస్తున్నారు శ్రీమతి తట్టా వెంకట నరసమ్మ. ఆమెకు, ఆమె వెంట శాసనోల్లంఘనం చేసిన ఆమె మిత్రురాలు దేవినేని శ్రీరాజితం గారికి చెరి 6 నెలలు కఠినశిక్ష వేసి 25–1–1932 న రాయవేలూరు జైలుకు పంపించారు.

శ్రీమతి తట్టా వెంకట నరసమ్మ

ఆ సమయంలో స్త్రీల వార్డులో 'సి' క్లాసు ఖైదీలందరు అంచులేని తెల్ల సైను చీరెలు కట్టుకుని వుప్పుడు బియ్యం బాగుచేస్తున్నారు. ఎవరి ముఖాన బొట్టు లేదు. చేతికి గాజులు లేవు. సి క్లాసు ఆడఖైదీలకు యివన్నీ నిషేధం. ఈ అవాచ్యం యింక భరించలేక పోయినారు అక్కడి స్త్రీలు. అంచు చీరెలు, బొట్టు, గాజులు అనుమతించేవరకు మేము పచ్చి మంచినీళ్ళు కూడ త్రాగమని, నిరసన వ్రతం పూనారు. వాళ్ళ ఐకమత్యం సంఘీభావం జయించినై. అంచు చీరలు, బొట్టు, రబ్బరు గాజులు అనుమతించారు. ఒక్క చిన్న షరతు పెట్టారు. ఆదివారం ఒక్కరోజు సూపరింటెండెంటు

తనిఖీకి వచ్చినప్పుడు మాత్రం తెల్ల సైను చీర పైన చుట్టు కోవలసిందిగా కోరారు. ఈ రకంగా ఆ సమస్య తీరింది. నరసమ్మగారు జైలుకు వచ్చిన సమయంలోనే రెండు మూడు రోజులు అటు యిటుగా, దుర్గాబాయమ్మగారి తల్లి అయిన శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మ సి క్లాసుకే వచ్చారు. ఆమె క్షణం నిర్వ్యాపకంగా కూర్చోలేదు. అందువల్ల అందరిని హిందీ నేర్పుతాను నేర్చుకోమన్నారు. అసలే వేరే యే వ్యాపకం లేకపోవటంతో అందరు వుత్సాహంగా చదువు ఆరంభించారు. అతి చురుకుగా అల్లుకుపోతున్న శ్రీమతి నరసమ్మను చూసి కృష్ణవేణమ్మ గారు చదువంటే నీకెంత వుత్సాహమమ్మా అని సంతోషం కనపరచేవారు. శ్రీమతి నరసమ్మ పుట్టింది రేపల్లె తాలూకా పెద్దపులివర్రు గ్రామం. 1910 ప్రాంతాలలో జన్మించిన ఆమెకు, ఆ వూళ్ళో 5,6 తరగతులపైన చదివే అవకాశం కలగలేదు. ఆమె సముద్రాల వెంకట శేషాచార్యులు తాయారమ్మగార్ల మూడవ సంతానం. తెలుగు సినిమారంగంలో కవులు, గేయకారులుగా పేరు పొందిన సముద్రాల రాఘవాచార్యులుగారి చెల్లెలు. పండిత వంశంలో పుట్టిన ఆమె విద్య పట్ల ఆస్త చూపటం సహజమే గదా.

గాంధీజీ ఆదేశానుసారం హిందీ నేర్చుకుంటున్న ఆ సి క్లాసు ఖైదీల వుపయోగార్థం శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు హిందీ బాల బోధిని, వాచకాలు, పలకలు, బలపాలు కొని అందరికి పంపించేవారు. ఆ విధంగా హిందీ నేర్చుకున్న నరసమ్మగారికి కృష్ణవేణమ్మ గారి పట్ల, ఆమె వాత్సల్యం పట్ల ఈనాటికీ చెప్పలేని గౌరవం, భక్తి. వీళ్లకు జైల్లో వుదయం వుప్పుడు బియ్యపు సంకటి ముద్ద, పుచ్చిపోయిన సరుకులతో తయారయిన పులుసు, దానినే జైలు పరిభాషలో దేవతా పులుసు అంటారు, యిచ్చేవారు. సాయంత్రం అన్నం ముద్ద, కంది గుగ్గిళ్లు యిచ్చేవారు. రుచిపాకాలు యెట్లా వున్నా అంతా పుచ్చు, పురుగులు, అందువల్ల ఆహారం మార్పు కోసం మళ్లీ అలజడి బయలుదేరింది. ఈసారి యిది మార్గం కాదని సగం శిక్ష పూర్తి కాగానే ఆమెను, ఆమె మిత్రురాలు శ్రీమతి శ్రీరాజితం, కృష్ణవేణమ్మగార్లను మరి కొంతమందిని కన్ననూరు జైలుకు మార్చారు. అక్కడ వుప్పుడు బియ్యం వద్దు — పచ్చి బియ్యపు అన్నం కావాలని, మజ్జిగ యివ్వాలని అడిగారు. గొడవలతో విసుగెత్తిపోయిన అధికారులు ఒప్పుకున్నారు. అందువల్ల ఆ సగభాగం జైలు శిక్షను సుఖంగానే గడిపి బయటికి వచ్చారు. హిందీ నేర్చుకుంటూనే వున్నారు.

1929 నుంచి ఆమెకు రాట్నం మీద నూలు వడకటం, ఆ నూలుతో యింటిల్లిపాదికి బట్టలు నేయించటం అలవాటు. విదేశీవస్తు, వస్త్ర బహిష్కరణలో తీవ్రంగ పాల్గొన్నారు. ఆ సమయంలో శ్రీ తుంగల చలపతిరావు, ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంగారు మొదలైన నాయకులు చీరాలలో ఒక శిబిరం నడిపారు. ఆమె ఆ శిబిరంలో మూడు నెలలు ప్రచారక శిక్షణ పొందారు. వాడ వాడల తిరిగి యీ తెల్లదొరతనం వద్దని శాసనోల్లంఘన చేస్తు ప్రజలను వుద్రిక్తపరుస్తు ప్రచారం చేసేవారు. ఒకనాడు అట్లాంటి కరపత్రాలు గ్రామాలలో పంచుతు ప్రచారం చేస్తున్నందుకు ఆమె అరెస్టు అయినారు. అందువల్ల కన్ననూరు జైలునుంచి విడుదల కాగానే తిరిగి ఆ ప్రచార కార్యక్రమంలో నే ప్రవేశించారు. శ్రీ ఉన్నవ దంపతులు, దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్య, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గార్ల వెంట తిరిగి వుద్యమ ప్రచారం చేశారు. ఖాదీ బట్టలు యింటింటికి తిరిగి అమ్మేవారు. అట్లా రెండు మూడు సంవత్సరాలు పనిచేశారు.

1936 లో ఆమె సోదరులు సముద్రాల రాఘవాచార్యులుగారు మద్రాసు తరలివెళ్ళటంతో ఆమె కూడ మద్రాసు చేరుకున్నారు. పదవ సంవత్సరంలోనే ఆమెకు శ్రీ తట్టా వీరరాఘవాచార్యులుతో వివాహం జరిగింది. కాని సంతతి కలగలేదన్న నెపంతో ఆయన రెండవ వివాహం చేసుకోవటంతో ఆమె అన్నగారి దగ్గరే వుండేవారు. మద్రాసు ఎగ్మూరులో మిసెస్ పీటర్స్ అనే ఆమె ఒక రికగ్నయిజుడు మాంటిస్సోరీ స్కూలును నడిపేవారు. ఆమె ఆ స్కూలులో తెలుగుటీచరుగా కొంతకాలం వున్నారు. ఆ తరువాత మద్రాసు మైలాపూరులోవున్న చిల్డ్రన్స్ గార్డెన్ స్కూల్లో తెలుగు టీచరుగా 2,3 సంవత్సరాలు పనిచేశారు. అనారోగ్య కారణంగా ఆ తరవాత చాలాకాలం నిర్వ్యాపకంగానే గడచిపోయింది. 1953–54 ప్రాంతాలలో కాంగ్రెసు ప్రభుత్వం రాజకీయ బాధితులకు ఐదేసి యెకరాల బంజరు భూములు యిచ్చారు. ఆ విధంగా ఆమెకూ వచ్చింది భూమి. కాని దానిలో పంట పండ లేదు. ఆమె శిస్తు చెల్లించలేదు. అదీ కథ.

ఆమెకు బంధువర్గపు అండ దండలు బాగానే వున్నవి. ఏ కొరత రానీయరు. కాని ఒకరిమీద ఆధారపడి వాళ్లను యిబ్బందిపెట్టటం ఆమెకు నచ్చదు. శక్తి వున్నంతకాలం స్వేచ్ఛా జీవితం గడపాలంటారు ఆమె. అందువల్ల 1962 నుంచి యీనాటివరకు యీ పదిహేడు సంవత్సరాలుగా ఆమె మెదక్ జిల్లా, నరసాపూర్ తాలూకా బొంతపల్లి గ్రామంలో శ్రీ వీరభద్ర స్వామి దేవస్థానంలో విప్రనారాయణుడి స్థానంలో వున్నారు. అంటే చేతులార

రకరకాల పూలమాలలు కూర్చి వేళ వేళకు భగవంతుడికి సమర్పించుతారు. ఆధ్యాత్మిక చింతనలో కాలం గడుపుతు వుంటారు. 1974 నుంచి రాజకీయ బాధితులకు దేశవ్యాప్తంగా నెలకు రెండు వందల రూపాయల పెన్షను వస్తున్నది. 'ఆ మహాతల్లి ఇందిరాగాంధి పూనుకుని యీ పెన్షను ఏర్పాటు చేయించింది. కాబట్టి తనవంటి బిడ్డలు లేనివారు, భర్త ఆదరణ లేనివారు కూడ, ఆనాడు దేశ స్వతంత్రంకోసం పోరాడినందుకు ఈనాడు స్వతంత్ర జీవనం చేయగలుగుతున్నారని' కళ్ళు తుడుచుకుంటారు శ్రీమతి తట్టా వెంకట నరసమ్మగారు.

---

# శ్రీమతి మైనేని బసవ పూర్ణమ్మాదేవి

**జననం 1909**

ఏనాడుగాని ఒక వుద్యమం విజయవంతం కావాలంటే జనబాహుళ్యానికి అందులో ప్రవేశం వుండాలి. ఆ విషయం గాంధీ మహాత్ముడికి తెలిసినంతగా మరెవరికి తెలియదు. ఆయన ధనికులను, పేదలను, విద్యావంతులను, విద్యావిహీనులను, నగర వాసులను, పల్లె ప్రజలను, పురుషులను, నాలుగు గోడల మధ్య వున్న స్త్రీలను సమాన దృష్టితో గౌరవించి, ప్రాధాన్యత యిచ్చి బృహత్ వుద్యమాన్ని విజయవంతంగా నడిపించారు. అందులోను శాంతి సమరం. ఒక్క పుల్లకూడ చేతిలో పట్టుకొనవలసిన అవసరం లేదు. తమ వాక్చాతుర్యాన్ని వుపయోగించి ప్రచారం చేస్తే, వుద్బోధ చేస్తే చాలు. అందువల్లనే గ్రామీణులు విరివిగా 1930 ఉప్పు సత్యాగ్రహంలోను, 1932 శాసనోల్లంఘనంలోను అత్యధిక సంఖ్యలలో పాల్గొన్నారు.



శ్రీమతి మైనేని బసవ పూర్ణమ్మాదేవి

గుంటూరు జిల్లాలోని ఒక్క రేపల్లె తాలూకానుంచే 1932లో 106 మంది శాసనోల్లంఘనచేసి వివిధ శిక్షలను అనుభవించటానికి జైళ్లకు వెళ్లారు. వారిలో కనీసం 50 మంది స్త్రీలు. దరిదాపు వారందరు యింట్లో చదువు అభివృద్ధి చేసుకున్న గ్రామీణ స్త్రీలే. కాని వారికి గాంధీ మహాత్ముని నాయకత్వంలో కలిగిన చైతన్యం కర్తవ్యబోధ చేతనాశక్తిని ప్రసాదించింది. దేశసేవకు నిస్సంకోచంగ పూనుకున్నారు. శ్రీమతి మైనేని బసవపూర్ణమ్మాదేవి వారిలో ఒకరు.

1909లో ఆమె గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా, చాట్రగడ్డ గ్రామంలో జన్మించారు. శ్రీమతి బుల్లెమ్మ, శ్రీ కొత్తపల్లి కుటుంబయ్యలు ఆమె తల్లి దండ్రులు. తండ్రి నీలిమందు వ్యాపారం సాగించుతు సేద్యం చేసే సంపన్నరైతు. ఆమె 5వ తరగతి వరకు బడికివెళ్లి చదువుకున్నారు. ఆ తరువాత యింట్లోనే గురువుల సన్నిధిన భారత భాగవత రామాయణాది

కావ్యాలన్నీ చదివారు. 12వ ఏట మైనేనివారి పాలెం వాస్తవ్యులయిన మైనేని కోటయ్యగారితో వివాహం జరిగింది.

1930 లో ఉప్పు సత్యాగ్రహం నాటికే జాతీయోద్యమం ఆంధ్ర గ్రామాలకు చొచ్చుకునిపోయింది. ప్రతి ఆంధ్రమహిళ గాంధీజీ పరిభాషలో ''రాట్నంరాణి'' అయి భక్తిశ్రద్ధలతో చక్రం త్రిప్పింది. నాటికి నేటికి ఆంధ్ర గ్రామీణ రైతులు ఖాదీ ధారులే. అందువల్ల శ్రీమతి బసవపూర్ణమ్మ నూలు వడుకుతు ఖాదీ ధరించటమేకాక ఖాదీ ప్రచారం చేసేవారు. విదేశీ వస్త్ర దుకాణాల దగ్గర పికెటింగు చేసేవారు. 1930లో ప్రఖ్యాత దేశసేవిక శ్రీమతి పత్తిపాటి సాధు సీతమ్మతో కలిసి చీరాల పేరాల వంటి గ్రామాలలో తిరిగి విదేశీ వస్త్ర దుకాణాల దగ్గర బహిరంగంగా సత్యాగ్రహం చేసేవారు. చక్కని కంఠంతో దేశభక్తి గీతాలు, జాతీయ గీతాలు పాడి ప్రజలలో వుద్రేకం వుత్సాహం కలిగించేవారు. కాని అప్పుడు ఆమెను అరెస్టు చేయలేదు. రాష్ట్రభాష అయిన హిందీని చదవ నారంభించారు.

లవణ సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్లి వచ్చిన రెండవ జట్టు సొంతం యిళ్లు చేరుకునే లోపలే తిరిగి శాసనోల్లంఘనం రెండవ ఘట్టం ఆరంభమయింది. అప్పటికి మైనేనివారి పాలెం కూడ రంగప్రవేశం చేసింది. కొత్తపల్లి వెంకటకృష్ణవర్మ, యలమంచిలి వెంకటప్పయ్యగార్ల వంటి పురుషులు పూనుకుని వుద్యమం నడిపించారు. వారిని మించిన ఉత్సాహ వుద్రేకాలతో శ్రీమతులు మైనేని బసవపూర్ణమ్మాదేవి, యలమంచిలి బసవమ్మాదేవి వంటి యువతులే కాక కుమారి సరళ కుమారి వంటి బాలికలు కూడ నిర్భయంగ శాసనధిక్కారం చేయసాగారు. గరిమెళ్ల సత్యనారాయణగారు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు రచించిన గీతాలు సులభమైన చక్కని పదజాలంతో ప్రతి వారికిఅర్థం అవుతు దేశభక్తిని వుద్రేకాన్ని కలిగించేవి. జండాలు భుజాన పెట్టుకుని యీ గీతాలు పాడుకుంటూ ప్రజలలో వుద్బోధ చేయటంలో ఆంధ్రమహిళలు ప్రసిద్ధిగన్నారు. శ్రీమతి బసవపూర్ణమ్మ కూడ కలిశారు.

''దండాలు దండాలు భరతమాత
అవి అందుకుని దీవించు భరతమాత''
''ముప్పైకోట్ల ప్రజలు రాంభజన
పంజర బంధమైనారు రాంభజన

బంధాలు త్రెంపుకుని రాంభజన
అవతల పడాలి రాంభజన
గాంధీ మంత్రమదేను రాంభజన
స్వరాజ్య మంత్రం రాంభజన
ఒకటేమంత్రం రాంభజన''

ఇట్లా పాటలద్వారా ప్రచారమేకాక విదేశీ బట్టలదుకాణాలు, కల్లు, సారాదుకాణాల దగ్గర పికెటింగులుచేసి, కరపత్రాలు పంచిపెట్టి, వూరేగింపులో పాల్గొని బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేకంగ నిర్భయంగ శాసన ధిక్కారం జరిగించారు. చివరకు 16–1–1932న ఆమెను, యలమంచిలి బసవమ్మాదేవి, కుమారి సరళాకుమారిగార్లను అరెస్టుచేశారు. రేపల్లె తాలూకా జైలులో మూడు రోజులు వుంచారు. విచారణ జరిపి ఆరునెలలు శిక్షవేసి 'సి' క్లాసు ఇచ్చి రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమె ఏకైక సంతానమైన కుమారి స్వరాజ్యలక్ష్మి అప్పటికి 5,6 సంవత్సరాల అమ్మాయి. తల్లివెంట అమ్మాయి బయలుదేరింది. ఆమె కూడ వెంట తీసుకువెళ్ళటానికే నిశ్చయించుకున్నారు. కాని అంతమంది పోలీసులమధ్య తాలూకా జైలులోవున్న తల్లినిచూసి పాపం ఆ అమ్మాయి మరి తల్లి దగ్గరికి రాక అమ్మమ్మని హత్తుకున్నది.

శ్రీమతి బసవపూర్ణమ్మ రాయవేలూరు జైల్లో ప్రవేశించారు. అప్పుడు జైలులో శ్రీమతులు బెన్నూరి కృష్ణవేణమ్మ, తట్టా నరసమ్మ, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి, భారతీదేవి రంగా మరి యెందరో వున్నారు. 3 నెలలు గడిచింది. ఇంతలో అక్కడ జనసంకీర్ణం యెక్కువగావున్నదని శ్రీమతులు కృష్ణవేణమ్మ, యలమంచిలి సరళాకుమారి, సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి, బసవపూర్ణమ్మలను కొంతమందిని మలబారులోని కన్ననూరు జైలుకు పంపించారు. అక్కడ వుప్పుడు బియ్యపు అన్నమేకాక కొబ్బరినూనె వంటకు వుపయోగించేవారు. పచ్చి కొబ్బరి, పనసముక్కలు తరుచు వాడేవారు. ఆ భోజనంపడక శ్రీమతి బసవపూర్ణమ్మ ఆరోగ్యం దెబ్బతిన్నది. రక్త విరోచనాలవల్ల అక్కడవున్న మూడు నెలల లోను అధికభాగం ఆసుపత్రిలోనే గడిచిపోయింది. ఆ సమయంలో కన్ననూరు జైలులో శ్రీమతులు ఎర్నేని అమృతమ్మ, లీలావతీదేవి, వారి అత్తగారు పుల్లమ్మగార్లు వుండేవారు.

విడుదలయివచ్చిన తరువాత ప్రత్యక్షంగా రాజకీయాలలో ఆమె పాల్గొన లేదు. ఆమె దృష్టి మహిళాభ్యుదయంవైపు మళ్ళింది. మహిళల అనర్థా

లన్నిటికి ముఖ్యకారణం విద్యావిహీనత, ఆర్థిక పరాధీనత అనితేల్చుకున్నారు. అందువల్ల తమ యేకైక సంతానమైన కూతురిని చదివించి రేపల్లె తాలుకా మొత్తంమీద మొదటి పట్టభద్రను చేశారు. ఉద్యోగంలో రెండు సంవత్సరాలు స్థిరపడిన తరువాతనే కూతురికి వివాహం చేశారు. ఆమె పట్టుదలకు అదే తార్కాణం.

ఆమెకు శ్రీమతులు కొండా పార్వతీదేవి, భారతీదేవిరంగా, తుమ్మల దుర్గాంబలవంటి సంఘసేవికలు దేశసేవికలతో సన్నిహితత్వంవున్నది. అనేక మహిళాసభలు సమావేశాలకు యెప్పుడు హాజరవుతు, పాల్గొంటు వుండేవారు. గుంటూరు జిల్లా మహిళా సంఘానికి అనుబంధంగా, ఆమె స్వయంగా పూనుకుని సభ్యులనుచేర్చి రేపల్లె తాలూకా మహిళా సంఘం స్థాపించారు. దానికి కార్యదర్శినిగావుండి సంఘం స్వంత భవనాల నిర్మాణానికి చాలా సహకరించారు. శ్రీమతులు భారతీదేవిరంగా, కొండా పార్వతీదేవులవంటి పెద్దలను ఆహ్వానించి రేపల్లెలో తాలూకా మహిళాసభలు బ్రహ్మాండంగా జరిపించి అందరి మన్ననలు పొందారు. కావూరు వినయాశ్రమానికి తరుచు వెళ్తు, కార్యక్రమాలలో పాల్గొంటు వుండేవారు. రేపల్లె బెంచి మేజిస్ట్రేటుగా శ్రీమతి బసవపూర్ణమ్మ కొంతకాలం పనిచేశారు. రాట్నం వడకటం పరిపాటి. గాంధీజీ సిద్ధాంతాలపైన కాంగ్రెసు సంస్థపైన ఆమెకు ఈనాటికీ నమ్మకం వున్నది.

స్వగ్రామమైన మైనేనివారిపాలెంలో కొంత స్థలం, వెయ్యిరూపాయల డబ్బుయిచ్చి శ్రీ దత్తాత్రేయ దేవాలయ నిర్మాణానికి తోడ్పడ్డారు. 1958లో రాజకీయ బాధితురాలుగా ఆమెకు కొంతభూమి యిచ్చినప్పటికీ అది ఆమె కనుచూపు మేరలోకి యింతవరకు రాలేదు. తామ్రపత్రంయిచ్చి ప్రభుత్వం సన్మానించారు. ఆమెకిప్పుడు 70 సంవత్సరాల వయసు. స్వయంగా యే పనిగాని పూనుకొని నిర్వహించగల శక్తిలేదు. సంతృప్తిగా విశ్రాంతి తీసుకుంటూ మహిళాభ్యుదయాన్ని గమనించుతు వుంటారు.

---

# శ్రీమతి మాన్యప్రగడ రామసుందరమ్మ

**జననం 1915** **మరణం 19-12-1934**

1927లో శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి అకాలంగా మరణించినప్పుడు గాంధీమహాత్ముడు "ప్రాచీన కాలమున మన దేశము అనుభవించుచుండినట్లు అనేకులు చెప్పు స్వాతంత్ర్య ప్రతిపత్తిని మన దేశము తిరిగి పొందుటకుగాను అనేకులగు యువతీ యువకులు తమ జీవితాలను నిజధర్మాచరణమునకు ధారపోయక తప్పదని నిశ్చయముగా చెప్పగలను," అని అన్నారు. అదే ఆదేశానుసారం నిజ జీవితాన్ని దేశస్వాతంత్ర్యం కోసం గడ్డిపోచగా భావించి త్యాగంచేసిన అమరజీవి శ్రీమతి మాన్యప్రగడ రామసుందరమ్మ.

పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా, ఖండవల్లి గ్రామం ఆమె జన్మస్థలం. 1915 లో జన్మించారు. ఆ వూరి కరణం అయిన శ్రీచిత్రావూరి కనకయ్యగారి ఏకైక సంతానం ఆమె. ఆ గ్రామంలో అందుబాటులో వున్న ప్రాథమిక విద్యనే ఆమె అభ్యసించారు. 1926 ఫిబ్రవరి 17 న, సుప్రసిద్ధ దేశభక్తులయిన మాన్యప్రగడ వెంకట కృష్ణారావుగారితో వివాహం అయింది. ఆయన తూర్పు గోదావరి జిల్లా సీతానగరంలోని గౌతమీ సత్యాగ్రహాశ్రమంలో వుండేవారు. సర్వసంగపరిత్యాగి, త్యాగపురుషులు అయిన డాక్టరు శ్రీ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం 1925లో గాంధీమహాత్ముడి ఆశీస్సులతో ఈ గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించారు. మహర్షి బులుసు సాంబమూర్తిగారు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, మరికొందరు ధర్మకర్తలుగా యీ ఆశ్రమం ఆంధ్ర దేశంలో సత్యాగ్రహోద్యమ వ్యాప్తికి పనిచేసింది. ఆశ్రమానికి వుదారంగా దేశాభిమానులు భూదానం చేయగా, నాలుగు వేల పై చిలుకు యెకరాల భూమి యేర్పడింది. ఆ భూములమీద వచ్చే ధాన్యంతో సత్యాగ్రహులకు శాంతి సమరంలో పాల్గొనటానికి క్రమశిక్షణ నిచ్చి పంపుతువుండేవారు. వడ్రంగం, కమ్మరం నేర్పేవారు. కాంగ్రెసు అనే పత్రిక నడిచింది. ఖాదీవుత్పత్తి ప్రధాన పరిశ్రమ. పట్టు, జరీలతో శ్రేష్ఠమైన ఖాదీబట్టలు అక్కడి మగ్గాల మీదనేయించేవారు. ఆంధ్రదేశ పర్యటనలో గాంధీమహాత్ముడు సపరివారంగ ఆ

ఆశ్రమం అడంగుగా పెట్టుకుని పర్యటించటం పరిపాటి. ఆశ్రమంలోని కార్యకలాపాలలో వుత్సాహంగ పాల్గొంటు, ఆశ్రమ నిర్వహణకు తోడ్పడుతున్న కృష్ణారావుగారి నవవధువు శ్రీమతి రామసుందరమ్మ 12 సంవత్సరాల పిల్ల అయినా, ఆ వాతావరణం ఆమెను విపరీతంగ ఆకర్షించింది. ఆ లేతహృదయంలో దేశాభిమానం, దేశభక్తి నిండిపోయినవి. తన గ్రామమైన ఖండవల్లిలో ఆశ్రమగాథలను, స్వాతంత్ర్య సమరవిశేషాలను ప్రతివారికి వివరించుతు, తోటివారిలో దేశభక్తి వుద్బోధించుతు ఆమె వుప్పొంగిపోయేవారు. రాట్నంమీద నూలువడుకుతు, ఖాదీధరించుతు వుండేవారు. దీనిపరిణామం గ్రహించిన ఆమె తల్లి దండ్రులు వారించేవారు. కాని ఆమె ఆగలేదు. 1930లో ఆమె గృహిణిగా సీతానగరం వచ్చేశారు. 15 ఏళ్లవయసుకే భర్తతోపాటు ఆశ్రమ కార్యకలాపాలలో పాల్గొనేవారు. భర్తతో కలిసి జాతీయోద్యమంలో పాల్గొనటం పెద్ద భాగ్యంగా భావించేవారామె. ఆ సమయంలోనే రాష్ట్రభాష అయిన హిందీని అభ్యసించారు. అడపాదడపా ఆశ్రమంలో లాఠీఛార్జీచేస్తు పోలీసులు ఆశ్రమ కార్యకలాపాలకు అంతరాయం కలిగించుతు వుండేవారు. 1932లో ఆశ్రమం ఛిన్నాభిన్నంచేసి సీళ్లుకూడవేశారు. ఆమె అన్నిటిని దేశసేవలో భాగంగ నవ్వుతు స్వీకరించేవారు.

1933 జనవరి 15న గుంటూరులో ఆంధ్రరాష్ట్ర నియంతల మహాసభ జరిగింది. ఆమె నైజాం రాష్ట్రనియంతగా యెన్నికయినారు. ఆ సభల్లో పాల్గొన్న కారణంగా ఆమెను అరెస్టుచేసారు. 6 మాసాలు విడిఖైదు. రెండు వేలరూపాయల జరిమానా విధించారు. జరిమానా చెల్లించనిపక్షంలో మరి మూడునెలలు అదనపుశిక్ష. 'సి' క్లాసు యిచ్చారు. జరిమానా చెల్లించ నిరాకరించిన కారణంగా ఆమె మొత్తం 9 నెలలు జైలుశిక్షను రాయవేలూరు, కన్ననూరులలో అనుభవించారు. ఆ సమయంలో అక్కడ ఆంధ్రరాష్ట్ర నియంతగా అరెస్టయి శిక్షననుభవించుతున్న శ్రీమతి శ్రీ పెరంబుదూరు సుభద్రమ్మ వున్నారు. కొంతవరకు ఆమెది దుర్బల శరీరం. వయసు తక్కువ. శిక్షాకాలం యెక్కువ. అనారోగ్యకరమైన జైలు భోజనం, ఆ పరిస్థితులు యెంతటివారిని కుంగతీయగలవు. పర్యవసానంగా ఆమె ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది.

విడుదలయి శీతానగరం వచ్చారు. వ్యాధిగ్రస్థఅయి గౌతమీ సత్యాగ్రహాశ్రమంలోనే వున్నారు. ఆమెను కన్నబిడ్డలాగ వాత్సల్యంతో అభిమానంతో

చూసుకునే డాక్టరు సుబ్రహ్మణ్యంగారు, శ్రీ వంగల దీక్షితులుగారు యింకా అనేకమంది మేటి వైద్యులు ఆమెకు దాదాపు 15 నెలలు వైద్యంచేశారు. ఆమెకది తగ్గటానికి వచ్చిన జబ్బు కాదుగదా. ఎంతమంది యెంత ప్రయత్నించినా ఫలితం దక్కలేదు. డాక్టరు సుబ్రహ్మణ్యంగారే లాఠీఛార్జీలతో, జైలు వాసంతో వ్యాధిగ్రస్థులయి మరణించారు. తగినట్లు ఆ కాలంలో క్షయవ్యాధికి గట్టి మందులులేవు. 1934 డిశంబరు 19వ తేదీన 19 సంవత్సరాల లేతవయసులోనే, ఆమె పిందెగానే రాలిపోయినారు. ఆమె బ్రతికినది 20 సంవత్సరాలుకూడలేదు. కాని ఆమె ఆ కొద్దికాలంలోనే దేశభక్తి, త్యాగం, సేవానురక్తులతో తారాజువ్వలాగ ప్రకాశించి యశఃకాయులైనారు.

— ——

# డాక్టరు శ్రీమతి కొమర్రాజు అచ్చమాంబ

జననం 6–10–1906 మరణం 20–10–1964

"కలకంఠికంట కన్నీరొలికిన సిరియింట నిలవద"ని పండితుడు, చరిత్ర కారుడు, విజ్ఞానచంద్రికా మండలి స్థాపకుడు అయిన శ్రీ కొమర్రాజు లక్ష్మణ రావుగారి భావన. సంఘ సంస్కారి, సేవాతత్పరురాలు, విద్యావతి, అబలా సచ్చరిత్ర రత్నమాల అనే బృహద్గ్రంధ రచయిత్రి అయిన శ్రీమతి భండారు అచ్చమాంబ శ్రీ లక్ష్మణరావు సోదరి. ఆమె అకాలమరణం చెందగా ఆమె పట్లగల ఎనలేని గౌరవ అభిమానాల కారణంగా ఆయన తన కూతురుకి అచ్చమాంబ అని పేరు పెట్టుకున్నారు. ప్రాణాధికంగాపెంచి తనలో చెలరేగే వున్నత భావాలను, ఆదర్శాలను, సంస్కార భావాలను పసితనంనుంచే ఆమెకు నూరి పోశారు. అందుకే ఆమె దృష్టిలో స్త్రీ డా. శ్రీమతి కొమర్రాజు అచ్చమాంబ అంటే చీటికి మాటికి బేలగా కన్నీరుకార్చే బలహీనురాలు, వాజమ్మకాదు. ఎదురయ్యే సమస్యలను ధైర్యంతో పరిష్కరించుకుని నిబ్బరంగా ముందుకు సాగిపోగల ఆత్మాభిమాని, కరుణామయి . సానుభూతికి బదులు గౌరవం అందుకోవలసిన మానవ జాతిలో సగభాగం స్త్రీ అని భావన.



ఆమె 1906 అక్టోబరు 6న గుంటూరులో జన్మించారు. తల్లి శ్రీమతి రామకోటమాంబ. ఆమె పెరగటం, చదవటం మద్రాసులో జరిగి పోయింది. అశాంతి, కల్లోలం తొలగించి ప్రశాంతత నెలకొల్పాలని అవసరంలో వున్నవారికి చేయి అందించాలని ఆమెకు చిన్ననాటినుంచే అనిపించేవి. పది పన్నెండు సంవత్సరాల అమ్మాయిగా వున్నప్పుడు ఆడుకోవటానికి బదులు, చుట్టుపక్కలవున్న పేదకుటుంబాలలో వచ్చే పోట్లాటలకు కలతలకు ఛిద్రాలకు మూలకారణాలు ఆలోచించుతు, వాళ్లకు ఆ కలతలు తీరిపోవటానికి తగిన సలహాలు, సూచనలు యివ్వటంజరిగేది. ఆమె మాటలోని నిజాయితీ కనిపెట్టిన ఆ పేదలుకూడ ఒక పెద్ద ఆరిందాలాగ ఆమెను సలహాలడిగేవారు.

తండ్రికి జాతీయాభిమానం మెండు. రాష్ట్రోద్యమంలో జాతీయోద్యమంలో బహుకాలంగ నాయకత్వం వహించిన శ్రీ ఆచంట లక్ష్మీపతి, శ్రీమతి రుక్మిణీదేవి కుటుంబ మిత్రులు. వస్తుతః స్వతంత్రభావన అధికంగాగల ఆమె చదువుకునే రోజుల్లోనే జాతీయోద్యమం వైపు ఆకర్షితులైనారు. విదేశీ వస్తు వస్త్రాలను బహిష్కరించారు. నూలు వడికేవారు, ఖాదీ ధరించేవారు, ఉబుసుపోక కాలక్షేపానికి యేపని చేయటం ఆమెకు నచ్చదు. ప్రతిదాని గురించి చాల తీవ్రంగ ఆలోచించటం అలవాటు. ఆచంట లక్ష్మీపతిగారి పెద్దబ్బాయి జానకిరాంగారు, ఆమె అన్నా చెల్లెళ్ల చనువు, అభిమానాలతో వుండేవారు. జీవితమే ఒకసుందరస్వప్నంగా తోచే భావుకుడు శ్రీ జానకిరాం. ప్రతి వస్తువును సౌందర్యదృష్టితో చూసే ఆయన ఒకపత్తి పూవును కోసి ''చెల్లాయీ అచ్చమాంబా, యీపువ్వు యెంత అందంగా వున్నదో చూడు'' అన్నారు. అంతే, ఆమె దానిని తీసుకోకపోగా చురచుర చూస్తు 'నీకళ్లకు యీ పత్తి పూవేకనిపించిందా? నీవు కోసి నాశనం చేయకుండావుంటే కాయకాసి పత్తి వచ్చేది. ఆ నూలుతో బట్టవచ్చేది. నీవు సింగారించుకున్న చొక్కా కూడ పత్తితో తయారైనదే తెలుసా!' అంటు వుపన్యాసం ఆరంభించారు.

1923లో అనుక్షణం ఆమెను తీర్చిదిద్దుతున్న తండ్రి అకస్మాత్తుగ గుండెపోటుతో మరణించారు. జీవితానికొక లక్ష్యమంటూ వుండాలన్న సంకల్పంతో ఆమె మెడికల్ కాలేజిలో చేరారు. ఎప్పుడూ యేవో సభల్లో సమావేశాలలో పాల్గొంటు ధాటిగా వుపన్యసించుతు వుండేవారు. సైమన్ కమిషన్ పట్ల నిరసన ప్రదర్శనలలో పాల్గొన్నారు. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి స్థాపించిన యూత్‌లీగులో చేరి జాతీయోద్యమ ప్రచారం చేశారు. తల్లి రామకోటమాంబగారితో సహా ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. లాఠీ దెబ్బలు తిన్నారు. విద్యార్థి వుద్యమం నడిపారు. తుపాకి పోట్లకి, లాఠీ దెబ్బలకు క్షతగాత్రులయిన వాలంటీర్ల సపర్యలకు చికిత్సకు ఆసుపత్రి నెలకొల్పారు. ఎంతో దీక్షతో పనిచేశారు.

1931 నాటికి మెడికల్ కాలేజీలో చదువు ముగిసింది. కాని ఆమెకు సంతృప్తి కలగలేదు. శిశు సంరక్షణ, ప్రసూతి శాస్త్రాలు యింకా బాగాచదివి, దేశంలోని స్త్రీలకు మరింతగా వైద్య సహాయం అందించాలన్న తలంపుతో ఇంగ్లండులో సంవత్సరంనర చదివి, మూడు ప్రత్యేక పరీక్షలు నెగ్గి డిగ్రీలతో వచ్చారు. అప్పటికి ఆమెకు వామపక్ష సిద్ధాంతాలు బాగా వంటపట్టినవి. మద్రాసులో కూలీ రక్షణ సంఘం, కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలలో పాల్గొనటం ఆరంభించారు. తండ్రి హేతువాది. ఆమె పూర్తి నాస్తికురాలుగా మారారు. ఆత్మాభిమానానికి, ప్రగతికి, ప్రతిబంధక

మని తోచిన వ్యర్థపు సాంప్రదాయాలను, నమ్మకాలను సమూలంగా పీకివేసినా ఆమె ఖాదీనే ధరించేవారు. దేశ భక్తులు, సంఘసేవకులపట్ల యెనలేని గౌరవం చూపించేవారు. ఒకసారి దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమయింటికి వచ్చినప్పుడు ఆమె సాష్టాంగనమస్కారం చేశారట. ఆయన దీవించారని సంబరపడి, పరిచయులందరికి ఆయన దీవెనలు మళ్లీమళ్లీ విని పించారట. ఆమె నిష్కపటానికి, సహృదయతకు యిటువంటి వుదంతాలు యెన్నో తార్కాణంగ వుండగలవు. ఆమె యిల్లు సనాతనులకు, సంస్కారులకు, కాంగ్రెసువారలకు, కమ్యూనిష్టువారలకు, అందరికీ కూడలిగా వుండేది. ప్రతివారిని ఆమె ఆత్మీయులుగా బంధు జనులుగానే భావించేవారు.

విదేశాలలో డిగ్రీలు పొందివచ్చిన డాక్టరుగా మద్రాసులో రెండు చేతుల ధనరాసులు సంపాదించటానికి అవకాశాలు వున్నవి. కాని యేనాడు ఆమెకు ధనవ్యామోహంలేదు. స్త్రీలకు ప్రత్యేక వైద్య సహాయం చేతనయినంతగా అందించాలన్న సంకల్పంతో తన గడ్డ అయిన ఆంధ్ర రాష్ట్రం, విజయవాడలో 1936లో స్థిరపడ్డారు. ఆమె అతి సహనంతో రోగుల మాటలు వింటారు. మనసూర్తిగా మాట్లాడుతారు. వ్యాధికి తాత్కాలిక వుపశమ నార్థం మందు యిచ్చి పంపటంకాక, అసలువ్యాధికి పూర్వాపరాలు, గృహ పరిస్థితులు, పరిసర ప్రభావాలువంటి వెన్నో విచారించి, వ్యాధి నివారణకే కాక ఆ వ్యక్తి ఆనందప్రదంగ కుటుంబ జీవితం గడపటానికి దోహదంచేసే వారు. కుటుంబ సంక్షేమ ఆఫీసరు హోదా తమకుతాముగా నిర్వహించేవారు. అంతస్థును పట్టికాక రోగి పరిస్థితికి ప్రాధాన్యత నిచ్చేవారు. అందువల్ల నిజమైన వైద్య సహాయం అవసరమైన పేదలుకూడ నిర్భయంగ నిస్సంకోచంగ వచ్చి అమూల్య వైద్య సహాయం పొందేవారు. ఏ విధమైన తారతమ్యాలు లేకుండ అందరిపట్ల సహానుభూతితో, ఆత్మీయతతో వ్యవహరించటాన స్వల్పకాలంలోనే పౌరస్త్రీలకు ఆమె ప్రియ బాంధవి అయినారు. అన్నిపార్టీలవారికి ఆమె అవసరాన్నిపట్టి వుచితంగా కూడ వైద్యం చేసేవారు. అంతటి సమదృష్టి, విశాలహృదయం ఆమె సొత్తు.

నలభై సంవత్సరాల కిందట స్త్రీలకు యింతగా విద్యావకాశాలులేవు. హక్కులు లేవు. బాల వితంతువులు, భర్తనిరాదరించినవాళ్లు, అత్తనిరాకరించిన వాళ్లు పరిసర ప్రభావాలవల్ల, అజ్ఞానంవల్ల కాలుజారి జీవితం దుర్భరంగా తయారయినవాళ్లు అనేకమంది ప్రత్యేకంగా కనిపించేవారు. వాళ్లకు కావలసిన సహానుభూతిగాని, అవకాశాలుకాని యెవరు అందించేవారు కాదు. స్త్రీలకు ముందు కావలసిన చైతన్యం కలిగించటానికి ఆమె ఆంధ్ర మహిళా సంఘ

పుద్యమం భారీయెత్తున ఆరంభించారు. వాడవాడల మహిళా సంఘాలు నెలకొల్ప టంలో ప్రధాన పాత్రవహించారు. ఆ సంస్థలు క్రమబద్ధంగా ప్రయోజన కరంగా నడపటానికి శిక్షణ శిబిరం నడిపారు. నిర్మాణాత్మకమైన కార్యక్రమం సృష్టించి స్త్రీ సామాన్యంలో చైతన్యం, హెచ్చరిక కలిగించారు. స్వతంత్ర భారతంలో ప్రజోపయోగం, స్త్రీజనాభ్యుదయకరమైన చట్టాలను రాజ్యాంగం ప్రవేశపెట్టినా అవి శాసనాలుగ రూపొందటానికి అవసరమైన ప్రజాభిప్రాయాన్ని సేకరించి సహకరించారు. స్త్రీలకు విజ్ఞాన వికాసాలు కల్పించాలనే కోరికతో ప్రసూతి, శిశు పోషణ అనే గ్రంథాన్ని తెలుగులో సులభ శైలిలో అందరికి అర్థమయ్యే పదాలతో వ్రాశారు. ఆనాటివరకు అటువంటి వైద్య పుస్తకం సామాన్య ప్రజల అందుబాటులోకి రాలేదు. అందువల్ల ఆ పుస్తకం బహుళ ప్రచారంపొంది ఆమె ఆశయం తీరింది.

ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. దేశం పైన ఏవిధమైన శత్రు దాడి జరిగినా ముందు నశించేది అసమర్థులయిన స్త్రీలు, నిస్సహాయులైన పిల్లలు. స్త్రీలు తమ మాన ప్రాణాలను కాపాడుకుని తమ బిడ్డల ప్రాణాలను కాపాడటానికి మహిళా సంఘాల ద్వారా ఆమె ప్రత్యేక శిక్షణ యిప్పించారు. సమర్థులైన స్త్రీ కార్యకర్తల సహకారంతో యెంతో విజయవంతంగ స్త్రీలకు ఆత్మరక్షణోపాయాలు నేర్పారు. బాంబుల నుంచి, మంటల నుంచి రక్షణ విధానాలే కాక ఆయుధ ప్రయోగాలు కూడ స్త్రీలు తెలుసుకోగలిగారు. ముఖ్యంగా తెలంగాణా స్త్రీలనేకమంది యీ శిబిరంలో శిక్షణ పొంది హైదరాబాదులో నడిచిన ప్రజా పోరాటంలో ప్రయోజనం పొందారు.

అధిక ఆహారోత్పత్తి ప్రచార సందర్భంలో డాక్టరు అచ్చమాంబ స్వయంగా గునపంపట్టుకుని ప్రతి రోజు కొన్ని గంటలకాలం తవ్వటం, మట్టి మోయటం వంటి పనులు చేశారు. అతి నాజూకైన సూక్ష్మ పరికరాలు పట్టి ఆపరేషన్లు చేసే డాక్టరుగారు గునపంపట్టి యెండలో తవ్వుతుంటే మరి అనుసరించే అభిమానులకు కొరత వుండదుగదా. ఈ విధంగా కూడ ఆమె ప్రజలకు అత్యంత సన్నిహితులైనారు.

కమ్యూనిస్టు అగ్రనాయకుల ఆశీర్వాదాలతో ఆమె 1940లో వఝుల వెంకటరామశాస్త్రిగారిని వివాహం చేసుకున్నారు. శ్రీమతి లక్ష్మి టాన్యా వారి ఏకైక సంతానం. ఆ అమ్మాయి వివాహ సందర్భంలో వేదోక్తంగా కన్యాదానం చేయాలని వియ్యాలవారు కోరారు. తమ నమ్మకాలకు సిద్ధాంతాలకు అది విరుద్ధం కాబట్టి—ఒక్కగానొక్క కూతురు వివాహం తాను చేయకుండ ఆమె ఆ తుంత తన ఆత్మ బంధువులకు అప్పగించారు.

పసివారిని చిన్నప్పటి నుంచి తగిన జాగ్రత్తతో పెంచి, తీర్చి దిద్దితే వాళ్ళు మానసికంగా, శారీరకంగా, ఆరోగ్యవంతులైన చక్కని భావి పౌరులు కాగలరని ఆమె నమ్మకం. 20 మంది పిల్లలు, 11 మంది టీచర్లతో ఆమె విజయవాడలో స్థాపించిన మాంటిసోరీ స్కూలు ఈనాడు వేలకొద్దీ పిల్లలతో, వందమంది టీచర్లతో, బ్రహ్మాండమైన గ్రంథాలయంతో స్వంత భవనాలతో విజయవంతంగా నడుస్తున్నది. పరిస్థితులు యేవైనప్పటికి కొందరు స్త్రీలు అక్రమ సంతానం పొందే దుస్థితి ప్రాప్తించుతు వుంటుంది. ఆ సమయంలో సంఘాన్ని యెదుర్కొనే ధైర్యంలేక ఆత్మహత్య చేసుకోవటమో, కలిగే బిడ్డలను హతమార్చటమో చేస్తు వుంటారు. స్వజనమే నిరసించే అటు వంటివారిని డాక్టరు అచ్చమాంబగారు వాత్సల్యంతో ఆదుకుని, అవసరమైతే ఆశ్రయమిచ్చి సుఖప్రసవానికి సదుపాయాలు కల్పించేవారు. ఆ తల్లులు ఈ బిడ్డలను తమకు అక్కరలేదంటే, ఆమె స్వయంగా పెంచి, అర్హతలు యోగ్యతగల దంపతులు చట్టబద్ధంగా పెంచుకుంటామని కోరినప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకుని, గుప్తంగ అప్పగించేవారు. కాలుజారినవారు శాశ్వతంగ పతితలనే పేరిట కుంగిపోకుండ, సంఘంలో తిరిగి గౌరవ ప్రతిపత్తులతో జీవించటానికి తగిన అవకాశాలు కల్పించేవారు. ఈ విధంగా ఆదుకోవటానికి దయ, సానుభూతి, స్థైర్యం వంటి సద్గుణాలెన్నో కావాలి.

ఆమె 1948 జూన్‌లో శాసనోల్లంఘనం చేసి జైలుకు వెళ్లారు. రాయవేలూరులో 7 నెలలు గడిపి వచ్చారు. 1957లో కాంగ్రెసు తరపున శాసన సభకు ఎన్నికయినారు. ఇవన్నీ ఆమెకు ఆరోపించగల ఆధిక్యత కన్న 1964 అక్టోబరు 20న గుండె పోటుతో చనిపోయినప్పుడు కంటతడి పెట్టని ఆంధ్రులు లేరంటే కనిపించే గౌరవం అధికం. ఆమె స్త్రీలోకానికి ఆప్తురాలు, సేవిక, ప్రియతమ నాయిక. తండ్రి దగ్గర నేర్చుకున్న "కలకంఠి కంట కన్నీరొలికిన సిరియింట నిలవద"నే సూక్తికి ప్రాధాన్యత యిస్తూ డాక్టరు కొమర్రాజు అచ్చమాంబగారు మహిళాభ్యున్నతికి నిరవధిక కృషి బహుముఖంగా చేసి ధన్యులైనారు.

---

# శ్రీమతి సరస్వతీ గోరా

**జననం 1912**

శ్రీమతి సర్వతీ గోరా, శ్రీ గోరా అనగానే ప్రతి వారికి వారు బహు కాలం క్రితం స్థాపించిన నాస్తిక కేంద్రం, ప్రచారం చేస్తున్న హేతువాదం స్ఫురణకురావటం సహజం. గాంధీ మహాత్ముడు చిన్నప్పుడు భయంకలిగి నప్పుడు రామనామం జపించటం, చివరకు తుపాకి గుండు తగిలి నేలకొరిగిపోతు హే రామ్ అనటం అందరికి తెలిసిందే. కాని చిత్రమేమిటంటే 1945 ఫిబ్రవరిలో గాంధీజీ శ్రీ గోరా దంపతులను, బిడ్డలను, వారి ఉద్యమ కార్య కర్తలను సేవాగ్రాంవచ్చి కొంతకాలం పాటు అక్కడ వుండ వలసినదిగా కోరారు. వారికున్న పరస్పర గౌరవం, అభిమానం, ఆకర్షణ అటువంటివి. పైగా ఉభయులూ సత్యాన్వేషకులే. ఒకరికొకరు సన్నిహితంగావుండి రెండవవారి ఆధిక్యతను, కార్యసాఫల్యతకుగల కారణాలను పరిశీలించాలనుకున్నారు.



శ్రీమతి సరస్వతీ గోరా

సేవాగ్రాం ఆశ్రమంలో యే మూలనుంచో పెళ్లగించి, సరస్వతి గారి మూడు నెలల పసి బిడ్డకు గాంధీజీ ఉయ్యాల సమకూర్చారు. ఆమె మూడేళ్ల కుమారుడు భోజనాల దగ్గర పేచీ పెడుతుంటే, ఆశ్రమంలో వడ్డనలు జరిపే పెద్దలతో ''చిన్నవాడి మాటను అర్థంచేసుకుని సహనంతో అతనికి తగిన విధంగా వడ్డించాలి. అతనూ అందరితో కలిసి భోజనంచేసే ఉపాయం ఆలోచించండి,'' అని సలహాయిచ్చారు. సరస్వతి గారి చిన్న పిల్లలు ఆశ్రమంలో కూరగాయలు, పళ్లు కడుగుతూవుండగా, అటు నుంచి స్నానానికి వెళ్తున్న గాంధీజీ ఆగి, పిల్లలను పలకరించి ''అక్కడఅన్నిపళ్లు వున్నామీరు తినకుండానే వాటిని కడిగి అవతల పెడుతున్నారే, యెందుకు?'' అని ప్రశ్నించారు. అప్పుడాపిల్లలు తరవాత భోజనంలో పళ్లువేస్తారుగదా అన్నారు. అది విని గాంధీజీ తనపక్కనున్న సహచరులతో ''పిల్లల సమాధానం విన్నారుగదా!

ప్రజలందరికీ కూడా తిండికి హామీ ఉన్నప్పుడు సక్రమంగా పనులు జరిగి పోతవి. ఆ తిండికి హామీ కలిగించటానికి మనం కృషి చేయాలి'' అన్నారు. శ్రీమతి సరస్వతి పెద్దమ్మాయి కుమారి మనోరమ, రెండవ అమ్మాయి కుమారి మైత్రి తన పక్కన కూర్చుని నూలు వడుకుతున్నప్పుడు గాంధీజీ వారి నైపుణ్యానికి మెచ్చుకుంటూ, మెళుకువలు బోధించేవారు. ఒకనాటి ఉదయాన వాహ్యాళికి వెళ్తున్న గాంధీజీ, తనబెడ్డింగు తానే మోసుకు వెళ్తున్న కుమారి మైత్రిని చూసి నవ్వుతు, "ఇట్లా యెవరి పనులు వారు చేసుకోవటం నేర్చుకోవాలి. చిన్నప్పుడు నేనూ యిట్లాగే చేసే వాడిని. పనిచేయటంలోనే గౌరవం వున్నది'' అని ప్రోత్సహించారు. శ్రీమతి సరస్వతి పెద్ద కూతురు వివాహం నాస్తికోద్యమ కార్యకర్తలలో ఒకరయిన అర్జునరావు గారనే హరిజనుడితో నిశ్చయమయినప్పుడు గాంధీజీ సంతోషించి, ఆ వివాహం తమ ఆశ్రమంలో తానే చేస్తానని, వధూ వరుల స్థిరనిర్ణయం పరీక్షించటానికి రెండు సంవత్సరాల గడువు యిద్దామని సలహాయిచ్చారు. ఇంతటి ఆత్మీయతతో గాంధీజీ శ్రీమతి సరస్వతి కుటుంబాన్ని గమనించుతు తృప్తి చెందారు.

ఆశ్రమంలో జరిగే ప్రతిచిన్న విషయంపై గాంధీజీ కనపరచే శ్రద్ధకు, అడుగడుగునా యేదో నేర్చు కోవాలని చూసే ఆయన వుత్సుకతకు ఆశ్చర్యపడుతు వుండేవారు సరస్వతిగారు. ఆమె కుటుంబం వాళ్లు యావన్మంది గాంధీజీతో పాటు సూత్ర యజ్ఞంలో, ఉపవాసాలలో పాల్గొనేవారు. మరుగుదొడ్లు శుభ్రపరచటం, పిల్లలకు చదువు చెప్పటం, వంటచేయటం వంటి అన్ని పనులు అతిసహజంగ, చురుకుగవారు చేయటం ఆశ్రమ వాసులను, గాంధీజీని ఆకర్షించింది. ఉభయ పక్షాలవారు యెంతో సంతృప్తులైనారు.

శ్రీమతి సరస్వతి 1912లో విశాఖజిల్లా విజయనగరంలో జన్మించారు. శ్రీ పోడూరు లక్ష్మీనరసింహం, శ్రీమతి కొండమ్మలకు నలుగురు అబ్బాయిల తరువాత పుట్టిన ఒక్కగానొక్క ఆడపిల్ల కావటాన చాలా గారాబంగా పెంచారు. 7వ తరగతి చదువుతుండగా 11వ యేట గోపరాజు రామచంద్రరావు గారితో వివాహం అయింది. పేరులోని పొడి అక్షరాలనే తనపేరు చేసుకుని ఆయన గోరాగా ప్రఖ్యాతులయినారు. ఆయన తండ్రి శ్రీ వెంకటసుబ్బారావు మాటకుముందు మహాదేవ శంభో అంటూ వుండేవారు. దాంతో ఆయనను అందరు మహాదేవ శంభో సుబ్బారావుగారనేవారు. రెండు కుటుంబాలు ఉప్పునిప్పు కడుక్కునే శ్రోత్రియ కుటుంబాలు. నాటికే గాంధిజీ ప్రభావానికిలోనైన శ్రీ గోరా ఖాదీమధుపర్కాలతోనే వివాహంచేసుకున్నారు. మద్రాసులో ఎం.ఏ. పట్టం పుచ్చుకున్న శ్రీ గోరాకి చదువుకునే రోజుల్లోనే

అర్థంలేని ఆచారవ్యవహారాలపట్ల విముఖత్వం కలిగింది. హేతువాదంపట్ల ఆకర్షితులైనారు. స్త్రీ పురుషులు సమాన బాధ్యతలు కలిగి, సమానగౌరవ ప్రతిపత్తులు కలిగి వుండాలని ఆయన వుద్దేశం. ఆయనకొకభావం కలగటం ఒక అభిప్రాయం ఏర్పడటం ఆలస్యం భార్యతో వివరించేవారు. ఆయన నోటి వెంట ఒకమాట రావటం ఆలశ్యం ఆమె ఆయనభావాలతో యేకీభవించేవారు. దాంతోవారికి ఒక విధమైన ఆత్మవిశ్వాసం, సాహసం అధికమైనవి. ముక్కుకు సూటిగా, తమ ఆలోచనల కనుగుణ్యంగా ప్రవర్తించటంతప్ప వారేమను కుంటారో, యిదేమవుతుందో అనే సందేహాలు, భయాలుకలిగేవి కావు. 1927లో ఒకసారి దంపతులిద్దరు మద్రాసులో కాఫీహోటలుకువెళ్లి నలుగురి మధ్యకూర్చుని కాఫీతాగుతుంటే జనం వింతగా చూడనారంభించారు. వాళ్లు చలించలేదు.

భర్త ఉద్యోగరీత్యా శ్రీలంక రాజధాని కొలంబో వెళ్ళిన శ్రీమతి సరస్వతి పాతనమ్మకాలు ఆచారవ్యవహారాలను కట్టగట్టి విసిరిపారేశారు. శుద్ధశ్రోత్రియబ్రాహ్మణులు ముస్లిముల యింట్లో అద్దెకున్నారు. ఆమె నాలుగునెలలగర్భవతిగావుండి పంతంపట్టి గ్రహణసమయంలో కూరలుతరిగారు. ఇంటిపనులన్నీ యదేచ్ఛగా తిరుగుతు నిర్వర్తించారు. కావాలని వీధిలోకి వెళ్లి గ్రహణం పూర్తిగా విడిచేవరకు చూశారు. ఇతర యే మతస్థులు పాటించని యీ ఆచారం హిందూగర్భిణీస్త్రీలే యెందుకు పాటించాలో ఆమెకు అర్థం కాలేదు. వైద్యవిషయకంగా యేదైనాకారణంవుంటే అన్ని మతాలస్త్రీలకు వర్తించాలికదా అని ఆమె వాదం. పురిటికి పుట్టింటికి విజయనగరం వచ్చినప్పుడు వచ్చిన మరొక గ్రహణసమయంలోను యీవిధంగానే వ్యవహరించి సంచలనం కలిగించారు. పుట్టినబిడ్డ ఆరోగ్యంగా చక్కగా ముద్దుగా యే గ్రహణమొరికి లేకుండవుండటంతో అందరిమనుసులలోను నిజమా, అవునా అంటూ సందేహం తలెత్తింది. ఇంతలో శ్రీ గోరా పుట్టి పెరిగిన కాకినాడలోనే లెక్చరర్ వుద్యోగం రావటంతో ఆయన కొలంబోనుంచి వచ్చేసి తలిదండ్రులదగ్గరే వుండి వుద్యోగంచేయనారంభించారు. శ్రావణపౌర్ణమి వచ్చింది. అప్పటి వరకు కొడుకు జంధ్యంవేసుకున్నా మధ్యమధ్యన తీసివేసినా సహించిన తండ్రి శ్రీ సుబ్బారావుగారు ఆనాడు కొత్తజంధ్యం వేసుకుతీరాలని పట్టుపట్టారు. లేకపోతే తనయింట్లోనే వుండవద్దన్నారు. నమ్మకంలేనిపనులు చేయటం యిష్టం లేని సరస్వతిగారు రెండు నెలల పసిబిడ్డతో భర్తవెంట బయటికి నడిచారు. కావాలని ముస్లింపిల్లను పనికి పెట్టుకున్నారు. హరిజనవాడలకువెళ్ళి వారితో సహపంక్తి భోజనాలు చేసివచ్చేవారు. అనేకమంది వితంతువులకు పూనుకుని వివాహాలు చేశారు. ఆ సమయంలో విందులు చేసేవారు. దేశసేవికగా

వాసికెక్కిన దుర్గాబాయమ్మ గారు ఆ కాలంలో కాకినాడలో వుండేవారు. శ్రీగోరా దగ్గర హిందూయూనివర్సిటీ మెట్రిక్యులేషనుకు చదువుకుంటు వుండేవారు. ఆమె మద్దతుకూడ యీదంపతులకు దొరికింది. నిత్యఖాదీధారులై నూలు వడికి బట్టలు నేయించుకునేవారు. ఈవిధంగా గాంధీజీ ఆశయాలకు హేతువాదం జోడించి నిస్సంకోచంగ ఆచరణలో పెడుతూవుండేవారు.

మరొక మెట్టుపైకి యెక్కి దేవుడు లేడని పత్రికలో వ్రాయటం బహిరంగ సభలలో ఉపన్యసించటంతో ఆయన వుద్యోగం పోయింది. ఆర్థిక ఒత్తిడి వారి అభిప్రాయాలను మరింత గట్టిపరచింది. మరికొంత కాలానికి బందరు కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం వచ్చి అక్కడకు వెళ్లారు. శ్రీమతి సరస్వతి బందరులో శ్రీమతి దుర్గ్గవెంకటరమణమ్మతో కలిసి స్త్రీలలో చైతన్యం కలిగించటానికి చాలా కృషిచేశారు. శ్రీ గోరా నాస్తిక వాదం కారణంగా ఆ లెక్చరర్ వుద్యోగానికి రాజీనామా యివ్వవలసి వచ్చింది.

కృష్ణా జిల్లా ముదునూరు ప్రజలు శ్రీ గోరా దంపతులను తమవూరు ఆహ్వానించారు. నాస్తిక కేంద్రం స్థాపించి పూర్తిసమయం ఆ ఉద్యమ ప్రచారం లోనే గడప నారంభించారు. వారికి స్వంత సంపాదన, ఆస్తులు, అంటు ఏర్పరుచుకోకూడదని నిశ్చయించుకున్నారు. జాతీయోద్యమం వారి జీవితంలో ఒక భాగమయింది. కుటుంబమంతా ఖాదీ ధారణ, నూలు వడకటం, అస్పృశ్యతానివారణ, విద్యావ్యాప్తి, నిరాడంబర జీవనం వంటివి అనుక్షణం పాటించుతు గాంధీజీ సిద్ధాంతాలను తమ నాస్తిక మతహేతువాదాలతో సమన్వయ పరచి భారీయెత్తున వుద్యమం నడపసాగారు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో పుట్టిన కుమారుడికి లవణం అని, గాంధీ ఇర్విన్ ఒడంబడికల సమయంలో జన్మించిన అమ్మాయికి మైత్రి అనీ, ఎన్నికలలో కాంగ్రెసు విజయం పొందినప్పుడు కలిగిన బిడ్డకు విజయం అని, గాంధీజీ బేసిక్ విద్యా విధానం ఆచరణలో పెట్టిన సమయంలో పుట్టిన బిడ్డకు విద్య అనీ నామకరణాలు చేస్తూ గాంధీమహాత్ముడి కార్యకలాపాల పట్ల అభిమానం, గౌరవం వెల్లడించుకున్నారు.

క్విట్ఇండియా ఉద్యమం నాటికి శ్రీమతి సరస్వతీదేవికి ఏడుగురు బిడ్డలు. ఎనిమిదవ గర్భం అయినా ఆమె స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని తను అశక్తురాలను కానని నిరూపించుకున్నారు. అప్పటికే శ్రీ గోరా, కొంతమంది నాస్తిక కేంద్ర కార్యకర్తలు స్వాతంత్ర్యవుద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లివచ్చారు. సరస్వతిగారు విజయవాడ వచ్చారు. తమ పెద్ద కూతురు కుమారి మనోరమ ఆడపడుచు దేశసేవిక సంఘసేవిక అయిన

శ్రీమతి రాచర్ల సామ్రాజ్యం, శ్రీమతులు శీతంరాజు సీతారామమ్మ, మద్దాలి రాజేశ్వరి, మద్దాలి వెంకటసుబ్బమ్మ వంటి స్త్రీలు, మరికొందరు పురుషులను ఒకదళంగా కూర్చుకుని 1944 ఏప్రిల్ 13 న జలియన్‌వాలాబాగ్ దురంతాల సంస్మరణగా జాతీయ దినోత్సవాలకు నాయకత్వం వహించారు. ఫలితంగా అరెస్టు చేసి ఒకొక్కరికి 6 నెలల శిక్షవిధించి 'సి' క్లాసుయిచ్చి రాయవేలూరు జైలుకు పంపించారు. ఆడపడుచు శ్రీమతి సామ్రాజ్యం, 17 సంవత్సరాల వయసుగల పెద్దకుమార్తె కుమారి మనోరమలతో పాటు శ్రీమతి సరస్వతి జైలుకువెళ్లారు. మూడు సంవత్సరాల చిన్నపిల్లవాడుకూడ ఆమె వెంట వున్నాడు. శిక్ష అనుభవించి విడుదల అయివచ్చారు.

ఆ సందర్భంలోనే గాంధిజీ శ్రీ గోరా కుటుంబాన్నీ కార్యకర్తలతోసహా సేవాగ్రాం ఆహ్వానించారు. శ్రీమతి సరస్వతి, జాతి, కుల,మతరహితమైన సమాజం స్థాపించటం ధ్యేయంగా పెట్టుకున్నారు. అది కార్యరూపంలో పెట్టటానికి పెద్దకూతురుని హరిజనుడికిచ్చి వివాహంచేశారు. సుప్రసిద్ధ ఆధునిక కవివతంసుడైన శ్రీ జి. జాషువా అమ్మాయిని కోడలుగా తెచ్చుకున్నారు. మొదట యింట్లోనుంచి వెళ్ళిపొమ్మని, రాకపోకలు నిల్పివేసి దూరంగా వుంచిన శ్రీమతి సరస్వతి అత్త మామలు తమ పిల్లల చిత్తశుద్ధికి, త్యాగనిరతికి సంతోషించి మనమలను ఆదరించి ఆతిధ్యమిచ్చి తమలో చేర్చుకున్నారు. 1947లో తమ ప్రచారం మరింత జయప్రదంగా కొనసాగించటానికి ముదునూరునుంచి విజయవాడ, పటమటలో స్థిరపడ్డారు. నేటికి అక్కడే వారినివాసం.

సమాజం పురుష పక్షపాతిగా వుండి స్త్రీలకు అన్యాయం, న్యూనత కలిగించటం శ్రీమతి సరస్వతికి సహించరానిదయింది. అవివాహిత స్త్రీ మాతృత్వం వహించినప్పుడు అది స్త్రీ సహజమైన ప్రకృతి ధర్మమే తప్ప పురుషులకు వర్తించనిది, స్త్రీలకే వర్తించగల కళంకమేమీ కాదని ఆమె నమ్మకం. ఆమె దృష్టిలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలన్నీ ఒకే విలువకలిగి వుంటవి. ఆ సమస్యలన్నీ సవ్యంగా పరిష్కారమయినపుడు సమసమాజం, అదే యేర్పడగలదని అంటారు. 1954లో కర్నూలు జిల్లా కరివెనలో ఇనాందారులకు వ్యతిరేకంగ రైతు సత్యాగ్రహం జరిగింది. అప్పుడామె సామాన్య రైతుస్త్రీలను 60 మందిని దళంగా కూర్చుకుని నాయకత్వం వహించి సత్యాగ్రహం చేశారు. అప్పుడు ఆమెను, తోటిస్త్రీలననేకులను అరెస్టుచేసి 6 నెలలు శిక్షవేశారు. రాయవేలూరు జైలుకు పంపించారు. ఆమెకు "ఏ"

క్లాసు యిచ్చినా ఐచ్ఛికంగా తోటి స్త్రీలతోపాటు "సి" క్లాసులోనేవుండి సంతోషంగా శిక్ష పూర్తిగా అనుభవించారు.

ఆమె జీవనవిధానంలో ఎటువంటి ఆడంబరాలకు, అలంకారాలకు స్థానం లేదు. ప్రతి జీవికి ముఖ్యంగా కావలసిన తిండి, బట్ట, బస సమకూర్చాలంటారు. అందువల్ల అందరికీ ఆహారం లభించేవరకు ప్రభుత్వం భారీయెత్తున ఉద్యానవనాలు, పార్కులు, పూలచెట్లతో నింపరాదని పళ్ళుకాయలు, కూరలు పండించాలని 1967లో ఒక వుద్యమం గోరాదంపతులు లేవతీసి ప్రచారం చేశారు. దంపతులు, చిన్నకోడలు, మరి అనేకమంది సహచరులతో హైద్రాబాదు పబ్లిక్ గార్డెన్స్‌లో పూలమొక్కలుపీకి కాయకూరల మొక్కలు నాటటానికి వుపక్రమించారు. అప్పుడు అరెస్టయి రెండు నెలలు జైలులోవుండివచ్చారు. వారందరికి జైలులో వేరువేరు క్లాసులు యిచ్చినా పేచీపెట్టి అందరు "బీ" క్లాసులోనే వున్నారు. ఈనాటివరకు తాము నమ్మిన సిద్ధాంతాలతో సమసమాజంకోసం కృషిచేస్తున్నారు. నాకు వేరే జీవితమంటూలేదు. గోరా గారిది నాది ఒకటేబాట ఒకటేమాట అంటారు. ఆమె నాకు అర్ధాంగికాదు ముప్పాతికాంగి అదే హిందీలో పౌనాంగి అని గోరా గారి చలోక్తి.

# శ్రీమతి రాచర్ల సామ్రాజ్యం

**జననం 26-4-1900**

సేవాగ్రాంలో ఒకనాడు కొంతమంది యువతులు వాహ్యాళికి వెళ్తూ, తమ యెదురు వైపునుంచి వస్తున్న గాంధీజీని చూసి "బాపూజీ నమస్తే" అంటూ చేతులు జోడించారు. వారెవరు అని అడిగిన ప్రశ్నకు, పక్కనవున్న శ్రీ ఆర్యనాయకం వీళ్లు ఆంధ్రసోదరీ మణులు బాపూ అని జవాబు యిచ్చారు. ఐతే వీళ్లు రాళ్లా అని నవ్వారు బాపు. రాళ్లంటే రాళ్లా—బంగారపు రాళ్లు బాపూ అన్నారు శ్రీ ఆర్యనాయకం. అబ్బో అంత మంచి పేరు తెచ్చుకున్నారావీళ్లు అంటు చిరునవ్వులు చిందించుతు ముందుకు సాగారు బాపూ. ఆ బంగారురాళ్లలో ఒక రాయి శ్రీమతి రాచర్ల సామ్రాజ్యం. సేవాగ్రాంలో శిక్షణ పొందటానికి అనేక ప్రాంతాల నుంచి



శ్రీమతి రాచర్ల సామ్రాజ్యం

యువతీ యువకులు వస్తువుండేవారు. ఆహార విహారాలలోగల మార్పులకు గాంధీమహాత్ముడి నియమ నిబంధనలకు, తట్టుకోలేక వచ్చిన కొద్దికాలానికే చాలామంది జబ్బు పడుతువుండేవారు. కాని యీ ఆంధ్రమహిళలు అన్ని ఢక్కీ ముక్కీలకు తట్టుకొని ఆరోగ్యంగ నిలబడటమే కాక, యెంతో చురుకుగ శ్రద్ధగ తమపనులను, చదువును కొనసాగించి ప్రిన్సిపాల్ అయిన శ్రీ ఆర్యనాయకం ఆయన భార్య శ్రీమతి ఆశాదేవి ఆర్యనాయకం మన్ననలకు పాత్రులైనారు. అక్కడ వారి కోరికపైన మరికొంతకాలం శిక్షణ నివ్వటంలో కూడ సహకరించి బాపూజీ ఆశీస్సులతో యిల్లు చేరుకున్నారు. ఇది 1946 నాటి గాథ.

శ్రీమతి సామ్రాజ్యం 1900వ సంవత్సరం ఏప్రెల్ 26న రాజమండ్రిలో జన్మించారు. ఈమెకు నలుగురు అక్కలు, ఇద్దరు అన్నలు, ఒక తమ్ముడు వున్నారు. శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ, శ్రీ గోపరాజు వెంకట

సుబ్బారావులు ఆమె తల్లి తండ్రులు. ఆయన యెప్పుడు తరుచుగా మహాదేవ శంభో అంటూవుండటాన, చివరకు అది వ్యవహార నామమై పోయింది. తెలుగు హిందీ చదువుకొంటూ వుండగానే 12 సంవత్సరాలలోపుగానే రాచర్ల రామచంద్రరావు గారితో వివాహం జరిగిపోయింది. దేశభక్తులు, సంస్కారులు, నాస్తికులై నాస్తిక కేంద్రాన్నే స్థాపించి ప్రచారంచేసిన శ్రీ గోరా ఆమె అన్నగారు. ఆయన శక్తి మేరకు చెల్లెలి బాల్యవివాహం నిరోధించాలని చూశారు. కాని సాధ్య పడలేదు. ఒక్క కుమారుడు కలిగిన తరువాత 18వ ఏటనే ఆమెకు వైధవ్యం ప్రాప్తించింది. అన్న శ్రీ గోరా గట్టి పట్టు, ప్రోద్బలాలతో ఆమె తెలుగు, యింగ్లీషు చదువుతునే ముందు హింది పరీక్షలకు శ్రద్ధగా చదవ నారంభించారు. రాష్ట్ర భాష, విశారద, హింది ప్రచారక ట్రెయినింగు ముగించారు. అన్న యెప్పుడూ దేశకాల పరిస్థితులను వివరించుతు రాజకీయ పరిచయం, దేశాభిమానం, సంస్కరణాభిలాష, సేవా భావన వంటి వన్నీ నూరిపోస్తు వుండేవారు. ఆయన స్వయంగా గాంధీజీ దగ్గర చాలాకాలం వున్నారు. జైలుకు వెళ్లారు. అందువల్ల క్విట్టిండియా ఉద్యమ సందర్భంలో చెల్లెలిని భార్యను వుద్యమంలో మీరు కూడ పాల్గొంటారా అని అడిగినప్పుడు యెవరికి ఆశ్చర్యం కలగ లేదు. అమితోత్సాహంతో, వీరావేశంతో శ్రీమతి సామ్రాజ్యం, వదిన శ్రీమతి సరస్వతి గోరా, చివరకు 17 సంవత్సరాల మేనకోడలు కుమారి మనోరమతో సహా ఉద్యమంలో ప్రవేశించారు.

శ్రీమతులు రాజేశ్వరి, సీతారామమ్మ, వేంకట సుబ్బమ్మ, మరి కొంత మంది కలిసి విజయవాడలో సత్యాగ్రహం చేశారు. నిర్ణీత ప్రదేశం నుంచి జాతీయ గీతాలు పాడుతూ, నినాదాలు చేస్తు వూరేగింపు జరిపి శాసనోల్లంఘనం చేశారు. ఆ కారణంగా 1944 ఏప్రెల్ 13 న అరెస్టయి నారు. ఆరుమాసాలు కఠిన శిక్ష వేసి, రాయవేలూరు జైలు 'సి' క్లాసులో వుంచారు. అరెస్టయిన శ్రీమతి వేంకట సుబ్బమ్మ ఆరు మాసాల గర్భిణీ. ఆమెకు జైలు లోనే ఒక అబ్బాయి పుట్టాడు. శ్రీమతి సామ్రాజ్యం రోజు కొంతసేపు చదువుకోసం వినియోగించేవారు. మిగతా వేళల నూలు వడికి, స్త్రీ బందీల దగ్గర రకరకాల అల్లికలు, సంచులు, చౌకాలు తయారు చేయటంవంటి చేతిపనులు యెన్నో ఆస్తతో నేర్చుకున్నారు. నిజమైన ఆస్తశ్రద్ధవున్న గృహిణులు అనేక మంది ఆనాడు జైలులోనే చదువు, చేతిపనులు, ప్రపంచ జ్ఞానం అభివృద్ధి పరుచుకో గలిగారు. ఆ వాతావరణ ప్రభావం అటువంటిది. జైలులో భోజనం బాగుండేదికాదు. తగినంత వుండేదికాదు. అసంతృప్తిపడి నీళ్లుకారి పోయేవారికి బాధే, కాని ప్రతి సందర్భంలోను తమకు వుపకరించే పాఠమే నేర్చుకోవాలనుకునే శ్రీమతి

సామ్రాజ్యం, జైలు జీవితం వల్ల తనకు యెంతో సంయమనం, తృప్తి కావలసినంత సర్దుబాటు అలవాటయి ముందు జీవితానికి గట్టి పునాదులు యేర్పడినవని సంతృప్తి పడతారు. ఆ సమయంలో వారితోపాటు శ్రీమతులు ఎర్నేని లీలావతి, అమృతమ్మ, రాధామనోహరం, సావిత్రి అమ్మాళ్ మొదలైన వారు వుండేవారు. అకస్మాత్తుగా శ్రీమతి సావిత్రి అమ్మాళ్ భర్త చనిపోయిన వార్త తెలిసింది. అందరు కలసి ఆమెకు వూరట కలిగించటానికి యెంతగానో ప్రయత్నించేవారు. వీరందరు విడదలయే నాటికి పాపం ఆ తమిళ వనితకు శిక్షాకాలం ముగిసిపోలేదు. ఆ పరిస్థితిలో ఆమెను వదలి రావటానికి మనసు వప్పక విడుదలైన వారందరు ఆమెను కూడ విడుదల చేయమని జైలు అధికారులను కోరారు. ప్రత్యేక పరిస్థితిగా పరిగణించి అధికారులు ఆమెను విడుదల చేశారు. ఇదే మామూలు సమయంలో అయితే శ్రీమతి సామ్రాజ్యం కూడ బహుశ రెండు సానుభూతి వాక్యాలు పలికి వూరడించి వచ్చేసే వారు. కాని ఒక్క లక్ష్యంతో జైలుకు వెళ్లి ఒకరి కష్టసుఖాలు ఒకరు పంచుకోవటం, వాటిని అధిగమించటానికి క్రియారూపంలో తోడ్పడటంవంటి శక్తి సామర్థ్యాలను జైలు జీవితం వారికి చక్కగా నేర్పింది.

1944 ఫిబ్రవరి 22 న శ్రీమతి కస్తూర్బాగాంధీ మరణించారు.

కస్తూర్బాగాంధీ జాతీయస్మారక నిధి పేరిట దేశవ్యాప్తంగ విరాళాలు పోగుచేశారు పెద్దలు. స్త్రీలు శిశువులు సంక్షేమానికి అందులోను గ్రామాలలో వుంటున్నవారి అభ్యున్నతి కోసం యీనిధిని బాపూ ప్రత్యేకించారు. పల్లెలకు పోయి నిర్మాణాత్మకంగా క్రమ విధానంలో సేవా కార్యకలాపాలు కొనసాగించటానికి ఆయన ప్రత్యేక శిక్షణ నివ్వటానికి పూనుకున్నారు. ప్రతిరాష్ట్రం తరపున కొంతమంది సేవాగ్రాం వెళ్లారు. ఆంధ్రరాష్ట్రం తరపున శ్రీమతులు దుర్గాబాయమ్మ, సామ్రాజ్యం, విద్యాదేవి, సరళాదేవి వంటి ఎనిమిదిమందిని శిక్షణ నిమిత్తం 1945 జులైలో సేవాగ్రాం పంపించారు. హిందూస్థాన్ నయీతాలిమ్ శిక్షణభారం శ్రీ ఆర్యనాయకం దంపతులు వహించారు. బేసిక్ విద్యా విధానమని కూడ దీనికి పేరు. ఆ విధానంలో పుస్తకాలు కలాలకన్న చేతులతో చేసేపనికి ప్రాధాన్యత యెక్కువ. స్వయంగా పనిచేస్తు విషయజ్ఞానం సంపాదించుకోవాలి, చరఖాశాఖ, గోశాల, వైద్యశాల, వంటశాల వంటి అనేక శాఖలు వుండేవి. ప్రతిదానికి సంబంధించిన విద్యాలయం వుండేది. వీటిల్లో పనులుచేస్తు, నేర్చుకుంటు, వాటికి సంబంధించిన చదువును విద్యాలయాలలో అవగాహన చేసుకునేవారు. గాంధీజీ స్వయంగా పూనుకుని విద్యార్థుల ఆరోగ్యం, క్రమశిక్షణ, శ్రమశక్తి,

ఆసక్తి, పరిశుభ్రతవంటివన్నీ గమనించుతు వుండేవారు. ఆయన తోచినప్పుడల్లా వచ్చి అన్ని విభాగాలు, హాస్టలు విభాగం చూస్తువుండేవారు. అందువల్ల ప్రతివారికి అనుక్షణం అప్రమత్తులై వుండటం, పరిసరాలు, వస్తువులు శుభ్రంగా పొందికగా పెట్టుకోవటం ఒక విధంగా తప్పనిసరి అయేది. ఎవరికి యే అలవాట్లు, పద్ధతులు రుచి పాకాలువున్నా అక్కడ వాటన్నిటిని మూటగట్టి దూరంగాపెట్టి జొన్నరొట్టెలు, పప్పు కూరలవంటి అతి మామూలు భోజనంచేస్తు గడిపేవారు. ఇంతటి క్రమశిక్షణ, శరీరకష్టం మామూలు సాదా భోజనం అలవాటులేక కొంతమంది డీలాపడి పోయేవారు, కొంతమంది మాత్రమే అన్నీ నిభాయించి నిలబడగలిగేవారు. సామ్రాజ్యంగారు జైలు అనుభవం నేర్పిన పాఠాలతోను, మనోదారుఢ్యంతోను ఉత్సాహంగ పనిచేస్తు సమర్ధవంతంగ శిక్షణపొందుతు ఆరోగ్యంగా వుండగలిగారు. అందుకే వాళ్ల గురువుగారయిన శ్రీ ఆర్యనాయకంచేత బంగారురాయిగా ప్రశంస పొందగలిగారు.

ఆశ్రమంలో ఒకనాడు గాంధీజీకి ఒక చిన్న యేకు ముక్క కనిపించింది. వెంటనే జాగ్రత్తగా దానిని తీసుకున్నారు. విద్యార్థులందరు సమావేశమైనప్పుడు జీవితంలో యేచిన్న వస్తువుపట్ల నిరాదరణ, అజాగ్రత్త పనికిరావని, కోటాను కోట్ల దరిద్రనారాయణులున్న మనదేశంలో యింత చిన్న యేకుముక్క యెంత గొప్పగా వుపకరించుతుందో వివరించారు. ఆయన సమయం దొరికినప్పుడల్లా బ్రిటిష్ రాజకీయదృక్పథంనుంచి అరంగుళం దూదిపింజ వరకు సమస్త విషయాలు చర్చించుతు, వ్యాఖ్యానించుతు వుండేవారు. హిందీలో పట్టం పుచ్చుకున్న కారణంగా శ్రీమతి సామ్రాజ్యం అతిసులువుగా ప్రతి శబ్దాన్ని జీర్ణింప చేసుకోగలిగారు. ప్రస్తుతం వున్న ఆసక్తి, భక్తి కారణాలుగా గాంధీజీ ప్రతి భావాన్ని పదిలంగ మనసులో నిల్పుకున్నారు. శిక్షణ ముగిసి కార్యరంగంలో ప్రవేశించారు.

రాజమండ్రికి 14 మైళ్లదూరాన వున్న తూర్పుగోదావరిజిల్లా, సీతానగరంలో ప్రఖ్యాత దేశ సేవకులు, అక్షరాల గాంధీజీ శిష్యులు అయిన డాక్టరు బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం గారు దేశసేవకు తగిన వాలంటీర్లను తయారు చేయటానికి గౌతమీ సత్యాగ్రహాశ్రమం స్థాపించారు. 1929 మే 8 వ తేదీన, మళ్లీ 1933 డిశంబరు 26 న ఆ ఆశ్రమానికి గాంధీజీ శ్రీమతి కస్తూర్బాతోను పరివారంతోను వచ్చి విడిది చేశారు. అది అడంగుగా పెట్టుకుని ఆంధ్ర పర్యటనచేసేవారు. ఆయనకాఆశ్రమ వాతావరణం, నిర్వహణా విధానం అంతగా నచ్చినది. తర్వాత డాక్టరు సుబ్రహ్మణ్యంగారు మరణించారు. పోలీసుల

దురాగతాలకు లోనై ఆశ్రమం చెల్లాచెదరయి పోయింది. మళ్లీ ఆ ఆశ్రమం కళకళ లాడాలన్న భావనతో బాపూ కస్తూర్బా ట్రస్టువారి కార్యకలాపాలకు ఆంధ్రదేశంలో దీనిని కార్యస్థానంగా చేశారు. అందువల్ల శ్రీమతి సామ్రాజ్యం సీతానగరం చేరుకున్నారు.

బేసిక్‌స్కూలు ఉపాధ్యాయినిగా గాంధీజీ ఆదేశానుసారం పల్లెలలో స్త్రీలకుబారు చదువు కాకుండ సేవాగ్రాం పద్ధతిలో చేతిపనులు, కాయకష్టంతో స్వావలంబనంగా యేగ్రామాని కాగ్రామం స్వయం సమృద్ధంగా నిలబడగలిగేటట్టు సహకరించారు. మూడు సంవత్సరాలపాటు యీామూలవిరాట్ములు యెనిమిది మందే ట్రస్టువారి కార్యక్రమాలన్నీ విజయవంతంగా నడిపించారు. ఆ తరువాత మరియిద్దరు శిక్షణ పొందిన వారుకూడ వచ్చిచేరారు. కేవలం విద్యాశాఖ మాత్రమేకాక ఆరోగ్యరంగంలో కూడ ప్రవేశించారు. పెద్ద ఆసుపత్రులలో శిక్షణనిప్పించి ప్రసూతిసేవికలను అసంఖ్యాకంగ తయారు చేశారు. అసలు ఆ మాత్రము వసరులూలేని కుగ్రామాలలో యెంతో సహాయం అందించారు. బాలవిహార్ విభాగాలను పసివాళ్లకోసం గ్రామాలలో నిర్వహించటానికి బాలసేవికల శిక్షణ ఆరంభమయింది. అంబర్ చరఖా, తేనెపరిశ్రమ, నాలపరిశ్రమ శిశు శరణాలయం, ప్రసూతి శిశుసంక్షేమ వైద్యకేంద్రం, ఒకటేమిటి కస్తూర్బాగాంధి స్మారక జాతీయట్రస్టు ఆధిపత్యాన ఆంధ్రదేశంలో సీతానగర ఆశ్రమంలో గ్రామీణ స్త్రీశిశువుల అభ్యున్నతికి వివిధరంగాలలోను అమూల్యకృషి జరుగుతున్నది. ఆరంభదశనుంచి యీనాటివరకు సామ్రాజ్యంగారు అన్ని రంగాలలోను అపూర్వకృషి చేసారు. ఏవిభాగం అప్పగించినా అతిసమర్థవంతంగా నిర్వహించారు. హైదరాబాదు శాఖ ఆంధ్రరాష్ట్రశాఖ కలిసి ఒకే బృహత్ శాఖగా యేర్పడింది. ప్రధాన కార్యస్థానం హైదరాబాదు ఉప్పల్‌లో. ఉప ప్రతినిధిగా సీతానగర ఆశ్రమంలో ఉపరాష్ట్ర కార్యాలయాన్ని 1965 నుంచి 74 వరకు ఆమె నిర్వహించారు. 1974 నుంచి యీనాటివరకు కస్తూర్బాగాంధి జాతీయస్మారకట్రస్టువారి ఆంధ్రశాఖకు సలహాదారు. ఆంధ్రరాష్ట్ర సర్వోదయమండల్ సభ్యులు చాలానిరాడంబరంగ వుంటారు. వ్యక్తిగతమైన ప్రచారం ఆమెకు రుచించదు. 79 సంవత్సరాల వయసులో ఆమె పూనికతో, ఆత్మవిశ్వాసంతో, జీర్ణం చేసుకున్న గాంధీజీ ఉన్నత ఆశయాలను ఆచరణలో పెడుతువున్నారు.

---

# శ్రీమతి ముసునూరి కస్తూరిదేవి

జననం 18-4-1929      మరణం 18-5-1969

గాంధీమహాత్ముడి శాంతిసమరం యావద్భారతంలోను అనేక దేశ భక్తులను సృష్టించింది. ఆంధ్రదేశంలో ఆవిధంగా ప్రసిద్ధిగన్న ఎర్నేని వారి కుటుంబంలో శ్రీమతి కస్తూరిదేవి జన్మించారు. ఆమె పితామహి ఎర్నేని పుల్లమ్మ గారు 80 సంవత్సరాల పండువయసులో శాసనోల్లంఘనం చేసి 1932 లో ఒక్క సంవత్సరకాలం కన్ననూరు జైలులో వుండి వచ్చారు. తండ్రి ఎర్నేని "సాధు" సుబ్రహ్మణ్యంగారు చిన్ననాటినుంచి గాంధే యులు. మహాత్ముని వెంట యావదాంధ్ర ప్రతినిధిగా దండీయాత్రచేసి అనేక సార్లు శాసన ధిక్కారంచేసి దీర్ఘకాలం జైళ్లలో గడి పినవ్యక్తి. తల్లి శ్రీమతి ఎర్నేని లీలావతీదేవి 8-9 సంవత్సరాల వయసునుంచే నూలు వడకటం ఖాదీ ధరించటంతో ఆరం



శ్రీమతి ముసునూరి కస్తూరిదేవి

భించి, జీవితాంతం కొమరవోలు గాంధీ ఆశ్రమ నిర్వహణలోను వివిధజాతీ యోద్యమాలలో పాల్గొనటంతోను తృప్తిపడక పసిపిల్లతో సహాజైళ్లకువెళ్లి వచ్చారు. ఇక పెత్తండ్రి, పెత్తల్లి, వారిఅమ్మాయి, మేనత్తలు వారికుటుంబాలు, అందరు స్వాతంత్ర్య సమరయోధులే. అందువల్ల శ్రీమతి ముసునూరి కస్తూరిదేవికి దేశాభిమానం, సేవ అనేవి అతిసహజంగ అనాయాసంగ పసితనం నుంచే అబ్బినవి.

ఆమె 18-4-1929 న కృష్ణాజిల్లా గుడివాడ తాలుకా గుడ్లవల్లేరు గ్రామంలో జన్మించారు. తలిదండ్రులకు ఆమెరెండవసంతానం. శ్రీమతి కస్తూరిబాగాంధిపట్ల గల గౌరవంకొద్దీ ఆమెకు కస్తూరిదేవి అనిపేరుపెట్టారు. వారికెప్పుడు జాతీయోద్యమాలతోను, నిర్మాణాత్మక కార్యకలాపాలతోను తీరికవుండేదికాదు. అందువల్ల పెత్తల్లి శ్రీమతి ఎర్నేని శేషమాంబ

దగ్గర గుడ్లవల్లేరులోనే ఆమెపెరిగి ఆరవక్లాసువరకు చదువుకున్నారు. ఆ తరువాత తమయింటికి, అంటే తల్లిదండ్రులు కొమరవోలు గ్రామంలో స్థాపించి నిర్వహించుతున్న గాంధీ ఆశ్రమానికి వచ్చారు.

కొమరవోలు గాంధీ ఆశ్రమంలో గాంధీజీ నిర్మాణాత్మక కార్యకలాపాలన్నీ ఆచరణలో వుండేవి. ప్రతిదీ స్వావలంబన ప్రకారం నడిచేది. అందువల్ల ఆచిన్న వయసునుంచే ఆమెకు పొలంపనులు, పశువుల పెంపకం, కాలువలు, రోడ్లు నిర్మించటం, వడకటం, నేయటం, ఖాదీ ప్రచారం చేయటం, ప్రకృతి వైద్య నిర్వహణలో సహకరించటం అలవాటయి పోయినది. అస్పృశ్యత అంటే ఏమిటో తెలియదు. అక్కడఅందరు ఒకటిగానే వుండేవారు. అప్పటికే కుటుంబంలోని పెద్దలందరు రెండుమూడు సార్లు జైళ్లకు వెళ్లివచ్చారు. ఆశ్రమంమీద అనేక పర్యాయాలు పోలీసులు దురాక్రమణ చేయటం లాఠీ ఛార్జిలు, కనిపించినవన్నీ జప్తు చేసుకోవటం జరిగింది. ఇన్నిటిమధ్య ఆశ్రమంనడుపుతున్న హిందీస్కూలులో చదివి ఆమె రాష్ట్ర భాష పరీక్షలో కృతార్థులైనారు. 1942 లో ఆమెకు 12 సంవత్సరాల వయసులో వార్ధా ఆశ్రమమహిళా విభాగంలో శిక్షణ పొందటానికి వెళ్లారు. తలిదండ్రులు, మరికొందరు కుంటుంబసభ్యులు అక్కడ శిక్షణ పొందిన వారే. అందువల్ల ఆమె యేమాత్రం బెరుకు, సంకోచంలేకుండ సంతోషంగవెళ్లారు. అప్పటికే క్విట్ఇండియా ఉద్యమం వేగంపుంజుకున్నది. గాంధీజీ వంటి పెద్దలందరిని అప్పటికే అరెస్టుచేశారు. అక్కడ నిలబడి క్రమ విధానంలో ఆశ్రమ మహిళా విభాగాన్ని నిర్వహించగల పెద్దలు మిగలలేదు. అందువల్ల కొద్దికాలానికే కుమారి కస్తూరిదేవి కొమరవోలు గాంధీ ఆశ్రమానికి తిరిగివచ్చేశారు.

అక్కడ పరిస్థితులు మరీ ఉద్రిక్త పూరితంగా వున్నవి. మామూలుకార్య కలాపాలతో పాటు క్విట్ఇండియా ఉద్యమంలోకుటుంబం తలమునిగి తాటి ప్రమాణంగ నిల్చివున్నది. తలిదండ్రులు, పెత్తండ్రి కుటుంబం, మేనత్తలు, వారికుటుంబాలు ఆమెబంధువర్గం యెడతెరిపి లేకుండ ప్రచారంచేస్తున్నారు. ఆమె సంతోషానికి అవధులులేవు. అత్యంతవుత్సాహంతో ఆమెకూడ బహిరంగంగ క్విట్ఇండియా ఉద్యమ ప్రవేశంచేసి పెత్తండ్రి కూతురు శ్రీమతి రాధక్కతో కలిసి ప్రముఖ పాత్ర వహించారు. అంతటా తామే అయి విజృంభించారా అమ్మాయిలు. బందరు, గుడివాడ, కైకలూరు తాలూకాలలో కనీసం రెండు నెలలపాటు రాత్రింబగళ్లు తిరిగి ప్రచారం చేశారు. ప్రభుత్వం యింకెంత కాలం సహించగలుగుతుంది. బంధుమిత్ర సపరివారంగా అందర్ని

అరెస్టు చేసి వివిధ శిక్షలతో వివిధ ప్రదేశాలకు పంపించారు. కుమారి కస్తూరి దేవికి ఆరునెలలు శిక్షవేసి బందరు, గుడివాడ సబ్‌జైళ్లలో వుంచారు. అప్పటికి ఆమె వయస్సు 13 సంవత్సరాలు.

ఆమె విడుదలఅయి వచ్చారు. తలిదండ్రులు యింకాజైలులో నేవున్నారు. ఆమెనుపెంచి పెద్దచేసిన పెత్తల్లి ఎర్నేని శేషమాంబగారు పూనుకుని శ్రీ మునునూరి భాస్కరరావుతో ఆమె వివాహంజరిపించారు. 1944లో ఆమె అక్క శ్రీమతి కరుణ అకాలమరణంతోపాటు పాపం ఆ అమ్మాయి జైలులో వున్నతల్లిని చూడాలని తపించటం మరీ భరించరాని బాధకలిగించింది. పెత్తల్లి శ్రీమతి శేషమాంబ ఆ అమ్మాయి పైగల మమకారం కొద్దీ విజయవాడ సమీపానవున్న యనమలకుదురులో "కస్తూరిబా కరుణానిలయం" అనే అనాథ శరణాలయంస్థాపించారు. శ్రీమతి కస్తూరిదేవి ఆసంస్థనే అక్కకు ప్రతిగాభావించి అక్కడిఅనాథలకు ప్రేమతోశ్రద్ధతో రెండుసంవత్సరాలు సేవచేశారు. క్రమవిధానంలో చదువుకుని మరింత సరిఅయినపద్ధతిలో సేవచేయగలం అన్న అభిప్రాయం ఆమెకుగలిగింది. పర్యవసానంగా మద్రాసులోవున్న దక్షిణభారత హిందీ ప్రచారసభకు వెళ్లారు. రాష్ట్రభాషావిశారదపట్టం పుచ్చుకున్నారు. ఆ సమయంలోనే గుజరాతీ మహిళామండలిలో హిందీతరగతులు ఆమె నిర్వహించారు. సామర్థ్యంతో అందరి మెప్పుపొంది ఆంధ్రదేశం వచ్చారు. విజయవాడలోవున్న హిందీ ప్రచారక విద్యాలయంలో హిందీటీచరుగా శిక్షణపొందారు. తదాదిగా రాష్ట్రభాషా ప్రచారం కూడ సాగించారు.

బహుకాలం రాజకీయాలలో పాల్గొన్న కారణంగా ఆమె పుట్టింటి వారయిన ఎర్నేనివారి స్థిరచరాస్తులన్నీ బ్రిటిష్ ప్రభుత్వం కబళించివేసింది. నిశ్చింతగా వారందరు కొమరవోలు గాంధీ ఆశ్రమంలోను, తదితర ప్రదేశాలలోను నిరాడంబర జీవితాలు గడుపుతూ గాంధీజీ ఆదేశానుసారం వివిధ నిర్మాణాత్మక కార్యకలాపాలను నిర్వహించుతువున్నారు. ఇంతలో ఆమె తల్లి అకాలంగ కన్ను మూశారు. శ్రీమతి కస్తూరిదేవికి గృహిణిగా తన కుటుంబ నిర్వహణ, తదితర వ్యాసంగాలతోపాటు చిన్నవారయిన సోదరీ సోదరులకు తల్లిలేని కొరత తీర్చవలసి వచ్చింది.

స్వాతంత్ర్యం సిద్ధించింది. కాని దేశానికి గాంధీమహాత్ముడి నాయకత్వం కరువయింది. ఇంకా నిర్మాణాత్మక కార్య కలాపాలను కొనసాగించుతువున్న వారికి శ్రీ వినోబాభావే నాయకత్వం వూరట కలిగించింది. 1955 నవంబరులో ఆయన భూదాన యాత్రచేస్తు ఆంధ్రదేశం వచ్చారు. ఆ సందర్భములో శ్రీమతి కస్తూరిదేవి

కొన్ని నెలల పర్యంతం శ్రీ భావేగారి వెంట తండ్రితోపాటు ఆంధ్రదేశం అంతా తిరిగారు. ఆదినుంచి ప్రజలతో కలిసి ప్రజలకోసం పనిచేయటం అలవాటే కాబట్టి ఆమె అన్ని యిబ్బందులు శ్రమలువోర్చి తిరిగారు. ఆ సందర్భంలో రెండువేల యెకరాల భూమి సేకరణ జరిగింది. ఆమె ఏది చేపట్టినా స్థిరంగా నిలబడి ఆ పని విజయవంతంగా చేయగలదిట్ట. 1963–64వ సంవత్సరాలలో ఆమె అఖిలభారత గ్రామీణ మహిళామండలి, కృష్ణాజిల్లా శాఖకు అధ్యక్షురాలుగా వున్నసందర్భంలో అఖిలభారత కాంగ్రెసు మహిళా విభాగం కన్వీనరయిన శ్రీమతి ముకుల్‌బెనర్జీ రావటం జరిగింది. కృష్ణా జిల్లాలో ఆమె పర్యటనకు సకలవిధాల తోడ్పడి ఆమె కృషికి సహకరించి శ్రీమతి కస్తూరిదేవి ఆమె ప్రశంసలను అందుకున్నారు. ఆ విధంగానే 1968లో బీహారు క్షామబాధితుల సహాయార్థం వూరూరు తిరిగి అతి సమర్ధవంతంగ 130 కాటా బస్తాల బియ్యం సేకరించి ప్రదేశ్ కాంగ్రెస్ సంఘానికి సమర్పించారు.

ఆమె కార్యకలాపాలు బహుముఖం. 1954లో గుడివాడ పట్టణ కాంగ్రెసు ఉపాధ్యక్షురాలుగా వున్నారు. 1959లో జిల్లా కాంగ్రెసు అడ్‌హాక్ కమిటీ సభ్యురాలుగా నామినేట్ అయినారు. 1960 నుంచి మరణించేదాకా ప్రదేశ్ కాంగ్రెసు సహసభ్యురాలుగా వున్నారు. 1956లో గుడివాడ పురపాలక సంఘ సభ్యులుగా ఎన్నికయి తన సామర్థ్యం నిరూపించు కున్న కారణంగా 1967 ఫిబ్రవరిలో గుడివాడ నియోజకవర్గంనుంచి శాసనసభ సభ్యురాలుగా ఎన్నికయినారు. అలంకార ప్రాయంగాకాక అక్షరాల శాసనసభ్యు రాలుగా, చిరస్థాయిగా నిలవగల వసరులను తమ నియోజక వర్గానికి కల్పించారు. ఆమె రైతుబిడ్డ. గ్రామీణ స్త్రీ. స్వావలంబన విధానంలో గాంధీజీ, వినోబాజీల ఆదేశాలను తు.చ. తప్పకుండ ఆచరణలో పెట్టి సఫలతను సాధించిన దిట్ట. తన నియోజకవర్గం అసలు యెట్లావుంటుంతో యే గ్రామానికి యే వసరులు కావాలో యే లాకులకు యేగోడలు పాట్టిచేస్తే యెంత లాభం ప్రజలకు చేకూరుతుందో, యే స్టేషను పెంచి కడితే ప్రయాణికులకు యిబ్బంది తొలగు తుందో, యే మురుగునీటి కాలువను యెట్లామళ్లించితే ప్రజలకు క్షేమ దాయకమో ఆమెకు అనుభవ పూర్వకంగ, క్షుణ్ణంగ తెలుసు. ఆమె కృషి ఫలితంగా అనేక సూచనలను శాసనసభ ఆమోదించి ప్రజలకు శాశ్వత ప్రయో జనాలను కల్పించింది. రెండు సంవత్సరాలే ఆమె ఆ హోదాలోవున్నారు. అకాలమరణం ఆమెను లోకానికి ప్రజలకు దూరంచేసింది. ఆమె తలపెట్టిన ప్రజాహిత కార్యాలు మాత్రం యిప్పటికీ జీవం పోసుకుంటున్నవి. చనిపోయే నాటికి ఆమె జిల్లా కాంగ్రెసు కార్యవర్గంలోను శాసనసభ హౌసు కమిటీలోను

ప్రివిలేజస్ కమిటీలోను సభ్యురాలు. వేములవాడ దేవస్థానంలో ట్రస్టుబోర్డు సభ్యురాలు. ఆంధ్రప్రదేశ్ పాలసలహా సంఘములో సభ్యురాలు. దక్షణ, మధ్య రైల్వే ఎమెనిటీస్ కమిటీలో సభ్యురాలు. ప్రజలు, అధికారులు యిన్నివిధాల ఆమె సామర్ధ్యంలో, కార్యదీక్షలో నమ్మికవుంచారు. కాని భగవంతుడు ఆమెను నలభై సంవత్సరాల వయసులోనే 18–5–1969న తన సాన్నిధ్యానికి రప్పించుకున్నాడు. పసిబిడ్డలను, భర్తను తండ్రివంటి బంధు కోటిని దుఃఖములో వదిలివెళ్లారు.

"అందరిని ప్రేమించుట, బీదలయెడల దయగలిగి ప్రవర్తించుట, సత్య ప్రవర్తనకు దయార్ద్ర దృష్టికి తోడ్పడుట, నా శక్తిని యితరులకు వినియోగించుట, యితరులనుండి శక్తిని గ్రహించుట నా మతం" అని శ్రీ వినోబాజీ అంటారు. దానికి రూపకల్పనచేసిన యశస్వి శ్రీమతి ముసునూరి కస్తూరిదేవి.

---

# శ్రీమతి ఆరుట్ల కమలాదేవి

**జననం 1920 జూన్**

నల్లగొండజిల్లా, భువనగిరి తాలూకాలో మంతపురి ఒక గ్రామం. ఆ గ్రామంలో సంపన్న గృహస్థులయిన శ్రీ పల్ల వెంకటరాంరెడ్డి, శ్రీమతి లక్ష్మీ నరసమ్మలకు 1920 జూన్‌లో రుక్మిణి అనే అమ్మాయి కలిగింది. ఆ రోజుల్లో ఆ వూళ్ళో ఆడపిల్లలకు బడి లేదు. అందువల్ల యింటి దగ్గర మాస్టరును పెట్టి చదివించారు. ఆమెకు 12వ ఏట శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డితో వివాహం అయింది. ఆయన నూటికి నూరుపాళ్లు గాంధేయులు. సిద్ధాంతాల కోసం స్థిరంగ నిలబడగల వ్యక్తి. వరకట్నం తీసుకోలేదు. కాని వివాహ సమయంలో వధూవరులకు ఖద్దరు బట్టలే యివ్వాలని, పెళ్లి అయిన తరవాత అమ్మాయిని హైదరాబాదు పంపించి చదివించాలని మామగారితో నిష్కర్షగా అన్నారు. తన భార్య విద్యావంతురాలయి శ్రీమతులు కమలానెహ్రూ, సరోజినీనాయుడు, కమలాదేవి చట్టోపాధ్యాయల మాదిరి దేశసేవచేసి గణనకెక్కాలని ఆయన వాంఛ. చివరకు రుక్మిణి పేరు మార్చి కమలాదేవి అని నామకరణం చేశారు. ఆవే శ్రీమతి ఆరుట్ల కమలాదేవి.



శ్రీమతి ఆరుట్ల కమలాదేవి

ఆమె చదువుకోవటానికి 1932లో హైదరాబాదు వచ్చారు. ఆంధ్రోద్యమ పితామహ మాడపాటి హనుమంతరావుగారి పుణ్యమా అని తెలుగు అమ్మాయిలకు హైద్రాబాదులో ఒక స్కూలు రూపొందింది. కాని వుండటానికి యెక్కడ ఒక్క హాస్టలు లేదు. ఆ వూళ్ళో రెడ్డి హాస్టలులో వుండి చదువుకుంటున్న శ్రీయుతులు రామచంద్రారెడ్డిగారు, రావి నారాయణరెడ్డి మరికొంతమంది మిత్రులు కలిసి రాజాబహదుర్ వెంకటరామారెడ్డిగారితో ఆడపిల్లల హాస్టలు ఆవశ్యకతను వివరించారు. విద్యారంగంలో స్త్రీ జనాభ్యుదయం పట్ల శ్రద్ధ

కనపరుచుతున్న శ్రీ రెడ్డిగారు ఆడపిల్లల హాస్టలు ఒకటి నెలకొల్పారు. ఇంత చక్కని అవకాశం కలిగినందుకు సంబరపడిపోతూ 12 సంవత్సరాల అమ్మాయి కమలాదేవి మూడవ క్లాసులోచేరి ఆ హాస్టలుకు ప్రారంభోత్సవం చేశారు. అతిశ్రద్ధగా చురుకుగా చదువుకుని 1939 నాటికి మెట్రిక్యులేషను పరీక్షలో నెగ్గారు. చదువుకునే కాలంలో కేవలం పాఠాలతో తృప్తిపడక నిజామాబాదు, శాద్ (శహద్) నగర్, మల్కాపురం, చిలుకూరు, ఖమ్మం మొదలయిన వూళ్లలో జరిగిన నిజాం రాష్ట్ర ఆంధ్రమహిళా సభల సందర్భంలో వాలంటీరు దళాలకు నాయకత్వం వహించి నిర్వహణా శక్తిని నిరూపించుకున్నారు. నిజాంరాష్ట్ర మహిళా సంఘానికి 1939 నుంచి 41 వరకు కార్యదర్శిగావున్నారు.

అత్తవారి గ్రామమైన కొలనుపాక చేరుకున్నారు. అక్కడ ఒకే ఒక టీచరు గల బడి మగపిల్లలకు వుండేది. అమ్మాయిలకు ఆమాత్రం అవకాశంకూడలేదు. అందువల్ల స్వయంగా పూనుకుని ఆడపిల్లలకు ఒక స్కూలునెలకొల్పారు. ఆ పరిసరాలలో విద్యావంతురాలు ఆమె ఒక్కరే. కాబట్టి ఆమె ఆ బడికి టీచరు బాధ్యతకూడ నిర్వహించవలసివచ్చింది. ఒక్క నెలరోజుల వ్యవధిలో గ్రామస్థుల సహకారంతోను, ఆమె భర్త రామచంద్రారెడ్డి, మరది లక్ష్మీనరసింహారెడ్డిగార్ల ఔదార్యంతోను ఆరోజుల్లో పదివేల రూపాయల విలువగల భవనం నిర్మాణమయింది. అది ఆడపిల్లల స్కూలు. నైజాంపాలనలో ప్రజలకు సభలు, సమావేశాలు, రాజకీయ చర్చలు బహిరంగంగా జరుపుకునే అవకాశంలేదు. అందువల్ల గ్రంథాలయాలు, పఠనమందిరాలు నెలకొల్పి వాటి నీడన ప్రజలు తమకష్టసుఖాలు చర్చించుకునేవారు. రాజకీయ, సాంఘిక పరిస్థితులను సింహావలోకనం చేసుకునేవారు. అక్కడా అదే జరిగింది. బడిపెట్టిన విశాల భవనంలో మంచిగ్రంథాలయం స్థాపించి గ్రామస్థులంతా అక్కడ చేరుతువుండేవారు. అది పసికట్టిన నైజాం ప్రభుత్వం, జాగీరుదారులు కలిసి ప్రభుత్వ అనుమతి లేకుండ భవన నిర్మాణం చేసి బడిని, గ్రంథాలయాన్ని నెలకొల్పినట్లు సాకుపెట్టి భవనం స్వాధీనపరుచుకున్నారు. అయినా శ్రీమతి కమలాదేవి చలించలేదు. గ్రామస్థుల ప్రోత్సాహంతో జైనమందిరం ఆవరణలో వున్న భవనంలో ఆ మర్నాడే తిరిగి స్కూలు వెలిసింది. ఆవిధంగా 1942 వరకు స్కూలు నిరాఘాటంగా నడిచింది. అధికారుల దురాగతం సహించలేక ఆమె, విద్యార్థినులను వారి తల్లులను అరవైమందికిపైగా ఒక దళంగా కూర్చుకుని కొలనుపాకనుంచి హైదరాబాదు వచ్చి అధికారులను కలుసుకొని న్యాయం చేకూర్చమని అడగటం ఒక పెద్ద సాహస చర్య.

రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. శత్రువులు దాడి జరిపితే ముందు నశించేది పిల్లలు, స్త్రీలు. స్త్రీలు తమ బిడ్డలను కాపాడుకుంటు, తమ తమ మాన, ప్రాణ రక్షణకు, తగిన శిక్షణ పొందవలసిన అవసరం యేర్పడింది. ఆంధ్ర దేశానికి నడి బొడ్డు అయిన విజయవాడలో డాక్టరు శ్రీమతి కొమర్రాజు అచ్చమాంబ, కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన ఆత్మరక్షణ శిక్షణ కేంద్రం నడిపించారు. అక్కడ ఆత్మరక్షణకు ఆయుధధారణ, వాటిని వుపయోగించటం కూడ నేర్పేవారు. శ్రీమతి కమలాదేవి 1943 నాటికి కాంగ్రెసు బాట నుంచి వామ మార్గానికి తప్పుకున్నారు. అందువల్ల ఆమె విజయవాడ వచ్చి యీ కేంద్రంలో విద్యలన్నీ క్షుణ్ణంగా నేర్చుకుని, తమ ప్రాంతంలో వారందరికి బోధించనారంభించారు. గ్రామ గ్రామాలలోను బహిరంగసభలు జరిపి ప్రచారంసాగించారు.

ఆమె మద్యపాన నిషేధానికి తీవ్రంగపూనుకున్నారు. తోటిమహిళ లనందరిని సంఘటితపరచి ఊరేగింపులు, ప్రదర్శనలు, సభలు, ప్రబోధాలు ముమ్మరంగా సాగించారు. ఆ తీవ్రప్రభావానికి మరి నిలవలేక గ్రామస్థులు ఇచ్ఛికంగా మద్యపానం మానివేసి మహిళాలోకానికి అఖండవిజయం కల్పించారు. తోటి స్త్రీలను కూడ విద్యావంతులనుగా చేయాలని ఆమె తపన పడేవారు. స్వయంగా పూనుకుని వయోజనులైన స్త్రీలకు పాఠశాలను నెలకొల్పి స్త్రీ విద్యావ్యాప్తికి కృషిచేశారు.

స్వతంత్ర సంస్థానాలలో వెట్టిచాకరి చేయటం ఆఖరు మెట్టున వున్న పౌరుల వారసత్వం. అదిలించి, బెదిరించి మందలు మందలుగా నోరువిప్పలేని బీదల చేత తమ స్వంత పనులు నిర్దాక్షిణ్యంగా చేయించుకోవటం జాగీరు దారుల జన్మహక్కు. తరతరాలుగా జరిగి పోతున్నగాథ అది. కొలనుపాక గ్రామంలోనే 50, 60, మంది పేద కూలీలు ఆ ప్రాంతపు జాగిర్దారు, పోలీసు అధికారులు, రెవెన్యూ అధికార్ల స్వంత పొలాలు, తోటలలో ప్రతిరోజు వుచితంగా పనిచేసేవారు. ఊళ్లో కూలీముట్టచెప్పే ఆసాముల దగ్గర పనికి వెళ్దామన్నా యీ అధికారులందరి స్వంత పనులు ముగిసిన తరువాతనే మరొకచోట కాలు పెట్టగలిగేవారు. ఇటువంటి విషయాలు కర్షక కూలీల అభ్యున్నతికే పాటు పడుతున్న శ్రీమతి కమలాదేవిగారి హృదయాన్ని కలచివేసినవి. ఆమె భర్త రామచంద్రారెడ్డిగారు మిత్రులు రావి నారాయణరెడ్డిగారు వంటి నాయకు లతో కలసి ఆమె వెట్టిచాకిరిరద్దు వుద్యమంలో తీవ్రంగ పనిచేశారు. ఊరూరు తిరిగి ప్రబోధం చేసి ప్రజలలో చైతన్యం కలిగించారు. చివరకు ఆంధ్ర మహాసభ నాయకత్వాన బలం పుంజుకున్న యీ వుద్యమం కొలనుపాక నుంచి తెలంగాణా అంతటా వ్యాపించి విజయం పొందింది. జనగామ తాలూకా ఖమునూరు

వంటి ప్రదేశాలలో పెత్తందారులు, ఉపపాలకులు ప్రజానీకంపైన నిరంకుశంగ దౌర్జన్యాలు జరుపుతువుండేవారు. అవి అరికట్టటానికి ఆంధ్ర మహాసభ పెద్ద యెత్తున తిరుగుబాటు లేవతీసింది. శ్రీమతి కమలాదేవి యీ వుద్యమంలో పాల్గొన్నారు. దేవరుప్ప, కడివెండి వంటి గ్రామాలలో శిబిరాలు నెలకొల్పి ఆమె ముఖ్యంగా స్త్రీలలో చాలా చైతన్యం కలిగించారు. ప్రబోధం, ప్రచారం చేశారు. 1947 ఆగస్టు 15తో భారతదేశానికి బానిసత్వం తీరిపోయింది. కాని నైజాము ప్రాంతవాసులకు అది వర్తించలేదు. మిగతాదేశంతో సంబంధం లేకుండ హైదరాబాదు సంస్థానం స్వతంత్ర రాజ్యంగ వుంటుందని పాలకులు ప్రకటించారు. ఎవరైనా ప్రజలు భారతదేశంలో చేరాలని తిరుగుబాటు చేస్తారేమో, వారికి తగిన భయం కలిగించాలన్న భావనతో పాలకులు రజాకార్లను, రిజర్వు పోలీసులను ప్రజానీకంపైకి, గ్రామాలపైకి వదలటంతో దారుణ భీభత్సకాండ ఆరంభమయింది. ధన, మాన, ప్రాణాలకు విలువ, రక్షణలేకుండ అల్లకల్లోలం ఆరంభమయింది. ప్రజాసామాన్యంలో పాలకుల నిరంకుశత్వంపట్ల బహిరంగంగా యేహ్యత యేర్పడి తిరుగుబాటుకు పురికొల్పింది. అన్నివర్గాల వారు చేతనైనవిధంగా ఆత్మరక్షణార్థమే తిరుగుబాటు సాగించారు. శ్రీమతి కమలాదేవి ఆంధ్రమహాసభ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సాయుధ గెరిల్లా దళంలో ప్రవేశించారు. నల్లగొండ, వరంగల్లు, కరీంనగరు జిల్లాలలో ఆయుధాలు ధరించి అధికారులతో దాగుడుమూతలాడుతు, మెరుపుదాడులలో శత్రువులనుంచి ఆయుధాలు సేకరించుతు తిరిగారు. భువనగిరి ప్రాంతీయ కేంద్ర దళంలో వుండి, గెరిల్లా పోరాటాలను సాగించారు. నైజాముకు వ్యతిరేకంగ పోరాడుతు, జాగీరుదారులు, భూస్వాముల స్వాధీనంలోవున్న భూములను ప్రభుత్వస్వాధీన భూములను, వ్యవసాయ యోగ్యమైన ఆటవీ భూములను యీ గెరిల్లాదళాలు హస్తగతం చేసుకుని పేదరైతులకు, నిరాధార ప్రజానీకానికి పంచియిచ్చేవారు. భూస్వామ్య దోపిడికాండకు వ్యతిరేకంగ జరిగిన యీ చారిత్రాత్మక పోరాటంలో శ్రీమతి కమలాదేవి చాలా ప్రధానపాత్ర వహించారు.

నిజాం ప్రభుత్వం కొనసాగించుతున్న ఘాతుకచర్యలను మరి సహించలేక భారత ప్రభుత్వం 1948 సెప్టెంబరు 13న యుద్ధరంగంలోకి దిగింది. ఐదురోజుల ప్రతిఘటనతో నైజాం రాష్ట్రం స్వతంత్ర భారతంలో ఐక్యమైపోయింది. భారత స్వాతంత్ర్య సమరంలో యిది ఆఖరు ఘట్టం. అప్పటివరకు కొండలలో కోనలలో వుండి ప్రాణాలకు తెగించి, ముష్కరులతో పోరాడిన ప్రజానీకాన్ని ఆయుధ విసర్జనచేసి స్వతంత్ర భారతపౌరులుగా నగరప్రవేశం చేయమని భారతప్రభుత్వంకోరింది. చాలా వరకు అట్లాగే చేశారు. భూస్వామ్య

విధానాన్ని నిరసించుతుగాని, జరుగుతున్న ఆ ప్రజావిప్లవాన్ని సమర్థించుతూ గాని ప్రభుత్వం యేవిధమైన అభిప్రాయప్రకటనా చేయలేదు. తమవుద్యమం మరి కొంతకాలం సాగించవలసి రావచ్చునన్న వుద్దేశంతో వుద్యమకర్తలు కొంతమంది ప్రచ్ఛన్నంగానే నిల్చిపోయినారు. వారిలో ఆమెఒకరు. చివరకు 1949 జనవరిలో బహదూర్‌పేట శివార్లలో ఆమె అరెస్టయినారు.

నల్లగొండ జైలులో 6 నెలలు వున్నారు. వరంగల్లు జైలులో 6 నెలలు, ఔరంగాబాదుజైలులో ఒక సంవత్సరం, సికిందరాబాదులో 6 నెలలు యిట్లా మొత్తం $2\frac{1}{2}$ సంవత్సరాలకాలం ఆమె జైలులో గడిపారు. తమ ఏకైక సంతానమైన రెండు సంవత్సరాల కుమారుడిని తమ అత్తగారికి అప్పగించి ఆమె నిశ్చింతగ ఈ దీర్ఘకాల శిక్షలను అనుభవించారు. ఆమెచేసిన నేరాలు కోర్టులో విచారించి ఫలాన శిక్ష అని విధించటం జరగలేదు. అప్పుడే కొత్తగా అధికారంలోకి వచ్చిన భారతప్రభుత్వానికి నైజాం రాష్ట్రంలో పరిష్కరించ వలసిన ముఖ్యసమస్యలు అనేకం వుండటంవల్ల జైళ్ల పరిస్థితులను గురించి పట్టించుకోవటానికిగాని తగినమార్పులు చేయటానికి సావకాశము కలగలేదు. కాబట్టి ఆ విభాగమంతా పూర్వం వున్న విధంగానే నిలచిపోయింది. ఫలితంగా యిక్కడి జైళ్లు రాయవేలూరు, కన్ననూరు జైళ్లకన్న అధ్వాన్నంగానేవుండేవి. ఉదయం పచ్చజొన్నలసంకటి, రాత్రివేళల జొన్నరొట్టె యిచ్చేవారు. వాటినిండా సన్నవి పురుగులో రాళ్లో తేల్చుకోవలసిన పూచీ తినేవారిదే. వరంగల్లు జైలులో, యివ్వవలసిన రేషను యిస్తేమేము బాగుచేసి వండుకు తింటామంటే చాలాకాలం యిచ్చేవారుకాదు. జైలులోవున్న అధికభాగంస్త్రీలు యేమీతెలియని అమాయకపు పాటకజనం, వారి పిల్లలు పిల్లలతో పాపమాస్త్రీలు నానాయిబ్బందులుపడేవారు. ఇవన్నీ చూడలేక చివరకు ఆమె నిరసనవ్రతం సాగించారు. ఇద్దరు వృద్ధులతో సహా తోటి స్త్రీలందరు కూడ ఆమె ననుసరించారు. ఆమె, అక్కడవారితో కలిసి వుంటే ప్రమాదమని భావించి అధికారులు ఆమెను ఔరంగబాదు జైలుకు పంపించారు. అక్కడ ఒక సంవత్సరం, సికిందరాబాదు జైల్లో మరొక ఆరునెలలు వున్నారు. తగిన సాక్ష్యంలేని కారణంగా ఆమెపైనవున్న కేసులను కొట్టివేశారు. కాని విడుదలచేయలేదు. హైదరాబాదు కోర్టులో పిటిషనుపెట్టుకోగా 1951లో విడుదలచేశారు.

1952 లో జరిగిన శాసనసభ ఎన్నికలలో నల్లగొండజిల్లా, భువనగిరి తాలూకా ఆలేరు నియోజకవర్గంనుంచి పెద్ద మెజారిటీతో ఎన్నికయినారు. 15 సంవత్సరాలు ఏకబిగిన ఆలేరు నియోజకవర్గంనుంచి కమ్యూనిస్టు అభ్యర్థినిగా ఆమె శాసనసభ సభ్యురాలుగా వున్నారు. 1963–64లో శాసనసభలో ప్రతిపక్ష కమ్యూనిస్టు నాయకురాలుగా పనిచేశారు. 1969 నుంచి 71 వరకు

ఉపాధ్యక్షురాలుగా వున్నారు. అఖిలభారత మహిళాసమాఖ్యకార్యవర్గ సభ్యురాలుగా 1967 నుంచి 75 వరకు వున్నారు.

దాస్యశృంఖలాలను విడగొట్టటానికి అక్షరాల కదనరంగంలో ప్రవేశించినా ఆమె శాంతిప్రియ. అందువల్లనే తెలంగాణా అలజడిసందర్భంలో దానిని సమరస పుచ్చాలని యెంతగానోచూశారు. వ్యర్థ ధన ప్రాణ నష్టాన్ని వ్యతిరేకించారు. స్త్రీలగురించి గోడలమీద అసభ్యవ్రాతలు వ్రాయటాన్ని బొత్తిగా గర్హించారు. ప్రాణాలకుసైతం తెగించి ముష్కరుల కబంధ హస్తాలనుంచి దేశాన్ని విముక్తం చేయటానికి ఆఖరు భారతస్వాతంత్ర్యసమరంలో పాల్గొన్న అన్నిపార్టీల రాజకీయ బందీలను కూడ కాంగ్రెసు కేంద్రప్రభుత్వం దేశసేవకులుగా గుర్తించింది. మిగతా అందరితోపాటు వారికి నెలనెల పెన్షను యిచ్చి ఆదుకున్నది. ప్రత్యేక సిద్ధాంతాల ననుసరించుతూ, జాతీయోద్యమంలో పాల్గొన్న యీ కొత్తవర్గపు స్వాతంత్ర్య సమరయోధులయిన ఆంధ్రమహిళలకు ప్రతినిధి శ్రీమతి ఆరుట్ల కమలాదేవి.

— —

# శ్రీమతి చిట్టూరి అన్నపూర్ణాదేవి

**జననం 30-12-1927**

1942 సెప్టెంబరు 9వ తేదీన తెనాలి సబ్‌కోర్టుముందు ఒక బండి ఆగింది. తెల్ల ఖాధీ చీరెలు ధరించిన ముగ్గురు స్త్రీలు ఆవరణలో ప్రవేశించటం చూసిన జనం గుంపులు గుంపులుగా తోసుకుని లోపలకు వచ్చేశారు. ఎట్లాగో వారు ముగ్గురు ఆఫీసులోపలికి ప్రవేశించ గలిగారు. లోపలికివచ్చిన వీళ్లను, బయటి జనాన్నిచూసిన కోర్టులోని గుమాస్తాలు, ప్లీడర్లు విషయం వెంటనే అర్థంచేసు కున్నారు. పని ఆపి లేచి ఫైళ్లను సర్దుకోనారంభించారు. ఆ ముగ్గురు చేతికందిన సిరాబుడ్లువంచేశారు. బయట కనిపించిన ఫైళ్ల అటు, యిటూ విసిరి వేశారు. ఇంతలో పోలీసులు వచ్చి అమ్మా బయటికి నడవాలి అన్నారు. ఆఫీసు పని ఆగిపోవటంతో ముగ్గురు బయటకు వచ్చి గుంపులోకి తమచేతిలోని కరపత్రాలను



శ్రీమతి చిట్టూరి అన్నపూర్ణాదేవి

విసిరారు. ప్లీడర్లకు తమ చేతిలోని కవర్లు అందించారు. వాళ్ల అవి అక్కడే జారవిడిచివెళ్లారు. గాజులుతొడుక్కోండి అని జనంలోనుంచి గట్టిగా అరుపులు బయలుదేరినవి. ఆ స్త్రీలు గాంధీమహాత్మాకి అన్నారు. ప్రజలు జైకొట్టారు. బ్రిటిష్‌పాలన అనగానే ప్రజలు దిక్కులు పిక్కటిల్లేట్టుగా వూకొద్దు అని అరిచారు. అక్కడ వున్న కొద్దిమంది పోలీసులు ఎవరినని పట్టుకోగలరు ? ఇంతలో బయటినుంచివచ్చిన ఒకపోలీసు అమ్మా మిమ్ములను అరెస్టుచేస్తున్నానన్నాడు. ప్రజలు వెంటరాగా పోలీసులు వారిని సబ్‌జైలు ఆఫీసుకు తీసుకువెళ్లారు. ఇటువంటి నేరస్తులు గుంపులు గుంపులుగా వుండటాన ఆరురోజులకుగాని వీరికేసు విచారణకురాలేదు. నయాన, భయాన అధికారులు చెప్పిచూసారు. ప్రయోజనం లేకపోయింది. పైగా నిర్భయంగా, నిస్సంకోచంగ జవాబులుయిచ్చారు. గత్యంతరం లేక ఒక్కొక్కరికి ఒకసంవత్సరం కఠిన శిక్షవేసి, సీక్లాసుయిచ్చి రాయవేలూరు సెంట్రలు జైలుకు వాళ్లను పంపించారు.

ఆ ముగ్గురిలో పెద్దవారు శ్రీమతులు కమలాంబ, శాంతాదేవి విద్యాసాగర్‌లు మూడవ ఆమె పధ్నాలుగు సంవత్సరాల వయసుగల శ్రీమతి చిట్టూరి అన్న పూర్ణాదేవి.

భారత స్వాతంత్ర్య సమరంలో తుదిఘట్టంగా 1942 లో క్విట్టిండియా వుద్యమం ఉవ్వెత్తున దేశాన్ని ముంచెత్తింది. నాయకులు, ప్రజలు కూడా ప్రాణాలు విసిగి వున్నారు. అటో యిటో తేల్చుకోవటానికే నిర్ణయించుకున్నారు. తప్పనిసరిఅయిన ప్రభుత్వోద్యోగులు తప్ప మనసులోనో బహిరంగంగానో ప్రతి వారు వుద్యమాన్ని బలపరిచినవారే. స్త్రీలు, పురుషులు మాత్రమేకాక వుత్సాహ వుద్రేకాలకు వునికిపట్టు అయిన విద్యార్థులుకూడ రంగప్రవేశం చేశారు. దాంతో స్వాతంత్ర్య సమర చరిత్రలో యేనాడు లేనంత ముమ్మరంగా క్విట్టిండియా వుద్యమం అల్లుకుపోయింది. అంతా గమనించుతున్న బ్రిటిష్ ప్రభుత్వం కూడా అంత పట్టుదలతోను, దమన నీతితోను వుద్యమాన్ని అణచ టానికి ప్రయత్నాలు చేశారు. కాల్పులే జరిగినవి. నిరాయుధులైన ప్రజలు నేలకొరిగిపోయినారు. అయినా ప్రజల వుత్సాహం పట్టుదల సడలలేదు. శ్రీమతి అన్నపూర్ణాదేవి వంటి చిన్నవయసువాళ్లు కూడ వుద్యమంలో ప్రవేశించి ప్రభుత్వ కార్యకలాపాలను స్థంభింప చేయటానికి నిర్భయంగా ముందుకు వచ్చారు.

ఆమె 1927 డిసెంబరు 30న కేశనకుర్తి చిట్టెయ్య, సరస్వతీదేవి గార్ల ప్రథమ సంతానంగా జన్మించారు. కృష్ణాజిల్లా విజయవాడ ఆమె జన్మస్థలం. ఆమె పినతండ్రి శ్రీ మాణిక్యారావు విద్యా, రాజకీయ చైతన్యం కలిగించి, అట్టడుగు మెట్టువీాదివారికి సేవచేసిన ప్రజాసేవకుడు. గాంధేయులుగా తల్లిదండ్రులు ఆమెను కాశీ విద్యాపీఠంలో చదువుకుని హిందీ భాషా ప్రచారం చేయపూనుకున్న విద్వాంసులు, పండితులు అయిన శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ కిచ్చి వివాహం చేశారు. ఆమెకు ఎనిమిదవ ఏటనే వివాహం జరిగింది. 1940 లో పదమూడేళ్ల వయసులో ఆమె గృహిణిగా తెనాలి వచ్చారు. అప్పటి కామె చదివింది రెండవక్లాసు మాత్రమే. తెనాలిలో శ్రీ శర్మగారు నడుపుతున్న హిందీ తరగతులలో యిల్లాలిని కూడ చేర్చుకుని యిటు తెలుగు, అటు హిందీ నేర్ప నారంభించారు. హిందీ విద్యార్థులు రాట్నం వడకాలి, ఖాదీ ధరించాలి, జాతి, కుల, మత వివక్షత పాటించరాదు. కాబట్టి ఆమెకు విద్య మాత్రమేకాక దేశాభిమానం, సంస్కారం కూడ అలవడసాగినవి. తగినవయసు, ఆసక్తి వుండటంతో గబగబ చదువు వంటపట్టింది. 1942 సెప్టెంబరు నాటికి రాష్ట్ర భాష పరీక్ష నెగ్గి ప్రవేశిక పరీక్ష కూడ వ్రాశారు.

ఇంతలో క్విట్ఇండియా వుద్యమం తీవ్ర రూపందాల్చింది. శ్రీ శర్మగారి దగ్గర హిందీ రాష్ట్ర భాషా విశారద పరీక్షకు చదివి వుత్తీర్ణులయిన ప్రఖ్యాతదేశ సేవిక సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవిగారు జయప్రకాష్ నారాయణ్ గారి ఆదేశానుసారం ప్రచ్ఛన్నంగా వుండి, యువతీ యువకులకు వుద్బోధచేసి, శిక్షణనిచ్చి, జట్లు జట్లుగా వారిచేత సత్యాగ్రహం చేయించి జైలుకు పంపుతు వుండేవారు. శ్రీ శర్మగారు తదితర హిందీ ప్రచారకులు కూడ నాయకత్వం వహించి వాలంటీర్లకు శిక్షణనిస్తూ వుండేవారు. ఇదంతా చూస్తు, పత్రికలు చదువుతున్న శ్రీమతి అన్నపూర్ణాదేవి తాను వుద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొంటానన్నారు. చిన్నవయసునల్ల వుద్రేకంతో ప్రవేశించినా, తరువాత బెంబేలుపడి క్షమాపూర్ణణ యిచ్చి యిల్లు చేరుకుంటూ రేమోనని గురువుల అనుమానం. కాని ఆమెను యిక ఆపటం యెవరితరం కాలేదు. అనుమతి యివ్వక తప్పలేదు. అరెస్టయి సంవత్సరకాలం శిక్ష అత్యంత వుత్సాహంతో భరించటానికి రవంతయినా జంకు గొంకులుగాని పశ్చాత్తాపంగాని చూపక రాయవేలూరు జైలుకు వెళ్లిన ఆమెను చూసి భర్త శర్మగారు, రాజకీయ గురువు శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి తృప్తిచెందారు. ఒకవ్యక్తి తప్పటడుగు వేస్తే భారత జాతికే తలవంపులని భావించేసువర్ణ కాలం అది.

రాయవేలూరు జైలులో ఆ సమయంలో శ్రీమతులు కుట్టిమాలు అమ్మ అమ్ముస్వామినాథన్, కమలాదేవి చటోపాధ్యాయ, లక్ష్మీ నరసమ్మగుప్తా, కమలా ఆర్య డిటెన్యూలుగ వుండేవారు. శ్రీమతులు ఎర్నేని లీలావతీ దేవి, ఉషాదేవి, సావిత్రీదేవి, పత్తిపాటి సాధుసీతమ్మలు అనేకులు 'సీ' క్లాసులో వుండేవారు. ఇంతమంది దేశసేవికలను నాయికలను చూసి, శ్రీమతి అన్నపూర్ణాదేవి సంబరానికి అంతులేదు. జైలులో వుప్పుడు బియ్యపు అన్నం, బూడిద గుమ్మడికాయ ముక్కలు వేసిన కందిపప్పు పులుసు వడ్డించేవారుట. గడ్డి పరకలు సర్వ సాధారణంగాను, అరంగుళం పొడుగు పురుగులు అడపాదడపా దాంట్లోతేలుతూ వుండేవిట. కానీ అవన్నీ పట్టించుకునే ఓపిక యెవ్వరికి? మాకు యివేవి లెక్కలేదు, యేపరిస్థితులు మమ్ములను వంచలేవన్నట్లుగా వ్యవహ రించేవారుట ఆ రాజకీయబందీలు.

కర్నూలు జిల్లాకు చెందిన శ్రీమతి ఎస్. అమరావతి, తూర్పు గోదావరి జిల్లాకు చెందిన శ్రీమతి దేగల వెంకటరత్నం, గుంటూరు జిల్లాకు చెంది శ్రీమతి అన్నపూర్ణాదేవి అక్కచెల్లెళ్లలాంటి సఖ్యతతో ఒక్క గదిలో వుండేవారు. ఆమె జైలు లైబ్రరీనుంచి తెలుగు భారతం

సంపుటాలు తెచ్చుకుని పట్టుదలగా చదువుతు వుండేవారు. ఒకనాడు పుస్తకం చదువుకుంటూవుండగా, ఒక స్నేహితురాలు వచ్చి తమాషా చూపించుతాను రమ్మనమని చెయ్యిపట్టిలాక్కుని వెళ్లింది. కాయపారుగా వున్న ఒక తెల్లదొర యూవినింగు హాట్ పెట్టుకుని, ఖాదీ నిక్కరు షర్టు తొడుక్కుని చేతిలో ప్రేమబాస్కెట్టు పట్టుకుని నవ్వుతూ 'సి' క్లాస్ ఆవరణ వైపు వస్తున్నాడు. డిటెన్యూల విభాగం నుంచి శ్రీమతులు కమలాదేవి చట్టోపాధ్యాయ, అమ్ముస్వామినాధన్ మరికొందరు బిలబిలమంటు బయటికి వచ్చి హల్లోమెర్లీ అని పలకరించుతున్నారు. ఆ దొర సంతోషంగా ప్రతివారిని పలకరించి కరచాలనం చేస్తున్నాడు. అప్పుడు స్నేహితురాలి వల్ల తెలిసింది ఆ వచ్చింది దొరకాదు అని. శ్రీ ఉప్పల లక్ష్మణరావు సతీమణి అయిన స్విస్‌వనిత మెర్లీ షోలింగరని. ఆశ్చర్యంనుంచి తేరుకుని శ్రీమతి అన్నపూర్ణాదేవి సంతోషంతో ముందుకు వెళ్లి "గుడ్ మార్నింగ్ మదర్, నేను అన్నపూర్ణను" అన్నారు. వెంటనే ఆమె అక్షరాల మాతృవాత్సల్యం ముప్పిరిగొనగా అన్నపూర్ణను గుండెలకు హత్తుకున్నారు. నాటినుంచి వారి బంధం అట్లానిల్చిపోయింది. శ్రీమతి మెర్లీ టైం ప్రకారం నియమబద్ధంగా ప్రతి పనిచేసేవారు. పుస్తకంలో తలదూర్చుకు కూర్చున్న శ్రీమతి అన్నపూర్ణను తనవెంట రౌండ్లు తిరగటానికి తీసుకువెళ్లేవారు. బాడ్మింటను, రింగు టెన్నీసు ఆడేవారు. దాంతో కుంటుపడసాగిన శ్రీమతి అన్నపూర్ణాదేవి ఆరోగ్యం బాగుపడి ఆరోగ్యవంతంగ తయారయినారు.

జైలులో తలకు రాచుకోవటానికి నువ్వుల నూనె యిచ్చేవారు. ఆంధ్రులకు అది పడదు. అధికారులను అడిగితే యేమి తంటా వస్తుందోనని భయపడుతు వుండగా శ్రీమతి అన్నపూర్ణాదేవి నిస్సంకోచంగ నేనడుగుతానన్నారు. ఆ తరువాత ఆదివారం రాజకీయ బందీలందరు తమగోనె, కంబళి, రేకుగ్లాసు ప్లేట్లతో వరుసలు తీరి నిలబడి వుండగా డెబ్బయి సంవత్సరాలు దాటిన బ్రిటిష్ సూపరింటెండెంటు వచ్చారు. తన ముందుకు ఆయనరాగానే ఆమె "గుడ్ మార్నింగ్ గ్రాండ్‌ఫాదర్" అన్నారు. అందరు బిత్తరపోయి చూశారు. ఆయన ముఖంమీద ప్రసన్నత, చిరునవ్వు చూసి ధైర్యంతో ఆమె గబగబ తలకు రాచుకోవటానికి నువ్వుల నూనెవద్దు, కొబ్బరినూనె కావాలని అడిగారు. ఆయన తల పంకించి ముందుకు సాగిపోయినారు. అడిగినందుకు యే గొడవ వచ్చిపడుతుందో నని పెద్దలు యెదురుచూస్తుండగా అన్నపూర్ణా యిదుగోనంటూ ఘుమ ఘుమ లాడే కొబ్బరినూనె యిచ్చారు. జైలు వార్డెను కిళి అనే మలబారు యువతికి ఆమె అంటే ఎంతో అభిమానం, ప్రేమ. దాక్షిణాత్యపద్ధతిన ఆమెను ఆంధ్రేతరు

లందరు అన్నపూర్ణ అనేపిల్చేవారు. వార్డెనుకిళిఆమె చేతపాటలు పాడించు కునేవి. అందరితో కలసిఆడుతు పాడుతు వుండగా సంవత్సరకాలం ఒక్క నెలలాగ గడిచిపోయింది. విడుదలరోజు వచ్చింది. శ్రీమతులు అమ్ముస్వామినాధన్, కుట్టిమాలు అమ్మగార్లు ఆమెను తమ గదిలోకి తీసుకువెళ్లి బొట్టు పెట్టి ఖద్దరు చీరె, రెవికె, ఆపిలు పళ్లు యిచ్చారు. శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ నాలుగు కమలాఫలాలు యిచ్చి, నీవు యిచ్చిన హిందీ పుస్తకాలు చూసినప్పుడల్లా నిన్ను గుర్తు చేసుకుంటానన్నారు. ఆమెతోపాటు ఒకే గదిలో వున్న శ్రీమతులు వెంకటరత్నం, అమరావతిగార్లు కన్నీటితో వీడ్కోలిచ్చారు. తనను ఎంతో ప్రేమగా చూసిన కిళి దగ్గరకు వెళ్లినప్పుడు అంత కరుకుగా మాట్లాడి అందరిని హడలగొట్టే గంభీర మూర్తి కిళి వెన్నముద్దలాగ కరిగిపోయి వల వల యేడ్చింది. వృద్ధ బ్రిటిష్ సూపరింటెండెంటు విష్‌యూ బెస్టాఫ్‌లక్ మై చైల్డ్ అన్నారు. శ్రీమతి అన్నపూర్ణాదేవి గారి చిన్న వయసు, మంచిహృదయం యిందుకు కారణం కావచ్చు లేదా కాలక్రమేణ జైలు అధికారుల మనసులలో పరివర్తనా వచ్చి వుండవచ్చు.

ఆమె యిల్లు చేరుకున్నారు. హిందీ రాష్ట్ర భాషా విశారద పరీక్షలలో వుత్తీర్ణులయి ప్రచారక్‌గా పట్టం పుచ్చుకున్నారు. కాలక్రమాన నలుగురు పిల్లల తల్లి అయినా 1967 వరకు ఆడపిల్లల హైస్కూళ్లలో హిందీ పండిట్‌గా పనిచేశారు. సంస్కృత పరీక్షలకు చదివి వుత్తీర్ణులయినారు. ఆమె చక్కని రచయిత్రి. ఆంధ్ర మహిళాసభవారు నెలికొల్పిన ఆంధ్ర మహిళ పత్రికలోను, వినోదిని, జాగృతి, బహుజన, ఆంధ్ర భూమి వంటి యెన్నో పత్రికలలో కథలు వ్రాశారు.

రెండోక్లాసు చదివిన గృహిణిగా గృహప్రవేశం చేసి యింతటి విద్యావతి అయి, వందల సంఖ్యన పిల్లలకు విద్యా దానం చేశారు. మైనరుగా జాతీయోద్యమంలో పాల్గొని సౌశీల్యంతో సహృదయంతో అధికారులకు సైతం అభిమాన పుత్రిక అయినారు. పెద్దల స్నేహాన్ని వాత్సల్యాన్ని ఎంతగానో పొందారు. ఈనాటికి ఆమె వుత్సాహం, సౌశీల్యం నిత్య నూతనంగా నిల్చివున్నవి.

ఉత్సాహం పట్టుదల, సహృదయతతో జీవితంలో యేమేమి సాధించవచ్చునో తెలుసుకోవటానికి శ్రీమతి చిట్టూరి అన్నపూర్ణాదేవి తార్కాణం.

---

# డాక్టరు శ్రీమతి ముత్తు లక్ష్మీ రెడ్డి

జననం 1886 మరణం 22-7-1968

కాంగ్రెసు సభల సందర్భంగా గాంధీమహాత్ముడు 1927లో మద్రాసు వచ్చినప్పుడు డాక్టరు శ్రీమతి ముత్తులక్ష్మీరెడ్డి ఆయనను కలుసుకోవటానికి వెళ్ళారు. ఆమెను చూడగానే గాంధీజీ నాలుగడుగులు ముందుకువేశారు. చిరునవ్వుతో స్నేహపూర్వకంగ ఆమెభుజంపైన చేయివేసి "ఏమమ్మా శాసనసభ సభ్యురాలుగా నీ సోదరీమణులకు యే విధమైన సేవచేస్తున్నావు?" అని అడిగారు. ఆమె వెంటనే ఒక కాగితం ఆయనచేతిలో పెట్టి "ప్రస్తుతం దేవదాసీ విధాన నిర్మూలనా చట్టాన్ని ప్రవేశ పెట్టి, అది శాసనంగా రూపొందాలని ప్రయత్నిస్తున్నాను. దానికి మీ ఆశీస్సులు నాకు కావాలి బాపూ" అన్నారు. ఆయన కాయితం సాంతం చదివి మెచ్చుతున్నట్లుగా తలవూపుతు "నీవు చాలా మంచిపని చేస్తున్నావు నీకు నా ఆశీస్సులు మాత్రమేకాదు. నా సహకారం సర్వదా వుంటుంది. నేను నడుపుతున్న యంగ్ ఇండియా పత్రిక ద్వారా నీ బిల్లు విజయం సాధించటానికి నా చేతనయినంత కృషిచేస్తాను" అని హామీయిచ్చారు. ఆ రోజు సాయంత్రం జరిగిన స్త్రీల బహిరంగసభలో మాట్లాడుతు మహాత్ముడు "స్త్రీల వుద్ధరణకు స్త్రీలుకూడ పూనుకోవాలి. ఎవరిచేతనయిన విధంగా వాళ్ళు చేయూత నివ్వటానికి ముందుకురావాలి. బ్రిటిష్ ప్రభుత్వంతో సహాయ నిరాకరణ సాగించుతు నాకు తోచినసేవ నేను చేస్తున్నాను. సోదరి శ్రీమతి ముత్తులక్ష్మీరెడ్డి శాసనసభ సభ్యురాలుగా, వుపాధ్యక్షురాలుగా ప్రభుత్వంతో సహకరించుతు స్త్రీలకు యెన్నివిధాలుగానో వుపకరించగల విధానాలను అమలులోపెట్టి సేవచేస్తున్నారు. మీ అందరిలోను అటువంటి చైతన్యం, వికాసం, సేవాతత్పరత రావాలి," అని వుద్బోధించారు. గాంధీజీ దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహోద్యమం ఆరంభించిన నాటినుంచి ఆయన కార్యకలాపాలను గురించి వినటమేతప్ప నాటివరకు కలుసుకోలేదు. ఆ నాడు మొదలు ఆమె యెప్పుడు



డా. శ్రీమతి ముత్తులక్ష్మీరెడ్డి



AM 19x

యే సంఘసంస్కరణ మానవ సేవచేయ పూనుకున్నా మహాత్ముడిని సంప్రదించి, ఆయన అనుమతి, ఆశీస్సులతోనే కొనసాగించేవారు.

1929లో ఆరంభమైన భారత సత్యాగ్రహోద్యమం 30 నాటికి దేశ మంతా అల్లుకుపోయింది. విచ్చలవిడిగా జరుగుతున్న లాఠీచార్జీలు, అరెస్టులు, శాంతి, అహింసలనే ఆయుధాలుగా వుద్యమం నడుపుతున్న గాంధీజీ అరెస్టు ఆమెను చాలా బాధపెట్టినవి. ఆ ప్రభుత్వాన్ని మన్నించి సహకరించటం వ్యర్థమనుకున్నారు. ఆరోజుల్లో రాష్ట్ర శాసనసభలకు సభ్యులను ప్రభుత్వమేయెన్నుకునేది. 1926లో ప్రభుత్వమే ఆమెను శాసనసభకు సభ్యురాలుగా ఎన్నుకోవటం, శాసనసభ సభ్యులు ఆమెను ఉపాధ్యక్షులుగా ఎన్నుకోవటం జరిగింది. ప్రపంచం మొత్తం మీద ఆ స్థానాన్ని అలంకరించిన ప్రథమ స్త్రీ ఆమె. ఇంతటి గౌరవాన్ని, హోదాను 1930 మే లో ఆమె, దేశంపట్ల గాంధీజీ పట్లగల గౌరవంతో తృణప్రాయంగా వదిలేశారు. బహిరంగంగా గాంధీజీ శిష్యరికం స్వీకరించారు. ఆమె విదేశీవస్త్రాలయాల దగ్గర, కల్లు సారాదుకాణాల దగ్గర పికెటింగులు జరప టానికి బదులు విద్యావతిగా స్త్రీ లోకంలో జాతీయభావం, చైతన్యం కలిగించి దేశం తరఫున రాయబారాలుజరిపి, చర్చలలో పాల్గొని సంప్రదింపులు జరిపి స్వాతంత్ర్యసిద్ధికి తోడ్పడేవిధానాలు అవలంబించారు. అఖిలభారత మహిళా సంఘం, భారత మహిళా సమాఖ్య, మహిళా జాతీయ సమితి వంటివేకాక, విద్యావికాసాలుగల అనుభవజ్ఞురాలైన మహిళగా మరెన్నో క్రైస్తవ, ముస్లిం మహిళా సంఘాలను కూడ సమర్థవంతముగ ప్రయోజనకరంగ నిర్వహించుతు వుండేవారు. ఏ వర్గాన్నిగాని ఆమె పరభావంతో చూడక, ఏకోన్ముఖంగ మహిళలకు తామున్న పరిస్థితి, కోరుకుంటున్న పరిస్థితి, ప్రభుత్వ విధాయకం, జరుగుతున్న అన్యాయం వంటి విషయాలు కూలంకషంగ బోధించారు. ప్రభుత్వ ఆహ్వానంపైన సైమను కమీషను, లోథియన్ కమీషను, రౌండు టేబులు సమావేశాలల్లో నిష్పాక్షికంగ, నిర్భయంగ, నిస్సంకోచంగ భారత మహిళాలోకానికి ప్రతినిధులుగా వ్యవహరించి, వాదించి సాక్ష్యమివ్వగల సామర్థ్యం కలిగించారు. దానికి యెంత సామరస్యం, సహానుభూతి, నాయకత్వం వహించగల శక్తి, విషయ పరిజ్ఞానం, వివేచన సమర్థత కావాలో వూహించుకో వచ్చు. ఆమె కలిగించిన చైతన్యం స్త్రీలకు సర్వకాలాలకు సదానుపకరించగలది. పికెటింగులతో తూకం వేసి ఆనాడు ఆమె దేశభక్తిని శంకించిన వారూ, విమర్శించినవారూ లేకపోలేదు. ఆమె నిబ్బరంగ అన్నీవోర్చి తామరాకుమీది నీటిబొట్టులాగ తన వ్యక్తిగత భావాలను యితరులకు అంటగట్టాలని చూడక, ఆలోచించి వ్యవహరించగల దక్షతను నాటి విద్యావంతులకు ప్రసాదించారు.

1929 లో భారత మహిళా సమాఖ్యతరఫున సెలెక్టుకమిటీలో సాక్ష్యమివ్వటానికి రౌండుటేబులు సమావేశానికి ఆమె ఇంగ్లండు వెళ్లారు. దానికి ఇంకా కొంతవ్యవధి వున్నందువల్ల అమెరికాలో జరుగుతున్న అంతర్జాతీయ మహిళాసభకు భారతదేశప్రతినిధిగా రావలసినదని ఆహ్వానించారు. ఆమె ప్రయాణం చేసిన స్టీమరు న్యూయార్కు నగరం సమీపించుతుండగానే తోటి ప్రయాణీకులందరు మెడలు నిక్కించి స్వాతంత్ర్య చిహ్నమైన లిబర్టీ స్టాచ్యూను చూడ నారంభించారు. ఆమె వెంటనే "భగవాన్ మా భారతదేశం కూడ త్వరలో యిటువంటి స్వతంత్రరాజ్య చిహ్నాన్ని ప్రతిష్ఠించుకోగలిగేట్లు దీవించు తండ్రీ" అని భగవంతుడిని ప్రార్థించారు. అమెరికాలో జరిగిన సమావేశాలలో ఆమె వుపన్యాసధోరణికి, విషయ విపులీకరణ శక్తికి అందరు ఆశ్చర్యపోయేవారు. స్వయంగా కష్టపడి స్వతంత్రం సంపాదించుకున్న అమెరికన్లు భారతీయుల స్వాతంత్ర్య సమరాన్ని సమర్థించేవారు. గాంధీమహాత్ముడి యోగక్షేమాల గురించి, ఆయన వుపవాసదీక్షను గురించి అడిగి తెలుసుకునేవారు. 1931 లో ఎదురుచూసిన రౌండు టేబులు సమావేశం రానూ వచ్చింది విఫలమూ అయింది. ప్రభుత్వానికి యెంత నచ్చచెప్పాలని చూసినా ఆ ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరయింది. భారతదేశ మహిళలందరి తరఫున గంపెడాశతో వచ్చిన ఆమెకు ఆ విఫలత భరించరానిదయి, నవనాళ్లు కుంగిపోయినవి. పక్కమీది నుంచి లేవలేని స్థితిలో స్వదేశం చేరుకున్నారు. ఆమె అనుభవించిన మానసిక క్షోభ అంతటిది.

సమాజాభ్యున్నతి పట్ల స్త్రీల కర్తవ్యాన్ని ప్రబోధించుతు ఆమె అంతకు పూర్వమే యేనాటినుంచో నిర్వహించుతున్న "స్త్రీ ధర్మ" అనే యింగ్లీషు పత్రిక ప్రపంచ ఖ్యాతి పొందింది. అహింసా, శాంతి ప్రియులయిన సత్యాగ్రహుల పట్ల బ్రిటిష్ ప్రభుత్వం చూపుతున్న కుటిలనీతిని పోలీసుల ద్వారా జరిపించుతున్న దురాగతాలను ఆ పత్రిక ముఖంగా ఎంతగానో గర్హించారు. సత్యాగ్రహిణులయిన స్త్రీ రాజకీయ బందీల పట్ల విద్యార్థినుల పట్ల అధికారులు జరువుతున్న దురాగతాలకు, అన్యాయాలకు నిరసనగా బ్రహ్మాండమైన బహిరంగ సభలు యేర్పాటు చేశారు. స్త్రీలను వుద్బోధించుతు వుత్తేజకరమైన వుపన్యాసాలు చేశారు. అనేక వూరేగింపులలో పాల్గొన్నారు.

1933 లో హరిజన యాత్రాసందర్భంగా గాంధీజీ మద్రాసు వచ్చారు. అప్పుడు ఆమె భారత మహిళా సమాఖ్యకు అధ్యక్షులు. స్త్రీలు తమసమస్యలను గాంధీజీతో చర్చించుకోవటానికి అనువుగా ఆమె బ్రహ్మాండమైన ప్రత్యేక స్త్రీల సభను సమావేశపరచారు. ఆమె అంతకు మూడేళ్ల ముందే 1930 లో

అవ్వైహోం అనే అనాధ శరణాలయం స్థాపించారు. జాతి, కుల, మతవివక్షత లేకుండ అనాధలను, అనదలను, వ్యధితులను అందులోచేర్చుకుని ఆశ్రయమిచ్చివిద్యవికాసాలు కల్పించుతున్నారు. అందువల్ల భారీయెత్తున హరిజనుల దేవాలయ ప్రవేశానికి, అస్పృశ్యతానివారణకు భారీ యెత్తున తోడ్పడగలమని మహాత్ముడికి హామీ యివ్వగలిగారు. బహిరంగసభలు జరిపి ప్రచారం చేశారు. స్వచ్ఛంద స్త్రీ సేవా సంస్థలన్నిటిలోను, అవి నడిపే సంస్థలలోను, ప్రభుత్వ హాస్టళ్లలోను సర్వసమత ఆపాదించగలిగారు. మహిళా సమాజాల వజ్రసంకల్ప ఫలితంగానే మధుర గురువాయూరు వంటి పుణ్యక్షేత్రాలలో హరిజనులు దేవాలయ ప్రవేశం చేయగలిగారు.

1946 లో గాంధీజీ హిందీ ప్రచారసభ రజతోత్సవాలు జరిపించటానికి మద్రాసు వచ్చారు. అప్పటికే 1935 లోనే ఆమె కేన్సరు హాస్పిటలు ఆవశ్యకతను గురించి ప్రచారం చేయటం, భారత మహిళా సమాఖ్య ద్వారా కొన్ని విరాళాలు సేకరించటం కూడ జరిగిపోయింది. ఆమె నేత్రదృష్టి క్రమేపి తగ్గిపోవ నారంభించింది. అయినా వుత్సాహంతో మహాత్ముడిని చూడ టానికి వెళ్లారు. ఆమెను చూడగానే సంతోషం ముప్పిరిగొనగా రెండుభుజాల మీద చేతులువేసి ''అమ్మా నీ నేత్రదృష్టి తగ్గిపోయిందని విచారించకు. నీ కుశాగ్రబుద్ధితో తోటివారికి సేవచేయవచ్చు. శారీరక అశక్తతలు సేవాతత్పరులకు అడ్డురావు '' అని అనునయించారు. హిందీ ప్రచారసభలో ఒక వారం పాటు జరిగిన నిర్మాణాత్మక కార్యకర్తల సమావేశాలకు ఆమె అధ్యక్షత వహించారు. ఆతర్వాత ఆమె గాంధీమహాత్ముడిని మళ్లీ ముఖాముఖి కలుసుకోలేదు. అప్పటి గాంధీజీరాకకు గుర్తుగా తాను నిర్వహించుతున్న అవ్వైహోంలో ఒకబేసిక్ స్కూలును ఆమె నెలకొల్పారు. ఆమెకు బాపుపట్ల అంతటి గౌరవం.

చిన్ననాడే ఆమె బ్రహ్మమత ప్రభావితులు అయినారు. రాజా రామమోహన రాయ్, శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు, మహర్షి వెంకటరత్నంనాయుడు గార్లలాగ ఆర్తజనరక్షణ స్త్రీవుద్ధరణలకు పాటుపడాలని ఆనాడే నిశ్చయించు కున్నారు. 1912లో భారతదేశం మొత్తం మీద మొదటి లేడీడాక్టరు అయినారు. గాంధీజీ తన జీవితంతో, రాజకీయాలతో మతం సమన్వయపరుచుకున్నట్లు, ఆమె తన జీవితంతో వృత్తితో మానవాళిపైన అవ్యాజానురాగాన్ని సమైక్య పరచారు. సిస్టర్ సుబ్బులక్ష్మిగారు మద్రాసులో స్థాపించిన వితంతు శరణాలయం దుర్భర నరకప్రాయ జీవితాలు అనుభవించుతున్న వితంతువుల పాలిట కల్పవృక్ష మయింది. ప్రేమతో జాలితో డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి వాళ్లకు వుచితంగా వైద్యసహాయం చేసేవారు. మహిళాభ్యుదయానికి సాధనంగా మిత్రులతోకలిసి

ఆమె భారత మహిళాసమాఖ్య స్థాపించారు. శాసనసభలకు స్త్రీలను యెన్ను కోవాలని, వోటింగుహక్కు స్త్రీలకు కావాలని, పురపాలక సంఘాలలో స్త్రీలకు స్థానం ముఖ్యమని, రౌండు టేబులు సమావేశాలలో భారత మహిళలకు ప్రాతి నిధ్యం వుండాలని యీ సమాఖ్యద్వారానే ఆమె కృషిచేశారు. దిక్కుమొక్కులేని పసివాళ్లకు శరణాలయాలు స్థాపించాలని, బాల నేరస్థులకు ప్రత్యేకకోర్టు, రక్షణాలయాలు, శిక్షణాలయాలు వుండాలని, వ్యభిచార గృహాలనుంచి బాలికలను రక్షించటానికి, ఆశ్రయమివ్వటానికి శరణాలయాలు కావాలని, జీవితాంతం కష్టించి, అన్నీ సాధించారు. ఆమెది అంతటికింకపట్టు.

తనవారు పైవారు అన్న భేదంలేకుండ అందరిని సమానంగా ప్రేమించ గల విశాలహృదయం ఆమెది. చిన్నప్పుడు పుదుక్కోటలో చదువుకుంటున్న సమయంలోనే చుట్టుపక్కల గొల్లపల్లెలో యెడ్డమడ్డెగా వుండి యేడుస్తున్న పసివాళ్లను తీసుకొచ్చి స్వయంగా స్నానంచేయించి పాలుపోసి యెత్తుకుని ఆడించేవారు. డాక్టరయి, బిడ్డల తల్లి అయిన తరువాత కొడుకులు పుట్టిన రోజున శరణాలయాలలోని పిల్లలకు తీపి తినిపించితే తప్ప ఆ చల్లని తల్లికి తృప్తివుండేది కాదు. 1942లో క్విట్టిండియా వుద్యమంలో మెడికల్‌కాలేజీలో చదువుతున్న ఆమె రెండవకొడుకు అరెస్టయినాడు. మర్నాడు ఆమెకోర్టుకు వెళ్లి తనకొడుకునేకాక తోటి విద్యార్థులను కూడ హామీవుండి విడిపించారు. పిల్లల చదువులు అనవసరంగా వ్యర్థమైపోగలవని ఆమె ఆదుర్దా. జాతీయ జండాకాలేజీపై యెగరవేసిన నేరానికి యిట్లా విద్యార్థులను అరెస్టుచేయటం, హాస్టలునుంచి పంపించివేయటం అన్యాయమని భావించి స్వయంగా వాళ్లకు ఆశ్రయం కల్పించారు.

ఆమె తమిళనాడులోని పుదుక్కోటలో 1886లో శ్రీనారాయణ స్వామి, శ్రీమతి చంద్రమ్మాళ్ ల ప్రథమ సంతానంగా జన్మించారు. ఒక తమ్ముడు యిద్దరు చెల్లెళ్లు ఉన్నారు. ఆడపిల్లలకు చదువులంటు లేని ఆ పరిసరాలలో, మగ పిల్లల స్కూలులోనే స్కూలుఫైనలు ముగించి మద్రాసు లోఇంటరు, ఎం.బి. సి.యం., చదివారు. పతకాలతో డిగ్రీలు పొంది ప్రథమ భారతీయ లేడీ డాక్టరయినారు. సుప్రసిద్ధ వైద్యులు డాక్టరు టి. సుందర రెడ్డి గారు కోరి ఆమెను వివాహం చేసుకున్నారు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు మద్రాసు బ్రహ్మమందిరంలో వివాహంచేసి ఆంధ్రుల కోడలుగా గృహప్రవేశం చేయించారు. ఆమెకు శ్రీమతులు జయంతి సూరమ్మ, సరోజినీనాయుడు, మాగంటి అన్నపూర్ణల వంటి ఆంధ్రమహిళలు మిత్రులు. ఎన్నోసమావేశాల కధ్యక్షత వహించటానికి ఆంధ్రదేశం వచ్చేవారు. ఆమెకిద్దరు కుమారులు. పై

చదువులకు ఆమె యింగ్లండు వెళ్లినప్పుడు కొడుకులు, భర్త వెంట వెళ్లారు. అలవాటుప్రకారం మరచెంబుతో కాచిననీళ్లు, పెద్దటిఫిన్ కారియర్‌లో తినుబండారాలు తీసుకుని బయలుదేరారు. విదేశాలలో డిగ్రీలుపొంది వచ్చిన సుందరరెడ్డిగారికది నచ్చకవద్దన్నారు. ఆమెవినలేదు. పారిస్‌స్టేషనులో అలవాటులేక కూలీలు తల్లకిందులుగా పట్టుకుని అంతా నేలపాలు చేశారు. ఆయన చాలకోపంగ "అందుకే నేను వద్దన్నానని" అన్నారు. రైలుకదిలింది. డైనింగుకారు మూసేశారు పిల్లలు మంచినీళ్లు అనిగోల, ఆదేశాలలో యెవరు పుత్తనీళ్లుతాగరు. అప్పుడామె "అందుకేనేనుతెస్తాను" అని అన్నారు. రెడ్డిగారు యిబ్బందిగా ముఖం పెట్టి యెటోచూశారు.

అదేపట్టుదల ఆమె దేవదాసీవిధాన నిర్మూలనంలోను, అత్యుత్తమస్థాయికి చెందిన గొప్పకేన్సరు హాస్పిటలును మద్రాసులో స్థాపించగలగటంలోను, లెక్కలేనన్నియితర సేవాకార్యకలాపాలు నెరవేర్చటంలోను కనిపించుతుంది. ఆమె గొప్ప జాతీయాభిమాని, దేశభక్తురాలు. గాంధీజీకలలుకన్న నిర్మాణాత్మక కార్యకలాపాలకు అద్వితీయరూపురేఖలుదిద్దిన అమరశిల్పి. వేషభాషలలో, సిద్ధాంతాలలో ఆచరణలో మహాకర్మయోగిని అయిన శ్రీమతి ముత్తులక్ష్మీరెడ్డి తన 82 వ ఏట జూలై 22 న కన్నుమూశారు.

---

# శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి

జననం **10-3-1900** మరణం **9-3-1927**

1921 మార్చి చివరిభాగంలో గాంధీమహాత్ముడు బెజవాడ వచ్చారు. అప్పటికి ఆవూరుకు యింకా విజయవాడ అన్నపేరురాలేదు. బ్రహ్మాండమైన స్త్రీల సమావేశం జరుగుతున్నది. రెండు లక్షల పైచిలుకు జనం వచ్చారు. అంత మందిలోను ఒక్కామె మాత్రమే ఖాదీ ధరించింది. సభ యే అలజడీ లేకుండ ప్రశాంతంగ, పద్ధతి ప్రకారం జరిగి పోవటానికి ఆమె సభ అంతటా కల తిరిగి కృషిచేయటం గమనించిన గాంధీజీ ప్రశంసా పూర్వకంగా ఆమెను పరికించు తువున్నారు. మరికొంత సేపటికి ఆమె ఒక్క గాజులజత, పుస్తెలుతప్ప తన నగలన్నీ కాంగ్రెసు నిధికి సమర్పించింది. అప్పటివరకు యేస్త్రీ కాని నగలు నిధికియివ్వలేదు. ఆమే మొట్ట మొదటి స్త్రీ. అందువల్ల ఆశ్చర్యపడిన గాంధీజీ ఆమెతో నీ నగలన్నీ యిచ్చివేయటానికి నీ తల్లిదండ్రుల అనుమతి తీసుకున్నావా అని అడిగారు. అందుకామె తడుముకోకుండ యిటువంటి పనులు చేయటంలో నా తల్లిదండ్రులు నన్ను అడ్డగించరని అన్నది. ఇంగ్లీషులో అనర్గళంగా మాట్లాడుతున్న ఆమె ఏలూరు మహిళల తరఫున తమ వూరు రమ్మని గాంధీజీని కోరింది. సాయంత్రం నాలుగున్నర గంటలనుంచి రాత్రి పదిన్నరగంటల వరకు గాంధీజీ ఏలూరులో వుండివచ్చారు. అప్పుడు ఆమెను తన ఆశ్రమానికిరావలసినదని ఆహ్వానించారు. అట్లా గాంధీజీతో ఆరంభమయిన పరిచయం పోనుపోను దృఢపడి 1927లో ఆమె చనిపోయినప్పుడు ఒక శిష్యురాలిని మాత్రమేకాదు నేనొక కన్నకూతురిని కోల్పోయినానని గాంధీజీఅన్నారు.



శ్రీమతి మాగంటి అన్నపూర్ణా దేవి

పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు ఆమె జన్మస్థలం. 1900 సంవత్సరం మార్చి పదవతేదీన అమె శ్రీ కలగర రామస్వామి శ్రీమతి పిచ్చమ్మల ఏకైక సంతానంగా జన్మించారు. ఆమె తల్లి దండ్రులు బ్రహ్మమత ప్రభావితులు. మత విషయకంగా గాని రాజకీయంగాగాని బానిసత్వం, దాస్యం, పనికిరావని స్వాతంత్ర్యం అవసరమని వాళ్లనమ్మకం. సంఘంలో సగభాగమైన స్త్రీలు విద్యావంతులయి వివేకంతో స్వాతంత్ర్యపు విలువతెలుసుకోనిదే సమాజానికిగాని దేశానికిగాని మోక్షంలేదని వాళ్ల విశ్వాసం. చదువుకోవటానికి తగిన వాతావరణం ఏలూరులో వుండదని ఆమెను కలకత్తా పంపించి బ్రాహ్మబాలికా పాఠశాలలో చదివించారు. అక్కడే ఇంటరు మీడియట్ కూడచదివారు. కలకత్తా వంటి మహాపట్టణంలో ఆడపిల్లను చదివించటమంటే ఆర్థికంగా తేలికగాదు. ఆ తల్లిదండ్రులు దీక్షగా అన్నియిబ్బందులను సహించి చదివించారు. తగినట్లే ఆమెవారు పంపే డబ్బుకోసం ఎదురు చూస్తు పంపించిదివాలదని గునుస్తూ వుండటానికి బదులు స్వతంత్రంగా నాలుగు డబ్బులు సంపాదించే ఆలోచనలు చేస్తువుండేవారు చివరకు, రచనవ్యాసంగాన్ని సంపాదనకు సాధనంగా ఎన్నుకున్నారు. ఆమెది చాల కుశాగ్రబుద్ధి. అందువల్ల బెంగాలీలో మంచిపాండిత్యం సంపాదించారు. అనేక బెంగాలీ పుస్తకాలు చదివారు. చక్కని రంగురంగుల బొమ్మలతో పిల్లలకు ఆ భాషలో యెన్నో పుస్తకాలు వుంటే తెలుగు పిల్లలకు ఒక్కముచ్చటైన చిన్నకథల పుస్తకంకూడ లేక పోవటం ఆమెకెంతో బాధ కలిగించింది. అందువల్ల సీతారాములగాథ అయిన రామాయణకథలను సీతారామం అనేపేరుతో యెంతో చక్కగా పండితులు పామరులు కూడ మెచ్చేట్లుగా 1916 లో వ్రాశారు. అప్పటి కామెకు పదహారవ సంవత్సరం. 1920 లో శాంతినికేతనం ప్రధాన పండితుడు శ్రీ విధుశేఖర శాస్త్రిగారు రచించిన 'వివాహమంగళము' అనే పుస్తకాన్ని ఆమె తెనిగించారు. ఆ వెంటనే సుప్రసిద్ధ మహిళాసేవిక శ్రీమతి సరళాదేవిగారు రచించిన 'నవవర్ష స్వప్నం' అనేగ్రంథం, 'శ్రీ అరవిందుని లేఖలు' తెలుగులోకి అనువదించారు. వ్రాయటమే కాకయివన్నీ స్వయంగా పూనుకుని ఆంధ్రప్రచారిణీ గ్రంథాలయం ద్వారా ప్రచురించారు. ఆమె పట్టుదల నిర్వహణా శక్తి అంతటివి. పిల్లలకోసం యింకా అనేక పుస్తకాలువ్రాసి చక్కని బొమ్మలతో అచ్చువేయించాలని కలలు కంటూ వుండేవారు.

1920 లో ఆమె మేనమామ అయిన శ్రీ మాగంటి బాపినీడుతో ఆమె కోరిక ననుసరించి బ్రహ్మధర్మ సాంప్రదాయంలో వివాహం జరిగింది. శ్రీ బాపినీడు కూడ కలకత్తాలో అమరజీవి నేతాజీ సుభాష్‌చంద్రబోసుతో కలిసి చదువుకున్నారు. ఆ రోజుల్లో ఆయువకులిద్దరు

యెంతో ముందడుగువేసి ఇండియన్ డిఫెన్సు ఫోర్సులోచేరారు. అటువంటి విభాగం మనదేశంలో అంతవరకు స్థాపనకాలేదు. దానినే తరువాత తరువాత కలకత్తా యూనివర్సిటీ కోర్ అనటం (Corps) ఆరంభించారు. బాపినీడు గారు వున్నత విద్యలకై అమెరికా వెళ్ళారు. ఆమెకూడ వెళ్లి అక్కడ పెద్ద చదువులు చదువాలనుకున్నారు. అందుకుగాను వేలడబ్బు ఖర్చు పెట్టివిలువయిన వున్ని బట్టలు సిల్కుబట్టలు యేర్పరుచుకున్నారు. పాసుపోర్టు వంటివిహంగులన్నీ సమకూర్చుకున్నారు. ఇంతలో 1921 లో గాంధీ మహాత్ముని స్వాతంత్ర్య సమర శంఖారావంవినిపించింది. చిన్నప్పటి నుంచి స్వాతంత్ర్యానికున్న విలువను తల్లిదండ్రులు రంగరించి పోశారు. విద్యవల్ల అదిగట్టిపడింది. జన్మతః స్వేచ్ఛా ప్రియురాలు, ఆత్మాభిమాని కావటంతోమరి అడుగుముందుకు పడలేదు. దేశమాత దాస్యశృంఖలాలను విడగొట్ట వలసిన తరుణంలో పై చదువులకు విదేశాలకు పోవటం ఆమెకు అవమానకరంగా, స్వార్థపూరితంగా కనిపించింది. విదేశప్రయాణం మానుకుని దేశసేవకుదిగారు. ఆమె నిర్ణయం తల్లిదండ్రులకు గర్వకారణమయింది.

ఆ సమయంలోనే శ్రీమతి అన్నపూర్ణాదేవి తన నగలన్నీ గాంధీజీ చేతిలో పెట్టారు. విదేశవస్త్ర బహిష్కరణ సూచకంగా అమెరికా పోవటానికి సమకూర్చుకున్న విలువైన దుస్తులన్నీ సరికొత్త మడతలు పరశురామప్రీతి చేశారు. నూలు వడకటం, ఖాదీ ధరించటమే కాక యింటింటికి తిరిగి ఖాదీ ప్రచారంచేశారు. విదేశాలకు వెళ్లటానికి సమకూర్చుకున్న డబ్బుపెట్టి రాట్నాలు, మగ్గాలు కొని పేదలకు యిబ్బంది కలగకుండ రాట్నాలు సమకూరేట్లు చేశారు. మోహనదాసు పరిశ్రమాలయం స్థాపించి వడకటంనేయటం యింకా చిన్న చిన్న కుటీరపరిశ్రమలు నెలకొల్పారు. ఆమె తల్లి శ్రీమతి కలగర పిచ్చమ్మ, పెత్తల్లి శ్రీమతి బొప్పన మాణిక్యాంబ ఆమెకు అండదండలుగా వుండి సహకరించేవారు. వాళ్లే హరిజనులను క్రైస్తవులను బహిరంగంగా తమయిళ్లకు ఆహ్వానించి గౌరవించుతు వుండేవారు. ఇప్పుడిక శ్రీమతి అన్నపూర్ణాదేవి బహిరంగంగ హరిజనబాలిక రామానుజమ్మను, యింకొక పిల్లవాడిని తీసుకువచ్చి తమపిల్లల్లాగ పోషణభారం వహించారు. తన గ్రంథాలపైన వచ్చే రాబడితో ఆ పిల్లలకు చదువుచెప్పించారు. చివరకు ఆ అమ్మాయిని కొంతకాలం గాంధీజీ ఆశ్రమానికికూడ శిక్షణార్థం పంపించారు. ఆమె యీ చర్యలకు సంఘబహిష్కారమే కానుకయింది. ఆమె చలించలేదు. బాలికా పాఠశాలకు విరాళంయిచ్చి ప్రోత్సహించారు. స్వయంగా కొంతకాలంగా గాంధీజీ ఆశ్రమంలో వుండివచ్చారు. దేశం పర్యటించి వుద్యమ ప్రచారం చేశారు. ఆమె ఇంగ్లీషు, తెలుగు, బెంగాలీలలో అనర్గళంగా వుపన్యసించగలరు.

1921, 22 నాటికి నిస్సంకోచంగ వేదికనెక్కి శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మ గారిలాగ వుపన్యసించగలవారు బహుకొద్దిమంది వుండే వారు. పురుషుల సభలలో సైతం నిస్సంకోచంగ వుపన్యసించేవారు. ఆమె వాక్ప్రవాహం ఆవేశం ప్రేక్షకులను వుఱ్ఱూతలూగించేవి.

ఆమె ప్రపంచమంతా స్వాతంత్ర్య సమరమే. అందులో త్రికరణ శుద్ధిగా లీనమై వుండేవారు. ఆదే భావాలను భర్తకి అమెరికా వుత్తరాలలో వ్రాసేవారు. తిండికి లేని భారతీయులకు మీరు జామ్ ఫాక్టరీలు నెలకొల్పి ప్రయోజనం వుండదు. సేద్యంలో సులువులను విశదంగా పేద వారికి విద్యా విహీనులయిన గ్రామీణులకు నేర్పటానికి మ్యాజిక్‌లాంతరు, స్లైడ్లు తెమ్మని వ్రాసేవారు. పేదవారికి ప్రధాన శత్రువు మద్య పానం. అదిమాన్పించటానికి అనువుగా స్లైడ్లు ప్రచారక సాధనాలు తెమ్మని అడిగే వారు. పెద్ద జీతాలకు ఆశపడి యేమిల్లులో ప్రారంభించక అసంఖ్యాక ప్రజలతో కలిసి దేశానికి సేవచేయ మని వేడుకునే వారు. భర్త వీలయినంత వెంటనే తిరిగి వచ్చేసి తన సరసన వుండి దేశసేవ చేసి, జాతికులమత ప్రసక్తి లేని గొప్ప నాయకుడుగా కీర్తి పొందాలన్నదే ఆమె తపన. తనను మరిచినా మాత్ర దేశాన్ని మరువ వద్దని, పదే పదే గుర్తు చేశేవారు.

1923లో స్వదేశం తిరిగివచ్చిన భర్తకి రాజకీయాలలో ఆమెమార్గదర్శిని అయినారు. విదేశీ సూటు బదులు శాశ్వతంగా ఖాదీధారి అయినారు. ఆనాడు ఆమె దగ్గర శిష్యరికం వహించిన మాగంటి బాపినీడు గారు 5సార్లు జైలుకు వెళ్లారు. హరిజన దేవాలయ ప్రవేశవుద్యమంలో రాత్రింబగళ్లు కృషి చేశారు. ఆంధ్ర అగ్రనాయకులలో ఒకరయి గాంధీమహాత్ముడి సన్నిహితులలో ఒకరై కీర్తి గడించారు. ఆమెది అంత అకుంఠిత దీక్ష.

ఆమెకు భగవంతుడు అన్నీప్రసాదించాడు కాని ఆరోగ్యం మాత్రం యివ్వ లేదు. చిన్నప్పటినుంచి చాలా సున్నితమైన ఆరోగ్యం. అందులోను క్రమేపి జాతీయోద్యమంలో ప్రవేశించి రాత్రింబగళ్లు శక్తినిమించి శ్రమపడటంతో, తిరగటంతో బొత్తిగా క్షీణించి పోయింది. ఇకవైద్యంకూడ ప్రకృతి వైద్యమే. గాంధీజీ ఆదేశానుసారం వీలుపడినప్పుడు జ్ఞాపకం వచ్చినప్పుడు ఆప్రకృతి వైద్య మయినా చేసేవారు. ఆమెకు దేశసేవ ఒక్కటే ముఖ్యం. జాతీయ విద్యాలయం నడపటం, మోహనదాసు పరిశ్రమాలయం నడపటం, హరిజనోద్ధరణ, దేశం పర్యటించుతు వుపన్యసించుతు వుద్యమ ప్రచారం చేయటం అవే పరమావధి. ఆమెయిన్ని చేసినా యే కారణానో పోలీసులు ఆమె జోలికి వచ్చేవారుకారు. ఆంధ్ర

రాష్ట్రీయ సభ సభ్యురాలుగా, అఖిల భారత జాతీయ ఉపసంఘ సభ్యురాలుగా ఎన్నికయినారు.

ఆమె ఆరోగ్యం క్షీణించి పోతున్నదని తెలుసు. మరింత కాలం బ్రతికి మరింత దేశసేవ చేయాలన్నతపన తప్ప కొంత విశ్రాంతి తీసుకుని శరీరాన్ని బాగు పరుచుకుందామన్న తలంపు ఆమెకు కలగలేదు. 1927 మార్చి 1వ తేదీన ఆమె ఏకైక సంతానమైన చిరంజీవి ఝాన్సీ లక్ష్మీబాయి జన్మించింది. మరి వారం రోజులకే పురిటి స్నానం అయినా చేయని పసి గుడ్డును, తల్లి దండ్రులను, భర్తను వదిలి 9—3—1927న దూర లోకాలకు తర్లిపోయినారు.

ఆమె కన్న పసిపాప ఏడవ యేటనే గాంధీజీ మీద పాట వ్రాసింది. గాంధీ తాతకు వుత్తరాలు వ్రాసేది. అమ్మమ్మతో పాటు నాలుగేళ్ల వయసుకే జైలుకు కూడ వెళ్లింది. శ్రీమతి పిచ్చమ్మగారు అనేక సంస్థలను ప్రతిష్ఠించి, కూతురు అన్నపూర్ణాదేవికి ప్రతిగా వాటిని పెంచారు. 27 సంవత్సరాలకే కన్ను మూసినా శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి మొదటి తరపు ఆంధ్ర నాయికగా, ప్రథమ శ్రేణికి చెందిన వీరవనితగా నిలిచారు.

అందుకే గాంధీజీ "ఆమె మరణము వలన భక్తురాలినే కాదు కేవలము పుత్రికను గోల్పోయినట్లు భావించుచున్నాను. భారత పురంధ్రులలో ననేకులను నా పుత్రికలనుగా భావించుకొను భాగ్యము నాకు గలదు. వారందరిలో నీమెయే అత్యుత్తమురాలు. ఆమె నిశ్చల భక్తితో ఫలాపేక్ష వదిలి దేశసేవ గావించెను. ఆమెను బోలి, భారత నారీమణులెల్లరును పవిత్ర హృదయులై, పతివ్రతలై అనురాగ బలముననే తమ భర్తల ననుకూలురుగను, సన్మార్గులుగను గావింప వలెననియు నా అభిమతము. నాయాదేశము ననుసరించి దేశ సేవాకారణముననె యామె తన శరీరము శుష్కింప జేసుకొనెనని బాపినీడుగారు నాపై మోపిన నింద సమంజసముగనేయున్నది. ఆమెవలె యువతీయువకులనేకులు దేశారాధనము నందు ప్రాణ సమర్పణము గావించినగానీ, భారతదేశము మరల పూర్వమువలె పవిత్రవంతమై స్వతంత్రము కానేరదనుట నిస్సంశయము" అన్నారు.

---

# శ్రీమతి కడప రామసుబ్బమ్మ

**జననం 1902**

హైదరాబాదు పట్టణంలోవున్న ఆంధ్ర యువతీ మండలిని శ్రీమతి రంగమ్మా ఓబులురెడ్డి అధ్యక్షులుగా శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవి ఉపాధ్యక్షులుగా నిర్వహించుతు వుండేవారు. 1940 లో జరిగిన ఐదవ వార్షికోత్సవానికి శ్రీమతి కడప రామసుబ్బమ్మని అధ్యక్షులుగా ఆహ్వానించారు. ఆమె, వుమ్మడి మద్రాసు రాష్ట్ర మంత్రిగా వుంటున్న ఆమె భర్త కడప కోటిరెడ్డిగారు సభకు వచ్చారు. ఇంకా అనేకమంది పురుషులు వచ్చారు. అప్పట్లో హైదరాబాదులో హిందూ స్త్రీలుకూడ పరదాపద్ధతి పాటించేవారు. అందువల్ల ఒక చిన్న అడ్డుగోడను, మేదరి చాపలతో యేర్పాటుచేసి ఒకవైపు పురుషులు మరొకవైపు స్త్రీలు ఆసీనులయినారు. ఇది గమనించిన శ్రీమతి



శ్రీమతి కడప రామ సుబ్బమ్మ

రామసుబ్బమ్మ పరదా పాటించితే ఆ సభలో తాను పాల్గొనని నిర్మొగమాటంగ తెగేసి చెప్పారు. ఒక్క క్షణం తడపడినా, శ్రీమతి రంగమ్మా ఓబులురెడ్డి సరేనని ఒప్పుకుని అడ్డం కట్టిన చాపలు వూడతీయించారు. అంతటితో సభ సలక్షణంగా జరిగింది. స్త్రీలు, పురుషులు వుపన్యసించారు. ఆమె తలపెట్టిన పని విజయవంతంగా సాధించగలరని చెప్పటానికి యీ సన్నివేశం చాలు.

కడప జిల్లా, జమ్మలమడుగు తాలూకా సుద్దపల్లె ఆమె జన్మస్థలం. 1902లో శ్రీ కొనుదుల రామచంద్రారెడ్డి, శ్రీమతి అచ్చమాంబల కుమార్తెగా జన్మించారు. ఆమె తండ్రి సంపన్నులు, గొప్ప సంస్కృత పండితులు. 1911లో ఐదవ జార్జి చక్రవర్తి పట్టాభిషేకోత్సవానికి బ్రిటిషు ప్రభుత్వం ఆయనను అహ్వానించారు. ఆయన యెన్నో విద్యార్థి వేతనాలను యేర్పాటు చేశారు. ఆమె 15వ ఏట, 1917లో కడప కోటిరెడ్డిగారితో

ఆమె వివాహం అయింది. ఆయన లండన్ యూనివర్సిటీలో ఎల్.ఎల్.బి., ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీలో బి.సి.ఎల్. పట్టాలు పొంది బార్—ఎట్—లా అయినారు. విదేశాలకు వెళ్లి చదివివచ్చిన ఆనాటి యువకులు అనేకమంది మాదిరి ఆయనకూడ దేశభక్తి, జాతీయాభిమానం పుష్కలంగా సమకూర్చు కున్నారు. ఆ సద్భావాలన్నీ శ్రీమతి రామసుబ్బమ్మకీ కలిగించారు. ఫలితంగా ఆమె 1921 నాటినుంచే కాంగ్రెసులోచేరి జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

1928 ఫిబ్రవరి 3న సైమన్ కమీషన్ బహిష్కరణ, నిరసన ప్రదర్శనాలు మద్రాసులో జరిగినవి. మద్రాసు పౌరులు వెల్లువలాగ వీధులు ప్రవేశించి నిరసన ప్రదర్శనాలు జరుపుతున్నారు. హైకోర్టు సమీపాన యీ ప్రదర్శనము ఆపటానికి తెల్ల సోల్జర్లు కాల్పులు ఆరంభించారు. ఒక అజ్ఞాతవీరుడు నేలకొరిగాడు. రామసుబ్బమ్మగారు, కోటిరెడ్డిగారు, శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు వంటి ఆంధ్ర ప్రముఖులంతా ఆ జనసందోహంలోనే వున్నారు. సోల్జర్ల దురాగతాన్ని మరిచూడలేక గాంధీజీ శాంతిసమర యోధుడయిన శ్రీ ప్రకాశం పంతులుగారు "ఎవరురా నా ప్రజలను కాల్చుతున్నది ? నన్నుకాల్చిన తరువాత ధైర్యముంటే నా ప్రజలను కాల్చండి" అంటూ చొక్కా గుండీలువిప్పి ఛాతీని తుపాకులకు అడ్డుపెట్టారు. ఆ గర్జనే, ఆ నిస్వార్థ శౌర్య ప్రదర్శనే ఆయనను ఆంధ్రకేసరిగా ఆంధ్రుల హృదయాలలో నిల్పింది. ఆ దృశ్యం రామసుబ్బమ్మగారి హృదయంలో యీనాటికీ చెరగని ముద్రవేసింది. దేశంకోసం యెంతటి త్యాగం చేయవలసివచ్చినా వెనుకాడవలసిన అవసరంలేదని నిశ్చయించుకున్నారు.

1930 లో ఉప్పు సత్యాగ్రహం ఆరంభమయింది. శ్రీమతులు దువ్వూరి సుబ్బమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, పొణకా కనకమ్మ, దుర్గాబాయమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మలతోను శ్రీయుతులు బులుసు సాంబమూర్తి, భోగరాజు పట్టాభి సీతారామయ్య, ప్రకాశంపంతులు, కళావెంకట్రావుల వంటి దేశభక్తులతో, అగ్ర ఆంధ్రనాయకులతో కలసి వుద్యమంలో పాల్గొనగలగటమే కాక, పోటీలుపడి అత్యుత్సాహంతో వుద్యమం నడిపించిన ఘట్టాలు రామసుబ్బమ్మగారు జ్ఞాపకాల పేటికలో అమూల్యంగా దాచుకున్నారు.

1941 లో జరిగిన వ్యక్తిగత సత్యాగ్రహంలో భర్తతోపాటు ఆమె పాల్గొన్నారు. ఆయనను అరెస్టుచేసి జైలుశిక్షవేశారు. కాంగ్రెసు అధ్యక్షులయిన డాక్టరు పట్టాభిగారి ఆదేశానుసారం జైలుకు వెళ్లకుండ ఆమె యివతలనే వుండి యెంతోమందికి జైలు ప్రవేశంకలిగేట్లు కార్యక్రమాలు రూపొందించి సమర్థనీయంగా వుద్యమం నడిపించారు. 1938 డిసెంబరులో ఆమె కాంగ్రెసు తరఫున కడపజిల్లా బోర్డు ప్రసిడెంటుగా ఎన్నికయినారు. ఆపదవికి

భారతదేశం మొత్తంమీద ఎన్నికయిన మొదటి మహిళ ఆమె. 1943 ఆగష్టు 15 వరకు ఆ పదవిని సమర్ధవంతంగా నిర్వహించి ఆంధ్ర మహిళల దక్షతకు మరొక నిదర్శనం కల్పించారు. క్విట్ ఇండియా సందర్భంలో పూజ్య బాపు ఆదేశానుసారం ఆ హోదాను ఆమె త్యజించారు.

ఆంధ్రుల చరిత్రలో ఆంధ్రోద్యమం చాలా ప్రధాన ఘట్టం. దేశవ్యాప్తంగ స్వరాజ్య వుద్యమ ప్రచారంలోకి రాకముందే ఆంధ్రులు తమదంటు ఒక రాష్ట్రం తమకు కావాలని తపించారు. 1918 నాటికే శ్రీమతులు పొణకా కనకమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, ఆచంట రుక్మిణీలక్ష్మీపతి, కంచనపల్లి కనకమ్మలు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, డాక్టరు శ్రీ ఆచంట లక్ష్మీపతి, కాశీనాధుని నాగేశ్వరరావుగార్లు తరచు నెల్లూరులో సమావేశమై తీవ్రచర్చలు జరుపుతు వుండేవారు. ఇంతలో గాంధీ మహాత్ముని స్వాతంత్ర్యసమర పిలుపు వినవచ్చింది. ఆంధ్ర నాయకులు రాష్ట్రంకన్న దేశంముందు అన్న దొడ్డభావంతో జాతీయోద్యమంలో పాల్గొన్నారు. నిరవధికంగా కృషిచేస్తున్నా అవకాశం కలిగినప్పుడు ఆంధ్ర రాష్ట్రం గురించిన ఆలోచనలు జరుపుతునే వున్నారు. శ్రీమతి రామసుబ్బమ్మ, శ్రీ కోటిరెడ్డి పుట్టి పెరిగిన రాయలసీమను ఆనాడు దత్తమండలం అని పిల్చేవారు. అది ఆంధ్రుల పౌరుషానికి తక్కువగా అనిపించిన కారణంగా శ్రీయుతులు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కల్లూరి సుబ్బారావు, కోటిరెడ్డి, నివర్తి మృత్యుంజయశాస్త్రి మరి అనేకులు పాల్గొన్న నంద్యాల రాజకీయ మహాసభలో దత్తమండలాలు అనేపేరు శాశ్వతంగా తొలగించి, రాయలుయేలిన రత్నాలసీమ కావటాన రాయలసీమ అని నామకరణం చేశారు. అదే శాశ్వతమై నిల్చింది. ఆదినుంచి ఆంధ్రోద్యమంతో గట్టి సంబంధం పెట్టుకున్న కారణంగా శ్రీమతి రామసుబ్బమ్మ ఆంధ్ర రాష్ట్రోద్యమానికి ఉపాధ్యక్షులుగా దేశమంతట తిరిగి మహాసభలు యేర్పాటు చేసి ప్రజలలో జాగృతిని కలిగించారు.

ఆమెను ఏకబిగిన 40 సంవత్సరాలపాటు కడప పురపాలక సంఘ సభ్యురాలుగా ఎన్నుకున్నారు. ఆమె యేపదవిలోవున్నా, హోదాలోవున్నా ఆస్థానానికి తమ సామర్థ్యంతో గౌరవం ఆపాదించుతారు. పురపాలక సిబ్బందిలో పాకీవారు ఆఖరు మెట్టుమీద వుంటారు. వారిచేత మురికిచాకిరి చేయించుకోవటంతప్ప, వాళ్ల సౌకర్యాలకోసం యెవరు ఆలోచించరు. కాని శ్రీమతి రామసుబ్బమ్మ పురపాలక సిబ్బందిలోవున్న పాకీ స్త్రీలకు ప్రసవానంతరం నెలరోజులు శలవు పూర్తిజీతంతో యివ్వాలని తీర్మానం ప్రవేశపెట్టి యేకగ్రీవంగ నెగ్గేటట్లు చూశారు.

స్త్రీల అభ్యున్నతిపట్ల ఆమెకు ఆసక్తి యెక్కువ. సమాజంలో స్త్రీలకు కలుగుతున్న అన్యాయాలు, అక్రమాలు స్వయంగా తెలుసుకుని ప్రతిఘటించగలశక్తి స్త్రీలకే కలగాలని, అప్పుడే నిజమైన మార్పు రాగలదని ఆమెనమ్మకం. అందువల్ల

ఆమె మొదటినుంచి స్త్రీలలో చైతన్యం కలిగించటానికి మహిళా సమాజాలను, స్త్రీవిద్యను సాధనాలుగా ఎన్నుకున్నారు. ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సులో ఆంధ్రరాష్ట్ర విభాగానికి అధ్యక్షురాలుగా ఆమె ఆంధ్రదేశమంతా పర్యటించారు. అనేక వూళ్లలో మహిళా సమాజాలను స్థాపించారు. నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను రూపొందించి నిజమైన సంఘసేవ చేయగలిగేట్లు చూశారు. నాటికి నేటికి సంక్షేమ సంస్థలు స్త్రీల స్థితిగతులను మెరుగుపరిచేవిగా వుండాలితప్ప కేవలం కబుర్లు, పేకాటలకు ఆటపట్టు కాకూడదని ఆమె వాదించుతారు. ఆంధ్రరాష్ట్ర స్త్రీల మహాసభలు ఆమె పూనుకుని ఒకసారి చిత్తూరులోను, మరొకసారి 1940లో కడపలోను జరిపించారు. ఆ సందర్భంలోనే కడప మహిళాసమాజం స్థాపించబడింది. కడపలో స్త్రీల కళాశాలస్థాపనకు ప్రధాన పాత్రవహించారు. లక్షరూపాయలు స్వయంగా విరాళం యిచ్చారు. అవసరమైన కృషిచేశారు. ఫలితంగా అప్పటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు కడప రామసుబ్బమ్మా కోటిరెడ్డి ప్రభుత్వ స్త్రీల కళాశాలకు ప్రారంభోత్సవం చేయగలిగారు. అంధులకోసం కడపలో ఒక హైస్కూలు నెలకొల్పటంలోకూడ ఆమెపాత్రయెంతోవున్నది. ఆమె విద్యావ్యాప్తికి చేసేకృషికి నిదర్శనం తొమ్మిది సంవత్సరాలపాటు జిల్లా విద్యాసంఘ సభ్యురాలుగా ఎన్నికకావటం. శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ, ఆంధ్రా యూనివర్సిటీలలో సెనేటుసభ్యురాలుగా వున్నారు.

ఆమె ఆలిండియా సోషల్ వెల్ఫేర్ బోర్డు సభ్యురాలుగా, రాష్ట్ర సంఘ సంక్షేమ సంఘంలో సభ్యులుగా, గిల్డు ఆఫ్ సర్వీస్ అధ్యక్షులుగావున్నారు అని జాబితాయిచ్చేకన్న ఆమె స్వయంగాపూనుకుని వూరూరు తిరిగి రాయలసీమ క్షామనివారణకు ధనరూపేణా, వస్త్రరూపేణ విరాళాలు సేకరించి క్షామపీడితులకు అందించారు. హరిజనసేవ చేశారు, వరకట్న నిషేధానికి పాటుపడ్డారు అనిచెప్పటం చక్కని వివరణ అవుతుంది.

ఉమ్మడి రాష్ట్రకాంగ్రెసు సంఘసభ్యులుగా 20 సంవత్సరాలు పనిచేశారు. అఖిలభారత స్త్రీల కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గసభ్యురాలుగా, ఆంధ్ర రాష్ట్ర సంఘఅధ్యక్షురాలుగా సేవచేశారు. కాంగ్రెసులో అచంచల విశ్వాసంగలవ్యక్తి ఆమె.

ఇటీవల విదేశాలనేకం తిరిగివచ్చారు. కాని యేదేశమేగినా యేపీఠమెక్కినా ఆమె ధ్యాస తెలుగుజాతి, తెలుగు సంస్కృతి, భారతదేశం మీదే వుంటుంది. అందువల్ల ప్రతిచోట వాటినిగురించే ఆమె వినిపించారు. ఆమెకిప్పుడు 77 సంవత్సరాలవయసు. సిరిసంపదలతో తులతూగుతున్న పెద్ద ముత్తయిదువ. కాని యింకా మనం యేమిచేయాలి, యేమిచేయగలం అనే ఆలోచించుతు వుంటారు. బహుముఖ ప్రజ్ఞాశాలి కడప రామసుబ్బమ్మగారు.

---

''సంఘ సేవాధురీణ''

# శ్రీమతి బత్తుల కామాక్షమ్మ

జననం **1886** మరణం **16-12-1970**

శ్రీమతి కామాక్షమ్మ 1886 లో జన్మించారు. రాజమండ్రి ఆమె జన్మస్థలం. శ్రీమతి సీతాయమ్మ, ఉదుత్తు వెంకటరత్నంగార్లు ఆమె తల్లి దండ్రులు. ఆమెకు వివాహం కావటం, వైధవ్యం ప్రాప్తించటం అన్నీ అతిచిన్నవయసు లోనే జరిగిపోయినవి. అప్పటి కామె చదివింది నాలుగో క్లాసు. పద్దెనిమిదేళ్ల వయసులో తను మాతామహులయిన శ్రీ నాళం లక్ష్మీ కాన్తంగారి దగ్గరకు మద్రాసు వెళ్లారు. ఆమె దృష్టి అంతా ఆంధ్ర వాఙ్మయం మీదికి ప్రసరించింది. చదివిన కావ్యం చదవకుండ పుస్తకాలు జీర్ణం చేసుకున్నారు. చిన్ననాటినుంచి దైవభక్తి అధికం. వ్యక్తి గతంగా జరిగిన దుర్ఘటనకు ఆమె నీళ్లు కారిపోలేదు. తన జీవితంలో ఒక సహజ ఘట్టంగా స్వీకరించారు. యాత్రలకు బయలుదేరారు. తీర్థాలలో మునిగారు, అందరు దేవుళ్లను సేవించారు. వివిధ ప్రదేశాలను చూసి రకరకాల మనుష్యులను కలుసుకున్నారు. దురదృష్టవంతులైన స్త్రీల వ్యథలను, సమస్యలను, సునిశితంగా గమనించారు. అంతటితో దేశసేవ, దేశంలోవున్న ప్రజలసేవకూడ ప్రతివారి కర్తవ్యంగ ఆమె భావించు కున్నారు. నాటినుంచి సేవాదీక్ష పూనారు. ఆమె యాత్రలు ఫలించినవి. బహుశ యిటువంటి నిస్వార్థ, విశాలభావాలు కలగటానికే అన్ని మతాలవారు, అన్నిదేశాలవారు తీర్థయాత్రల పేరుతో బయట కాలుపెడతారేమో.



శ్రీమతి బత్తుల కామాక్షమ్మ

ఆమెకు కలిగిన భావాలు, చేయాలని సంకల్పించుకున్న కార్యకలాపాలు రూపుదాల్చినవి. దానకర్ణ బిరుదాంకితులు ఆమె మేనమామ శ్రీ నాళం రామలింగయ్యగారు ''వైశ్యసేవాసదనం'' అనే సంస్థను 1920 లో

రాజమండ్రిలో నెలకొల్పారు. ఆమె గౌరవకార్యదర్శిగా దాని నిర్వహణాభారం వహించారు. హాస్టలుకూడ యేర్పాటు చేశారు. "వైశ్య" శబ్దం పేరులోనేగాని ఆచరణలో లేదు. వయోజనులైన స్త్రీలు అనేకమంది వచ్చి చదువుకునేవారు. తెలుగు సాహిత్య పరీక్షలకు యిక్కడ శిక్షణ యిచ్చేవారు. సుప్రసిద్ధ దేశసేవకురాలు, కవయిత్రి అయిన శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ కూడ కొంతకాలం యిక్కడ చదువుకున్నారు. ప్రముఖ సంఘసేవిక శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మ అనేకమంది స్త్రీలను యిక్కడవుంచి చదివించారు. కాలక్రమాన ఆ సదనం సంస్కృత కళాశాలగా రూపొందింది. విశాలభావాలుగల శ్రీమతి కామాక్షమ్మ వైశ్య శబ్దానికి వ్యుత్పత్తి చెప్పారు. 1931 నాటినుంచి అది ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలగా వాసికెక్కింది. దానికామె గౌరవ ప్రిన్సిపాలు అనేకన్న ఆమెకది సర్వస్వం అనటం సబబు. అహర్నిశలు దాని ధ్యాసే. ఆమెకు అక్కడ ఉభయ భాషాప్రవీణవంటి ప్రాచ్య విద్యలేకాక ఇంగ్లీషు, హిందీ, చిత్రలేఖనం, కుట్లు, సంగీతంవంటి విషయాలలోకూడ శిక్షణనిచ్చి పరీక్షలకు పంపుతున్నారు. కళాశాలకు సంవత్సరానికి 84,000 రూపాయలు ప్రభుత్వ సహకారం లభించుతున్నదంటే దాని ప్రాశస్త్యాన్ని వూహించుకోవచ్చు. అనేకమంది స్త్రీలు ప్రభుత్వ పరీక్షలు నెగ్గి తమ జీవనాధారం తాము చూచుకోగలుగుతున్నారు. తాము మళ్లీ పదిమందికి జ్ఞానభిక్ష పెడుతున్నారు. ఇంత తీరని పనులతోను ఆమె 1929 లోనే ఆంధ్ర యూనివర్సిటీ మొత్తంమీద ద్వితీయులుగా ఉభయ భాషాప్రవీణ పరీక్షలో కృతార్థులైనారు.

ఆమె స్వభావం వివరించాలంటే చాలా సులువు. అతికష్టం. మనోభావాలకు వూహలకు అందుతుంది తప్ప శబ్దాలకు అంత పరిపూర్ణతరాదు. ఆమె ఆంధ్రా యూనివర్సిటీ సెనేట్ మెంబరు. ఎకడమిక్ కౌన్సిలు మెంబరు. బోర్డు ఆఫ్ స్టడీసులో తెలుగు విభాగానికి మెంబరు. స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు కావాలని ఆరంభంలో యూనివర్సిటీ వారిని వొత్తిడిపెట్టిన ఆంధ్రమహిళలలో ఆమె ఒకరు. ఒకేసారి ఉభయ భాషాప్రవీణ, విద్వాన్‌వంటి పెద్దపరీక్షలు వ్రాయటానికి చిన్నప్పటినుంచి క్లాసువారీగా చదవటానికి సందర్భపడని స్త్రీలు భయపడతారు. అందువల్ల కొంతభయం తీరటానికి, వారి శక్తిసామర్థ్యాలు అంచనా వేసుకోవటానికి ఎంట్రెన్సు పరీక్ష వుండితీరాలని, అందువల్ల మళ్లీ ఆ పరీక్షను ఆరంభించమని అలజడి లేవదీసి, చివరకు సాధించగలిగారామె. రాజమండ్రిలో అమ్మాయిలకు హైస్కూలుకోసం కృషిచేసి నెలకొల్పటానికి సహకరించారు. కందుకూరిగారు వీరేశలింగంపంతులు గారు స్థాపించిన శ్రీ గౌతమీ గ్రంథాలయానిని యెంతో వృద్ధిలోకి తెచ్చారు.

సంస్కృత కళాశాలలో అటు విద్యార్థినులకు యిటు అధ్యాపకులకుకూడ చదువు భారమనిపించకుండ విసుగనిపించకుండ చాకచక్యంగ టైంటేబులు ఏర్పాటు చేయగలరు. ఇన్ని నిర్వహించగల ఆమె హాస్టలులో పిల్లలను చుట్టూ చేర్చుకుని ఆడించుతారు పాడించుతారు. వారిలో ఒకరై ఆడతారు. ఉన్నట్లుండి గోపాలకృష్ణుడు చల్దులు తింటున్నాడు రమ్మంటు పిల్లలను ఆరుబయట చుట్టూ కూర్చోపెట్టుకుని శ్రీకృష్ణలీలలు కథలుకథలుగా వినిపించుతు పిల్లలకు స్వయంగా అన్నాలు పెడతారు. ఇదంతావింటు చూస్తువున్న పెద్దవాళ్లు కూడ కూర్చుని చేతులుచాపి ముద్దలు అందుకుంటారు. ఆ దృశ్యసౌందర్యాన్ని, మాతృవాత్సల్యాన్ని వూహించుకోవాలేతప్ప యేమి వర్ణించగలం. పండగలు, పబ్బాలు అమితోత్సాహంతో జరుపుతారు. సభలకు సమావేశాలకు యాత్రలకు, ప్రదర్శనలకు యితర సంస్థలతో జరిగే కార్యక్రమాలకు పిల్లలను స్వయంగా తీసుకువెళ్తారు. ప్రతిపోటీలోను తమ సంస్థవారు పాల్గొనేట్లు ప్రోత్సహించుతారు. గెలిచి బహుమతులు అందుకుంటే వాళ్లకన్న యెక్కువగా మురిసిపోతారు. తనను పదితిట్టినా భరించుతారు కాని యేపరిస్థితిలోను తమ విద్యార్థినులమీద యీగ వాలనివ్వరు. వాళ్లకు రవంత అన్యాయం జరిగినట్లుతోచినా, అది సరిఅయేవరకు పోరాటం సాగించుతారు. అది ఆమెకు సంస్థమీద విద్యార్థినులమీద వున్న మమకారం.

ఆమె స్నేహశీలి. పొరుగూరు వెళ్లే తీరుబడిలేకపోయినా ఒక్కసారి వెళ్లి బంధుమిత్రులు యావన్మందిని పలకరించి వస్తారు. అతిశయం గర్వం, భేషజం యెరగని నమ్రస్వభావం. బహుస్వల్పంగా ఆహారం తీసుకోవటం, విరామం లేకుండ తిరగటమో పనిచేయటమో ఆమెకు అలవాటు. వృద్ధాప్యం వచ్చిన తరువాతకూడ ఆమెతోపాటు నడవలేకపోయేవారు యువతులు. ఆమె హిమాలయ పర్వతాలలో వున్న హరిద్వార్‌నుంచి బ్రహ్మకపాలంవరకు ప్రతిక్షేత్రం కాలినడకన వెళ్లివచ్చారు. ఆమెమనసు యెప్పుడు వుత్సాహంతో పరవళ్లు తొక్కుతువుంటాన అలసటయెరగరు. స్వయంగా ఆటలలో పాల్గొనటమేకాక పెద్దవాళ్లందరిచేత ఆడించుతారు. ప్రతిరోజు బ్రహ్మ ముహూర్తానలేచి హాస్టలు పిల్లలనేకమందిని తీసుకుని గోదావరీ నదికి వెళ్తారు. ఎవరు వూహించని విధంగా ఆమె ప్రవాహంలో పద్మాసనం వేసుకుని ధ్యానంలో నిమగ్నులవుతారు. మరొకప్పుడు పడుకుని ఈదుతూ వెళ్తారు. పిల్లలకు జంకుపోగొట్టి యీతనేర్పుతారు. ఆమె యిన్నివిధాలయిన క్రీడలు వ్యాయామాలు ఆటలలో పాల్గొంటు పలువురు పాల్గొనేట్లు చేస్తారు. కనకనేనేమో అఖిల భారత స్త్రీల స్పోర్ట్సు సంఘానికి వైస్ చైర్మన్‌గా ఆమెను ఎన్నుకున్నారు.

ఆమె రాజమండ్రి మున్సిపల్ కౌన్సిలర్‌గా, గౌరవ మేజస్ట్రేటుగా, యింకా అనేకానేక పదవులలో హోదాలలో వుండేవారు. కాని వీటన్నిటినిమించిన కాలక్షేపం, సరదా ఆమెకు ఒకటి వున్నది. అదే సభలు, సమావేశాలునడపటం, పాల్గొనటం. వాటిద్వారా స్త్రీల సమస్యలను పరిష్కరించాలన్న వుద్దేశం, పరిష్కరించగలమన్న నమ్మకం ఆమెకు అధికం. అందువల్ల 1924 ప్రాంతాలనుంచే తమ మహిళాసేవకు అదొక సాధనంగా స్వీకరించారు. 1924లో గుంటూరులో జరిగిన ఆర్య వైశ్య మహిళాసభకు అధ్యక్షత వహించి విద్య ఆవశ్యకతను, సంఘసంస్కరణ ఆవశ్యకతను ప్రబోధించారు. 1927లో అఖిలాంధ్ర రాష్ట్ర మహిళాసభ కార్యనిర్వాహక వర్గసభ్యులుగా యెన్నికైనారు. నాటినుంచి ఆఖరువరకు ఆ పదవిలో వుండి తత్కాలీన సమస్యలను స్త్రీలకు వివరించుతు, పరిష్కార మార్గాలను బోధించుతు సాంఘిక చైతన్యం కలిగించారు. ఆలిండియా విమెన్స్ కాన్ఫరెన్స్ ప్రారంభమైన నాటినుంచి ప్రతి సమావేశానికి ఆంధ్ర ప్రతినిధిగా హాజరయేవారు. 1927లో జరిగిన నాలుగవ సమావేశానికి ఆంధ్ర ప్రతినిధిగా దరిశి అన్నపూర్ణమ్మగారి తోపాటు బొంబాయి వెళ్లారు. శార్దా చట్ట ఆవశ్యకతను వాడవాడల ప్రచారంచేస్తూ జిల్లా సభలు తాలుకాసభలు అనేకం జరిపించారు. 1936లో భద్రాచలంలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర మహిళాసభకు అధ్యక్షత వహించి అతి సమర్థవంతంగ నిర్వహించారు. అప్పటివరకు ఇంగ్లీషు చదివినవారే ఆ సభలకు అధ్యక్షత వహించేవారు. ఆమె నేర్పుచూసిన మీదట నిర్వాహకుల అభిప్రాయం మారింది. 1946లో నంద్యాలలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర మహాసభ, వస్తు ప్రదర్శనలకు అధ్యక్షత వహించి అమితమైన కౌశలం చూపించారు. ఆమె యే పనికి పూనుకున్నా వుపాయంగ, యెవరిని నొప్పించకుండ నలుగురిని కూడగట్టుకుని అంగబలంతో సులువుగా నెరవేర్చటం అలవాటు. అందువల్ల యెంత భారీయెత్తున జరిగే సభలనైనా పదిమంది మిత్రులను కూర్చుకుని ప్రోత్సహించుతు, వాళ్లను ఆటపాటలలోకిదించి అలసట తెలియకుండ ఎంతో చమత్కారంగ నిర్వహించే వారు. తలంపు కలిగినచోటల్లా ఒక మహిళా సమాజం స్థాపించి, స్థానిక మహిళలను నిర్వహించమని అప్పగించేవారు. ఆవిధంగా వూరూర, వాడవాడల సభలు సమావేశాలు జరపటం, మహిళా సమాజాలు స్థాపించటంతో స్త్రీలలో సాంఘిక చైతన్యం యెంతగానో కలిగించారు. ఎంతమంది సంఘసేవికలనో సంఘసేవాధురీణలనో భావితరానికి సమకూర్చిపెట్టారు. జంకు గొంకు తెలియవు. న్యాయం అనితోచిన పరిస్థితులలో యెవరికిగాని భయపడరు. ఒక సమస్య యెదురైనప్పుడు పరిష్కార మార్గం సూచించటమేకాక నిర్మాణాత్మకంగ స్వయంగా సహకరించి చూపుతారు. ఆర్థికచిక్కులు కారణంగా ఒకప్పుడు

ఆంధ్ర యువతీ కళాశాలను మూసివేయాలన్నారు. కాని ఆమె ఒప్పుకోలేదు. ఇంతమందికి విద్యాభిక్షపెట్టి తద్వారా జీవనోపాధి కల్పించుతున్న సంస్థ మూసివేయుటం అన్యాయం అని ఆమె వాదించారు. తాత్కాలిక సమస్యలను పరిష్కరించటానికి అనువైన పద్ధతులను ఆచరణయోగ్యంగా చూపించారు. ఫలితంగా ఆ సంస్థ నిలబడివుండటమేకాక మూడు పూవులు ఆరు కాయలుగా అభివృద్ధికి వచ్చింది.

వివిధ రంగాలలో ఆమె కృషి, చేసిన సేవ మెచ్చతగినది. ఆమెకు 1929లో ''సంఘసేవాధురీణ'' బిరుదం యిచ్చి గౌరవించారు. మహిళా లోకానికి విద్యా ప్రబోధం చేస్తు సాంఘిక చైతన్యం కలిగించుతు సంవత్సరాల తరబడిగా కృషి చేస్తున్నందుకు సంతృప్తి సూచకంగా డాక్టరు కె.ఎన్. కేసరిగారు గృహలక్ష్మి పత్రిక తరఫున సువర్ణకంకణ ప్రదానం చేశారు. ఆమె చేతిన అది యెప్పుడు మెరుస్తు వుండేది. 1962 మే 28వ తేదీన మద్రాసు ఆంధ్ర మహిళాసభ రజతోత్సవ సందర్భంలో శ్రీమతి కామాక్షమ్మకి రజతఫలకం సమర్పించి సన్మానించారు.

ఆంధ్ర మహిళలు ఆమెను ఆంధ్ర అనిబిసెంటు అంటారు. సంఘ సేవలో ఆరితేరిన నేటి సంఘసేవాధురీణలు సేవారంగంలో ఆమె మా గురువు అని నమస్కరిస్తారు. ఈ చైతన్యస్రవంతి తనచుట్టూ చైతన్యాన్ని విరజిమ్మి 1970 డిశంబరు 16వ 84 సంవత్సరాల వయసులో కీర్తికాయులైనారు.

# శ్రీమతి వేముగంటి పాపాయమ్మ

**జననం 1900**

"మీకు రామరాజ్యం కావాలా" అని ప్రశ్నించారు బాపూజీ. "కావాలి బాపూ తప్పకుండా కావాలి" అన్నారు సభికులు "ఐతేమరి దానికి డబ్బు కావాలి" అన్నారు మోహనదాసు కరమ్ చంద్రశేష్టి. నాలుగు వైపుల నుంచి డబ్బు వర్షం కురిసింది. స్త్రీలదే పెద్దపద్దు. వెర్రి ఆవేశంతో తమ వొంటినవున్న బంగారు సొమ్ములు వొలిచి యిచ్చారు. వారిలో శ్రీమతి వేముగంటి పాపాయమ్మ కూడ వున్నారు. 1921 మార్చిలో గాంధీ మహాత్ముడు స్వరాజ్య సంపాదన యాత్ర చేస్తు, ప్రజలను వుద్బోధించుతు, వుత్తేజితులచేస్తు ఆంధ్రదేశ సంచారం చేశారు. ఆ సమయంలో తూర్పు గోదావరి జిల్లా కాకినాడ కూడ వచ్చారు. శ్రీమతి



శ్రీమతి వేముగంటి పాపాయమ్మ

పాపాయమ్మ తమ గుఱ్ఱపు బగ్గీని అందంగ అలంకరించారు. ఉన్నతాసనం అమర్చి, అందరికి బాగా కనపడేటట్లుగా గాంధీజీని ఆసీనులను చేశారు. బహ్మాండమైన వూరేగింపుతో ప్రజల జయ జయ ధ్వానాల మధ్య బహిరంగసభ జరిపే ప్రదేశం చేరుకున్నారు. అదే యీనాడు గాంధీనగరం అయింది. ఆ కాలంలో ఆంధ్రులకు హిందీ పరిచయం అట్టే లేదు. అందుకని మహాత్ముడు సరళమైన ఇంగ్లీషులో ప్రసంగించారు. భారతీయులు తమ సర్వస్వం అర్పించి, మనస్ఫూర్తిగా వుద్యమంలో పాల్గొన్నప్పుడే రామ రాజ్యం లాంటి స్వరాజ్యం సమకూరుతుందని సభికుల హృదయాంతరాళాలలోనిల్చి పోయేట్లుగా ప్రసంగించారు.

కాకినాడ సమీపానగల వేళంగి అనే వూరిలో కమ్మకుల స్త్రీలందరిని సమావేశపరచి వారందరు తమ అమూల్యాభరణాలను గాంధీజీ నిధికి సమర్పించుకోవటానికి సహకరించారు.

జిల్లాబోర్డు సభ్యులైన మెర్ల సత్యం గారు, ఆయన సోదరులు గాంధీజీని తమ వూరయిన వేళంగికి మరొకసారి రమ్మనికోరారు. గాంధీజీ పరిభాషలో గంట అంటే అరవై నిమిషాలుకాదు. జాతీయోద్యమ నిధికి యిన్ని వేల విరాళం అని అర్థం. అందుకని ఆయన వేయి నూటపదహార్లు యిస్తేవస్తామన్నారు. వచ్చారు. విరాళం తీసుకున్నారు. దీనికంతకీ సంధానకర్తలు సూత్రధారులు సాంబమూర్తిగారు, పాపాయమ్మగారు.

ఆ పర్యటన సందర్భంలో గాంధీజీ రాజమండ్రి సమీపానవున్న సీతానగరం శ్రీ గౌతమీ ఆశ్రమాన్ని తమ అడంగుగా పెట్టుకుని సంచారం చేస్తువుండేవారు. అందువల్ల పాపాయమ్మగారు శ్రీమతి కస్తూర్బా గాంధీకి పనిపాటులలో సహాయంగా, తోడుగా సీతానగరం వెళ్లారు. అక్కడ ఆమెకు బిడ్డలాగ కూడ తిరిగి యేంతో పని సహాయం, మాట సహాయంచేశారు. తిరిగి వచ్చేసేటప్పుడు తాను వడికిన సన్నని నూలువిచ్చెలు, బంగారు గాజులు గాంధీజీకి విరాళం యిచ్చారు. తిరిగి సామర్లకోట స్టేషనులో బాపును దర్శించి, వేలినవున్న రత్నపుటుంగరాన్ని నిధికి సమర్పించి ఆయన ఆశీర్వాదాలతో యిల్లుచేరుకున్నారు. ఆమెకు యివేవి కొత్తకాదు. 1919 నుంచి ఆమె గాంధీజీ శిష్యరికం ఆరంభించారు. జలియన్‌వాలా బాగ్‌లో జరిగిన దారుణ హింసాకాండకు నిరసన సూచకంగా దేశవ్యాప్తంగా ప్రజలను నిరసన వ్రతంపూనమన్న గాంధీజీ ఆదేశానుసారం ఆమె వుపవాసాలుచేశారు.

ఆమె 1900 సంవత్సరంలో కాకినాడ లో జన్మించారు. శ్రీ నేట్రకంటి బిందు మాధవరావు పంతులు శ్రీమతి వెంకటరమణమ్మల కుమార్తె ఆమె. అభం శుభం తెలియని ఐదేళ్ల వయసులో వివాహం జరిగింది. ఎనిమిదవ ఏటనే వైధవ్యం కూడ ప్రాప్తించింది.

1906వ సంవత్సరంలోనే శ్రీమతులు బాలాంత్రపు శేషమాంబ, మాతభూషి చూడమ్మ, పులగుర్త లక్ష్మినరసమ్మలు స్త్రీ విద్యాభివృద్ధి కోసం కాకినాడలో విద్యార్థినీ సమాజంపేర ఒక విద్యాలయం స్థాపించి రిజిస్టరు చేయించారు. అక్కడ ఆంధ్రం, సంస్కృతం సంగీతం వంటివి నేర్పేవారు. స్త్రీల వుపయోగార్థం హిందూసుందరి అనే మాస పత్రికను స్థాపించారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారి పేరుతో ఒక చక్కని గ్రంథాలయం స్థాపించారు. ఆకాలంలో ఆ సంస్థ పేరెన్నికగన్న విద్యాలయం. పాపాయమ్మగారు తమ అన్న శ్రీనివాస కోనేట్రావుగారి ప్రోద్బల ప్రోత్సాహాలతో ఆ విద్యాలయంలో ప్రవేశించారు. సంస్కృతంలో పంచకావ్యాలను చదివారు. ఉభయభాషాప్రవీణ ప్రవేశ పరీక్షలో వుత్తీర్ణులయారు.

ఆ సమయానికి 1923 లో జరగవలసిన కాంగ్రెసు సమావేశాలను కాకినాడలో జరపాలని నాయకులు నిర్ణయించారు. దానికి దేశం నాలుగు మూలలనుంచి అసంఖ్యాకంగా ఆంధ్రేతర దేశ నాయకులు, సభికులు వస్తారు. కాబట్టి వాళ్లతో మాట్లాడటానికి, వాళ్లమాటలు అర్థం చేసుకోవటానికి వీలు అయినంతగా ప్రతివారు హిందీ నేర్చుకోవటం అవసరమని బులుసు సాంబమూర్తిగారు అన్నారు. అందువల్ల విద్యార్థినీ సమాజంలో హిందీ క్లాసులు ఆరంభమయినవి. పాపాయమ్మగారు హిందీ నేర్చుకుని పరీక్షలు నెగ్గి మంచి పాండిత్యం సంపాదించారు.

1923లో కాకినాడ కాంగ్రెసు సమావేశం రానేవచ్చింది. నాటికి నేటికి ఆంధ్రదేశంలో జరిగిన కాంగ్రెసు సమావేశం యిదొక్కటే. కాని ఆ ఘట్టం చరిత్రలో స్వర్ణాక్షరాలతో నిలిచిపోయేట్లుగా జరిపి తరించారు ఆంధ్రులు. నాటి కాకినాడ శోభ ఆంధ్రుల అతిథి సత్కారం కని విని యెరగని అంశంగా నాయకులే అంగీకరించారు. ఆంధ్రదేశం నలువైపులనుంచి పసిబిడ్డలతో సహా హాజరయినారు. ఆంధ్ర మహిళలు, హిందీ సాహిత్య సమ్మేళనం, గొప్ప స్వదేశీ వస్తు, వస్త్ర ప్రదర్శన కూడ జరిగినవి. పాపాయమ్మగారు కాంగ్రెసు సన్మాన సంఘంలోను, వస్తు ప్రదర్శన కమిటీలోను సభ్యులుగా యెన్నికయినారు. శాంతిదళానికి ఒక కెప్టెనుగా, దేశసేవికా సంఘానికి కార్యదర్శినిగా అతి సమర్థవంతంగ పనిచేశారు. శ్రీమతి సరోజినీ నాయుడు అధ్యక్షత వహించిన ఆనాటి సమావేశంలో దేశ బాంధవి దువ్వూరి సుబ్బమ్మ గారిని గురించి శ్రీమతి పాపాయమ్మ హిందీలో ప్రసంగించారు. ఎన్నెన్నో రాష్ట్రాల నుంచి వచ్చిన ఆంధ్రేతర సభికులు దువ్వూరిసుబ్బమ్మ గారి సాహసోపేత చరిత్రను, దేశసేవను తెలుసుకుని సంతోషించి దేశబాంధవికి జయ జయ ధ్వానాలు చేశారు.

శ్రీమతి పాపాయమ్మ కలవారి బిడ్డ. ఆమెకు కావలసినంత తీరిక విశ్రాంతి వుండేవి. ఆంధ్ర, సంస్కృత, హిందీ భాషలలో పండితులు. లక్షణంగా తీరుబాటుగా తమకు యిష్టమైన గ్రంధాలు, పత్రికలు చదువుకుంటు కాలక్షేపం చేయవచ్చు. కాని అది ఆమె స్వభావంకాదు. అందువల్ల చిన్న చిన్న అబ్బాయిలు, అమ్మాయిలకే కాక వయోజన స్త్రీలకు కూడ వుచితంగ తమ యింట్లో హిందీ నేర్పేవారు. పరీక్షలకు పంపేవారు. అట్లాగే స్వయంగ ఆంధ్ర సంస్కృతాలు బోధించి స్త్రీలను నరసాపురం పరీక్షలకు పంపేవారు. ఈ పరీక్షలు నెగ్గిన స్త్రీలు రాజమండ్రి ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలో వుభయ భాషా ప్రవీణ విద్వాన్ పరీక్షలకు చదివి హైస్కూళ్లలో పండితులుగాచేరేవారు. హిందీలోను అంతే. ఆ విధంగ ఆమె అనేక

మంది యువతులను విద్యావంతులను చేశారు. అవసరమైన వారికి గౌరవ ప్రదంగ స్వశక్తిపై ఆధార పడటానికి మార్గంచూపించి అనేక మంది వితంతువులు, పరిత్యక్తలకు ఆత్మగౌరవం పెంపొందించారు.

1932 లో సత్యాగ్రహోద్యమం రెండవ ఘట్టం ప్రతివారిని వుత్తేజపరిచింది. 1930 వుప్పుసత్యాగ్రహంతో ప్రజలకు జంకు తీరిపోయింది. అందరిలోను, ముఖ్యంగా స్త్రీలు బాగా ఆరితేరారు. ఆంధ్ర మహిళలు యిళ్లదగ్గర రాట్నారాణులు. బయట కల్లు సారాదుకాణాల దగ్గర, విదేశీ వస్త్ర దుకాణాలదగ్గర సత్యాగ్రహ సైనికులు. శాంతిసమరం చాలా ఒడుపుగా సాగించేవారు. పాపాయమ్మగారు మహోత్సాహంతో వుద్యమంలో పాల్గొన్నారు. స్వయంగ వుప్పువండి తయారుచేశారు. దానిని బంగారంలాగ అమ్మి కాంగ్రెసు నిధికి విరాళాలు వసూలుచేశారు. సామర్లకోటలో శ్రీమతులు వేదాంతం కమలాదేవి, ఆనందవల్లులతోపాటు బహిరంగ సభల్లో గంభీరోపన్యాసాలనిచ్చారు. ఆమె కుటుంబ సభ్యులందరు నూలువడికేవారు. ఇంటి ఆవరణలోనే మగ్గాలమీద నేయించి కట్టుకునేవారు. గాంధిమహాత్ముడితో వ్యక్తిగత పరిచయం వున్నది. సభలు సమావేశాలకు హాజరయేవారు పాపాయమ్మగారు. 1919 నుంచిజాతీయోద్యమంలో పాల్గొని గాంధీజీ శిష్యరికం చేసినా పెద్దలు వారించలేదు. కాని యీనా వుద్రిక్త పరిస్థితులలో ఆమె యింకా తీవ్రంగ సత్యాగ్రహం చేస్తే, పికెటింగులుచేస్తే వుపన్యాసాలిచ్చి ప్రబోధించితే, అరెస్టుకాగల అవకాశం వున్నది. అది వారికి అంతగా రుచించలేదు. అందువల్ల మద్రాసువెళ్లి అక్కడ శ్రీ శారదా విద్యాలయంలో చదువుకోమని నచ్చచెప్పి కాకినాడనుండి మద్రాసు దాటేశారు.

ఆమె మద్రాసువెళ్లి చదువు ఆరంభించారు. అది కొనసాగుతునే వుప్పది. శ్రీమతులు కృష్ణాబాయి, జానమ్మాళ్‌లు మద్రాసులో అమోఘమైన కృషి చేస్తున్నారు. ఒకజాతి పిట్టలన్నీ ఒక చెట్టుమీదకు చేరినట్లు వీరితో ఆమెకు గాఢమైత్రి యేర్పడింది. అందరుకలసి విదేశవస్త్ర దుకాణాలదగ్గర పికెటింగు చేసేవారు. అంతటితో తృప్తి కలగలేదు. శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి స్థాపించిన యూత్‌లీగ్ మె బర్లుగా స్వదేశీవస్తువులు, ఖాదీ బట్టలు అమ్ముతూ వూళ్లో పేటలన్నీ కలతిరిగేవారు. నూలువడకటం పోటీలు జరిగేవి. తకిలీమీద, రాట్నంమీద నాజూకైన గట్టి నూలువడికి ఆమె వెండి కుంకుమభరిణె ప్రథమ బహుమానం పొందారు. ఆ సమయంలోనే శ్రీమతి కస్తూర్బా గాంధీ మద్రాసు వచ్చారు. పాపాయమ్మగారిని గుర్తించి మాట్లాడి, ఫోటోలుకూడ తీయించుకున్నారు.

తిరిగి కాకినాడ చేరుకున్నారు. ఆమె యథాప్రకార సిద్ధిరస్తు అని మళ్లీ సత్యాగ్రహోద్యమ కార్యకలాపాలలో ప్రవేశించారు. శ్రీమతులు వేములకొండ తాయారమ్మ, కమలా సీతమ్మలతో కలిసి పికెటింగులు జరిపారు. జైళ్లు నిండి 'స్థలంలేదు' బోర్డులుతగిలించుకున్నవి. అందువల్ల ప్రభుత్వం అరెస్టులు చేయటం కొంతవరకు తగ్గించటంతో ఆమె అరెస్టుకాలేదు.

1938లో గాంధీజీ జయంతి సందర్భంగా ఆమె తన మిత్రులైన శ్రీమతులు ఎ. సత్యావతి, వి. సుభద్రమ్మలను జతకూర్చుకుని వారం రోజుల పాటు ఇంటింటికి తిరిగి ఖాదీ అమ్మకం జరిపారు. దానివల్ల ఖాదీ బోర్డుకు చాలా లాభాలు వచ్చినవి. అట్లా వాళ్లు వరసగా రెండు మూడేళ్లు చేశారు. వాళ్ల కృషికి సంతోషించి డాక్టరు పట్టాభిగారు విడివిడిగా వాళ్లకు ప్రశంసా పత్రాలు పంపుతు అభినందించారు.

ఆమె యెప్పుడు యేదో ఒక పనిచేస్తూ వుంటారు. అందులోను ఆ పని సంఘానికో సమాజానికో సంబంధించినదై వుండాలి. జిల్లా బోర్డు మెంబరు కావటానికి మున్సిపల్ కౌన్సిలర్ కావటానికి యింతకన్న అర్హతలు యింకేమి కావాలి ? అందువల్ల 1931లోనే ఆమెను ఆ రెండు స్థానాల్లోను నామినేట్ చేశారు. ఆమె సేవానిరతికి, దీక్షకు, కార్యదక్షతకుమెచ్చి పదేపదే ఏకబిగిన 35 సంవత్సరాలపాటు ఆ హోదాలకు ఎన్నుకుని కాకినాడ పౌరులు ఆమెపట్ల తమకుగల నమ్మకాన్ని వెల్లడించారు. ఆ సమయంలో ఆమె ఆడపిల్లలకు కాకినాడలో ప్రత్యేక హైస్కూల్ నెలకొల్పటానికి చాలాకృషిచేశారు. భవననిర్మాణ కమిటీలో సభ్యురాలుగావుండి విరాళాలు సేకరించారు. అన్నవరంలో ఎగ్జిబిషన్ నడిపే నిమిత్తం ధనసహాయం చేయించారు. పేదపిల్లలకు వాత్సల్యంతో బట్టలు యిప్పించారు.

కాకినాడలో 1932 లో నుంచి హరిజన హాస్టలువున్నది. తొలి దశలో సుప్రసిద్ధ దేశసేవిక జయంతి సూరమ్మగారి కుమార్తె కరుణమ్మగారు, ఆమెభర్త గరిమెళ్ల సత్యవీరభద్రరావుగారు కార్యదర్శులుగా వుండేవారు. క్రమంగా 1977లో అది ప్రభుత్వ నిర్వహణ కిందకు వచ్చింది. స్త్రీల సంక్షేమ పథకం కింద గ్రంథాలయం,మిషనుకుట్టు, ఎంబ్రాయిడరీ కుట్టు క్లాసులు, టైపు క్లాసులు నడుపుతున్నారు. ఆరంభంనుంచి దానికి శ్రీమతి పాపాయమ్మ కమిటీమెంబరుగా వుంటున్నారు. ఎన్నిరకాల కార్యక్రమాలు జరుగుతున్నా ఆమె మాత్రం స్వయంగా పూనుకుని హాస్టలు వాళ్లచేత నిత్యం నూలు వడికించుతారు,

ఆమె చదువుకున్న విద్యార్థినీ సమాజానికి 14వ యేట నుంచే కమిటీ మెంబరుగా వుండేవారు. చివరకు 1939లో కార్యదర్శినిగా సంస్థ భారం వహించారు. అనాటినుంచి దాని అభివృద్ధికి పాటుపడుతున్నారు. సంస్కృత, ఆంధ్ర, హిందీభాషలు, సంగీతం పరీక్షలకు తయారుచేసి పంపుతున్నారు. కుట్లు, నవారునేతవంటి చేతిపనులు నేర్పుతున్నారు. హిందూ సుందరి పత్రికలో విద్యావిషయకమైన విషయాలనుచేర్చి అటు పత్రికస్థాయికి, యిటు విద్యార్థులకు తోడ్పడ్డారు. రాజ్యలక్ష్మి గ్రంథాలయాన్ని ఎంతో అభివృద్ధికి తెచ్చారు. కేంద్ర సంఘ సంక్షేమ సమితివారి విరాళంతో దుర్గా లేడీస్ క్లబ్ భవనం ఆరంభించారు. కాని ధరలు పెరగటంతో అది కప్పువరకు తయారయి నిల్చిపోయింది. దానిని పూర్తిచేయుటమే ఆమె కిప్పుడొక సమస్యగా తయారయింది.

పాతికేళ్ళ వయసులో గాంధీజీ ఆగమన సందర్భంలో చూపిన వుత్సాహం 55వ యేట నిర్వహించిన భారతసేవక సంఘ శిబిర నిర్వాహణలో చూపించారు. అదేమోతాదులో 79వ ఏట పురాణశ్రవణ కమిటీ అధ్యక్షులుగ చూపుతున్నారు. ఆమె కార్యదక్షత, సేవానిరతి, వుత్సాహం అటువంటివి. వాటికి యేవి అడ్డురావు. వేముగంటి పాపాయమ్మగారిని చూస్తుంటే "ప్రారబ్ధార్థము లుజ్జగింప రుసుమీ ప్రజ్ఞానిధుల్కావునన్" అన్నభర్తృహరి పద్యం జ్ఞాపకం వస్తుంది.

# శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మ

**జననం 1907** **మరణం 28-11-1931**

"ఆయన బాగా చదువుకున్నారు. విదేశాలలోనే జాతీయాభిమానంతో దేశసేవచేశారు. నాలుగున్నర సంవత్సరాలు జైలుకుకూడవెళ్ళి శిక్షలనుభవించారు. ఎన్నో సంస్కారభావాలు గలవారు. ఆయన్ను చేసుకుంటే నేనుకూడ దేశసేవ చేయవచ్చు. ఇంకా బాగా చదువుకుంటాను. ఎట్లాగయినా ఆయన నన్ను పెండ్లి చేసుకోవటానికి ఒప్పుకునేట్లు చూడండి" అని 14 సంవత్సరాలైనా నిండని ఒక అమ్మాయి మద్రాసు అడయారులోని థియొసాఫికల్ సొసైటీలో తమ కుటుంబ మిత్రులైన పెద్దలతో అంటున్నది. నేను ఆయన్నే వివాహం చేసుకుంటానని అనటం చాలా పాతకాలపు మాట. దమయంతి, రుక్మిణివంటి పురాణ స్త్రీలే అన్నారు. పక్షులతోను, మనుష్యులతోను తాము కోరుకున్న పురుషుడికి రాయబారాలుకూడ సంపించారు ఆ గడుసరి అమ్మాయిలు. కాని ఆయన అర్ధాంగినయి దేశసేవచేస్తానంటు వుబలాటపడి, పెద్దల సహకారం అభిలషించింది బహుశా ఈ అమ్మాయి శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మ ఒక్కతేనేమో.



శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మ

ఆమె అంతగా కోరుకున్న దరిశి చెంచయ్యగారు కనిగిరిలో ఒక పేద వైశ్యకుటుంబంలో జన్మించారు. విద్యావంతులు, సంస్కారప్రియులు, ధైర్య సాహసోపేతులు తమ కులంలోనూ వున్నారని లోకానికి నిరూపించాలని చిన్ననాటి నుంచి ఆయనకొక తీవ్ర సంకల్పం వుండేది. ఎంతో కష్టపడి యెన్నెన్నో సమస్య లను యెదుర్కొని మద్రాసులో ఇంటరు చదివి, అగ్రికల్చరల్ బి.యస్‌సి., చదవటానికి అమెరికా వెళ్ళారు. అక్కడ అది ముగించారు. ఆ రోజుల్లో

1914లో మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్నది. అమెరికాలో లాలాహరదయాల్ నాయకత్వాన బ్రిటిష్ ప్రభుత్వవ్యతిరేకాభిప్రాయాలతో గదర్‌పార్టీ స్థాపించబడింది. చెంచయ్యగారు కూడ సభ్యులుగాచేరారు. దేశభక్తి అంతా తమసొత్తేనన్నభావం ప్రతిమాటలోను ఆ పార్టీ సభ్యులయిన పంజాబీ యువకులు ప్రదర్శించేవారు. ఆయనకది అసహ్యకరంగాతోచేది. బెంగాలీ తమిళ మొదలయిన యువకులను కూడగట్టుకుని దేశభక్తి అందరికీ వుంటుంది. బ్రిటిష్ సేనలో మొదట పేరిచ్చిచేరి విదేశాలలో యుద్ధాలుచేస్తున్న పంజాబీలు అంతగా గర్వించవలసిన అవసరం యేమిలేదని నిర్భయంగ వాదించారు. ఆనాటి నుంచి గదర్‌పార్టీలో ఆయనకు పలుకుబడి, గౌరవంఎక్కువయి చివరకు స్వదేశం తిరిగివస్తుండగానే, నడిదోవలో అరెస్టుచేసి బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను రాజద్రోహిగా నాలుగున్నర సంవత్సరాలు భారతదేశపు జైళ్లలోవుంచారు. ఆయన ప్రభుత్వాన్ని, జైలు అధికారులను పెట్టిన తిప్పలు తలుచుకుంటె యింతటి సాహసోపేతుని పేరు గదర్‌పార్టీగురించి వ్రాసిన యేచరిత కారులుగాని, చివరకు ఆంధ్రులు కూడ యెందుకు విశదంగా పేర్కొనరా అని ఆశ్చర్యం, బాధకలుగుతుంది.

భర్త వుద్యోగరీత్యా గుంటూరులోవున్న సమయంలో ఆమె శారదా నికేతనంలో చేరి తెలుగు సంస్కృతభాషల్లో మంచిపాండిత్యం సంపాదించారు. ఉత్తమసంస్కృత కావ్యాలన్నీ పండితుల దగ్గరచదువుకోగలఅవకాశం కలిగినందుకు యెంతోసంతోషించేవారు. పుస్తకంలో విషయాలే కాక యెన్నిటిని గురించో ఆలోచించుతూ వుండేవారు. ఆ చిన్నవయసులోనే ఆమెకు సంఘంలో యెన్నోదురా చారాలు మరెన్నోమూఢాచారాలు కనిపించేవి. జాతీయాభిమానంహెచ్చుకావటాన రాజకీయాలలోను కొత్తభావాలు స్ఫురించుతువుండేవి. అందువల్ల తోటి విద్యార్థినులనుచేర్చి సాంఘికరాజకీయ ధార్మిక విషయాల మీద చర్చలు గోష్ఠులు జరుపుతువుండేవారు. నదురు బెదురులేకుండ తన నిశ్చితాభిప్రాయాలను తీవ్రంగ వుపన్యాస ధోరణిలో వెల్లడించేవారు. విద్యార్థినులందరికి కూడ యీవిధానం చాలామేలుచేసింది. సంస్కార భావాలు గల మంచివ్యక్తిగా ఉన్ననవదంపతులు ఆమెను అభిమానించేవారు.

బళ్లారి ఆమె జన్మస్థలం. 1907 లో జన్మించారు. ఆమెకొక అన్న, ఒక చెల్లెలు. దైవభక్తి ఆధ్యాత్మిక చింతనగల కుటుంబంవారిది. తండ్రి రొట్టగల్ నీలప్పగారు చిన్నవయసులోనె మరణించారు. తల్లి శ్రీమతి గౌరమ్మగారు భర్తమరణించిన దుఃఖంతో కుంగిపోతుంటే బంధువులు ఆవూళ్లోవున్న మైత్రేయి దివ్యజ్ఞాన మహిళా సమాజంలో చేర్చారు. ఆ సమాజ సభలు సమావేశాలు కారణంగా ఆమె మద్రాసు అడయారు

వస్తూ వుండేవారు. ఆ కారణంగా అన్నపూర్ణమ్మగారికి అడయారు థియొసాఫికల్ సొసైటీలో చదువుకునే అవకాశం లభించింది. పుటకతో ఆమెలో వున్నదయ, జాలి, ఆధ్యాత్మిక చింతనలకు హేతువాదం, సంస్కారభావాలు జతకలిసినవి.

అర్ధశతాబ్దం కిందట మన సంఘం యీనాడు వున్నట్లు వుండేదికాదు. అతిబాల్యవివాహాలు, ఫలితంగాబాలవితంతువులు. అసలే స్త్రీవిద్యకు అవకాశంలేదు. అందులో ఆమె పుట్టిన ఆర్యవైశ్యకులంలో బొత్తిగా అవకాశంలేదు. ఇన్ని అనర్థాలకు మూలకారణం బాల్యవివాహాలు కాబట్టి ముందు వాటిని అరికట్టాలని ఆమె తేల్చుకున్నారు. ఎటువంటి పరిస్థితులేర్పడినా తనచెల్లెలికి వున్నత విద్యావకాశాలు ముందుకలిగించి ఆ తరవాతనే వివాహం చేసేట్లుగా తల్లిని ఒప్పించారు. అట్లాగే ఎం.ఎ.,బి.యిడి., అయిన తరువాతనే వివాహంచేశారు. అందరికి అటువంటి వుద్దేశాలు వుండి వుండవచ్చుకాని సంఘ భయం. సంఘం బహిష్కరించిందంటే పురోహితులు పౌరోహిత్యంచేయరు. చాకళ్లు బట్టలు వుతకరు. ఏ పనులు చేసేవారూ సహకరించరు. ఒక్కసారి ధైర్యంచేసి నిలబడి సంఘాన్ని యెదిరించాలని క్రమేపిమార్పు తీసుకురావాలని ఆమె నిశ్చయించుకున్నారు.

ఒక ధనిక కుటుంబంలో అమ్మాయికి సంబంధాలు చూస్తూవుండగానే అటువంటి పరిస్థితి యేర్పడింది. తల్లి దండ్రులు భయంతో దిగులుతో మంచం పట్టడం చూసి ఆమె ఆ అమ్మాయికి వివాహం చేసే బాధ్యత తనపైన పెట్టుకున్నారు. తండ్రి లేని ఒక పేదకుఱ్ఱవాడితో వైభవంగ వివాహం జరిపించారు. ముందు జంకుతో యిష్టపడకపోయినా పిల్ల వాడి తల్లి ఆ అమ్మాయి అందచందాలను, సిరి సంపదలను చూసి తృప్తిపడింది. ప్రతి వాళ్లు చాటుగా తమలో తాము సంతోషించారు తప్ప ప్రళయం రాలేదు.

అంతటితో ఆమెకు ధైర్యం పుంజుకున్నది. భర్త వూహాలలో మెదులుతున్న బాల వితంతు వివాహాలను కూడ జరిపించి చూడాలనుకున్నారు. అప్పటికే రాజమండ్రిలో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు దంపతులు, గుంటూరులో ఉన్నవ దంపతులు పూనుకుని అనేక పునర్వివాహాలు చేశారు. కాని అప్పటికింకా ఆర్యవైశ్యకులంలోను తదితర కులాలలోను జరగలేదు. 1926లో గుంటూరులో, అన్నపూర్ణమ్మగారు ఆమె భర్త పూనుకుని తమ కులానికి చెందిన ఒక 12 సంవత్సరాల బొమ్మ లాంటి బాల వితంతువుకు వైభవంగ వివాహం జరిపించారు. పెండ్లి వేడుకలలో అదొక భాగంగాను ఆ వుద్యమానికి తగిన ప్రచారం వుంటుదన్న నమ్మకంతోను మేళ

తాళాలతో పెద్ద వూరేగింపు చేశారు. వేల కొద్ది ప్రేక్షకులు ఆ మహా విడ్డూరాన్ని చూడటానికి గుమికూడారు. ఇంతలో ఒక ముఠా పిచ్చికేకలు వేస్తు, వెర్రి మాటలు అంటు అల్లరిచేయటమేకాక, రాళ్ల వాన కురిపించ సాగారు. అప్పటికి పద్దెనిమిదేళ్ల వయసుగల శ్రీమతి అన్నపూర్ణమ్మ వూరేగింపులో ముందుకు వచ్చి ''మరేమీ ఫరవా లేదు. ముందుకు సాగి పొండి, రాళ్ల వానలు, మాటల జల్లులు అవే నిర్చి పోతయ్య''ని ధైర్యం చెప్పారు. అట్లాగే అంతా సవ్యంగా జరిగింది.

దైవికమే కావచ్చు, ముఠానాయకత్వం వహించి అల్లరి చేయించిన ఆయన ఏకైక సంతానమైన అమ్మాయి వితంతువయింది. అంతటితో ఆయన దృక్పథం మారిపోయింది. శ్రీమతి అన్నపూర్ణమ్మని తన కూతురు జీవితానికీ వెలుగు చూపమని ప్రాధేయ పడ్డారు. అదృష్టం బాగుండి ఆమె ప్రయత్నం ఫలించి, మంచి సంబంధమే కుదిరింది. నిర్విఘ్నంగా పెళ్లి జరిగిపోయి ఆ అమ్మాయి జీవితం కలకలలాడింది. ఇవన్నీ చూసిన కొందరికి అసూయ కావచ్చు, సనాతనాచారాల పట్ల అభిమానమే కావచ్చు. శ్రీ చెంచయ్య శ్రీమతి అన్నపూర్ణమ్మ గుంటూరులో అద్దెకుంటున్న యింటి గోడమీద గుమ్మడి కాయలంత అక్షరాలతో వితంతువులకు పునర్వివాహం చేసే దరిశి చెంచయ్యగారి యిల్లు యిదేఅని అర్థం వచ్చేట్లుగా అచ్చ తెలుగు పదజాలంతో వ్రాశారు. ఆ దంపతులు అవతలవారి అవివేకానికి నవ్వుకుని ఆ వ్రాతలు అట్లాగే వుంచారు. ఈ విధంగా కొన్ని వివాహాలు తమ కులంలో జరిపించిన తరువాత ఆ దంపతులు యితర కులాలయిన కమ్మ, విశ్వబ్రాహ్మణ మొదలైన వారిలో కూడ చేయించారు. ప్రతి పునర్వివాహ సమయంలోను ఆమె అత్యుత్సాహంతో కుంకుమ భరిణ తీసుకుని స్త్రీలందరిని పసుపు కుంకుమలకు భోజనాదులకు ఆహ్వానించి వచ్చేవారు. దగ్గరుండి అన్ని వేడుకలు సలక్షణంగా జరిపించేవారు. అట్లా పదిహేను పైచిలుకు వివాహాలు జరిపించారు. ముందు విద్య నభ్యసించి వివేక వంతులయితే తమ బాగోగులను యేనాటికయినా స్వయంగా నిర్ణయించు కోగలరన్న అభిప్రాయంతో యెంతో మంది బాల వితంతువులను రాజమండ్రి వైశ్య సేవా సదనానికి మద్రాసులో సర్ ముత్తా వెంకట సుబ్బారావు, ఆయన భార్య స్థాపించి నిర్వహించుతున్న సేవాసదనానికి పంపించి చదివించారు. తమ సహాయం కోరి వచ్చిన బాల వితంతువులను జాతి, కుల, మత వ్యత్యాసం లేకుండ అత్యంత అభిమానంతో తగిన సంబంధం కుదిర్చి వివాహమయేవరకు సంరక్షించే వారు.

ఆమె ఖాదీ ధారిణి. గాంధీమహాత్ముడంటే ఎనలేని భక్తి. భగవదంశ సంభూతుడన్న నమ్మకం. పతితలను వుద్ధరించటానికి పూనుకున్న పురుషోత్తము

డని భావన. సహపంక్తి భోజనాలు, వర్ణాంతర వివాహాలు, కులం అడ్డుగోడలు లేని విశాల హిందూ సంఘం ఆమె వాంఛించేవారు. పిల్లులను, కుక్కలను ఆదరించుతాము కాని, తోటివారయిన హరిజనులను దూరంగా వుంచాలను కోవటం యేమి న్యాయం అని బాధపడేవారు. ఒకహరిజన బాలుడిని తెచ్చి కన్న బిడ్డకన్న వాత్సల్యంతో పెంచారు. పాప పంకిలంలో కూరుకుపోయి దయనీయ జీవితాలను గడిపే దేవదాసీలంటే గాంధీమహాత్ముడికి చెప్పలేని జాలి. వారి వుద్ధరణకు ఆయన పాటుపడటం చూసిన ఆమె స్వయంగా ఆ సేవలో నిమగ్నులయినారు. ఎంతో సాహసంతో పాపకూపాలయిన వ్యభిచారిణుల యిళ్లకు వెళ్లి వారిని చక్కగా వివాహం చేసుకుని గౌరవ ప్రదంగా గృహిణులై సంఘంలో జీవించమని ప్రబోధించేవారు. ఆమె మాటలువిని కొంత మంది తమ కూతుళ్లకు వివాహాలుచేసి మామూలు గృహస్థ జీవితాలను గడిపేట్లు చేశారు. వేశ్యావృత్తిలోకి దించపోతున్న కొంతమంది అమ్మాయిలను ఆమె ఆదుకుని తమయింటికి తెచ్చి వారికి చదువు చెప్పించి పెండ్లి చేసుకునేట్లు వొప్పించి పాటుపడ్డారు. తమ యింటికి వచ్చిన ప్రతివారిని వావివరసలు పెట్టి పిలుస్తు అరమరిక లేకుండ ఆదరించగల అపర అన్నపూర్ణ ఆమె.

భర్త వుద్యోగరీత్యా విజయవాడలో వుంటున్నప్పుడు సుప్రసిద్ధ సంఘ సేవిక అయిన శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మతో కలిసి ఎన్నో మహిళా సంఘాలు స్థాపించి, మహిళా సమావేశాలు జరిపి మహిళాభ్యుదయానికి పాటు పడుతు వుండేవారు. ఒకనాడు రైవసు కాలువవొడ్డున నడిచివస్తున్న వీళ్లు అప్పుడే పుట్టిన పసికందును యెవరో గొంతునులిమి చంపి అక్కడ పారవేయగా చుట్టూర కాకులు గద్దలు కవ్వాట్లాడటం చూసి గుండెలు చెదిరిపోయి పెద్దగా యేడుస్తు యిల్లుచేరుకున్నారు. ఫలితంగా రాజేశ్వరమ్మగారి యింటి ఆవరణలో వున్న ఔట్ హౌసులో ఆర్రాత్రికిరాత్రి ఒక అనాథ శిశు శరణా లయం వెలిసింది. పరిస్థితులకులోనై తమ అవాంఛనీయ సంతానాన్ని బాహాటంగా పెంచటానికి సాధ్యపడనివారు బిడ్డలను అక్కడ కని యిచ్చి వెళ్లేవారు. డాక్టరు రంగనాయకమ్మగారు వీరికి చాలా సహకరించి వైద్య సహాయం అందించేవారు. అట్లాంటి బిడ్డలు దాదాపు 60 మందిని వీళ్ళు ఆదుకుని కాపాడి జాగ్రతగా పెంచుకోగల దంపతులకు దత్తత యిచ్చారు.

1929 లో బొంబాయిలో జరిగిన అఖిలభారత మహిళా సమాఖ్యకు ఆంధ్రదేశ ప్రతినిధులుగా యీమెను, శ్రీమతి బత్తుల కామాక్షమ్మను మరి ఒకరిని పంపించారు. దానిలో ప్రధాన చర్చాంశమైన శార్దా చట్ట సమర్థనం

పైన ఆమె అమూల్య అభిప్రాయాలు లోక విదితమే. మహిళలకు వుపకరించేవి, న్యాయంకలిగించేవి, యేదివిన్నా చూసినా ఆమె సంతోషం పట్టలేరు. వాటిని ప్రశంశించుతు ఆవశ్యకతను వివరించుతు పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాసేవారు. బొంబాయిలో మాంటిసోరీ స్కూలు చూసిన ఆమె పరవశించారు. అక్షరం ముక్కరాని గృహిణి అజ్ఞానంతో అశక్తతతో, పురుషుల సహాయ నిరాకణతో నలుగురైదుగురు బిడ్డలను పెంచలేక సతమతం అవుతు వుంటుంది. గుళ్లు గోపురాలు కట్టించే ధనవంతులు యిటువంటి మాంటిసోరీ స్కూళ్లు స్థాపించి స్త్రీలను ఆదుకోరాదా అని అడుగుతారు. ప్రతి మునిసిపాలిటీ సంఘం ఒక శిశు పోషణాలయం నిర్వహించి పేద పిల్లల స్నానపానాదుల నిర్వహణా భారం వహించకూడదా అని వ్యధ పడతారు. అర్ధ శతాబ్దం తరువాత కూడ ఆమె కోరిక తీరటంలేదు. సంఘంలో దురాచారాలను ఎత్తి చూపుతు పత్రికలలో యెన్నో కథలు వ్రాశారు. దురాచారాలను ఖండించుతు వ్యాసాలు వ్రాశారు. దేశసేవ చేయమని వుద్బోధించుతు వ్రాసేవారు. ప్రసగించేవారు. భార్యనియేమి తెలియని వ్యర్థజీవిగా భావించుతు పురుషుడు తన ఆధిక్యత ప్రదర్శించుకుంటు యే వుద్యమము కొనసాగించినా అది సఫలం కాదని ఆమె తీవ్రంగ వాదించేవారు. అన్నీ విపులపరచి తగిన శిక్షణనిచ్చి తన అర్ధాంగిగా భావించితే, యే సంస్కరణాభిలాషిగాని, దేశసేవకుడుకాని తనకు తన భార్య సహకారం బొత్తిగాలేదని వాపోవలసిన సందర్భంరాదని ఆమె గట్టినమ్మకం. శ్రీమతి అన్నపూర్ణమ్మ శ్రీ చెంచయ్యలు యిన్నిరంగాలలో యింత విజయవంతంగ కృషిచేసి సఫలత సాధించారు. కాబట్టి ఆమె మాట అందరూ ఒప్పుకోవాలి. బందరులో దిగ్విజయంగా ఒక పునర్వివాహం జరిపించి మద్రాసు వచ్చినయామె మరి నాలుగు రోజులకు 1931 నవంబరు 28 న గుండెపోటుతో కన్ను మూశారు. దేశంలోని శిశువుల సంక్షేమంకోసం పరితపించిన ఆమె, వూళ్లోవారి పునర్వివాహాలకు యింటింటికి వెళ్లి పిలిచి వచ్చిన ఆమె, తన ఐదేళ్ల పెద్దమ్మాయి ఎనిమిది నెలల చిన్నమ్మాయిల ముద్దు ముచ్చట్లు చూడకుండానే కన్ను మూశారు. ఆమె జీవించింది కేవలం పాతిక సంవత్సరాలే కాని చేసిన సంఘసంస్కరణ, మహిళాసేవ ఒక శతాబ్దానికి సరిపడ చేసి ఆదర్శప్రాయులైనారు.

---

# శ్రీమతి మాసుమా బేగం

**జననం 7-10-1901**

విశాల నేత్రాలు, సాత్వికత వుట్టిపడే ముఖం, సౌమ్యత జాలువారే కంఠధ్వని ఆత్మీయత తొణికిసలాడేమాట, తెల్లని శరీరఛాయలే అలంకారాలుగా అతి నిరాడంబరంగా కనిపించే శ్రీమతి మాసుమా బేగంని యెరగనివాళ్ళు హైదరాబాదులో వుండరు. స్కౌటు, గరల్‌గైడ్ విభాగాలలో పరిచయంవున్న విద్యార్థులు, అంజుమనే ఖావాతీన్, మహబూబియా స్కూలు విద్యార్థినులు, రెడ్ క్రాసు సంఘం, ఆలిండియా విమెన్సు కాన్ఫరెన్సు, సంఘ సంక్షేమసభలు సమావేశాలతో యేపాటి పరిచయంవున్న వారయినా ఆమెను తరుచు చూస్తు, ఆమె మాటలు వింటూనే వుంటారు. భారతదేశం మొత్తంమీద మంత్రి హోదా నలంకరించిన ప్రథమ ముస్లిం స్త్రీ కావటాన ఆంధ్రులేకాక భారతీయులందరు ఆమెను గౌరవించుతారు.



శ్రీమతి మాసుమా బేగం

ఆమె 1901 అక్టోబరు 7న హైదరాబాదులో జన్మించారు. శ్రీమతి తయ్యబాబేగం బిల్‌గ్రామి, డాక్టరు ఖదీవ్‌జంగుగార్ల ప్రథమ సంతానం. ఆమెకు ఇద్దరు చెల్లెళ్లు వున్నారు. ఈజిప్టుకు భారతదేశ ప్రతినిధిగా, మహారాష్ట్ర గవర్నరుగా సత్కీర్తిపొందిన శ్రీ ఆలీయవార్‌జంగ్ ఆమె ఏకైక సోదరుడు. గుజరాత్ గవర్నరుగావున్న శ్రీ మెహదీనవాజ్‌జంగు ఆమె మేనమామ. తల్లి ప్రథమ గురువుకావటం సర్వసాధారణం. కాని అతి ప్రతిభావంతమైన తల్లి వ్యక్తిత్వం శ్రీమతి మాసుమాబేగం జీవితంతో అల్లుకుపోయింది. అందువల్ల తల్లి శ్రీమతి తయ్యబాబేగం జీవిత విశేషాలు, స్వభావం తెలుసుకోకుండా యీమెను గురించి తెలుసుకోలేము. శ్రీమతి తయ్యబాబేగం హైదరాబాదులోపుట్టి పెరిగింది.

ఆమె చదువుకోవటానికి పెద్దలు స్థాపించిన లిటిల్ గరల్స్‌స్కూలు క్రమంగా పెరిగి, ఈనాడు ఉస్మానియా స్త్రీల కళాశాల అయింది. చట్టాపట్టాలు వేసుకుని పసితనాన అక్కడకలసి చదువుకున్న శ్రీమతి తయ్యబాబేగం, శ్రీమతి సరోజిని నాయుడు గాఢమైత్రితో ప్రగతిపథాన నడిచారు. శ్రీమతి తయ్యబాబేగం పరదా పాటించుతు ప్రైవేటుగా చదివి, పిల్లలతల్లి అయి, మద్రాసు యూనివర్సిటీ పట్టభద్ర అయింది. అంటే భారతదేశంలో మొదటి ముస్లిం స్త్రీ గ్రాడ్యుయేటు. ఆ తరువాత ఎం.ఏ. పాసయింది. ఉర్దూలో నాలుగు నవలలు వ్రాసింది. ఇంగ్లీషు పత్రికల్లో వ్రాసింది. ఆమె వ్రాసిన "భారతీయ లోక్‌గీత్" లండన్ పత్రిక ధారావాహికంగా ప్రచురించింది. 1901లో హైదరాబాదు మహిళా సభను ఆమె స్థాపించింది. నిజాం ప్రభుత్వం ధనసహాయం చేయటంకోసం దానిపేరు మార్చారు. అదే లేడీ హైదరీక్లబ్బుగా నేటికి నిల్చివున్నది. ఆడ పిల్లలకు ప్రత్యేక పాఠశాలలు పెట్టమని ప్రభుత్వాన్ని యెప్పుడు వొత్తిడిచేసేది. కొంతమంది మిత్రులతోకలిసి మహబూబియాస్కూలు, అంజుమానే ఖావాతీన్, మరికొన్ని స్కూళ్లు, సంస్థలు స్థాపించింది. ప్రతిమహల్లాలోను బీదపిల్లలకు వుచితస్కూళ్ళు వుండి తీరాలని విద్యాప్రచారం చేసింది. గొప్పవక్త. అఖిలభారత ముస్లిం మహిళా కాంగ్రెసుకు కలకత్తాలోను, బ్రాహ్మమహిళాసభకు హైదరాబాదులోను అధ్యక్షత వహించింది. 1908 లోమూసీనది వరదలలో సగంవూరు కొట్టుకు పోయినప్పుడు పరదా పాటించుతునే, తోటిస్త్రీలను కూర్చుకుని వరద బాధితులకు చెప్పనలవి కాని సహకారం అందించింది. అటువంటి చల్లని తల్లి శ్రీమతి తయ్యబా బేగంకు వారసురాలుగా పెద్దకుమార్తె శ్రీమతి మాసుమాబేగం తయారయినారు.

శ్రీమతి మాసుమా తన తొమ్మిదవ యేటనే లేడీ హైదరీక్లబ్బులో జూనియర్ మెంబరుగా చేరారు. మహబూబియా స్కూల్లో స్కూలు ఫైనలువరకు చదివి ఉర్దుభాషా పాండిత్యానికి బంగారు పతకం పొందారు. 1922 లో ముఖ్య బంధువులయిన హుస్సైన్ ఆలీఖాన్‌గారితో వివాహం అయింది. ఆయన విద్యావంతులు. విద్యావేత్త. వాళ్లకు నలుగురు అబ్బాయిలు ఒక అమ్మాయి.

1927 లో ఆలిండియా విమెన్సుకాన్ఫరెన్సు స్థాపించబడినప్పటినుంచి శ్రీమతి మాసుమా బేగం అందులో పాల్గొనటం ఆరంభించారు. ప్రతి సమావేశానికి హాజరు కావటమేకాక స్త్రీల సమస్యలనేకం చక్కగా అవగాహన చేసుకుని విపులంగా వేదికపైన చర్చించేవారు. ఆనాటినుంచి అనేకహోదాలలో ఆ సంస్థతో సంబంధం పెంచుకుని దానిముఖ్యపోషకులలో ఒకరయినారు. 1962–1964 లలో ఆమె దానికి అధ్యక్షురాలుగా కూడ వున్నారు.

1963 లో లండను విమెన్సుకౌన్సిలు వారు ఆమెను ఆహ్వానించి ఆమెగౌరవార్థం హౌస్ ఆఫ్ కామన్స్‌లో గొప్ప విందు చేశారు. ఆ సమయంలో ఆలిండియా వుమెన్స్‌కాన్ఫరెన్స్ భారత స్త్రీల సమస్యలను పరిష్కరించుతు, వారిలో చైతన్యం కలిగించుతు యేవిధంగా మహిళాభ్యున్నతికి తోడ్పడుతున్నది వివరించుతు చేసిన వుపన్యాసం యావన్మంది ప్రశంసలను అందుకున్నది. ఆసంస్థ కార్యకలాపాల సందర్భంగా ఆమె ప్రపంచదేశాలనెన్నిటినో పర్యటించి భారత మహిళలకు ప్రాతినిధ్యం వహించారు. అంతర్జాతీయ మహిళా మైత్రిసమాజం (ఇంటర్నేషనల్ ఎలయన్స్ ఆఫ్ విమెన్స్) స్వర్ణోత్సవ సందర్భంలో 1955 లో సిలోన్ వెళ్లి ఆవుత్సవాలలో ప్రాతినిధ్యం వహించారు. 1958లో యుగస్లేవియాకు, 1963 లో ఇండోనేషియాకు లీడరుగా భారత బృందాన్ని తీసుకు వెళ్లారు. అంతర్జాతీయ మహిళా మైత్రి సమాజం వారి 22వ వార్షిక కాంగ్రెసు సభారంభానికి వెళ్లారు. ఆయుధ విసర్జన సమాఖ్యలో ప్రపంచ స్థాయిన పాల్గొనటానికి భారతదళం నాయకత్వం వహించి 1972లో జెనీవా వెళ్లారు. అంతర్జాతీయస్థాయిలో భారతదేశానికి భారత మహిళలకు ప్రాతినిధ్యం వహించి మన్ననలుపొంది దేశగౌరవాన్ని యినుమడింప జేసిన సమర్థురాలు, మేధావి శ్రీమతి మాసుమా బేగం. ఇంతటి కీర్తిని గడించు కోవటంలో, దేశఖ్యాతిని నిలబెట్టటంలో ఆమె తన తల్లి చిన్ననాటి స్నేహితురాలు, కుటుంబ క్షేమాభిలాషిణి అయిన శ్రీమతి సరోజినీ నాయుడును స్ఫురింప చేస్తున్నారు.

ఆమెకు చిన్ననాటినుంచి విద్యాసంస్థలతోను, నిర్వహణతోను సంబంధంవున్నది. 1911 లో ఆమె తల్లి స్థాపించిన అంజుమానేఖవాతీన్ అనేప్రసిద్ధ సంస్థ తరఫున స్థాపించబడిన బీదపిల్లల వుచిత పాఠశాలను అత్యంత సమర్థతతో నడుపుతున్నారు. అనేక బాలికా పాఠశాలలకు సలహాదారుగా వున్నారు. 1934 నుంచి దాదాపు ఒక దశాబ్దం ఉస్మానియా యూనివర్సిటీ సెనేట్ సభ్యులుగాను, ఫైనాన్సు కమిటీ సభ్యులుగాను వున్నారు. 1950 లో వయోజన విద్యా సమితి సభ్యురాలుగా నిజాం ప్రభుత్వం ఆమెను ఎన్నుకున్నారు. ఆమెకు స్త్రీల సమస్యలేకాక విద్యా వ్యాప్తితో సమస్యాపరిష్కారం కూడ బాగాతెలుసు.

దానికొక ప్రత్యేకమైనచీటి తగిలించకుండానే అతిసహజంగ ఆమెచిన్ననాటినుంచి సంఘసేవచేస్తూనేవున్నారు. పిల్లలకు అందులోను పేదపిల్లలకు వుచిత విద్య బహుళప్రచారంలోకి తెచ్చారు. పసివారిసంక్షేమం ప్రధానంగా భావించి సేవ్‌ది చిల్డ్రన్ కమిటీలో సభ్యత్వం వహించారు. ఆహారసమితి స్త్రీల శాఖలో పనిచేశారు. మహిళలలో చైతన్యం కలిగించి బిడ్డలను వుత్తమ భావిపౌరులుగా తీర్చి దిద్దగల అవకాశాలు కల్పించారు. న్యాయ శాస్త్రచట

రీత్యా స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను నిర్మూలించటానికి పూనుకున్న లీగల్ డిసెబిలిటీస్ కమిటీలో సభ్యులుగా వుండి ఆస్తులు, వివాహాలు, విడాకులు, బాల్య వివాహాలు, వృద్ధులతో వివాహాలు, దత్తత విషయాలు, విద్యా వుద్యోగ విషయాలు మొదలయిన వాటిని పామరులకు చక్కగా అర్థం అయి లోతుపాతులు తెలిసే విధంగా ఆమె ఆయా విషయాలలో నిష్ణాతులు, పండితులు అయిన వారి చేత వుపన్యాసాలు యిప్పించేవారు. దేశనాయకులు, ప్రభుత్వ ఉద్యోగులు కూడ ఆమెతో సహకరించి విషయాలను సమస్యలను చక్కగా చర్చించి విడమరిచి చెప్పేవారు. సామాన్య పరిజ్ఞానంగల గృహిణులకు యెన్నో విషయాలు తెలిసేవి. అందువల్ల 1966 లో ఆమె కేంద్ర సంఘసంక్షేమ సమితికి ఛైర్మన్ కావటం వుచితమనిపించుతుంది. ఆ సమయంలోనే బిడ్డల పెంపకంలో తల్లులను సుశిక్షితులను చేయటానికి, పిల్లలు ముఖ్యంగా అభివృద్ధిలోకి రావటానికి యూనిసెఫ్ (UNICEF) వారి సహకారంతో కొత్త పథకాలు తయారయినవి. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ఆమె కేంద్ర సంఘ సంక్షేమ సమితి ఆంధ్రరాష్ట్ర శాఖలో తెలంగాణా విభాగానికి ఛైర్మన్‌గా కూడా వున్నారు.

ఆమెకు రాజకీయరంగంలోను ప్రవేశం వున్నది. రాష్ట్ర యంత్రాంగంతోను సంబంధం వున్నది. 1952 లో కాంగ్రెసు తరఫున ఎన్నికలలో పాల్గొన్నారు. అధిక మెజారిటీతో గెల్చారు. ప్రజలతో ఆమెకు గల బహుకాల పరిచయం, వాడ వాడల ఆమె సేవలు పొందిన ప్రజలు వుండటమే అందుకు కారణం. ఆమెకున్న చక్కని వైదుష్య వక్తృత్వాలు, నిర్వహణా శక్తి అందరికి పరిచితమే కావటాన పేనల్ ఆఫ్ ఛైర్మన్‌కు ఎంపికయి అనేక శాసన సభా సమావేశాలను సమర్థవంతంగా నిర్వహించారు. 1957 ఎన్నికలలో కాంగ్రెసు తరఫున తిరిగి శాసనసభ సభ్యులుగా యెన్నికయినారు. ఆంధ్రరాష్ట్ర శాసనసభ కాంగ్రెసు వర్గ సభ్యులకు డిప్యూటీ లీడరుగా ఆమెను యెన్నుకున్నారు. 1960 జనవరిలో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంలో ఆమె సంఘసంక్షేమ శాఖ, ముస్లిం ధర్మాదాయ, సాలార్ జంగ్ ఎస్టేట్ నిర్వహణ శాఖల మంత్రిణిగా పదవీ స్వీకారంచేశారు. భారతదేశం మొత్తం మీద ప్రథమ ముస్లిం స్త్రీని మంత్రిణిగా చేసిన గౌరవం ఆంధ్రరాష్ట్రానికి దక్కింది. ఆ పదవి నలంకరించిన గౌరవం శ్రీమతి మాసుమా బేగానికి దక్కింది. ఆమెకు ఒక విభాగం పైన అభిమానం అని గాని మక్కువ అనిగాని లేదు. క్రమశిక్షణ, బుద్ధి వికాసాలకు, చైతన్యానికి దోహదకారిఅయి సామాజిక కళ్యాణానికి తోడ్పడే ప్రతిరంగంలోను ఆమె చెయ్యివుంటుంది. మధ్య దక్షిణరైల్వే ప్రయాణీకుల సంక్షేమ సమితిలో కూడ ఆమె సభ్యులుగా వుండి ప్రయోజనాలు సాధించారు. రెడ్ క్రాసు సంఘంలో

ఆమె పాత్ర బహుప్రధానమైది. ఆ సంఘానికి ఆమె యావజ్జీవ శ్రేయోదాయిని, స్నేహమయి అయిన లైఫ్‌అసోసియేటుగా వుంటారు. అఖిల భారత గ్రామీణ మహిళా సంఘం ఆంధ్రశాఖ పోషకురాలు, అఖిల భారత అంధ సహకార సంఘానికి జీవిత సభ్యురాలు. లేడీ హైదరీ క్లబ్బు అధ్యక్షురాలుగా, అంజుమనే ఖవాతీన్ సంస్థ అధ్యక్షురాలుగా అటు నాగరిక సంపన్న మహిళలకు, యిటు పేద ముస్లిం బాలికలకు చిరపరిచితురాలు. స్కూళ్లలో సాధారణంగా వుండే స్కౌటు, గరల్ గైడ్ వుద్యమానికి కూడ ఆమె చేయి అందించి కావలసినంత సహకారం చేశారు. ఆమె కోరక పోయినా తమ సంతోషం కొద్ది తమ సంతృప్తికోసం ప్రజలు, ప్రభుత్వం ఆమెను గౌరవించుతూ వుంటారు. భారత స్కౌటు వుద్యమ సేవకు, లేడీ బేడెన్ పావెల్ పతకం యిచ్చి సత్కరించారు. కేంద్ర సంఘ సంక్షేమ సమితి రజతోత్సవాల సందర్భంలో మాజీ చైర్మన్‌గా ఆమెను సన్మానించారు. వీటన్నిటిని మించి జాతి, కుల, మత, వర్గ ప్రసక్తిలేకుండ శ్రీమతి మాసుమా బేగాన్ని ప్రతివారు హృదయ పూర్వకంగా గౌరవించుతారు. కురుపితామహుడయిన భీష్ముడి పట్ల కౌరవ పాండవు లందరికీగల గౌరవ ప్రతిపత్తులే ఆమె పట్ల అందరికి వుండటం గమనించవలసిన విషయం.

# శ్రీమతి వెనిగళ్ల లక్ష్మీపార్వతి

**జననం 1908**

1977 ఏప్రిల్ 10వ తేదీన మద్రాసు రాజాజీహాల్లో ప్రపంచ వికలాంగుల సహకార దినోత్సవాలు పెద్దపెట్టున జరిగినవి. వికలాంగులకు చేయూతనిస్తున్న అనేక సంస్థలవారు చేరి ఆటలు, పాటలు, నాటకాలవంటి సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. ఆంధ్రమహిళా సభ ఆధ్వర్యాన మద్రాసు అడయారులో ఈశ్వరీ ప్రసాద దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటరు యీరంగంలో అమోఘమైన కృషి చేస్తున్నది. ఆ కేంద్రంలో చికిత్స పొందుతున్నబాలబాలికలు అమితోత్సాహంతో ప్రదర్శించిన ''రాధాకృష్ణ—గోపికలు'' ''పిల్లల వివాహ మంగళం'' అత్యద్భుతంగా వున్నవని యేకగ్రీవంగా సభికులు, కార్యక్రమ నిర్వాహకులు ఆమోదించారు. శ్రీ వెనిగళ్ల హనుమంతరావు రోలింగ్‌ట్రాఫీని ఆ బాలలు సగర్వంగా అందుకున్నారు. అంతకుముందే రాజరత్నం స్టేడియంలో రకరకాల ఆటల పోటీలు జరిగినవి. దాదాపు వంద మంది బాలబాలికలు వున్న యీ చికిత్సా కేంద్రం నుంచి అరవైమంది పిల్లలు పోటీల్లో పాల్గొన్నారు. అందులో 11 మందికి బహుమతులు వచ్చినవి. మొదటి బహుమతి అందుకున్న కుర్రవాడు యిక్కడ చికిత్స పొందుతున్నవాడే. వాళ్ల చికిత్సా కేంద్రం హాస్టలు, స్కూలు, అన్నింటికి దగ్గరగా పక్కనే ఒక పెద్ద స్టేజి కట్టివుంటుంది. ఆంధ్రమహిళా సభ నర్సింగ్‌హోం వుత్సవాలు, సమావేశాలు అన్ని అక్కడే జరుగుతువుంటవి. వాటన్నింటికి యీ పిల్లలను పర్యవేక్షకులు, ఆయాలు తీసుకువచ్చి, మంచి ఏర్పాట్లతో చక్కగాచూసి సంతోషించేట్లు చేస్తారు. ఇక రోజు సాయంకాల వేళల యీ పిల్లలు ఆ స్టేజిమీద చేరి, మనసుతీర ఆడుతారు, పాడుతారు. చుట్టూవున్న తోటలో మరికొంతమంది పిల్లలు వుషారుగ తోటపనులు చేస్తువుంటారు. వాళ్ల అందమైన తోటలకు యెన్నో బహుమతులుకూడ వచ్చినవి. ఇనప బూట్లతో,



శ్రీమతి వెనిగళ్ల లక్ష్మీపార్వతి

తోలుపటకాలతో, అంగాలకు బిగువునిచ్చే యితర సాధనాలతో, ఆ పిల్లలను చూస్తువుంటే యితరురలకు జాలిగా వుంటుంది. కాని వాళ్లు అంత సంతోషంగా తమలోతాము ఆడుతు, పాడుతు పనులు చేస్తు, అతి మామూలుగా కనిపించుతు వుంటే, సంతోషంగాను వుంటుంది. ఆయాలు, నర్సులు సమీపాన వుండి కనిపెట్టి చూస్తునే వుంటారు. ప్రేమ, అభిమానం, సహానుభూతి ముఖాన తాండవించుతుండగా వ్యవస్థాపకులయిన శ్రీమతి వెనిగళ్ల లక్ష్మీ పార్వతిగారు ఆ పిల్లల చేష్టలను తన్మయత్వంతో చూస్తువుంటారు. ఆ చికిత్సా కేంద్రం ఆమెకు జీవన సర్వస్వం.

ఆమె 1908లో శ్రీ మద్దాలి గోపాల కృష్ణయ్య, శ్రీమతి పార్వతమ్మల కుమార్తెగా జన్మించారు. కృష్ణా జిల్లా, విజయవాడ తాలూకా పునాదిపాడు ఆమె జన్మస్థలం. సోదరీ సోదరులు వున్నారు. గుంటూరు జిల్లా తెనాలి తాలుకా దుగ్గిరాల వాస్తవ్యులయిన వెనిగళ్ల హనుమంతరావుగారితో వివాహమయింది. ఆయన కొంతకాలం లా చదివి, డిప్యూటి తాసిల్దారు వుద్యోగంలో ప్రవేశించి, చివరకు ఐ. ఏ. ఎస్. ఆఫీసరుగా, మద్రాసు ప్రభుత్వానికి సెక్రెటరీ గాను జైళ్ల ఇన్‌స్పెక్టరు జనరలుగాను గౌరవ ప్రదమైన పదవులలో వుద్యోగవిరమణ చేశారు. రావుసాహెబ్ బిరుదాంకితులు.

భర్త వుద్యోగ కారణాన ఆమెఅనేక ప్రదేశాలు తిరిగారు. రోటరీ క్లబ్బు, లయన్స్ క్లబ్, గిల్డు ఆఫ్ సర్వీసెస్, రెడ్‌క్రాసు సంఘం, అఖిల భారత మహిళాసమాఖ్య వంటి లెక్కలేనన్ని సంస్థలతో సమాజాలతో ఆమెకు సన్నిహిత సంబంధం వున్నది. పరిసర ప్రభావాలవల్ల, స్వయంకృషితో తెలుగు ఇంగ్లీషులలో మంచి ప్రవేశము సంపాదించారు. ఏ కొరత లేకుండ ఆనంద ప్రదంగ కాలం గడిచి పోతున్నది.

1943 లో వారి యేకైక సంతానమైన ఈశ్వరీ ప్రసాద దత్తాత్రేయుడు జన్మించాడు. రూపసి, తేజస్వి, బలశాలి అయిన ఆబిడ్డకు నెలల వయసులోనే పోలియోవ్యాధి వచ్చినందువల్ల, లేచి తిరగలేని అశక్తుడయినాడు. అప్పట్లో దేశంలో వున్న ప్రసిద్ధ వైద్యులందరిదగ్గర వైద్యం చేయించారు. నోములు, వ్రతాలు కావుకదా యాగమే జరిపించారు. ప్రయోజనం లేకపోయింది. చివరకు 1958 లో తల్లిదండ్రులను శోకసముద్రంలోముంచి కనుమరుగైనాడు.

ఉద్యోగరీత్యా ఆ దంపతులు చాలా రోజులు మద్రాసులోనే వుండటం జరిగింది. ఆంధ్రమహిళాసభ నిర్వహించుతున్న ప్రజాహిత కార్యకలాపాలు ఆమెను బాగా ఆకర్షించినవి. సభ నర్సింగ్‌హోముకు ఐదువేలు విరాళం

యిచ్చారు. మహిళాసభ జీవితసభ్యురాలు. ఎంతో నెమ్మదిగా ఆప్యాయంగా మాట్లాడే ఆమె అనేకమంది సభ్యులకు అక్కయ్య. శ్రీమతి దుర్గాబాయమ్మ కుటుంబంతో సన్నిహితత్వం వుండేది. ఉన్న ఒక్క బిడ్డను పోగొట్టుకున్న ఆమెను ఓదార్చటంతప్ప యెవరు చేయగలిగింది యేమున్నది?

మరికొద్ది రోజులకే కుమారుని జ్ఞాపకార్థం మహిళాసభకు లక్ష రూపాయలు విరాళం యిచ్చారు. పోలియోవ్యాధితో వారి అబ్బాయి పోయినాడు కాబట్టి ఆ వ్యాధితో బాధపడుతున్న చిన్నపిల్లలకు ఒక చికిత్సాలయం నిర్మించితే ఈశ్వరీ ప్రసాదుకు తగిన జ్ఞాపక చిహ్నం యేర్పడుతుందని మహిళాసభ నిర్వాహకులు అన్నారు. ఆమెకు, ఆమె భర్తకు అదినచ్చింది.

మద్రాసు అడయారులో మహిళాసభ అప్పటికే పెద్ద నర్సింగ్‌హోము, ప్రసూతి కేంద్రం నడుపుతువున్నది. దాని పక్కన మరికొంత స్థలం యిప్పించ వలసినదిగా తమిళనాడు ప్రభుత్వాన్ని కోరారు. మద్రాసు జనరల్ ఆసుపత్రిలో కొద్దిగా యీరకపు చికిత్స పిల్లలకు చేస్తున్నారు తప్ప, ప్రత్యేకించి ఆసుపత్రిలేదు. అందువల్ల మద్రాసు రాష్ట్రప్రభుత్వం వుదారంగా ఏడు గ్రౌండ్లస్థలం యిచ్చారు. 26–7–1958న అప్పటి మద్రాసు గవర్నరయిన శ్రీవిష్ణురామ్ మేథి చికిత్సా కేంద్రానికి శంకుస్థాపన చేశారు. పని ఆరంభమయింది.

పోలియో, చచ్చువాతం పిల్లల శరీరానికి రావచ్చు, మెదడుకు రావచ్చు. అవయవాలకువస్తే అంగవైకల్యం ప్రాప్తించినట్లుగానే మెదడుకువస్తే మనోవైకల్యం, మానసిక రుగ్మత యేర్పడుతుంది. చికిత్స ఓర్పుతో నేర్పుతో చేయాలి. కొన్ని నెలలు పట్టవచ్చు, కొన్ని సంవత్సరాలూ పట్టవచ్చు. అంతకాలం యెదిగే పిల్లలకు చదువు వ్యర్థం కాకుండ చదివించుతూవుండాలి. ప్రత్యేక శ్రద్ధతో వీళ్లకు వుపకరించే విధంగా క్లాసులు నడపాలి. ఇక చికిత్సావిధానం, పరికరాలు, యంత్రసాధనాలు చాలా ఖరీదయినవి. అపురూపమయినవి. విదేశాలనుంచి అధిక భాగం తెప్పించుకోవలసి వుంటుంది. ఏ రకంగా చూసినా శ్రీమతి లక్ష్మీ పార్వతి సంకల్పించిన చికిత్సా కేంద్రంరూపాయలమీద నడపవలసిన సంస్థ. ప్రత్యేక శిక్షణపొందిన నిపుణులు, సమర్థులు కావాలి. ఆమె అధైర్యపడలేదు. మహిళాసభ నిర్వాహకులమీద, భర్తమీద గట్టి విశ్వాసంతో ముందడుగు వేశారు. కేంద్ర విద్యాశాఖవారు అంగవైకల్యంగల పిల్లలు చికిత్స పొందుతు చదువు కోవటానికిగాను భవనం నిర్మించమని లక్షన్నర రూపాయలు గ్రాంటు యిచ్చారు. కేంద్ర ఆరోగ్య శాఖవారు యీ పిల్లల ఆరోగ్యం తమ బాధ్యతో కాదో తెలియక, తేల్చుకోలేక, కొంతమంది డాక్టర్లకు, నర్సులకు జీతాలు

యివ్వటానికి సహకరించారు. అప్పటికి హనుమంతరావుగారు రిటైరు అయినారు. ఆయనకు ప్రభుత్వంలో అన్ని విభాగాల పనులు కొట్టిన పిండి. అన్ని విభాగాల కార్యకర్తలు చిరపరిచితులు. వస్తుతః క్రమవిధానంలో పని సానుకూలం చేయగల కార్యదక్షులు. భవన నిర్మాణం, చికిత్సా పరికరసేకరణ గబగబ జరిగిపోసాగినవి. ఆ దంపతులకు అదేధ్యాస, అదేభావన, అదేతృప్తి. రాత్రింబగళ్లు దగ్గరవుండి అన్నీచేశారు. ఒక్కొక్క రాయికోను పాతస్మృతులునింపుతు కళ్లు తుడుచుకుంటు, కార్యభారంవల్ల నుదుటపట్టిన చెమట తుడుచుకుంటు " ఈశ్వరీ ప్రసాద దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటరు " రూపకల్పన చేశారు. ఆరంభించిన ఒకటెన్నర సంవత్సరకాలానికే సర్వం సిద్ధమయింది. 19–1–1960 న అప్పటి భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధి స్వయంగావచ్చి పరమానందంగ ప్రారంభోత్సవం జరిపారు.

ఢిల్లీ, బొంబాయి, నాగపూర్లలోతప్ప యిటువంటి చికిత్సా కేంద్రాలు దక్షిణాన అసలులేవు. అందువల్ల యిరుగుపొరుగు రాష్ట్రాలనుంచికూడ తలి దండ్రులు చికిత్సకోసం తమ పిల్లలను తీసుకురావటం మొదలుపెట్టారు. గంపెడాశతో తమ బిడ్డలను యింతింత దూరం తెచ్చిన ఆ తలిదండ్రుల ఆరాటం చూసిన శ్రీమతి లక్ష్మీపార్వతిగారికి హాస్టలు ఆవశ్యకత తెలిసింది. ఊళ్లోవున్న పిల్లలకయినా కేంద్రంలో చేర్చుకుని వైద్యం చేయవలసిన అవసరం కనిపించింది. అప్పటికే మొదట అన్నప్రకారం లక్షకాక, మరికొంత డబ్బు అదనంగా యిచ్చారు. ఒక లక్షరూపాయల నిధిని యేర్పాటుచేసి చికిత్సా కేంద్ర ఖర్చులకు ట్రస్టును నియమించారు. మళ్లీ స్వయంగా పూనుకుని తమ అత్తగారయిన వెనిగళ్ల బాపనమ్మగారి పేరిట హాస్టలు నిర్మించారు. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ 5–5–1963 లో శంకుస్థాపన చేయగా 13–6–64 న శ్రీ చాగ్లా ప్రారంభోత్సవం చేశారు. మరి రెండేళ్లకు పిల్లలకు ప్రత్యేక విధానంలో చదువు చెప్పటానికి స్కూలు భవనాలు నిర్మాణం అయినవి. ఆడుతూ పాడుతువున్న పసివాళ్లకే యీ పోలియో వ్యాధివచ్చి అవయవాలు చచ్చుపరుస్తుంది. వెంటనే పూనుకుని తగిన చికిత్స చేస్తే కొంత త్వరలో వాళ్లకు పూర్తి ఆరోగ్యం కలగటానికి అవకాశాలు వున్నవి. అందుకని పసివాళ్లకు మాంటిసోరీ స్కూలునుంచి ఎనిమిదవక్లాసు వరకు అక్కడ యేర్పాటు చేశారు. శ్రీమతి లక్ష్మీపార్వతి సంతోషానికి అవధులులేవు. చికిత్సాకేంద్రం, హాస్టలు, స్కూలు, పిల్లలతో నిండివుండేవి. డబ్బుగలవారు ఖర్చులు భరించేవారు. పేదవారికి అన్నీ వుచితమే. కొంతమంది అనాథలు కూడ చికిత్స పొందుతు, చదువుకుంటు వుండేవారు. ఆ దంపతులకు ఆ పిల్లల

ఆలనా పాలనా స్వయంగా చేయటం చూడటం ఒక తృప్తి. అక్కడ వున్న ప్రతి బిడ్డలోను తమ బిడ్డనే వాళ్లు చూసుకోగలిగేవారు. అందువల్ల వారికి ఆ ప్రాంగణమే స్వర్గధామంగా, ఇల్లు శూన్యంగా తోచేవి.

వ్యాధితో చచ్చుపడిన అవయవాలను యెత్తిపెట్టి, బిగువునిస్తు కట్టటానికి ప్రత్యేకమైన పటకాలు బెల్టులు వాడతారు. పిల్లలకు అవసరాలను పరిశీలించుతు అవి తయారు చేయటానికి అక్కడే ఒక వర్క్‌షాపు నెలకొల్పారు. ఆమె బంధువులు మిత్రులు పరిచయులు అనేకమంది సంపన్నులున్నారు. మరియెన్నో సంస్థలతో, సమాజాలతో సంబంధంవుంది. ఇన్ని చోట్లనుండి లక్షల ధనం సేకరించి సెంటరుకు అమూల్య పరికరాలను సదుపాయాలను సమకూర్చారు. మూడు పూవులు ఆరు కాయలుగా ఆర్థోపెడిక్ సెంటరు జరిగిపోతున్నది. దేశంలోని అత్యాధునిక వుత్తమ చికిత్సా కేంద్రాలలో యిదొకటిగా ప్రఖ్యాతికెక్కింది. ఇంతలో 1970 డిశంబరు 3న తమ 73వ యేట హనుమంతరావుగారు మరణించారు. ఆమె కుప్పకూలి పోయినారు. జడత్వం ఆవరించింది. కేంద్రంలో చికిత్సపొందుతున్న అభాగ్యులు గుర్తుకు వచ్చారు. మమ్మలను చూసి ధైర్యం తెచ్చుకోమని అంటున్నచిన్నారి పిల్లల మాటలు, మావెన్ను నిమరమనే వారి పిలుపులు ఆమెకు వినిపించినవి. అవును, ఈసంస్థ ఆమె ఈశ్వరీ ప్రసాదుకు ప్రతిరూపం. తన బిడ్డకు అన్యాయం చేస్తే, బిడ్డను నిర్లక్ష్యంచేస్తే తనభర్త తనను క్షమించరు. తల్లితండ్రీ తనే అయినిలబడాలి. కళ్ళు తుడుచుకున్నారు.

చికిత్స పొందుతున్న పిల్లల అవసరాలను పట్టివసతులు, కూర్పులు, చేర్పులు నేనుముందంటే నేను ముందంటు వచ్చి నిల్చినవి. స్థలాభావంవల్ల హైస్కూలు చదువులకు ఆ కేంద్రంలోనే ఏర్పాటుచేయలేకపోయినా బయటిహైస్కూళ్లలో యీ పిల్లలనుచేర్పించారు. వారిరాకపోకలకోసం స్వంతబస్సులు, నిపుణులయిన సహాయకులు సిద్ధమయినారు. చివరకుకాలేజిచదువుల అవకాశంకూడ ఆమెకల్పించారు. ఆవిధంగా అనేకమంది వికలాంగులయిన బాలబాలికలు తమ కాళ్లపై తామునిలబడి విద్యావంతులయి, ఆర్జన పరులై సలక్షణమైన భారతపౌరులుగా ఆనందమయజీవితాలను గడపగలుగుతున్నారు. చికిత్సకు యేదేశంలో యే కొత్తమందువచ్చినా, యేకొత్తపరికరంవచ్చినా, యేకొత్తవిధానంవచ్చినా అదితమపిల్లలకు కల్పించాలి. అంతవరకు ఆమెకు నిద్రపట్టదు. దేశవ్యాప్తంగ ఆయాశాఖలలో ఖ్యాతిగాంచిన వైద్యనిపుణుల సహకారంతో, సహాయంతో అనేకానేకశాఖలు, విభాగాలు యేర్పడినవి. బ్రహ్మాండమైన పరిశోధనా విభాగమేయేర్పడింది. నిరవధిక కృషితో వ్యాధి సోకకుండముందు జాగ్రత్తలు, చికిత్సలు, శాశ్వతవిభాగంలో

వారికి జీవనోపాధులు, వ్యాసంగాలు కల్పించి ఆదుకోవటంవరకు గల వివిధ రంగాలలోను చెప్పలేని కృషిజరిగిపోతువున్నది.

ఆమెకు యిప్పుడు 71 సంవత్సరాలవయసు. కార్యభారంవల్ల, దిగుళ్లవల్ల ఆరోగ్యం తగ్గిపోతున్నది. దీక్షమాత్రం పెరుగుతున్నది. ఒక్క బిడ్డకు ప్రతిగాయిన్ని పందలమందిని అపూర్వమైన మమకారంతో, మాతృప్రేమతో చెయ్యిపట్టుకుని ముందుకు నడిపించుకు వెళ్తున్నారు. ఆంధ్రమహిళాసభ ఆధ్వర్యాన నడుస్తున్న ఈశ్వరీప్రసాద దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటరుకు 19 సంవత్సరాలు నిండినవి. అత్యుత్తమ చికిత్సాకేంద్రంగా, పరిశోధనా గారంగా శిక్షణాలయంగా వాసికెక్కుతున్నది. లక్షలఆస్తిసమకూరి వందలకొద్ది పసివారి జీవితాలకు ఆమె బంగారు బాట కల్పించుతున్నారు. ఆంధ్రమహిళాసభ కీర్తిని కొత్త శిఖరాలకు చేర్చినఆప్తురాలు, సమర్ధురాలు శ్రీమతి వెనిగళ్ల లక్ష్మీపార్వతి. ఆమెను చూస్తుంటే మహాకవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి గేయంలోని — కన్నీటికెరటాల వెన్నెలకు, హాలాహలంలోని అమృతానికి సజీవ రూపకల్పనగా తోస్తుంది.

---

# శ్రీమతి ఎలెన్ శర్మ

**జననం 15–11–1898** **మరణం 9–6–1978**

తెరలేచింది. ముగ్గురమ్మాయిలు ముచ్చటగా అలంకరించుకుని భరతనాట్య సాంప్రదాయంలో అడుగులువేస్తూ వచ్చారు.



శ్రీమతి ఎలెన్ శర్మ

''గురుర్బ్రహ్మ — గురుర్విష్ణుః
గురుర్దేవో — మహేశ్వరః
గురుస్సాక్షాత్ — పరబ్రహ్మః
తస్మై శ్రీ గురవే — నమః ''
అంటు గురువుకు నమస్కారం చేశారు.

మద్రాసు మైలాపూరులోని చిల్డ్రన్సు గార్డెన్ స్కూలు పిల్లలు తమ ఆట, పాట, ముద్దు, మురిపెం పెద్దలకు చూపించ దలుచుకుని ఆహ్వానాలు పంపినప్పుడు పట్టణంలో నాలుగుమూలలనుంచి స్త్రీలు పురుషులు వచ్చి కార్యక్రమాలు ఆసాంతం చూసి సంతృప్తితో వెళ్తు వుంటారు. అతిథుల తృప్తికి కారణం కేవలం పిల్లల ప్రావీణ్యత కాదు. నిర్వాహకుల ఆప్యాయత. సంస్థాపకులు, నిర్వాహకులు అయిన డాక్టరు శ్రీ వి. ఎన్. శర్మ, శ్రీమతి ఎలెన్ శర్మ ఇచ్చగాలు మాట్లాడరు. అతిశయం చూపించుకోరు. వాళ్లముఖంలో నైర్మల్యం, మాటలో స్వచ్ఛత సూటిగా యెదుటివారి మనసును తాకగలవు. అందువల్ల అతిథులు తాము వచ్చినందుకు సంతోషిస్తారు. మళ్లీ రావాలనుకుంటారు. ఎప్పుడూ రావాలనుకుంటారు, అదీ శ్రీ శర్మ దంపతుల ఆదరణ.

డాక్టరు శర్మ ఆంధ్రులు. ముక్తి నూతలపాటి వెంకటనారాయణ శర్మ ఆయన పూర్తిపేరు. ఆమె జర్మన్ వనిత. ఉన్నత విద్యలకు ఆయన యూరప్ వెళ్లినప్పుడు 1931లో వారి వివాహం అయింది. ఎలెన్‌ప్రైస్

ముల్లర్ ఆమెపూర్తిపేరు. శ్రీమతి ఆల్వీనా ఫాన్‌కెల్లర్, శ్రీ మాక్స్‌ఫ్లైష్ ముల్లర్ ఆమె తల్లిదండ్రులు. బెర్లిన్ నగరంలో 15–11–1898న ఆమె జన్మించారు. బాసెల్, బెర్లిన్ వంటి పట్టణాలలో చదివి ఎం. ఎ.,ఎం. ఇడి. డిగ్రీలను తీసుకున్నారు. ఓడెన్‌వాల్డు అనే సుప్రసిద్ధ అంతర్జాతీయ స్కూలులో కూడ కొన్నిసంవత్సరాలు టీచరుగా వున్నారు. 1936 నవంబరులో భర్తవెంట భారతదేశం చేరుకున్నారు. ఉమ్మడి రాష్ట్రరాజధాని అయిన మద్రాసునగరంలో ఆంధ్రుల కోడలుగా గృహప్రవేశం చేశారు. తెల్లని శరీర ఛాయ, మెల్లనిమాట, చల్లనిచూపు, ప్రశాంతత, గంభీరత తాండవించేముఖం, నున్నగా దువ్వుకుని మెడలమీదికివేసుకున్న మామూలు జుట్టుముడి, మోచేతుల వరకు చేతులతో, చీలమండలవరకు నిండైన ఫ్రాకుధరించిన ఆమెను చూస్తుంటే ఆమెపట్ల ప్రతివారికి గౌరవమే కలుగుతుంది. అభిమానమే కలుగుతుంది.

ఆమె విద్యావంతురాలేకాక గురుపీఠమెక్కి జర్మనీలో బహుకాలం యెందరికో విద్యాభిక్షపెట్టిన చదువుల తల్లి. మద్రాసులో తమ పొరుగునవున్న పేద బాలబాలికలకు చదువుచెప్పి వారిని తీర్చిదిద్దాలనుకున్నారు. వెంటనే ఏడుగురు పిల్లలతో మాంటిసోరీ పద్ధతిలో స్కూలు ప్రారంభించారు. కాని ఆఏడు సంఖ్యచాలా విచిత్రమైనది, స్థిరమైనది. సముద్రాలు, కుల పర్వతాలు, వారాలు, స్వరాలు, వర్ణాలు, ఋషులు, చివరకు శాశ్వత సహచరత్వం కోరు కునే కొత్తదంపతులు వేయవలసిన అడుగులుకూడ ఏడు సంఖ్యతో ముడిపడి వున్నవి. అందువల్లనేమో ఆ స్కూలు చిరస్థాయిఅయి, యీనాడు రెండు వేలమందితో కళకళలాడుతున్నది. మొదటినుంచి శర్మగారికి అడయారు థియోసాఫికల్ సొసైటీతో చాలా సన్నిహితత్వం వుండేది. అక్కడ తోటలో వున్న మర్రిచెట్టు వింతల్లో వింతగా ప్రతివారిని ఆకర్షించేది. అద్దంలో ప్రతి బింబంలాగా ఆ చెట్టు సూక్ష్మరూపాన్ని తమ స్కూలుకు చిహ్నంగా నిల్పు కున్నారా దంపతులు. అది యీనాడు వూడలువూని, ఆవరణ లావరణలుగా విస్తరించుకొంటుపోయి, చల్లని నీడయిస్తున్నది. అదే చిల్డ్రన్సు గార్డెను స్కూలు.

1937నాటి ఆ రోజుల్లో శ్రీమతి ఎలెన్‌శర్మ శ్రీమతి దుర్గాబాయమ్మ కుటుంబాలు మైలాపూరు ద్వారకాకాలనీలో పక్కపక్క యిళ్లలో వుండేవి. శ్రీమతి శర్మ ఏడుగురు పిల్లలతో తమ యింట్లోనే కిండరుగార్టెను స్కూలు ఆరంభించారు. దాదాపు ఆ కాలంలోనే బృందావన గోపికలనే పేరుతో చిన్నపిల్లలను కూర్చుకుని దుర్గాబాయమ్మగారు తమ యింట్లోనే ఆంధ్ర మాహిళాసభకు అంకురారోపణచేశారు. అందువల్లనే వీటిలో ఒక సంస్థ తెలిసిన

వారికి రెండవసంస్థ పాతచుట్టం. ఈ రెండు సంస్థలలోను మద్రాసు తెలుగువారు విరివిగా కనిపించుతారు. మరికొంత కాలానికి స్కూలు పెరిగి, ఫర్లాంగు దూరానవున్న ప్రస్తుత భవనాలలో ప్రవేశించింది. నాటినుంచి నేటివరకు ఒకొక్క కొత్తశాఖ బయలుదేరి మరికొంత మంది పిల్లలకు స్త్రీలకు పుపకరించుతు సేవచేస్తువున్నది.

శ్రీమతి శర్మ దృష్టిలో అంతస్థుకు ప్రాధాన్యతలేదు. అందరిని ఒకేతీరున ఆదరించి అభిమానించగల విశాల హృదయం. అందువల్ల అనాథలు, అనదలు, పరిత్యక్తలు అనేకులువచ్చి ఆమె ఆశ్రయం కోరేవారు. సహానుభూతితో ఆమె మనసు ద్రవించిపోయేది. ఆమెది వజ్రసంకల్పం. ఈ దీనులకు యేదో ఒకటి చేయలేక పోతానా అని అనుకునేవారు. వెంటనే ఆశ్రయం యిచ్చేవారు, తరవాత డబ్బు సమకూర్చుకోవటం గురించి ఆలోచించేవారు. వెంటనే పుట్టిల్లు గుర్తుకువచ్చేది. పశ్చిమ జర్మనీదేశంలో తమకున్న పలుకుబడిని వినియోగించి విరాళాలు సేకరించేవారు. తమ దేశపు స్త్రీ భారతదేశంలో దీనుల సేవచేస్తున్నదని సంతోషించి యెవరికితోచిన సహాయంవారు చేసేవారు. ఈనాటికీ ఆ ఆచారం అట్లాగే నిల్చివున్నది. వ్యక్తులు, సంస్థలు ధనరూపేణ పంపుతారు. మందుల కంపెనీల వారు మందులు, టానిక్కులు పంపుతారు. అందువల్లనే యీనాడు హాస్టలులో వుంటున్న వివిధశాఖల పిల్లలకు, ప్రతిరోజు వైటమిన్ మాత్రలు టానిక్కులు తప్పనిసరిగా యిచ్చి పిల్లలందరు బలంగ, ఆరోగ్యంగ వుండేట్లు చూడగలుగు తున్నారు. ఎలక్ట్రిక్ బాయిలర్లు తయారుచేసే కంపెనీలవారు జర్మనీనుంచి అవే పంపుతారు. అట్లాగే వాషింగ్ మెషీన్లు, కుట్టుమెషీన్ల వంటివి అనేకం వస్తు వుంటవి, ఆడపడచుకు సారెగా. అందువల్ల యీనాడు హాస్టలులో పిల్లలకులేని సదుపాయంలేదు. అన్ని వసతులు వసరులు వున్నవి. కాని ఆఫీసుగదుల్లో మాత్రం ఒక్కడాబుదర్పం కనిపించకపోగా డొక్కు కుర్చీలు బల్లలేదర్శనం యివ్వటం పరిపాటి. పనిచేయటానికి డాబుదర్పం అవసరంకాదని, సహానుభూతి, కృషి అవసరమని ఆమె పరోక్షంగా బోధించటమేమో అది.

చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో చిన్న పిల్లలకు మాంటిసోరీ విభాగం, ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు వున్నవి. ఐదోక్లాసు వరకు మాత్రం అబ్బాయిలను అక్కడ చదవనిస్తారు. ఆ తరువాత తరగతులన్నీ అమ్మాయిలకే పరిమితం. ఆ విద్యార్థులలో అనేక మందికి చదువులేకాక పుస్తకాలు, బట్టలు, హాస్టలులో భోజనం మొదలయినవన్నీ వుచితంగా ఆమె సమకూరుస్తారు. పేద విద్యార్థులకు మధ్యాహ్నం భోజనం స్కూలులోనే పెడతారు. ఆమె

దృష్టిలో పిల్లలందరు సమానం. వాళ్లకు అంతస్థులు తెలియవు, లేవు. సాధ్యమైనంత వరకు అందరికీ అన్ని అవకాశాలు కల్పించాలి. అన్ని చిన్నారి మనసులు పూవులల్లే వికసించేట్లు చేయాలి. ఇదే ఆమె తపన. అందువల్ల దేశ విదేశాలలో యెంతెంతో ప్రయత్నంచేసి అవన్నీ సమకూర్చుతూ వుంటారు. జర్మనులు అనేక మంది ఇక్కడి అనాథలను పేదపిల్లలను పెంచుకుంటారు. కేవలం పిల్లలు అభివృద్ధిలోకిరావాలని, వాళ్ల ఖర్చులు భరించి పెంచి, చదివించుతారు. కొంత సహాయం అమెరికా, ఆస్ట్రేలియాల నుంచికూడ సంపాదించారు. ఆమె నిస్వార్థ ప్రేమ పూరితసేవకున్న ప్రభావం శక్తి అంతటివి. ఇవన్నీ సేకరించి పెస్టలాజ్జి అనేవిద్యావేత్త పేర కేంద్రం స్థాపించి, దాని ద్వారా దాన, ధర్మాలు వుచిత వేతనాలు విద్యార్థి వేతనాలు అన్నీ సమకూర్చుతున్నా రామె. ఒక్కొక్కప్పుడు పిల్లలకు ఆ స్కూలులో వున్నంత వరకు చదువులో సహాయ పడటమే కాక నిజంగా నిర్ధనులై అశక్తులై పై చదువులు మాన వలసిన పరిస్థితిలో వుంటే వాళ్లకు కాలేజీ చదువులకు కూడ చేయూత నిస్తున్నారు. ఎవరి పిల్లలకే వారు సమకూర్చుకోలేని యీ కాలంలో ఆమె జగజ్జననిగా రెండు చేతుల పిల్లలను రక్షించుతు బంగారు బాటన వాళ్లను నడిపించ టానికి, వాళ్లకు చక్కని భవిష్యత్తు కలిగించటానికి, యింత శ్రమ పడుతున్నారంటే ఆమె సహృదయత సేవాసక్తి తెలుస్తుంది. ఆ వాతావరణ విలువను గ్రహించిన ధనికులు, పెద్ద హోదాలలో వున్న వారనేకులు తమ పిల్లలను ఆమె సంస్థకు పంపటం పరిపాటి.

వయోజనులయిన స్త్రీలు అనేకులు వ్యాపకం కోసమో, జీవిక కోసమో ఆమెను సమీపించటం జరిగేది. మాంటిసోరీ టీచరు ట్రెయినింగు, క్రెష్ నిర్వహణ ట్రెయినింగు వంటివి నెలకొల్పి అటువంటి వారికి చక్కని అవకాశాలు కల్పించారు. ఎక్కువ చదువుకోని స్త్రీల కోసం కుట్లు, అల్లికలు, చేతి పనులు వంటివి నేర్చుకోవటానికి దాదాపు 40 సంవత్సరాల క్రితమే క్లాసులు నడిపించి అవకాశాలు కల్పించారు. ఆది నుంచి ఆమెకు కుడిభుజంగా వున్న అదంకి సుందరమ్మగారు ఆ విభాగాన్ని స్త్రీ సేవా మందిర్ పేరుతో చిరస్థాయి చేసి అది మరొక పెద్ద సంస్థగా రూపొందటానికి తోడ్పడ్డారు.

ఉద్యోగాలు వృత్తులలో నిమగ్నులయి వుండే మధ్య తరగతి స్త్రీల వుపయోగార్థం ఆమె ఒక క్రెష్ స్థాపించారు. మూడు నెలల వయసునుంచి నాలుగు సంవత్సరాల వయసు వరకుగల పిల్లలు వంద మందిని యిక్కడ వుదయం 8 గంటలనుంచి సాయంత్రం 6 గంటల వరకు సంరక్షించుతు కంటికి రెప్పలాగ కాపాడుతు వుంటారు. వారిలోను పేదవారు లేక పోలేదు.

20 మంది పేద పిల్లలకు రాష్ట్ర సంఘ సంక్షేమ సమితివారు యిక్కడ స్థానం కల్పించారు. ఒక్కసారి లోపల అడుగు పెట్టిన తరవాత పిల్లలలో యే వ్యత్యాసాలు అంతస్థులు చూపరు. అక్కడి పిల్లల భోగాలు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

శ్రీమతి ఎలెన్ శర్మ తన సంఘసేవకు ఒక సాధనంగా మాత్రమే స్కూలు నెలకొల్పారు. సేవా తత్పరతతో దాని అభివృద్ధికి పాటుపడటమే తప్ప, స్కూలు ద్వారా ఆమె ఒక్క పైస అపేక్షించలేదు, తీసు కోలేదు. స్కూలు ఆరంభించిన 1937లోనే మద్రాసు యూనివర్సిటీలో ఆమె జర్మను భాషా బోధకులుగా చేరారు. 1969 వరకు నిండు 32 సంవత్సరాలు, అంత కన్న సూటిగా చెప్పాలంటే ఆమెకు 72 ఏళ్ల వార్ధక్యం వచ్చేవరకు క్లాసులు తీసుకున్నారు. విదేశాలలో జర్మను భాషా ప్రచారం చేసినందుకు గథె బహుమతి లభించింది. భారత దేశంలో జర్మను భాషా ప్రచారం ద్వారా అంతర్జాతీయ స్నేహలతను పెంపొందింప చేసినందుకు జర్మన్ ఫెడరల్ ప్రభుత్వం బహూకరించి సన్మానించింది.

విద్యావంతులు, వినయ సంపన్నులు అయిన ముగ్గురు అమ్మాయిలు ఆమె సంతానం. మూడవ అమ్మాయి కుమారి శకుంతలాశర్మ తల్లి విద్యాలయం అడుగు జాడలలో నడుస్తున్నది. ఈమె చేతుల్లో తాము నాటిన మొక్కపెంపు మరింతగా విస్తరించ గలదని ఆ తల్లికి పరిపూర్ణ విశ్వాసం. 80 సంవత్సరాల వయసులో ముత్తయిదువగా శ్రీమతి ఎలెన్‌శర్మ 9-6-1978న భగవత్సాన్నిధ్యం చేరుకున్నారు.

---

## 'సంఘ సేవా ధురీణ'

# శ్రీమతి తలారి చంద్రమతీదేవి.

**జననం 6-6-1903**

మహాత్మా గాంధీ శతజయంత్యుత్సవాల సందర్భంలో శ్రీమతి చంద్రమతీదేవి శ్రీమద్భగవద్గీత రెండవ అధ్యాయంలోని "స్థిత ప్రజ్ఞ లక్షణములు" వెయ్యికాపీలు అచ్చువేయించి పంచిపెట్టారు. "దేశ స్వాతంత్ర్యమునకై, స్వరాజ్యప్రాప్తికై పోరాడిన ధీరుడు, రాష్ట్రపిత మహాత్మ గాంధీ; ఆత్మస్వాతంత్ర్య, స్వరాజ్యసంపాదనమునకు స్త్రీ శూద్రాదులందరు సమానార్హులని ధైర్యముతో సత్యమును చాటి బోధించిన ఆంధ్రవేదాంత పితామహులు మహర్షిసద్గురు శ్రీ మలయాళ స్వాములవారు" పక్కపక్కన కూర్చున్న ఫోటోను మొదటి పేజీలో వేశారు. ఆకారం, వేషం, భావాలు, గీతానురక్తి మానవాళి పైన దయ, అయిద్దరికి మరింత పోలికను తెచ్చిపెడుతున్నని. రెండవ పేజీ తిప్పగానే స్థితప్రజ్ఞులు "వివిధ విధముల వారి వారి కార్యక్రమముల నెంచుకుని భగవంతుని మార్గమున పని చేయగలరు." అని కనిపించింది. ఈవాక్యమే శ్రీమతి చంద్రమతీదేవి జీవిత లక్ష్యాన్ని అతి విపులంగ చాటుతుంది. భగవంతుని మార్గమున పని చేయటానికి ఆమె దీనులు, దరిద్రులు, ఆర్తులు అయినమానవుల సేవను ఎన్నుకున్నారనటం తప్పనిపించుతుంది. ఆమె ఎన్నుకుని ఆసేవా మార్గంలో ప్రవేశించలేదు. బాల్యంనుంచే ఆమె అట్లా ఆమార్గాన నడుచుకుంటూ వచ్చేశారు.



శ్రీమతి తలారి చంద్రమతీ దేవి

1903 జూన్ 6వ తేదిన శ్రీ తాడి చంచయ్య నాయడు శ్రీమతి వెంకమాంబల చిన్నకుమార్తెగా శ్రీమతి చంద్రమతీదేవి జన్మించారు. ఆరవ ఏటనే ఆమెకు వివాహం జరిగింది. అదిజరిగిన ఆరు నెలలకే వైధవ్యం ప్రాప్తించింది. అందాల రాశి ఆయిన తమకూనకు జరిగిన యీ అన్యాయానికి ఆమె తల్లిదండ్రులు

ఆమె వైపు కన్నెత్తిచూడలేక పోయినారు. పసిపిల్ల క్షేమం ముఖ్యమని తలచిన ఆమె అక్కబావలు శ్రీమతి మహాలక్ష్మమ్మ శ్రీ తలారి వెంకట గోపాలరావు ఆపిల్లను రెండేళ్లవయసు నుంచి పెంచివున్న కారణంగాతమ యింటికి తీసుకునివెళ్లారు. చాలా రోజుల వరకు వారికి పిల్లలు లేక పోవటంతో శ్రీమతి చంద్రమతీదేవి దాదాపు వారి బిడ్డలాగే అక్కడ పెరిగింది. అందువల్లనే పుట్టింటి పేరయినతాడి, అత్తింటి పేరయిన చిక్కం, అటకెక్కి ఆమె శ్రీమతి తలారి చంద్రమతీదేవిగా అందరికి పరిచయం అయినారు. గోపాలరావు నాయదుగారు కలెక్టరు, రావుసాహేబు బిరుదాంకితులు. ఆయన నిఘంటువులో హరిజనులనే ప్రత్యేక పదం లేదు. అందరు హరిసృష్టించిన జనులే. ఆయన పెద్దపెద్ద కాస్మాపాలిటన్ డిన్నర్లు జరిపినప్పుడు యింట్లో, సావిట్లో విస్తళ్లు వేయించిసమస్తపదార్థాలు వడ్డించి హరిజనులకు విందులు చేసేవారు. వారికి బావులలో నీళ్లుతోడుకోవటానికి అవకాశాలు కల్పించారు. స్వయంగా పూనుకుని, హరిజన మహాసభలెన్నో నడిపించారు. ప్రభుత్వసహాయంతో హరిజనులకు యెన్నో కోఆపరేటివ్ బాంకులు, రాత్రి పాఠశాలలు స్థాపించారు. ఆయన భార్య శ్రీమతి మహాలక్ష్మమ్మ స్వయంగా హరిజనులను ఆదుకునే వారు. వాళ్లయిళ్లకు వెళ్లి పిల్లలకు స్నానాలు కూడచేయించేవారు. ఇవన్నీ చూసినవాళ్లు మాలకలెక్టరని నాయుదుగారిని పరిహసించేవారు. పసితనం నుంచి యీవాతావరణంలో, సేవా కలాపాలలో పెరిగిన ఆమెకు అదే చదువులబడి, తర్ఫీదు కేంద్రం అయింది. మానవ సేవ అంటే చెప్పేదికాదు, చేసేది అన్న నిర్వచనం నిగ్గుతీశారు ఆమె. అక్కబావలతో పొరుగూళ్ల క్యాంపులకు వెళ్లినప్పుడు పళ్లో, యింత చిరుతిండో సమకూర్చుకుని బీదలను యింటికి పిలిపించేవారు. పళ్లు, పసుపుబొట్టు యిప్పించేవారు. ఆ స్త్రీలకు చదువువిలువ, పరిశుభ్రత ఆవశ్యకత, దైవభక్తి బోధించి, చివరకు శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారి సంస్కారభావాలన్నీ వాళ్లకు నూరి పోసేవారు.

1920లో గాంధీ మహాత్ముడు హరిజనాభ్యుదయ సందర్భంలో ప్రాయోపవేశం జరిపే నాటికి శ్రీమతి చంద్రమతీ దేవి వయసు పదిహేడు సంవత్సరాలు. అప్పుడే ఆమె బహిరంగంగా బయటకు వచ్చి వ్యక్తిగతంగా హరిజన సేవకు పూనుకున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా యానాలపల్లిలో వున్న పాతదేవాలయం రిపేరు చేయించారు. అందులో హరిజనులకు ప్రవేశం కల్పించారు. బహుకాలంగా ప్రచారంలో వున్న జంతుబలిని నిరోధించగలిగారు.

అట్లాగే ధవళేశ్వరంలో వున్న ముత్యాలమ్మ గుడిలో కూడ జంతుబలిని వ్యతిరేకించుతు ప్రబోధంచేసి చివరకు జయించారు. మరెన్నో దేవాలయాలలో కూడ తమ సుతిమెత్తని, వేడికోలుతోనే జంతుబలిని ఆపుచేయించగలిగారు.

ఆమె తనకై తాను సమాకూర్చుకున్న సభికులముందు, చిన్నచిన్న సమావేశాలలో మాట్లాడినా పిఠాపురంలో జరిగిన హరిజన మహాసభలో ప్రథమ బహిరంగ ఉపన్యాసంయిచ్చారు. అప్పటికామె వయసు ఇరవైలోపు. ఆనాటి నుంచి సభలలో సమావేశాలలో పాల్గొనటం ఆరంభించారు. తణుకులో ప్రఖ్యాత దేశసేవిక దేవులపల్లి సత్యవతమ్మ గారు స్థాపించియీనాటికీ నడుపుతున్న "శ్రీబాలసరస్వతీ స్త్రీసేవా సమాజం" ప్రారంభోత్సవం ఈమె జరిపారు.

కొంచెం చురుకుగా బయటికివచ్చి సభలు సమావేశాలలో పాల్గొంటు, మహిళా సమాజాలు స్థాపించుతు, స్త్రీలలో విజ్ఞాన వికాసాలు పెంపొందింప కోరే వారందరికి ఆరోజుల్లో శ్రీమతి బత్తుల కామాక్షమ్మ పెద్దదిక్కు. పొల్లుజల్లు రాకుండ, మంచి కట్టు దిట్టాలతో పెద్దపెద్ద మహాసభలు యేర్పాటు చేయటం శ్రీమతి కామాక్షమ్మ నేర్పించారని ఆమె అంటారు. ద్రోణుడు దగ్గర అర్జునుడిలాగా రాణించారు. ఆమె రెడ్‌క్రాసువారి సమావేశాలు, అఖిలభారత మహిళా సభలు, పండగలు— పబ్బాలు, పూజలు, ధార్మిక వుపన్యాసాలు, క్షామనివారణ సమావేశాలు, తుఫాను బాధితుల సహాయ సమావేశాలు యేవైనా సరే అతి సమర్ధవంతంగా సలక్షణంగా నిర్వహించుతారు. ఐనా తెరమరుగునే వుంటారు.

శ్రీమతి చంద్రమతీ దేవి పసిమిరంగుతో బక్క పలచగా చెరగని చిరునవ్వుతో, పరమ స్వాతికంగా వుంటారు. ఎంతకొత్త వారితోనైనా నెమ్మదిగా ఆప్యాయంగా జంకుపోగొడుతు మాట్లాడగలరు. ఆమెచెప్పినమాట నిజాయతీగా వుండి మనసులో గట్టిగా నాటుకుంటుంది. ఎవరుగాని ఆమెమాట సంతోషంగా మనస్ఫూర్తిగా పాటించుతారు. ఆమె తన సామర్థ్యాన్ని మానవ సేవకే వినియోగించుతారు. ఎక్కడకు వెళ్లినా పేదల బస్తీలకు, మురికి వాడలకు, హరిజన వాడలకు, ముందుదారి తీస్తారు. అక్కడ రోగాలతో బాధపడుతున్న వాళ్లకు మందులు తెప్పించియిస్తారు. బట్టలులేని వాళ్లకు తమ దగ్గర అనవసరంగా వున్న వాటిని యిస్తారు. నలుగురిని పోగుచేసుకువచ్చి చదువుకోమని పలకా బలపాలు యిస్తారు. ఇంకోపది మందినికుట్లుకత్తిరింపులు నేర్చుకోమని కావలసిన బట్టలు, సూదులు, దారాలు, తెచ్చియిస్తారు. రకరకాల సహాయాలు అందుకోవటానికి ఆర్తులు వస్తారు. ఇదంతా ఆస్తతో వేడుకగా

చూస్తున్న యిరుగు పొరుగు స్త్రీలు ముచ్చటపడి వుత్సాహంతో ఆకార్య క్రమాలు నెరవేర్చటానికి ముందుకు వస్తారు. ఒకమహిళా సమాజం అనుకోకుండ రూపొందుతుంది. పకడ్బందీగా దానికొక అధ్యక్షురాలు, కార్యదర్శిని, కార్యనిర్వాహక వర్గమంటు స్థానికంగా పాల్గొంటున్న స్త్రీలను నియమించుతారు. తగిన రాబడి వుండి, సమాజం ఆపెట్టుబడి నిర్వగలిగితే తీసుకుంటారు. లేకపోతే ఆ సంస్థకు అది తమ విరాళంగా వదిలివేస్తారు. ఆ సమాజంలో యే అధ్యక్షురాలు గాను, కార్యదర్శిని గాను ఆమెవుండరు. తిరిగి యింకొకచోట యింకొక మహిళా సమాజం వెలుస్తుంది. ఆమె గాథలు విటూంటే మరియొక నాడు మరియొక పిట్ట మరియొక గింజ కథ గుర్తుకువస్తుంది.

ఈ విధంగా ఆమె నెలకొల్పిన మహిళా సమాజాలలో తారనాక మహిళా సమాజం ఒకటి. కుశలులు, సమర్థులు అయిన కార్యకర్తల కృషి ఫలితంగా ఆ సమాజం మహిళాభ్యున్నతికి అధునాతన మార్గాలలో పనిచేస్తున్నది.

హైదరాబాదు మలక్‌పేట ఆంధ్రా కాలనీలో ఒక మహిళా సమాజం ఆమె నెలకొల్పారు. అక్కడ స్త్రీలకు కన్డెన్స్‌డ్ కోర్సు, కుట్లు, టైలరింగు వంటి తరగతులు యెన్నో నడుస్తున్నవి. గుంటూరు పట్టాభిపురంలో ఆమె వ్యక్తిగతంగా పూనుకున్న సంఘసేవకు ఫలితంగా ఒక మహిళా సమాజం రూపొంది నేటికీ అభివృద్ధి చెందుతువున్నది. రాజమండ్రిలో శ్రీ తలారి వెంకట గోపాలరావు నాయుడు స్మారక మందిరం కట్టించి, ఆమె అందులో హరిజన బాలబాలికలకు ఇండస్ట్రియల్ ట్రైనింగు క్లాసులు, హరిజన బాలికల స్కూలు, హాస్టలు నిర్వహించుతున్నారు. ఇటువంటి సంస్థలు సమాజాలు కనీసం ఒక పాతిక స్థాపన అయి, సక్రమంగ యీనాటికీ సలక్షణంగ పనిచేయటానికి ఆమె కారణభూతురాలు.

ఇవి కాక ఆమె రెడ్‌క్రాసు సంఘం తరఫున నిర్మాణాత్మకమైన కార్య క్రమాల నెన్నిటినో నడుపుతు వుంటారు. రెడ్‌క్రాసు వర్కుపార్టీకి ఆమె జీవిత సభ్యురాలు. ఆమె సేవలకు మెచ్చి రెడ్‌క్రాసువారు బంగారు పతకాన్ని బహూకరించారు.

అఖిల భారత శ్రీ శారదాదేవి సంఘానికి ఆమె అధ్యక్షురాలు. హైదరాబాదులో దాని శాఖను నెలకొల్పి నిర్వహించుతున్నారు. ఆమె యే పీఠమెక్కినా యెండు కాలిడిన చివరకు చేసేది సంఘసేవే. అవసరమైన చోట చేయి అందించటమే ఆమె లక్ష్యం. అందువల్ల శ్రీ శారదా సంఘం తరఫున హైదరాబాదు శ్రీరామ నగర్ పేదల బస్తీలో ఒక క్రేష్ నడుపుతున్నారు. బాలానంద శాఖ వున్నది.

శిశు సంరక్షణాలయంలో శ్రీమతి మహాలక్ష్మి బాల సంరక్షణ సంఘం పేర రోజు వుచితంగ పిల్లలకు పాలు పోయిస్తున్నారు. కావలసిన వైద్య సహాయం అందించుతారు. బస్తీలోని స్త్రీలకు కుట్టు నేర్పుతారు. అక్కడ వున్న ఆలయంలో పండగలు పబ్బాలు పూజలు వ్రతాలు అన్నీ యధావిధిగా జరిపించి అక్కడి పేద ప్రజలకు భక్తి, జ్ఞానం, కాలక్షేపం కలిగించుతున్నారు. ప్రపంచస్త్రీల సంవత్సరమైన 1975 లో హైదరాబాదులోని పేదల బస్తీలలోని స్త్రీలను సమీకరించి మహాసభలు జరిపించారు. వారికి స్త్రీల సంవత్సర ప్రాధాన్యతను వివరించారు. ఆమె ఇరవై సంవత్సరాల వయసులోపలే రామచంద్రపురంలో వుండగా రకరకాల వంటలు చేయించి తీసుకు వెళ్లి కుష్టు రోగులకు స్వయంగా భోజనం వడ్డించి వారికి సహానుభూతితో మంచి మాటలు వినిపించేవారు. ఊళ్లో యేవైనా కలరావంటి వ్యాధులు వచ్చి పెద్దలు బాధ పడుతుంటే జాతి, కుల, మత, వర్గభేదాలు పాటించకుండ ఆయిళ్లలోని పిల్లలను తీసుకువచ్చి ఆశ్రయం యిచ్చేవారు. పిల్లలకు వ్యాధి రాకుండ కాపాడటం, పెద్దలను ఆదుకోవటం జరిగి పోయేది. అందువల్ల శ్రీమతి చంద్రమతీదేవి యేసేవా కార్యక్రమం యేవూళ్లో నేరవేర్చారని గాని యే సంవత్సరంలో అనిగాని చెప్పూనటం సాధ్యమయేపని కాదు.

ఇంత కమాటం, పూచీలు, కార్యకలాపాలువున్నా, ఆమె పైచూపు చూడరు. ఎంతో సహృదయతతో యితరులు నడిపే సంస్థలకు కూడ సహకరించుతు వుంటారు. ఆంధ్రమహిళా సభకు ఆమె జీవిత సభ్యులు, సభవిద్యాలయానికి ఐదు వేలరూపాయలు విరాళం యిచ్చారు. 1971లో సభ స్కూలు బ్లాకు ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్ర యువతీ మండలి జీవిత సభ్యులు. అక్కడ నడిచే వర్కింగ్ విమెన్సు హాస్టలు నిర్మాణ సమయంలో కన్వీనర్‌గా వుండి సహకరించారు.

ఆమె తమ రచనాశక్తిని కూడ సంఘసేవకే వినియోగించుతున్నారు. అంతగా విజ్ఞానం, విద్యాగంధం లేనివారికి వుపకరించేట్లుగా ''వైకుంఠ మహాలక్ష్మి కొలువుకూటం'', ''చింపిరి గుడ్డల శివాలక్ష్మి'', ''నిస్వార్థ సేవకు నివాళులు'', ''బుద్ధి కుశలత వుంటే భుక్తికి లోటులేదు'', ''గర్వానికి పతనం'', ''బదులుకోరని సేవకు బహుమతులు'' వంటి పుస్తకాలు రచించారు.

ఇన్ని రంగాలలో ఆమె చేస్తున్న సేవకు గౌరవ సూచకంగా ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ మహిళా సమాజాలవారు కలిసి 1965 లో ఆమెకు ''సంఘసేవా ధురీణ'' బిరుదాన్ని యిచ్చి గౌరవించారు. చిన్ననాడు క్రమబద్ధంగా సంఘసేవను, సభలు, సమావేశాలను, నిర్వహించటం నేర్పినగురువు ''సంఘసేవాధురీణ''

బత్తుల కామాక్షమ్మగారు అధ్యక్షత వహించటం ఆనాటి విశేషం. 1975 లో ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆమెను ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం సత్కరించింది. అందరికి ఆమె ప్రేమాస్పదురాలైన ఆంటీ.

ఆమెకిప్పుడు 76 సంవత్సరాల వయసు. సున్నితమైన ఆరోగ్యం. కాని చెరగని చిరునవ్వుతో తరగని ఆస్తతో యింకా సంఘసేవ కార్యకలాపాలలో పాల్గొంటారు. పూనుకుని చేయించుతారు. 1977 నవంబరు తుఫాను భీభత్స సహకార కార్యక్రమాలలో కూడ ఆమె పాల్గొనటం చూస్తే ఆశ్చర్యం కలగక మానదు. ఆమె స్థితప్రజ్ఞుల లక్షణాలు అచ్చువేయించి పంచిపెట్టటంలో గల పరమార్థం, రహస్యం అదే.

---

# శ్రీమతి దుల్ల వెంకట రమణమ్మ

**జననం 1900**

పాత బట్టలు యిచ్చి స్టీలు సామాన్లు కొనటం, గుప్పెడు బియ్యంపెట్టి కరివేపాకు కట్ట కొనటం చాలామందికి తెలిసేవుంటుంది, కాని రాట్నంమీద వడికిన నూలు చిలపలు యిచ్చి మహిళా సమాజం మెంబర్లు కానటం, నాటకాలు చూడటం, ఎవరు చూసి వుండరు. ఐనా బందరులో దుల్ల వెంకట రమణమ్మగారి ఆధిపత్యంకింద ఆపద్ధతి చాలాకాలం అమలులో వున్నది. ఆమె 1900 సంవత్సరం ఆగస్టులో జన్మించారు. తెనాలి జన్మస్థలం. తండ్రి కొమ్మూరి సాంబ శివరావుగారు తల్లి వెంకట సుబ్బమ్మగారు అమ్మాయి చదువుపట్ల ఆస్తవుండి స్కూలుకు పంపించారు. సెకండుఫారం పాసయింది అమ్మాయి. కాని ఒకేఒక్క పిల్లకోసం థర్డుఫారం క్లాసునడపమన్నారు స్కూలు



శ్రీమతి దుల్ల వెంకటరమణమ్మ

నిర్వాహకులు. దాంతో అమ్మాయి చదువుఆగి పోయింది. కాని అన్నగారు ప్రఖ్యాత రచయిత, సాహిత్యవేత్త అయిన శ్రీ చలం గారు యింట్లోనే చెల్లెలు వెంకట రమణమ్మకు సాహిత్యాభిలాష కలిగించి యెప్పుడూ చదివే అలవాటు కలిగించారు. ఆమెకు పుస్తకాలు, వార్తా పత్రికలు అంటె పరమప్రీతి. కాలక్రమాన కుమారి వెంకటరమణమ్మ బందరు వాస్తవ్యులయిన శ్రీ దుల్ల పట్టాభిరామయ్యని, వివాహం చేసుకుని బందరువెళ్లారు. ఆయన స్కూలులో చాలా కుశలులైన టీచరు. మంచి జాతీయవాది. ఖద్దరు ప్రచారంలోకి వచ్చినప్పటినుంచి వాళ్లయింట్లో పసిపిల్లలు సైతం ఖద్దరే ధరించేవారు. బాల్యంనుంచే వార్తాపత్రికలద్వారా దేశకాల పరిస్థితులు చక్కగా అవగాహన చేసుకున్న శ్రీమతి రమణమ్మ భర్త దేశభక్తికి, విశాలభావాలకు జోహార్లు అర్పించేవారు. దక్షిణాఫ్రికాలో భారతీయులు పడుతున్న యిక్కట్లు

తొలగించటానికి శ్రీ మోహనదాసు కరమ్‌చంద్ గాంధీ పడుతున్న పాట్లు భారతీయులను కదలించినవి. వారి సహాయార్థం యింటింటికి తిరిగి విరాళాలు పోగుచేసి ఆఫ్రికా పంపటం జరిగింది. ఆ పుద్యమంతోనే శ్రీమతి వెంకటరమణమ్మ స్వయంగా బయటకువచ్చి కార్యరంగంలో ప్రవేశించి సేవచేయుటం ఆరంభమైంది. దంపతులు గాంధీజీ శిష్యులు కావటాన పరిమిత కుటుంబం నిర్దేశించుకున్నారు. కాని మొదటి ముగ్గురు అమ్మాయిలే. తరతరాలుగా జీర్ణించిపోయిన పుత్రవ్యామోహం మరి యిద్దరుఅబ్బాయిలను యెత్తించింది. 1930 నాటికి ఆమెకు కావలసినంత తీరుబాటు కలిగింది.

ఆ సమయానికి మహాత్మాగాంధి పుద్బోధాలు జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. ఖద్దరుప్రచారం, విదేశవస్త్రదహనం, అసహాయోద్యమం, హరిజనోద్ధరణ వంటి వన్నీ అంచలంచలుగ నడిచి ఉప్పుసత్యాగ్రహం రంగప్రవేశం చేసింది. ఏరోజు వార్తాపత్రికచూసినా కంపరమెత్తే దారుణకాండలు జరపుతున్న పరప్రభుత్వవైఖరీ, వీరావేశంతో జాతీయోద్యమంలో చేరుతున్న ప్రజాకోటి కబుర్లే కనిపించేవి. శ్రీమతి రమణమ్మకు తానుకూడ పాల్గొనాలన్న తీవ్రకాంక్ష కలిగేది. దాంతో మహాత్ముడు ఆదేశించి రూపొందించిన నిర్మాణాత్మక కార్యక్రమాలవైపు దృష్టిమళ్లింది. కాని అవన్నీ సంఘపరంగా సాధించగలపనులు. వ్యక్తిగతంగాజరగవు. అందుకని ఒక మహిళాసమాజం స్థాపించాలనుకున్నారు. భర్తకు పెద్దహోదా లేదు. తనకు డిగ్రీలులేవు, వెదజల్లటానికి డబ్బులేదు. ఇవన్నీ ఆమెలో సంక్షోభాన్ని పెంచినవి. వేరేమార్గంలేక అంతకుముందే అక్కడున్న స్త్రీలక్లబ్బులో చేరారు. ఇంతలో గాంధీజీ బందరు వస్తున్నట్లు తెలిసింది. నాయకులు సమావేశమయి, విరాళాలు పోగుచేయుటం ఆరంభించారు. శ్రీమతి వెంకటరమణమ్మ తమలేడీస్ క్లబ్బుతరఫునకూడ కొంతమొత్తం సేకరించి గాంధీజీకి యిద్దామన్నారు. ఆ క్లబ్‌లో అందరు ప్రభుత్వ పుద్యోగుల భార్యలు. అనవసరపు రాజకీయాలలో ప్రవేశించి తమ కన్ను తాము పొడుచుకోవటానికి యెవరు సాహసించుతారు? నిరపాయకరంగా ఆటపాటలతో కాలం వెళ్లబుచ్చుతున్న క్లబ్బు మెంబర్లువాళ్ళు.

శ్రీమతి రమణమ్మ అక్కడనుంచి బయటికి రాకతప్పలేదు. పట్టుదల ఆత్మవిశ్వాసాన్ని పెంచింది. ఆకాంక్ష బలాన్ని యిచ్చింది. నిస్సంకోచంగా వూళ్ళో యెరిగివున్న స్త్రీలను కొంతమందిని ఒక కమిటీగా కూర్చుకున్నారు. ఇంటింటికి తిరిగి విరాళాలు పోగుచేశారు. మహాత్ముడికి శ్రద్ధతా భక్తిగా నిధి సమర్పించి ధన్యులమనుకున్నారు. దాంతో తనలాటి సామాన్య స్త్రీకూడ పూనుకుంటే కొంత సాధించగలదు అన్న ధైర్యం కలిగింది. జాతీయపద్ధతులలో ఒక సమాజం స్థాపించి మహాత్ముడి నిర్మాణ కార్యక్రమం నెరవేర్చటానికి

నిశ్చయించుకున్నారు. మిత్రురాలైన శ్రీమతి మల్లాది వెంకట రమణమ్మతో కలిసి 1939 డిశంబరులో "మహిళా సేవా మండలి"ని స్థాపించారు. ఆనాటి సభ్యులసంఖ్య పది. కాని సమాజం ఆశయాలు లక్ష్యాలపట్టిక పెద్దదే. స్త్రీలు, పిల్లల అభ్యున్నతికి సమాజాన్ని పరిమితం చేసుకున్నారు. ప్రతి స్త్రీకి అందు బాటులో వుండటంకోసం సమాజానికి నెలకు చందా ఒక్క పావలా మాత్రమే పెట్టారు. అంటే యీనాటి యిరవై అయిదు పైసలు. మొదటి నెల ఆదాయం పదిపావలాలు రెండున్నర రూపాయలు. ఈ ధనరాశితో స్త్రీలలో నిరక్షరాశ్యత నిర్మూలనం చేయాలి, చిన్న పిల్లలకు క్లాసులు పెట్టాలి, హిందీ తరగతులు నడపాలి, చేతి పనులు నేర్పాలి, హరిజనోద్ధరణచేయాలి, గ్రంథాలయం స్థాపించాలి. ఇంకా యెన్నోయెన్నో చేసెయ్యాలి. ఇంటింట ధర్మమడిగి నవలలు నాటకాలు యిచ్చినవన్నీ తెచ్చి గ్రంథాలయం రూపొం దించారు. ఇంటింటికి తిరిగి కొన్ని కొత్తగుడ్డలు, అటుయిటు కాకుండ మిగిలి పోయిన ముక్కలు అన్నీ సేకరించితెచ్చి బీద స్త్రీలకు, హరిజన స్త్రీలకు బట్టలు కుట్టటం నేర్పేవారు. తయారయిన దుస్తులను బీదలకే పంచేవారు. కాలం గడుస్తున్నది. కొంత పని జరుగుతున్నది. కాని ఆదాయం మాత్రం నెలకు మూడు రూపాయలకు మించటంలేదు. మహిళా మండలి సభ్యులు తీవ్రమైన ఆలోచనలు చేశారు. నిస్పృహచెందారు. సభ్యులు కష్టపడి సాధనచేసి ఒకనాటకం ప్రదర్శించితే యెంతో కొంతడబ్బు రాకపోతుందాఅన్న ఆలోచన మెరుపులాగవచ్చింది. వెంకటరమణమ్మగారు మూడు నెలలు సాధనచేసి ఒక నాటకం ప్రదర్శించారు. సమాజంవారి ఖర్చులుపోగా వందరూపాయలు మిగిలింది. వందగజాల యెత్తున వుప్పొంగి పోయినారు వెంకటరమణమ్మగారు.

వందరూపాయలకు ఆరోజుల్లో విలువున్నది. అందువల్ల వెంటనే ఒక గది అద్దెకుతీసుకుని "మహిళా సేవా మండలి"ని వసతి గృహంలో ప్రవేశపెట్టి తరించాలనుకున్నారు. పఠనాలయం, గ్రంథాలయం, హిందీ తరగతులు, మొదలైనవి, గోవుతోపాటువత్సం అన్నట్లు బాలానందశాఖ పని ప్రారంభించింది. చివరకు ఒక నౌకరునికూడ నియమించుకున్నామని నవ్వుతారు వెంకట రమణమ్మగారు. సభ్యులందరితో హరిజనవాడలకువెళ్లి వాళ్ళ పిల్లలను స్కూళ్లకు పంపమని, యిల్లు వాకిళ్లు శుభ్రంగ వుంచుకోమని బోధించేవారు. మిఠాయిలు పంచేవారు. మహాత్మాగాంధి, కస్తూరిబా గాంధీల జయంతుల సందర్భంలో హరిజన వాడలకువెళ్లి, వంటలుచేసి వాళ్లకు భోజనాలు పెట్టేవారు. మండలి తరఫున కుట్టుక్లాసుల్లో తయారయిన దుస్తులు వాళ్లకు పంచేవారు. పలకలు బలపాలు కొనియిచ్చి బీదస్త్రీలకు చదువునేర్పేవారు. కుట్లు, అల్లికలు వుచితంగ నేర్పేవారు. జాతీయ పర్వదినాలలో ప్రభాతఫేరీలు, ఖద్దరు అమ్మటం, జాతీయ

గీతాలు పాడుతు వూరేగింపులు జరపటంవంటి అనేక కార్యకలాపాలతో మహిళా సేవా మండలికి మంచిపేరు, గౌరవం సంపాదించి పెట్టారు శ్రీమతి రమణమ్మ; కాని ఆదాయం మాత్రంపెరగలేదు.

ఆమెకు భగవంతుని ఉనికిపై తీవ్ర విశ్వాసం వున్నది. భగవంతుడు ఏదోఒకమార్గంచూపి తీరుతాడు అన్న నమ్మకంతో ఓపికవహించి మండలిని నెట్టుకు వస్తున్నారు. అంతలో గాంధీమహాత్ముడు ప్రవేశపెట్టిన చరఖా కార్యక్రమం స్త్రీలను యెక్కువగా ఆకర్షించింది. ఆర్థికంగాయిబ్బంది పడుతున్న స్త్రీలు అనేకమంది చరఖామీద నూలు వడకటానికి ముందుకు వచ్చారు. వెంటనే పెట్టెరాట్నాలు కొనిబీదస్త్రీలకు నూలు వడకటం నేర్పించారు. నేర్చుకుంటున్న స్త్రీలు వడికిననూలు మండలికేయిచ్చి వెళ్లేవారు. సూత్రయజ్ఞం అంటూ వూరంతాతిరిగి నూలు సేకరించేవారు. ఈవిధంగా సేకరించిననూలు అమ్మకం వల్లకొంతడబ్బు సమకూర్చేవారు మండలికి. నెలకు పావలా చందా కట్టటానికి ముందు వెనుకలాలోచించిన స్త్రీలు యిప్పుడు నిస్సంకోచంగ మూడు చిలపలు యిచ్చి నెలకు చందాచెల్లించినవారు కాసాగారు. చిలపచందా దారులసంఖ్య 80 ని దాటింది. కార్యకలాపాలు మరింతచురుకుగా నెరవేరసాగినవి.

డబ్బు అవసరమైనప్పుడల్లా ఆమెసభ్యురాండ్రను సమకూర్చుకుని నాటకాలు ప్రదర్శింపచేసేవారు. వారికువార్తెలు వేషధారణచేసేవారు. ఆమె స్వయంగావేషం ధరించితే యెవరుగాని ఆమెను గుర్తించలేకపోయేవారు. 1944లో శ్రీయోగానందస్వామి వేషంచూసి అందరు ముగ్ధులయినారు. అది ఆమె ధరించారని చెపితే మిత్రులే నమ్మలేక పోయినారు. 1948 ఏప్రిల్ 10న ఆమె శ్రీహరిరామశర్మ పండితవేషంలో వేదికమీదకు వచ్చివికృతినామ సంవత్సర పంచాంగశ్రవణం చేస్తే సభికులెవరుగాని ఆమెను గుర్తించ లేకపోయినారు. ఆమె పాత్రపోషణా కౌశలం అంతటిది. నాటక ప్రదర్శనకు ఒక్కొక టిక్కెట్టు ధర రెండుచిలపలువడికిననూలు. ఈపద్ధతినవలంబించటంతో చాలావరకు చిక్కులు తీరిపోయినవి. నూలువడికే స్త్రీలకూ కొంత ఆదాయానికి అవకాశంకలిగింది. ఈ సమయానికిమండలి సభ్యులసంఖ్య నూటికిపైగా తయారయింది. ఆచిలపలన్నీ ఖాదీనేత సంఘాలకు అమ్మి ఆ నగదును ఆమె మండలికి అప్పగించేవారు. చేతిలోనుంచి డబ్బు యివ్వనవసరంలేదు. ఒకరిని అడగవలసిన అవసరంలేదు. కొంచెం సేపుకుదురుగా కూర్చునినలుగురితో కబుర్లు చెప్పుకుంటు, విషయాలు చర్చించుకుంటూ నూలువడికితే యిటు మండలికి చందా కట్టవచ్చు మరి నాలుగు చిలపలు చేర్చిపెట్టుకుంటే పిల్లలతోసహా కాని డబ్బు ఖర్చు లేకుండ నాటక ప్రదర్శనలకు వెళ్లవచ్చు. అట్లా ఆమండలి అభ్యున్నతి కోసం శ్రమించుచుతు సాటిస్త్రీలకు చేయూతగా నిలుస్తూ ఈ చిలపల ద్రవ్య మారకం పద్ధతి శ్రీమతి వెంకటరమణమ్మ అమలులో పెట్టారు.

నాలుగు డబ్బులు కలిసి రావటంతో పఠన మందిరం, గ్రంథాలయం పెరిగినవి. వాటిని వుపయోగించుకునే స్త్రీల సంఖ్య పెరిగింది. మండలి జరిపే వుత్సవాలకు ఎంతోమంది ప్రేక్షకులు వచ్చేవారు. పర్యవసానంగా అద్దెకు తీసుకున్న గది చాలలేదు. స్వంతభవనం కావాలన్న కాంక్షబయులుదేరి, అవసరం వత్తిడిపెట్టింది. దాంతో భవననిర్మాణానికి విరాళాలుపోగుచేయటం ఆరంభించారు. ఊళ్లో కొంత పరపతి యేర్పడటంవల్ల నాలుగైదువేలు సమకూరినవి. అదిపెట్టి మంచి కూడలిలో రెండుచోట్ల కొంత స్థలంకొన్నారు. వాటిల్లో పాకలు వేసి యథేచ్ఛగా మండలి కార్యకలాపాలు కొనసాగించారు.

సరిగా ఆసమయంలోనే శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ కేంద్రసంఘసంక్షేమ సమితితరఫున స్త్రీలు పిల్లలఅభ్యున్నతికోసం పాటుపడుతున్న స్వచ్ఛందసేవా సంస్థలకు సహాయసహకారాలను అందించుట ఆరంభమయింది. అది తెలిసిన వెంటనే శ్రీమతి వెంకటరమణమ్మ మండలి తరఫున ధరఖాస్తు పెట్టుకున్నారు. సవిస్తరంగా పరిశీలించిన మీదట కేంద్ర సంక్షేమ సమితి వారు మండలి భవన నిర్మాణానికి ఐదు వేల విరాళం యిచ్చారు. దానికి సరిగా సమానంగా యింకొక ఐదు వేలు జోడించి భవనం కట్టించ వలెనన్నది సమితి నిబంధన. చేతిలో చిల్లిగవ్వలేదు. సభ్యురాండ్రందరితో కలసి యెంతో పట్టుదలతో కార్యరంగంలోకి దూకారు. చుట్టుపక్కల పల్లెలకు స్వయంగా వెళ్లి మండలి చేస్తున్న కార్యకలాపాలు గ్రామీణులకు వివరించి వాళ్లు యిచ్చిన బస్తా, అరబస్తా, పావుబస్తా ధాన్యాలు పదిలంగ తెచ్చుకునే వారు. బందరులో యింటింట బియ్యం బుట్టలు పట్టి బిచ్చం తెచ్చారు. ఊళ్లోవున్న ధనికులను, హోదాలలో వున్న వుద్యోగస్తులను, ధాన్యం మరల యజమానులనుఅడిగి ధనరూపంలో విరాళాలు పోగు చేశారు. చివరకు బాలానందం పిల్లలను కూడ యింటింటికి తిప్పి, చిల్లర డబ్బులు వసూలు చేయించేవారు. వారానికొక రోజు అఖండ సూత్రయజ్ఞం పేర ఆపకుండ నూలు వడికించే వారు. రెండు చివల కొకటిక్కట్టు చొప్పున మళ్లీ సభ్యురాండ్ర నాటక ప్రదర్శన జరిపి కొంత డబ్బు, నూలు, సంపాదించారు. సభ్యురాండ్ర చేతి పనుల తయారీ వస్తువులు అమ్మకంతో కావలసిన మొత్తం ఐదు వేల రూపాయలు చేరేలోపల భవన నిర్మాణానికి కావలసిన ప్లానులు వగైరాలు కూడ సిద్ధమైనవి. 1958లో మహిళా సేవా మండలి స్వంత భవనాలను ప్రవేశించ గలిగింది. వెంకటరమణమ్మగారి కార్యసాధనకు, పట్టుదలకు సంతృప్తి చెంది సంఘ సంక్షేమ సంఘం వారు 1955 నుంచి యీనాటి వరకు ప్రతిసంవత్సరం రెండు వేల రూపాయల గ్రాంటు మండలికి యిస్తున్నారు. మండలిలో పఠనాలయం, గ్రంథాలయం, కుట్టు తరగతులు,

చేతి పనుల శాఖ, హిందీ తరగతులు, శిశువిహార్ క్లాసులు, బాలానందం నిర్విరామంగా జరుగుతువున్నవి. అవసరాన్నిబట్టి అప్పుడప్పుడు మెడికల్ చెకప్‌లు జరుగుతు వుంటవి.

1939లో పదిమంది సభ్యులతో నెలకు రెండున్నర రూపాయల ఆదాయంతో ఆరంభమయిన సంస్థ యీనాడు ముప్పయి మంది రాజ పోషకులు, నలభై మంది జీవిత సభ్యులు, నూట ఎనభై మంది సాధారణ సభ్యులు, యాభై మంది పిల్లలు గల శిశువిహార్‌తో పెద్ద కుటుంబంగా తయారయింది. లక్షరూపాయల ఆస్థి సంపాదించు కున్నది. శ్రీమతి దుర్గా వెంకటరమణమ్మ చిలపలను మారక ద్రవ్యంగా ప్రవేశ పెట్టటమే కాక గాంధీ మహాత్ముడి మాట నమ్మి నూలు తీసి నూలు పోగుసామర్థ్యాన్ని శక్తిని దేశమంతటు చాటు గలిగారు. ఇంత సాధించ గలిగిన వెంకటరమణమ్మగారు నాదేమున్న దమ్మా — యిదంతా నా అనుచర వర్గ సహకారం, తోడ్పాటే అని తమ వినయ సౌశీల్యాలను వ్యక్తం చేస్తుంటారు.

# శ్రీమతి అన్నాప్రగడ చన్నఘంటమ్మ

**జననం 17–11–1913**

దేశంలో వ్యాధిగ్రస్థులు, అనాధలు, అనదలు, కోటాను కోట్లు. కానివారిని ఆదుకునేవారు తక్కువ. వాళ్లలో యెన్నతగినవారు శ్రీమతి చన్నఘంటమ్మ. మద్రాసు త్యాగరాయ నగరు చారి రోడ్డులో వున్న స్త్రీ సేవా మందిర్ విభాగం వరండాలో ఒక జుగుప్సాకరమైన మానవాకారం నేలమీద కదులుతు కనిపించేది. పసితనం నుంచి పోలియో వ్యాధికి గురిఅయి తగిన పెంపు ఆదరణలకు కూడ నోచుకోని ఆ మానవాకృతినే జానకిరాం అని పిలుస్తారు. మరికొన్ని రోజులకు జానకిరాం కాళ్లకు యినపవూతం అమర్చిన ప్రత్యేక బూట్సు తొడుక్కొని, నడుముకు బిగువు నిచ్చే పటకా పెట్టుకుని, యింకా శేషించిన అశక్తతతో మెలికలు తిరుగుతు చిరునవ్వులు చిందించుతు,



శ్రీమతి అన్నాప్రగడ చన్నఘంటమ్మ

కనిపించితే కళ్లు చెమర్చేవి. ఇంక కొంత కాలానికి జానకిరాం ఖాకి బట్టలు తొడుక్కొని ప్రత్యేకమయిన వూతపు బూట్సు వగైరా సాధనాలు ధరించి క్లాసులో కూర్చుని పాఠాలు చదువుతువుంటే సంతోషంకలిగేది. మరికొంత కాలానికి చదువుముగిసి, ప్రత్యేక బూట్లతోనే అయినా తన కాళ్లతోతాను భూమి మీద నడుచుకుంటు స్వజనం దగ్గరకు జానకిరాం వెళ్లినప్పుడు మొత్తానికి ఆమె జయించారు అనిపించింది.

జరీపువ్వుల బెనారస్ చీరకట్టుకుని, తెల్లగులాబిరంగు శరీరంతో, కొత్తపెళ్లి కూతురుగా సిగ్గుదొంతరలమధ్య ఎరుపెక్కిన బుగ్గలతో అతిధుల ఆశీస్సుల నందుకుంటున్న ఒక సౌభాగ్యవతిని చూసిన వాళ్లెవరు, నా అనేవారు లేక ఆమె స్త్రీ సేవామందిర్ లో పెరిగి పెద్దయి, సంపన్నయువకుడి అర్ధాంగిగా వెళ్తున్నదని తెలుసుకోలేరు.

స్త్రీ సేవా మందిర్ ఉపాధ్యక్షురాలుగా చన్నఘంటమ్మగారి సాధనకు పరిశ్రమకు యిటువంటి నిదర్శనాలు అసంఖ్యాకం.

ఆమె 17–11–1913 న ఏలూరులో శ్రీవత్సమణి, రావుబహదర్ కల్లి చిట్టి అబ్బాయి నాయుడుగార్లకి జన్మించారు. ఆమెకు అన్న, తమ్ముడు, చెల్లెలు వున్నారు. స్త్రీలకు స్కూళ్ళులేని ఆ రోజుల్లో ఆమెతల్లి మిషనరీల సహాయంతో ఇంగ్లీషు, కుట్లు, అల్లికలు నేర్చుకున్నారు. వయొలిన్ చక్కగా వాయించేవారు. శ్రీమతి చన్నఘంటమ్మకి ఎనిమిదవయేటనే కన్న తల్లి కరువైనారు.

తండ్రి బహుకాలం స్వగ్రామమైన వుూళ్లకు పంచాయతీ అధ్యక్షులుగా వుండి గ్రామానికి లైట్లు, రోడ్లు, స్టేషను, పోస్టాఫీసు వంటి వసరులు కల్పించారు. విద్యాభిమాని కావటాన స్వగ్రామమైన వుూళ్లలో మాధ్యమిక స్కూలు స్థాపించి 20 సంవత్సరాల పాటు సగం ఖర్చు భరించి నిర్వహించారు. ఇటీవల అది హైస్కూలుగా కూడ అభివృద్ధి చెందింది. వుూళ్లలో ఆమె చాలా ఘోషా పద్ధతిగా పెరిగారు. వంచిన తలయెత్తకుండ క్లాసులో కూర్చుని తండ్రి పెట్టించిన స్కూల్లో ఎనిదవ తరగతి ముగించారు.

హైస్కూలు చదువుకు రాజమండ్రి వెళ్లవలసివచ్చింది. ఆరోజుల్లో హైస్కూలుకు హాస్టలు సదుపాయం లేకపోవటాన ట్రెయినింగు కాలేజీ స్త్రీల హాస్టలులో వుండేవారు. సమవయస్కులైన చిన్న పిల్లలు అక్కడ యెవరు లేక పోవటంతో మామూలు ఆట పాటలతోనవ్వుతు, తుళ్లుతు వుండటానికి ఆమెకు అవకాశమేరాలేదు. జంకువదలి తిరగటానికి ఘోషా దాంతో గంభీరంగా ఆలోచించటం, వినిన విషయాలను మననం చేసుకోవటం వంటి లక్షణాలుయేర్పడినవి. శ్రీ వీరేశలింగం పంతులుగారు స్థాపించిన శరణాలయాలు, ఆశ్రమాలు శ్రీ పిఠాపురం రాజావారు నెలకొల్పిన శరణాలయాలు ఆమె ఆలోచనలలోకి తరుచు ప్రవేశించుతు వుండేవి. ఆసమయంలో డాక్టరు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి చెల్లెలయిన శ్రీమతి నల్లముత్తుఅమ్మాళ్ హైస్కూలుకు సూపరింటెండెంటుగా వుండేవారు. ఆమె అప్పుడే విదేశాల నుంచి తిరిగివచ్చారు. అందువల్ల చదువుతోపాటు పిల్లలలో యెన్నెన్నో ఆశయాలు భావాలు కలిగించాలని స్కూలు నిర్వహణలోనే కొత్తపద్ధతులు ప్రవేశపెట్టాలని చాలా వుత్సాహ పడేవారు. ఆమె సంఘసేవ, సంఘ సంస్కారం, ప్రతి ఒక్కరు యితరుల కష్టాలను బాధలను తొలగించటానికి పూనుకోవలసిన ఆవశ్యకతలను గురించి చెపుతూవుండేవారు. అవన్నీ చన్నఘంటమ్మగారి మెత్తని మనసులో గాఢంగ నాటుకున్నవి. శ్రీమతి నల్లముత్తుఅమ్మాళ్ స్కూలు

మొత్తంమీద మీకునచ్చిన అమ్మాయిని రహస్యవోటింగు ద్వారాఎన్నుకోమని విద్యార్థినులందరిని ప్రోత్సహించారు. శ్రీమతి చన్నఘంటమ్మ స్కూలు మొత్తం మీద మంచి అమ్మాయిగా యెన్నికయి చెల్లమ్మాళ్ రాజగోపాలన్ రజతపతకం అందుకున్నారు. మొత్తం కోస్తా జిల్లాల మీద ఇంగ్లీషులో మంచి మార్కులు రావటాన స్కూలుఫైనలులో కూడ బహుమతి లభించింది. కాలేజీ చదువులకు మద్రాసు వెళ్లారు. ఇంటరులో తెలుగు పాండిత్యానికి బొబ్బిలి రాజావారి బంగారు పతకం వచ్చింది. బి.ఏ.లో ఫస్టుక్లాసు వచ్చింది. ఫిజిక్సుతో ఎం.ఏ చదివి ఫస్టుక్లాసు తెచ్చుకున్నారు. కాలేజీలో మళ్లీ తటస్థపడిన శ్రీమతి నల్లముత్తు అమ్మాళ్ అవ్వైహోం అనాధ శరణాలయాలు, అనాదల ఆశ్రయాలు, ఐస్ హౌస్‌లో నడిపించుతున్న వితంతు శరణాలయం వంటి సంస్థల కార్యకలాపాలు వివరించుతు వుంటే ఆమెకు మంత్రోపదేశం పొందుతున్నంత తృప్తిగా తోచేది.

1937లో మద్రాసు వాస్తవ్యులైన శ్రీ అన్నాప్రగడ వెంకట కృష్ణారావుతో వివాహం అయింది. ఆయన కూడ ఫిజిక్సువేత్త, భౌతిక శాస్త్రానికి పరికరాలు తయారు చేస్తు వుంటారు. భర్తతో పరికరాల నిర్మాణంలోను వర్కుషాపు నిర్వహణలోను సహకరించుతు వుండేవారు. ఎల్.టి. శిక్షణ కూడ పొంది వుండటాన అప్పుడు నాలుగు సంవత్సరాలు స్కూల్లో టీచరుగా పనిచేశారు. కాని అది ఆమెకు బొత్తిగా చప్పగా తోచేది. ఆ సమయంలో దుర్గాబాయమ్మగారు పక్క యింట్లోనే వుంటువుండేవారు. అందువల్ల ఆమెతోను, ఆంధ్ర మహిళా సభతోను చన్నఘంటమ్మగారికి సన్నిహిత సంబంధం యేర్పడింది. చిన్ననాటి నుంచి మనసులో నాటుకున్న సంఘసేవా బీజాలు మొలకెత్తి రెపరెపలాడుతు ఆలంబన కోసం చూస్తున్న పరిస్థితి కావటాన దుర్గాబాయమ్మగారు అడగగానే మహిళా సభలో స్త్రీలను బెనారస్ మెట్రిక్యులేషను పరీక్షలకు తయారు చేయటానికి మొట్టమొదటి టీచరుగా వుత్సాహంగా ఒప్పుకున్నారు. ఆమె విద్యావతి, వినయం, ఆలోచన కావలసినంతగా వున్నవి. తు.చ. తప్పకుండ ఒక క్రమ పద్ధతిలో పని చేయటం ఆమె లక్ష్యం. ఆస్త వుండనేవున్నది. ఇతరుల సామర్థ్యాన్ని క్షణంలో కనిపెట్టగల శ్రీమతి దుర్గాబాయమ్మ ఒకొక్కటిగా ఆమెపైన అనేక బాధ్యతలు పెట్టనారంభించారు. చూస్తుచూస్తు వుండగానే ఆమె ఆంధ్రమహిళ పత్రిక, ఆంధ్ర మహిళా సభ ప్రెస్సు, పారిశ్రామిక శాఖ, ఫామిలీ ప్లానింగు కార్యనిర్వహణా శిక్షణ విభాగానికి చైర్మన్, నర్సింగ్‌హోం అడ్మినిస్ట్రేటివ్ కార్యదర్శినిగా మాత్రమే కాక, మొత్తం మహిళా సభకు శ్రీమతి జమునాబాయితో పాటు జాయింటు కార్యదర్శినిగా సభాభారం వహించారు.

మహిళాసభ నిర్వాహకులకు మొదట తటస్థపడేది సహకారం, సహాయం కోరే అబలలు. ఆసహాయం అందించటానికి సాధనంగా క్లాసులో శిక్షణో, వృత్తో ఆరంభ మయేవి. అవి సలక్షణంగా నడపటానికి ఆదాయం సమకూర్చుకోవలసి వచ్చేది. దానికి కావలసిన పద్ధతులు వుపాయాలు వెతుక్కొని వబ్బంగడువుకోవలసి వుంటుంది. అందువల్ల సర్వదా మెదడు చురుకుగా పనిచేస్తు వూహలు పన్నుతు ఆలోచనలు చేస్తువుండాలి. చన్నఘంటమ్మగారికి వస్తుతః వున్న సద్గుణమే అది. అందువల్ల దుర్గాబాయమ్మ గారు ఢిల్లీలోవున్నా, విదేశాలలోవున్నా తమ కార్యకలాపాలను తాను నిర్విఘ్నంగా నెరవేర్చటమే కాక స్వయంగా బాధ్యతా యుతంగ నిర్వహించటం అలవాటు చేసుకున్నారు. అవసరమైన స్త్రీలకు జీవనోపాధికి అర్హతలు కల్పించి ఆదుకోగలుగుతున్నామన్న తృప్తితో కావచ్చు పారిశ్రామిక శాఖను ప్రాణప్రదంగ భావించుకునే వారు. ఇన్ని అర్హతలు వున్నందున ఆమెను ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమ సమితికి ప్రథమ ఛైర్మన్‌గా 1954 లో దుర్గాబాయమ్మగారు సూచించారు. తరువాత 1959 వరకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సంఘ సంక్షేమ సమితి ఛైర్మన్‌గా దేశం నాలుగుమూలల పర్యటించారు. అనేకానేక స్వచ్ఛంద సేవాసంస్థలు పరిశీలించారు. కార్యకర్తల సమావేశాలలో పాల్గొన్నారు. దాంతో అందుకు సబంధించిన విషయాలు క్షుణ్ణంగా అవగహన అయినవి. అనాథలు, అనదలు సంఘంలో యెట్లా తయారవుతారు, యేయేసహాయాలు వాళ్లకుఅందించాలి, అనేవన్నీ తెలుసుకున్నారు. కాలంగడిచినకొద్దీ కేవలం అటువంటి ఆర్తులకోసం స్వయంగా పూనుకుని చేతనయినంతగా పాటుపడాలని నిశ్చయించుకున్నారు. తమకువున్న సమస్తవ్యాపకాలు, వ్యాసంగాలు 1960 లో వదిలేశారు. స్త్రీ సేవామందిర్ ఉపాధ్యక్షురాలుగా దానిని తన వూహలకు ప్రతిరూపుగా తయారు చేయసంకల్పించుకున్నారు.

స్త్రీ సేవామందిర్ ఆనాడు కొత్తగా పుట్టలేదు. చిల్డ్రన్సు గార్డెన్ స్కూలు వ్యవస్థాపకులైన శ్రీ శర్మదంపతులు, ఆరంభ దశనుంచి వారితో అన్నిట సహకరించుతున్న అద్దంకి సుందరమ్మగారు, మరిఅనేకమంది ప్రముఖులు కలిసి 1949 లోనే స్థాపించారు. వయోజనులైన స్త్రీలకుకొంత కొంత తోడ్పడటానికి, జీవనోపాధికల్పించటానికి, కొన్ని చేతిపనులు, వృత్తి విద్యలు, చదువుతో నడపనారంభించారు. శ్రీమతులు సుందరమ్మగారు అధ్యక్షులు, చన్నఘంటమ్మ గారు వుపాధ్యక్షులుగా వుండేవారు. కాని ప్రతి వారికి వారివారి ప్రత్యేక పనులు, వ్యాసంగాలు వుండటంతో ఆ సంస్థ ఒక మామూలు మహిళా సమాజంస్థాయిలో ఆగి, పని చేయసాగింది. పిల్లికూనలాగ

అద్దెగడపలు యెక్కుతు దిగుతు యిబ్బందులకు లోనవుతు వుండేది. అటువంటి పరిస్థితులలో శ్రీమతి చన్నఘంటమ్మ అదేతన పరమావధిగా 1960లో దాని నిర్వహణకు పూనుకున్నారు.

తాత్కాలికంగా తిండి, బట్ట, ఆశ్రయం కల్పించినా, స్థిరమైన పద్ధతిలో వుపకారం జరిగి ఆర్తులు తమకాళ్లపై తాము నిలబడటానికి కొన్నిఅర్హతలు కలిగించాలి. ఉపాధులు చూపించాలి. అవసరమైన వాళ్లు నిశ్చిత పద్ధతిలో మరికొంత డబ్బు సంపాదించుకోవటానికి అవకాశాలు చూపించాలి. ఒకసారి వృత్తులలో, పనులలో, వుద్యోగాలలోచేరిన స్త్రీలు తమపిల్లల పెంపకం అడ్డువచ్చి వుపాధులు పోగొట్టుకోకుండ చూడాలి. ఇన్నిటిని సమన్వయ పరుచుకుని కుట్లు, అల్లికలు, నేతవంటి సామాన్య విషయాలలోనే కాక, ఆధునిక కాలంలో పనికివచ్చేట్లుగా అన్నిరంగాలలోనూ శిక్షణ అవకాశాలకు ఆమె పథకాలుతయారు చేసుకున్నారు. ఆమె తనకున్న అనుభవ పరిజ్ఞానానికి చక్కని ఆలోచన, క్రమవిధానం, పరిశ్రమ జోడించారు. సంక్షిప్తవిద్యావిధానాలు, కుట్టు అల్లికల క్లాసులు, క్రెష్, బాల్వాడీ, కిండర్ గార్డెను స్కూళ్లు, మాధ్యమిక పాఠశాలలు, హైస్కూళ్లు, పారిశ్రామిక శిక్షణ కేంద్రాలు, కామర్స్‌శిక్షణాలయాలు, అనేకం సక్రమంగా పనిచేస్తు, పరీక్షలకు పంపుతు తయారయినవి. ఆమెతనకున్న ఫిజిక్సు అభిరుచితో, నేడు ఇంజనీరింగుకున్న ప్రాముఖ్యతకు తగినట్లుగా రేడియో మెకానిక్సు, ఇన్‌స్ట్రుమెంటు మెకానిక్సు, ప్రెసిషన్‌వర్క్సువంటి అనేకానేక సరికొత్త విభాగాలను కూడ నెలకొల్పారు. ఒకచోట వుయ్యాళ్లలో పసిపాపలను జోకొడుతుంటే, మరొక విభాగంలో అమ్మాయిలు ప్లాస్టిక్కు పరికరాలకు భాగాలను మూసల్లో పోతపోస్తువుంటారు. ఒకచోట శిల్కు దారాలతో లతలు పూవులు కుడుతువుంటే, మరొకచోట పరిశ్రమాగారాలలో వుపయోగించే తోలుగ్లౌస్ తయారుచేస్తుంటారు. ఒకచోట పిండిమరలు, కాఫీపొడి మరలతో జీవనోపాధి నేర్చుకుంటూవుంటే మరొక విభాగంలో ఎలక్ట్రానిక్ పరికరాలు సృష్టించుతు వుంటారు. అంతటి బృహత్ కార్యక్రమం చూసి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలే కాక విదేశాలు కూడ ఆర్థిక సహాయం చేస్తున్నవంటే సబబే. అశోకనగర్, సాలిగ్రాం, విరుగంబాకంవంటి చోట్ల బ్రహ్మాండమైన స్వంతభవనాలు వున్నవి. పాతిక లక్షల విలువచేసే నాలుగంతస్థుల 'ఫుడ్ అండ్ న్యూట్రిషన్' అనే బృహద్భవనం తుదిమెరుగులు దిద్దుకుంటున్నది. పోషక ఆహార విజ్ఞానం సమగ్రంగా బాలికలకు యువతులకు అక్కడ కలిగించుతారు. శుభ్రంగా, రుచిగా, శుచిగా, శరీరానికి పుష్టికలిగించే ఆహార పదార్థాలను తయారుచేయటం, నిలవచేయటం, సమగ్రమైన పరిజ్ఞానంతో వయసుకు, పరిస్థితికి, సమయానికి తగినట్లు పదార్థాలు తయారు

చేసి బాల్వాడీలు, స్కూళ్ళు మొదలయిన వాటికి ఆరోగ్య సూత్రాల ప్రకారం అందిచటం వంటి విద్యలెన్నో అక్కడ నేర్పబోతున్నారు. తద్వారా మరియెంతో మందికి విద్య, వ్యాసంగం, జీవనోపాధి సమకూరనున్నవి. ఎంత తక్కువగా అంచనావేసినా స్త్రీసేవా మందిర్ సంస్థకు 80 లక్షలకు పైచిలుకు ఆస్తి ఏర్పడింది. ''దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్'' అన్న సూక్తి ప్రకారం చూసినా మందిర్ నీడన చదువో, జీవనోపాధో, వృత్తో, వుద్యోగమో, ఆశ్రయమో, సంరక్షణో పొందుతున్న వారిసంఖ్య మూడున్నర వేలుదాటి వుంటుంది. ఇదంతా శ్రీమతి అన్నాప్రగడ చన్నఘుంటమ్మ కృషి ఫలితం. రాత్రింబగళ్ళు ఆమెకదే ధ్యాస, అదే ఆలోచన. అందువల్లనే ఆమెను ఆమె నిరవధిక కృషిని గమనించినవారు ఆమె జయించారన్నా, ఆమె సాధించారన్నా నిజమేననిపించుతుంది.

---

# శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మగారు

**జననం 1908** **మరణం 23-10-1980**

అది 1977 సంవత్సరం సెప్టెంబరు 30 వ తేదీ. ఆనాడు హైదరాబాదునగరం లలితకళా కల్చరల్ అసోసియేషనువారు రవీంద్రభారతిలో వార్షికోత్సవం జరుపుకుంటున్నారు. హాలులో ప్రవేశించిన సభికులు స్టేజిమీద పెడగా ఒక మూలగా కూర్చునివున్న రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్య గార్లను చూసి తికమక పడసాగారు. ఇంతలో చిన్నారులు కొంత మంది చిట్టిచిట్టి మల్లెలు, చిన్న గులాబులు, చిరు చేమంతులు ప్రేమలు పండిన మమతలు ముగ్గిన, పాపల పాలిటి సురతరువుల్ మన అన్నయ్యకు, మన అక్కయ్యకు ఘనసన్మానమహో అంటూ వేదిక నలంకరించటం జరిగింది. మామంచి అన్నయ్య దయచేయవయ్యా, మామంచి అక్కయ్య వేంచెయ్యవమ్మా అంటు కూర్చోపెట్టి పండ్లు పూలు కొత్తబట్టలుయిచ్చి ప్రణమిల్లారు పిల్లలు. "మాతాతయ్యల కన్నయ్య అక్కయ్యలు, మానాన్నలకు అత్తయ్యలకు అన్నయ్య అక్కయ్యలు, మరిమాతో పాటు ఆంధ్రదేశానికంతకీ మీరు అన్నయ్య అక్కయ్య" లంటు వింతచుట్టరికానికి నవ్వుల జల్లులు వెదజల్లారు. ప్రేక్షకులు ముగ్ధులయినారు. ఆనందాశ్రువులు తుడుచుకుంటు పిల్లలు చెప్పినట్లల్లా చేశారు అన్నయ్యా అక్కయ్యా. ఈ చిన్న ప్రోగ్రామే రేడియో అన్నయ్య అక్కయ్యల గురించి విపుల గ్రంథాలు వినిపించగలదు. రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్య దంపతులు. అనేకమందికి తెలియకపోవచ్చుకాని, వారికి అసలుపేర్లు వేరేవున్నవి. వారిపేర్లు శ్రీన్యాయపతి రాఘవరావు, శ్రీమతి కామేశ్వరమ్మ. 33 సంవత్సరాలుగా మద్రాసు, హైదరాబాదులలో రేడియో అక్కయ్యగా ప్రసిద్ధిపొందిన శ్రీమతి



శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మ

కామేశ్వరమ్మ 1908 డిశంబరులో జన్మించారు. విశాఖపట్నంజిల్లా విజయనగరం వీరి జన్మస్థలం. విద్వత్ కుటుంబానికి చెందిన శ్రీమతి సత్యలక్ష్మమ్మ, శ్రీ పేరి రామమూర్తి వీరి తలి దండ్రులు. విజయనగరంలోనే చిన్నక్లాసుల చదువు ముగించారు. ఆడపిల్లలకు అక్కడ హైస్కూలు లేని కారణంగా విశాఖపట్నంలో హాస్టలులో వుంటు, క్వీన్ మేరీ గరల్సు హైస్కూల్లో 1920 నుంచి 1926 దాకా చదివి స్కూలు ఫైనలు పాసయినారు. ఆ రోజుల్లో చదువునిమిత్తం ఆడపిల్లను పొరుగూరు పంపటం హాస్టలులో వుంచటం యేతన్మాత్రపు విషయాలుకావు. కాలేజి చదువు చదివితీరాలని అమ్మాయి మొండి పట్టుదల. అంతకు శక్తిచాలక సెకండరీ ట్రెయినింగుకు వెళ్లమని పెద్దల హితబోధ. స్వగ్రామమయిన విజయ నగరంలోవున్న మహారాజా వారి కాలేజిలో అప్పుడే కొత్తగా ఆడ పిల్లలను చేర్చుకుంటున్నామని ప్రకటించారు. సంస్థానానికి అప్పట్లో దివానుగావున్న మామిడిపూడి వెంకటరంగయ్యాగారు ఆడ పిల్లలు జీతం కట్టనవసరం లేదని నిర్ణయించారు. స్త్రీ విద్య పట్ల ఆస్త శ్రద్ధగల రాజమాత, శ్రీమతి కామేశ్వరమ్మ చదువు నిరాఘాటంగా జరిగి పోవటానికి స్కాలర్‌షిప్పు కూడ యేర్పాటు చేశారు. కామేశ్వరమ్మగారి కోరిక తీరింది. విజయనగర మహారాజా వారి కాలేజిలో చదివి పట్టభద్రఅయిన మొదటి మహిళ ఆమె. ఆర్థిక పరిస్థితుల కారణంగానే బి.యిడి. చేయాలన్న కోరికవునా సాగలేదు. ఆమె మిత్రురాలు శ్రీమతి శ్రీ పెరంబుదూరు సుభద్రమ సలహా సహకారాలతో ఒక జమీందారిణికి ఇంగ్లీషు ట్యూటరుగా చేరారు. కొంతకాలం అట్లా పనిచేసి కావలసిన డబ్బు సేకరించుకుని బి.యిడి. చదవాలని ఆమె వుద్దేశం. ఇంతలో 1935 లో న్యాయపతి రాఘవరావుగారితో వివాహ జరిగింది. ఉద్యోగాన్వేషణలో దంపతులు మద్రాసు చేరుకున్నారు. భర్తకి హిందూ పత్రిక ఆఫీసులో వుద్యోగందొరికింది; కామేశ్వరమ్మ గారు లేడీవిల్లింగ్‌డన్ ట్రెయినింగు స్కూల్లో ఎల్. టి. క్లాసులో చేరటం జరిగింది. ఆమె కోరిక సిద్ధించింది. నిజమైన ఆర్తివుండి పట్టుదల వుంటే, పరిస్థితులను అధిగమించ వచ్చుననటానికి యిటువంటి వారి విజయాలేతార్కాణం. మద్రాసు మైలాపూరులోని నేషనల్ గరల్సుహైస్కూలు (దానినే యిప్పుడు లేడి శివస్వామి గరల్సు హైస్కూలు అంటారు.) ఇంగ్లీషు టీచరుగా 1937 నుంచి 1945 వరకు పనిచేశారు. అక్కడ పాఠ్య విషయాలన్నీ ఇంగ్లీషులో చెప్పేవారు. తెలుగు, తమిళం, మాతృ భాషలు. ఉన్నట్లుండి తమిళ మీడియం కూడా పెట్టి తమిళులపై పక్షపాతం చూపించారు. అంటే తెలుగు పిల్లలను చిన్నచూపు చూశారు. దాంతో తెలుగు తలి దండ్రులకు చిన్నతన మనిపించింది. ఏవిధమైన నష్టము తనకు లేక పోయినా తను కూడ తెలుగు స్త్రీనే గదా అన్న ఆత్మాభిమానంతో మళ్లీ త్వరలో యింకో వుద్యోగం దొరుకుతుందా లేదా అన్నసంశయం కూడలేకుండ శ్రీమతి కామేశ్వరమ్మ వుద్యోగానికి రాజీనా

యిచ్చారు. మదరాసులోని తెలుగు పిల్లలు చక్కని తెలుగు చదువుతు వ్రాస్తూ యెవరికీగాని తీసిపోని ప్రత్యేకతను ఆధిక్యతను కలిగి వుండాలని ఆమె పట్టుదల. ఈ విషయంలో ఆ దంపతులిద్దరిదీ ఒకే అభిప్రాయం. తెలుగుభాష యందు పిల్లలకు ప్రోత్సాహం కలిగించటానికి, విజ్ఞానం పెంపొందించటానికి పత్రిక వుండి తీరాలన్న సంకల్పంతో "బాల" అనే బొమ్మల మాసపత్రికను ప్రత్యేకించి బాలలకోసం నెలకొల్పారు. ఆంధ్రదేశం మొత్తం మీద యిది మొదటి తెలుగు పిల్లల బొమ్మల పత్రిక. వారిద్దరు సంపాదకులుగా వుండి విజ్ఞానాత్మకమైన రచనలు చేస్తు తెలుగుబాలలకు బోలెడంత బాలవాఙ్మయం పెంపొందించారు, మార్గదర్శకులైనారు. తెలుగు సినీడైరెక్టరు ప్రొడ్యూసరు అయిన శ్రీ. కె.ఎస్. ప్రకాశరావుగారు నిర్మించిన బూరెల మూకుడు, కొంటెకిష్టయ్య, రాజయోగం, అనే పిల్లల తెలుగు ఫిల్ములు ఆనాడు నిర్మించటంలో చాలా సహకరించారు. చివరకు నాయిల్లు అనే ఫిల్ములో కామేశ్వరమ్మగారు పిల్లలతో పాటు పాత్రధారణకూడ చేశారంటే ఆశ్చర్య పడకండి. పిల్లలకు పనికి వచ్చే పాటలు పద్యాలు కాలక్షేపాలతో గ్రామ్‌ఫోనురికార్డులు కూడ తయారయినవి. ఆమె వాటిలో కూడ పాల్గొన్నారు.

1939 నుంచి 1956 వరకు మద్రాసు రేడియో వారి తెలుగు బడిపిల్లల కార్యక్రమాలు, స్త్రీల కార్యక్రమాలు, శని, ఆదివారాలలో ఆటవిడుపు, బాలానందం కార్యక్రమాలు నిర్వహించేవారు. కొంతకాలానికి శ్రీ రాఘవరావు కూడ యీమెతోకలిసి పిల్లల ప్రోగ్రాములు నిర్వహించేవారు. ఆ సమయంలోనే వారిద్దరు రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్యలుగా ప్రచారంలోకి వచ్చారు. పిల్లల్లో పిల్లలై ఆకర్షణీయమైన చక్కని ప్రోగ్రాములను ప్రసారంచేసి గొప్ప పేరు ప్రతిష్టలను సంపాదించుకున్నారు. 1956లో అక్కయ్య, అన్నయ్య మద్రాసు వదలి హైదరాబాదు వచ్చి స్థిరపడిపోయినారు. ఆమె 1956 నుంచి 1969 వరకు యీ పదమూడు సంవత్సరాలు రేడియో స్టేషనులో స్త్రీల కార్యక్రమాలు నిర్వహించారు. అన్నయ్య పిల్లల ప్రోగ్రాముల ప్రొడ్యూసరుగా నియమించబడినారు.

జంటనగరాలైన హైదరాబాదు, సికిందరాబాదులలో రేడియో అక్కయ్య 50 రేడియో సంఘాలను ఏర్పాటుచేశారు. మహిళలకు వారివారి అభిరుచులను పట్టి ప్రోగ్రాములు రూపొందించుకునే అవకాశం కల్పించారు. అదే కదంబమాల. తమ భావనాశక్తిని నిర్వహణాశక్తిని పెంపొందించుకునేందుకు వీలుగా ప్రతి సంఘానికి ప్రోగ్రాం యివ్వబడేది. అప్పట్లో యిది చాలా సరికొత్తపంథా. జంటనగరాలలోనేకాక పల్లెటూళ్లలోకూడ అనేక మహిళాసంఘాలు, బాల

సంఘాలు ఏర్పరచారు. కామేశ్వరమ్మ రాఘవరావుగార్లు తరచు గ్రామాలకు వెళ్లి, అక్కడి స్త్రీలతో పరిచయంచేసుకొని అక్కడివారి అభివృద్ధికి తగిన ప్రోగ్రాములు తయారుచేసేవారు. ఈ రకంగా స్త్రీలకు పిల్లలకు చాలానే సేవచేశారు. రేడియోరంగంలో 1937 నుంచి ఏకబిగిన 1969 వరకు వున్నారు.

శ్రీమతి కామేశ్వరమ్మ శ్రీరాఘవరావులు మొదట మద్రాసువెళ్లిన రోజుల్లో తెలుగు పిల్లలకు ఒక సంఘంకాని ఒక క్లబ్‌గానిలేవు. వాళ్ల విజ్ఞాన వికాసాలకు తగిన దోహదమే వుండేదికాదు. నిజం చెప్పాలంటే స్వచ్ఛమైన తెలుగు నేర్చుకునే అవకాశాలే లేవు. ఆ పరిస్థితులలో శ్రీమతి కామేశ్వరమ్మ, శ్రీ రాఘవరావులు మద్రాసు తెలుగుపిల్లలకోసం "ఆంధ్ర బాలానంద సంఘం" నెలకొల్పారు. శ్రీయుతులు కందా భీమశంకరం, దువ్వూరి నరసరాజుగార్లు పూనుకుని బాలానంద సంఘానికి నియమనిబంధనలను ఏర్పరచి 1947 లో దానిని రిజిష్టరుకూడ చేయించారు. రిజిష్టరయిన మొట్టమొదటి పిల్లల సంఘంయిదే. త్వరలోనే దేశమంతట బాలసంఘాలు ఏర్పరచి మద్రాసు ఆంధ్ర బాలానంద సంఘానికి అనుబంధ సంస్థలుగా గుర్తించారు.

కేవలం సంఘాలు నెలకొల్పటంతో ఆగలేదు. రాష్ట్రస్థాయిలో యేనాడు యెరగని విధంగా నాలుగు బాలమహాసభలు జరిపించారు. మొదటి బాలమహాసభ 1950లో మద్రాసులోనే జరిగింది. 1954లో రెండవమహాసభ కర్నూలులో జరిగింది. 1955లో మూడవసభ గుంటూరులో జరిగింది. అంతటితో ఆంధ్రరాష్ట్రం అవతరించటంతో నాలుగవ మహాసభ 1957లో హైద్రాబాదులో జరిపించారు. ఈ సభలకు ఆంధ్రదేశం నాలుగుమూలలనుంచి బాలసంఘాల సభ్యులు, ప్రతినిధులు వచ్చారు.

అప్పట్లో కేంద్ర సంఘసంక్షేమ సమితికి శ్రీమతి దుర్గాబాయిదేశముఖ్ అధ్యక్షులుగా వుండేవారు. పిల్లల అభ్యున్నతికి శ్రీమతి కామేశ్వరమ్మ శ్రీ రాఘవ రావులు జరుపుతున్న కృషి ఆమెకు ఎంతగానో నచ్చింది. దాంతో కేంద్ర సంఘ సంక్షేమ సంఘం తరఫున ఆంధ్ర బాలానంద సంఘానికి ప్రతి సంవత్సరం గ్రాంటు మంజూరుచేశారు. పిల్లల సంచార గ్రంథాలయం నడపటానికి ప్రత్యేకంగా ఒక వాన్, పిల్లల ఫిల్ములు చూపించటానికి ప్రత్యేకంగా ఒక ప్రొజక్టరుకూడ బహూకరించారు. దాంతో బాలానందసంఘం పిల్లలసేవలో మరొకమలుపు తిరిగి సేవారంగం మరింత విస్తృతంఅయింది. పౌరులు

కూడ వుదారంగ విరాళాలుయిచ్చి తోడ్పడేవారు. అందువల్ల ఆంధ్ర బాలానంద సంఘం మూడు పూవులు ఆరు కాయలుగా అభివృద్ధిపొందింది.

శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ కేంద్ర సంఘ సంక్షేమ సమితికి అధ్యక్షురాలుగావున్న సమయంలో ప్రతి జిల్లాకు ఒక సలహా సంఘాన్ని ఏర్పాటుచేశారు. ముఖ్యంగా పల్లెప్రాంతాలలో సంక్షేమ విస్తరణ కేంద్రాలను ప్రారంభించారు. మద్రాసులోని ఆంధ్రమహిళా సభకూడ ఒక ప్రాజక్టును చేపట్టింది. ఆ ప్రాజక్టు తరఫున నెల్లూరు జిల్లా సూళ్ళూరుపేట తాలూకాలోవుండే అనేక గ్రామాలలో మాతాశిశు సంక్షేమ కేంద్రాల కమిటీకి శ్రీమతి కామేశ్వరమ్మను కన్వీనరుగా నియమించారు. ఏవసతులు వనరులులేని మారుమూల కుగ్రామాలలో ప్రసూతి కేంద్రాలు, పిల్లలకు బాల్వాడిలు నెలకొల్పటానికి పడినకష్టం శ్రీమతి కామేశ్వరమ్మ యెప్పటికి మరుపురాదంటారు. మహిళాసభ కార్యకర్తలైన శ్రీమతులు సుగుణమణి, హైమవతి, గజ్జల లీల లతో కలసి, పడవలలోను చేలగట్లనుపడి మారుమూల కుగ్రామాలు చేరుకోవటమే ఒక పెద్ద అనుభవం. ఇక ఆగ్రామీణుల మూఢాచారాలను అజ్ఞానాన్ని తొలగించటం యేతన్మాత్రపు పనికాదని యెంతో ఓర్పునేర్పు అవసరమైందని కామేశ్వరమ్మగారు పాత విషయాలను జ్ఞప్తికి తెచ్చుకుంటు అంటారు. ఇరకం అనే చిన్న ద్వీపంలో ప్రసూతికేంద్రాన్ని యేర్పరచి, అక్కడ యేయితర వైద్యసహాయం లభించదు కాబట్టి మంత్రసాని బదులు ఒక నర్సునే నియమించారుట. డ్యూటీలో చేరటానికి వచ్చిన ఆ నర్సు చెట్లుదాటి, పుట్టదాటి, అటుపైన యేరుదాటి, తాటిచెట్ల మధ్యన బిక్కుబిక్కుమని కనిపించే ఆ కుగ్రామాన్ని దూరం నుంచే చూసి నాకీ వుద్యోగంవద్దు మొర్రో అని యేడుపే అరంభించిందట. అప్పుడు కామేశ్వరమ్మగారు ''భయంలేదమ్మ నీతో పాటు నేనూ నాలుగు రోజులు వుంటాను. తరచు వస్తూ పోతూవుంటాను, మధ్య మధ్య నీవు మద్రాసువచ్చి మాయింట్లో నా దగ్గరవుండి వెళ్తుండు'' అని బుజ్జగించి, లాలించి ప్రవేశపెట్టారుట. ఆంధ్రమహిళాసభ సభ్యులు, ఇంప్లిమెంటింగు కమిటీ అధ్యక్షులు యిచ్చిన ప్రోత్సాహం, ఆంధ్రబాలానంద సంఘంవారి సాంస్కృతిక కార్యక్రమాలునన్ను ఆదుకున్నాయని శ్రీమతి కామేశ్వరమ్మగారు నవ్వుతారు. ఆమెసేవారంగంలో యీ కన్వీనరు పదవీ నిర్వహణ ఒక అపూర్వ ఘట్టం. 1956 లో మద్రాసువదిలి హైదరాబాదు వచ్చేయటంతో ఆ హోదా ముగిసింది.

బాలానందసంఘం ప్రధాన కార్యాలయంకూడ మదరాసు నుంచి హైద్రాబాదుకు తర్లివెళ్లింది. అప్పటి వరకు హైద్రాబాదులో తెలుగు

పిల్లలకు యేసంఘాలు, సాంస్కృతిక కార్యక్రమాలులేవు. మళ్లీ శ్రీమతి కామేశ్వరమ్మ శ్రీరాఘవరావులకు చేతినిండా పని దొరికింది. హైదరాబాదు బాలానంద సంఘానికి శ్రీమతి దుర్గబాయి దేశ్‌ముఖ్ ప్రారంభోత్సవం చేశారు. నిర్విఘ్నంగా జరిగిపోతున్నది. హైదరాబాదు రేడియో స్టేషనులో బాలల ప్రోగ్రాములు నిర్వహించి మరింత మందికి అక్కయ్య అయినారు. ఆమె వయసు 71 సంవత్సరాలు. రేడియో వుద్యోగంనుంచి రిటైరయినారు. ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీవారు నడుపుతున్న బాలప్రతికకు సంపాదకులుగా వుంటు బాలానందసంఘ కార్యక్రమాలను మరింత వుత్సాహంగా నెరవేరుస్తున్నారు. తెలుగు బాల ప్రపంచాన్ని కొత్త శిఖరాలకు తీసుకువెళ్లి తెలుగుబాలల జీవితాలకొక కొత్త అర్థాన్ని కల్పించిన శ్రీమతి కామేశ్వరమ్మ శ్రీరాఘవరావుగార్లు యేనాటికీ మామంచి అక్కయ్య మా మంచి అన్నయ్యలే.

---

# డాక్టరు శ్రీమతి చన్నా సరస్వతీరావు

**జననం 1914**

కాకినాడ పట్టణం రెడ్‌క్రాసు సంఘ కార్యాలయంలో వున్న డాక్టరు శ్రీమతి సరస్వతీరావుని కలుసు కోవటానికి ఆమె పరిచయులొకామె వచ్చారు. ఇద్దరు కబుర్లలోకి దిగారు. వెంటవచ్చిన 4, 5 ఏళ్ళఅబ్బాయికి యీకబుర్లేమి రుచించలేదు. బయట ఆవరణలో తిరుగుతు తిరుగుతు బావి దగ్గరకు వెళ్ళాడు. బావికనపడగానే తొంగిచూడటం పెద్ద వాళ్లకే అలవాటు. అబ్బాయి తొంగిచూసి నీడ చూసుకుని మురిసి పోయిచివరకు నీళ్లలో పడిపోయినాడు. అదిచూసిన మరొకపిల్లవాడు కబుర్లలో మునిగివున్న పెద్దలకు చెప్పాడు. తల్లిగగ్గోలుపడుతూ బావిదగ్గరకు పరుగెత్తింది. "సిరికిం చెప్పడు శంఖుచక్రయుగమున్ చేదోయి సంధింప" దన్న పోతన గారి శ్రీమన్నారాయ ణుని స్ఫురింపచేస్తు శ్రీమతి సరస్వతీదేవి ఒక్కపరుగున బావి చేరుకున్నారు. వెనుక, ముందు, ఆలోచించకుండ గభాల్నబావిలోకి దూకేశారు.లోపలగోడలకున్న రాళ్ల సందులో



శ్రీమతి చన్నా సరస్వతీరావు

వేళ్లదూర్చి నిల దొక్కుకుని పిల్లవాడి చొక్కాపట్టుకుని మునిగిపోకుండ తేల్చి పట్టుకున్నారు. ఇంతలో అందరు గుమిగూడి యిద్దరినీ సురక్షితంగా బయటికి చేర్చారు. వెంటనే ఆమె ప్రథమ చికిత్స చేసి పిల్లవాడిని వూపిరి తిప్పుకునేట్లు చేశారు. నిజానికి ఆమెకు ఈత రాదు. కేవలం ఆ ప్రాణిని రక్షించాలన్న పట్టుదల ఒకటే ఆమెకు ధైర్యాన్ని శక్తిని సమకూర్చి పెట్టింది. ఇది 1943 లో జరిగిన గాథ. కాని ఆమె పట్టుదల సాహసం త్యాగం యీనాటికీ చెక్కుచెదరలేదు.

ఆమె 1914లో మహాశివరాత్రినాడు చల్లపల్లి గోపాలరావు సీతాదేవిగార్ల కుమార్తెగా రాజమండ్రిలో జన్మించారు. పితామహులైన చల్లపల్లి బాపయ్యగారు శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారికి అన్నివుద్యమాల లోను, సంస్కారాలలో చేయూత నిచ్చారు. ఆమె తల్లి

శ్రీమతి సీతాదేవి పెద్దాడ వెంకట సుబ్బమ్మగారితో కలసి దేశ బాంధవి దువ్వూరి సుబ్బమ్మగారి ఆధ్వర్యాన స్త్రీ విద్యావ్యాప్తికి పాటుపడుతు వుండేవారు. మహిళా సభలు సమావేశాలు జరుపుతు వుండేవారు. శ్రీమతి సరస్వతీ దేవి చిన్ననాడు శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మతో కలసి ఎన్నో సాంఘిక కార్యకలాపాలలో పాల్గొనేవారు. గాంధీమహత్ముడు రాజమండ్రి, కాకినాడ వచ్చినప్పుడు వీరిద్దరు యెంతో చురుకుగ సభల్లో వెండి బంగారాలతోసహా విరాళాలు పోగుచేసి మహత్ముడికి అంద చేశారు. చిన్ననాటి యీవాతావరణం వల్ల కావచ్చు, ఆమెకు సేవా తత్పరత అధికం. ఆమె తల్లి తొట్టి స్నానాలు, మట్టి పట్టీలు, చల్లని నీటి పోతలు, ఆతపస్నానాల నంటి ప్రకృతి చికిత్సా విధానంతో కుటుంబంలోని వారికి యిరుగు పొరుగు వారికి జబ్బులు నయం చేసేవారు. అందువల్లనేమో కాకినాడలో ఇంటరు ముగించినతరువాత రక రకాల చదువులు వుండగా ఆమె మద్రాసులో పబ్లిక్ హెల్తు, నర్సింగు మిడ్వైఫరీ, హెల్తు విజిటింగులలో శిక్షణ పొందారు. భర్త శ్రీ సి. భాష్యకార్లరావు డాక్టరేటు పొందటానికి ఇంగ్లండు వెళ్లినప్పుడు యీమె కూడ వెళ్లారు. అక్కడ వింతలు, వినోదాలు, క్లబ్బులు, డాన్సులు చూసి ఆనందించడానికి బదులు ఆమె ప్రసిద్ధి పొందిన ఆసుపత్రుల్ని విశదంగ చూసేవారు. ఎన్నిటిలోనో కానిడబ్బు జీతం లేకుండ ఉచితంగా పని చేశారు. అక్కడ 3సంవత్సరాలు వుండి భర్త డాక్టరేటు పొందిన మీదట తిరిగి వచ్చారు. కొంతకాలం మద్రాసులోవున్నారు. అప్పుడు ఆంధ్ర మహిళా సభతో పరిచయం యేర్పడింది.

ఆంధ్రరాష్ట్ర యేర్పడిన కొత్తల్లో ఆమె భర్త డాక్టరు సి. బి. రావు 1952–1957 వరకు విద్యా విభాగంలో డిప్యూటీ డైరెక్టరుగా కర్నూలులో వుండేవారు. అప్పుడామె కర్నూలులోనే కాక చుట్టు పక్కల గ్రామాలకు వెళ్లి యే పరిస్థితిలో యే రకమైన సహాయం అవసరమైతే అవి వారికి అందించుతు వుండేవారు. పల్లెటూళ్లలో మూఢాతత్వాలు, కక్షలు కావేషాలు అధికం. కర్నూలు సమీపానవున్న రోజా గ్రామంలో కూడ అంతే. దాని నొక తోవకు తీసుకు రావాలనుకున్నారు. ఆమె పట్టుపడితే యేతన్మాత్రంగ వదలరు. గ్రామస్థులను సమావేశ పరచి వాళ్ల అసలు సమస్యలేమిటో అవి యెట్లా పరిష్కరించుకోవాలో దానికి సంఘీభావం, ఐకమత్యం యెంత ముఖ్యమో వివరించేవారు. పట్టుదలలు, కక్ష్యలు పాటించుతు శక్తిని సమయాన్ని యెంత వృధా చేసుకుంటున్నారో విడమరచి చెప్పేవారు. క్రమంగా గ్రామస్తులు ఆమె మాటల నిజాయితీని, నిజాన్ని గుర్తించి ఐకమత్యంతో గ్రామ సౌభాగ్యానికి కృషిచేయ నారంభించారు. ఇదంతా గమనించిన గవర్నరు సతి శ్రీమతి కుసుమ్ త్రివేదిగారు సంతోషంతో శ్రీమతి సరస్వతీదేవిని అభినందించి

గ్రామస్థులకు పొగ లేకుండ చక్కగా మండే కొత్తరకం పొయ్యిలు, మురుగునీరు రోడ్ల మీదకు ప్రవహించకుండ భూమిలోకి పోయే పారుదల యేర్పాట్ల కోసం అదనంగా కొంత ఆర్థిక సహాయం చేశారు. శ్రీమతి సర్వతీదేవి అనేక విషయాలను గురించి గ్రామీణులకు తెలియచెపుతు వుండేవారు. రోటరీ క్లబ్బు తరఫున ఆటలు, పాటలు, నాటకాలు వంటి వినోద కాలక్షేపాలు, ఆట పాటలలో పోటీలు పెట్టి గెల్చిన వారికి కలెక్టరు భార్య చేత బహుమతి ప్రదానం చేయించేవారు. దాంతో గ్రామస్థులకు కావసినంత ఉత్సాహం సత్కాలక్షేపం సమకూరినవి. స్కూలు పిల్లలలో జూనియర్ రెడ్‌క్రాసు ఉద్యమ ప్రచారంచేసి పిల్లలకు తమకుతాముకాని యితరులకుగాని అవసర పడినప్పుడు ప్రథమ చికిత్సచేయటం కట్లు కట్టటంవంటి అనేక విషయాలను సులువుగా అర్థమయేట్లుగా బోధించేవారు. జూనియర్ రెడ్‌క్రాసు సలహాదారుల సమావేశాన్ని సంఘటిత పరచి నూరు గ్రామాల నుంచి 650 పైగా టీచర్లు హాజరయేట్లు చేశారు. దాంతో జూనియర్ రెడ్‌క్రాసు ఉద్యమ చైతన్యం అక్కడ విస్తరించింది. ఈమె కృషికి మెచ్చుకుంటూ రాష్ట్ర రెడ్‌క్రాసు సంఘం వారు తమ కార్యకర్తల సమావేశాలకు ఆమెను తరచు ఆహ్వానించుతు వుండేవారు. ఆ సమావేశాలలో ఆమె తల్లులు గృహిణుల మధ్యసకృషి, గృహిణుల పాత్ర, జూనియర్ రెడ్‌క్రాసు పాత్రవంటి అనేక ప్రయోజనకర అంశాల పైన వ్యాసాలు వ్రాసి చదివేవారు. ఈ రకంగా గ్రామాలకు యెంతో సేవ చేశారు.

1953 ఆగస్టులో రాజమండ్రి సమీపాన గోదావరి గట్టుకి గండిపడి వరద వచ్చింది. కొన్ని కొన్ని ప్రదేశాలలో 12–15 అడుగుల యెత్తున నీరు వచ్చేసింది. దాంతో నది గట్టున నివసించే పేదసాదలు వేలకొద్ది నిరాధారులై పోయినారు. ఆ సమయంలో శ్రీ రావు గవర్నమెంటు ట్రెయినింగు కాలేజికి ప్రిన్సిపాలుగ వుండే వారు. శ్రీమతి సరస్వతీదేవి తనకు సాధ్యమా కాదా అన్న సందేహానికే చోటివ్వకుండ 500 మంది ఆర్తులకు నీడ కల్పించి, స్వంత ఖర్చుతో భోజనాదికాలు సమకూర్చారు. 1970లో హైదరాబాదు మూసీ నది గట్లు తెగి అనుకోకుండ క్షణాల మీద అనేక ప్రదేశాలు నీటిమయం ఐపోయినవి. అప్పటికి హైదరాబాదువాసి ఐన ఆమె వంటరిగా పూనుకుని వరద బాధితులకు ఒక్క చేతిమీదుగా బట్టలు, తిండి పదార్థాలు, విరాళాలు, పోగు చేసి సమకూర్చేవారు. చివరకు 1977 నవంబరు 19న తుఫాను ఆంధ్ర దేశాన్ని అతలా కుతలం చేసిన సందర్భంలో కూడ ఆమె రెడ్‌క్రాసు సంఘం తరఫున వెంటనే ఆ ప్రాంతాలకు వెళ్లి

ఆదుకున్నారు. సమస్తం కోల్పోయిన అభాగ్యులకు కనీసావసరాలయిన బట్టలు, తిండి పదార్థాలు, మందులు అందించి వచ్చారు.

ఆధునిక చికిత్సా విధానంలో కొత్తరకపు ఆవశ్యకత రోగులకు యెంతగానో వున్నది. అనేక సందర్భాలలో రోగికి కొత్తరక్తం యెక్కించవలసివస్తున్నది. సమయానికి అదేగ్రూపుకుచెంది, రోగికి వుపకరించే రక్తం లభ్యం కాక నానాపాట్లు పడటంకూడ జరుగుతూ వుంటుంది. పోనుపోను రక్తదానం ఒక ధనార్జన మార్గంగా కూడ తయారయింది. ఈ పరిస్థితి శ్రీమతి సరస్వతీదేవిని చాలా కలవరపెట్టింది. అందువల్ల ఆమె గృహిణులను కలుసుకునిరక్తంలో వున్న విభేదాలు, యెవరిది యే గ్రూపుకు చెందుతుంది, ఒక్కొక్కరు తమ ఆరోగ్యానికి భంగంరాకుండ, నిస్సత్తువ కలుగకుండ నిశ్చింతగ తడవకు యెంత రక్తం దానం చేయవచ్చు, యెంతెంత వ్యవధి వుండాలి మొదలైన వివరాలు సమగ్రంగ తెలియచెపుతారు. ఇష్టపడి ఐచ్ఛికంగా దానం చేయ పూనుకున్న వారిని బ్లడ్ బాంకు వారికి, ఆసుపత్రులకు పరిచయం చేసి సహకరించుతు వుంటారు. దాదాపు 14, 15 సంవత్సరాలుగా ఆమె యీ కృషిలో నిమగ్నులై వున్నారు. సాధారణంగా పండగలు పబ్బాలు అయితే స్త్రీలు కొత్తబట్టలు సొమ్ములు ధరించి, బంధుమిత్రులకు విందులు వినోదాలు యేర్పాటు చేస్తారు. కాని ఆమె ఆసుపత్రులకు పోయి రోగులను పరామర్శ చేసి వారికి పళ్లో, అభ్యంతరం లేని తిండి పదార్థాలో యిచ్చి వస్తువుంటారు. అలోపతి వైద్య విధానంలో మందులు అనేకం కొనవలసి వస్తువుంటుంది. ఎంతెంతో డబ్బు వెచ్చించి మాత్రలు, బిళ్లలు, గొట్టాలు, రోజు కొకరకం డాక్టర్లు వ్రాసి యివ్వగా కొనుక్కోవలసి వస్తుంది. అవి అధిక భాగం అట్లాగే మిగిలిపోతయ్. అందులోను యిప్పుడు తగరం, ప్లాస్టిక్కు సంచులలో సీలువేసి వుండటాన అవి పాడైపోవు. శ్రీమతి సరస్వతీ దేవి అటువంటి మిగిలిపోయిన అమూల్య ఔషధాలను జాగ్రతగా సేకరించి శ్రీనగర్ కాలనీలో స్త్రీ సమాజంవారు నడిపే వుచిత డిస్పెన్సరీకి పేదల వినియోగం కోసం అందచేస్తూ వుంటారు. ఆమెకు బిడ్డలులేరు. పెద్ద బాదరబందీలేదు. దంపతులిద్దరు రాజోపచారంగ విలాసాలతో వినోదాలతో కాలం గడపవచ్చు కాని ఆమె ప్రకృతికి అటువంటి జీవితం విరుద్ధం. ఎప్పుడు యితరుల బాధ, కష్టం తొలగించాలన్నదే ఆమెలక్ష్యం.

ఆమెకు రోగుల బాగోగులు ఎంతముఖ్యమో, రోగులకు సపర్యలుచేసే నర్సుల బాగోగులుకూడ అంతేముఖ్యం. వాళ్ల ఆరోగ్యం మనసు బాగావుంటేనేకాని వుత్సాహంగ తమ డ్యూటీలను చేయలేరు. వారికీ యెన్నో సమస్యలు వుంటయ్. జాయలాపాయలాగా అవన్నీ కనుక్కుంటు వారికి అవసరమైనంతగా

వుల్లాసం కలిగించేవిధంగా ఆటలు, పాటలు, వినోద కాలక్షేపాలు కలిగించా లంటారు. అందుకని నర్సుల సంక్షేమ సంఘాలతో చిక్కని చక్కని బంధం కల్పించుకుంటారు. నర్సుల సంక్షేమం కోసం అత్యధికంగా పాటుపడిన హెల్తు అండ్ మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు రమేష్ పాయ్‌గారి స్మృతి చిహ్నంగా ఆమె వెయ్యిరూపాయల నిధి యేర్పాటుచేసి, వడ్డీతో ప్రతి సంవత్సరం నర్సు ట్రెయినింగులో ఎక్కువ మార్కులు తెచ్చుకున్న ఒకరికి ఒక పతకం బహూక రించుతారు. నర్సుల హాస్టలులో మైకు తదితర సౌకర్యాలకోసం కొంతమొత్తం యిచ్చారు. తరువాత యేవో ఒక పోటీలు యేర్పాటు చేసి స్వంతఖర్చులతో బహుమతులు యిస్తూ వుంటారు. రెడ్‌క్రాసు సంఘ సంక్షేమానికి యెప్పుడు పెద్దమొత్తాలలో విరాళాలు పోగు చేయవలసివచ్చినా ఆమె సహకారం వుండితీరవలసిందే. ఎగ్జిబిషన్లలో రెడ్‌క్రాసు విభాగం అతి చక్కగ నెలకొల్పి బహుమతులు పొంది, ఆ మొత్తాలను కూడ తిరిగి సంఘానికే యిచ్చివేస్తు వుంటారు. ఆమెకు రెడ్‌క్రాసు సంఘంతో నలభై సంవత్సరాలకు పైగా బంధం యేర్పడి పోయింది. అది ఆమెజీవితంలో ఒక భాగమైపోయింది. అందువల్ల దాని కోసం మనస్ఫూర్తిగా అతి సహజంగ, ఉచితంగ అమోఘ కృషిచేస్తువుంటారు. ఆ నిస్వార్థసేవా తత్పరతను గమనించిన పెద్దలు ఆమెను సన్మానించుతు సత్కరించుతు వుంటారు. 1964లో భారత అధ్యక్షులయిన శ్రీ రాధాకృష్ణన్ స్వహస్తాలతో ఆమెకు నేషనల్ ఎవార్డు ఆఫ్ మెరిట్ సర్టిఫికెట్, 1960లో వెండిపతకం, 1964లో బంగారు పతకం, 1976 వెండి పతకం ఆమెసేవాను రక్తికి చిహ్నంగాయిచ్చి గౌరవించారు. ప్రశంసాపత్రాలకు లెక్కలేదు. ఇంతగా సత్కరించబడినా గౌరవించబడినా ఆమె వేషభాషలు, ప్రవర్తన చాలా నిరాడంబరంగవుండి యేవిధమైన అతిశయం కనిపించదు.

ఆమె ఆంధ్రబాలానంద సంఘంలో జీవిత సభ్యురాలు. ఆంధ్రయువతీ మండలిలో జీవిత సభ్యురాలు. ఆంధ్ర మహిళా సభలో జీవిత సభ్యురాలు. హైదరాబాదులో ఆంధ్రమహిళాసభ నర్సింగ్‌హోం పెడుతున్న సమయంలో రెండు సంవత్సరాలు కన్వీనరుగా వున్నారు. గృహిణులు నిత్య జీవితాన్ని యే ఒడుదుడుకులు లేకుండ శక్తిసామర్థ్యాలతో విజ్ఞానయుతంగా గడుపుకోవటానికి అవసరమైన అనేక వైజ్ఞానిక, వైద్య, ఖగోళ, భౌగోళికాది విషయాలను బోధించుతు మహిళా సభలో చాలాకాలం మధ్య తరగతి గృహిణులకు ఆమె క్లాసులు నడిపారు. కావలసిన పరికరాలు పటాలు నమూనాలు అన్నీ ఆమే సమకూర్చుకునే వారు. సభ నర్సింగుహోముకు ఒక మంచంకొని యిచ్చారు. విద్యాలయంసైన్సు లేబరెటరీకి ఐదువేలు యిచ్చారు. ప్రతి సంవత్సరం

హైస్కూలులో ఎక్కువ మార్కులు తెచ్చుకున్న అమ్మాయికి బంగారు పతకం బహూకరించుతారు. ఆమె ఒక షీల్డుయిచ్చారు. ఇంక చిన్న చిన్న పోటీలు జరపటం బహుమతులు యివ్వటం పరిపాటి.

ఆమెకు చిత్రలేఖనంలో నైపుణ్యం వున్నది. జీవకళ ఉట్టిపడుతు ముమ్మూర్తుల ఆ వ్యక్తులను పోలి వుండేట్లుగా ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో సహజ కొలతలలో దేశనాయకులు సంఘసేవకుల బొమ్మలు అనేకం చేస్తువుంటారు. ఒకవస్తువు విరిగిపోతే పనికి రాకుండ పోతే దానికి అలంకారయుతంగా రిపేరు చేయగలరు.

1937 నుంచి పదమూడు సంవత్సరాల పాటు శ్రీమతి సరస్వతీదేవి శ్వాస అందక పోవటం, కనుగుడ్లు పగిలి పోతవేమోనన్నంత పోటుతో, భరించ శక్యంకానంత బాధ అనుభవించేవారు. ఎన్నెన్ని వైద్యాలో ఐనవి. చివరకు ఇంగ్లండులో కూడ చికిత్స పొందారు. ప్రాణంవిసిగిపోయిన సందర్భంలో తమ తల్లిగారైన శ్రీమతి చల్లపల్లి సీతాదేవి ప్రకృతివైద్యంచేసి కుటుంబంలో వారికి, బయటి వారికి జబ్బులునయం చేయటం జ్ఞాపకం వచ్చి ఆవైద్య గ్రంథాలన్నీ తిరగవేశారు. ఆ విధానంలో స్వయంగా చికిత్స చేసుకుని కొద్ది నెలలలోనే సంపూర్ణ ఆరోగ్యం పొందారు. ఇది చూసిన యిరుగు పొరుగువారు బంధు మిత్రులు ఆశ్చర్యపడి తామూ ఆ విధానంలో చికిత్స పొందటానికి ఆమె దగ్గరకు రావటం ఆరంభించారు. ఒకరికి బాధానివృత్తి కలిగించటమే ఆమె సహజలక్షణం కావటంతో ప్రకృతి చికిత్స, యోగాసనాలు, జతచేసి స్వగృహంలో యోగ ప్రకృతి చికిత్సాకేంద్రం స్థాపించారు. అప్పటి గవర్నరు సతి అయిన శ్రీమతి పొన్నమ్మథాను పిళ్లె ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి సరస్వతీ దేవికి డబ్బు వ్యామోహం లేనందున వుచిత, స్వచ్ఛంద, సేవాకేంద్రంగా దానిని రిజిస్టరు చేశారు. అనేక రకాల జబ్బులకు ఉచితంగా చికిత్స పొందుతు ఆరోగ్యవంతులై వెళుతు వుంటారు. ఆమె మొదటకొన్ని రోజులు స్వయంగా చికిత్సా విధానం చేసి చూపించుతారు. తరవాత ఎవరికి వారే ఆ విధానాలు ఆచరించ వీలయినవిగా వుంటవి. ఇన్ని కార్యకలాపాలతో గృహనిర్వహణతో ఆమెక్షణం తీరిక లేకుండ వుంటారు. అర్థం, ప్రాణం, యితరుల కోసమే వెచ్చించే యీామెకు సర్వదా భర్త సహకారం వుంటుంది. ఆ దంపతులు తమ యిల్లు కూడ రెడ్‌క్రాసు వారికే దత్తం చేశారు. శ్రీమతి సరస్వతీరావు ఒక విచిత్ర, విశేషవ్యక్తి.

---

# శ్రీమతి విద్యాదేవి ఓంప్రకాష్

**జననం 1924**

ఏ వాడ చిలక ఆ వాడ పలుకే పలుకుతుందంటారు. శ్రీమతి విద్యాదేవి ఓంప్రకాష్‌ని పరిశీలించితే అది అక్షరాలనిజం అని తెలుతుంది. బందరులో శ్రీ దుగ్గిరాల పట్టాభిరామయ్య సమర్థులైన టీచరుగా వాసికెక్కారు. చిన్న నాటినుంచి ఆయనకు జాతీయ భావాలు వంటబిజీర్ణించిపోయినవి. భార్య శ్రీమతి వెంకటరమణమ్మ నాటినుంచిదేశం కోసం, సంఘంకోసం చేతనయిన సేవచేయాలన్న తపనగలవారు. దక్షణాఫ్రికా అసహాయోద్యమ సహాయార్థం విరాళాలు వసూలుచేయటంతోనే ఆమె సేవాకార్య క్రమం ఆరంభమయింది. మహిళా సమాజాలు కేవలం ధనవంతులయిన స్త్రీలకోసం, వారి ఆట పాటలకోసం కాదని ఆమె నమ్మకం. అందుకే బందరులో మహిళా సేవాసమాజం స్థాపించి చందా నెలకు ఒక పావలా (నాలుగణాలు) మాత్రమేపెట్టారు. అదీ యివ్వటానికి వీలు పడక, సాధ్యపడకపోతే నూలువడికి నెలకు రెండు చిలపలువంతున యివ్వవచ్చునని కొత్తరకపు పద్ధతిన చందాయేర్పాటుచేశారు. ఆర్థికంగా ఆ పరిస్థితులలో వున్నవారికి కూడ చదువుకోవటానికి, నూలువడికి కొంతడబ్బు సంపాదించుకోవ టానికి, స్వయంగా మరికొంతమంది స్త్రీలకు పేదలకు సహాయపడటానికి గొప్ప అవకాశం కల్పించారు. సమాజ సభ్యుల సహకారంతో నాటకాలు ప్రదర్శించి వాటికి రెండుచిలపలకు ఒక టిక్కట్టువంతున అమ్మి విచ్చలవిడిగా విలాసాలకు డబ్బుఖర్చు చేయలేని స్త్రీలకు కూడ విజ్ఞానవికాసాలకు, వినోదాలకు అవకాశంకల్పించారు. అటువంటి దంపతులకు మూడవ అమ్మాయిగా శ్రీమతి విద్యాదేవి 1924 లో జన్మించారు. బందరు ఆమె జన్మస్థలం.



శ్రీమతి విద్యాదేవి ఓంప్రకాష్.

శ్రీమతి విద్యాదేవి ఇంట్లో ప్రతివారికి నూలువడకటం నిత్యకృత్యాలలో ఒక అంశం. అందువల్ల పసితనంనుంచి ఆమెకు నూలువడకటం ఖద్దరుకట్టటం

అలవాటు. ప్రభాతఫేరీలకు వెళ్లటం, జాతీయోత్సవాలలో పాల్గొనటం, తల్లితో హరిజనవాడలకువెళ్లి ప్రచారంచేయటం, సేవలుచేయటం ఆమెకు మామూలు విషయమై పోయింది. సంస్థలు నడపటంలో గల సాధకబాధకాలు క్షుణ్ణంగా అవగాహనఅయినవి. నిజంగా సేవచేయటం అంటేయేమిటో యెట్లాచేయాలో తల్లిని చూసి నేర్చుకున్నారు. మహిళా సేవాసమాజానికి డబ్బుకావలసివచ్చి నప్పుడల్లా ప్రదర్శించేనాటకాలలో శ్రీమతి విద్యాదేవి అన్నివయసులలోను పాల్గొన్నారు. చక్కగా గొంతెత్తిపాడగలరు. సమాజంలో హిందీతరగతులు నడిపేవారు. ఆమె హిందీలో మంచిపాండిత్యం సంపాదించారు. 1942 లో క్విట్టిండియా వుద్యమం వుప్పెనలాగ దేశంమీద విరుచుకుపడింది. బందరులో వుండి ఈ వుద్యమంలో ఆమె బాగా లోతుగానే మునిగారు. ఎన్నియావత్తులు, వ్యాపకాలువున్నా 1943 లో బి. ఎ. ముగించారు. ఆ తర్వాత మద్రాసు వెళ్లి లా చదివారు. 1945 లో లాయరు అయినారు. అప్పటికి యిప్పటికి మనదేశంలో స్త్రీ లాయర్లు, ఇంజనీర్లు అధికసంఖ్యలో లేరు. అందువల్ల వాళ్లకు కావలసినంత గౌరవం, పేరు, రాబడి. శ్రీమతి విద్యాదేవికి సభాపిరికితనంలేదు. నిర్దుష్టంగా, స్పష్టంగా తమ భావాలను గంభీరస్వరంలో వెలిబుచ్చగలరు. మంచి వాగ్ధాటివున్నది. కుశాగ్రబుద్ధి. లాయరుకు కావలసిన హంగులన్నీవున్నవి. ఎటొచ్చి అభిలాషేలేదు. ఆమెదృష్టి అంతా సేవాగ్రాం మీదనే. చిన్ననాటినుంచి గాంధీజీనిచూడాలి, ఆయన శిష్యురాలిగా దేశసేవచేయాలి. ఆయన మహోన్నత భావాలను క్రియారూపంలోపెట్టటానికి పూనుకోవాలి. ఇదే ఆమె లక్ష్యం.

శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ ఆ సమయంలో కస్తూర్బా స్మారక నిధి ఆంధ్ర రాష్ట్రశాఖకు కార్యదర్శినిగా వుండేవారు. మన రాష్ట్రం తరఫున, సేవాగ్రాంలో కస్తూర్బా ట్రస్టువారి తర్ఫీదుపొంది, గాంధీజీ ఆశయాలు అందులోను ముఖ్యంగా స్త్రీల అభ్యున్నతి కార్యకలాపాలు కొనసాగించమని సలహా యిచ్చారు. శ్రీమతులు బుచ్చి కృష్ణమ్మ, సామ్రాజ్యం, సుభద్ర, సరళాదేవి, కేశవమ్మ, రమణమ్మ, కమలమ్మలను జతకూర్చుకుని శ్రీమతి విద్యాదేవి వెంటనే సేవాగ్రాం వెళ్లారు. అక్కడ ఒక సంవత్సరం కరువుతీరా గాంధీగారి సాన్నిధ్యంలో వుండి సేవాభావం అవగాహన చేసుకున్నారు. ఆమె, ఆమె జట్టులోని తోటివారు సేవాగ్రాం వారు యిచ్చిన శిక్షణ అతి క్షుణ్ణంగా గ్రహించారు. దాంతో ఈ జట్టును అక్కడ టీచర్లుగా కొంతకాలం వుండమని కోరారు. కొంతకాలం అక్కడ వున్నమీదట ఈ జట్టు సీతానగరంలో కస్తూర్బా ట్రస్టు తరఫున గ్రామ పునరుద్ధారణకై స్త్రీలకు, బాలికలకు ట్రెయినింగు సెంటరు స్థాపించారు. కుటీర పరిశ్రమలలో శిక్షణ నివ్వ నారంభించారు. తరువాత దేశం నలుమూలల చొచ్చుకుపోయి ముఖ్య సేవికలుగా గ్రామ సేవికలుగా

పేరుతెచ్చుకున్న వాళ్లందరు యిక్కడ శిక్షణ పొందిన వారే. శ్రీమతి విద్యాదేవి సీతానగరంలో సంచాలికగా బాధ్యత వహించారు.

శ్రీమతి దుర్గాబాయమ్మ చట్ట నిర్మాణసభకు సభ్యురాలుగా ఢిల్లీ వెళ్లటంతో గాంధీజీ ఆదేశానుసారం శ్రీమతి విద్యాదేవి ఆంధ్ర రాష్ట్ర కస్తూర్బా గాంధీ ట్రస్టు నిర్వాహకురాలు అయినారు. ఆ సమయంలో ఆమె గ్రామాలు, కుగ్రామాలు విరివిగా సంచారం చేశారు. అక్కడ అనేక శిక్షణ శిబిరాలు నెలకొల్పారు. కేంద్ర నిర్వాహకులను కలుసుకుని, అవసరాలను బట్టి ప్రత్యేక కార్యకలాపాలపట్ల శ్రద్ధ వహించుతు వుండేవారు. వాడవాడలకు వెళ్లి అసలు పరిస్థితులను శ్రద్ధగా ఓర్పుగా పరిశీలించి నిజమైన సేవ చేయటానికి, కేంద్రాలు సాఫీగా నడవటానికి పాటుపడ్డారు. చిన్న నాడు తల్లి వెంట వెళ్లి యీ పనులన్నీ చేసివుండటాన ఆమెకు అది పరిపాటిగా తోచేది. ఆ వాతావరణంలో ఆమె యిమిడి పోయినారు. 1950 వరకు ఆ పని చేశారు.

1952–53 మధ్య సంవత్సర కాలం ఆమె తిరిగి సేవాగ్రాం వెళ్లారు. శ్రీమతి ఆశాదేవి ఆర్యనాయకం, శ్రీ ఆర్యనాయకం దంపతుల సహకారంతో హిందూస్థానీ తాలీమీ సంఘం పని యెంతో చాకచక్యంగా నిర్వహించారు. ఆఫీసుపని, ప్రార్థనల విభాగం, అతిథుల ఆదర సత్కారాల ప్రమేయం, శిక్షణ విభాగం వంటి అన్ని శాఖలు అతి సమర్థవంతంగా నడిపించారు.

ఏ పని అయినా సరదా, కాలక్షేపంగా చేసేవాళ్లు, యింక యింతవరకు చాలులే అని అంటీ ముట్టనట్లు వ్యవహరించుతారు. కాని పుటకతో సంఘ సేవా భావం వచ్చి, పరిస్థితుల ప్రాబల్యంతో పెంపొందించుకున్నవాళ్లు దేనితోను తృప్తి పడరు. ఇంకా యింకా చేయాలన్న తపన కలుగుతుంది. ఆమె విషయంలోను అదే అయింది. సేవాగ్రాంలో వుండగానే శ్రీ వినోబాజీతో పాటు ఉత్తరప్రదేశ పాదయాత్రలో పాల్గొన్నారు. ఉద్యమ నాయకులెప్పుడు అప్రమత్తతతో తమ వుద్యమం నిర్విరామంగా నడపగల కార్య కర్తలకోసం వేయి కళ్లతో వెతుకుతు వుంటారు. శ్రీమతి విద్యాదేవి నైపుణ్యం శ్రీ వినోబాజీ గ్రహించటానికి అట్టే సమయం పట్టలేదు. బీహారులో కాలినడకన గ్రామ గ్రామాలు తిరిగి ప్రజలలో ఆమె వుద్యమ ప్రచారం చేశారు. ఎవరు కాని చూస్తు చూస్తు తమ భూములను వుచితంగా యింకొకరికి యిచ్చివేయలేరు, అది మానవ సహజం. అటువంటి పరిస్థితులలో ఆమె యెంత ఓర్పుగా నేర్పుగా నిజాయితీ ద్యోతకమయేట్లు వ్యవహరించారో, వాళ్లను ఒప్పించారో, వూహించుకోవచ్చు. ఎంతో భూమిని నిరాధారుల కోసం సేకరించగలిగారు.

భూదాన కార్యక్రమం క్రమపద్ధతిలో జరపటానికి తగిన కార్య నిర్వాహకులను సమకూర్చటంకోసం శిక్షణ కేంద్రాలు స్థాపించారు. ఇదంతా కాలినడకనే సాధించారు. చివరకు గయలో భూదాన సమితి కార్యాలయం భూముల దానపత్ర శాఖలో అప్రమత్తతతో భూమి పంపకాలు చేశారు. మేధావి అయిన లాయరుగా ఆ పని ఆమెకు తగివున్నది. ప్రజలకు న్యాయం జరిగింది.

1954లో శ్రీ జయప్రకాష్‌నారాయణ్ శ్రీమతి ప్రభావతీదేవి తో కలిసి గయజిల్లా—సుఖోదేవరలో ఆశ్రమం నెలకొల్పారు. దానితరఫున మహిళాచరఖా సమితితో పాటు యెన్నెన్నో కొత్త పథకాలను ఆచరణలో పెట్టారు. సర్వోదయ సిద్ధాంతాలకు అనుగుణ్యంగా వయోజన స్త్రీలకు విరివిగా విద్యాప్రచారం చేశారు. స్వాశ్రయిసేవిక విద్యాలయం, అంబరు చరఖా విద్యాలయం నడిపించారు. ఇట్లా విద్యావిహీనులయిన పేదస్త్రీలకు యెంతో సేవ చేయుటమేకాక—మధ్యతరగతి స్త్రీలు తమ తీరిక వేళల్లో నాలుగు డబ్బులు సంపాదించుకోవటానికి అనువుగా కుటీర పరిశ్రమల విభాగం నెలకొల్పారు.

బీహారులో వుండగా శ్రీ ఓంప్రకాష్ గుప్తతో వివాహం అయింది. ఆయన ఎం. ఏ.; ఎల్. ఎల్. బి., డి.లిట్., ఉత్తరప్రదేశస్థులు. చదువుతు క్విట్టిండియా వుద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లిన స్వాతంత్ర్య సమరయోధుడు. గాంధీజీ దగ్గర 'హరిజననిధి', "హరిజన సేవక్" అనే హిందీ వారపత్రికలు నిర్వహించారు; కార్యదర్శిగా పనిచేశారు. గాంధీజీ హేరాం అంటూ 1948 లో నేలకొరిగేవరకు ఆయనతో అతి సన్నిహితంగ మెలుగుతు పనిచేశారు. శ్రీ వినోబాజీ, జె. సి. కుమారప్ప, కాకాకలేల్‌కర్ తో కలసి చాలారోజులు బాధ్యతలు వహించారు. ఆ తరువాత శ్రీ జయప్రకాష్‌నారాయణ్‌కు సహకరించారు. ఆయన ఇంతగా దేశసేవ సంఘసేవల్లో రాటు తేలటాన వారిది నలుగురు మెచ్చే దాంపత్యం. గాంధీపీస్ ఫౌండేషన్ బాధ్యత వహించటానికి డా. ఓంప్రకాష్ ఢిల్లీ వెళ్లటంతో ఆమె కూడ ఢిల్లీవాసి అయినారు. అలవాటుపడిన చెయ్యి కాబట్టి అక్కడ యింకా విస్తృత కార్యక్రమాలు నడిపించారు. సర్వోదయ మండలి, కస్తూర్బాట్రస్టు—ఢిల్లీ శాఖ, ఆంధ్రా ఎడ్యుకేషను సొసైటీలతో సన్నిహిత సంబంధం పెట్టుకుని వాటి అభివృద్ధికి పాటుపడ్డారు. స్త్రీ సమస్యలను గాంధీజీ భావాలతో, లక్ష్యాలతో యెట్లా పరిష్కరించుకోవచ్చుననే విషయం బాగా పరిశ్రమచేసి నిగ్గుతేల్చారు. గాంధీ పీస్‌ఫౌండేషన్ రిసర్చి శాఖ తరఫున ఆమె యీ పని కొనసాగించారు.

1964లో హైదరాబాదు చేరుకున్నారు. కుటుంబం అక్కడే స్థిరపడి, యిక తమదైన ఒక కార్యక్రమం కొనసాగించాలనుకున్నారు. ఉప్పల్ పరిసరాలలో పీర్‌జాదీగూడా అనేది ఒక పల్లె. ఆ పల్లె తమస్థావరంగా ఎన్నుకున్నారు. ఆమె అప్పటినుంచి 1971 వరకు కస్తూర్బాట్రస్టు ఆంధ్రశాఖ నిర్వాహకురాలుగా వున్నారు. పీర్‌జాదీగూడా పల్లెలో తాము స్థాపించిన గాంధీకస్తూర్బా సేవాసంఘం 1971 లో రిజిష్టరుచేయించారు. దానికామె కార్యదర్శి. తమకు అవసరమైన వస్తుసముదాయాన్ని తమ కృషితో సమకూర్చుకునే (Self Help) స్వయం సమృద్ధి సూత్రం మీద యీ సంస్థ నడుపుతున్నారు. గ్రామ పునరుద్ధరణకు సహకరించుతు గ్రామీణ స్త్రీలకు అన్నివిధాల సహాయం అందించటం వారి లక్ష్యం. నూనె గానుగ ఆడించటం, బియ్యం దంపటం, కారం, పసుపు దంపటం, మసాలా పొడులు తయారీ, నూలు వడకటం, తేనె పరిశ్రమ, కాయలు, కూరలు పండించటం, కుట్లు, అల్లికలు నేర్పి అవసరమున్న స్త్రీలు డబ్బు సంపాదించు కోవడంవంటి వాటికి తోడ్పడుతున్నారు. వయోజనులైన స్త్రీలకు కన్డెన్స్‌డ్ క్లాసులను కేంద్ర సంఘ సంక్షేమ సమితివారి సహకారంతో నడుపుతున్నారు. శ్రీమతి విద్యాదేవి గాంధీస్మారకనిధి సభ్యురాలు. సర్వోదయ మండలికి, మద్యపాన నిషేధసంఘానికి యింకా అనేక సమాజాలకు సభ్యురాలు. ఆంధ్రప్రదేశ్ నిర్మాణాత్మక కార్యకర్తల సంఘానికి కార్యదర్శి కావటాన గాంధీజీ లక్ష్యసాధనకు యీ నిర్మాణాత్మక కార్యకలాపాలన్నిటిని సమన్వయ పరచటానికి కృషి చేస్తున్నారు. గాంధీ, కస్తూర్బా గాంధీ శతజయంత్యుత్సవాల అఖిలభారత సంఘ సభ్యురాలుగాను రాష్ట్రసంఘ సభ్యురాలుగాను వున్నారు. శతజయంత్యుత్సవాలకు పిల్లలు స్త్రీలశాఖకు కమిటీ మెంబరుగా పనిచేశారు. హిందీ, ఇంగ్లీషు, తెలుగు మూడు భాషలలోను ఆమె వ్రాస్తారు, అనర్గళంగా వుపన్యసించుతారు. రేడియో ప్రోగ్రాములు యిస్తారు. సభలు సమావేశాలలో పాల్గొంటారు. కాని యే పీటయెక్కినా యే కార్యక్రమంలో పాల్గొన్నా మహిళల సమస్యలు గాంధీజీ లక్ష్యాలతో పరిష్కరించి సుఖజీవనం చేయగల విధానమే చెపుతారు. తెల్లని ఖద్దరు చీరెతో, యే అలంకారాలు లేకుండ సాదాగా వుండే ఆమె గంభీర విగ్రహాన్ని చూస్తే "భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్" అనే భర్తృహరి పద్యం జ్ఞాపకం వస్తుంది.

---

# శ్రీమతి మల్లు స్వరాజ్యం

**జననం 1931**

ఆంధ్రరాష్ట్ర శాసనసభ వార్తలను ఏపాటి చదివే వారికయినా శ్రీమతి మల్లు స్వరాజ్యం పేరు బాగాతెలిసి వుంటుంది. స్త్రీలు, పేదలు, బలహీనవర్గాలవారికి యెక్కడ యెప్పుడు అన్యాయం జరిగినట్లుతోచినా, ఆమె వెంటనే శాసన సభలో ప్రశ్నలు చర్చలు ఆరంభించి, పట్టుదలగా దాని పర్యవసానం న్యాయబద్ధంగా క్షేమదాయకంగా వుండేట్టు చూస్తారు. అది ఆమెలోని ప్రత్యేకత. ఆమె శాసన సభ సభ్యురాలయి ప్రజాసేవకు ఆరంభించలేదు. ప్రజాసేవలో, స్వాతంత్ర్యసమరంలో ప్రాణాలను గడ్డిపోచగా భావించి, రాటుదేలి ప్రస్తుతం యిదొక సాధనంగా మాత్రమే వ్యవహరించుతున్నారు. అందువల్ల ఆమె జంకు గొంకులు లేకుండ కుశాగ్ర బుద్ధితో అప్రమత్తతతో పరిస్థితులను గమనించుతు తమధర్మం నెరవేర్చుతువుంటారు.

తెలంగాణా ప్రాంతమైన నల్గొండ జిల్లా సూర్యాపేట తాలూకా, కొత్తగూడెం ఆమె జన్మస్థలం. శ్రీ భీమిరెడ్డి రామిరెడ్డి శ్రీమతి చుక్కమ్మల రెండవకుమార్తెగా ఆమె 1931 లో జన్మించారు. ఆమెకు అన్న, అక్క, చెల్లెలు, తమ్ముడు వున్నారు. నైజాం సంస్థానంలో ఆమె పుట్టిన 1930 ప్రాంతాలలో కూడ తెలుగు అమ్మాయిలు చదువుకునేందుకు బడులులేవు. భూస్వాములు కావటాన యింట్లో టీచరును పెట్టి నాలుగు క్లాసులు చదివించారు. అదే ఆమె చదువు. జమీందార్లు, జాగీర్దార్ల కుటుంబాల సంగతి విడిచిపెట్టి సామాన్యప్రజల విషయం చూస్తే ఆనాటి అక్కడి పరిస్థితులు కొంత శోచనీయంగానే వుండేవి. స్త్రీలకు చదువు లేదు. బాల్యవివాహాలు అమలులో వుండేవి. వితంతు వివాహాలు తలవరాదు. బహుభార్యాత్వం పరిపాటి. మద్యపానం గౌరవ సూచకంగా భావించే పురుషులకు భార్యబిడ్డలను కొట్టటం పరిపాటి. ఇక పేదవారు పుట్టిందే యజమానుల సేవలు చేయటానికి, బరువులు మోయటానికి. వందేమాతరం వుద్యమం నాటినుంచీ బ్రిటిష్ పాలనలోవున్న మిగతా భారతదేశంలో రాజకీయ చైతన్యం కలిగి ప్రజలు విప్లవ ధోరణిని అవలంబించుతున్న 1930లో దేశవ్యాప్తంగ శాసనధిక్కారం చేసి వేలసంఖ్యన ప్రజలు జైళ్లకు వెళ్లినా, యీ సంస్థానంలో సభలు సమావేశాలు జరపకూడదు. స్వాతంత్ర్యేచ్ఛ కనపరచ కూడదు, చివరకు పేపరు కూడ చదవకూడదు. కాని బ్రిటీషు ఇండియాలో నడిచిన సత్యాగ్రహం వీరిలోనూ చైతన్యం కలిగించింది.

నైజాంరాష్ట్రంలో మాడపాటి హనుమంతరావుగారు, శ్రీ బూర్గుల రామకృష్ణారావు వంటి వారిని జతకలుపుకుని ఆంధ్రజాతి వుద్ధరణకు పూనుకున్నారు. తెలుగు పిల్లలకు తెలుగు బడులు స్థాపించి, హాస్టళ్లు నిర్మించి, ఆంధ్ర మహాసభల పేరుతో కాంగ్రెసుసభల పద్ధతిన సభలు జరిపించి, ఆంధ్రులకు ఏకత్వం కలిగించారు. అందుకే ఆయన ఆంధ్ర పితామహగా తెలంగాణా హృదయాలలో నిల్చిపోయినారు. అవకాశంకోసం వేచివున్న ఆంధ్ర స్త్రీలు శ్రీమతులు యల్లాప్రగడ సీతాకుమారి, రంగమ్మ ఓబులురెడ్డి, రాలి సీతాదేవి మరియెందరో తోటి స్త్రీలను జతకలుపుకుని ఆంధ్రమహిళా సభలు జరిపి స్త్రీలలో చైతన్యం కలిగించ నారంభించారు. బ్రిటిష్ భారతంలో కాంగ్రెసు సహకరించి అనేక రాష్ట్రాలలో మంత్రివర్గం స్థాపించటంతో హైద్రాబాదు సంస్థానంలో కూడ ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పటానికి నాందిగా, నేటి ప్రఖ్యాత కమ్యూనిస్టు అగ్రనాయకులయిన శ్రీ యుతులు రావి నారాయణ రెడ్డి, బద్దం యెల్లా రెడ్డి, ఆరుట్ల లక్ష్మి నరసింహా రెడ్డి, వల్లం వెంకట రెడ్డి వంటి వారు స్టేటు కాంగ్రెసు సంస్థను క్రమబద్ధంగా స్థాపించి నిర్వహించ సాగారు. దాని ద్వారా పేదరైతులు, కూలీల ఆర్థిక సమస్యలను, పై వర్గాల వారి దురాగతాలను చర్చించటం, పరిష్కారమార్గాలు ఆలోచించటం ఆరంభమయింది. 1944 నాటికి ప్రజలలో విపరీతమైన చైతన్యం కలిగి రకరకాల దాస్యవిమోచనానికి ప్రజలు చేతులు కలిపి ముందుకు నడిచారు. సంస్థానంలోని కాంగ్రెసు వాదులు, కమ్యూనిస్టులు, బ్రిటిష్ ఇండియాలోని కాంగ్రెసువాదులు అందరు ఏకమై ప్రజావిప్లవాన్ని నడిపించారు. ముష్కరుల దురాగతాలనుంచి ఆత్మరక్షణకోసమైనా ప్రతివారు సాయుధులు కావలసి వచ్చింది. బెజవాడలో డాక్టరు శ్రీమతి కొమర్రాజు అచ్చమాంబ నడుపుతున్న ఆత్మరక్షణ శిక్షణ తరగతులకు శ్రీమతులు ఆరుట్ల కమలా దేవి మొదలయిన వారు వచ్చారు.

అప్పటికి శ్రీమతి స్వరాజ్యం తండ్రి చనిపోయినారు. అన్న భీమిరెడ్డి నరసింహారెడ్డిగారు పేరుపొందిన కమ్యూనిస్టు నాయకుడుగా వుద్యమంలో బహిరంగంగా ప్రవేశించారు. ఆమె అక్క శ్రీమతి శశిరేఖ, బావ అందరు వుద్యమంలో చేరారు. వీరి తల్లి శ్రీమతి చుక్కమ్మ 'నా పిల్లలు భరతమాతకూ పిల్లలే. వాళ్లను ఆమే కాపాడుకుంటుంది', అని వీరమాతకు తగినట్లుగా అన్నారు. శ్రీమతి స్వరాజ్యం బెజవాడలో ఆత్మరక్షణ శిక్షణ పొంది కోస్తా జిల్లాలన్నీ తిరిగి, మద్రాసు వరకు వెళ్లి స్వాతంత్ర్య సమర ప్రచారం చేశారు. ఆమె కామాలు, ఫుల్‌స్టాపులు లేకుండ, టకటక వుపన్యసించుతు వుంటే ప్రజలు వింతగా చూచేవారు. అప్పటికామె వయసు పదహారు సంవత్సరాలలోపు.

ఆమె యింటికి అంటే, హైదరాబాదు సంస్థానానికి తిరిగి వచ్చారు. నిర్ధనులు, విద్యావిహీనులు వెట్టిచాకిరితో నడుములు వంగిపోయిన బడుగు కోయ జాతి, కొండజాతి అడవిజాతి వారిని సమీకరించి, వారికి వివరంగా విషయాలు చెప్పి ప్రచారం చేసేవారు. గ్రామీణ పాటక జనులకోసం నాటిపరిస్థితులను వర్ణించుతూ పెద్ద 'యేలపాట' రచించారు. స్వయంగా పెద్దగొంతుకతో దానిని పాడి జనానికి తెలియచెప్పేవారు. రాత్రింతల గ్రామీణులను సమావేశపరచి ఉయ్యాల —చుట్టు కాపడివంటి జానపద ఆటల ద్వారా ప్రబోధంచేసేవారు. చివరకు అన్నతో అక్కతో కలసి అడవులలో ప్రచ్ఛన్న వాసానికి వెళ్లారు. రోడ్డు సౌకర్యాలులేని ఆ కొండ ప్రదేశాలలో గుఱ్ఱాలు యెక్కి తుపాకి ధరించి అక్క చెల్లెళ్లు ఆనాటి ఝాన్సీరాణిలాగ వీరవిహారం చేసేవారు. అధికారుల స్థావరాల పైన మెరపు దాడులు జరిపి ఆయుధాలు మొదలగునవి సేకరించేవారు. కోయస్త్రీలకందరికి ఆయుధాలు వాడటం మానప్రాణాలు రక్షించుకోవటం తెలియచెప్పేవారు. అప్పటికీ ఆకునూరు, మాచిరెడ్డిపల్లె వంటి చోట్ల గూండాలు స్త్రీలను అవమానుషంగ భంగపరచటంతో శ్రీమతి సరోజినీ నాయుడుగారి పెద్ద కుమార్తె శ్రీమతి పద్మజా నాయుడు మొదలయిన పెద్దలు స్వయంగా వెళ్లి విచారణ జరిపి గూండాల ఘాతుక చర్యలను గర్హించారు. అన్ని పార్టీలవారు ముక్తకంఠంతో ఒకే మార్గాన స్వాతంత్ర్య సంపాదనకు సింహగర్జనచేస్తు బయలుదేరారు.

1948 సెప్టెంబరు 12వ తేదీన స్వతంత్ర భారతసేనలు సంస్థానాన్ని చుట్టుముట్టి లోబరుచుకున్నవి. ఆనాటితో యీ సంస్థానం కూడా స్వతంత్ర భారతంలో ఒక భాగంగా విలీనమైపోయింది. అడవులు పట్టి ప్రచ్ఛన్నవాసంచేస్తు వుద్యమం నడిపించిన అనేకులు తిరిగి జనపదాలకు వచ్చారు. శ్రీమతి శశిరేఖ మూడు సంవత్సరాల జైలుశిక్ష అనుభవించి విడుదలయినారు.

తరతరాలుగా నిరంకుశ ప్రభుత్వానికి గురిఅయివున్న రాష్ట్రం కాబట్టి భారత ప్రభుత్వం వెంటనే అన్నిరకాల మార్పులు రాజ్యాంగంలో ప్రవేశపెట్టలేక పోయినారు. జైళ్ల పరిస్థితులను క్షణంలో మార్చలేకపోయినట్లే పేదరైతుల, కూలీల, ఆర్థిక సమస్యలను కూడ వెంటనే పరిష్కరించి తేల్చిచెప్పలేక పోయినారు. అందువల్ల ప్రజావుద్యమంలో తలమునిగి తాటిప్రమాణంగవున్న కమ్యూనిస్టు ముఖ్యులు కొంతమంది అడవులలో కొండలలో అట్లా ప్రచ్ఛన్నంగానే నిల్చిపోయినారు. 1953 వరకు శ్రీమతి స్వరాజ్యం కూడ అట్లాగే వుండిపోయినారు. ఆరు సంవత్సరాలపాటు ఆ జీవితం గడిపిన కారణంగా ఆమెఆరోగ్యం దెబ్బతిన్నది. మలేరియాతో, సరిఅయిన పోషక ఆహార లోపంతో

కృశించారు. అకుంఠిత దీక్షతో తన ఆశయసిద్ధికి వేచివున్నారు. 1953 లో భారత ప్రభుత్వం యిచ్చిన హామీ ప్రకటనతో ఆమె అజ్ఞాతవాసం ముగిసింది.

1954 లో శ్రీ మల్లు నరసింహారెడ్డితో ఆమె వివాహం అయింది. 1946 లో కాలేజీలో చదువుతున్న రోజులలోనే శ్రీ నరసింహారెడ్డి చదువుకు స్వస్తిచెప్పి దళంలో చేరారు. నైజాం ఆంధ్రమహాసభ తరపున ప్రజావుద్యమంలో పాల్గొన్నారు. అడవులలో ప్రవాసంచేస్తు ఏరియా కమాండరుగా ఆయన స్వాతంత్ర్య సమరంలో వీరవిహారంచేశారు. అందువల్లనే వారిద్దరిది తగిన జంట అని అందరు మెచ్చారు. వారికిద్దరు అబ్బాయిలు ఒక అమ్మాయి.

కొంతకాలం ఆమె సూర్యాపేటలో పార్టీ వైస్‌ప్రెసిడెంటుగా వున్నారు. రాష్ట్ర మహిళా సంఘానికి సహాయ కార్యదర్శి . ప్రతివారికి స్వతంత్రవృత్తి వుండాలన్న తలంపుతో సేద్యంలో ప్రవేశించారు. ఆమెకు వుద్దేశం కలగకపోయినా, పార్టీ ప్రోద్బలంతో ఎన్నికలలో సి.పి.యం. తరపున తుంగతుర్తి నియోజకవర్గం నుంచి పోటిచేసి, ఆరువేలఓట్ల మెజారిటీతో గెల్చారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యత్వం వహించారు. గత చరిత్రనుపట్టి స్త్రీలకు బలహీనవర్గాలకు దళితులకు అన్యాయం జరుగుతున్నట్లు తోస్తే ఆమె సహించలేరు. వెంటనే ప్రశ్నల వర్షం కురిపిస్తారు. సంజాయిషీలు అడుగుతారు. హామీలు తీసుకుంటూరు. మద్యపాన నిషేధంగురించి సందర్భం వచ్చినప్పుడల్లా ప్రచారంచేస్తూనేవుంటారు. అధికారంలో వున్నది యే పార్టీఅయినా ప్రజల అవసరాలకు ఆదుకోవటంలో జాప్య చేయటం, తగిన నిధులు లేవని ప్రజాహిత కార్యాలు వాయిదాలు వేయటం, కుదించటం, సబబు కాదంటూరు. నాటి పరిస్థితులను బట్టి డిగ్రీచదువులు లేకపోయి నందుకు ఆమె నేటికీ చాలా బాధ పడతారు. పెద్ద డిగ్రీలు సంపాదించగలిగి వుంటే యింకా యెంతో సాధించగలిగే దాన్ని గదా అని నిరుత్సాహపడతారు. "ఆనాటి తెలంగాణా ప్రజా వుద్యమంలో యెంతోమంది స్త్రీలు యిల్లు వాకిలి, సుఖం, భద్రత వదులుకుని దేశాభిమానంతో, ప్రజాసేవానురక్తితో అడవులలో వున్నారు. పురుషులను మించి పరాక్రమంతో ప్రాణాలకు తెగించి మెరుపుదాడులు జరిపి సాయుధ పోరాటాలలోనే పాల్గొన్నారు. కాని యీనాడు వారందరు యేరి? ఆ స్త్రీలకు యీనాడు గుర్తింపు వున్నదా ? పదవులు యిచ్చారా? హోదాలు యిచ్చారా? ఈ విధంగా స్త్రీలకు మన దేశంలో అన్ని వుద్యమాలలోను, అన్ని పార్టీలవారు, అన్యాయం చేస్తూనే వున్నారు. దీంట్లో మాత్రం యే మార్పు రావటంలేదు" అని కొలికి పూసలాగా, మణిపూస వంటి అభిప్రాయం వెలిబుచ్చారు, శ్రీమతి మల్లు స్వరాజ్యం.

---

# శ్రీమతి కంచర్ల సుగుణమణి

**జననం : 27-11-1919.**

హైదరాబాదు ఆంధ్ర మహిళాసభలో శ్రీమతి సుగుణమణి ఆఫీసుకు ఒక ప్రత్యేకతవున్నది. అక్కడ వున్న కుర్చీలన్నీ అతిథులతో నిండి వుంటవి. మరొక నలుగురు బయట తచ్చాడుతు వుంటారు. శిశువిహార్ టీచరు మొదలు మహిళా విద్యాలయం హెడ్ మిస్ట్రెస్ వరకు తమ స్కూలు విషయాలు వివరించటానికి, సమస్యలు చర్చించు కోవటానికి వాళ్ల మేడం గారయిన శ్రీమతి సుగుణమణి దగ్గరకు వస్తారు. ఇక పిల్లలు ప్రత్యేక సెలవుకోసమో, మరి యే ప్రత్యేక సంప్రదింపులకో వస్తారు. చెక్కుల మీద, నోటీసుల మీద సంతకాలకు అనుచరులు వస్తారు. ప్రత్యేక కన్డెన్స్‌డ్ కోర్సు, శిశువిహార్, మహిళా విద్యాలయాలకు ఇన్‌ఛార్జి సెక్రటరీగా ఆమెకు యీవిషయాలు తప్పనిసరి. ఇంతలో ఒక యువతిని వెంట పెట్టుకుని ఒకామె వస్తుంది. ఆమెదొక విషాధగాథ. తన చెల్లెలో, కూతురో అయిన ఆ యువతికి పండువంటి కాపురం చెడిపోయింది. నట్టడవిలో నిల్చివున్నది. వెంటనే యేదోతారకం చూపించాలి. మీరే ఆ పని చేయాలి అంటుంది. శ్రీమతి సుగుణమణి అంతా వోపిగ్గా వింటారు. హాండీక్రాఫ్ట్ సెక్షన్, హాబీక్లాసు సెక్షన్ వివరాలు అర్థమయ్యేటట్లు చెపుతారు. ''ఇవేవీ మీకు ప్రయోజనం లేకపోతే, వెంటనే డబ్బు అవసరం వుంటే ఫలాన చోట్ల ఫలాన సంస్థలు వుంటయ్. అక్కడికి వెళ్లి నేను పంపించానని చెప్పండి. వాళ్లు యే బట్టలు కుట్టటమో కత్తిరించటమో చేయించుకుని జీతం యిస్తారు'' అని చెప్పి పంపిస్తారు. అంతకన్న తక్కువ స్థాయిలో వున్న స్త్రీలు వస్తారు. తమగోడు వెళ్లబోసుకుంటారు. వెంటనే పని కావాలంటారు. అంతా విని ఆమె యిదుగో చూడమ్మా ఒక వృద్ధురాలున్నారు. ఆమె దగ్గర వుండి అన్ని వుపచారాలు సక్రమంగా జరిగేట్లు కనిపెట్టి చూస్తువుండగలవా, లేకపోతే



శ్రీమతి కంచర్ల సుగుణమణి

ఒక అమ్మ ఆఫీసుకు వెళ్ళి పోతారు, తిరిగి ఆమె వచ్చే దాకా వారి పాపను యింటిని కనిపెట్టుకుని వుండాలి. ఇందులో నీవు యేమి చేయగలిగినా నేను ఫోన్‌చేసి చెపుతాను. ఆలోచించుకుని చెప్పు అంటారు. అప్పటి దాకా కుర్చీలో సహనంగా కూర్చుని వున్న పెద్దమనిషి యిక పురుషుల వంతు అన్నట్లుగా కుర్చీలో కదులుతారు. అమ్మా సుగుణమణిగారూ మీ కొక శుభవార్త చెప్పాలని అరగంటనుంచి కూర్చున్నాను. ఏమిటంటే మా గురువుగారు ఎల్లుండి యీ వూరు వస్తున్నారు. మా ఆశ్రమంలో తయారయే సరుకులు యెంత శ్రేష్ఠమైనవో, మేమంతా యెంత నిస్వార్థంగా ప్రజాసేవ చేస్తామో మీకు తెలుసు గదా. మీరు ఒక్కసారి వచ్చి స్వామివారి దర్శనం చేసుకుని మా ఎగ్జిబిషను ప్రారంభించాలని మనవి. మీరు సరేననాలి, నేను కదలాలి. అంతా స్వామి సత్సంకల్పం అంటూ ముగించుతారు. నేను ఆశ్రమాన్ని చాలాసార్లు చూశాను. ఆ సమయాల్లో నేను కొన్నవస్తువులు నాదగ్గర యింకా వున్నవి. తప్పక వస్తానని ఆమె అభయం. 1945లో మద్రాసు మహిళా సభలో పరిచయం వున్న పాత మెంబరు శ్రీమతి సుగుణమణిని చూడకుండా యెట్లా రైలెక్కటమన్న తలంపుతో అట్లా సభకు వచ్చేశారు. అది ఆమె కథ. ఇంతలో ఫోన్ మ్రోగుతుంది. డి.యి.ఒ.గారి సెక్రటరీ రేపు టూరు మీద వెళ్తారు కాబట్టి అవసరమైన కాయితాలన్నీ తీసుకుని యిప్పుడే వస్తే ఆ పనేదో చూసుకోవచ్చు. ఇటువంటివన్నీకాక మహిళా సభ మెంబర్లు, పరిచయులు, సిబ్బంది యెవరి యిళ్లలో శుభా శుభాలు జరిగినా ఒక డజనుమంది ఆమెను వెంట రమ్మని పిలుస్తారు. అందరిని కూడగట్టుకుని వెళ్లి రావటం ఆమెకు పరిపాటి. ఏ రోజయినా ఒక్క అరగంట ఆమె ఆఫీసులో యీ వాతావరణం గమనించితే ఆమె స్వభావం వివరించవలసిన పని వుండదు. అదే శ్రీమతి కంచర్ల సుగుణమణి ప్రత్యేకత.

తూర్పు గోదావరి జిల్లా కాకినాడ ఆమె జన్మస్థలం. 1919 నవంబరు 27న శ్రీ గురుజు వెంకటస్వామి, శ్రీమతి సూర్యనారాయణమ్మల పెద్ద కూతురుగా ఆమె జన్మించారు, నలుగురు అన్న తమ్ములు, నలుగురు చెల్లెళ్లు వున్నారు. ఆమె తండ్రి గొప్ప సంస్కరణాభిలాషి, సంఘసేవకులు. మహర్షి శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యులు. అందువల్ల గురువుగారి భోధలు, ఆదర్శాలు జీవితాంతం ఆచరణలో పెట్టినవ్యక్తి ఆయన. అనాథశరణాలయ హైస్కూలు హెడ్‌మాస్టరుగాను, తరువాత శరణాలయ నిర్వాహకులుగాను సత్కీర్తి సంపాదించు కున్నారు. ఆయన సేవాసక్తి, దీక్ష, శీలసంపద ఆమెకు పైతృకంగా లభించిన ఆస్తి. పైగా ఆమె చదువంతా కాకినాడలో పిఠాపురం రాజావారి హైస్కూలు, కాలేజీలలో కావటాన ఆమెకు

ప్రత్యక్షంగ మహర్షి సన్నిధిన పాఠాలు నేర్చుకోగల అదృష్టం కలిగింది. ఆమెకు వంట పుట్టిన సద్గుణాలు సేవానురక్తి, త్యాగం వంటి వన్నీ చక్కని రూపుదిద్దుకున్నవి. కుమారి సుగుణమణికి కోయంబత్తూరులో అగ్రికల్చరల్ బి. ఎస్. సి. పాసయి రిసర్చి సెంటరులో పనిచేస్తున్న కంచర్ల భూషణంగారితో 1937 లో వివాహం జరిగింది. ఆయన మేధాసంపన్నులు. నూటికి నూరుపాళ్లు గాంధీజీ అనుయాయులు, బహునిరాడంబరులు. ఆమె కోయంబత్తూరు వెళ్లారు. అక్కడ లేడీస్ క్లబ్బులో సభ్యులుగా చేరారు. బీహారు వరదలు వచ్చి వేల జనం నిరాశ్రయులైనారు. వ్యధితులకు చేయందించటం ఆమె హృదయానికి చేరువైన విషయం కావటంతో స్వయంగా పూనుకుని తమ క్లబ్ తరపున విరాళాలు సేకరించి వరదబాధితులకు అందచేశారు. అప్పట్లో మద్రాసులో డాక్టరు శ్రీ కె.ఎన్. కేసరిగారు ప్రచురించుతున్న "గృహలక్ష్మి" పత్రిక స్త్రీల పాలిట కల్పతరువు. అనేక విషయాలపైన మహా రచయిత్రులు, కవయిత్రులు, రచనావ్యాసంగంలో అప్పుడే ప్రవేశించుతున్నవారు కూడ వ్రాసేవారు. విద్యావతి, చక్కని ఆశయాలు, భావాలుగల శ్రీమతి సుగుణమణి గృహలక్ష్మిలో చక్కని ప్రయోజనం సాధించగల వ్యాసాలను సరళశైలిలో విరివిగా ప్రచురించేవారు. కోయంబత్తూరు కాపురం ఆమెను మంచి రచయిత్రిగా, యేవిషయం గురించి అయినా ఆలోచించి అమూల్య భావాలు వెలిబుచ్చగల దిట్టగా తయారుచేసింది. భర్త వుద్యోగరీత్యా 1939లో ఢిల్లీకి వెళ్లారు.

ఏదో ఒక ప్రయోజనకరమైన సేవచేయాలని ఆరాటపడేవారికి పొరుగూరు పోయినా, బహుదూరం పోయినా బాధ్యతలు వచ్చిపడుతునే వుంటవి. అక్కడ బిహార్ భూకంప బాధితులకు, రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొంటున్న భారత సైనికులకు ఆమె విరాళాలు పోగుచేసి వున్ని స్వెట్టర్లు మొదలయినవి అల్లించి తోడ్పడ్డారు.

1943లో మద్రాసు వచ్చారు. ఆంధ్ర మహిళాసభ అప్పటికింకా అద్దె యిళ్లలోనే తలదాచుకుంటున్నది. హిందీ, సంగీతం, డాన్సు, బెనారస్ మెట్రిక్ క్లాసులు నడుస్తు వుండేవి. "ఆంధ్ర మహిళ" పత్రిక వుండేది. కాని డబ్బుమాత్రం లేదు. హోదాలు లేవు. ఇన్నికోట్లు విలువచేసే ఆస్తులు సంపాదించుకోగలమని కాని, ఇన్ని బృహత్ సంస్థలను నిర్వహించగలమని గాని ఆనాడు వ్యవస్థాపకులుగాని మెంబర్లుగాని వూహించుకోలేదు. ప్రతిమెంబరు ఆంధ్రమహిళా సభకు ఒక ప్రధానవ్యక్తి. ప్రతిమెంబరు తమసంస్థకు ప్రధాన సేవికే. అది ఆనాటి మహిళాసభ మహద్భాగ్యం . అటువంటి స్వర్ణయుగంలో ఆమె ఒక శుభ ముహూర్తాన సభలో ప్రవేశించి అమ్మమ్మగారుగా అందరి గౌరవాభిమానాలు పొందే శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మను సమీపించారు.

నాకు సభలో చేరి యేదైన సేవ చేయాలని వున్నది. నేను ఏమి చేయ వచ్చునో చెప్పండి అని అడిగారు. కలయో వైష్ణవ మాయయో తెలియక తబ్బిబ్బు అయిన అమ్మమ్మగారు ఆమెను చెయ్యి జాపి ఆంధ్ర మహిళాసభ కుటుంబంలో ప్రేమాస్పదురాలైన బిడ్డగా ఆహ్వానించారు. తన నిష్కల్మష హృదయంతో, సత్యభావంతో, సేవానురక్తితో శ్రీమతి సుగుణ మణి మహిళా సభలో ప్రతివారికి ఆత్మబంధునయినారు. ఆనాడు ఆమెకు హోదా లేదు, జీతం లేదు. అన్నీ పనులే. అమ్మమ్మగారు అనుక్షణం "సభ నాబొందు అని అనుకునే వ్యక్తులు కావాలి మన సభకు" అంటూ వుండేవారు. ఆ మాటకు సజీవ రూపకల్పన శ్రీమతి సుగుణమణి. స్వహస్తాలతో అన్ని పనులు చేసి, కాళ్లు అరిగేట్లు సభ పనుల మీద తిరిగి ఆమె క్రమేపి సభలో ఒక భాగం, సభ వెన్నెముకలో ఒక పూస అయినారు.

ఇంతలో కస్తూర్బా జాతీయ స్మారకనిధి ఏర్పడటం, దుర్గాబాయమ్మగారు, ఆంధ్ర రాష్ట్ర శాఖకు కార్యదర్శి కావటం జరిగింది. శ్రీమతి సుగుణమణి అందులోను ప్రధాన పాత్ర వహించి చాలా సేవచేశారు. 1948 లో విజయవాడకు బదిలీ అయివెళ్లారు. కొద్ది నెలలకే అరకులోయకు మార్చారు.

శ్రీ భూషణం దంపతులు వెళ్లిన అరకులోయ ఆంధ్రా ఊటీగా పేరు పొందిన చల్లని చక్కని అడవి. అక్కడ స్థిరవాసులయిన అడవి జాతివారు, గిరిజనులు, ఆధునిక నాగరికతలకు దూరస్థులు. వారిచేత పనులు చేయించుకోవటమే తప్ప వారిని గురించి ఆలోచించే ఓపికా తీరికా యెవరికి వుండవు. ఓపికా తీరికా, ఆసక్తి అమితంగా గల శ్రీమతి సుగుణమణి తమ యింట సంస్కరణ ఆరంభించారు. పరమ అయోమయ స్థితిలో వుండే తమ పని కుర్రవాడిని బుజ్జగించి అక్షరాభ్యాసం చేశారు. వాడు వద్దని పరుగులెత్తినా పలకపట్టుకుని వెంట తిరిగి వ్రాయటం, చదవటం నేర్పగలిగారు. ఆంధ్రమహిళా సభ పరిచయులు, మిత్రులు అప్పటి విమెన్సు వెల్ ఫేర్ డైరెక్టరు అయిన పారిజాతం నాయుడు గారికి వ్రాసి, ఆమె ద్వారా ఆటవిక, గిరిజన యువతులకు అనేక సంక్షేమ కేంద్రాలు నెలకొల్పారు. అక్కడ వాళ్లకు విస్తళ్లు కుట్టటం, బట్టలు కత్తిరించటం, కొంత చదువు నేర్పించారు. కేంద్రాల ద్వారా హెల్తు సెంటర్లు నెలకొని ఆ స్త్రీలకు వైద్య సహకారం అందించ సాగినవి. పేదకు పెన్నిధి దొరికినట్లు ఆ స్త్రీలు సంతోషించారు. ఆనాటి కేంద్రాలు యీనాటికీ చక్కని కార్యక్రమాల ద్వారా అక్కడి ఆటవిక గిరిజన స్త్రీలకు సేవ చేస్తున్నవి.

భర్త ఉద్యోగరీత్యా ఆమె 1953 లో కడప వెళ్లారు. ఆమెతో అప్పటికే పరిచయంవుండి ఆమె సేవాదీక్షను గమనించిన శ్రీమతి కడప రామసుబ్బమ్మ వెంటనే కడప మహిళా సమాజానికి ఆమెను ఉపాధ్యక్షులుగా చేశారు. శ్రీమతి సుగుణమణి కృషి ఫలితంగా మహిళా సమాజానికి అవసరమైన నిధులు సమకూరినవి. భవనాలు రిపేరయినవి. వివిధశాఖలతో సమాజం అభివృద్ధి పొందింది. ఆమె యే పని చేసినా మనస్ఫూర్తిగా శక్తివంచన లేకుండ చేయగలరు. అందువల్లనే ఆ సమయంలో యుద్ధనిధికి భారీ విరాళాలు సేకరించి యిచ్చారు.

1957 నవంబరులో హైదరాబాదు స్థిర నివాసులుగా వచ్చారు. ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా హైదరాబాదులో కూడ ఆంధ్ర మహిళాసభ అవసరమయింది. ఆనవాయితీ ప్రకారం బర్కత్‌పురాలో అద్దె యిల్లలో ఆంధ్ర మహిళా సభ హైదరాబాదుశాఖ బోర్డు వెలిసింది. శ్రీమతులు సుగుణమణి, లీలాగౌరీ బాజీలు కార్యదర్శినులుగా ఒక చేతిపనుల శాఖ ఒక చిన్న ఆసుపత్రి ఆరంభమైనవి. ఆసుపత్రి యీనాడు బ్రహ్మాండమైన నర్సింగ్‌హోం అయింది. చేతి పనుల శాఖ రీజినల్ హాండీక్రాఫ్ట్స ట్రెయినింగు సెంటరుగా ప్రభుత్వ సహకారంతో నడుస్తున్నది. శ్రీమతి సుగుణమణి కృషి ఫలితంగా శిశువిహార్, హైస్కూలు కన్డెన్స్‌డ్ కోర్సు క్లాసులు వూపిరి పోసుకుని అతి చక్కగా ఆరోగ్యంగా పెరుగుతున్నవి. తీర్చి దిద్దిన స్వంత భవనాలతో అలరారుతున్నవి.

ఆమె నిరంతర నిస్వార్థ సేవ గమనించి ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు ఆమెను యెన్నో సంఘాలలో కమిటీలలో మెంబరుగా వేసుకున్నారు. స్టేట్ సోషల్ అడ్వయిజరీ బోర్డు ఇంప్లిమెంటింగు కమిటీలో మద్రాసు, కడప సభ్యులుగా 5 సంవత్సరాలు వున్నారు. రేడియో మహిళా మండలుల ఫెడరేషను జనరల్ సెక్రెటరీగా పది సంవత్సరాలున్నారు. హాండీక్రాఫ్ట్స అడ్వయిజరీ బోర్డులో ఆరు సంవత్సరాలు సభ్యులుగా వున్నారు. గాంధీ కస్తూర్బా సేవా సంఘం స్త్రీలశాఖ కార్యదర్శిగా రెండు సంవత్సరాలున్నారు. ఆలిండియా రేడియో ఫోరం అండ్ హోం విభాగ సలహా సంఘ సభ్యులుగా రెండు సంవత్సరాలు వున్నారు. ప్రస్తుతం 1972 నుంచి ఆంధ్ర బాలానంద సంఘం వైస్ ప్రెసిడెంటు, 1973 నుంచి రీజినల్ ఎంప్లాయిమెంటు ఎక్ఛేంజి వికలాంగుల శాఖకు సలహా సంఘ సభ్యురాలుగా వుంటున్నారు. 1974 నుంచి ఆంధ్ర రాష్ట్ర శారదా సంఘ ఛైర్మను, 1974 నుంచి రాష్ట్ర ప్రభుత్వ లేబర్

వెల్ ఫేర్ అడ్వయిజరీ కమిటీ మెంబరు, ఫీల్డు పబ్లిసిటీ డైరెక్టరేటు వారి అడ్వయిజరీ కమిటీ సభ్యులు. ఆమెకు ఎన్నో సన్మానాలు చేస్తువుంటారు. ఇన్నిటిని మించి ఆంధ్ర మహిళాసభ ప్రతి సభ్యురాలికి ఆమె ఆప్తురాలు, ప్రాణ మిత్రురాలు. అంతకి మించిన బిరుదు ఏమి కావాలి?

# డాక్టరు శ్రీమతి కొత్తా లక్ష్మీ రఘురామయ్య

**జననం 18-6-1920**

"......ఋగ్వేద కాలంలో స్త్రీలు అత్యున్నత గౌరవస్థానంలో వుండే వారు. నిత్య నైమిత్తిక కర్మలన్నిటిలోను స్త్రీలకు ప్రాధాన్యత యెక్కువగా వుండేది. ధర్మపత్ని సమేతంగా ప్రతి ఒక్కవిధి, ధర్మం ఆచరించటానికి అలవాటుపడిన ఆర్యఋషి పుంగవులు చివరకు తమ దేవుళ్లను కూడ వంటరిగా వూహించుకోవటానికి యిష్టంలేక పత్నీ సమేతులుగానే ఆ దైవాలను ఆరాధించేవారు. కాని యీనాటి గృహవేల్పులు — తమతోటి వారయిన స్త్రీలకూ వొంట్లో చీమూనెత్తురు వున్నవని తమకు వున్నట్లే కోరికలు, అభిలాషలూ వుంటవని యెందుకు గ్రహించరో అర్థం కాదు......"



శ్రీమతి కొత్తా లక్ష్మీరఘురామయ్య

"గడచిన సంవత్సరకాలంలో మనం యేమైనా సాధించగలిగామా? వేదికల పై నిలబడి గంటల కొద్దీ మనం యిచ్చిన వుపన్యాసాలన్నీ వుత్తకంఠశోషేనా ? వ్రాసిన వుపన్యాస పరంపరలన్నీ శుష్క దండగేనా ? కొండలు వీసమంతయినా కదలలేదు. అవి కదలవు. మహోద్వేగంతో పరవళ్లు తొక్కుతు వచ్చే మహానదులే కొండలను ఛేదించుకుని తమ గమ్యం చేరటం గమనార్హం. గంగా, గౌతమీ, కృష్ణవేణుల మహోద్వేగాన్ని, మహోజ్వల వుధృతాన్ని స్త్రీలు సంతరించుకుని ముందుకు సాగాలి. ఆ శక్తి యెక్కడినుంచో రాదు. ఎవరో అందించరు. మీరు శక్తి స్వరూపిణులు. మీలో నిబిడీకృతమై వున్న శక్తిని గుర్తించండి. సమత, ధర్మంతో కూడిన సాహసం, వినయంతోకూడిన స్వేచ్ఛలతో పుష్టినిచ్చి నవతరపు స్త్రీలకు రూపకల్పన చేయండి". ఇటువంటి భావపరంపరలను డాక్టరు శ్రీమతి కొత్తా లక్ష్మి రఘురామయ్య 1975లో గోవాలో జరిగిన ఆలిండియా విమెన్సు కాన్ఫరెన్సులో అధ్యక్షురాలుగావెల్లడించారు.

ఆమె మాటలు సహేతుకం, శాస్త్రీయం. తార్కాణసహితం కావటాన విలువైనవి. అందువల్లనే ఏకబిగిన ఆమెను మూడవసారికూడ ఆలిండియా విమెన్సు కాన్ఫరెన్సుకు అధ్యక్షురాలుగా ఎన్నుకున్నారు. ఈ గౌరవం అందుకున్న తొలి మహిళ ఆమె.

1976 సెప్టెంబరు 4న హైదరాబాదు రవీంద్రభారతిలో బ్రహ్మాండమైన సన్మానసభ జరిపి, నాలుగు దశాబ్దాలుగా ఆమె చేసిన మహిళా సమాజసేవకు, సాహిత్య సేవకు, సంఘోద్ధరణకు, అంతర్జాతీయ స్థాయిలో భారత గౌరవాన్ని పెంపొందింపచేసినందుకు గౌరవించారు. రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ అధ్యక్షతవహించారు. బేగం అబీదా అహ్మద్ ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. నాటి ఆంధ్ర రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి, శ్రీ ఆవుల సాంబశివరావు ఆమె జీవన స్రవంతి గ్రంథాన్ని ఆవిష్కరించారు. సాధారణంగా కష్టాలు అనుభవించినవారు, ఆ కష్టాలలోనుంచి యితరులను తప్పించటానికి సంఘసేవ చేస్తారు. తాము కష్టాలను భరించక పోయినా, సున్నిత మనస్కులయి యితరుల కష్టాలను, బాధలను భరించలేక, వాటిని నివారించాలని కొందరు సంఘసేవకు పూనుకుంటారు. మరికొందరు సకల సంతోషసౌఖ్యాలతో తాము నవ్వుతు, యితరులను నవ్వించి వారి జీవితాలను ఆనందప్రదం చేయటానికి సంఘసేవకు దిగుతారు. శ్రీమతి లక్ష్మి మూడవ కోవకు చెందుతారు.

సంపన్నులు, వున్నతప్రభుత్వోద్యోగులు అయిన శ్రీ జంపాల వెంకటేశం చౌదరి, శ్రీమతి రత్న మాణిక్యమ్మల పెద్దమ్మాయిగా, ఆమె 18-6-1920న జన్మించారు. గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా దుగ్గిరాలగ్రామం ఆమె జన్మస్థలం. డాక్టరు శ్రీమతి రాధాకృష్ణ రామస్వామి ఆమె ఏకైక సోదరి. స్కూలు ఫైనలు ముగించి మదన పల్లెలో దివ్యజ్ఞాన సమాజంవారు గురుకుల పద్ధతిలో నడపుతున్న కాలేజిలో ఆమె ఇంటర్ మీడియట్ చదివారు. ఆ కాలేజి ప్రిన్సిపాలు శ్రీ కజిన్సు, ఆయన భార్య శ్రీమతి మార్గరేట్ కజిన్సు ఐరిష్ దేశీయులు. ఐనా భారతదేశాన్ని తమ మాతృదేశంగా స్వీకరించారు. హోంరూలు వుద్యమంనాటి నుంచి వాళ్లకు భారత జాతీయోద్యమంతో సన్నిహితత్వం వున్నది. శ్రీమతి మార్గరేట్ కజిన్సు ఖాదీ ధరించి ఆంధ్రమహిళలతోకలిసి, సత్యాగ్రహాలు, పికెటింగులు చేసి రెండుసార్లు అరెస్టయినారు. రాయవేలూరులోను, మద్రాసులోను జైలు శిక్షలు అనుభవించి వచ్చారు. జాతీయ అభిమానం, దేశభక్తి నిరాడంబర జీవనం, వున్నత ఆశయాలు తమ శిష్యులకు రంగరించిపోసి, నిజమైన

గాంధేయులను తయారుచేసేవారు. అస్పృశ్యతను, మూఢాచారాలను, నిరక్ష రాశ్యతను మదనపల్లెచుట్టుపక్కల కూడ నిర్మూలించుతు, ఆ పుణ్యదంపతులు ఆర్తితో సంఘసేవచేయటం శిష్యులకు నేర్పేవారు. అందువల్ల అక్కడ చదివిన కుమారి లక్ష్మి లేతహృదయంలో గురు దంపతుల ఆదర్శాలు, ఆశయాలు, సేవాను రక్తి యథాతథంగ ముద్రపడిపోయినవి. వంట జీతుచి పోయినవి. 1937లో శ్రీమతి మార్గరేట్ కజిన్సు నెలకొల్పిన ఆలిండియా వుమెన్సు కాన్ఫరెన్సులో కుమారి లక్ష్మి సభ్యురాలయి, సమాజ పత్రికయిన స్త్రీధర్మలో ప్రయోజనాత్మకమైన వ్యాసాలు వ్రాసేవారు.

ఆ వేసవి శలవుల్లో ఆమెకు కొత్తా రఘురామయ్యగారితో వివాహం అయింది. ఆయన గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా సంగంజాగర్లమూడి వాస్తవ్యులు. బారిస్టరుగా అప్పుడే విదేశాలనుంచి తిరిగి వచ్చారు. శ్రీమతి లక్ష్మిరఘురామయ్య మద్రాసు వాస్తవ్యులైనారు. వుమెన్సు క్రిష్టియన్ కాలేజీలో చదివి పట్టభద్రులైనారు. ఆ కాలంలో మద్రాసు ఆంధ్రులకు చెన్నపురి ఆంధ్రమహాసభ ఏకైక కూడలి. అందువల్ల దంపతులిద్దరు అందులో సభ్యులైనారు. నేటి విఖ్యాత ఆంధ్రమహిళాసభ ఆనాడు ఆంధ్రమహాసభలో స్త్రీల శాఖగా వుండేది. విడిపోయి ప్రత్యేక సంస్థగా నెలకొంటే మహిళాభ్యు దయానికి కృషిచేయగలమన్న తలంపు శ్రీమతి దుర్గాబాయమ్మ వెల్లడించారు. శ్రీమతి లక్ష్మి నిజమన్నారు. ఫలితంగా మైలాపూరు లజ్ చర్చి రోడ్డున ఆంధ్రమహిళాసభబోర్డు అవతరించింది. వ్యవస్థా సభ్యులయిన శ్రీమతి లక్ష్మి ఆంధ్రమహిళాసభలో వివిధ విభాగాల నిర్వహణలోను సహకరించారు. కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా, నాగేశ్వర శిశువిహార్ కార్యదర్శిగా విద్య సాహిత్యశాఖల నిర్వాహకురాలుగా, నర్సింగ్‌హోం నిర్వాహకవర్గ సభ్యురాలుగా, జాయింటు సెక్రెటరీగా 11 సంవత్సరాలు నిర్వహించారు. మహిళాసభ ప్రెస్సు మేనేజరుగా, సభ పత్రిక అయిన ఆంధ్రమహిళ నిర్వాహకులుగా 5 సంవత్సరాలు సమర్థవంతంగ నిర్వహించారు. ఆమె మూర్తి గంభీరమే అయినా హాస్యప్రియ. ప్రతి అక్షరంలోను నిశితమైన విమర్శ, సున్నితమైన హాస్యం కలగలుపుగావుండి, ఆమె సంపాదకీయాలు, వ్యాసాలు చివరకు పాకకళ చిట్కాలు కూడ అందరిని అలరించేవి. హాస్య ధోరణిలోనే జటిల సమస్యలను విపరించుతు, పరిష్కార మార్గాలను సూచించుతు వ్రాసేవారు. ఆనాడు ఆమె రచించిన సింగినాదం, చిల్లిగవ్వ, హుస్కు, మొగలిపొట్లంవంటి నవలలు, వ్యాస సంపుటాలు చాలా ప్రసిద్ధి పొందినవి. గృహలక్ష్మి, ఆంధ్రభూమి వంటి అనేక పత్రికలలో కూడ వ్యాసాలు వ్రాసేవారు. ఆటలలో ఆసక్తి అధికం. స్వచ్ఛమైన మనసు, నిష్కపటమైన సూటిమాట. జాతి, కుల, మత, వర్గ

భేదాలులేని స్నేహభావం. రవంతయినా ఆడంబరం, గర్వంలేని కారణంగా, ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రందరికి ఆమె 'మన లక్ష్మీరఘురావ్‌గారు'. ఆమెవున్న పరిసరాలన్నీ నవ్వుల జల్లులతో చల్లగా, హాయిగా వుండేవి. శ్రీమతి మార్గరెట్ కజిన్సు దగ్గర సంఘసేవా మంత్రోపదేశం పొందితే దుర్గాబాయమ్మగారి దగ్గర సార్థక సాధకసన్మార్గాన్ని విపులంగా తెలుసుకున్నారు. నిర్మాణాత్మక ప్రయోజనకర సంఘసేవలో పండితులైనారు. విశ్వభారతి కళామందిరమనే హరిజన బాలల నర్సరీ స్కూలుకు అధ్యక్షులుగా వుండేవారు. ఆలిండియా వుమెన్సు కాన్ఫరెన్సు కార్యకలాపాలు వుండనేవున్నవి. ఐదు సంవత్సరాలపాటు ఫిల్ము సెన్సారుబోర్డు సభ్యులుగా వున్నారు. సంస్కారం, సభ్యత, విజ్ఞత, విచక్షత వుపయోగించి స్త్రీజాతిని కించపరచే దృశ్యాలను చాలా నిష్కర్షగ తీసివేసేవారు. ఏ పనిచేసినా, బాధ్యతగా నిర్వహించేవారు. ఇట్లా 20 సంవత్సరాలు గడిచిపోయినవి.

ఆమె భర్త రఘురామయ్యగారు కేంద్రమంత్రిగా నియమితులు కావటంతో ఆమె 1957లో ఢిల్లీ వాస్తవ్యులైనారు. అలవాటు పడిన చేయి వూరుకోలేదు గదా. సాంఘిక కార్య కలాపాలలో ప్రవేశించారు. ఆంధ్ర ఎడ్యుకేషనల్ సొసైటీకి ఉపాధ్యక్షులుగా వున్నారు. ఆంధ్రా అసోసియేషనుకు అధ్యక్షులైనారు. నాటికి, నేటికి ఆ హోదా నలంకరించిన మహిళ ఆమె ఒక్కరే. అసోసియేషను అభ్యుదయం ప్రతివారి బాధ్యత అని, అందరు దాని శ్రేయస్సుకు పాటుపడాలని, స్వయంగా కృషిచేసి చూపించారు. సమాజ రజతోత్సవాలను వైభవంగ జరిపించారు. దానికి స్వంత భవన నిర్మాణం చేసితీరాలని గట్టి తీర్మానం చేశారు. దాని ఫలితమే నేటి ఆంధ్ర భవనం. దాదాపు పది సంవత్సరాల పాటు ఆలిండియా విమెన్సు కాన్ఫరెన్సు స్టాండింగు కమిటీ మెంబరుగా వున్నారు. జనరల్ సెక్రెటరీగా నాలుగేళ్లు పనిచేశారు. ఉపాధ్యక్షురాలుగా రెండు సంవత్సరాలు బాధ్యత వహించారు. అధ్యక్షురాలుగా మూడవసారి తిరిగి యెన్నికయినారు.

ఆమె కేవలం సంఘసేవిక. దానికోసమే తన రచనా సామర్థ్యాన్ని వినియోగించుతువున్నారు. మహిళా సమస్యలే ఆమె నవలల యితివృత్తాలు. మహిళా సమస్యల గురించే ఆమె వ్యాసాలు. ఆమె నవలలు, వ్యాసాలు యితర భాషలలోకి అనువదించారు. ఒక నవలను ఇంగ్లండులో రేడియోనాటికగా ప్రసారం చేయటానికి ప్రయత్నం జరుగుతున్నది. మహిళాసేవ, సంఘసేవ తనపేరు ప్రఖ్యాతులతోగాని, కాలక్షేపంతోగాని ఆమె ముడిపెట్టరు. సేవ మహిళల కోసమే. వాళ్ల అభివృద్ధి కోసమే. అందువల్లనే ఆమె

రాజకీయాలలోకి దిగరు. మతాతత్వాలకు దూరంగా వుంటారు. జాతి, కుల, మత, వర్గ అవధులను దాటి విశ్వవ్యాప్తంగ స్త్రీల అభ్యుదయాన్ని గురించే ఆలోచించుతు వుంటారు. సంఘసేవికగా వచ్చిన పలుకుబడిని వుద్యోగాలు, హోదాలు, పదవులు పెంపొందించు కోవటానికి వినియోగించుకోరు. సిరి సంపదలతో, సంతోష సౌఖ్యాలతో నవ్వుతు, తుళ్ళుతువుండే ఆమె అహోరాత్రులు పతితల పతనానికి కారణాలు ఆలోచిస్తువుంటారు. మానసిక రుగ్మతలకు గురిఅయి, అయోమయస్థితిలో బ్రతుకులు ఈడుస్తున్న బాలల గురించి వ్యధపడతారు. కాయితం మీద తప్ప ఆచరణలో హక్కులు, అవకాశాలు లేక నిజజీవితంలో అడుగడుగునా సమస్యలనే యెదుర్కొనే స్త్రీల విద్యావ్యాసంగాలు, వుద్యోగావకాశాలు, సురక్షిత మనుగడ, సంఘంలో స్థానం వంటి యెన్నిటిని గురించో పరిష్కార మార్గాలు ఆలోచించుతు వుంటారు. సంగంజాగర్లమూడి, దుగ్గిరాల, తెనాలి వంటి చోట్ల స్వయంగా మహిళా సమాజాలు స్థాపన చేశారు. విజయవంతంగా నడుపుతున్నారు. ప్రతిసమాజ బాగోగులను, సమస్యలను, అధ్యక్షులుగా స్వయంగా పరిశీలించుతారు. భారతీయ గ్రామీణ మహిళా సంఘానికి వుపాధ్యక్షురాలు. తెలుగు భాషా సమితి సభ్యురాలు. ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషను స్త్రీల సలహాసంఘ సభ్యురాలు. ఢిల్లీ విదేశీయ విద్యార్థి సంఘం ముఖ్య సలహాదారు. ఈ విధంగా రాష్ట్ర, దేశ, అంతర్జాతీయ స్థాయిలో వున్న దాదాపు 45 సంస్థలకు ఆమె ఈనాడు నిర్వాహకురాలు, సలహాదారు, శ్రేయోభిలాషి. ఆ సంస్థల పనులమీద అంతర్జాతీయ సభలు, సమావేశాలలో పాల్గొనటానికి యిప్పటికి దాదాపు 45 సార్లు విదేశాలు వెళ్ళిరావలసి వచ్చింది. ఆమెకు స్త్రీలు, పిల్లల సమస్యలన్నీ అవగతమే కావటాన ఈ అంతర్జాతీయ సమావేశాలలో భారత స్త్రీల పరిస్థితులను క్షుణ్ణంగా చర్చించుతు వుంటారు. దేశ దేశాలలోను ఆమెకు పరిచితులు, స్నేహితులు, వున్నారు. కాని యెక్కడ యెవరు అడిగినా— మా దేశం పేదదేశం కావచ్చు. అనారోగ్యం, అజ్ఞానం వుండవచ్చు. కాని మా దేశంలో విశాలమైన నదులు. వుత్తుంగ పర్వతాలు, యుగయుగాల సంస్కృతి వున్నవి. నాకు అదే స్వర్గతుల్యం అంటారు.

ఆమెకున్న వ్యాసంగాలరీత్యా భారతదేశంలోని పెద్దలు, గొప్పవారు, హోదాలలో వున్నవారు, విదేశాలనుంచి వచ్చే ప్రముఖులు, విదేశాలలో ఆమె కలుసుకునే పెద్దలు, వందల సంఖ్యనే వుంటారు. నాగరిక సమాజం యావత్తు ఆమెకు సుపరిచితం. కాని ఆమె వేషభాషలలో, సంస్కృతిలో ఆంధ్ర గ్రామీణ స్త్రీ. భూములు, పంటలు, సాగుబడి, రాబడి, కష్టం, నష్టం, అన్నీ ఆమెను కూలంకషంగ, సాధికారంగ చర్చించగలరు, వివరించగలరు. 1967మార్చిలో రష్యన్ మహిళా సంఘంవారు సంఘ స్వర్ణోత్సవ సందర్భంలో—ఆలిండియా

విమెన్సు కాన్ఫరెన్సు, ఆలిండియా విమెన్సు కాంగ్రెసుల ప్రతినిధిగా ఆమెను ఆహ్వానించగా వెళ్లారు. సోషలిస్టు సమాజంలో స్త్రీల పాత్ర అనే విషయంపై తమ అభిప్రాయం వినిపించారు. ఆ సందర్భంలో ఆమె రష్యన్ వ్యవసాయశాఖను సందర్శించి, అధికారులతో ప్రసంగించారు. సహేతుకంగా సోదాహరణంగా, భారత కర్షకులు తమ పరిమిత పరిజ్ఞానంతో పండించుతున్న పంటలు—రష్యను కర్షకులు తమ ఆధునిక పరిజ్ఞానంతో, యంత్ర సహాయంతో పండించుతున్న మొత్తాలకు యే విధంగాను తగ్గవని అక్షరాల, అంకెల ఆమె వివరించారు. ఆమె వ్యావసాయిక పరిజ్ఞానానికి, విపులీకరణ శక్తికి సంతృప్తులై రష్యన్ ప్రభుత్వం వారు పతక బహూకరణతో ఆమెను సన్మానించారు. ఏ విషయం చర్చించినా అంతటి పరిజ్ఞానంతోను, వివరాలతోను అవతలివారికి అర్థమయి మెచ్చేటట్లుగా ఆమెమాట్లాడ గలరు. 1976 లో ప్రపంచ తెలుగు మహాసభలసందర్భాన ఆమెను సత్కరించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు గౌరవించారు. ఆంధ్రా యూనివర్సిటీవారు డాక్టరేటు యిచ్చారు. ఆమె జీవనప్రసంతి పుస్తకరూపంలో వెలువడింది. అనేక అభినందన సంచికలు, ప్రత్యేక సంచికలు ఆమెచేసిన సంఘసేవ విపులీకరించుతు వెలువడినవి. కొందరు తమ రచనలు కృతియిచ్చి గౌరవించారు.

ఆమె ప్రతి ఒక్కరిని ఒకే తీరున ఆప్యాయతతో, ఆత్మీయతతో గౌరవించగలరు. ఆ సామర్థ్యంగల పున్నతులు, విశాలహృదయులు అరుదు. అందువల్లనే ఆమె ప్రజల వ్యక్తి. ఆమె పలకరించి మాట్లాడుతు వుంటే అభాగ్యులు, అక్షరజ్ఞానం లేని వాళ్ల అనాగరికులు కూడ నిబ్బరంగ నిలబడి తమగోడు విన్నవించుకో గలుగుతారు. సంతృప్తులై నవ్వు ముఖాలతో వెళ్తారు. ఒక నిస్వార్థ సంఘసేవికకు అంతకన్న కోరతగిన ప్రతి ఫలంయేముంటుంది?